

డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్

ఎం ఎ , పిహెచ్ డి , డి ఎస్ పి , బార్–ఎట్–లా, జె పి , ఎల్ ఎల్ డి , డి లిట్

ననం : 14 ఏప్రిల్, 1891 పరినిర్వాణం : 6 డిసెంబర్, 1956

# డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్

# రచనలు - ప్రసంగాలు

## సంపుటం - 1



ప్రధాన సంపాదకులు

ఆచార్య పేర్వారం జగన్నాథం

ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం

సంపాదకులు

బొజ్జా తారకం

డాక్టర్ బి విజయభారతి

అనువాదం

డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్

హైదరాబాదు

సారథ్యం

తెలుగు విశ్వవిద్యాలయం

కన్వీనర్

ప్రొఫెసర్ జయధీర్ తిరుమలరావు

ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

1994

# Dr. BABASAHEB AMBEDKAR RACHANALU - PRASANGALU VOL - I

*Pages* XII + XIV + 618



*First Edition*
April 1993

*Second Edition*
October 1994

*Copies*
Popular Edition 4000

*Price*
Popular Edition Rs **40/-**

*General Editor*
**Prof PERVARAM JAGANNADHAM**

*Editors*
**Bojja Tharakam**
**Dr. B Vijaya Bharathi**

*Convenor*
**Prof JAYADHIR THIRUMAL RAO**

*Copies can be had from*
**Registrar,**
Telugu University
Lalita Kala Kshetram, Public Gardens,
Hyderabad - 500 004

*Cover* K C Reddy

*Printed at* NAVYA PRINTERS,
Raj Bhavan Road, Hyderabad Phone 314147

ఆచార్య పేర్వారం జగన్నాథం,
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం,
పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాదు - 4

# రెండవ ముద్రణ పీఠిక

నవభారత రాజ్యాంగ నిర్మాత బాబాసాహెబ్ డా భీంరావు అంబేద్కర్ ఆంగ్ల రచనలను తెలుగులోకి అనువదించి ప్రచురించే కార్యక్రమానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగు విశ్వవిద్యాలయాన్ని సారధ్య సంఘంగా నియమిస్తూ అందుకోసం 18 లక్షల రూపాయిలు మంజూరు చేసింది ఈ ప్రణాళికను ప్రోత్సహించి నిదులు మంజూరు చేసిన అప్పటి ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి గారికి, అంబేద్కర్ సంపుటాలను విజయివంతంగా తెలుగు వారికి అందజెయిడంలో సహకరిస్తున్న ప్రస్తుత ముఖ్యమంత్రి మాన్యులు శ్రీ కోట్ల విజయబాస్కర రెడ్డి గారికి ఈ సందర్భంగా దన్యవాదాలు సమర్పిస్తున్నాను డా అంబేద్కర్ బావజాలాన్ని, ఆయన ఆలోచనా సంఫిని నేటి యువతరానికి తెలియజెసె దృష్టితొ ఈ గ్రందాలను సంక్షేమ శాఖ హాస్టళ్లకు సరఫరా చెయ్యాలని ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ శాఖ మమ్మల్ని కోరింది అందుకోసం ఈ సంపుటాలను ప్రత్యేకంగా పునర్ముద్రిస్తున్నాం ఈ కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించుటకు సహకరిస్తున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి, సాంఘిక సంక్షేమ శాఖాదిపతులకూ, పాఠకులకూ, ఆయా సంపుటాల సంపాదక వర్గానికి మరోసారి దన్యవాదాలు తెలియజేస్తున్నాను

(పేర్వారం జగన్నాథం)

హైదరాబాదు
ది 14 10 1994
విజయదశమి

# ముందుమాట

భారత రాజ్యాంగ నిర్మాతగా, దళితవర్గాల నాయకుడిగా, రాజనీతి కోవిదుడుగా, న్యాయశాస్త్ర పారంగతుడుగా పరిపాలనాదక్షుడుగా అశేష ప్రజాభిమానాన్ని చూరగొన్న మహామనీషి డాక్టర్ బాబాసాహెబ్ భీమ్‌రావ్ అంబేద్కర్ కులవ్యవస్థ పంకిలంలో కూరుకుపోయిన వారికి డా॥ అంబేద్కర్ ఒక ఆశాజ్యోతి ఒక చైతన్య చేతనం స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వాల మేలుకలయికగా ఉండే సమాజం అంబేద్కర్ లక్ష్యం

మహర్ కులంలో జన్మించిన అంబేద్కర్ విద్యార్థి దశ నుండే సమాజంచేత దుర్భరమైన అవమానాలను ఎదుర్కొన్నారు దాంతో చిన్నతనంలోనే ఆయన సంఘ సంస్కరణ, పీడిత జనోద్ధరణలపట్ల ఆసక్తి పెంచుకున్నారు నిరుపేద దళితవర్గాల సముద్ధరణే పరమ లక్ష్యంగా జీవించినారు ఆయన ఏవృత్తి చేపట్టినా ఆ లక్ష్యానికి దూరం కాలేదు ఆ లక్ష్యసాధన కోసం డా॥ అంబేద్కర్ రాజకీయ కార్యకలాపాలు నిర్వహిస్తూ, ఎన్నో నిర్మాణాత్మక కార్యక్రమాలను కొనసాగించినారు ఆ క్రమంలోనే రచనలు చేయడం ప్రసంగాలు చేయడం ద్వారా ప్రచారం చేయడం, వంటి ప్రధాన మార్గాలను ఎంచుకున్నారు

బలహీన వర్గాలలో చైతన్యాన్ని రగిలించి వారికి నాయకత్వం వహించి డా॥అంబేద్కర్ తన రాజకీయ మహా ప్రస్థానానికి శ్రీకారం చుట్టారు బొంబాయి రాష్ట్ర శాసనసభ సభ్యత్వం, రాజనీతి శాస్త్రంలో విశేష పరిజ్ఞానం డా॥ అంబేద్కర్ కృషికి ఎంతగానో దోహదం చేసినాయి

డా॥ అంబేద్కర్ అహర్నిశలు ప్రతి దశలోనూ దళితుల అభ్యున్నతికోసం కృషిచేశారు రాజ్యాంగంలో దళితులకోసం ఏర్పాటయిన ప్రత్యేక హక్కులు, వసతుల కోసం నిర్విరామంగా కృషిచేసిన విషయం లోకవిదితమే

దళిత జనాభ్యున్నతికోసం ఆయన సాగించిన అవిశ్రాంత పోరాటానికి వెన్నుదన్నుగా భారత చరిత్ర, శ్రుతి స్మృతి పురాణాది సమస్త ప్రాచీన వాఙ్మయాన్ని,

అందుకు సంబంధించిన ఆధార గ్రంధాల్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నారు తాను చేపట్టిన మహత్తర సంస్కరణోద్యమాన్ని శక్తిమంతంగా నడిపించినారు.

డా॥ అంబేద్కర్ ఏరంగంలో కృషిచేసినా రచనా వ్యాసంగాన్ని విడనాడలేదు రాజకీయ, ఆర్థిక, సాంఘిక, ధార్మిక ఏ విషయాలపై అసాధారణ ప్రతిభతో ఆయన రాసిన రచనలు, చేసిన ప్రసంగాలు అంబేద్కర్ జ్ఞాన సంపదకు మణిహారాలు.

అమూల్యమైన అంబేద్కర్ రచనలు–ప్రసంగాలను సేకరించేందుకు 1976లో మహారాష్ట్ర ప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని ఏర్పాటుచేసింది ఫలితంగా డా॥ అంబేద్కర్ గ్రంధావళిని మహారాష్ట్ర ప్రభుత్వం 1979లో డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ జన్మదినోత్సవ దినాన ఆంగ్లంలో వెలువరించి భారతావనికి అందించింది

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం డా॥ అంబేద్కర్ శతజయంతి ఉత్సవాల సందర్భంగా ఆయన రచనలు, ప్రసంగాలను తెలుగులోకి అనువదింపచేయాలని నిర్ణయించింది. ఈ విషయంలో అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి మాన్య శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డిగారి ఆసక్తి, ఉత్సాహం అనువాద కార్యక్రమానికి ప్రేరకాలయినాయి వారు నిధులను కూడా సమకూర్చినారు.

అనంతరకాలంలో ముఖ్యమంత్రి మాన్య శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డిగారు డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమానికి మరింత చేయూత అందించినారు అందుకు రాష్ట్ర ప్రభుత్వానికి ధన్యవాదాలు తెలుపుతున్నాను.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ అనువాద కార్యక్రమ నిర్వహణకు సారథ్య సంస్థగా తెలుగు విశ్వవిద్యాలయాన్ని నియమించింది తెలుగుశాఖలు ఉన్న కొన్ని విశ్వ విద్యాలయాలు, ఇతర ముఖ్య సంస్థలు ఈ అనువాద కార్యక్రమంలో భాగస్వాములను చేసి తెలుగు విశ్వవిద్యాలయ పూర్వ ఉపాధ్యక్షులు పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు ఈ ప్రణాళికకు రూపకల్పన చేశారు వారి నేతృత్వంలో అనువాద కార్యక్రమానికి ఆరంభం జరిగింది.

డా॥ అంబేద్కర్ రచనలు – ప్రసంగాల అనువాద కార్యక్రమానికి తగిన సలహాలు, సూచనలు ఇచ్చేందుకు ఒక పరిశీలనా సంఘం ఏర్పాటయింది పార్లమెంటు మాజీ సభ్యులు శ్రీ కోట పున్నయ్య, ప్రముఖ విద్యావేత్త డా॥ టి వి నారాయణ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ మాజీ కార్యదర్శి శ్రీ జె

వీరాస్వామి సభ్యులుగా ఉన్నారు పరిశీలనాసంఘ సభ్యులు చేసిన సూచనలననుసరించి, వారి మార్గదర్శక సూత్రాలను దృష్టిలో ఉంచుకుని సారధ్య సంఘంగా తెలుగు విశ్వవిద్యాలయం అనువాద కార్యక్రమాన్ని ముందుకు నడిపిస్తున్నది. ఈ సందర్భంగా వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు తెలుపుతున్నాను

డా॥ అంబేద్కర్ రచనలు – ప్రసంగాల సంపుటాలను అనువదించే బాధ్యతను వెంటనే వివిధ విశ్వవిద్యాలయాలకూ, కొన్ని సంస్థలకూ అప్పగించింది. ఈ సందర్భంలో రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ, సాంఘిక సంక్షేమ శాఖలు ఏర్పాటు చేసిన సమావేశాలకు తెలుగు విశ్వవిద్యాలయం తరపున రిజిస్ట్రార్ డా॥ తాళ్ల వెంకటరెడ్డి మా ప్రచురణ కార్యక్రమాన్ని క్రమబద్ధం చేశారు

డా॥ అంబేద్కర్ శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకుని తెలుగు విశ్వవిద్యాలయం అనువదించి, ముద్రింపచేసిన ఏడవ సంపుటం తిరుపతిలో 14.4 1992 నాడు ఆవిష్కృతమైంది

ప్రస్తుత సంపుటం డా॥ అంబేద్కర్ గ్రంధావళిలో మొట్టమొదటిది దీని అనువాదాన్ని డా॥అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌వారు నిర్వహించినారు ఈ గ్రంధంలో సంఘాన్ని అంటు జాడ్యంలా పీడిస్తున్న కులాల గురించి, కులనిర్మూలన గురించి, భాషా ప్రయుక్త రాష్ట్రాల గురించి కులమత పరమైన ప్రతిష్టంభన – పరిష్కార మార్గం, రాష్ట్రాలు – అల్పసంఖ్యాక వర్గాలు తదితరమైన కొన్ని కీలకాంశాలను ఈ గ్రంధంలో డా॥ అంబేద్కర్ విశ్లేషణాత్మకంగా చర్చించారు

ఈ మొదటి సంపుటం అనువాదాన్ని "డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్" ప్రముఖ రచయితలకు, అనువాదకులకు అప్పగించింది అనువాదాన్ని సకాలంలో అప్పగించడానికి విశేషంగా తోడ్పడిన డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌కు అధ్యక్షులు శ్రీ కె ఎస్ ఆర్ మూర్తి, ఐ ఎ ఎస్ గారు, ప్రస్తుత అధ్యక్షులు శ్రీ కె. మాధవరావు, ఐ ఏ ఎస్ గారికి, అంబేద్కర్ ట్రస్ట్ తరపున అనువాదాల సమన్వయకర్తగా వ్యవహరించిన శ్రీ గనుమల జ్ఞానేశ్వర్‌గారికీ ప్రత్యేక ధన్యవాదాలు. అనువాదకులు పద్మ శ్రీ డ్క్టర్ బోయి భీమన్న, శ్రీ బొజ్జా తారకం, శ్రీ పి. బాలకృష్ణ, శ్రీ జె అమ్మయ్య, శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు, శ్రీ ఎం ఎస్ బాబూరావు, శ్రీ కె రాహుల్, శ్రీ జి సురమౌళి, శ్రీమతి ఎం సుమతి, శ్రీ పి. అంబేద్కర్‌గార్లకు ధన్యవాదాలు

దీక్షతో, దక్షతతో త్వరితగతిన అనువాదం చేసిన రచయితలకూ, అనువాదానికి మెరుగులు దిద్దిన సంపాదకులు శ్రీ బొజ్జా తారకం, డా॥ బి. విజయభారతిగార్లకు నా అభినందనలు తెలియజేస్తున్నాను.

డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని ప్రోత్సహించి, ఉత్సాహంతో ముందుకు నడిపిస్తున్న సాంఘిక సంక్షేమాధికారులకీ, ఉన్నత విద్యా శాఖాధికారులకు కృతజ్ఞతలు

ఈ గ్రంధాన్ని సకాలంలో అందంగా ముద్రించిన ప్లానోగ్రాఫర్స్, హైదరాబాదు వారికి కృతజ్ఞతలు

డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ జయంతి 14-4-1993 నాడు ఆయనకు నివాళిగా సమర్పిస్తున్న ఈ అనువాద గ్రంథం అందరి హృదయాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

ఆచార్య పేర్వారం జగన్నాధం
ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం
&
ప్రధాన సంపాదకులు

హైదరాబాదు
14-4-1993

# విషయ సూచిక

"ఆదర్శప్రాయమైన సమాజం మార్పుకు అనుకూలమైందిగా ఉండాలి స్తబ్దంగా ఉండకూడదు ఒకచోట మార్పు జరిగితే, ఆ మార్పు తక్కిన చోట్ల కూడ ప్రతిబింబించే మార్గాలతో నిండి ఉండాలి ఆదర్శప్రాయమైన సమాజంలో సమాజ సభ్యులంతా కలిసి ఇష్టంగా పంచుకోగల అనేక ఉమ్మడి ప్రయోజనాలు ఉండాలి సామాజిక సంబంధాలన్నిటిలోనూ స్వేచ్ఛాయుతమైన, బహుముఖమైన సంసర్గం ఉండాలి క్లుప్తంగా చెప్పాలంటే – సమాజంలోని మానవులందరి మధ్యా సాంఘిక సోదరత్వం ఉండాలి అదే సౌభ్రాత్రత సౌభ్రాత్రత అంటే, ప్రజాస్వామికానికి మరొక పేరు ప్రజాస్వామికమంటే, ఒకరకమైన ప్రభుత్వం మాత్రమే కాదు, పరస్పరాను బంధంగల ఒక పద్ధతి జీవిత విధానం అది సంయుక్త సంసర్గ సామ్యానుభవమది తోటి మానవుల పట్ల గౌరవ మర్యాదలను ప్రదర్శించడం"

డాక్టర్ బి ఆర్ అంబేడ్కర్

"కుల నిర్మూలన" నుంచి

# ప్రస్తావన

డాక్టర్ అంబేడ్కర్ రచనలలో, ప్రసంగాలలో ప్రతిఫలిస్తున్న ఆలోచనలు భారతదేశంలోని సామాజిక ఆలోచన చరిత్ర క్రమాన్నీ, పెరుగుదలనూ గ్రహించటంలో ఎంతో ప్రాధాన్యతను సంతరించుకుంటాయి కాలక్రమంలో ఆయన పుస్తకాలు ఎన్నో, బజారులో అసలు దొరకకుండానే పోయాయి కొన్ని సందర్భాలలో ప్రామాణికమైన ప్రచురణలు ముద్రణకు కరువయ్యాయి అంతేకాకుండా, కాలం గడుస్తున్నకొద్దీ సామాజిక, ఆర్థిక, రాజకీయ విషయాలలో ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలు వాస్తవమవుతూ వచ్చాయి రానురాను సామాజిక ఉద్రిక్తతలు, కులఘర్షణలు పెరుగుతూనే ఉన్నందువల్ల డాక్టర్ అంబేడ్కర్ ఆలోచనలు ఈనాడు ఇంకా ఎక్కువ సందర్భోచితంగా ఉన్నాయి సామాజిక ఆర్థిక సమస్యలపై ఆయన సూచించిన పరిష్కారాలను, నివారణోపాయాలను అర్థం చేసుకొని అనుసరిస్తే, ప్రస్తుత సంక్షోభాన్ని అధిగమించటానికి, భవిష్యత్తులో మనకు మార్గదర్శకం కావటానికి అవి సహాయపడతాయి అందువల్ల డాక్టర్ అంబేడ్కర్ గురించి దొరికిన మొత్తం సమాచారాన్నంతటినీ సేకరించి తగిన రీతిలో ప్రచురించటం కోసం మహారాష్ట్ర ప్రభుత్వం ఒక సలహా మండలిని నియమించటం ఎంతో ఉచితంగా ఉన్నది జ్ఞాన సంపన్నుడైన ఆ డాక్టర్ ఏమి రాశాడో, ఏమి ప్రసంగించారో అవన్నీ సేకరించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి

ఈ ప్రస్తుత సంపుటిలో భారతదేశంలో కులాలు, కుల నిర్మూలనలను గూర్చిన ప్రసంగ పత్రాలతోపాటు జస్టిస్ రెనడే మీద ఆయన చేసిన ప్రసంగం, సమాఖ్య స్వేచ్ఛ, భారతదేశంలో చిన్న కమతాలు, రసెల్ పుస్తక సమీక్ష వంటి సులువుగా లభ్యం కాని కొన్ని వ్యాసాలను చేర్చటం జరిగింది

ఈ సంపుటిలో ఉన్న విషయాల ముఖ్యాంశాలను ఈ క్రింద పొందుపరుస్తున్నాం

## భారతదేశంలో కులాలు

కొలంబియా విశ్వవిద్యాలయంలో డాక్టరేట్ డిగ్రీకోసం పరిశోధన చేస్తున్న సమయంలో,

డాక్టర్ అంబేడ్కర్ ఈ వ్యాసాన్ని డాక్టర్ గోల్డెన్ వీజెర్ నరవర్గశాస్త్ర సెమినార్‌లో చదివారు సహజంగానే ఆయన కులవ్యవస్థ సమస్యను నరవర్గశాస్త్ర దృక్పథంతోనే చూశారు భారతదేశంలోని జనాభా ఆర్యుల, ద్రావిడుల, మంగోలియన్ల, స్కిథియన్ల సమ్మిశ్రం అని ఆయన సూచించారు నరవర్గ శాస్త్ర రీత్యా చూస్తే మానవులలోని భిన్నతెగల ప్రజలంతా సంకరజాతివారే ఆయన ప్రకారం, భారత ఉపఖండంలో ఈ చివర నుంచి ఆ చివరి వరకూ గల ప్రజలను సాంస్కృతిక ఐక్యతే కలిపి ఉంచుతున్నది కులం విషయంలో వివిధ ప్రామాణిక సిద్ధాంతాలను బేరీజు వేసిన తర్వాత డాక్టర్ అంబేడ్కర్ ఏమంటారంటే, బాహ్య వివాహ పద్ధతిపై అంతర్వివాహ పద్ధతిని రుద్దడమే కుల సముదాయాలు ఏర్పడటానికి ముఖ్య కారణం అని స్త్రీలలో 'సతి' ఆచారమూ, జీవితకాలం బలవంతపు వైధవ్యమూ, బాల్య వివాహాలూ అంతర్వివాహ పద్ధతి నుంచి వచ్చినవే అని ఆయన చెప్పారు సమాజం ఉప విభజన కావటం సహజమే అంటూ, ఈ సముదాయాలు బహిష్కరణ, అనుకరణల ద్వారా కులాలుగా ఏర్పడ్డాయని డాక్టర్ అంబేడ్కర్ అన్నారు

## కుల నిర్మూలన

ఈ వ్యాసం ఎంతో ప్రసిద్ధి చెంది మహాత్మాగాంధీ అంతటివారి దృష్టిని ఆకర్షించింది డాక్టర్ అంబేడ్కర్ తాను గమనించిన అంశాలు ఇలా చెప్పారు- సవర్ణ హిందువులలోని సంస్కర్తలు ఎంతో విజ్ఞానవంతులు అయినాగాని, వారు తమ కార్యకలాపాలను బలవంతపు వైధవ్యాన్నీ బాల్య వివాహాలనూ రద్దు చేయటం వరకే పరిమితం చేసుకున్నారు కులాలను రద్దు చేయవలసిన అవసరాన్ని వారు గుర్తించలేదు, సరికదా, కులవ్యవస్థకు వ్యతిరేకంగా ఆందోళన జరిపే ధైర్యమూ లేకుండా పోయింది వారికి అంబేడ్కర్ ప్రకారం, భారతదేశంలో రాజకీయ విప్లవాలకంటే ముందు ఋషుల నాయకత్వంలో సాంఘిక, మతపరమైన సంస్కరణలు జరిగాయి కాని బ్రిటిషు పాలన కాలంలో సంఘ సంస్కరణ కంటే రాజకీయ స్వాతంత్ర్యం ఎక్కువ ప్రాధాన్యతను సంతరించుకున్నది దానితో సంఘ సంస్కరణను నిర్లక్ష్యం చేయటం జరిగింది విప్లవం ముందు అయినాగాని తర్వాత అయినాగాని సామ్యవాదులు ఈ కులరాక్షసికి వ్యతిరేకంగా పోరాటం చెయ్యవలసిందే అని అంబేడ్కర్ సామ్యవాదుల నుద్దేశించి చెప్పారు కులం శ్రమ విభజన మీద ఆధారపడిలేదనీ, అది శ్రామికుల విభజన అనీ స్పష్టంగా చెప్పారు అది ఆర్థిక వ్యవస్థ రూపంలో ఉన్నా కూడా నష్టదాయకమే సామాజిక ఐకమత్యానికి అడ్డుగా నిలుస్తున్న కులాన్ని నిర్మూలించి, ప్రజాస్వామ్య సూత్రాలకు అనువుగా ఉండేలాగ స్వేచ్ఛ, సమానత, సౌభ్రాత్రత సిద్ధాంతాలపై ఆధారపడే ఒక నూతన సమాజాన్ని నిర్మించవలసిందిగా ఆయన హిందువులకు పిలుపునిచ్చారు ఈ సమస్యకు, కులాంతర వివాహాలు ఒక పరిష్కార మార్గంగా ఆయన సూచించారు కులాలు నిలబడి ఉండటానికి 'శాస్త్రాల' మీద విశ్వాసమే మూలకారణమని ఆయన నొక్కి చెప్పారు "ప్రతి పురుషుణ్ణి, ప్రతి స్త్రీని శాస్త్రాల దాస్యం నుంచి విముక్తులను చేయండి, శాస్త్రాలు ఆధారంగా ఏర్పడిన విష భావాలను వారి మేధస్సునుంచి

కడిగి వేయండి, అపుడు అతడుగాని ఆమెగాని సహపంక్తి భోజనం చేస్తారు, కులాంతర వివాహం చేసుకుంటారు" అని సూచించారు కులవ్యవస్థ యొక్క దుర్మార్గపు ఆచారాల మీద కాకుండా హేతువు మీద సమాజం ఆధారపడాలని ఆయన అన్నారు

## భాషా ప్రయుక్త రాష్ట్రంగా మహారాష్ట్ర

సంపుటి రెండో భాగంలో భాషా రాష్ట్రాలపై డాక్టర్ అంబేడ్కర్ చేసిన ప్రధాన రచన లున్నాయి భాషల ప్రాతిపదికపై రాష్ట్రాలు ఏర్పాటు చేయాలని తలపెట్టినప్పుడు ఇచ్చిన మొదటి ప్రకటన 'భాషా ప్రయుక్త రాష్ట్రంగా మహారాష్ట్ర' అనేది అది భాషా రాష్ట్రాల సంఘానికి 1948లో ఆయన సమర్పించిన నివేదిక భాషా రాష్ట్రాలు ఏర్పాటు చేయటం ద్వారా తమ జాతి, భాష, సాహిత్యాలపై ఎంతో గర్వం పెంచుకొని, ప్రత్యేక జాతిగా పెరిగే మనస్తత్వాన్ని సంతరించుకొనటం వల్ల భాషా రాష్ట్రాల ఏర్పాటులో దేశ ఐక్యతకు ఏర్పడగల ప్రమాదాన్ని ఒకపక్క గుర్తిస్తూనే, భాషా ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్నిర్మాణం జరగటం వలన కొన్ని నిర్దిష్టమైన రాజకీయ ప్రయోజనాలు ఉంటాయని డాక్టర్ అంబేడ్కర్ అంటారు ప్రజాస్వామ్యం పని చేయటానికి ఒక రాష్ట్రంలో వివిధ రకాల జాతులకు చెందిన జనాభా ఉన్నదానికంటే ఏకజాతి జనాభా ఉన్న భాషా రాష్ట్రం తగినదిగా ఉంటుందని చెప్పారు భారతదేశంలో ఆరు రాష్ట్రాలు భాషా రాష్ట్రాలుగా ఉన్నాయి కాబట్టి బొంబాయి, మద్రాసు మధ్య పరగణాలను ఏకభాషా రాష్ట్రాలుగా నిర్మాణం చేయటానికి స్వతంత్ర భారతదేశ ప్రజాస్వామ్య రాజ్యాంగాన్ని దృష్టిలో పెట్టుకుంటే వాయిదా వేయటానికి వీలులేదనీ మధ్య పరగణాలు, బెరార్‌లను ఆనుకొని ఉన్న ప్రాంతాలలోని మరాఠీ మాట్లాడే ప్రజలనందరినీ కలిపి బొంబాయి నగరాన్ని ముఖ్య పట్టణంగా చేసి ఒకే శాసనసభ, ఒకే కార్య నిర్వాహక వర్గంతో మహారాష్ట్రను ఏకభాషా రాష్ట్రంగా ఏర్పాటు చేయాలనీ డాక్టర్ అంబేడ్కర్ వాదించారు మహారాష్ట్ర నుంచి బొంబాయి నగరాన్ని విడదీసి, దానినొక ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయాలనే దాన్ని సమర్థిస్తూ వస్తున్న వాదనలు పేర్కొంటూ డాక్టర్ అంబేడ్కర్ చారిత్రక, భౌగోళిక, జనాభా ప్రాతిపదికపై వాణిజ్య, ఆర్థిక తదితర కారణాలతో పటిష్ఠమైన పత్రాలు, ఆధారాలు చూపి వాటిని ఖండించారు బొంబాయి సమస్యను మధ్యవర్తి తీర్పుకు విడిచిపెట్టాలనే ప్రతిపాదనను త్రోసిపుచ్చుతూ, మహారాష్ట్ర బొంబాయి ఒకదాని మీద ఒకటి ఆధారపడి ఉన్నవే కాదు, అవి రెండూ వాస్తవానికి ఒకటే, విడదీయరానివి అని చెప్పారు

## అదుపులు – సమతుల్యాల ఆవశ్యకత

'టైమ్స్ ఆఫ్ ఇండియా'లో ప్రచురితమైన వ్యాసం ఇది భాషా రాష్ట్రాల భావన చరిత్రనూ, పెరుగుదలనూ పేర్కొన్న తర్వాత అవి నిలబడగలుగుతాయా లేదా, కులపరంగా అవి ఎలా ఉన్నాయనే విషయాలను దీనిలో పరిశీలించారు డాక్టర్ అంబేడ్కర్ ప్రకారం,

హైదరాబాద్ రాష్ట్రంలో ఉన్న తెలుగు మాట్లాడే ప్రాంతాలను విడిగా ఉంచితే ఆంధ్రరాష్ట్రం నిలదొక్కుకోలేదు. చెప్పు, ఆంధ్ర, మహారాష్ట్ర వంటి భాషా ప్రాంతాలలో కులాల పరిస్థితి ఎలా ఉంటుందో పరిశీలిస్తూ ఒకటో రెండో కులాలు అధిక సంఖ్యలో ఉంటాయనీ ఆ అధిక సంఖ్యాక కులాలకు మిగిలిన అల్ప సంఖ్యాక కులాలు లొంగి ఉండి వారిమీద ఆధారపడి జీవించవలసిన పరిస్థితి ఉంటుందనీ ఆయన అభిప్రాయపడ్డారు. ఒకేభాషను మాట్లాడుతున్న వారినందరినీ ఒక పెద్ద రాష్ట్రంలో సమీకృతం చేయటంలోని ఔచిత్యాన్ని ఆయన ప్రశ్నించారు. ప్రత్యేక చైతన్యాన్ని కలిగించే ఇలాంటి సమీకరణ, రాష్ట్రాల మధ్య విరోధ భావానికి దారితీస్తుంది. భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడవలసిన అవసరం ఉందనే విషయాన్ని ఆయన అంగీకరించినప్పటికీ భాషా రాష్ట్రం పేరు మీద అధిక సంఖ్యలో ఉన్న కులం తన అధికారాన్ని దుర్వినియోగపరచకుండా అదుపులు, సమతుల్యత ఉండాలని దీనిలో వాదించారు.

## భాషాప్రయుక్త రాష్ట్రాలపై ఆలోచనలు

'భాషా రాష్ట్రాలపై ఆలోచనలు' అన్న పుస్తకం భాషా రాష్ట్రాల నిర్మాణంపై డాక్టర్ అంబేడ్కర్ అంతిమ వ్యాఖ్యానం అని చెప్పవచ్చు. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమిషన్ నివేదికపై విమర్శనాత్మకంగా రాసిన వ్యాసం ఇది. ఆయన ప్రకారం, కమిషన్ చేసింది ఏమంటే, ఉత్తర ప్రదేశ్, బీహార్ రాష్ట్రాలు ఎలా ఉన్నాయో అలానే ఉంచటం ద్వారా రాష్ట్రాల మధ్య వ్యత్యాసాన్ని సృష్టించటమే కాకుండా, మధ్యప్రదేశ్, రాజస్థాన్‌లతో మరో కొత్త పెద్ద రాష్ట్రాలను ఏర్పరచింది. హిందీ మాట్లాడే ఉత్తర ప్రాంతాలనన్నింటినీ సమీకృతం చేయటం ద్వారా ముక్కలైన దక్షిణ ప్రాంతంతో కొత్త రాజకీయ సమస్యను సృష్టించింది. ఈ రెండు ప్రాంతాల లోను ఉన్న విస్తృతమైన సాంస్కృతిక విభేదాలను దృష్టిలో పెట్టుకొని, దక్షిణ ప్రాంతం నాయకులు ఉత్తరదేశ పెత్తనంపై వెలిబుచ్చిన భయాలు చూసి భవిష్యత్తులో ఈ రెంటి మధ్య జగడాలు వచ్చే ప్రమాదం ఉన్నదని డాక్టర్ అంబేడ్కర్ ఊహించారు. "ఒక రాష్ట్రం ఒక భాష" అనే సూత్రాన్ని కమిషన్ అనుసరించి ఉండవలసిందని ఆయన అభిప్రాయపడ్డారు.

బహు భాషా రాష్ట్రాలు కాకుండా ఏక భాషా రాష్ట్రాల ఏర్పాటును ఆయన వాంఛించారు. ఎందుకంటే, పటిష్ఠమైన, ప్రజాస్వామ్య రాజ్యానికి ప్రాతిపదిక అయిన సోదరభావం ఈ రెండో పద్ధతిలో ఉంటుంది. అలా కాకుండా మొదటి పద్ధతిలో అయితే రెండు భాషలు మాట్లాడే ప్రజల నాయకులు ఒకరితో మరొకరు పోటీ పడటం వల్ల నాయకత్వం కోసమూ, పాలనా విధులు పంచుకోవటంలోనూ మురా తగాదాలు వస్తాయి. ప్రజాస్వామ్యానికి ఈ అంశాలు సరిపడవు. ఏకభాషా రాష్ట్రాలపై ఆయన సమ్మతి ఒక షరతుకు లోబడి ఉంది. అదేమంటే వాటి అధికార భాష హిందీ అయి ఉండాలి. భారతదేశంలో హిందీ ఆ స్థాయికి వచ్చేవరకూ ఇంగ్లీషు భాష కొనసాగాలి. ఏకభాషా రాష్ట్రాలలో వాటి ప్రాంతీయ భాషను అధికార భాష స్థాయికి గనక పెంచినట్లయితే, అవి స్వతంత్ర జాతులుగా పెరిగే ప్రమాదం ఉన్నదని ఆయన పసిగట్టారు.

ప్రాంతాలు, జనాభాతో సంబంధం లేకుండా కేంద్ర శాసనసభలో రాష్ట్రాలకు సమాన ప్రాతినిధ్యం లేనందువలన ఉత్తరదేశంలోని పెద్ద రాష్ట్రాలు దక్షిణదేశంలో ఉన్న చిన్న రాష్ట్రాల మధ్య వ్యత్యాసాన్ని తొలగించటానికి డాక్టర్ అంబేడ్కర్ సూచించిన నివారణోపాయం ఏమంటే, రెండుకోట్ల జనాభా మించకుండా ఉండే భాగాలుగా పెద్ద రాష్ట్రాలను విభజించాలి ప్రస్తుతానికి బీహార్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలను రెండు రాష్ట్రాలుగాను, సంయుక్త రాష్ట్రాలను మూడు రాష్ట్రాలుగాను విభజించాలని ఆయన సూచించారు మహారాష్ట్రకు సంబంధించి ఆయన ప్రతిపాదన ఏమంటే, ప్రాచీన కాలంలో మాదిరిగా దానిని పశ్చిమ, కేంద్ర, తూర్పు మహారాష్ట్రలుగాను, బొంబాయి నగరాన్ని ప్రత్యేక మహారాష్ట్ర నగర రాష్ట్రంగాను విభజించాలి ఇలాంటి చిన్న రాష్ట్రాల వలన ఆయన ఉద్దేశంలో సమర్థవంతమైన పరిపాలన ఏర్పాటు చేసుకోవటానికి, వివిధ ప్రాంతాల ప్రత్యేక అవసరాలను తీర్చటానికి వీలవుతుంది ప్రజల మనోభావాలను కూడా ఈ ఏర్పాటు తృప్తి పరుస్తుంది

భారతదేశంలో అధిక సంఖ్యాకుల, అల్ప సంఖ్యాకుల మధ్య పరస్పర సంబంధం రాజకీయపరంగా ఉండదు, కులపరంగా ఉంటుంది అందులో మార్పు కూడా ఉండదు చిన్న రాష్ట్రాల ఏర్పాటు వలన ఈ సంబంధాలలో తీవ్రత తగ్గుతుంది అల్ప సంఖ్యాకులపై అధిక సంఖ్యాకులు క్రూరకృత్యాలు చేసే ప్రమాదం కూడా తగ్గుతుంది అటువంటి క్రౌర్యం నుంచి అల్ప సంఖ్యాకులకు రక్షణ కల్పించటానికి డాక్టర్ అంబేడ్కర్ బహుళ సభ్యుల (ఇద్దరు లేదా ముగ్గురు సభ్యులు) నియోజకవర్గాలు, ఓట్లన్నీ కలిపే పద్ధతిలో ఏర్పాటు చేయటానికి రాజ్యాంగ సవరణ సూచించారు

భారతదేశానికి రెండో రాజధాని పట్టణాన్ని కూడా డాక్టర్ అంబేడ్కర్ సూచించారు అది దక్షిణాదిలో హైదరాబాద్ నగరం గనక అయితే మంచిదనీ, ఉత్తర దక్షిణ ప్రాంతాలమధ్య ఉద్రిక్త వాతావరణాన్నీ రాజకీయ కేంద్రీకరణనూ తగ్గించటానికి ఉపయోగపడుతుందనీ ఆయన భావించారు

## రెనడే, గాంధీ, జిన్నా

భారతదేశంలో రాజకీయ, సామాజిక మేధావులలో అగ్రగణ్యుడైన జస్టిస్ రెనడే 101వ జన్మదిన మహోత్సవ సందర్భంగా డాక్టర్ అంబేడ్కర్ ఈ ముఖ్యమైన ప్రసంగం చేశారు తన ప్రసంగం ప్రారంభంలో, డాక్టర్ అంబేడ్కర్ చరిత్ర నిర్మాతగా మనిషి పాత్రను చర్చించారు ఆయన ప్రకారం, భూగోళ శాస్త్రం, భౌతిక శాస్త్రం, చరిత్రను సృష్టించాయనే బకల్ సిద్ధాంతమూ ఆర్థిక శక్తుల మూలంగా చరిత్ర నిర్మాణమయిందనే మార్క్స్ సిద్ధాంతమూ రెండూ కూడా అర్థ సత్యాలే ఈ రెండూ కూడా మనిషికి ఏ స్థానమూ ఇవ్వవు చరిత్ర నిర్మాణంలో మనిషి ప్రధాన పాత్ర వహిస్తాడనీ, కేవలం పరిసర శక్తులు తమంతతాము చరిత్రను సృష్టించజాలవనీ డాక్టర్ అంబేడ్కర్ నొక్కి వక్కాణించారు

నాయకారాధనను ప్రస్తుతించిన కార్లైల్, ఇతర రాజకీయ చింతనాపరులూ ప్రతిపాదించినట్టుగా మహా పురుషుల లక్షణాలను పరిశీలించటానికి డాక్టర్ అంబేడ్కర్ ఉద్యుక్తులయ్యారు విస్తృతమైన చర్చ తరువాత, నిష్కాపట్యం, వివేకం ఈ రెండూ కలిసి ఉండటం మహాపురుషుని లక్షణమని అంటారాయన కాని ఈ లక్షణాలు మాత్రమే సరిపోవు ఈ రెండు లక్షణాలు కలిగి ఉన్న వ్యక్తి సామాజిక ప్రయోజన ప్రేరకాలతో ఉద్విగ్నుడై సమాజానికి పారిశుద్ధ్య కార్మికునిగా పనిచేయాలి

డాక్టర్ అంబేడ్కర్ ప్రకారం, ఏ ప్రమాణంతో చూసినా రెనడే ఒక మహా పురుషుడు సామాజిక ప్రజాస్వామ్యాన్ని సృష్టించటం కోసం హిందూ సమాజాన్ని శక్తిమంతం చేయాలనుకున్నా డాయన సామాజిక మతపరమైన ఆచారాలు ఎంత అవినీతికరంగా ఉన్నా పవిత్రమైనవిగా భావించే రోజుల్లో రెనడే జీవించాడు హిందూ సమాజంలో వేటిని సిగ్గుమాలినవిగా, తప్పిదాలుగా భావించారో వాటినే ప్రజలు తమ మతం ఇచ్చే పవిత్రమైన ఆంక్షలుగా భావించారు వ్యాధిగ్రస్తమై చావనున్న హిందూ సమాజపు అంతరాత్మను రెనడే చైతన్యవంతం చేయాలనుకున్నాడు నిజమైన సాంఘిక ప్రజాస్వామ్యాన్ని సృష్టించాలని రెనడే ఉద్దేశించాడు ఎందుకంటే అది లేకపోతే స్థిరమైన పటిష్ఠమైన రాజకీయాలు ఉండవు పాతవ్యవస్థను ప్రక్షాళనం చేసి హిందూ సమాజ నైతిక భావనను అభివృద్ధి పరచాలని రెనడే భావించారని డాక్టర్ అంబేడ్కర్ చెప్పారు

తన ప్రసంగాన్ని ముగిస్తూ డాక్టర్ అంబేడ్కర్ నిరంకుశ ప్రభుత్వం విషయంలో జాగ్రత్తగా ఉండాలని హెచ్చరించారు

"నిరంకుశ ప్రభుత్వం, అది ప్రజలు కోరుకున్నది అయినంత మాత్రాన నిరంకుశ ప్రభుత్వం కాకుండా పోదు అలాగే నిరంకుశ ప్రభుత్వంలోని నిరంకుశులు మన జాతికి చెందిన వారే అయినప్పటికీ అది ఆమోదయోగ్యమూ కాదు నిరంకుశ ప్రభుత్వాన్ని నిజంగా కాపాడగలిగేది ఏదంటే దానిని పడగొట్టగల అవకాశం ఉన్నదని చూపటమే మరో ప్రతిపక్ష పార్టీని అధికారంలోకి తీసుకురాగలమనే పరిస్థితిని ఎదురు చూపగలగటమే " అని చెప్పారు

## సౌత్ బరో కమిటీకి ఇచ్చిన వాంగ్మూలం

సౌత్ బరో కమిటీకి డాక్టర్ అంబేడ్కర్ ఇచ్చిన వాంగ్మూలం ఆయన రాజకీయ రచనల్లో మొదటిది ఈ వాంగ్మూలంలో, రైట్ ఆనరబుల్ లార్డ్ సౌత్ బరో అధ్యక్షతన ఏర్పడిన ఓటుహక్కు కమిటీకి రాతపూర్వకంగా డాక్టర్ అంబేడ్కర్ ఇచ్చిన ప్రకటన, అదే కమిటీ ముందు జనవరి 27, 1919 నాడు ఇచ్చిన వాంగ్మూలం రెండూ చేరాయి

అభిప్రాయాల ప్రాతినిధ్యాన్నీ, వ్యక్తుల ప్రాతినిధ్యాన్నీ తీసుకురాని ఓటు హక్కు నియోజకవర్గం పథకం ఏదయినా ప్రజా ప్రభుత్వాన్ని ఏర్పరచలేదనే సైద్ధాంతిక వాదన చేసి,

డాక్టర్ అంబేడ్కర్ కుల, మత సముదాయాలతో కూడి ఉన్న భారతీయ సమాజానికి సంబంధించి ఈ రెండు అంశాలూ ఎంత సందర్భోచితంగా ఉన్నాయో చూపారు ప్రతి కుల సముదాయమూ తనదంటూ ఒక ప్రత్యేక తరహాలో రాకపోకల సంబంధాలు, సమష్టి కార్యకలాపాలలో భాగస్వామ్యం, అంతః ధర్మం మొదలైన వాటిమీద ఆధారపడిన ఒక సాధర్మ్యాన్ని పెంచుకోవటానికి ప్రయత్నిస్తుంది హిందూ, ముస్లిం, పార్శీ మొదలైన మత సముదాయాల మధ్య కంటె అవర్ణ సవర్ణ హిందువుల మధ్య సాధర్మ్యలోపం - కలిసి పనిచేయకపోవటమనేది - స్పష్టంగా కనిపిస్తుంది లౌకిక ప్రాతిపదికపై పై మత సముదాయాలకు ఉమ్మడి భౌతిక ప్రయోజనం ఉంటుంది అట్టి సముదాయంలో, భూస్వాములు, కార్మికులు, పెట్టుబడిదారులు ఉంటారు ఏ రకమైన సాంఘిక భాగస్వామ్యమూ లేకుండా అంటరానివారిని వేరుగా ఉంచారు సాంఘిక, మతపరమైన అయోగ్యతలు పెట్టి వారిని దాదాపు బానిసల స్థాయికి దించి మానవులుగా బ్రతకకుండా చేశారు సార్వత్రికంగా ఆమోదించే పౌరహక్కులు వారికి లేకుండా చేశారు వారి ప్రయోజనాలు స్పష్టంగా వారి ప్రయోజనాలు మాత్రమే ఎవరూ కూడా వారి గురించి పట్టించుకున్న వారు లేరు

జనాభా ప్రాతిపదిక మీద, బొంబాయి రాష్ట్రంలోని అంటరానివారి కోసం తగు మాత్రం నియోజకవర్గం ఏర్పడేలా ఓటు సంఖ్యను కుదించి బొంబాయి శాసనసభలో వారికి ఎనిమిది నుంచి తొమ్మిది స్థానాలుండాలని డాక్టర్ అంబేడ్కర్ కోరారు వివిధ సంస్థలు ప్రతిపాదించిన వివిధ పథకాలను సమీక్షించిన మీదట, ఆయన మతపరమైన ప్రాతినిధ్యం ముస్లిములకు మాత్రమే ఉండాలనీ అంటరానివారిని సాధారణ నియోజకవర్గాలలో ప్రాతినిధ్యం తెచ్చుకోమనీ చెబుతున్న కాంగ్రెస్ విధానం రాజకీయంగా అతివాదంగా ఉండి సాంఘికంగా మితవాదులుగా ఉన్న వారి నాయకులకు తగ్గట్టుగానే ఉన్నదని విమర్శించారు ద్విసభ్య నియోజకవర్గాలలో ఒకటి లేదా రెండు సీట్లు మాత్రమే అంటరానివారికి కేటాయించాలనే మధ్యేవాదుల ప్రతిపాదనను కూడా ఆయన విమర్శించారు ఎందుకంటే అది పనికి వచ్చే ప్రాతినిధ్యాన్ని కలిగించదు గనుక శాసనసభకు ఎన్నికైన సభ్యులు కొందరిని లోపలికి తీసుకోవాలనే డిప్రెస్డ్ క్లాస్ మిషన్ వారు చేసిన ప్రతిపాదన కూడా ఆయన తిరస్కరించారు ఎందుకంటే అంటరానివారికి ఏది మంచో వారే నిర్ణయించుకొనేలా వారికి సహకరించకుండా వారికి ఏది మంచో తామే నిర్ణయం చేసే స్థితికి అది దారి తీస్తుంది గనుక మిక్కిలి వెనుకబడిన కులాలకు సీట్లు ప్రత్యేకించటం ద్వారా కుల పరమైన ప్రాతినిధ్యం కలిగించటం, సాంఘిక విభజనను కొనసాగించదనీ, పరస్పర సంబంధాలు పెట్టుకోవటానికి, సహకరించుకోవటానికీ, వేర్పాటు ధోరణులను తగ్గించి సమాజంలోకి కలుపుకొనే అవకాశాలు కలిగించి భేదాలు లేకుండా చేయటానికీ ఈ పద్ధతి ఉపకరిస్తుందనీ ఆయన చెప్పారు అంతేకాకుండా, బ్రిటిషు పాలనాధికారం నుంచి, అత్యధిక సంఖ్యాకులు కోరుతున్నట్లుగానే అంటరానివారు కూడా స్వయం నిర్ణయాధికారాన్ని వాంఛిస్తున్నారు

## సమాఖ్యకు పోటీగా స్వేచ్ఛ

డాక్టర్ అంబేద్కర్ రెండు ప్రసంగాలు – "సమాఖ్యకు పోటీగా స్వేచ్ఛ" అనేది పూనాలోని గోఖలే ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎకనామిక్స్‌లో 29 1 1939న చేసిన ప్రసంగం "కులమతపరమైన ప్రతిష్ఠంభన పరిష్కార మార్గం" అనేది 6 5 1945న జరిగిన అఖిల భారత షెడ్యూల్డు కులాల ఫెడరేషన్ సమావేశంలో చేసిన ప్రసంగం ఈ రెండూ కూడా సమయానుగుణంగా ఉన్నాయి 1939లో, భారతదేశంలో ఉన్న అన్ని పెద్ద రాజకీయ పార్టీలు రాష్ట్రాల స్వయం ప్రతిపత్తికి సంబంధించిన 1935 భారత ప్రభుత్వ చట్టంలోని భాగాలను అమలు పరచటానికి నిర్ణయించుకున్నాయి భారత రాజకీయ ఆకాశంలో కేంద్రంలో సమాఖ్య నిర్మాణాన్ని అంగీకరించటమనే సమస్య మెదులుతూ ఉన్నది ఈ అంశంపై అంతవరకు డాక్టర్ అంబేద్కర్ తన అభిప్రాయాలను బహిర్గతం చెయ్యలేదు గోఖలే ఇన్‌స్టిట్యూట్ సమావేశంలో మేధావుల ముందు ఆ అవకాశాన్ని వినియోగించుకున్నారు

తన ప్రసంగంలో, సమాఖ్య పథకం ఎలా ఉంటుందనేది సంక్షిప్తంగా అమలులో ఉన్న ప్రజాస్వామిక సమాఖ్యల కొలబద్దలతో పరిశీలన చేశాడు ఈ పరిశీలన ఏమి చూపిందంటే ఈ పథకం కేంద్రం వద్ద పరిమితమైన బాధ్యతలను మాత్రమే అందజేస్తుంది ఇది డొమినియన్ ప్రతిపత్తికి దారితీసే అవకాశం మాత్రం ఉంది సమాఖ్యలో చేరనున్న రెండు భాగాలు అంటే– రాష్ట్రాలు– రాజకుమారుల పాలనలో ఉన్న రాష్ట్రాల – మధ్య హోదాలో వ్యత్యాసం ఉంది సమాఖ్య అంటే స్వయం ప్రతిపత్తిగల రాష్ట్రాలు ఏర్పడినట్టే ఒక సహజ పరిణామంలాగ అవి సమాఖ్యలో చేరతాయి రాజకుమారుల పాలన క్రింద ఉన్న రాష్ట్రాల విలీనీకరణ బ్రిటిషు రాజ్యాధికారులతో వారు చేసుకున్న ఒప్పందాల చారిత్రక షరతులపైనా వారు సంతకం చేసిన విలీనీకరణ పత్రంపైనా ఆధారపడి ఉంటుంది స్వయం ప్రతిపత్తిగల రాష్ట్రాలే కాకుండా రాష్ట్రాల విలీనీకరణ కూడా సమాఖ్య ఏర్పాటుకు పూర్వ షరతు అవుతుంది రెండు సమాఖ్య సభలకు రాష్ట్రాల ప్రాతినిధ్యం ఎన్నిక ద్వారా ఉంటుంది రాజకుమారుల పాలనలో ఉన్న ప్రాంతాల ప్రతినిధులను మాత్రం నిరంకుశ ప్రభువు ఎంపిక చేస్తారు ఆయనకు వారు విధేయులై ఉంటారు ఈ ప్రతినిధులు ఎల్లప్పుడూ బ్రిటిష్ ఉద్యోగుల చెప్పుచేతల్లో ఉంటారు. దీనివల్ల ప్రభువులపై అధికారం చేసే అవకాశం దొరుకుతుంది ఈ విధమైన ఏర్పాటులో అఖిల భారత జాతీయ భావన ఏర్పడదు సరికదా భారత రాజకుమారుల పాలనలో ఉన్న ప్రాంతాలను సమాఖ్య క్రింద విదేశీ ప్రాంతాలుగా చూడటంతో వేర్పాటు ధోరణులు తల ఎత్తుతాయి ప్రభువుల ప్రవర్తనను గాని రాష్ట్రాల పాలనా పద్ధతినిగాని సమాఖ్య శాసనసభ చర్చించటానికి వీలులేదు అయితే ఏదైనా రాష్ట్రానికి సంబంధించిన అంశంపై జరిగే చర్చలో పాల్గొని ఓటు చేయవచ్చు ప్రాతినిధ్యంలో మాదిరిగా, పన్ను విధింపు, పరిపాలన, శాసనం చేయటం మొదలైన విషయాలలో ఈ పథకం రాజకుమారుల పట్ల కొంత పక్షపాతం

చూపుతున్నది ఆ విధంగా బ్రిటిష్ ఇండియా భవితవ్యాన్ని నిర్ణయించే విషయం రాజకుమారుల చేతుల్లోకి వెళ్లిపోతుంది

ఇవీ ఇంకా ఇట్లాంటి ఇతర కారణాల వల్ల 1935 భారత ప్రభుత్వ చట్టం రూపొందించిన సమాఖ్య విధానాన్ని డాక్టర్ అంబేడ్కర్ తిరస్కరించారు రాష్ట్రాల సమస్యకు ఆయన సూచించిన పరిష్కారం ఏమంటే దానిని రాజకీయంగా కాక పరిపాలనకు సంబంధించినదిగా చూడటం చట్టపరంగా దీనిని పరిష్కరించటం ఎలా అంటే - భూసేకరణ చట్టం కింద రాజకీయ అవసరాలకోసం ప్రైవేటు హక్కులనూ, ఆస్తులనూ ఏ విధంగా అయితే సేకరిస్తారో అదేవిధంగా రాజకుమారుల భూభాగాలను కలుపుకొని వారికి భరణం చెల్లించాలి అని ఆయన చెప్పారు

డాక్టర్ అంబేడ్కర్ ఉద్దేశంలో, రాజకుమారులు, హిందూ మహాసభవారు మాత్రమే రాజకుమారుల విలీనీకరణ హిందూ బలాన్ని పెంపు చేస్తుందని అనుకుంటున్నారు తప్ప, మిగిలిన పెద్ద రాజకీయపార్టీ ఏదీ కూడా సమాఖ్య పద్ధతిని మెచ్చు కోవటం లేదు సమాఖ్య గురించి, అది ఏ మాత్రమూ పట్టించుకోని స్వతంత్ర వ్యక్తి అభిప్రాయమూ, పేదవాని అభిప్రాయమూ రెండూ ఒకేలాగ ఉన్నాయి అని డాక్టర్ అంబేడ్కర్ అన్నారు సమాఖ్య ఆవిర్భావం గనక అయితే రాకుమారుల నిరంకుశాధికారం స్వతంత్ర వ్యక్తి స్వేచ్ఛకు ప్రమాదకరమవుతుంది పాత విలువలకు తిరిగి విలువ కట్టడంలోనూ, కూడబెట్టుకున్న హక్కులను నాశనం చేయడంలోనూ రాజ్యాంగం తమకు సహకరించాలని ఆశించే పేదవానికి అది అడ్డుగా నిలుస్తుంది

## కుల మత పర ప్రతిష్టంభన – పరిష్కార మార్గం

'కుల మతపరమైన ప్రతిష్టంభన–దాని పరిష్కార మార్గం' అనే రచన కాలానుగుణమైనది భారతదేశపు భావి రాజ్యాంగం కోసం షెడ్యూల్డు కులాల తరఫున ఉంచిన ఒక నిర్మాణాత్మకమైన ప్రతిపాదన ఇది సంఘటనాత్మకమైన 1945 సంవత్సరంలో కుల-మత సమస్యను పరిష్కరించటానికి సమకాలికులు ఎందరో ప్రతిపాదించిన ఎన్నో పరిష్కార మార్గాలలో ఇది ఎన్నదగినది తొలుత, 1941లో స్వయం నిర్ణయాధికార సూత్రం ప్రకారమూ ఒక చారిత్రక అవసరంగానూ, డాక్టర్ అంబేడ్కర్ పాకిస్థాన్ ఏర్పాటును గురించి చెప్పారు ప్రస్తుత వ్యాసం, మరొక ప్రత్యామ్నాయ మార్గాన్ని ప్రతిపాదిస్తున్నది ఆయన అభిప్రాయంలో తగిన అదుపులు, సమతూకాలు ఉంచటం అనేది, అన్ని అల్ప సంఖ్యాక వర్గాల ప్రయోజనాలకూ రక్షణ ఉండేలా చేసి ఒక సమైక్య భారతదేశానికి హామీ ఇస్తుంది

కుల సమస్యను పరిష్కరించకుండా రాజ్యాంగ రచనా సభను ఏర్పాటు చేయటాన్ని ఆయన వ్యతిరేకించారు భారతదేశానికి కావలసిన రాజ్యాంగపరమైన భావనలు, రాజ్యాంగ

రూపాలు 1935 భారత ప్రభుత్వ చట్టంలో దొరుకుతాయి, డొమినియన్ ప్రతిపత్తికి భిన్నంగా ఉన్న అంశాలను అందులో నుంచి తొలగిస్తే సరిపోతుంది రాజ్యాంగ రచనా సభ అంటూ ఒకటి ఉండాలనుకుంటే, దానిలో కులసమస్యను చేర్చకూడదని డాక్టర్ అంబేడ్కర్ అన్నాడు

రాజ్యాంగ సభ విషయంలో సర్ స్ట్రాఫోర్డ్ క్రిప్స్, సర్ తేజ్ బహదూర్ సప్రూలు సూచించిన రెండు పథకాలనూ పరిశీలించిన తర్వాత డాక్టర్ అంబేడ్కర్ ఏమంటారంటే ఈ రెండూ కూడా కులసమస్యను పరిష్కరించకుండానే మిగిల్చి వేశాయని ఆయన ఉద్దేశంలో, అటువంటి పథకాలు, ప్రణాళికలు విఫలమవుతాయి ఎందుకంటే అవి తప్పు ధోరణిలో ఉన్నాయి ఒక సూత్రం ప్రకారంగా కాకుండా అవి ఒక పథకం ప్రకారం ఉండడమే అందుకు కారణం ఎప్పటికీ పెరుగుతూనే ఉన్న కుల-మత పరమైన అల్ప సంఖ్యాక వర్గాల కోర్కెలు తీర్చడానికి ఎల్లప్పుడూ ప్రయత్నాలు చేయవలసి రావటమే దీని అంతిమ ఫలితం

ఇందుకు ఆయన ప్రతిపాదించే సూత్రం ఏమంటే, భారతదేశంలో మెజారిటీ అనేది కులపరమైన మెజారిటీగా ఉంటుంది అది రాజకీయ మెజారిటీగా మారటం అంటూ జరగదు అందు వల్ల మెజారిటీ పరిపాలన అనేది సైద్ధాంతికంగా అంగీకరించటానికి వీలు లేనిది ఆచరణలో న్యాయబద్ధంగా కూడా ఉండదు మెజారిటీ కులం, ఇతర కులాలకంటే తాను సాపేక్ష మెజారిటీలో ఉన్నానని సంతృప్తి పడాలి ఈ మెజారిటీ కూడా, మరో మైనారిటీతో కలుపుకొని తన పరిపాలన సాగించటానికి వీలు కలిగించేటంత మెజారిటీ ఉండకూడదు అదే విధంగా ఉన్న వాటిల్లో పెద్ద మైనారిటీ అదే రీతిలో పరిపాలన సాగించేటంత కూడా ఉండకూడదు ఏమయినా మైనారిటీలు అన్నీ కలిస్తే శాసనసభలో పూర్తి మెజారిటీ వచ్చేటట్టు ఉండాలి కేంద్ర, రాష్ట్ర శాసనసభల్లో ఈ సూత్రాల వర్తింపు కులాలవారీగా ఏ విధంగా పరిణమిస్తుందో డాక్టర్ అంబేడ్కర్ చాలా విపులంగా చూపారు

డాక్టర్ అంబేడ్కర్ ప్రతిపాదన ముఖ్యంగా సమైక్య భారతదేశం కోసం ఒకవేళ భారతదేశ విభజన తప్పనిసరి అయితే, పాకిస్థాన్ లో ఉండే ముస్లిములు, వారి దేశంలో ఉన్న ముస్లిమేతరులకు ఈ సూత్రాల ప్రయోజనాలను లేకుండా చేయరని డాక్టర్ అంబేడ్కర్ ఆశించారు వారి తోటి మతస్థులు, భారతదేశంలో నిస్సహాయులైన మైనారిటీగా మిగిలిపోయినా, ఈ సూత్రాల అంగీకారం వలన వారి ప్రయోజనాలు భద్రంగానే ఉంటాయి రాజకీయాలలో మెజారిటీ సూత్రాన్ని వదులుకున్నా, అది హిందువులను తమ సాంఘిక ఆర్థిక జీవన రంగాలలో ఏ మాత్రమూ దెబ్బ తీయదని డాక్టర్ అంబేడ్కర్ భావించారు

## రాష్ట్రాలు – అల్ప సంఖ్యాక వర్గాలు

"రాష్ట్రాలు - అల్ప సంఖ్యాక వర్గాలు" అనే పుస్తకం అల్ప సంఖ్యాక వర్గాలవారి-

ముఖ్యంగా షెడ్యూల్డు కులాలవారి – రక్షణలకు సంబంధించి డాక్టర్ అంబేద్కర్ రూపొందించి, 1946లో అఖిల భారత షెడ్యూల్డు కులాల ఫెడరేషన్ తరపున రాజ్యాంగ రచనా సభకు సమర్పించిన నివేదిక ఇది ఒక ముసాయిదా రాజ్యాంగంలా, అధికరణలతోనూ, క్లుప్త వివరణల తోనూ, ఇతర గణాంక వివరాలతోనూ కూడి ఉన్నది

పౌరుల ప్రాథమిక హక్కులు, శాసనసభల్లో, స్థానిక సంస్థల్లో, కార్య నిర్వాహకవర్గం ఉద్యోగాలలో అల్ప సంఖ్యాక వర్గాలు, షెడ్యూల్డు కులాల ప్రాతినిధ్యానికి సంబంధించిన హక్కుల, రక్షణల నిర్దిష్టమైన షరతులను ఈ నివేదిక రూపొందించింది విద్య గురించిన ప్రత్యేక నిబంధనలు, ప్రత్యేక గ్రామాలలో షెడ్యూల్డు కులాల నివాసపు ఏర్పాట్ల విషయాలు కూడా ఇది పొందుపరిచింది మొదటి అధికరణలోనే యూనియన్‌లోకి భారత రాష్ట్రాల ప్రవేశం విషయం ఉన్నది యూనియన్‌లోకి ప్రవేశంపై వాటిని అర్హమైనవిగా, అనర్హమైనవిగా వర్గీకరించటం జరిగింది అర్హమైన రాష్ట్రాలు యూనియన్ రాజ్యాంగ సూత్రాలకు అనువుగా ఉండేలా అంతర్గత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోవలసిన అగత్యం ఉన్నది అనర్హమైన రాష్ట్రాల భూభాగం యూనియన్ భూభాగం కింద లెక్కకు వస్తుంది

ఈ నివేదిక, షెడ్యూల్డు కులాల హక్కులు, యోగ్యతలను నిర్ణయించటమే కాకుండా వాటిని హరించివేస్తున్న సందర్భాలలో నివారణ మార్గాన్ని కూడా సూచించింది దీనికోసం రచయిత, 1931లో రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌కు అల్ప సంఖ్యాకుల తరపున తాను ఇచ్చిన నివేదిక పైనే ఎక్కువగా ఆధారపడటం జరిగింది అవన్నీ అమెరికా సంయుక్త రాష్ట్రాల చట్టాలలో నుంచీ బానిస విముక్తి తర్వాత నీగ్రోల ప్రయోజనం కోసం చేసిన సవరణల నుంచీ బర్మా ఏన్‌టీ బాయ్‌కాట్ చట్టం నుంచీ తీసుకోవటం జరిగింది ప్రధానమంత్రిని మొత్తం శాసనసభ – యూనియన్‌కు రాష్ట్రానికి – ఎన్నుకోవటానికీ, మంత్రిమండలిలోని వివిధ అల్ప సంఖ్యాక వర్గాల ప్రతినిధులను సభలోని ప్రతి అల్ప సంఖ్యాక వర్గం ఎన్నుకోవటానికీ, కార్యనిర్వాహక వర్గంలో అధిక సంఖ్యాకుల ప్రతినిధులను మళ్లీ మొత్తం సభ ఎన్నుకోవటానికీ సంబంధించిన ఏర్పాటు ఈ నివేదికలోని విశేషాంశాలలో ఒకటి

మరొక అద్వితీయమైన అంశం ఏమంటే, ఆర్థిక దోపిడి నుంచి, ఆకలి నుంచి భయం నుంచి విముక్తి కల్పించే పౌరుల ప్రాథమిక హక్కులను అతిక్రమిస్తున్న సందర్భంలో వాటి ప్రతిక్రియకు సంబంధించిన నిబంధన దేశ ఆర్థిక నిర్మాణాన్ని మార్చటానికి రాజ్యాంగం నిబంధన ద్వారా దీనిని సాధించవచ్చు దీనిని రాజ్యాంగం అమలుకు వచ్చిన పది సంవత్సరాలలోగా అమలుకు తెచ్చుకోవాలి క్లుప్తంగా చెప్పాలంటే రాజ్య సామ్యవాదాన్ని అమలు చేయటం ద్వారా, ప్రధాన పరిశ్రమలపై బీమాపై రాజ్య యాజమాన్యాన్నీ నిర్వహణనూ ఇది తల పెడుతున్నది వ్యవసాయాన్ని కీలక పరిశ్రమలలో చేర్చటం జరిగింది ఉమ్మడి వ్యవసాయ పద్ధతిపై దానిని సాగు చెయ్యాలి జాతీయం చేసిన తర్వాత భూముల యజమానులకు నష్ట

పరిహారాన్ని డిబెంచర్ల రూపంలో ఇస్తారు డిబెంచరు పత్రాలు కలిగినవారికి చట్టం అనుమతించే వడ్డీని చెల్లించటం జరుగుతుంది

## భారతదేశంలో చిన్న కమతాలు

డాక్టర్ అంబేడ్కర్ తన డాక్టరేట్ డిగ్రీకోసం చేసిన పరిశోధనలన్నీ ఆర్థిక విషయాలపైననే చేశారు. ఈ వ్యాసంలో దేశంలో వ్యవసాయ ఆర్థిక విధాన సమస్యను చర్చించటం జరిగింది వ్యవసాయోత్పత్తికి సంబంధించిన వివిధ వ్యవసాయ ఆర్థిక సమస్యలన్నింటిలో డాక్టర్ అంబేడ్కర్ భూ కమతాల పరిమాణం విషయాన్ని - అది వ్యవసాయోత్పత్తికి సంబంధించి ఉంటుంది కాబట్టి - ఎంపిక చేసుకున్నారు

డాక్టర్ అంబేడ్కర్ ఈ వ్యాసంలో భారతదేశంలో భూ కమతాలు చిన్నవిగా ఉండటమే కాక చెల్లాచెదురుగా ఉన్నాయని చెప్పారు ఈ రకమైన స్వభావం ఉండటం వల్ల వ్యవసాయం విషయం ఎంతో ఆందోళన కలిగిస్తున్నదని ఆయన అన్నారు వ్యవసాయాన్ని ఆయన పరిశ్రమగా వర్గీకరించారు ఈ కమతాల సమస్య రెండు విధాలుగా ఉంటుంది (1) కమతాలను సమకూర్చుకోవటం ఎలా? (2) కూర్పు అయిన తర్వాత దానిని కొనసాగించటం ఎలా? భారతదేశంలో, మరణించిన వ్యక్తి వారసులు మొత్తం కమతాలను తమలో తాము పంచుకోకుండా ప్రతి సర్వే నెంబరులోనూ వాటా కావాలని కోరుకుంటారు దీనివలన కమతాలు ఎక్కువ పంటను ఇవ్వలేకపోవటంతో బాటు అనేక ఇతర సమస్యలు తలెత్తుతాయి కమతాలను ఏకీకృతంగా సమకూర్చు కొనటానికి కొన్ని మార్గాలను డాక్టర్ అంబేడ్కర్ చర్చించారు అవి ఏమిటంటే, ముక్కలను కలపటం, ముక్కలయిన భాగాన్ని పక్క రైతుకే అమ్మటం, అమ్మకాన్నే లేకుండా చేయటం ఈ సందర్భంలో డాక్టర్ అంబేడ్కర్ బరోడా కమిటీ నివేదికను ప్రొఫెసర్ జెవాన్స్, కేటింగ్‌లు చేసిన ప్రతిపాదనలను చర్చించారు సమకూర్పువల్ల చెల్లాచెదురుగా ఉన్న కమతాల సమస్యలు తీరవచ్చు కాని, ఏకీకృతమయిన కమతాలు వాటికవి సరిపోయే కమతాలుగా అయితే తప్ప, చిన్న కమతాల సమస్యను మాత్రం పరిష్కరించలేవని సూచించారు

వాటికవే సరిపోయే కమతాల గురించి మాట్లాడుతూ డాక్టర్ అంబేడ్కర్ ఇలా అన్నారు. "పరిమాణం ఒక్కటే కమతం తానంతట అది మనగలదా అనే విషయాన్ని చెప్పటానికి చాలదు. ఉత్పత్తికి సంబంధించిన ఇతర కారకాలు పరిమాణంతో ఏ నిష్పత్తిలో ఉన్నాయనే దాని మీద అవి వాటంతట అవి మనగలవా లేదా అన్నది తేలుతుంది" ఆ విధంగా చిన్న పొలం, పెద్దపొలంలాగానే తనంతట అది మనగలుగుతుంది గణాంక వివరాలను సమగ్రంగా పరిశీలించిన మీదట, ఆయన ఏమంటారంటే "ప్రస్తుతం ఉన్న కమతాలు తమంతట తాము మనగలిగేవి కావు అయితే దానికి కారణం ఇవి పరిమాణంలో చిన్నగా ఉండటమూ పెద్దగా ఉండటమూ కాదు ఉత్పత్తికి సంబంధించిన ఇతర కారణాలు తగినంతగా

లేనందువల్ల అందువల్ల ఆయన ఏమి సూచిస్తారంటే, దీనికి నివారణ, కమతాలను పెంచటంలో కాకుండా పెట్టుబడిని, పెట్టుబడి వస్తువులను పెంచటంలో మాత్రమే ఉందని

డాక్టర్ అంబేడ్కర్ అభిప్రాయంలో, చిన్న కమతాల వల్ల చేటులు, భారత సాంఘిక ఆర్థిక వ్యవస్థ సర్దుబాట్లు సరిగా లేకపోవటం వల్ల వచ్చినవని కార్మికులు ఎక్కువ సంఖ్యలో పనిలేకుండా ఉండటం వల్ల వ్యవసాయం మీద బాగా ఒత్తిడి ఎక్కువవుతున్నది వ్యవసాయానికి పట్టుకున్న చేటు తొలగించటానికి మార్గాలను ఆయన విశ్లేషణ చేస్తూ, భారతదేశంలో వ్యవసాయ సమస్యలకు మంచి నివారణోపాయం పరిశ్రమీకరణే అని అన్నారు

## రసెల్ సమాజ పునర్నిర్మాణం

గౌరవనీయులైన బెర్ట్రాండ్ రసెల్ రాసిన "సమాజ పునర్నిర్మాణ సూత్రాలు" ("Principles of Social Reconstruction") అనే పుస్తకాన్ని సమీక్షిస్తూ, డాక్టర్ అంబేడ్కర్ ఆస్తి వ్యవస్థ విశ్లేషణ, అది మానవ స్వభావంలో కలిగించే మార్పుల గురించి ప్రస్తావించారు యుద్ధతత్వంపై రసెల్ అభిప్రాయాలపై వ్యాఖ్యానిస్తూ, డాక్టర్ అంబేడ్కర్ ఏమంటారంటే, రసెల్ యుద్ధాన్ని వ్యతిరేకిస్తాడు, కాని శాంతిని మాత్రం కోరుకోడు మృత్యువుకు మరోపేరు శాంతి చలనం పెరుగుదలకు దారి తీస్తుంది దేనినైనా సాధించాలంటే బలాన్ని ఉపయోగించాలని ఆయన చెబుతాడు అయితే శక్తిలా నిర్మాణాత్మకంగా దానిని వాడాలిగాని హింసలా విధ్వంసకంగా వాడకూడదని ఆయన అంటాడు డాక్టర్ అంబేడ్కర్ అభిప్రాయంలో శాంతి కాముకుడైన రసెల్ యుద్ధం కూడా ఒక కదలికే అనీ అది వ్యక్తి పెరుగుదలకు దోహదకారి అవుతుందనీ అభిప్రాయపడతాడు అయితే ఆయన యుద్ధాన్ని ఎందుకు ఖండిస్తాడంటే, అది మరణానికీ వినాశనానికీ దారి తీస్తుంది కాబట్టే అందుకని తక్కువ మోతాదులో జరిగే యుద్ధాలను రసెల్ ఆహ్వానిస్తాడని అంబేడ్కర్ విశ్లేషించారు

రసెల్ వివరించినట్టుగా ఆస్తి కలిగించే పరిణామాలను డాక్టర్ అంబేడ్కర్ ఇంకా చర్చించారు ఆస్తి కలిగించే మానసిక పరిణామాల విషయంలో రసెల్ చేసిన చర్చ కొన్ని తప్పు అవగాహనల వలన జరిగిందని అంటారు "డబ్బు పై వ్యామోహం" అనే రసెల్ చేసిన వ్యాఖ్యానాన్ని విమర్శిస్తూ డాక్టర్ అంబేడ్కర్ ఏమంటారంటే, ఈ విషయమై "ఉన్నవారు", "లేనివారు" దృక్పథంలో నిజమైన తేడా ఉన్నదని అందువల్ల డబ్బుపట్ల వారి దృక్పథంలో తేడా ఉంటుంది డబ్బు పట్ల వ్యామోహం ఉండవలసిన అవసరం అనే విషయాన్ని పరిశోధించటంలో రసెల్ విఫలమయ్యారని అందువల్లనే ఆ విషయంలో తప్పు అవగాహనకు ఆయన వెళ్లవలసి వచ్చిందని డాక్టర్ అంబేడ్కర్ అన్నారు మన జీవితంలో ఉత్పత్తి వైపు నుంచి చూస్తే ఈ సిద్ధాంతం ఊగిసలాడుతుందని ఆయన చెప్పారు

మన జీవితంలో వినియోగం వైపు నుంచి చూసినా పై ప్రతిపాదనను అంగీకరించటానికి

వీలులేదని డాక్టర్ అంబేడ్కర్ చర్చించి నిరూపించారు ఇక్కడ మేధావి అయిన డాక్టర్ వాంఛలు, ఆనందాలకు సంబంధించిన మానసిక, తత్వ సంబంధమైన చర్చలోకి దిగుతారు పాఠకుల సమయం ఎక్కువ తీసుకోకుండా ఆసక్తికరమైన ఈ చర్చను మూలం నుంచే చదువుకోవలసిందిగా పాఠకుల్ని వదిలేస్తున్నాం

ప్రస్తుత సంపుటిలో డాక్టర్ అంబేడ్కర్ చేసిన హేతుబద్ధమైన వాదనలలోని ముఖ్యాంశాలన్నింటినీ అందించగలిగామని సంపాదకులు భావించటం లేదు

ఈ సంపుటిని వెలుగులోకి తీసుకురావటానికి అమూల్యమైన సహాయాన్ని, మార్గదర్శకత్వాన్ని, సహకారాన్ని అందించిన మహారాష్ట్ర ముఖ్యమంత్రి గౌరవనీయులు శ్రీ శరద్ పవార్‌కు, విద్యామంత్రి గౌరవనీయులు శ్రీ సదానంద్ వర్దెకు, సంపాదక మండలి సభ్యులు ఎంతో రుణపడి ఉన్నారు చాలా తక్కువ కాలంలో ఈ పుస్తకాన్ని ముద్రించి అందజేసిన ప్రభుత్వ ముద్రణ, స్టేషనరీ శాఖ డైరెక్టరు అయిన శ్రీ సప్రేకు, ఆయన సిబ్బందికి మేము కృతజ్ఞులమై ఉన్నాం

సంపాదక మండలి సభ్యులు

అనువాదం : బొజ్జా తారకం

# 1

# భారతదేశంలో కులాలు

## వాటి ఏర్పాటు, పుట్టుక, అభివృద్ధి

*1916* మే *9*న

డాక్టర్ ఏ ఏ గోల్డెన్‌వీజర్ వారి

నరవర్గశాస్త్ర సెమినార్ లో

చదివిన పత్రం

ఇండియన్ ఏంటిక్వేరీ, *1917* మే *XLI* సంపుటం నుంచి

# భారతదేశంలో కులాలు

మానవ నాగరికతకు సమగ్రాకృతిని సమకూర్చే భౌతిక వస్తువుల (అంశాల) ప్రాంతీయ జాతీయ అంతర్జాతీయ వివరణలను మనలో చాలామంది పరిశీలించి ఉంటారని నేను ధైర్యంగా చెప్పగలను అయితే అందులో మానవ వ్యవస్థల వివరణ అనేది కూడ ఒకటి ఉంటుందనే భావం చాలా కొద్దిమందికే కలుగుతుంది మానవ వ్యవస్థల ప్రదర్శన అనేది ఒక వింత ఆలోచన కొంతమంది అది వెర్రి ఆలోచన అని కూడా అనవచ్చు కాని నరవర్గశాస్త్ర విద్యార్థులుగా ఈ నూత్న భావం మీకు కఠోరంగా అనిపించదని విశ్వసిస్తున్నాను ఎందుకంటే ఇది నిజంగా అలాంటి ఆలోచన కాదుగనక కనీసం మీకైనా ఇది వింతగా ఉండకూడదు

పాంపే శిథిలాల వంటి చారిత్రక స్థలాన్ని, మీరు సందర్శించి ఉంటారనీ, అక్కడి అవశేషాల చరిత్రను గైడ్ అనర్గళంగా చెప్పుకుంటూ పోతుంటే కుతూహలంతో విని ఉంటారనీ అనుకుంటున్నాను నా దృష్టిలో నరవర్గశాస్త్ర విద్యార్థి కనీసం ఒక విధంగా ఆ గైడ్ లాంటివాడు మానవ సాధ్యమైన వస్తుపర దృష్టితో మానవ వ్యవస్థలను అతి గంభీరతతోను, ఆత్మబోధన వాంఛతోను తన నమూనాలాగ చూస్తూ, వాటి మూలాన్ని, కార్యశీలతను పరిశోధిస్తాడు

ఆదిమ – ఆధునిక సమాజాలను గురించి చర్చ జరుగుతున్న ఈ సదస్సులో, మన తోడి విద్యార్థులు చాలామంది తమ తమ అభిరుచులను బట్టి ఆధునిక ఆదిమ సమాజాలలోని వివిధ వ్యవస్థలకు సరళమైన వివరణలు చేసి సమర్థంగా తమ వంతు పని ముగించుకున్నారు ఇపుడు ఈ సాయంకాలం, నా శక్తి మేరకు మిమ్మల్ని వినోదపరచటంలో నా వంతు వచ్చింది భారతదేశంలో కులాలు, వాటి ఏర్పాటు, పుట్టుక, అభివృద్ధి అనే అంశాన్ని గురించిన పత్రం ఇది

నేను వివరించాలని తలపెట్టిన ఈ అంశం ఎంత క్లిష్టమైనదో మీకు చెప్పనవసరం లేదు కులం రహస్యాలను, బయటపెట్టటానికి నాకంటే కుశాగ్రబుద్ధులు, సమర్థవంతులైన రచయితలు

ఎంతో కృషి చేశారు కాని, దురదృష్టవశాత్తు అవి అర్థం కానివిగా, అవిశదంగా, అర్థరహితంగా, వివరణలేని పరిధిలోనే ఉండిపోయాయి కులం వంటి ప్రాచీన వ్యవస్థ విషయంలో ఉండే చిక్కుముడులు నాకు బాగా తెలుసు కాని అదేదో అభేద్యమైనది అని పక్కకు పెట్టేసే నిరాశావాదిని మాత్రం కాను నేను దానిని తెలుసుకొనగలమనే నమ్మకం నాకున్నది ఈ కులం సమస్య సిద్ధాంతపరంగాను, ఆచరణ రూపంలోనూ ఎంతో విస్తృతమైనట్టిది ఆచరణరీత్యా అతి భయంకరమైన పరిణామాలను సూచించే వ్యవస్థ ఇది ఇది ఒక స్థానిక సమస్యగానే కనిపించినా, పరిధికి మించి నష్టం చేయగల సత్తా ఉంది దీనికి ఎందుకంటే "భారతదేశంలో కులం ఉన్నంతకాలం హిందువులు కులాంతర వివాహాలు చేసుకోరు, బయటివారితో అలాంటి సామాజిక సంబంధాలు పెట్టుకోరు ప్రపంచంలో వేరే ప్రాంతాలలోకి హిందువులు వలసపోతే భారతీయ కులం ప్రపంచ సమస్య అవుతుంది" [1] విషయంపట్ల గల అభిలాష కొద్దీ సైద్ధాంతికంగా దీని మూలాన్ని వెదకి పట్టుకుందామని తమంతట తాము ప్రయత్నించిన ఎంతో మంది విద్వాంసులకు దీని అంతు చిక్కలేదు అంచేత ఈ సమస్యను నేను ఇప్పుడు సమూలంగా, సమగ్రంగా, చర్చించబోవటం లేదు ఈ వ్యవస్థకు సంబంధించిన ఒక పక్షాన్ని మాత్రం, అంటే కులవ్యవస్థ పుట్టుక, ఏర్పాటు, వ్యాప్తిని మాత్రమే ఇక్కడ చర్చిస్తాను అలాకాక మొత్తం చూడాలని ప్రయత్నం చేస్తే నేను సఫలీకృతుణ్ణి కాలేను కాలం, సమయం, ఆలోచనా తీవ్రత నన్ను విఫలుణ్ణి చేయవచ్చు అంచేత నా నియమాన్ని నేను కచ్చితంగా పాటించదలిచాను నా సిద్ధాంతంలో ఏదైనా అంశాన్ని వివరించటానికో, బలపరచుకోవటానికో అవసరమైనపుడు మాత్రమే ఈ పరిధి దాటి బాహ్య విషయాలు ప్రస్తావిస్తాను

ఇక విషయంలోకి వద్దాం సుప్రసిద్ధ నరవర్గ శాస్త్రవేత్తల ప్రకారం భారతదేశ జనాభా ఆర్యులు, ద్రావిడులు, మంగోలులు, స్కిథియన్ల సమ్మిశ్రం ఈ ప్రజల సముదాయాలన్నీ తెగల దశలో ఉన్నప్పుడు శతాబ్దాల క్రితం వివిధ దిశల నుండి వివిధ సంస్కృతులతో భారతదేశంలోకి అడుగు పెట్టాయి వారంతా ఈ దేశంలోకి తమకంటే ముందువచ్చిన వారితో పోరాటం చేస్తూ, తోవ చేసుకుంటూ వచ్చారు చెయ్యగలిగినన్ని పోరాటాలు చేసిన తర్వాత శాంతియుతంగా ఇరుగుపొరుగు వారితో స్థిరపడ్డారు నిత్య సంబంధాలు, పరస్పర వ్యవహారాల ద్వారా తమ భిన్న సంస్కృతులను అధిగమించి ఒక ఉమ్మడి సంస్కృతిని రూపొందించుకున్నారు భారతదేశాన్ని రూపొందించిన వివిధ తెగల ప్రజలు పూర్తిగా సమ్మిశ్రం కాలేదనే మాట ఒప్పుకోవలసినదే భారతదేశం సరిహద్దుల లోపల సంచరించే పర్యాటకునికి ఎవరికైనా తూర్పు ప్రాంతాల ప్రజలు, రూపురేఖల్లోను రంగులోను పడమటి ప్రాంతం వారికంటె స్పష్టమైన తేడాతో కనిపిస్తారు అలాగే దక్షిణాదివారు ఉత్తరాదివారి కన్న భిన్నంగా కనిపిస్తారు అలాగే దక్షిణాది వారు ఉత్తరాది కన్న భిన్నంగా కనిపిస్తారు ఏ ప్రజల విషయం లోనూ కూడా సమ్మిశ్రం అనేది ఏకజాతీయతకు ప్రమాణం కాబోదు మానవవర్గ విశ్లేషణ ప్రకారం ప్రజలంతా సంకరజాతివారే

1 కేట్కర్ – కేస్ట్ పుట 4

సాంస్కృతిక ఐక్యత సజాతీయతకు ప్రాతిపదిక అవుతుంది ఈ మాటను అంగీకరిస్తే సాంస్కృతిక ఐక్యత విషయంలో భారత ఉపఖండాన్ని మించిన దేశం మరొకటి లేదని చెప్పటానికి సాహసిస్తున్నాను భౌగోళిక ఐక్యత కలిగి ఉండటమే కాకుండా అన్నిటికి మించి ప్రగాఢమైన అత్యంత ప్రాథమికమైన ఐక్యత – ఈ చివర నుంచి ఆ చివర వరకు భూభాగాన్ని కలిపే ఒక నిస్సందేహమైన సాంస్కృతిక ఐక్యత – ఈ దేశం కలిగి ఉన్నది ఈ జాతీయత వల్లనే కుల సమస్య విశదీకరించటానికి చాల కష్టమవుతున్నది పరస్పరం ప్రత్యేకంగా ఉండే గుంపుల సమాఖ్యగా గనక హిందూ సమాజం ఉండి ఉంటే, సమస్య కాస్త తేలిక అయ్యేది కాని ఇది వరకే ఏక జాతిగా రూపొందిన గుంపుల బృందాన్ని కులం చీలుస్తున్నది కులవ్యవస్థ పుట్టుకను విశదీకరించటం అంటే ఈ చీలిక విధానాన్ని విశదీకరించటమే అవుతుంది

పరిశోదనా రంగంలోకి ప్రవేశించే ముందు మనం కులం స్వభావాన్ని తెలుసుకోవటం మంచిది అంచేత కులం విషయంలో బాగా పరిశోధన చేసినవారు కులం గురించి ఇచ్చిన నిర్వచనాలను కొన్నింటిని మననం చేసుకుందాం

(1) ఫ్రెంచి పండితుడు సెనార్ట్ కులాన్ని ఈ విధంగా నిర్వచించాడు "కులం అనేది తమకు తాము మూసుకొని ఉన్న ఒక వ్యవస్థ ఇది సైద్ధాంతికంగా, కచ్చితంగా వంశపారంపర్యమైనట్టిది దీనికి ఒక నిర్దిష్టమైన సాంప్రదాయిక స్వతంత్ర సంస్థ సాధనంగా ఉంటుంది దానిలో ఒక ముఖ్యుడు ఉంటాడు పరిషత్తు ఉంటుంది ఇంచుమించు సంపూర్ణాధికారాలు కలిగి ఉన్న సభలలోను, కొన్ని పండుగ సందర్భాలలోను వీరు కలుస్తూ ఉంటారు ఒకే వృత్తితో ముడిపడి ఉంటారు ముఖ్యంగా వివాహాలకు, ఆహారానికి సంబంధించిన విషయాలు, కర్మకాండలకు, మైలకు సంబంధించిన విషయాలు మొదలైన వాటిలో ఒకే విధంగా ఉంటారు ఈ పరిషత్తు అధికారాన్ని వినియోగించటం ద్వారా సభ్యులను నిబంధిస్తూ ఉంటుంది ప్రజలపై కొన్ని శిక్షలు విధించటం వంటి పనుల ద్వారా ఈ సంస్థ తన అధికారాన్ని విజయవంతంగా చెలాయించగలుగుతుంది ఈ శిక్షలలో అన్నిటికన్నా మించిన శిక్ష గుంపు నుంచి శాశ్వతంగా వెలివేయటం"

(2) "సమాజంలోని ఇతర వర్గాలలో దేనితోను ఏ రకమైన సంబంధమూ పెట్టుకోకుండా ముఖ్యంగా వివాహ, భోజన సంబంధాలు పెట్టుకోకుండా ఉండే ఒక వర్గమే కులం" అని నెస్‌ఫీల్డ్ నిర్వచించాడు

(3) సర్ హెచ్ రైస్లే ప్రకారం "ఒక నిర్దిష్టమైన వృత్తితో ముడిపడి ఉండి మానవ లేదా దైవ సంబంధమైన ఒక పురాణ పురుషుడికి వారసులమని చెప్పుకుంటూ ఒకే వృత్తిని అవలంబించే కుటుంబాల సముదాయాన్ని గాని, ఒకే ఇంటిపేరు కలిగి ఉండి ఒకే ఒక సంఘంగా ఏర్పడినారనే అభిప్రాయానికి అవకాశం ఇవ్వగలిగే కొన్ని కుటుంబాల లేదా కుటుంబాల బృందాల సముదాయాన్ని గాని కులంగా నిర్వచించవచ్చు

(4) డాక్టర్ కేట్కర్ కులాన్ని ఇలా నిర్వచించాడు ఇది రెండు లక్షణాలు కలిగి ఉన్న ఒక సామాజిక బృందం i) ఆ బృందంలోని సభ్యులకు పుట్టిన వారికి మాత్రమే అందులో సభ్యత్వం ఉంటుంది అలా పుట్టిన వారందరూ అందులో సభ్యులు ii) వెలుపలి వారిని పెళ్లి చేసుకోకుండా ఒక కఠోరమైన సామాజిక శాసనం ద్వారా సభ్యులను నిషేధిస్తారు

ఈ నిర్వచనాలను సమీక్షించుకోవటం మనకు చాలా అవసరం ఇందులో ముగ్గురు రచయితల నిర్వచనాలను విడివిడిగా తీసుకుంటే అవి మరీ ఎక్కువగానో లేక తక్కువగానో చెప్పినట్టు కనిపిస్తాయి వీటిలో దేనికది ఏదీ సంపూర్ణమూ కాదు, సరైనదీ కాదు కులవ్యవస్థ ఏర్పాటులోని కేంద్ర బిందువును వీరిలో ఎవ్వరూ పట్టుకోలేకపోయారు మొత్తం కులవ్యవస్థలో ఒక అంతర్భాగంగానూ దానితో నిర్దిష్టమైన సంబంధాలు పెట్టుకొని ఉన్నట్టిదిగానూ కాకుండా, దానికదే ఎడంగా నిలబడి విడిగా ఉన్న గుంపుగా కులాన్ని గుర్తించటంలోనే వారి పొరపాటు ఉన్నది అయినా గాని, వారందరు చెప్పినవీ కలిపి చూస్తే అది ఒకదానికొకటి పూరకంగా ఉంటాయి ఇతరులు మరచిపోయిన వాటిని మరొకరు నొక్కి చెబుతున్నట్టు ఉంటాయి అంచేత పైన చెప్పిన నిర్వచనాలలో కులానికి స్వకీయమైనవిగా భావిస్తున్న ఉమ్మడి అంశాలను మాత్రమే తీసుకుని విమర్శనాత్మకంగా వాటిని బేరీజు వేస్తాను

సెనార్ట్‌తో మొదలు పెడదాం "మైలభావం" కులం లక్షణంగా ఆయన పరికించాడు దీని విషయం వచ్చేసరికి ఇది కులానికి సంబంధించి ప్రత్యేకమైన లక్షణం కాదని నిశ్చయంగా చెప్పేయవచ్చు ఇది సాధారణంగా పురోహితుల కర్మకాండ నుంచి పుట్టింది ఇది పరిశుద్ధత పట్ల సాధారణ నమ్మకానికి సంబంధించిన ఒక ప్రత్యేకమైన అంశం దాని ఫలితంగా కులంతో దీనికి అవసరమైన సంబంధం ఏదీ లేదని చెప్పవచ్చు దీనివల్ల కుల ఏర్పాటుకు భంగం ఏమీ కలగదు "మైలభావం" కులవ్యవస్థకు ఎందుకు అంటగట్టారంటే, అత్యుత్తమమైన హోదాను అనుభవించే కులం పురోహిత కులం కాబట్టి పురోహితుడు పరిశుద్ధత కలిగి ఉంటాడని మనమూ అనుకుంటాం అందువల్ల కులానికి మత సంబంధం అంటగట్టినపుడు మాత్రమే "మైల భావం" కులానికి ఒక ప్రత్యేక లక్షణంగా వచ్చిందని మనం నిర్ణయించుకోవచ్చు

తన కులం కాని వాళ్లతో కలిసి భోజనం చెయ్యకపోవటం కులం లక్షణాలలో ఒకటని నెస్‌ఫీల్డ్ తన ధోరణిలో చెప్పాడు ఆయన చెప్పిన అంశంలో కొత్తదనం కన్పించినా కారణం చూసి ఫలితం అనుకొని ఆయన పొరపాటు పడ్డాడని చెప్పవలసి ఉంటుంది కులం అనేది తన చుట్టూ తాను దడి కట్టుకొని ఉన్న ఒక గుంపు కావటం వల్ల సహజంగానే అది తన సభ్యులకు సాంఘిక సంబంధాలు, పంక్తి భోజనాలు లాంటి విషయాలలో పరిమితులు పెడుతుంది బయటివారితో కలిసి భోజనం చెయ్యకపోవటం అనేది ఏదో కచ్చితమైన నిషేధం వల్ల వచ్చింది కాదు కులం ఫలితంగా – అంటే, ప్రత్యేకత మూలంగానే వచ్చింది కలిసి భోజనం చేయకపోవటం అనేది కులం ప్రత్యేకత వల్ల వచ్చిందే అయినప్పటికీ మతపరమైన ఆంక్ష

ద్వారా నిషేధ లక్షణాన్ని సంతరించుకున్నది అయినా కాని, ఇది అనంతర కాలంలో వచ్చినట్టిదే సర్ హెచ్ రైస్లే ప్రత్యేకంగా ప్రస్తావించదగిన కొత్త అంశం ఏదీ చెప్పలేదు

డాక్టర్ కేట్కర్ చేసిన నిర్వచనం గురించి ఇపుడు పరిశీలిద్దాం ఈయన భారత దేశస్థుడవటమే కాకుండా కులం పరిశోధనను విమర్శనాత్మకమైన బుద్ధి కుశలతతో పక్షపాతరహిత దృష్టితో కొనసాగించాడు కులాల వ్యవస్థతో సంబంధం పెట్టి కులాన్ని నిర్వచించాడు కాబట్టి ఆయన చేసిన నిర్వచనం పరిశీలించదగినది ఒక వ్యవస్థలో అంతర్భాగంగా కులం ఉనికికి, కచ్చితంగా అవసరమైన లక్షణాల వైపు మాత్రమే, ఈయన తన దృష్టిని కేంద్రీకరించాడు మిగిలిన వాటిని అప్రధానమైనవనో మొదటిదానిలోంచి వచ్చిన లక్షణాలనో ఆయన చాలా సరిగ్గానే మినహాయించాడు అయినప్పటికి నిర్వచనం గురించిన భావంలో మాత్రం కొంత గందరగోళం ఉన్నదని చెప్పక తప్పదు ఇది తప్పిస్తే మిగిలినదంతా చాలా స్పష్టంగా బోధపడేలా ఉంది కులాంతర వివాహాల నిషేధం, కులంలో పుట్టిన వానికే సభ్యత్వం, ఈ రెండూ కులం లక్షణాలని ఆయన చెప్పాడు కాని డాక్టర్ కేట్కర్ భావించినట్టుగా అవి రెండు వేర్వేరు అంశాలు కాదనీ, ఒకే విషయానికి సంబంధించిన రెండు అంశాలనీ నేను మనవి చేస్తున్నాను

కులాంతర వివాహాల నిషేధ ఫలితం కులంలో పుట్టినవానికే సభ్యత్వం పరిమితం చేయటమే అవుతుంది అందువల్ల ఈ రెండూ కూడా ఒకే నాణేనికి బొమ్మా బొరుసూను

కులానికి ఉన్న వివిధ లక్షణాలను సరిగా అర్థం చేసుకొని విమర్శనాత్మకంగా బేరీజు వేసిన మీదట, కులాంతర వివాహాల నిషేధం లేదా కులం బయట వివాహాలు జరగకపోవటం అనేది - ఇంకా సంక్షిప్తంగా చెప్పాలంటే అంతర్వివాహం (ఎండోగమీ)- ఒక్కటే కులం అసలైన లక్షణమని నిస్సందేహంగా చెప్పవచ్చు కాని మానవశాస్త్రానికి సంబంధించిన ప్రత్యేక ఆధారాలను బట్టి కొందరు దీనిని అంగీకరించరు ఎందుకంటే అంతర్వివాహం చేసుకొనే సమాజాలు సాంస్కృతికంగా భిన్నమై, ఒకదానికొకటి సంబంధం లేకుండా సుదూరంగా ఉన్న ప్రాంతాలలో నివసిస్తూ, ఒకరితో ఒకరు ఏ రకమైన సంబంధాలు లేకుండా ఉండటం మనకు తెలిసిన వాస్తవమే అమెరికా సంయుక్త రాష్ట్రాలలో నీగ్రోలు, తెల్లవారు, అమెరికన్ ఇండియన్లుగా చెలామణి అవుతున్న వివిధ తెగల ప్రజలు ఈ వాదాన్ని బలపరచటానికి తగిన ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు కాని మనం ఈ విషయాలను గందరగోళం చేసుకోనక్కర లేదు, ఎందుకంటే భారతదేశంలో పరిస్థితి వేరు ముందు ప్రస్తావించినట్టుగా భారతదేశంలోని ప్రజలు మొత్తం ఏకజాతిగా రూపొందారు నిర్దిష్టమైన ప్రాంతాలను ఆక్రమించుకొన్న భారతదేశాల భిన్నజాతులు ఇంచుమించు ఒకరితో ఒకరు సమ్మిశ్రం అయిపోయి సంస్కృతిలో ఏకత్వాన్ని కలిగి ఉన్నారు ఇదే ఏకజాతి ప్రజల లక్షణం అంతర్వివాహాలు ఉండే సమాజాలలోనూ తెగల సముదాయాలలోనూ రక్తసంబంధాలు పెంచుకున్న పరిస్థితులలో కులం లేకుండా, ఒక్క భారతదేశంలోనే

ఉండటం వల్ల ఈ ఏక జాతీయతను ప్రాతిపదికగా చేసుకుంటే కులం అనేది లాక్షణికంగా ఒక కొత్త సమస్యగానే తయారవుతుంది భారతదేశంలో కులం అంటే జనాభాను ఒక స్థిరమైన, నిర్దిష్టమైన విభాగాలుగా కృత్రిమంగా వేరుచేసి పెట్టి అవి మళ్లీ ఒకదానితో ఒకటి కలవకుండా అంతర్వివాహ ఆచారం ప్రకారం నిరోధించటమే ఈ విధంగా అంతర్వివాహం ఒక్కటే కులానికి ఉన్న ప్రత్యేక లక్షణం అనే ముగింపు అనివార్యమౌతుంది ఈ అంతర్వివాహ పద్ధతిని ఎలా కాపాడుకుంటూ వచ్చారో మనం విజయవంతంగా చెప్పగలిగితే కులం పుట్టుక గురించీ దాని యంత్రాంగం గురించీ కూడా మనం ప్రయోగ కుశలంగా రుజావు చేసినట్టే

కుల వ్యవస్థలోని రహస్యం తెలుసుకోవటానికి అంతర్వివాహాన్ని ఒక సాధనంగా నేను ఎందుకు తీసుకున్నానో ఊహించటం మీకు అంత తేలిక కాదు మిమ్మల్ని మరీ అంత కష్టపెట్టకుండా నా కారణాలు చెప్పటానికి ఉద్యుక్తుడ నవుతాను

ఈనాడు భారతీయ సమాజంలో కనిపించే ఆదిమకాలపు అవశేషాలు ఇప్పటి ఏ నాగరిక సమాజంలోనూ కూడా ఎక్కడా లేవని చెప్పటం ఇక్కడ అసందర్భం కాబోదు దీని మతం ప్రధానంగా ఆదిమమైనది కాలం గడిచి నాగరికత అభివృద్ధి చెందినప్పటికీ కూడా దాని తెగల కట్టుబాట్లు ఇప్పటికీ మౌలిక శక్తితో చెక్కు చెదరకుండా నిలిచి ఉన్నాయి ఈ వేళ మీ దృష్టికి తీసుకురావాలనుకున్న ఆదిమ అవశేషాలలో ఒకటి ఏమిటంటే బాహ్య వివాహాల ఆచారం ఆదిమ సమాజాలలో ఈ బాహ్య వివాహాల ఆచారం విస్తృతంగా ఉండేదనే విషయం అందరికీ తెలిసిందే దాని గురించి వివరించవలసిన పనిలేదు చరిత్ర పురోగమించే కొలదీ బాహ్య వివాహం తన పటుత్వం కోల్పోయింది చాలా దగ్గరి రక్తసంబంధీకులతో తప్ప వివాహాలు చేసుకోవటంలో సామాజిక అడ్డంకులు ఏమీ లేకుండా పోయాయి కాని భారతదేశ ప్రజలకు సంబంధించినంత వరకూ బాహ్య వివాహ నియమం ఈనాటికీ రూఢిగా ఉన్న నిషేధమే వంశాలు లేనప్పటికీ భారతీయ సమాజం ఇంకా వంశాల వ్యవస్థను రక్షిస్తూనే ఉన్నది బాహ్య వివాహ సూత్రం కేంద్రంగా గల వివాహ నియమాలలో ఇది చాలా స్పష్టంగా కనిపిస్తుంది ఎందుకంటే ఇక్కడ సపిండ (రక్త సంబంధీకులు) వివాహాలు మాత్రమే నిషేధం కాదు, సగోత్ర వివాహాలు కూడా ధర్మోల్లంఘనంగా పరిగణించారు

అంచేత భారతదేశ ప్రజలకు అంతర్వివాహం అనేది లేనేలేదనే వాస్తవాన్ని గుర్తుంచుకోవటం కంటే మీకు మరో ముఖ్యమైన విషయం ఉండదు భారతదేశంలోని వివిధ గోత్రాలు అన్నీ కూడా బాహ్యవివాహాలు చేసుకొన్నవీ, చేసుకుంటూ ఉన్నట్టివీ గణచిహ్నాలు పెట్టుకొనే ఇతర తెగలు కూడా ఇలాంటివే భారతదేశ ప్రజలకు బాహ్యవివాహం అనేది ఒక విశ్వాసం దానిని అతిక్రమించటానికి ఎవరూ సాహసించలేకపోయారనడం అతిశయోక్తి కాదు కులం లోపల అంతర్వివాహాల పద్ధతి ఉన్నప్పటికీ బాహ్యవివాహ నియమాన్ని చాలా కట్టుదిట్టంగా పాటించేవారు అంతర్వివాహాలను అతిక్రమించిన దానికంటే బాహ్యవివాహ నియమాన్ని అతిక్రమించినందుకు

చాలా కఠినమైన శిక్షలు ఉండేవి బాహ్య వివాహం అనేది ఒక నియమం అయితే కులం అనేది ఉండదు అనే విషయం దీని వల్ల స్పష్టమవుతుంది ఎందుకంటే బాహ్య వివాహం అంటే మిశ్రమం కాని మనలో కులాలు ఉన్నాయి దీని ఫలితంగా తుది విశ్లేషణలో మనకు తేలేదేమంటే, భారత దేశానికి సంబంధించినంతవరకూ కులాల పుట్టుక అంటే – బాహ్య వివాహ నియమం మీద అంతర్వివాహ నియమాన్ని రుద్దటం అని ఏది ఏమైనప్పటికీ మౌలికంగా బాహ్య వివాహ నియమాన్ని అనుసరించే ప్రజలపైన అంతర్వివాహ పద్ధతిని (అంటే కులం ఏర్పాటుకు సమానమైనట్టిది) చాలా సులువుగా ప్రవేశపెట్టటం అనేది తీవ్రమైన సమస్యే బాహ్య వివాహ పద్ధతిని తోసిపుచ్చి అంతర్వివాహ పద్ధతిని కాపాడటానికి ఉపయోగించిన పద్ధతులను పరిశీలిస్తే మన సమస్యకు పరిష్కారం దొరుకుతుందని ఆశించవచ్చు

అంచేత, బాహ్య వివాహ పద్ధతిపైన అంతర్వివాహ పద్ధతిని రుద్దటం అంటే కులాన్ని సృష్టించటం అన్నమాట అయితే ఇదేమంత సులువైన వ్యవహారం కాదు కులంగా తయారు కావాలని కోరుకునే ఒక బృందాన్ని మనం ఊహించుకుని అంతర్వివాహ పద్ధతిని అనుసరించటానికి అది ఏయే మార్గాలు అవలంబిస్తుందో విశ్లేషిద్దాం ఏదైనా ఒక బృందం అంతర్వివాహ పద్ధతిని అనుసరించాలని కోరుకుంటే అది బయటి బృందాలతో వివాహాలు చేసుకోకూడదనే సాధారణ నిషేధం ఒకటి జారీ చేసి ఊరుకుంటే చాలదు అంతర్వివాహ పద్ధతిని ప్రవేశ పెట్టాలనుకొనేదాని కన్న పూర్వం అన్ని వివాహ సంబంధాలలోను బాహ్య వివాహమే నియమంగా ఉంటూ వచ్చిన సందర్భాలలో ఇది మరీ ముఖ్యం ఒకరితో ఒకరు సంబంధాలు పెట్టుకుంటూ దగ్గర దగ్గరగా నివసిస్తున్న గుంపులు సాధారణంగా ఒకరితో ఒకరు కలిసిపోయి సమ్మిశ్రంగా ఉండాలనే అభిప్రాయంలో ఉంటారు కుల ఏర్పాటు ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ అభిప్రాయాన్ని గట్టిగా నివారించే ప్రయత్నం చేయాలంటే ఒక గుంపు తన చుట్టూ ఒక గిరి గీసి దాని వెలుపలి వారితో వివాహాలు చేసుకోకూడదనే నియమం కచ్చితంగా పెట్టాలి

ఇలా నియమం పెట్టి బయటివారిని వివాహం చేసుకోకుండా చుట్టూ దడికట్టి ఉంచటం వల్ల లోపలి నుంచి కొన్ని సమస్యలు ఉత్పన్నమవుతాయి వీటిని నివారించడమూ అంత తేలిక కాదు స్థూలంగా చెప్పాలంటే ఒక సాధారణ గుంపులో మగవారు, ఆడవారు ఇంచుమించుగా చెరిసగం సంఖ్యలో ఉంటారు అందులో ఒకే ఈడు వారు కూడా సమానంగా ఉంటారు వాస్తవ సమాజాలలో సమానత్వాన్ని సాధించటం చాలా కష్టమే కులంగా ఏర్పడా లని వాంఛించే గుంపు ధ్యేయం సాధారణంగా తమ గుంపులోని ఆడవారు మగవారు సమంగా ఉండేలా చూసుకోవటం అయి ఉంటుంది ఎందుకంటే అలా లేకపోతే అంతర్వివాహ నియమం సాధ్యం కాదు మరో మాటలో చెప్పాలంటే అంతర్వివాహ పద్ధతిని కొనసాగించాలంటే గుంపు లోపలి జనానికి వైవాహిక జీవితాన్ని ఏర్పరచవలసి ఉంటుంది లేకపోతే ఆ వృత్తం లోపల ఉన్న జనం బయటకు పోయి తమకు కావలసినది తెచ్చుకొనే ప్రమాదం ఉంటుంది

అంచేత లోపలి జనానికి వైవాహిక జీవితాన్ని ఏర్పరచాలంటే, కులంగా ఏర్పడాలని వాంఛించే గుంపు, తమలో పెళ్లీడు కొచ్చిన స్త్రీలు, పురుషులు ఎప్పుడూ సమంగా సమ నిష్పత్తిలో ఉండేలా చూసుకోవలసి వస్తుంది ఆ విధంగా సమంగా ఉండేలా చూసుకొనటం ద్వారా మాత్రమే ఆ బృందంలో అవసరమైన అంతర్వివాహ పద్ధతి చెక్కుచెదరకుండా ఉంటుంది ఈ తేడా గనుక ఎక్కువ ఉంటే అది తప్పనిసరిగా విచ్ఛిన్నం అవుతుంది

చివరకు కులాల సమస్య ఏమయిందంటే తన గుంపులో లేదా బృందంలో ఉన్న స్త్రీ పురుషులలో పెళ్లీడుకొచ్చిన వారి నిష్పత్తిలో తేడాను సరి చూసుకుంటూ పోవడమే అయింది ఈ సమస్యను ప్రకృతికి విడిచిపెడితే భార్యాభర్తలు ఇద్దరూ ఒకేసారి చనిపోయినపుడు మాత్రమే గుంపులో స్త్రీ పురుషులు సమసంఖ్యలో తేడా లేకుండా ఉండటం సాధ్యమవుతుంది అది ప్రకృతికి విడిచిపెట్టవలసిందే అయితే ఇది చాలా అరుదుగా జరుగుతుంది భార్యకంటే ముందు భర్త చనిపోతే భార్యను మిగులు స్త్రీగా (surplus woman) విడిచిపెడతాడు ఈమె విషయం తొందరగా పరిష్కరించాలి లేకపోతే మరొకరిని పెళ్లి చేసుకొనటం ద్వారా ఆమె బృందంలోని అంతర్వివాహ పద్ధతి అతిక్రమించవచ్చు అదే విధంగా భార్య చనిపోయి భర్త బతికి ఉంటే, అతడు మిగులు పురుషుడు (surplus man) అవుతాడు అతనికి వాటిల్లిన నష్టానికి మిగిలిన వారు సానుభూతి తెలిపినా అతని గురించి నిర్ణయం తీసుకోవాలి అలా జరగకపోతే కులం బయటివారితో సంబంధాలు పెట్టుకొని అంతర్వివాహ పద్ధతిని అతిక్రమిస్తాడు తగిన జాగ్రత్త తీసుకోకపోతే ఈ విధంగా మిగులుతున్న స్త్రీలు, పురుషులు కులానికి చాలా ప్రమాదకారులు అవుతారు, ఎందుకంటే నిర్ణీత పరిధిలో తమకు తగిన భాగస్వామి దొరకకపోయినట్లయితే (వారికి విడిచిపెడితే తగిన భాగస్వామి దొరకనే దొరకదు, దీనిని క్రమబద్ధం చెయ్యకపోతే జంటలు చాలా కొద్ది మాత్రమే మిగులుతారు) వారు సరిహద్దు దాటి బయటివారిని వివాహం చేసుకొని కులం కాని అన్య సంతానాన్ని దిగుమతి చేయవచ్చు

మన ఊహా బృందం ఈ మిగులు పురుషుడు, మిగులు స్త్రీలను ఏం చేయబోతున్నదో చూద్దాం మిగులు స్త్రీ విషయం ముందు తీసుకుందాం కులంలోని అంతర్వివాహ పద్ధతిని కాపాడాలంటే రెండు భిన్న పద్ధతులలో ఈ మిగులు లేకుండా చేయాలి మరణించిన భర్త చితి మీదనే భార్యను కూడా ఉంచి కాల్చివేసి ఆమెను లేకుండా చేసుకోవటం మొదటి పద్ధతి అయితే ఆడా మగ మధ్య ఉన్న నిష్పత్తి తేడాను పరిష్కరించటానికి ఇది ఆచరణ సాధ్యం కాని మార్గం కొన్ని సందర్భాలలో ఇది పనిచేయవచ్చు మరికొన్ని సందర్భాలలో పని చెయ్యకపోవచ్చు దీని ఫలితంగా ప్రతి మిగులు స్త్రీనీ లేకుండా చేయటం సాధ్యం కాదు ఎందుకంటే పరిష్కారం సులువుగానే కనిపిస్తుంది కాని ఆచరణలో ఇది చాలా కష్టం అవుతుంది మిగులు స్త్రీ (విధవ)ని లేకుండా చేసుకోకపోతే ఆమె బృందంలో మిగిలిపోతుంది ఆమె బ్రతికి ఉండటం వల్ల రెండు ప్రమాదాలున్నాయి కులం వెలుపలివానిని పెళ్లి చేసుకొని ఆమె అంతర్వివాహ పద్ధతిని అతిక్రమించవచ్చు లేదా కులం లోపలివానినే పెళ్లి చేసుకొని కులం

లోపల పెళ్ళి కావలసిన అమ్మాయిలతో పోటీ పడి వారి వివాహ అవకాశాలను దూరం చేయవచ్చు ఎలా చూసినా ఆమె కులానికి ప్రమాదకరమే ఆమెను భర్త చితిమీద కాల్చి చంపి వెయ్యకపోతే మరో విధంగానైనా లేకుండా చేసుకోవాలి

ఇక రెండో పద్ధతి ఏమంటే జీవితకాలమంతా వితంతువుగా బ్రతకాలని ఆమెకు చెప్పటం ఆశించిన ఫలితాన్ని సాధించాలనుకుంటే మాత్రం వితంతువుగా బ్రతకాలనటం కంటే కాల్చి చంపేయటమే మంచి పద్ధతి వితంతువును కాల్చి చంపటం ద్వారా మిగులు స్త్రీ వలన కలిగే మూడు దుష్ఫలితాలను తొలగించుకోవచ్చు చచ్చిపోయి, లేకుండా పోవటం ద్వారా ఆ తర్వాత కులం లోపలగాని బయటగాని రెండో పెళ్లి చేసుకొనే సమస్యనే ఆమె కలిగించదు కాని బలవంతపు వితంతు విధానం, కాల్చి చంపేయటం కంటే శ్రేష్ఠమైనది, ఎందుకంటే ఆచరణలో అది ఎక్కువ సాధ్యం గనుక పై రెండు మార్గాలనూ పోల్చి చూస్తే ఇది ఎక్కువ మానవత్వంతో కూడినదిగా కనిపించటమే కాకుండా, సతీ సహగమనం వలెనే రెండో పెళ్లి వల్ల కలిగే ప్రమాదాల నుంచి కూడా ఇది కాపాడుతుంది కాని, బృందంలోని నైతిక వర్తనలను మాత్రం కాపాడలేదు బలవంతపు వితంతు విధానం వల్ల స్త్రీ బతికే ఉంటుంది, సందేహం లేదు, కాని భవిష్యత్తులో చట్టసమ్మతంగా మరొకరికి భార్య అయ్యే సహజ హక్కును ఆమెకు లేకుండా చెయ్యటం మూలంగా చెడు ప్రవర్తనకు అలవాటయ్యే అవకాశాలు ఎక్కువవుతాయి ఇది అధిగమించటం కష్టమేమీ కాదు ఇతరులను ప్రలోభ పెట్టలేని స్థితికి ఆమెను తీసుకువస్తే సరిపోతుంది

కులంగా ఏర్పడాలని వాంఛించే బృందానికి మిగులు స్త్రీ సమస్య కంటె మిగులు పురుషుని సమస్యే చాలా ముఖ్యమైనదీ, కష్టమైనదీను అనాదికాలం నుండీ కూడా స్త్రీ కంటే పురుషునిదే పైచెయ్యిగా ఉంటున్నది ప్రతి గుంపులోను పురుషుడే ఆధిక్యతతో వ్యవహరిస్తాడు స్త్రీ పురుషులలో అతనికే ప్రతిష్ఠ సాంప్రదాయికంగా వస్తున్న ఈ పురుషాధిక్యత వల్ల అతని అభీష్టాలను మాత్రమే ఎప్పుడూ సంప్రదించటం జరుగుతుండేది స్త్రీల విషయానికి వస్తే మతపరమైన సామాజిక లేదా ఆర్థిక విషయాలన్నిటిలోను వారు చాలా దుర్మార్గమైన నిషేధాలకు అన్ని రకాలుగానూ గురి అవుతూ వచ్చారు నిషేధాజ్ఞలను జారీ చేసేది పురుషుడే కాబట్టి అతడు వాటికి అతీతుడుగా ఉండిపోయాడు పరిస్థితి ఈ విధంగా ఉండటం వల్ల, మీరు, కులంలో మిగులు పురుషుణ్ణి మిగులు స్త్రీని ఒకే గాటన కట్టి వేయటమూ, వారిపట్ల ఒకే రీతిగా వ్యవహరించటమూ సాధ్యం కాదు

చనిపోయిన భార్య చితిమీద భర్తను కూడా పెట్టి కాల్చి చంపివేయటం అనే పద్ధతిలో రెండు ప్రమాదాలున్నాయి అసలు మొదటగా ఇది జరగటానికే వీల్లేదు ఎందుకంటే అతను మగవాడు కనుక ఇక రెండోది అలా గనక జరిగితే కులం ఒక బలాఢ్యుని పోగొట్టుకున్నట్టు అవుతుంది అతనిని వదిలించుకోవటానికి సులువైన మార్గాలు ఇక రెండే రెండు ఉన్నాయి

అతను ఉండటం బృందానికి పెద్ద అండ కాబట్టి, 'సులువుగా' అని అంటున్నాను

బృందానికి అతను చాలా ముఖ్యుడవటం వల్లనూ అంతర్వివాహ పద్ధతి మరీ ముఖ్యం కావటం వల్లనూ పరిష్కారమార్గం ఈ రెంటి లక్ష్యాలనూ సాధించేదిగా ఉండాలి ఈ పరిస్థితులలో వితంతువును అడిగినట్టే మగవానిని కూడ జీవితకాలమంతా మరో పెళ్లి చేసుకోకుండా ఉండవలసిందిగా అడగాలి, లేదా 'ప్రలోభ పెట్టాలి' అంటాను నేను ఈ పరిష్కారం ఏమంత కష్టం కాకపోవచ్చు ఎందుకంటే, కొంతమంది ఏరకమైన బలవంతమూ లేకుండానే తమంతతాము బ్రహ్మచర్య జీవితాన్ని గడపటానికి ఇష్టపడతారు మరికొంతమంది ఇంకొక మెట్టు ముందుకు వెళ్లి ఈ ప్రాపంచిక సౌఖ్యాలను వదులుకొని సన్యసించటానికి ఇష్టపడతారు కాని మానవ నైజాన్ని గనుక దృష్టిలో పెట్టుకొని చూస్తే ఈ పరిష్కారం వాస్తవానికి ఆశించినంతగా ఉండదు అలా కాకుండా మిగులు పురుషుడు బృందంలోనే ఉంటూ బృంద కార్యకలాపాలలో చురుకుగా పాల్గొనటం గనుక జరిగితే (సాధారణంగా అలాగే జరుగుతుంది కాబట్టి) అతడు బృంద నైతికతకు ప్రమాదం మరో కోణం నుంచి గనుక చూస్తే బ్రహ్మచర్యం అనేది సాఫీగా సాగినచోట బాగానే ఉన్నప్పటికీ కులం భౌతికాభివృద్ధికి అది అంత ప్రయోజనకారి కాదు స్వచ్ఛమైన బ్రహ్మచర్యం పాటిస్తూ ఒక లౌకిక వ్యక్తిగా మిగిలిపోతే కులంలో ఉన్న అంతర్వివాహ పద్ధతికి గాని కులం నైతిక నడవడికి గాని అతడు ఏ మాత్రమూ ప్రమాదకారి కాడు అతడు బ్రహ్మచర్యం అవలంబిస్తూ సన్యాసిగా గనక ఉండిపోతే కులానికి సంబంధించిన భౌతిక శ్రేయస్సుకు సంబంధించినంతవరకు అతడు చితిలో కాలిపోయిన వ్యక్తి కిందే లెక్కకు వస్తాడు ఒక బలమైన సామాజిక జీవితాన్ని నెరపటానికి వీలయినంత విశాలంగా కులం ఉండాలని అనుకుంటే మాత్రం, అది తగినంత సంఖ్యా బలాన్ని ఎప్పుడూ కొనసాగించు కోవలసి వస్తుంది దీనిని ఆశిస్తూ బ్రహ్మచర్యాన్ని పాటించాలనటం అంటే క్షీణిస్తున్న రోగికి రక్తస్రావం ద్వారా నయం చేయవచ్చుననటమే అవుతుంది

అంచేత బృందంలో మిగులు పురుషునికి బ్రహ్మచర్యం విధించటం సిద్ధాంతపరంగానూ, ఆచరణాత్మకంగానూ కూడా సాధ్యం కాదు కులం ప్రయోజనాల కోసం అతణ్ణి గృహస్థుగానే ఉంచాలి అయితే కులంలో నుంచి అతనికి భార్యను సమకూర్చటమే సమస్య అసలు ఇది సాధ్యం కాని పని ఎందుకంటే ఒక పురుషునికి ఒక స్త్రీ అనేది కులం క్రమం ఎవరికీ కూడా పెళ్లి చేసుకొనే అవకాశాలు రెండుసార్లు ఉండవు తనకు తాను చుట్టూ దడి కట్టుకుని ఉన్న కులంలో పెళ్ళీడు కొచ్చిన మగవాళ్లకు సరిగ్గా చాలినంత సంఖ్యలోనే పెళ్లీడు కొచ్చిన ఆడవాళ్లూ ఉంటారు ఈ పరిస్థితుల్లో మిగులు పురుషుణ్ణి ఆ బృందంలోనే కట్టివేయాలనుకుంటే ఆ బృందంలో నుంచే ఇంకా పెళ్ళీడుకు రాని అమ్మాయిని అతనికి ఇచ్చి పెళ్లి చేయాలి మిగులు పురుషునికి సంబంధించినంతవరకు, ఉన్న వాటిలో ఉత్తమమైన మార్గం ఇదొక్కటే దీని ద్వారా అతణ్ణి కులంలోనే ఉంచి వేయవచ్చు మరణాల ద్వారా జనసంఖ్య తగ్గిపోవటాన్ని కూడా ఈ ఉపాయంతో తట్టుకోవచ్చు అంతర్వివాహ నీతి నియమాలను కాపాడుకోవచ్చు

స్త్రీ పురుషుల సంఖ్యా క్రమాన్ని సమంగా కొనసాగించటానికి వీలయిన మార్గాలు నాలుగున్నాయి (1) చనిపోయిన భర్తతో పాటు భార్యను చితిమీద కాల్చటం, (2) బలవంతపు వితంతు విధానం (కాల్చే పద్ధతి కంటే కొంచెం తక్కువ), (3) భార్యను కోల్పోయిన వానిపై (విధురుడు) బ్రహ్మచర్యం విధించటం, (4) పెళ్లీడుకు రాని అమ్మాయిని అతనికి ఇచ్చి పెళ్లి చేయటం నేను పైన చెప్పినట్టుగా అంతర్వివాహ పద్ధతిని కాపాడుకోవాలనే తాపత్రయంలో వితంతువును కాల్చివేయటం, విధురునికి బ్రహ్మచర్యం విధించటం అనేవి బృందానికి చేకూర్చే ప్రయోజనం సందేహాస్పదమే కాని ఈ రెండూ కూడా అందుకు సాధనాలుగా పని చేస్తాయి ఈ సాధనాలు శక్తిగా వదిలితే లేదా ఉపయోగంలో పెడితే ఫలితాలను సాధించి పెడతాయి అవి అంతర్వివాహ పద్ధతిని సృష్టించి స్థిరపడేట్టు చేస్తాయి ఎందుకంటే కులానికి ఇచ్చిన వివిధ నిర్వచనాలను మనం విశ్లేషించి చూసిన మీదట కులమూ అంతర్వివాహ పద్ధతీ ఒకటేనని అనిపిస్తుంది ఈ విధంగా ఈ సాధనాల ఉనికి కులంతో తుల్యంగా ఉంటుంది కులం ఈ సాధనాలను కలుపుకొంటుంది

నా ఉద్దేశంలో కులాల వ్యవస్థలో కులం నిర్మాణ విధానం సాధారణంగా ఇదే ఇప్పుడు మనం ఈ సాధారణ సూత్రీకరణల ద్వారా హిందూ సమాజంలోని కులాలనూ, వాటి నిర్మాణ విధానాన్నీ పరిశీలిద్దాం గతాన్ని బయటకు తీయాలని ప్రయత్నించే వారి దారిలో ఎన్నో గోతులు గొప్పులు ఉంటాయని నాకు తెలియకపోలేదు భారతదేశంలో కులం అనేది కచ్చితంగా అతి ప్రాచీనమైన వ్యవస్థ ప్రామాణికమైన, లిఖిత పూర్వకమైన సాక్ష్యాధారాలు లేనప్పుడు గాని, లేదా ప్రపంచమంతా భ్రాంతి కాబట్టి చరిత్ర రాయటం అనేది మూర్ఖత్వమని భావించే హిందువులలాంటి ప్రజలు ఉన్నప్పుడు గాని, ఇది మరీ వాస్తవమవుతుంది చాలాకాలంగా వాటి గురించి ఎవరూ రాసిపెట్టక పోయినా సంస్థలు, వ్యవస్థలు జీవిస్తూనే ఉన్నాయి మరికొన్ని సందర్భాలలో ఆచారాలు, నీతి నియమాలు తమ చరిత్రను తామే చెప్పుకునే శిలాజాల వలె ఉన్నాయి నిజమయితే, తమలోని మిగులు పురుషుల, మిగులు స్త్రీల సమస్యలను తీర్చుకోవటానికి హిందువులు ఎంచుకున్న పరిష్కార మార్గాన్ని గనుక మనం పరిశీలిస్తే మన కృషి ఫలిస్తుంది

హిందూ సమాజం సాధారణ వ్యవహారాలలో ఎంత సంక్లిష్టంగా ఉన్నప్పటికీ భార్యా సంబంధంగా మూడు ప్రధానమైన ఆచారాలు బయట నుంచి చూసేవారికి కూడా స్పష్టంగా కనబడతాయి అవి–

(i) మరణించిన భర్త చితి మీద అతని వితంతువును పెట్టి కాల్చటం

(ii) వితంతువు తిరిగి వివాహం చేసుకోకుండా బలవంతంగా వైధవ్యాన్ని అమలు చేయటం

(iii) బాలికా వివాహం

విధురులలో సన్యాసం స్వీకరించాలనే కోరిక కొందరిలో గమనించవచ్చు కాని, కొన్ని సందర్భాలలో అది కేవలం ఒక విధమైన మానసికావస్థ మూలంగానే కలుగుతుందని చెప్పవచ్చు

నాకు తెలిసినంతవరకు, ఈ ఆచారాల మూలానికి సంబంధించి శాస్త్రీయమైన వివరణ ఈరోజు వరకు ఎక్కడా రాలేదు ఈ ఆచారాలను ఎందుకు గౌరవిస్తూ వస్తున్నారో అనే దాని మీద ఎంతో తాత్విక చింతన వచ్చింది కాని, వాటి మూలానికీ, వాటి అస్తిత్వానికీ సంబంధించిన కారణాలను గురించి మనకు తెలియజెప్పేది మాత్రం ఏదీ లేదు సతిని గౌరవిస్తారు (చూ ఎ కె కుమారస్వామి: సతి: ఎ డిఫెన్స్ ఆఫ్ ది ఈస్టర్న్ ఉమన్ ఇన్ ది బ్రిటిష్ సోషియొలాజికల్ రివ్యూ, సంపుటం 6, 1913) ఎందుకంటే, అది భార్యాభర్తల "ఆత్మ శరీరాల ఉత్తమ కలయిక"కు నిదర్శనంగా ఉండటం వల్ల, శ్మశానానంతర ప్రేమ కూడా ఉండటం వల్ల; ఇందులో ఆదర్శ సతీత్వం ఉన్నందువల్ల ఇది "ఉమ" మాటలలో సువిదితమవుతున్నది "ఓ మహేశ్వరా! తన ప్రభువును (భర్తను) పూజించటమే స్త్రీకి గౌరవం అదే ఆమెకు నిత్యస్వర్గం" అని ఆమె అన్నది మనసును కలచివేసే విధంగా, ఆమె ఇంకా ఇలా అంటున్నది "ఓ మహేశ్వరా! నీవు నాతో సంతృప్తి పడనప్పుడు, నేను స్వర్గలోకం కూడా కోరను"

బలవంతపు వితంతు విధానాన్ని ఎందుకు గౌరవిస్తారో నాకయితే తెలియదు దానిని అనుసరించేవారు చాలామంది ఉన్నా శ్లాఘించే వారిని మాత్రం నేనెవర్నీ కలవలేదు బాలికా వివాహాల ఆదరణ గురించిన శ్లాఘనను డాక్టర్ కేట్కర్ ఇలా చెబుతున్నారు, "నిజంగా విశ్వసనీయులైన పురుషుడు గాని స్త్రీగాని తాము కలిసి ఉండిన వ్యక్తిని తప్ప వేరెవరినీ ఇష్టపడకూడదు అటువంటి పవిత్రత, వివాహం అయిన తరువాత మాత్రమే కాదు, వివాహానికి ముందు కూడా తప్పనిసరిగా అవసరం, ఎందుకంటే అదొక్కటే సచ్ఛీలతకు సరియైన ఆదర్శం తనను వివాహం చేసుకోబోయే వ్యక్తిపైన కాకుండా మరెవరిపైన అయినా ప్రేమ పెంచుకున్న ఏ యువతీ కూడా స్వచ్ఛమైనది అని చెప్పటానికి వీల్లేదు తనకు ఎవరితో వివాహం అవుతుందో తెలీదు కాబట్టి వివాహానికి ముందు ఏ మగవానిపైన కూడా ఆమె అభిలాష ఉంచుకోకూడదు అలా అభిలాష ఉంచుకున్నట్లయితే పాపం చేసినట్టే లెక్క అందుకనే అమ్మాయిలో లైంగిక సచేతనత ఏర్పడే లోపునే తాను ఎవరిని ప్రేమించాలో ఆమె తెలుసుకుంటే మంచిది"[2] అందుకే బాలికా వివాహం

గంభీరమైన చమత్కారపూరితమైన ఈ కుతర్కం ఈ వ్యవస్థలను ఎందుకు గౌరవిస్తున్నారో తెలుపుతున్నది కాని, వాటిని ఎందుకు ఆచరిస్తున్నారో తెలపటం లేదు వాటిని ఆచరిస్తున్నారు కాబట్టి గౌరవిస్తున్నారన్నది నా సొంత వ్యాఖ్యానం 18వ శతాబ్దంలో

2 : హిస్టరీ ఆఫ్ కేస్ట్ ఇన్ ఇండియా, 1909, 2-33 పేజీలు

పెరిగిన వ్యక్తివాదం గురించి ఏ మాత్రమైనా తెలిసి ఉన్నవారు నా వ్యాఖ్యానాన్ని అంగీకరిస్తారు సర్వకాలాలలోను ఉద్యమం అనేది చాలా ముఖ్యమైనది ఆ తర్వాత చాలా కాలానికి దానిని సమర్థించి ఒక నైతిక బలాన్ని కలుగజేయటానికి దాని చుట్టూ తత్వశాస్త్రం పెరుగుతుంది అదే విధంగా ఈ ఆచారాలను అంత పెద్ద ఎత్తున ఎందుకు శ్లాఘిస్తున్నారంటే వాటి వ్యాప్తికి స్తోత్రం అవసరం గనుక అనే పరమ వాస్తవాన్ని నేను వక్కాణిస్తున్నాను అసలు ఈ ఆచారాలు ఎందుకు ఏర్పడ్డాయనే ప్రశ్నకు నేను చెప్పే సమాధానమేమంటే, కులవ్యవస్థను ఏర్పరచటానికి అవి అవసరమయ్యాయి, అని వాటిని పొగుడుకుంటూ వచ్చిన తత్వజ్ఞానమంతా వాటిని ప్రచారం చెయ్యటానికే ఉద్దేశింపబడింది చేదు మాత్రకు తేనె పూసినట్టు ఈ ఆచారాల చుట్టూ తత్వం అల్లారు ఎందుకంటే, అమాయక ప్రజల నైతిక దృష్టికి ఈ ఆచారాలు అత్యంత హేయంగా భయానకంగా కనిపిస్తాయి, కనుక, వాటిని బాగా తీపి చేయవలసిన అవసరం ఏర్పడింది ఈ ఆచారాలను ఆదర్శాలుగా అభివర్ణించినప్పటికీ అవి ప్రధానంగా మార్గాల రూపంలో ఉంటాయి అయితే వాటి నుంచి వచ్చిన ఫలితాలను అర్థం చేసుకోవటంలో ఇది మనకు అంతరాయం కానక్కరలేదు మార్గాలను ఆదర్శీకరించటం అవసరమని ఎవరైనా అనవచ్చు ఈ ప్రత్యేక సందర్భంలో వాటిని మరింత ఎక్కువ సమర్థవంతంగా చెయ్యాలనే ఉద్దేశం ఉండి ఉంటుంది మార్గాలను ఫలితాలుగా చెప్పటంలో ప్రమాదం ఏదీ లేదు - వాటి నిజ స్వరూపాన్ని మరుగుపరచి ఉంచినంతవరకూ - కాని, అంతమాత్రాన ఆ మార్గాలు తమ నిజస్వభావాన్ని దాచి పెట్టుకోలేవు మార్గాన్ని ఫలితం అని చెబుతున్నట్టుగానే "అన్ని పిల్లులూ కుక్కలే" అని ఒక చట్టాన్ని మీరు జారీ చేయవచ్చు కాని పిల్లుల స్వభావాన్ని కుక్కల స్వభావంగా మార్చలేనట్టుగానే మార్గాల స్వభావాన్ని ఫలితాలుగా మార్చలేరు దీని ఫలితంగా సతి, బలవంతపు విధవత్వ విధానం, బాలికా వివాహం అనేవాటిని 'మార్గాలు' అని అన్నాగాని 'ఫలితాలు' అని అన్నాగాని అవి కులంలో ఉన్న మిగులు పురుషుడు, మిగులు స్త్రీల సమస్యను పరిష్కరించటానికీ దాని అంతర్వివాహ పద్ధతిని కాపాడటానికీ ప్రధానంగా ఉద్దేశించిన ఆచారాలే అని అనటంలో నా వాదం సముచితమైనదే ఆ ఆచారాలు లేకుండా సిసలైన అంతర్వివాహ పద్ధతిని కాపాడలేరు అదేవిధంగా, అంతర్వివాహ పద్ధతి లేకుండా కులమూ లేదు (అంతర్వివాహ పద్ధతి లేని కులం అసత్యమే)

భారతదేశంలో కులం సృష్టి, దానిని కాపాడటం గురించిన విశదీకరణ అయిన తర్వాత సహజంగానే దాని పుట్టుకను గురించిన ప్రశ్న ఉత్పన్నమవుతుంది దీని మూలాన్ని గురించిన ప్రశ్న ఎప్పుడూ చికాకు కలిగించే ప్రశ్నగానే ఉన్నది విచారించదగిన విషయమేమిటంటే కులాన్ని గురించిన అధ్యయనంలో దీనిని చాలామంది ఉపేక్షించారు కొంతమంది దీనిని చూసీచూడనట్టు ఊరుకున్నారు మరికొందరు దీనిని దాటవేశారు అసలు కులానికి మూలం అంటూ ఒకటి ఉంటుందా అని కొందరు కలవరపడ్డారు "మూలం' అనే పదం మీద వ్యామోహాన్ని (ఆసక్తిని) మనం అదుపులో పెట్టుకోలేకపోతే దాని బహువచన రూపం అంటే

'కులం మూలాలు' అని వ్యవహరించటం మంచిది, అని కూడా సలహా చెప్పారు నా విషయానికి వస్తే భారతదేశంలో కులం అనే దానిని చూసి నేనేమీ కలవరపడటం లేదు ఎందుకంటే, అంతర్వివాహ పద్ధతి ఒక్కటే కులానికి మూలం అని ఇంతకు ముందే నేను నిర్ధారించి ఉన్నాను గనుక 'కులం మూలం' అని నేను అన్నప్పుడు 'అంతర్వివాహ పద్ధతి ఏర్పాటు మూలం' అనే నా ఉద్దేశం

సమాజంలో వ్యక్తులు అణువుల లాంటివారనే భావనను రాజకీయ ఉపన్యాసాలలో చాలా గొప్పగా ప్రచారం చేశారు ప్రచారం కాదు చాల దిగజార్చారని నేనంటాను ఇది పెద్ద మోసం వ్యక్తులు సమాజాన్ని రూపొందించారు అని చెప్పటం చాలా సాధారణమైనట్టిది సమాజం ఎప్పుడు కూడా వర్గాలతో కూడినట్టిది వర్గపోరాట సిద్ధాంతాన్ని గట్టిగా సమర్థించటం అతిశయోక్తి కావచ్చు కాని సమాజంలో కొన్ని నిర్దిష్టమైన వర్గాలు ఉన్నాయనేది మాత్రం వాస్తవం వాటి ప్రాతిపదిక భిన్నం కావచ్చు అది ఆర్థికపరమైనది కాని భౌతికమైనది కాని, సామాజికమైనది కాని కావచ్చు కాని, సమాజంలోని వ్యక్తి ఎల్లప్పుడూ ఒక వర్గంలోని సభ్యుడే ఇది సార్వజనిక వాస్తవం ఈ సూత్రానికి ప్రాచీన హిందూ సమాజం మినహాయింపు ఏమీ కాదు నిజానికి ఇది మినహాయింపు కాదని మనకు తెలుసు ఈ సాధారణీకరణను మనం దృష్టిలో పెట్టుకుంటే కులం పుట్టుకను గురించిన పరిశోధన మనకు చాలా సులువు అవుతుంది ఎందుకంటే వర్గమూ, కులమూ ఇరుగూ పొరుగుల్లాంటివి వాటి మధ్య దూరం ఒక జాన మాత్రమే దడికట్టుకున్న ఒక వర్గమే కులం

తన చుట్టూ ఈ విధంగా దడి కట్టుకున్న వర్గం ఏది? అనే ప్రశ్నకు కులం మూలం కోసం మనం చేస్తున్న అధ్యయనం సమాధానం అందించవలసి ఉంది ఈ ప్రశ్న మరీ ఆసక్తికరంగా కనిపించవచ్చు కాని చాలా అవసరమైనది మొత్తం భారతదేశం అంతటా కులాల పెరుగుదలకు, అభివృద్ధికి సంబంధించిన రహస్యాలను ఛేదించటానికి ఈ సమాధానం మనకు ఉపయోగపడుతుంది దురదృష్టవశాత్తు ఈ ప్రశ్నకు సూటి సమాధానం ఇవ్వటానికి నా శక్తి చాలదు పరోక్షంగా మాత్రమే నేను దానికి సమాధానం ఇవ్వగలను ఈ విషయానికి సంబంధించిన ఆచారాలు హిందూ సమాజంలో వ్యవహారంలో ఉన్నాయని ఇంతకు ముందే వివరించాను ఈ ఆచారాలు సర్వత్రా వ్యాప్తిలో ఉన్నాయి కాబట్టి, కొంత విపులీకరణ అవసరం హిందూ సమాజంలోని సామాజిక అధికార నిశ్శ్రేణి క్రమానుగతిలో అత్యున్నతమైన స్థానం ఆక్రమించుకొని ఉన్న ఒక్క బ్రాహ్మణకులంలోనే ఈ ఆచారాలను అంత కఠోరంగానూ పాటిస్తారు బ్రాహ్మణేతర కులాలలో ఇవి బ్రాహ్మణుల ఆచరణల నుంచి వ్యాపించాయి అయితే ఈ కులాలు వీటిని అంత కఠోరంగాను, పూర్తిగాను పాటించటం లేదు అతి ముఖ్యమైన ఈ వాస్తవం ఒక ముఖ్యమైన పరిశోధనకు ప్రాతిపదిక అవుతుంది బ్రాహ్మణేతర కులాలలో ఈ ఆచారాలు బ్రాహ్మణుల నుంచి వచ్చినప్పుడు (దీనిని చాల సులువుగా రుజావు చేయవచ్చు) కుల వ్యవస్థను ఏ వర్గం పుట్టించిందో నిరూపించటానికి పెద్దవాదమేమీ

అక్కరలేదు బ్రాహ్మణ వర్గం తన చుట్టూ తాను దడి ఎందుకు కట్టుకున్నదో అది వేరే ప్రశ్న దానికి మరో సందర్భంలో పని కల్పిద్దాం అన్ని ప్రాచీన నాగరికతలలోనూ ఈ ఆచారాలను కఠోరంగా పాటించటమూ, పురోహిత వర్గం తనకు తాను సామాజిక ఆధిక్యతను ఆపాదించుకోవటమూ అనే అంశాలు ఈ "అసహజమైన వ్యవస్థ"కు వారే మూలకారకులనీ, అసహజమైన ఆచారాల ద్వారానే వారు దానిని స్థాపించి కాపాడుతూ వచ్చారనీ నిరూపించటానికి సరిపోతాయి

ఇక ఇప్పుడు నేను, యావద్భారత దేశంలోనూ ఈ కులవ్యవస్థ పెరుగుదలకూ, వ్యాప్తికీ సంబంధించిన, పత్రంలోని మూడో అంశంలోకి వస్తాను నేను సమాధానం చెప్పవలసిన ప్రశ్న ఏమిటంటే దేశంలోని బ్రాహ్మణేతర కులాలలో ఈ కులవ్యవస్థ ఎలా వ్యాపించింది? కులాల పుట్టుక సమస్య కంటే ఇవి భారతదేశం యావత్తూ ఎలా వ్యాపించాయనే సమస్య చాలా అగమ్యగోచరంగా ఉంటుంది వ్యాప్తి, మూలం అనే రెండు ప్రశ్నల్ని వేరు చేయకపోవడమే ఇందుకు ముఖ్య కారణం అని నాకు అనిపిస్తున్నది ఇది ఎందువల్ల జరిగిందంటే భారతదేశంలోని విధేయులైన ప్రజలపైన ఎవరో ఒక స్మృతికారుడు దైవాజ్ఞగా ఈ కులవ్యవస్థను రుద్ది ఉంటాడనో, లేక భారతదేశ ప్రజలకు మాత్రమే ప్రత్యేకమైన సామాజిక వికాసానికి సంబంధించిన ఏదో ఒక శాసనం ప్రకారం ఈ వ్యవస్థ పెరిగి ఉంటుందనో భారతదేశంలోని పండితులలో ఉన్న సాధారణ నమ్మకం మూలంగానే

భారతదేశ శాసనకారుల సంగతి మొదట ప్రస్తావిస్తాను ప్రతి దేశానికి ఒక శాసనకారుడు ఉంటాడు పాపం చేస్తున్న ప్రజలను శిక్షించటానికీ, ధర్మన్యాయ సూత్రాలను ఉపదేశించటానికీ అత్యవసర పరిస్థితుల్లో ఒక అవతార పురుషుడిగా అతడు ఉద్భవిస్తాడు భారతదేశ శాసనకర్త అయిన మనువు ఒకవేళ నిజంగా ఉంటే, నిజంగానే అతడు నిర్భయుడు కుల శాసనాన్ని మనువు ఇచ్చాడనే కథను గనక మనం నమ్మినట్లయితే, అతడు నిజంగానే దుస్సాహసి అతని బోధనలను అనుసరించిన ప్రజలు ఇప్పుడు మనకు తెలిసిన ప్రజలకంటే నిజంగానే భిన్నమైన వ్యక్తులై ఉండాలి కుల శాసనాన్ని ఎవరో ఇచ్చారు అనేది ఊహకు అందనిది అది నమ్మదగినది కాదు అటువంటి శాసనం చేసి మనువు బ్రతికి బట్టకట్టాడంటే అది పెద్ద అతిశయోక్తే ఒక వ్యక్తి కలం పోటు ద్వారా ఏ వర్గం ప్రజలైనా మూర్ఖంగా తాము హీనస్థాయిలోకి పోవటానికి సిద్ధపడుతూ మరొక వర్గాన్ని అత్యున్నతమైన స్థానంలో నిలబెట్టటానికి అంగీకరిస్తారా? అతడు ఒక నియంత అయి ఉండి, మొత్తం ప్రజలనందరినీ తన చెప్పుచేతలలో ఉంచుకోగలిగితే తప్ప, ఈ విధంగా తన ధర్మాన్ని అంత అన్యాయమైన పద్ధతిలో నిర్వహించటానికి అతనికి వీలయ్యేది కాదని ఊహించవచ్చు అతని పంపకాలు ఎంత అధర్మంగా ఉంటాయో అతని "సంస్థలను' ఒకసారి పరికిస్తే సులువుగా తెలిసిపోతుంది మనువు పట్ల తీవ్ర వ్యతిరేకత ఉన్నవానిగా నేను కనిపించవచ్చు నా శక్తి అతని భూతాన్ని హతమార్చటానికి తగినంత బలంగా లేదని నాకు తెలుసు అశరీరమైన ఆత్మలాగా అతడు జీవిస్తున్నాడు విజ్ఞప్తులు వింటున్నాడు అతడు ఇంకా

చాలాకాలం జీవిస్తాడని నాకు భయంగా ఉంది మీకందరికీ ఒక విషయం స్పష్టం చేయదలచుకున్నాను అదేమంటే మనువు కుల శాసనాన్ని ఇవ్వలేదు అతనలా ఇవ్వలేదు కూడా మనువు కంటె చాలా ముందు నుంచే కులం ఉన్నది దానిని అతడు కాపాడాడు తద్వారా దానికి తాత్విక చింతన కలుగజేశాడు కాని, ఇప్పటి హిందూ సమాజ స్థితిని మాత్రం అతను విధించలేదు, విధించలేదు కూడా అప్పటికి అమలులో ఉన్న కుల నియమాలను క్రోడీకరించి కుల ధర్మాన్ని ప్రవచించటంతోనే అతని పని పూర్తి అయింది కుల వ్యవస్థను వ్యాప్తి చేయటం, పెంపు చేయటం అనేది ఒక బృహత్తర కార్యం ఎవరో ఒక వ్యక్తి లేదా ఒక వర్గపు, శక్తి వల్లనో కౌటిల్యం వల్లనో అది సాధ్యపడదు బ్రాహ్మణులు కులాన్ని సృష్టించారనే సిద్ధాంతంలో కూడా నాది ఇదే వాదన మనువు గురించి ఇంత చెప్పిన తర్వాత, ఇంక నేను ఏమీ చెప్పనవసరం లేదు బ్రాహ్మణులు అనేక విషయాలలో దోషాలు చేసి ఉండవచ్చు చేశారనే నేను ధైర్యంగా చెప్పగలను కాని, బ్రాహ్మణేతర ప్రజలపైన కులవ్యవస్థను రుద్దడం మాత్రం వారికి అతీతమైన పని తమ జారుడుతత్వం ద్వారా ఆ విధానానికి వారు సహాయపడి ఉండవచ్చు, అంతేగాని తమ పధకాన్ని తమ హద్దులు దాటి బయటకు తీసుకు వెళ్లగలిగే వారు మాత్రం కాదు సమాజాన్ని తమ మాదిరిగా రూపుదిద్దటంలో ఎంత ఘనమైనది! ఎంత దుస్తరమైనది! దానిని చూసి ఆనందించవచ్చు దాని వ్యాప్తిని శ్లాఘించవచ్చు అంతే అంతకంటే మించి ఎక్కువగా ఏమీ చెయ్యలేరు ఇంత తీవ్రంగా నేను దాడి చెయ్యటం అనవసరం అనిపించవచ్చు కాని అప్రస్తుతం మాత్రం కాదని నేను కచ్చితంగా చెప్పగలను హిందూ సమాజం కులవ్యవస్థ చట్రంలో ఏదో విధంగా అమరిపోయిందనీ శాస్త్రాలు ఉద్దేశపూర్వకంగా ఈ వ్యవస్థను నిర్మించాయనీ ఛాందస హిందువులలో చాల గట్టి నమ్మకం ఉన్నది ఈ నమ్మకం ఉండటమే కాదు, దీనిని శాస్త్రాలు విధించాయి కాబట్టీ శాస్త్రాలు తప్పుకావు కాబట్టీ ఇది మంచిది కాక తప్పదనే ప్రాతిపదికపై దీనిని సమర్థిస్తున్నారు ఈ వైఖరికి విరుద్ధ పక్షం గురించి నేనింతగా ఎందుకు నొక్కి చెప్పానంటే శాస్త్రీయ ప్రాతిపదికపై మతపరమైన పవిత్రతను మోపారని కాదు, దీనికి వ్యతిరేకంగా బోధిస్తున్న సంస్కర్తలకు సహాయం చేద్దామనీ కాదు, బోధనలు కులవ్యవస్థను రూపొందించనూ లేవు, నిర్మూలించనూ లేవు మతపరమైన విధింపులను ఒక శాస్త్ర వివరణ స్థాయికి పెంచి చెప్పున్న ధోరణిలోని అసత్యాన్ని చూపటమే నా ఉద్దేశం

ఈ విధంగా మహాపురుషుని ఆవిర్భావ సిద్ధాంతం, భారతదేశంలో కులాల వ్యాప్తి సమస్యను పరిష్కరించటానికి ఏమంత సహాయకారి కాదని తేలింది వ్యక్తి పూజను బహుశా అంగీకరించని పాశ్చాత్య విద్వాంసులు దీనికి ఇతర వివరణలు ఇవ్వటానికి ప్రయత్నాలు చేశారు వారి ప్రకారం భారతదేశంలో వివిధ కులాలు ఈ దిగువ ఇచ్చిన కేంద్రకాల చుట్టూ ఏర్పడ్డాయి

(1) వృత్తి (2) తెగల నిర్మాణాల అవశేషాలు (3) కొత్త విశ్వాస ఆవిర్భావం (4) సంకరం చేయటం (5) వలసపోవటం

ఈ కేంద్రకాలు ఇతర సమాజాలలో ఉండవా? ఒక్క భారతదేశానికే ప్రత్యేకమా? అనే ప్రశ్న రావచ్చు. అవి భారతదేశానికి మాత్రమే ప్రత్యేకం కాకుండా ప్రపంచంలోనే సామాన్యమై ఉంటే ఈ భూగోళంపై గల ఇతర ప్రాంతాలలో కులాన్ని ఎందుకు ఏర్పరచలేదు? ఈ వేదభూమి కన్నా ఆ భూభాగాలు పవిత్రమైనవా? లేక పండితులు పొరపాటు పడ్డారా? నా అనుమానం రెండోదే నిజమని.

పైన చెప్పిన కేంద్రాలలో ఏదో ఒకదానిని ప్రాతిపదికగా చేసుకొని వివిధ రచయితలు ఉన్నతమైన సైద్ధాంతిక విలువలను ప్రకటించుకున్నప్పటికీ వాటిని సూక్ష్మంగా పరిశీలించినపడు అవన్నీ ఉదాహరణల పుట్టలే తప్ప వేరేమీ కాదని చెప్పటానికి బాధగా ఉంది. మాథ్యూ ఆర్నాల్డ్ చెప్పినట్టు ఇది పేరు గొప్ప, ఊరు దిబ్బలాగ ఉన్నది. సర్ డెంజిల్ ఇబ్బెట్‌సన్, నెస్‌ఫీల్డ్, సెనార్ట్, సర్ హెచ్. రెస్లేలు ప్రతిపాదించిన వివిధ సిద్ధాంతాలు ఇలాగే ఉన్నాయి. వాటిలో పైపై పొంగులే తప్ప అసలు పస లేదు. వారినందరినీ ఉమ్మడిగా విమర్శించడం అంటే వారంతా సాధారణ తర్కశాస్త్రానికి చెందిన పెటీషియో ప్రిన్సిపే మారు రూపం అనటంలా ఉంటుంది. ఉదాహరణకు నెస్‌ఫీల్డ్ ఏం చెబుతాడంటే – "వృత్తి, వృత్తి ఒక్కటే భారతదేశంలోని మొత్తం కులవ్యవస్థ అదే పునాదిపై ఏర్పడి ఉన్నది" అని. పై వ్యాఖ్యానం వల్ల ఆయన మన ఆలోచనలను ఏమీ ముందుకు తీసుకు వెళ్ళటం లేదని చెప్పవలసి ఉంటుంది. ఇంచుమించు ఈయన వ్యాఖ్యానం భారతదేశంలోని కులాలు విధ్యాత్మకాలు లేదా వృత్త్యాత్మకాలు అని చెప్పటమే అవుతుంది. ఇది చాలా అల్పమైన ఆవిష్కరణ. వృత్తిపరమైన ఒక బృందం వృత్తిపరమైన కులంగా ఎందుకు మారిందో నెస్‌ఫీల్డ్ నుంచి ఇంకా మనం తెలుసుకోవలసి ఉంది. ఇతర మానవ శాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన సిద్ధాంతాలను పరిశోధించే పని కూడా నేను సంతోషంగా స్వీకరించేవాడిని గాని వారందరు కూడా నెస్‌ఫీల్డ్ లాంటి వారే.

హెర్బర్ట్ స్పెన్సర్ తన పరిణామ సూత్రంలో వివరించినట్టు కులం అనేది చీలిక సూత్రానికి విధేయంగా వచ్చే ఒక సహజ దృగ్విషయం అనో, ఛాందస మతవాదుల శైలీ విన్యాసంలో చెప్పాలంటే "ఒక సంఘటిత నిర్మాణంలోని నిర్మితి వైవిధ్య"మంత సహజంగా ఉండేదే కులం అనో, మానవ స్వభావోత్కర్ష సూత్రాలను పరీక్ష పెట్టటానికి చేసిన తొలి ప్రయత్నమే కులం అనో, కులవ్యవస్థ అనివార్యమని భావించే మిథ్యావర్గానికి చెందిన వారంతా ముందే ఊహించిన సూత్రాలను ఒక నిస్సహాయ, నమ్ర ప్రజలపై ఉద్దేశపూర్వకంగా తెలివిగా రుద్దారనో, ఈ కులవ్యవస్థను వివరిస్తున్న సిద్ధాంతాలను విమర్శించటం ఆపకుండానే ఈ విషయం మీద నా సొంత పరిశీలనను మీ ముందు ఉంచుతాను.

హిందూ సమాజం అన్ని సమాజాల మాదిరిగానే వర్గాలతో ఏర్పడినదనే విషయాన్ని ముందు మనం గుర్తుంచుకోవటం చాలా అవసరం. తొలుత తెలియవచ్చే వర్గాలేమంటే - (1) బ్రాహ్మణులు లేదా పురోహిత వర్గం (2) క్షత్రియులు లేదా యోధ వర్గం (3) వైశ్యులు లేదా

వాణిజ్య వర్గం (4) శూద్రులు లేదా చేతిపనివారు, సేవక వర్గం ఇది ప్రధానంగా వర్గవ్యవస్థ ఇందులోని వ్యక్తులు అర్హత కలిగిన వారైతే వర్గాలు మార్చుకోవచ్చును ఆ విధంగా వర్గాలు తమ సిబ్బందిని మార్చుకుంటూ ఉండేవన్న వాస్తవం పట్ల ప్రత్యేకంగా దృష్టి సారించాలి హిందువుల చరిత్రలో ఒక సమయంలో పురోహిత వర్గం మిగతా ప్రజా సముదాయం నుండి సామాజికంగా విడిపోయి తనకు తాను దడి కట్టుకున్న విధానం ద్వారా తనంతతాను ఒక కులంగా తయారయింది మిగతా వర్గాలు సామాజిక విభజన సూత్రానికి బద్ధమై కొన్ని పెద్ద గుంపులుగాను, కొన్ని మరీ చిన్న గుంపులుగాను విభజనకు లోనయ్యాయి వైశ్య, శూద్ర వర్గాలు మొదట ఆరబ్ధ జీవద్రవ్యపు మూలరాశిలాగ ఉండేవి వాటిలోంచే నేటి అసంఖ్యాక కులాలు ఏర్పడ్డాయి యుద్ధ సంబంధమైన వృత్తి ఎక్కువగా మరీ చిన్న చిన్న ఉప విభాగాలకు సులువుగా అవకాశం ఇవ్వదు కాబట్టి, క్షత్రియ వర్గం సైనికులుగానూ, పరిపాలకులుగానూ పేరు పడ్డారు

సమాజంలో ఈ రకమైన ఉప విభజన సహజమే కాని, ఉప విభాగాలలో అస్వాభావికమైన విషయం ఏమంటే అవి వర్గ వ్యవస్థలో ఉండే ఏ నిషేధాలూ లేని ఏక ముఖతత్వాన్ని పోగొట్టుకొని స్వయం కల్పిత ఆవరణలతో కులాలు అనే విభాగాలుగా మారిపోయాయి ఇక్కడ ప్రశ్న ఏమంటే, దిగ్బంధం చేసుకొని అంతర్వివాహ పద్ధతిని ఆవరించాలని వారిని ఎవరైనా బలవంతం చేశారా? లేక వారు తమంతట తామే తలుపులు మూసుకున్నారా? దీనికి రెండు వాక్యాల జవాబు ఉన్నదని మనవి చేస్తున్నాను కొందరు తలుపులు మూశారు కొందరికి తలుపులు మూసుకున్నాయి ఇందులో ఒకటి మనోవిజ్ఞాన శాస్త్రపరమైన వ్యాఖ్య మరొకటి యాంత్రికమైనది కాని ఇవి రెండూ పరస్పరం పరిపోషకాలు కులం ఏర్పాటు పద్ధతిని సంపూర్ణంగా వివరించటానికి ఈ రెండూ అవసరమే

మనోవిజ్ఞాన శాస్త్ర సంబంధమైన వ్యాఖ్యానం గురించి మొదట ప్రస్తావిస్తాను ఈ సందర్భంగా ఈ ఉపవిభాగాలు లేదా వర్గాలు పారిశ్రామికమైనవీ, మతపరమైనవీ, తదితరమైనవీ అని గనక మీరు అనుకుంటే అవి ఎందుకు తమ చుట్టూ దడి కట్టుకొని ఉండిపోయాయి? లేదా అంతర్వివాహ పద్ధతిని ఎంచుకున్నాయి? అన్నది మనం సమాధానం చెప్పవలసిన ప్రశ్న దీనికి నా సమాధానం ఏమంటే బ్రాహ్మణులు ఆ విధంగా ఉన్నారు కాబట్టి అని అంతర్వివాహ పద్ధతి లేదా, చుట్టూ దడికట్టుకొని ఉండటం అనేది హిందూ సమాజంలో ఒక వైఖరి ఇది బ్రాహ్మణ కులంలో పుట్టింది కాబట్టి బ్రాహ్మణేతర విభాగాలూ, వర్గాలూ మనస్ఫూర్తిగా దానిని అనుకరించి, అంతర్వివాహ పద్ధతిని ఆచరించే కులాలుగా మారిపోయాయి చీలికవైపు సాగుతున్న ప్రయాణంలో ఉపవిభాగాలకు ఈ "అనుకరణ అంటువ్యాధి" సోకింది వాటిని కూడా కులాలుగా మార్చివేసింది మానవుని మనస్సులో అనుకరణ ప్రవృత్తి చాలా గాఢంగా నాటుకుపోయి ఉంది అంచేత భారతదేశంలో వివిధ కులాలు ఏర్పడటానికి ఈ వివరణ సరిపోదని భావించవలసిన అవసరం లేదు ఈ అనుకరణ ఎంత ప్రగాఢంగా ఉంటుందో వాల్టర్ బేగ్‌హాట్ ఇలా చెప్పారు

"అనుకరణను స్వచ్ఛందమైనదిగానూ, బుద్ధిపూర్వకమైనదిగానూ మనం భావించనవసరం లేదు ఇది మస్తిష్కపు అస్పష్ట భాగాలలో ఎక్కడో తిష్ఠవేసి ఉంటుంది దాని భావాలను వెలికి తీద్దామంటే ప్రస్ఫుటంగా కనిపించదు దాని భావాలు బుద్ధిపూర్వకంగా బహిర్గతమయ్యే వరకు అవి ఉన్నట్టే తెలీదు ముందస్తుగా గనుక ఊహించలేకపోతే ఆ సమయంలో అవి అలా అనిపించవు కూడా మన స్వభావంలోని అనుకరణ భాగపు ప్రధానపీఠం మన విశ్వాసంలో ఉంది దీనిని విశ్వసించాలి అనో దానిని విశ్వసించకూడదు అనో మనలను ముందుగానే ఉద్యుక్తపరచే కారణాలు మన స్వభావంలోని అత్యంత నిగూఢ భాగాలలో ఎక్కడో ఉంటాయి "అనుకరణ స్వభావపు విశ్వాసశీలత విషయంలో సందేహం ఉండనక్కరలేదు" [3] గాబ్రియేల్ టార్డే అనుకరణ ప్రవృత్తి అనే అంశం మీద శాస్త్రీయమైన పరిశోధన చేసి మూడు అనుకరణ సూత్రాలను ప్రవేశపెట్టాడు ఆ మూడింటిలో ఒక సూత్రం ఏమంటే అనుకరణ, పై నుంచి కిందికి వ్యాపిస్తుందని ఆయన మాటల్లోనే చెప్పాలంటే "అవకాశం గనుక ఇస్తే కులీనులు ఎల్లప్పుడూ అన్ని చోట్లా తమ నాయకులను, రాజులను, సార్వభౌములను అనుకరిస్తారు అలాగే ప్రజలు తమకు అవకాశం వస్తే కులీనులను అనుకరిస్తారు" [4] టార్డే చెప్పిన అనుకరణ సూత్రాలలోని మరోటి ఏమిటంటే అనుకరణ విస్తృతి, తీవ్రతలు దూరంతో గల విలోమ అనుపాతాన్ని బట్టి మారుతూ ఉంటాయి ఆయన మాటల్లో చెప్పాలంటే "దగ్గరగా ఉన్న వాటిలో అత్యుత్తమమైన దానిని ఎక్కువగా అనుకరిస్తారు వాస్తవానికి ఉదహరిస్తున్న నమూనా ప్రభావం దూరానికి వెళ్లే కొలదీ తగ్గిపోతుంది, అలాగే మీది వాటి పట్ల సూటిగా ఉంటుంది ఇక్కడ దూరం అనేదాన్ని సామాజిక అర్థంలో చూడాలి ఒక కొత్త వ్యక్తి ఎంత దూరంలో ఉన్నప్పటికీ మనం గనుక అతనితో నిత్య సంబంధాలు అనేక రకాలుగా పెట్టుకుంటే, అతనిని అనుకరించాలనే కోరికను తీర్చుకోవటానికి అన్ని సౌకర్యాలు మనకు ఉంటే ఆ దృష్ట్యా అతను మనకు దగ్గర్లో ఉన్నట్టే ఉన్న వాటిని అనుకరించటం అనే ఈ సూత్రం, సమాజంలో ఉన్నత స్థానంలో ఉన్నవారు ప్రవేశపెట్టిన ఒక ఉదాహరణను ఇతరులు నెమ్మదిగా ఒకదాని తరువాత ఒకటిగా క్రమానుసారంగా అనుకరించడం అనేది ఎలా వ్యాప్తి చెందుతుందో విశదపరుస్తుంది" [5]

అనుకరణ ద్వారా కొన్ని కులాలు ఏర్పడ్డాయనే నా సిద్ధాంతాన్ని రుజువు చేసుకొనటానికి (దీనికి నిజంగా రుజువు ఏమీ అవసరం లేదు) ఉత్తమ మార్గం ఏమిటంటే అనుకరణ ద్వారా కులాలు ఏర్పడటానికి అనువైన పరిస్థితులు హిందూ సమాజంలో ఉన్నవా లేవా అని పరిశీలిస్తే సరిపోతుందని నాకు అనిపిస్తున్నది నిర్ణీత ప్రమాణాల ప్రకారం ఆ అనుకరణ పరిస్థితులు ఇవి- (1) అనుకరణ మూలం ఆ బృందంలో గౌరవపాత్రంగా ఉండాలి (2) అసంఖ్యాకమైన నిత్య సంబంధాలు ఆ బృందంలోని సభ్యుల మధ్య ఉండాలి ఈ పరిస్థితులు భారతదేశంలో

3 ꞏ ఫిజిక్స్ అండ్ పొలిటిక్స్, 1915 పేజి 60,

4 ꞏ లాస్ ఆఫ్ ఇమిటేషన్, ఇ సి పార్సన్, అనువాదం రెండో ముద్రణ పేజి 217

5 ꞏ అదే పుస్తకం పేజీ 224

ఉన్నాయని చెప్పటానికి సందేహించనవసరం లేదు బ్రాహ్మణుడు సగం దేవుడు, ఇంచుమించు భూసురుడు అతడు ఒక మార్గం ఏర్పరచి ఇతరులను తీర్చి దిద్దుతాడు అతని ప్రతిష్ఠ ప్రశ్నించరానిది ఆనందానికీ మంచితనానికీ అతను ఆలవాలం వేదశాస్త్రాలు ఆదర్శమూర్తిగా శ్లాఘిస్తున్న వాడూ, పురోహిత ప్రధానమైన అసంఖ్యాక జనానీకం పూజిస్తున్న వాడూ అయిన అటువంటి వ్యక్తి ఎవరైనా తనను ఆదరించే మానవాళి పైన తన వ్యక్తిత్వాన్ని ప్రసరింప చేయకుండా ఉంటాడా? అంతెందుకు, ఆ కథ గనక సత్యమైనట్లయితే అతడు సృష్టికి పరిపూర్ణమైన ముగింపు అని నమ్మాలి అటువంటి వ్యక్తి కేవలం అనుకరణ కంటే ఎక్కువ గౌరవార్హుడు అంచేత పోనీ కనీసం అతనిని అనుకరించటమైనా చెయ్యాలి కదా అలాంటి అతడు అంతర్వివాహ పద్ధతి దడిలో జీవిస్తూ ఉంటే మిగిలిన వారు అతని ఆదర్శాన్ని అనుసరించవద్దా? దుర్బల ప్రజానీకం దేనికైనా మొగ్గుతుంది గంభీరమైన వేదాంతి రూపంలో వచ్చినా చపలచిత్తంగల గృహ పరిచారిక వేషంలో వచ్చినా ఇట్టే లోబడి పోతుంది మరోలా ఉండటానికి వీల్లేదు అనుకరణ సులువు, అన్వేషణ కష్టం

కులం ఏర్పడటంలో అనుకరణ వహించిన పాత్రను ఇంకా చూపాలంటే, కుల నిర్మితిని బలపరిచిన ఆచారాలపట్ల మొదటిరోజుల్లో బ్రాహ్మణేతర వర్గాల ప్రవర్తన ఎలా ఉండేదో తెలుసుకుంటే సరిపోతుంది ఇప్పుడైతే వేరు చరిత్రగతిలో అవి హిందూ మస్తిష్కంలో నాటుకు పోయాయి కొలను నీటిమీది కలుపు మొక్కలవలె ఈ రోజుకు కూడా ఏ ఆధారమూ లేకుండానే వేలాడుతూ ఉన్నాయి ఇప్పుడు వాటికి రుజువు అవసరం లేదు, నమ్మకం చాలు ఒక విధంగా, కేవలం ఒక విధంగా మాత్రమే - హిందూ సమాజంలోని ఒక కులం స్థాయి సతి, బలవంతపు వితంతు పద్ధతి, బాలికా వివాహ పద్ధతుల ఆచారాల పాటింపు మేరను బట్టి మారుతూ ఉంటుంది కులాన్ని వేరు చేసే దూరాన్ని బట్టి (టార్డే అర్థంలో ఈ పదం వాడుతున్నాను) ఈ ఆచారాల పాటింపు సూటిగా మారుతూ ఉంటుంది బ్రాహ్మణులకు బాగా దగ్గరగా ఉన్న కులాలు ఈ మూడు ఆచారాలనూ అనుకరిస్తున్నాయి వాటిని చాలా కఠినంగా ఆచరించాలని కూడా ఆదేశిస్తున్నాయి కొంచెం దగ్గరగా ఉన్న కులాలు బలవంతపు వితంతు విధానాన్నీ, బాలికా వివాహాన్నీ మాత్రమే అనుకరిస్తున్నాయి కొంచెం దూరంగా ఉన్న ఇతర కులాల్ను బాలికా వివాహాలను మాత్రమే అనుకరిస్తున్నాయి బాగా దూరంగా ఉన్న కులాలు కులం సూత్రంలోని నమ్మకాన్ని మాత్రమే అనుకరిస్తున్నాయి ఈ అసంపూర్ణ అనుకరణ ఎందుకు వచ్చిందంటే కొంతవరకు టార్డే చెప్పినట్టు 'దూరం' వల్లనూ మరికొంత ఈ ఆచారాల క్రూర స్వభావం వల్లనూ అని నేను ధైర్యంగా చెప్పగలను టార్డే సూత్రానికి ఈ వ్యవహారం ఒక సంపూర్ణ దృష్టాంతం భారతదేశంలో కులాల ఏర్పాటు ప్రక్రియ మొత్తం అంతా - పైవారిని కిందివారు అనుకరించే ప్రక్రియ - అనే విషయంలో ఇది ఏ సందేహానికీ తావు లేకుండా చేస్తున్నది ఈ తరుణంలో ఇంతకు ముందు నేను వెలిబుచ్చిన అభిప్రాయాన్ని సమర్థించుకోవటానికి వెనక్కి వెళ్తాను ఈ నా అభిప్రాయం మీకు మరీ హఠాత్తుగా వచ్చినదిగానో

లేక నిరాధారమైనదిగానో అనిపించి ఉండవచ్చు ప్రసక్తిలో ఉన్న ఆ మూడు ఆచారాల సహాయంతో బ్రాహ్మణ వర్గం మొదట కులకట్టడాన్ని నిర్మించిందని నేను చెప్పాను ఆ అభిప్రాయానికి నేను చెప్పే కారణం ఏమిటంటే ఇతర వర్గాలలో వాటి ఉనికి పై వర్గం నుంచే వచ్చిందని బ్రాహ్మణేతర కులాలలో ఈ ఆచారాలు మార్గాలుగా గాని, ఆదర్శాలుగా గాని వ్యాప్తి చెందటంలో అనుకరణ వహించిన పాత్ర గురించి నేను చెప్పేవరకు అనుకర్తలు దీనిని గమనించకపోయినా గాని, ఇవి అలా వచ్చినవిగానే ప్రచారంలో ఉన్నాయి ఇవి అలా తెచ్చి పెట్టుకున్నవే గనక అయితే, మిగిలిన వారికందరికీ మాదిరిగా ఉంటూ ఉండే గొప్ప మౌలిక కులంలో మొదట ఇవన్నీ ఉండి ఉండాలి కదా! దైవమే అన్నీ సృష్టించాడనే సమాజంలో అటువంటి ఆదర్శం ఎవరుంటారు? భూదేవతలు తప్ప!

దీనితో ఉప విభాగాలు తమ చుట్టూ దడి కట్టుకొని తలుపులు మూసుకొన్న గాథ పూర్తి అవుతుంది తమను రానీయకుండా అవతలివారు తలుపులు మూసుకొన్న ఫలితంగా ఇతరులు తలుపులు ఎలా వేసుకున్నారో ఇపుడు పరిశీలిద్దాం కులం ఏర్పాటులో యాంత్రిక ప్రక్రియ అని నేను చెప్పినది ఇదే ఇది అనివార్యం కాబట్టి యాంత్రికం అయింది ఈ విషయాన్ని వివరించటానికి ఈ దృక్పథాన్నీ మనోవిజ్ఞాన శాస్త్ర సంబంధమైన చేరిక మార్గాన్నీ రెండింటినీ కూడా నా కంటేముందు ఈ విషయాన్ని పరిశీలించిన విద్వాంసులు గుర్తించకపోవటానికి కారణం ఏమిటంటే వారు కులాన్ని దానికి దాన్ని ఒక విభాగంగానే చూశారు తప్ప కులవ్యవస్థ లోపలిదానిగా చూడలేదు ఇలా చూడకపోవటం లేదా చూడలేకపోవటం అనేది పరిశీలనలో ఉన్న విషయాన్ని సరిగ్గా అర్థం చేసుకొనటానికీ తద్వారా సరైన వివరణ ఇవ్వటానికీ నష్టం కలిగించింది ఒక వ్యాఖ్యానంతో నా వివరణ ఇవ్వటానికి ముందుకు సాగుతాను అయితే ఈ వ్యాఖ్యానాన్ని మాత్రం మీరు ఎప్పుడూ దృష్టిలో ఉంచుకోవాలి అదేమిటంటే "కులం ఏక సంఖ్యలో ఉండటం అవాస్తవికం కులాలు బహుళ సంఖ్యలోనే ఉంటాయి" కులం అంటూ ఒకటి ఏదీ లేదు, కులాలు ఉన్నాయి వివరంగా చెప్పాలంటే బ్రాహ్మణులు తమను ఒక కులంగా చేసుకున్నప్పుడు తద్వారా బ్రాహ్మణేతర కులాన్ని సృష్టించారు నా పద్ధతిలో చెప్పాలంటే తమను తాము లోపల మూసుకుంటూ ఇతరులను వెలుపల ఉంచారు నా ఉద్దేశాన్ని స్పష్టీకరించటానికి మరో ఉదాహరణ ఇస్తాను వివిధ మతాలను అవలంబిస్తున్న వివిధ సమాజాల ప్రజలతో అంటే హిందువులు, మహమ్మదీయులు, యూదులు, క్రైస్తవులు, పార్శీలతో కూడిన మొత్తంగా భారతదేశాన్ని తీసుకోండి హిందువులను మినహాయించి మిగిలిన వారంతా కులరహిత సమాజాలవారే కాని పరస్పరం మటుకు అవి కులాలే వీటిలో మొదటి నాలుగూ తమలో తాము దడికట్టుకొని ఉన్నాయనుకోండి పార్శీలు ప్రత్యక్షంగా బయట ఉండిపోతారు, కాని పరోక్షంగా వారు కూడా దడి కట్టుకున్నట్టే ప్రతీకాత్మకంగా చెప్పాలంటే 'ఎ' అనే గుంపు అంతర్వివాహ పద్ధతికి కట్టుబడి ఉండాలనుకుంటే, పరిస్థితుల ప్రాబల్యం వల్ల 'బి' గుంపు కూడా ఆ విధంగానే ఉండవలసి వస్తుంది

ఇదే తర్కాన్ని హిందూ సమాజానికి అన్వయించండి కులానికి ఉన్న 'చీలిక అయ్యే లక్షణా'నికి మరో వివరణ దొరుకుతుంది, ఎందుకంటే, అసలు, కులంలోనే స్వయం ద్విగుణీకరణ లక్షణం (ఒకదానిలాగా మరొకటి పుట్టుకు వచ్చి రెండింతలయ్యే లక్షణం) ఉన్నది కులానికి సంబంధించిన నైతిక మతపరమైన సామాజిక ప్రవర్తనకు తీవ్రంగా భంగం కలిగించే ఏ నూతన పరివర్తననూ కులం సహించలేదు కులంలో తిరుగుబాటు చేసిన సభ్యులను కులంలో నుంచి వెలివేసే ప్రమాదం ఉంది మరొక కులం వీరిని చేర్చుకోవటం, తమలో ఇముడ్చుకోవటం వంటి ప్రత్యామ్నాయమేమీ లేనందువల్ల వారు ఒంటరిగా అయిపోతారు కుల నియమాలు చాలా నిష్టురమైనవి నేరాల రకాలలోని సున్నితమైన వ్యత్యాసాలను చూడటానికి వేచి ఉండవు నూతన కల్పన అనేది ఏ రకమైనదైనా కావచ్చు అన్ని రకాలూ ఒకే శిక్షకు గురి అవుతాయి ఒక వినూత్న ఆలోచనా విధానం ఒక కొత్త కులాన్ని సృష్టిస్తుంది పాత కులాలు దీనిని సహించవు ఒక గురువు (మత ప్రవక్త)గా గౌరవం పొందుతున్న ఉపద్రవకరమైన ఆలోచనాపరుడు, అక్రమ ప్రణయ సంబంధంగల అపరాధులు పొందే శిక్షనే పొందుతాడు మొదటి వ్యక్తి మత సంబంధమైన శాఖలాంటి కులాన్ని సృష్టిస్తే రెండో వ్యక్తి ఒక మిశ్రమ రకపు కులాన్ని సృష్టిస్తాడు కాబట్టి, కట్టుబాట్లను ఉల్లంఘించే ధైర్యం ఉన్న అపరాధి మీద కులాలు కనికరం చూపవు దానికి శిక్ష కులం నుంచి వెలి ఫలితం ఒక కొత్త కులం వెలికి గురయిన వారందరూ ఒక కొత్త కులంగా ఏర్పడటాన్ని ప్రోత్సహించటం హిందూ మనస్తత్వానికి కొత్త ఏమీ కాదు అంతేకాకుండా అలా ఏర్పడిన ఏదైనా కులంలో తమను చేర్చుకోవటానికి గనక సాధ్యపడితే అందులో విధేయులైన సభ్యులుగా ఉండటానికి తరచుగా ఇష్టం కనబరుస్తుంటారు అయితే కులాలన్నీ దడి కట్టుకున్న విభాగాలు బహిష్కృతులందరూ ఒక కులంగా ఏర్పడే విధంగా వారిని బలవంతం చేయటమే వారి కుట్రలో స్పష్టంగా కనబడే అంతర్‌బుద్ధి ఈ కఠోరమైన పరిస్థితిలో ఉన్న తర్కం నిర్దాక్షిణ్యమైనది దీని శక్తికి విధేయంగానే కొన్ని దురదృష్ట బృందాలు తాము దిగ్బంధంలో ఉన్నామని తెలుసుకున్నాయి ఎందువల్లనంటే ఇతరులు తాము దడికట్టుకుంటూ వీరిని బయట ఉంచేశారు దీని ఫలితంగా కొత్త బృందాలు (కుల కట్టుబాట్లకు గర్హణీయమైన ఏ పద్ధతి ద్వారా ఏర్పడినవైనా సరే) ఒక యాంత్రిక సూత్రం ద్వారా నిరంతరంగా దిగ్భ్రమ కలిగించే బహుళత్వంతో కులాలుగా ఏర్పడుతూనే ఉన్నాయి భారతదేశంలో కులాల ఏర్పాటు ప్రక్రియలో రెండో కథ ఇది

ఇపుడు నా సిద్ధాంతంలో ముఖ్యాంశాలను సంక్షేపిస్తాను కులాన్ని అధ్యయనం చేసిన వారంతా అనేకమైన పొరపాట్లు చేశారని నా అభిప్రాయం అవి వారి పరిశీలనను తప్పుదారి పట్టించాయి కులాన్ని అధ్యయనం చేసిన ఐరోపా పరిశోధకులు కుల వ్యవస్థలో రంగు పాత్రను అనవసరంగా ఎక్కువగా నొక్కి చెప్పారు వర్ణద్వేషాలతో నిండి ఉన్నారు కాబట్టి కులం సమస్యలో అదే ముఖ్యమైన కారకమై ఉంటుందని వారు త్వరపడి ఊహించుకున్నారు అంతకంటే సత్యదూరమైనది మరొకటి ఉండదు రాజులందరూ తాము ఆర్యజాతికి

చెందినవారమని చెప్పుకున్నా, ద్రావిడ జాతికి చెందినవారని చెప్పుకున్నా వారు ఆర్యులే అని డాక్టర్ కేట్కర్ వక్కాణించటం సరియైనదే పాశ్చాత్య పండితులు వచ్చి గీత గీయటం మొదలు పెట్టేవరకు ఒక తెగగాని, ఒక కుటుంబంగాని జాతిపరంగా ఆర్యులా, ద్రావిడులా అన్న ప్రశ్న భారతీయులను ఎప్పుడూ ప్రయాస పెట్టలేదు చాలారోజుల క్రిందటే చర్మపు రంగు అనేది అంత ముఖ్యమైన విషయం కాకుండా పోయింది "[6] ఆ తర్వాత మామూలు వర్ణనలను వివరణలుగా పొరపడి అవే మూల సిద్ధాంతాలన్నట్టుగా వాటి వెంటపడ్డారు వృత్తిపరమైనవీ, మతపరమైనవీ ఇంకా అలాంటివి కొన్ని కులాలు ఉన్నాయి, నిజమే కాని, కులం మూలానికి అది ఏ విధంగానూ వివరణ కాదు వృత్తిపరమైన బృందాలు కులాలుగా ఎందుకు మారాయో ఇంకా మనం తెలుసుకోవలసి ఉంది కాని ఈ ప్రశ్నను ఇంతవరకు ఎవరూ లేవనెత్తనే లేదు చివరగా కులాన్ని వారు చాలా తేలికగా అదేదో ఒక్క ఊపిరితో చేసేసినట్టు భావించారు దీనికి భిన్నంగా నేను వివరించినట్టు కులాన్ని ప్రామాణికంగా సమర్థించటం, దాని చెల్లుబాటును అంగీకరించటం, సహించటం దాదాపుగా అసాధ్యం ఎందుకంటే దీనిలో అనేక కష్టాలు ఇమిడి ఉన్నాయి నమ్మకం మీద కులం ఆధారపడి ఉన్నదన్న మాట నిజమే, కాని నమ్మకం అయినప్పుడు ఒక వ్యవస్థకు పునాది ఆ వ్యవస్థనే ముందు స్థిరపరచి బలపరచవలసిన అవసరం వచ్చింది కులం సమస్యపై నేను చేసిన అధ్యయనంలో నాలుగు ముఖ్యాంశాలున్నాయి (1) హిందూ జనాభా వివిధ జాతుల మిశ్రమ కలయిక ఏర్పాటు అయినప్పటికీ అందులో ఒక గాఢమైన సాంస్కృతిక ఐక్యత ఉన్నది (2) ఒక పెద్ద సాంస్కృతిక విభాగాన్ని కులం చిన్న చిన్న పాళ్లాలుగా, ముక్కలుగా చేస్తున్నది (3) మొదట్లో ఒక కులంతోనే ఆరంభమయింది 4) అనుకరణ బహిష్కరణల ద్వారా వర్గాలు కులాలుగా అయ్యాయి ఈ అసహజమైన వ్యవస్థను అంతం చేయటానికి తీవ్రమైన సంస్కరణ ప్రయత్నాలు జరుగుతున్నందువల్ల భారతదేశంలో కులం సమస్య పట్ల ఈనాడు విశేష శ్రద్ధ కనబరుస్తున్నారు అలాంటి సంస్కరణ ప్రయత్నాల వల్ల దీని మూలం గురించి - అసలు ఇది ఉద్దేశపూర్వకంగా ఒక సర్వోన్నత అధికారాజ్ఞ వలన ఏర్పడిందా లేక అసాధారణ పరిస్థితులలో మానవ సమాజ జీవనగతిలో ఉద్దేశరహితంగానే పెరుగుతూ రూపొందిందా - అని పెద్ద ఎత్తున వివాదం చెలరేగింది ఇందులో రెండో అభిప్రాయం ఉన్నవారికి ఈ పత్రంలో స్వీకరించిన అభిప్రాయం కొంత ఆలోచన రేకెత్తిస్తుందని ఆశిస్తున్నాను కులానికి ఉన్న ఆచరణాత్మక ప్రాముఖ్యమూ, దాని సైద్ధాంతిక పునాదుల విషయంలో నాలో అది రేకెత్తించిన ఆసక్తి, కొన్ని నిర్ణయాలతో నన్ను మీ ముందుకు తీసుకువచ్చాయి వాటికి బలాన్ని కూర్చే ఆధారాలను మీ ముందు ఉంచేవరకూ అవి నన్ను నిలవనివ్వలేదు ఈ నిర్ణయాలు విషయాన్ని చర్చించటానికి ఉపకరించేవే తప్ప అంతకు మించినవి కావు అవే తుది నిర్ణయాలన్న అతి నమ్మకమూ నాకు లేదు బండిని తప్పుదోవ పట్టించారనే నాకు అనిపిస్తున్నది ప్రయోజనకరమైన సత్యాన్ని

6 ։ హిస్టరీ ఆఫ్ కేస్ట్, పుట 82

చేరుకొనే దృష్టితో నాకు సరైనదని తోచిన పరిశోధనా మార్గాన్ని సూచించటమే ఈ వ్యాసం ప్రాథమిక ఉద్దేశం ఏమయినప్పటికీ ఈ విషయాన్ని పక్షపాత బుద్ధితో చూడకుండా మాత్రం మనం తప్పక జాగ్రత్త పడాలి శాస్త్రం పరిధి నుంచి రాగద్వేషాలను దూరంగా ఉంచాలి విషయాలను వస్తుగత దృక్పథంతో నిర్ణయించాలి నా మటుకు నేను ఏ విషయం మీదనైనా సరే నేను చేసిన సిద్ధాంతాలను రూఢిగా కాదని ఎవరైనా నిరూపిస్తే ఎంతో ఆనందిస్తాను ఎందుకంటే ఎంతో పాండిత్యం ఉన్న చర్చలు జరిగినప్పటికి కూడా ఒక విషయం మీద సహేతుకమైన అసమ్మతి గనుక ఉంటే అది ఎప్పటికీ వివాదాస్పదంగానే మిగిలిపోతుంది కులం విషయంలో ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించానని ఎంత లాలసతో ఉన్నప్పటికీ, అది సమర్థనీయం కాదని ఎవరైనా నిరూపించి చూపినట్లయితే, దానిని విడిచి పెట్టేయటానికి అంత సిద్ధంగానూ ఉన్నానని చెబుతూ ముగిస్తున్నాను

అనువాదం : బొజ్జా తారకం

# 2

# కుల నిర్మూలన

## మహాత్మా గాంధీకి ఇచ్చిన సమాధాన సహితంగా

"సత్యాన్ని సత్యంగాను,
అసత్యాన్ని అసత్యంగాను తెలుసుకో"

– బుద్ధుడు

"హేతువాదం చెయ్యనివాడు మూఢుడు
హేతువాదం చెయ్యలేనివాడు అవివేకి
హేతువాదం చేయ సాహసించని వాడు బానిస."

–హెచ్. డ్రమండ్

*1944 తృతీయ ముద్రణ నుంచి గ్రహించ బడింది*

# కుల నిర్మూలన

## రెండో ముద్రణకు పీఠిక

లాహోర్‌లోని జాత్-పాత్-తోడక్ మండల్ వారికోసం నేను తయారు చేసిన ప్రసంగం ప్రధానంగా దానిని ఎవరిని ఉద్దేశించి తయారు చేశానో ఆ హిందూ ప్రజలనుంచి ఊహించరాని ఆదరణ లభించింది దానిని ప్రచురించిన రెండు నెలలలోనే ఒక వెయ్యి అయిదు వందల (ఇంగ్లీష్) ప్రతులు అమ్ముడు పోయాయి దీనిని గుజరాతీలోకి, తమిళంలోకి అనువదించారు దీనిని మరాఠీ, హిందీ, పంజాబీ, మళయాళీ భాషల్లోకి అనువదిస్తున్నారు ఇంగ్లీషు ప్రతుల కోసం గిరాకీ తగ్గకుండా ఉన్నది వారి కోర్కెను తీర్చటంకోసం రెండో ముద్రణ వేస్తున్నాం ఉపన్యాస రూపంలో కాకుండా ప్రత్యక్షంగా వ్యాఖ్యానిస్తున్నట్టు దీనిని మార్చితే బాగుంటుందని కొందరు నాతో అన్నప్పటికీ చారిత్రక అవసరాలు, విజ్ఞప్తి పటిష్ఠత నన్ను ఈ వ్యాసాన్ని అసలు రూపంలోనే ఉంచేటట్టు చేశాయి ఈ ముద్రణకు రెండు అనుబంధాలను జోడించాను మొదటి అనుబంధంలో, నా ఉపన్యాసాన్ని సమీక్షిస్తున్నట్టుగా గాంధీగారు 'హరిజన పత్రిక'లో రాసిన రెండు వ్యాసాలను, జాత్-పాత్-తోడక్ మండల్ సభ్యుడైన శ్రీ సంత్‌రామ్ గాంధీగారికి రాసిన ఉత్తరంపై 'హరిజన్ పత్రిక'లో గాంధీ ప్రచురించిన వ్యాఖ్యలనూ సేకరించి వేశాను మొదటి అనుబంధంలో వేసిన గాంధీగారి వ్యాసాలకు జవాబుగా నా ఉద్దేశాలను రెండో అనుబంధంలో చేర్చాను నా ఉపన్యాసంలో వెలువరించిన అభిప్రాయాలపై గాంధీగారే కాకుండా ఇతరులు చాల మంది ప్రతికూల విమర్శలు చేశారు అట్టి ప్రతికూల వ్యాఖ్యానాలను దృష్టిలో ఉంచుకోవాలనుకున్నప్పుడు గాంధీగారు ఒక్కడికి నేను పరిమితం చేసుకోవాలి ఇలా ఎందుకు చేశానంటే ఆయన చెప్పినది జవాబు ఇవ్వ దగినంత గొప్పగా ఉన్నాయని కాదు, కాని చాలమంది హిందువులకు ఆయన మాట ఒక దైవ వాక్యంగా అనిపిస్తుంది ఆయన పెదవి విప్పి మాట్లాడాడంటే ఇక వాదన ముగిసి పోవలసిందే, ఇక ఏ కుక్కగాని మొరగ కూడదని వారు అనుకుంటారు గనుక ప్రధానాచార్యులకు వ్యతిరేకంగా వాదన చెయ్యటానికి సాహసించి, వారు పొరపాట్లు చెయ్యని వారు కాదని పట్టుపట్టే తిరుగుబాటు దార్లకు ప్రపంచం ఎంతో రుణపడి ఉంటుంది ప్రతి ప్రగతి శీల సమాజమూ అందులోని తిరుగుబాటు దార్లకు ఏరకమైన విలువ ఇస్తుందో నేను లక్ష్యపెట్టను హిందువులు భారతదేశంలో ఉన్న రోగిష్ఠులని, వారి రోగం మూలంగా ఇతర భారతీయుల ఆరోగ్యానికి, ఆనందానికి ప్రమాదం వాటిల్లు తున్నదని హిందువులు గ్రహిస్తే నేను తృప్తి చెందుతాను

బి.ఆర్.అంబేడ్కర్

❁ ❁ ❁

# మూడో ముద్రణకు పీఠిక

ఈ వ్యాసం రెండో ముద్రణ 1937లో వెలువడింది చాల తక్కువ కాలంలోనే ప్రతులన్నీ అమ్ముడయ్యాయి చాల కాలంనుంచి కొత్త ముద్రణ తీసుకు రావాలని చాల మంది అంటున్నారు ఇండియన్ ఎంటిక్వరీ జర్నల్ 1917 మే నెల సంచికలో 'భారత దేశంలో కులాలు, వాటి పుట్టుక పని తీరు" అనే పేరుతో నా వ్యాసం ఒకటి వచ్చింది దానిని కూడా ఈ వ్యాసంతో కలిపి ప్రచురించాలన్న ఉద్దేశం ఉండేది అయితే నాకు సమయం చాలనందువల్లనూ అలా జత చేసే అవకాశాలు సుదూరంలో కూడా కనిపించ నందువల్లనూ ఈ వ్యాసం కావాలనే కోరిక ప్రజలలో ఎక్కువగా ఉన్నందువల్లనూ కొత్త ముద్రణ వెయ్యకుండా రెండో ముద్రణనే తిరిగి ముద్రిస్తున్నాను

ఈ వ్యాసం ఎంతో ప్రసిద్ధి పొందినందుకు నాకు ఎంతో ఆనందంగా ఉన్నది ఇది ఎందుకోసం ఉద్దేశించానో ఆ ప్రయోజనం నెరవేరుతున్నదని ఆశిస్తాను

బి.ఆర్.అంబేద్కర్

22, పృథ్వీరాజ్ రోడ్,

న్యూఢిల్లీ,

1, డిశంబరు, 1944.

అనువాదం : బొజ్జా తారకం

# కుల నిర్మూలన

## పూర్వ రంగం

1935, డిశంబరు 12వ తేదీన జాత్‌పాత్ తోడక్ మండలి కార్యదర్శి శ్రీ సంత్‌రామ్ వద్దనుంచి నాకు ఈ క్రింది లేఖ అందింది :

ప్రియమైన డాక్టర్ సాహెబ్ :

మీరు దయతో డిశంబరు 5 వ తేదీన రాసిన లేఖ చేరింది అందుకు చాలా కృతజ్ఞుడను ఆ లేఖను నేను పత్రికకు విడుదల చేశాను మీ అనుమతి లేనిదే ఆ పని చేసినందుకు నన్ను క్షమింప ప్రార్థన ఆ లేఖ ప్రకటించడంలో వచ్చే బాధ ఏదీ నాకు కనిపించడం లేదు మీరు గొప్ప మేధావులు, చింతనాపరులు మీరు పరిశోధించినంత సాకల్యంగా, సమగ్రంగా కుల సమస్యను మరొక రెవరూ పరిశోధించలేదని నా గాఢ విశ్వాసం నేను, మా మండలీ కూడ మీ భావాల ద్వారా ఎప్పుడూ ఉత్తేజితుల మౌతూనే ఉన్నాం వాటిని "క్రాంతి" ద్వారాను, సభాముఖంగాను నేను తరచు ప్రచారం చేస్తూనే ఉన్నాను "కులవ్యవస్థ ఏ మత నమ్మకాలపై నిర్మించబడిందో ఆ మతనమ్మకాలను పూర్తిగా నాశనం చేస్తేనేగాని కులాన్ని నిర్మూలించడం సాధ్యంకాదు " అనే మీ నూతన సూత్రం వివరణను చదవటానికి చాలా కుతూహల పడుతున్నాను దయచేసి ఈ సూత్రాన్ని మీకు వీలయినంత త్వరలో మరికొంత విపులీకరించవలసిందిగా కోరుతున్నాను ప్రస్తుతం అది నాకు పూర్తిగా విశదం కాలేదు మీరు దాన్ని విశదీకరిస్తే పత్రికల ద్వారాను, సమావేశాల ద్వారాను గట్టిగా ప్రచారం చేయడానికి మాకు వీలవుతుంది



మా వార్షిక మహాసభకు మీరే అధ్యక్షులుగా ఉండాలని మా కార్యవర్గం పట్టుదలగా ఉన్నారు మీ వీలునుబట్టి మా మహాసభ తేదీలను మార్చుకోగలం పంజాబులోని స్వతంత్ర హరిజనులు మిమ్మల్ని కలుసుకోవాలని, మీతో తమ కార్యక్రమాలను గురించి చర్చించాలని

ఎంతగానో ఉవ్విళ్లూరుతున్నారు అందువల్ల మీరు దయతో మా కోరికను మన్నించి, మా మహాసభకు అధ్యక్షులుగా లాహోరు రాగలిగితే, ఈ రెండు ప్రయోజనాలు సిద్ధించగలవు వివిధ భావాలకు చెందిన హరిజన నాయకులందరినీ ఆహ్వానిస్తాం వారందరికీ మీ భావాలను అందించే అవకాశం కూడ మీకు కలుగుతుంది

క్రిష్టమస్‌కి బొంబాయిలో మిమ్మల్ని కలుసుకోడానికి, మీతో యావత్తు పరిస్థితినీ సవివరంగా చర్చించి మా ఆహ్వానాన్ని తప్పక అంగీకరించవలసిందిగా కోరడానికీ మా మండలి ఉప కార్యదర్శి శ్రీ ఇంద్రసింగ్‌ను పంపిస్తున్నాం "

★★★

జాత్ పాత్ తోడక్ మండలి సవర్ణ హిందూ సంఘ సంస్కర్తల సంస్థ అనీ, హిందూ సంఘం నుంచి కులవ్యవస్థను నిర్మూలించడమే దాని ఏకైక లక్ష్యమనీ నాకు చెప్పారు సాధారణంగా సవర్ణ హిందువులు నిర్వహించే ఉద్యమంతో ఎటువంటి సంబంధమూ పెట్టుకోవడానికి నేను ఇష్టపడను సంఘ సంస్కరణ విషయంలో సవర్ణ హిందువుల దృక్పథం వేరు, నా దృక్పథం వేరు కావటంవల్ల వారితో కలిసి పనిచేయడం చాల కష్టతరమని నాకు తెలుసు మా మధ్యగల అభిప్రాయ భేదాలవల్ల నిజానికి వారితో కలిసి మెలగడమంటే నాకు ఇరకాటంగా ఉంటుంది అందువల్ల మొట్టమొదట వారు నన్ను మహాసభకు అధ్యక్షత వహించవలసిందిగా కోరినప్పుడు నేను తిరస్కరించాను అయితే వారు నన్నంతటితో విడిచి పెట్టలేదు తమ సభ్యులలో ఒకరిని నన్ను ఒప్పించడానికి బొంబాయి పంపారు ఆయన పరిస్థితినంతా వివరించిన తరువాత, చివరకు నేను అధ్యక్షత వహించటానికి ఒప్పుకోవడం జరిగింది

మండలి వార్షిక మహాసభ దాని ప్రధాన కార్యస్థానమైన లాహోరులో జరగవలసి ఉంది మొదట ఈ సభను ఈష్టరు పండగ సందర్భంలో జరపాలనుకొన్నారు కాని తరువాత దానిని 1936 మే నెల మధ్య వరకు వాయిదా వేశారు మండలి ఆహ్వాన సంఘం ఇప్పుడు ఆ మహాసభను పూర్తిగా మానుకున్నారు అలా మానుకున్నామన్న నోటీసు నా అధ్యక్షోపన్యాసం అచ్చయిన చాల రోజులకు గాని నాకు అందలేదు ఆ ఉపన్యాసం ప్రతులు నా దగ్గరే పడి ఉన్నాయి అధ్యక్షపీఠాన్నుంచి ఉపన్యసించే అవకాశం నాకు లభించనందువల్లనూ, కులవ్యవస్థ సృష్టించిన సమస్యలపై నా అభిప్రాయాలను ప్రజలకు తెలియజేయడం కోసమూ ఎలాగూ అచ్చయిన ఉపన్యాస ప్రతులు నా వద్ద ఉండిపోయాయి గనుకనూ, వాటిని మార్కెట్టులో పెట్టడానికి నిశ్చయించాను నా ఉపన్యాసం పూర్తిపాఠం తరువాత పేజీలలో దీనితో పాటు ఉన్నది

నేను మహాసభ అధ్యక్షుడుగా ఉండడాన్ని వారు ఎందుకు రద్దుచేయవలసి వచ్చిందో తెలుసుకోడానికి ప్రజలు కుతూహల పడవచ్చు మొదట ఉపన్యాసాన్ని ముద్రించడం దగ్గరే పేచీ వచ్చింది ముద్రణ బొంబాయిలో జరగాలని నేనంటే - లాహోరులో జరగాలనీ, అక్కడయితే ఖర్చు తక్కువ అవుతుందనీ మండలి వారన్నారు నేనందుకంగీకరించక,

బొంబాయిలో ముద్రణ జరగాలని పట్టు పట్టాను ఈ నా ప్రతిపాదనను మన్నించడానికి బదులు వారు నాకొక లేఖ రాశారు మండలి సభ్యులు చాలమంది సంతకాలు చేసిన ఆ లేఖలోని ఒక భాగాన్ని ఈ క్రింద పేర్కొంటున్నాను

## పూజ్య డాక్టర్ జీ,

ఈ నెల 24వ తేదీన మీరు శ్రీయుత సంత్‌రామ్‌కు రాసిన లేఖను వారు మాకు చూపారు దానిని చదివి మేము కొద్దిగా ఆశాభంగం చెందాం బహుశా ఇక్కడ ఏర్పడి ఉన్న పరిస్థితి మీకు పూర్తిగా తెలియక పోవచ్చు మిమ్మల్ని ఈ రాష్ట్రానికి ఆహ్వానించడం పంజాబులోని హిందువులందరికీ మొత్తంమీద ఇష్టం లేదు ఈ విషయంలో జాత్‌పాత్ తోడక్ మండలి చాలా తీవ్రమైన విమర్శకు గురికావలసి వచ్చింది మొత్తంమీద ఇక్కడందరూ మమ్మల్ని అతి ఘోరంగా దుయ్యబట్టడం సాగించారు భాయి పరమానంద్ ఎం ఎల్ ఏ (హిందూ మహాసభ మాజీ అధ్యక్షుడు), మహాత్మా హన్స్‌రాజ్, డాక్టర్ గోకుల్ చంద్ నారంగ్ (స్థానిక స్వపరిపాలనశాఖ మంత్రి) రాజా నరేంద్రనాథ్ యం యల్ సి వంటి ప్రముఖులతో సహా మొత్తం హిందూ నాయకులందరూ మండలి చేపట్టిన ఈ కార్యక్రమంతో తెగతెంపులు చేసుకొన్నారు

ఇంత జరిగినప్పటికీ జాత్‌పాత్ తోడక్ మండలి కార్యకర్తలు (అందులో శ్రీయుత సంత్‌రామ్ ప్రధాన వ్యక్తి) మాత్రం మీరే అధ్యక్షులుగా ఉండాలన్న ప్రతిపాదనను మాత్రం వదులుకో దలచలేదు ఎంత ప్రతిఘటన నైనాసరే, ఎన్ని కష్టాలనైనా సరే ఎదుర్కొడానికి సంసిద్ధంగా ఉన్నారు మండలికి చాల చెడ్డ పేరు వచ్చింది

ఈ పరిస్థితులలో మండలితో సహకరించడం మీ కర్తవ్యం ఒక ప్రక్క హిందువులు ఎన్నో కష్టాలను, బాధలను కల్గిస్తూ ఉండగా మరొక ప్రక్క మీరు కూడా వారి ఇబ్బందులు పెంచడం నిజంగా వారి దురదృష్టమే కాగలదు

ఈ విషయంలో మీరు బాగా ఆలోచిస్తారని, మనందరికీ క్షేమకరంగా ఉండేవిధంగా వ్యవహరిస్తారని ఆశిస్తున్నాం "



ఈ లేఖ నన్ను చాల విభ్రాంత పరిచింది అధ్యక్షోపన్యాసాన్ని ముద్రించే విషయంలో కొద్ది రూపాయలకోసం మండలి ఎందుకు నన్ను ఇలా నిరాశ పరుస్తున్నదో నా కర్థం కాలేదు రెండోదేమంటే సర్ గోకుల్‌చంద్ నారంగ్ వంటి ప్రముఖులు నా అధ్యక్షతకు నిరసన తెలుపుతూ మండలితో తెగతెంపులు చేసుకొన్నారంటే నేను నమ్మలేకపోయాను ఎందుకంటే, సర్ గోకుల్‌చందే నాకు స్వయంగా ఈ క్రింది లేఖ వ్రాశారు

ప్రియమైన డాక్టర్ అంబేడ్కర్, 5 మౌంట్ గొమెరీ రోడ్

లాహోరు, 7-2-36

ఈస్టరు సెలవులలో లాహోరులో జరగబోయే జాత్ పాత్ తోడక్ మండలి వార్షిక మహాసభకు అధ్యక్షత వహించడానికి మీరు అంగీకరించినట్టు మండలి కార్యకర్తల ద్వారా విని నేను చాల సంతోషించాను మీరు లాహోరు వచ్చినప్పుడు నాతో మకాం చెయ్యగల్గితే నా కెంతో ఆనందంగా ఉంటుంది

ఇతర విషయాలు సముఖంలో మాట్లాడుకొన వచ్చును

భవదీయుడు

జి సి నారంగ్

నిజం ఏదైనప్పటికీ, నేను మాత్రం ఈ ఒత్తిడికి లొంగలేదు నా అధ్యక్షోపన్యాసాన్ని బొంబాయిలోనే ముద్రించాలని నేను పట్టుబడుతున్న సంగతి తెలిసి కూడా దానిని అంగీకరించక మండలి వారు నాకొక తంతి పంపారు అందులో వారు విషయాలు నాతో స్వయంగా మాట్లాడడం కోసం శ్రీ హర్ భగవాన్‌ను బొంబాయికి పంపుతున్నట్టు తెలిపారు ఏప్రియల్ 9వ తేదీని శ్రీ హర్ భగవాన్ బొంబాయి వచ్చారు ఆయన నాతో మాట్లాడినప్పుడు అధ్యక్షోపన్యాసం ముద్రణ ప్రసక్తే తేలేదు ముద్రణ బొంబాయిలో జరగాలా, లాహోరులో జరగాలా అన్న విషయం ఆయనకు అప్రధానమై నట్లు కనబడ్డారు ఆయనపడ్డతాపత్రయమంతా అధ్యక్షోపన్యాసంలోని వివరాలు తెలుసుకోవాలనే దీనిని బట్టి అధ్యక్షోపన్యాస ముద్రణ లాహోరులోనే జరగాలని మండలి పట్టుబట్టడం ఖర్చు తక్కువకోసం కాదనీ – ఉపన్యాసంలోని వివరాలు తెలుసుకోవటం కోసమే అనీ –నాకు రూఢి అయింది సరే, ఉపన్యాస ప్రతిని ఆయన కిచ్చాను అందులోని కొన్ని భాగాలపట్ల ఆయన కొంత కలవరపాటు చెందారు లాహోరు తిరిగి వెళ్లిపోయారు లాహోరునుంచి ఈ క్రింది లేఖ రాశారు

ప్రియమైన డాక్టర్ సాహెబ్, లాహోరు, 14-4-36

బొంబాయినుంచి 12వ తేదీని ఇక్కడకు చేరాను రైలు ప్రయాణంలో అయిదారు రాత్రులు వరుసగా నిద్ర లేకపోవడంవల్ల కొంచెం సుస్తీ చేసింది మీరు అమృతసర్ వచ్చినట్లు తెలిసింది ఆరోగ్యం బాగా ఉండిఉంటే అక్కడకు వచ్చి మిమ్మల్ని కలుసుకుని ఉండేవాడిని మీ ఉపన్యాసపు ప్రతిని అనువాదంకోసం శ్రీ సంత్‌రామ్‌కు అందజేశాను అది ఆయనకు ఎంతగానో నచ్చింది అయితే 25వ తేదీ లోపల ముద్రణకోసం అనువాదాన్ని సిద్ధం చేయడం తనకు అవుతుందా అని ఆయన భయపడ్డాడు ఏది ఏమైనప్పటికి దానికి అశేషమైన ప్రచారం లభించగలదు అంతేకాదు అది హిందువులను నిద్రనుంచి మేల్కొలప గలదని మా విశ్వాసం

బొంబాయిలో నేను మీకు చూపిన ఉపన్యాస భాగాన్ని ఇక్కడ కొంతమంది మిత్రులు చదివి కొద్ది భయం వ్యక్తం చేశారు మహాసభ ఎట్టి అవాంతర సంఘటనలూ లేకుండా సవ్యంగా జరిగిపోవాలని కోరుకునే నావంటి వాళ్ళు మీ ఉపన్యాసం నుంచి ప్రస్తుతానికి కనీసం "వేద"

అంతమాత్రంచేత హిందువులను, హిందూమతాన్ని వెనక వేసుకు వస్తున్న మహాత్ముడు ఓదార్పు పొందకూడదు ఇది ఎలా ఉందంటే– తనవంటి వాడే మరొక పిచ్చివాడున్నాడు కదా అని ఒక పిచ్చివాడూ, తన వంటివాడే మరొక నేరస్తుడున్నాడు కదా అని ఒక నేరస్తుడూ సంతృప్తినీ, ఓదార్పునూ పొందినట్లున్నది హిందువులు హిందూమతం, పరీక్షకు నిలవకపోవడమూ, విఫలం కావడమూ మాత్రమే నాపై ఆరోపించిన నా విసుగుకూ తిరస్కారానికీ కారణం కాదు ఈ విషయాన్ని నేను మహాత్ముడికి స్పష్టంగా చెప్పగలను ప్రపంచం ఎన్నో లోపాలతో నిండిఉన్నదనీ ప్రపంచంలో బ్రతకదలిచినవాడు దాని లోపాలన్నింటితోను సర్దుబాటు చేసుకొంటూ బ్రతకవలసి ఉన్నదని నే నెరుగుదును నేను ఏ సమాజంలో బ్రతకవలసి ఉన్నదో, ఆ సమాజం యొక్క అన్ని లోపాలనూ భరిస్తూ శ్రమ పడగలను, కాని ఏ సమాజం తప్పుడు ఆదర్శాలను ఆరాధిస్తున్నదో, ఏ సమాజం మంచి ఆదర్శాలను కలిగి ఉన్నప్పటికీ ఆ ఆదర్శాలతో సామాజిక జీవితాన్ని సమన్వయ పరచుకోడానికి అంగీకరించదో – అట్టి సమాజంలో బ్రతకడానికి నేను ఒప్పుకోను హిందువులతోనూ, హిందూమతంతోనూ నేను విసిగిపోయానంటే అందుకు కారణం వాళ్ళు తప్పుడు ఆదర్శాలను ఆరాధిస్తూ, తప్పుడు సామాజిక వ్యవస్థలో బ్రతుకుతున్నట్టు నాకు నిర్ధారణ కావడమే హిందువులతోనూ, హిందూమతంతోనూ నాకున్న వివాదం వాళ్ళ సాంఘిక ప్రవర్తనలోని లోపాలతో కాదు ఆ వివాదం ఇంకా లోతైనట్టిది ప్రాతిపదిక సూత్రాలకు సంబంధించినట్టిది నా వివాదం వాళ్ళ ఆదర్శాలతో

## XI

హిందూ సమాజం నిలవాలంటే, అది వెంటనే నైతిక పునరుజ్జీవాన్ని పొందవలసి ఉంది నైతిక పునరుజ్జీవ కార్యక్రమం ఎంత ఆలస్యమైతే అంత ప్రమాదం ఏర్పడుతుంది అయితే, ఈ పునరుజ్జీవ కార్యక్రమాన్ని నిర్ణయించేదీ, నిర్వహించేదీ ఎవరు? ఇదొక పెద్ద సమస్య తమ బుద్ధి ముందుగా పునరుజ్జీవం పొందినవాళ్ళు, తద్వారా ఏర్పడ్డ దృఢ భావాలను వెల్లడించే ధైర్యంగల నిజాయితీపరులు అయినవాళ్ళు మాత్రమే ఈ నైతిక పునరుజ్జీవ కార్యక్రమాన్ని నిర్ణయించి నిర్వహించవలసి ఉంది ఈ దృష్టితో చూచినప్పుడు, ఈనాడు పేరు ప్రఖ్యాతులలో ఉన్న హిందూ నాయకులెవ్వరూ కూడ ఇందుకు పనికిరారనే నా ఉద్దేశం నేటి హిందూ నాయకులలో ఏ ఒక్కరైనా కనీసం అట్టి బౌద్ధిక పునరుజ్జీవాన్ని పొందారనడానికి వీలులేదు వాళ్ళు బౌద్ధిక పునరుజ్జీవాన్ని ఏ మాత్రం పొంది ఉన్నా – పామర జనానీకం వలె తమను తాము భ్రమ పెట్టుకోవడం కాని, ఇతరుల అజ్ఞానాన్ని తమ స్వార్థానికి ఉపయోగించుకొని బ్రతకడానికి గాని పాల్పడి ఉండేవాళ్ళు కాదు

హిందూ సమాజం తమ కళ్ళ ముందు శిథిలమై పోతున్నప్పటికీ ఈ హిందూ నాయకులు కళ్ళు మూసుకొని సిగ్గు లేకుండా, గత కాలపు ఆదర్శాలను ఏకరువు పెడుతూ ఉన్నారు ఆ ఆదర్శాలు ఈ కాలానికి ఎందుకూ పనికిరానట్టివి అవి పుట్టిన రోజులలో ఎంత

ప్రయోజనకరంగా ఉండి ఉన్నా, ఇప్పుడు మాత్రం మార్గదర్శకంగా కంటే హెచ్చరికగా మాత్రమే మిగిలి ఉన్న ఆదర్శాలు అయినా – ఈ హిందూ నాయకులు వాటిపట్ల మూఢభక్తిని మానుకోరు వాటిని విమర్శనా దృష్టితో పరిశీలించడానికి కూడ ఒప్పుకోరు హిందూ సమాజం పునాదుల శిథిలస్థితి ఇలా ఉంది దానిపట్ల హిందూ నాయకుల పురాణ విశ్వాసాల దుస్థితి అలా ఉంది దేని విషయంలోను కూడ హిందూ ప్రజానీకం ఏమి పట్టించుకోరు అంతా కావలసినది హిందూ నాయకులకు మాత్రమే అన్నిటికంటే ఘోరం ఏమిటంటే – తమ విశ్వాసాల పట్ల ఈ నాయకులకు ఉండే దుర్మోహం వాటిని విమర్శించే వారిపట్ల దుస్తాపం తమ విశ్వాసాలను ఏ కొంచెం కూడ సడలించుకోడానికి కానీ, వాస్తవాన్ని చూడడానికి కానీ ఈ నాయకులు ఒప్పుకోరు మహాత్ముడు కూడ ఇందుకు భిన్నుడు కాదు ఈ దుర్మోహ దుస్తాపాలకు అతీతుడు కాదు

ఆలోచించడం అనేదానిలో మహాత్ముడికి విశ్వాసం ఉన్నట్టు కనిపించదు పెద్దలను అనుసరించడమే మంచి దంటాడాయన పవిత్రంగా భావించబడే ప్రాచీనమైన అభిప్రాయాల పట్ల ఆయనకు గౌరవం మెండు ఆయన కరడుగట్టిన సనాతనాచార పరుడివలె – ఆలోచనకు వ్యతిరేకి ఆలోచించడం మొదలు పెడితే తాను పట్టుకొని వ్రేలాడుతున్న అనేక లక్ష్యాలు, వ్యవస్థలు పేకమేడలవలె కూలిపోగలవని ఆయన భయం ఆయన గురించి మనం జాలిపడవలసి ఉంది

స్వతంత్రంగా ఆలోచించడం మొదలుపెడితే – ఒక్కొక్క ఆలోచన సుస్థిరంగా కనబడే ప్రపంచానికి ఏదో మూల గండాన్ని తెచ్చిపెట్టగలదు అయితే స్వతంత్రంగా ఆలోచించడాన్ని మానుకొని సెయింటుల మీద (జ్ఞానులమీద, స్వాముల మీద) ఆధారపడడం వల్ల మనకు సత్యం ఎలా గోచరిస్తుంది? సెయింట్లు కూడ మానవమాత్రులే లార్డు బాల్ఫోర్ మహాశయుడు చెప్పినట్టు "మానవుని మనస్సు పంది ముట్టెవలె ఒక సత్యాన్వేషక సాధనం మాత్రమే"

ఆయన (మహాత్ముడు) ఆలోచించడానికి పూనుకున్నా – అది సరియైన పద్ధతిలో ఆలోచించడంగా నాకు కన్పించదు పాతబడి బూజుపట్టిపోయిన హిందూ సామాజిక వ్యవస్థను సమర్థించడానికి కారణాలను వెదకడంకోసం మాత్రమే ఆయన తన ఆలోచనను వినియోగిస్తాడని నా అభిప్రాయం ఆ విధంగా ఆలోచించడం తన మేధాశక్తిని వ్యభిచరింపజేయడమే (దుర్వినియోగ పరచటమే) అవుతుంది ఈ ప్రాచీన నిర్జీవ హిందూ సమాజ వ్యవస్థను సమర్థిస్తూ సమాధానపడే మహాశయులలో మహాత్ముడు అగ్రగణ్యమైన పలుకుబడి కలవాడు ఆ విధంగా హిందువులకు ఆయన పరమ శత్రువు

మహాత్ముడి వలె గాక, నమ్మి అనుసరించడంతో మాత్రమే తృప్తి పడని హిందూ నాయకులు చాలామందే ఉన్నారు వాళ్ళు ఆలోచించడానికి సాహసిస్తారు కాని, అట్టివాళ్ళతో

ఉన్న దురదృష్టం ఏమిటంటే – ప్రజా సమూహానికి సరియైన మార్గదర్శకులు కావలసిన సందర్భాలు ఏర్పడినప్పుడు అట్టి నాయకులు నిజాయితీ హీనులుగాను, శ్రద్ధాహీనులుగాను ఉండిపోతున్నారు ప్రతి బ్రాహ్మణుడు తన కుల కట్టడిని ఉల్లంఘించినవాడే పౌరోహిత్యాన్ని, అర్చకత్వాన్ని అవలంబిస్తున్న బ్రాహ్మణులకంటె, చెప్పులు అమ్ముకొంటున్న బ్రాహ్మణులే చాలా ఎక్కువమంది వంశానుగతమైన పౌరోహిత్యాది వృత్తుల్ని విడిచిపెట్టుకొని వ్యాపారంలోకి దిగడం మాత్రమే కాక, శాస్త్ర నిషిద్ధాలయిన వృత్తులలోకి కూడ బ్రాహ్మణులు ప్రవేశించారు అయితే అడుగడుగునా, క్షణక్షణమూ తమ కుల నిబంధనలను ఉల్లంఘిస్తుండే బ్రాహ్మణులలో కులవ్యవస్థకూ, శాస్త్రాలకూ వ్యతిరేకంగా మాట్లాడగల వాళ్ళెంత మంది?

నీతి, నిజాయితీ, వాస్తవదృష్టి, నిర్మల అంతఃకరణమూ కలిగి ఉండడంవల్ల – తద్విరుద్ధమైన కులవ్యవస్థనూ, శాస్త్రాలనూ ఖండించగల సద్బ్రాహ్మణుడొకడుంటే, అందుకు ప్రతిగా – ప్రతిరోజూ కులాన్ని ధిక్కరిస్తూ, శాస్త్రాలను కాలరాస్తూ ఉండికూడ, కులవ్యవస్థనూ శాస్త్రాలనూ ఎలుగెత్తిచాటే ఉన్మాదులైన బ్రాహ్మణులు వందలకొలది ఉన్నారు ఈ కపట నాటకం ఎందుకు? ఈ ధూర్తత్వం ఎందుకు? ఎందుకంటే – ప్రజాసామాన్యం కుల వ్యవస్థ అనే దుష్టభారం నుంచి విమోచన పొందితే, అప్పుడు మొత్తం తమ కులం యొక్క అధికార ప్రతిష్ఠలకే గొడ్డలిపెట్టు కాగలదని బ్రాహ్మణులు భావించడం వల్ల అశేష ప్రజానీకాన్ని ఆలోచనా హీనుల్ని చేసి తమ ఆలోచనా ఫలితాలను వారికి దక్కకుండా చేస్తున్న ఈ మేధావివర్గం (బ్రాహ్మణ కులం) యొక్క బేనిజాయితీ (దగాకోరుతనం) నిజంగా లోకంలోనే అపూర్వమైన ఒక లజ్జావిహీన విచిత్ర సృష్టి

మాత్యూ ఆర్నాల్డ్ చెప్పినట్టు, హిందువులు రెండు లోకాల మధ్య అల్లాడుతున్న ఒక విచిత్ర జాతి ఆ లోకాలలో ఒకటి చచ్చిపోయినట్టిది రెండోది పుట్టడానికి శక్తి లేనట్టిది పాపం వాళ్ళేమి చేయగలరు? ఎవరు దారి చూపగలరు!

దారి చూపడం కోసం వాళ్ళు (హిందువులు) ఆశ్రయించిన మహాత్ముడికి ఆలోచించడంలో నమ్మకం లేదు కాగా – అనుభవయోగ్యమైన సలహా సహాయాలకు ఆయన పనికిరాడు ప్రజానీకం సహజంగా ఏ మేధావి వర్గం నుంచి వెలుగును ఆశిస్తుందో, ఆ మేధావివర్గం పూర్తిగా దగాకోరులుగా అయినా ఉంటున్నారు, లేదా ప్రజానీకాన్ని సరైన పద్ధతిలో విద్యావంతుల్ని చేయడంలో నిరర్థకులైన నిరపేక్షకులుగా అయినా వుంటున్నారు నిజంగా మనం ఈనాడు ఒక ఘోరమైన విషాద చరిత్రకు సాక్షీభూతంగా ఉంటున్నాం ఈ మహా విషాద పరిభూతి సమ్ముఖంలో ఏడవడం కంటే, "ఓ హిందువులారా! వీళ్ళా మీ నాయకులు!" అంటూ మొత్తుకోవడం కంటే ఎవరు ఏమి చేయగలరు?

అనువాదం : డాక్టర్ బోయి భీమన్న

# 3

# భాషా ప్రయుక్త రాష్ట్రంగా మహారాష్ట్ర

భాషా ప్రయుక్త రాష్ట్రాల కమిషన్‌కు
సమర్పించిన పత్రం

ప్రచురణ : 1948

# గమనిక

ఈ పత్రంలో ఉదహరించిన అంకెలను , భాషా ప్రాతిపదికన మహారాష్ట్రను పునర్నిర్మించాలన్న అంశంపై వివిధ రచయితలు ప్రకటించిన వివిధ గ్రంధాలనుండీ, కరపత్రాలనుండీ స్వీకరించడం జరిగింది ఆ అంకెలు సరైనవేనని నేనా రచయితలపై పూర్తిగా ఆధారపడ్డాను అయితే ఈ పత్రంతో పాటు జతపరచిన మహారాష్ట్ర పటాన్ని సరియైనదనిగానీ, సంపూర్ణమైనదనిగానీ భావించనక్కరలేదు మహారాష్ట్రను భాషా ప్రాతిపదికన పునర్నిర్మిస్తే ఎలా వుంటుందో తెలియజెప్పడమే దాని ఉద్దేశం

బి ఆర్ అంబేడ్కర్

14 10 1948

# భాషా ప్రయుక్త రాష్ట్రంగా మహారాష్ట్ర

## ఒకటవ భాగం

## భాషా ప్రయుక్త రాష్ట్రాల సమస్య :

పార్టీల పక్షపాత ధోరణుల కారణంగానూ, పార్టీల ప్రయోజనాల కారణంగానూ భాషా ప్రయుక్త రాష్ట్రాల సమస్య ప్రబల వివాదానికి దారితీసింది అంతేకాకుండా వాటియేర్పాటుకు ఉండవలసిన అర్హతలపై గూడా అభిప్రాయ భేదాలు పొడసూపాయి ఇరుగుపొరుగు ప్రాంతాలలో చేరివున్న భూ భాగాల చేర్పులు, ఆ విధంగా చేర్చటానికి సంబంధించిన నిబంధనలు ఈ వివాదాలలోని అంశాలు

మహారాష్ట్ర ఏర్పాటుకు సంబంధించినంతవరకూ ఈ వివాదాంశాలను నేను తరువాత చర్చిస్తాను ముందుగా భాషా ప్రయుక్త రాష్ట్రాల ప్రతిపాదనలో గల యోగ్యతల గూర్చి చర్చిస్తాను

## భాషా ప్రయుక్త రాష్ట్రాల కోరిక వెనుక వున్న ప్రయోజనాలు :

2) భాషా ప్రయుక్త రాష్ట్రాలను కోరడంలో గల ప్రయోజనాలేమిటి? రాష్ట్రాలలో వివిధ భాషలూ, వివిధ సంస్కృతులూ వున్నాయనీ, వాటిని పూర్తిగా అభివృద్ధి చేసుకోటానికి ఎక్కువ అవకాశాలు కల్పించాలనీ భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణవాదులలో అధిక సంఖ్యాకులు విశ్వసిస్తున్నారు అంటే - ప్రత్యేక జాతీయతా లక్షణాలు రాష్ట్రాలకున్నాయనీ, ఆ జాతీయతను పూర్తిగా అభివృద్ధి చేసుకోడానికి తగిన స్వేచ్ఛ రాష్ట్రాలకు వుండాలనీ దాని అర్థం

## భాషా ప్రయుక్త రాష్ట్రాల వల్ల కలిగే యిబ్బందులు :

3) భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు సమస్యను చర్చించేటప్పుడు మనమొక వాస్తవాన్ని దృష్టిలో ఉంచుకోవాలి భవిష్యత్తులో ఏర్పరచబోయే భారత ప్రభుత్వ వ్యవస్థ ద్వంద్వ స్వరూపాన్ని కలిగి వుంటుందనే విషయాన్ని విస్మరించకూడదు తమ తమ శాసన, కార్య నిర్వాహక, పరిపాలనా విధులను నిర్వహించడంలో 1 కేంద్ర ప్రభుత్వం, 2 అనేక రాష్ట్ర ప్రభుత్వాలు ఒక దానితో ఒకటి విడదీయ లేనంతగా ముడిపడి మిళితమై వుంటాయి భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటునుకోరే ఎవరైనా సరే ముందుగా ఆ ఏర్పాటు, కేంద్ర ప్రభుత్వపు పనితీరుపై ఎలాంటి ప్రభావాన్ని కలుగజేస్తుంది? అనే అంశాన్ని పరిగణనలోనికి తీసుకోవాలి. అలా కలుగుతాయని ఊహించే అనేక ఫలితాలలో ఈ క్రిందివి స్పష్టంగా కనిపిస్తాయి :

4 (I) తమ తమ జాతి, భాష, సాహిత్యాల పట్ల స్వాభిమానం గలిగిన జన సమూహాలు ఎన్నయితే ఉన్నాయో- అన్ని దేశాల సృష్టికి భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు దారి తీస్తుంది అప్పుడు కేంద్ర ప్రభుత్వం నానాజాతి సమితి అవుతుంది గదా! అప్పుడు తమ సంస్కృతి, తద్వారా తమ ప్రయోజనాలు వేరు అని భావించే పటిష్ఠ ప్రత్యేక దేశాల సమావేశంగా, కేంద్ర కార్యనిర్వాహక వర్గం తయారు అవవచ్చు అలాంటి దేశాలు రాజకీయ అవిధేయతా మనస్తత్వాన్ని పెంపుచేసుకోవచ్చు అంటే, మెజారిటీకి తల వొగ్గేందుకు తిరస్కరించడమో- లేదా సభా నిష్క్రమణ చేసే మనస్తత్వాన్ని పెంపొందించుకోవడమో జరగవచ్చు అలాంటి మనస్తత్వమే కనుక పెరిగినట్లయితే కేంద్ర ప్రభుత్వం పనిచేయటం కష్ట సాధ్యమవుతుంది అలాంటి మనస్తత్వం పెరగదు అని చెప్పడానికి వీలులేదు గదా!

(II) భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు, కేంద్ర ప్రభుత్వ, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య అవసరమైన పాలనా సంబంధాల నిర్వహణకు ప్రాణాంతక మవుతుంది ప్రతి రాష్ట్రం తన భాషను అధికారిక భాషగా అమలుచేసి నట్లయితే, అప్పుడు కేంద్ర ప్రభుత్వం ఎన్ని భాషా ప్రయుక్త రాష్ట్రాలైతే ఉన్నాయో అన్ని భాషలలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపవలసి వస్తుంది అది సాధ్యంకాని పని అని అంగీకరించి తీరాలి ప్రభుత్వ యంత్రాంగం పనితీరులో భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఎంత ప్రతిష్ఠంభన కలిగిస్తాయో, న్యాయ వ్యవస్థపై భాషా ప్రయుక్త రాష్ట్రాల ప్రభావాన్ని అధ్యయనం చేస్తే బాగా అర్థమవుతుంది కొత్తగా మనం ఏర్పరచుకోబోయే వ్యవస్థలో ప్రతి రాష్ట్రం ఒక హైకోర్టును కలిగి వుంటుంది దాని క్రింద వరుసగా అనే అధీన న్యాయ స్థానాలు ఉంటాయి వీటన్నింటికీ పైన హైకోర్టు నిర్ణయాలకు వ్యతిరేకంగా వచ్చే అప్పీళ్లను విచారించే హక్కుగల సుప్రీంకోర్టు ఉంటుంది భాషా ప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికపై ప్రతి రాష్ట్రంలోనూ హైకోర్టుతో సహా తక్కిన న్యాయస్థానాలన్నీ తమ కార్యకలాపాలను ఆ రాష్ట్ర భాషలోనే నిర్వహిస్తాయి ఏదైనా ఒక రాష్ట్ర హైకోర్టు చేసిన

తప్పులను సరిదిద్దవలసి వస్తే అప్పుడు సుప్రీంకోర్టు ఏం చేస్తుంది? సుప్రీంకోర్టులలో వున్న ప్రతి న్యాయమూర్తి (ప్రస్తుతానికి న్యాయవాదుల సంగతిని అలా ప్రక్కన పెడుతున్నాను) ప్రతి రాష్ట్ర భాషనూ తప్పని సరిగా తెలుసుకొని ఉండాలి గదా! అది అసాధ్యమైన పని అందువల్ల సుప్రీంకోర్టు పనిచేయలేని పరిస్థితి ఏర్పడుతుంది

అటువంటి పరిస్థితిని ఎవరూ సమదృష్టితో ఊహించలేరు అటువంటి పరిస్థితే తల ఎత్తితే అది భారతదేశ ఐక్యతకు బదులు దాని విచ్ఛిన్నతకు దారి తీయవచ్చు అప్పుడు భారతదేశం కూడా ఐరోపా మాదిరిగా అస్థిరత, అల్లకల్లోలాలను ఎదుర్కోవలసి రావచ్చు

## భాషా ప్రయుక్త రాష్ట్రాల వల్ల కలిగే లాభాలు

5) భాషా ప్రయుక్త రాష్ట్రాల ప్రతిపాదన భారతదేశ ఐక్యతనే దెబ్బతీయగలదేమో అన్నంతటి మూల సమస్యను సృష్టించే మాట నిజమే అయినా, భాష ప్రాతిపదికగా రాష్ట్రాల పునర్నిర్మాణం, ఖచ్చితంగా కొన్ని రాజకీయ ప్రయోజనాలను చేకూర్చుతుందని అనడంలో సందేహం లేదు

6) భాషా ప్రాతిపదిక రాష్ట్రాల పథకంలో నాకు ప్రముఖంగా కనిపిస్తున్న ప్రయోజన మేమిటంటే మిశ్రమ రాష్ట్రాల్లో కంటే, భాషా ప్రాతిపదిక రాష్ట్రాల్లో ప్రజాస్వామ్యం మరింత మెరుగ్గా పనిచేయగలగడం అని ప్రజాస్వామ్యానికి అవసరమైన సామాజిక జాతీయతను భాషా ప్రాతిపదిక రాష్ట్రాలు సృష్టిస్తాయి ఇప్పుడు ప్రజల సజాతీయత అంటే - తమంతా ఒకే సంతతికి చెందిన వారమన్న విశ్వాసమూ, ఉమ్మడి భాషా సాహిత్యాలను కలిగివున్నామన్న భావన, ఉమ్మడి చారిత్రక పారంపర్యత సామాజిక కట్టుబాట్లు కలిగివుండటం పట్ల గల అభిమానమూ- వీటిపై ఆధారపడి వుంది ఈ అంశాన్ని ఏ సామాజిక శాస్త్రవేత్తా కాదనలేడు సామాజిక సాజాత్యత లోపించడం, ఏ రాష్ట్రంలోనైనా- ముఖ్యంగా ప్రజాస్వామ్య వ్యవస్థపై నిర్మితమైన ఏ రాష్ట్రంలోనైనా- ప్రమాదకర పరిస్థితిని సృష్టిస్తుంది ప్రజల్లో సాజాత్యతా భావం లేని రాష్ట్రంలో ప్రజాస్వామ్యం పని చేయలేదని చరిత్ర చెప్తున్నది సజాతీయతా భావం లేని ప్రజలు ఒకరి పట్ల మరొకరు సామాజిక వ్యతిరేకతనూ, ద్వేషభావాన్నీ కలిగిన శ్రేణులుగా విడిపోతారు అటువంటి సమాజంలో ప్రజాస్వామ్యం ఎలా పనిచేస్తుంది? పక్షపాతం, నిర్లక్ష్యం, వివక్షతలకు దారి తీసే పరిస్థితులు ఏర్పడి రాజకీయ అధికారాన్ని హస్తగతం చేసుకోవడానికి ఒక వర్గం చేతిలో మరొక వర్గపు ప్రయోజనాలు అణిచివేయబడడం జరుగుతుంది సజాతీయతా భావం లేని సమాజంలో ప్రజాస్వామ్యం విజయవంతం కాలేక పోవడానికి కారణమేమిటంటే - ఆ సమాజంలో అధికారం అనేది అందరి ప్రయోజనాలనూ దృష్టిలో ఉంచుకొని నిష్పక్షపాతంగా యోగ్యతలను బట్టి ఉపయోగించబడకుండా, ఒక వర్గ ప్రయోజనాలకు ప్రతికూలంగానూ మరొక వర్గ అధికార దాహానికి అనుకూలంగానూ **ఉపయోగించబడడమే! ఇందుకు భిన్నంగా సజాతీయత కలిగిన ప్రజలు ఉన్న రాష్ట్రం**

నిజమైన ప్రజాస్వామ్య లక్ష్యాల కోసం పాటుపడ గలుగుతుంది ఎందుకంటే, అటువంటి రాష్ట్రంలో రాజకీయ అధికారం దుర్వినియోగానికి దారి తీసే కృత్రిమమైన అడ్డుగోడలు కాని, సామాజిక వైషమ్యాలు కాని ఉండవు

7) ప్రజాస్వామ్యం సక్రమంగా పని చేయాలంటే రాష్ట్రంలోని ప్రజలు సజాతీయతా భావం కలిగిన రాష్ట్ర పౌరులుగా ఉండేటట్లు చూడాలి భారత రాష్ట్రాలకు త్వరలో వర్తించబోతున్న రాజ్యాంగం, ప్రజాస్వామ్య ప్రభుత్వ వ్యవస్థకు అనుగుణంగా రూపొందుతున్నది అంటే రాష్ట్రాలలో ప్రజాస్వామ్యం విజయవంతం కావాలంటే ప్రతి రాష్ట్రమూ జనాభా పరంగా సజాతీయత కలిగినదై ఉండి తీరాలి ప్రజాస్వామ్యయుత రాజ్యాంగంలో చక్కగా ఇమిడి పోయేటట్లుగా ప్రతి రాష్ట్రమూ ఉండాలీ అంటే అదితప్పని సరిగా భాషా ప్రయుక్త రాష్ట్రమై ఉండి తీరాలి, అని చెప్పటానికి ఇది మరోపద్ధతి భాషా ప్రయుక్త రాష్ట్రాల సమర్థన ఇందులోనే ఇమిడి ఉంది

## భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటును వాయిదా వేయవచ్చా ?

8 ఈ సమస్యకు గల పరిష్కారాన్ని వాయిదా వేయవచ్చా? ఈ ప్రశ్నకు సంబంధించి ఈ క్రింది అంశాలను నేను కమీషన్ ముందు ఉంచదలుచుకొన్నాను

(I) భాషా ప్రయుక్త రాష్ట్రాలు కావాలని కోరడంలో కొత్త ఏమీ లేదు ఇప్పటికే ఆరు రాష్ట్రాలు, అంటే (1) తూర్పు పంజాబ్ (2) యునైటెడ్ ప్రావిన్స్, (3) బీహార్ (4) పశ్చిమ బెంగాల్, (5) అస్సాం, (6) ఒరిస్సా భాషా ప్రాతిపదిక రాష్ట్రాలుగా ఉన్నాయి (1) బొంబాయి (2) మద్రాసు, (3) సెంట్రల్ ప్రావిన్స్ భాషా ప్రాతిపదికన పునర్నిర్మాణం కావాలని ఘోష పెడుతున్నాయి ఆరు రాష్ట్రాల విషయంలో భాషా ప్రాతిపదిక సూత్రాన్ని అంగీకరించినప్పుడు, అదే సూత్రాన్ని తమకు కూడా వర్తింప చేయాలని కోరుతున్న రాష్ట్రాలను అనిశ్చితంగా వేచి వుండవలసిందిగా కోరడం బాగుండదు

(II) తమకు భాషా ప్రయుక్త రాష్ట్రాలు కావాలని కోరుతున్న రాష్ట్రాలలో పరిస్థితి, ప్రమాదకరంగా కాక పోయినప్పటికీ, ఉద్రేక స్థాయికి చేరుకుంది ఒకనాటి ప్రాచీన టర్కీ సామ్రాజ్యంలోనూ ఆస్ట్రో – హంగేరియన్ సామ్రాజ్యంలోనూ ఉన్నటువంటి పరిస్థితులకు ఎంత మాత్రం భిన్నం కానటువంటి పరిస్థితి ఈ రాష్ట్రాల్లో ఉంది

(III) ప్రాచీన టర్కీ సామ్రాజ్యం లేదా ఆస్ట్రో – హంగేరియన్ సామ్రాజ్యం తునాతునక లవడానికి కారణమైన విస్ఫోటన శక్తి లక్షణం ఈ భాషా ప్రయుక్త రాష్ట్రాల కోరికలో గూడా ఉంది విస్ఫోటన దశను అందుకోక ముందే ఆ కోరికను తీర్చడం మంచిది అంత వేడెక్కితే ఆర్పడం కష్టం

(IV) నిర్మాణరీత్యా రాష్ట్రాలు ప్రజాస్వామ్య యుతాలు కానంత వరకు నూతన

రాజ్యాంగం ప్రసాదించబోయే విస్తృత సార్వభౌమాధికారాలు రాష్ట్రాలకు లేనంత వరకూ - భాషా ప్రయుక్త రాష్ట్రాల అవసరం అంతగా లేకపోయింది కాని నూతన రాజ్యాంగం వచ్చిన తరువాత మాత్రం భాషా ప్రయుక్త రాష్ట్రాల సమస్య తక్షణ సమస్య అయింది

## దీనిలోని కష్టాలకు పరిష్కారాలు :

9) భాషా ప్రయుక్త రాష్ట్రాల సమస్యను వెంటనే పరిష్కరించాలంటే మార్గమేమిటి? ఇంతకుముందే చెప్పినట్లుగా, సమస్యను పరిష్కరించేందుకు సూచించే ఏ మార్గమైనా రెండు షరతులకు తప్పని సరిగా లోబడి ఉండాలి

(i) భాషా ప్రాతిపదికపై రాష్ట్రాల ఏర్పాటు సూత్రానికి అంగీకరిస్తే అది భారత దేశ సమైక్యతా విచ్ఛిన్నతకు దోహదకారి కావచ్చు అందువల్ల ఈ సమస్యకు నేను సూచించే పరిష్కారం ఇది భాషా ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్నిర్మాణం అన్న డిమాండ్‌ను రాజ్యాంగం అంగీకరించాలి అదే సమయంలో ప్రతి రాష్ట్రపు అధికారిక భాష, కేంద్ర ప్రభుత్వ అధికారిక భాష ఒకటే అయ్యేటట్లు చూడాలి ఈ ప్రాతిపదికపైన మాత్రమే నేను భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు కోరికను అంగీకరించేందుకు సిద్ధంగా ఉన్నాను

10) నా ఈ ప్రతిపాదన ప్రస్తుతం ప్రచారంలో ఉన్న భాషా ప్రయుక్త రాష్ట్రాల భావనకు వ్యతిరేకంగా ఉంటుందన్న వాస్తవాన్ని గూడా నేను ఎరుగుదును ఒక రాష్ట్ర భాష దాని అధికార భాష కావడం సహజమే! అయితే కేంద్ర అధికారిక భాషకు రాష్ట్రభాష భిన్నమైనప్పుడు ఆ రాష్ట్ర భాషను ఆ రాష్ట్రానికి అధికార భాషగా చేయడం పట్ల మాత్రం నాకు తీవ్ర అభ్యంతరం ఉంది నా అభ్యంతరానికి ఆధారాలు ఇవి-

(i) భాషా ప్రయుక్త రాష్ట్రాన్ని కలిగి ఉండాలన్న ఆలోచనకూ దాని అధికారిక భాష ఏదైనా ఉండాలన్న ప్రశ్నకూ ఎటువంటి సంబంధమూ ఏదు భాషా ప్రయుక్త రాష్ట్రం అంటే నా అర్థం సామాజిక కూర్పు విషయంలో సజాతీయత కలిగిన జనాభాగల రాష్ట్రం అని అందువల్ల ప్రజాస్వామ్య ప్రభుత్వం పరిపూర్తి చేయగల సామాజిక అవసరాల సిద్ధికి అది మరింత దోహదకారిగా ఉంటుందనేది నా ఉద్దేశం నా ఉద్దేశంలో భాషా ప్రయుక్త రాష్ట్రానికి ఆ రాష్ట్ర భాషకు ఎటువంటి సబంధమూ లేదు భాషా ప్రయుక్త రాష్ట్రాల పథకంలో భాషకు తగిన పాత్ర తప్పని సరిగా ఉంటుంది అయితే ఆ పాత్ర, రాష్ట్ర ఏర్పాటు- అంటే రాష్ట్ర సరిహద్దుల నిర్ణయం వరకు- మాత్రమే పరిమితమై ఉంటుంది ఒక రాష్ట్రానికి సంబంధించిన భాషను దాని అధికార భాషగా చేసి తీరాలి అని ఒత్తిడి తెచ్చే నిర్దిష్టమైన సూత్రమేదీ భాషా ప్రయుక్త రాష్ట్రాల పథకంలోలేదు రాష్ట్ర సాంస్కృతిక ఐక్యతను కాపాడటానికి ఆ రాష్ట్ర భాషను దాని అధికార భాషగా చేయాల్సిన అవసరం కూడా లేదు ఎందుకంటే, అప్పటికే ఉన్న రాష్ట్ర సాంస్కృతిక ఐక్యత అనేది భాషకన్నా గూడా, ఉమ్మడి చారిత్రక సంప్రదాయాలపైనా

సామాజిక కట్టుబాట్లు, ఆచారాలు మొదలయిన అనేక ఇతర కారకాలపైనా ఆధారపడి, తన మనుగడను సాగించగలదు కాబట్టి అప్పటికే ఆచరణలో ఉన్న రాష్ట్ర సాంస్కృతిక ఐక్యతను నిలబెట్టడం కోసం ఆ రాష్ట్ర భాషను అధికారిక అవసరాల కోసం ఉపయోగించాల్సిన అవసరం లేదు మహారాష్ట్రీయుడు ఇతరమైన మరే భాషో మాట్లాడినందువల్ల అతడు మహారాష్ట్రీయుడు కాకుండా పోతాడేమోనన్న భయం, అదృష్టవశాత్తు భాషా ప్రయుక్త రాష్ట్ర వాదులకు లేదు అదేవిధంగా తన మాతృభాష కాకుండా మరే ఇతర భాషనో ఆంధ్రుడు గానీ తమిళుడు గానీ బెంగాలీగానీ మాట్లాడినట్లయితే, అతడు ఆంధ్రుడూ తమిళుడూ బెంగాలీ కాకుండా పోతాడేమోనన్న భయం కూడా లేదు గదా!

(II) రాష్ట్రాలను ప్రత్యేక దేశాలుగా మార్చాలన్న ఉద్దేశం తమకే మాత్రం లేదని భాషా ప్రయుక్త రాష్ట్రాల సంపూర్ణ మద్దతుదారులు స్పష్టం చేస్తారనడంలో సందేహం లేదు వారి నిజాయితీని శంకించాల్సిన పని కూడా లేదు అయితే అదే సమయంలో మన మొక విషయాన్ని గుర్తుంచుకోవాలి అనుకున్నది ఒకటి అయ్యే దొకటి గూడా ఉంటుందొకొకప్పుడు ఆ కారణంగా, ముందు ముందు దుష్పరిణామాలు తలెత్తకుండా నివారించేందుకు గాను అవసరమైన ప్రతి చర్యనూ ప్రారంభంనుండీ తీసుకోవడం తప్పనిసరి అందువల్ల, ఒక దిశలో వెసులుబాటు కల్పిస్తూ దానితో పాటుగా మరొక దిశలో బిగించడం ఏ మాత్రం తప్పుకాదు

(III) ఒక రాష్ట్ర భాష దాని అధికార భాష కావడం సహజమే అయినప్పటికీ, ఆ రాష్ట్ర భాష దాని అధికార భాష కావడాన్ని మనం అనుమతించకూడదు భాషా ప్రయుక్త రాష్ట్రాలను సృష్టించడంలో ఎటువంటి ప్రమాదం లేదు ప్రమాదం ఎక్కడుందీ అంటే, ప్రతి రాష్ట్ర భాషనూ ఆ రాష్ట్రపు అధికార భాషగా చేస్తూ భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పరచడంలోనే రాష్ట్ర భాషను అధికార భాషగా చేస్తూ భాషా ప్రయుక్త రాష్ట్రాలను సృష్టిస్తే అది ప్రాంత పరిమితంగా తయారయ్యే స్వతంత్ర రాజ్యాల సృష్టికి దారి తీస్తుంది ఎందుకంటే, రాష్ట్ర భాషలనే అధికార భాషలుగా ఉపయోగించడం వల్ల ప్రాంతీయ సంస్కృతులు వేరు పడి కేంద్రీకృతమై కరుడు గట్టి ఘనీభవించిన సంస్కృతులుగా మారడానికి దారి తీస్తుంది దీనిని అనుమతించడం జరిగితే అది ప్రాణాంతకమౌతుంది అలా అనుమతిస్తే, రాష్ట్రాలు విడి విడి స్వతంత్ర దేశాలుగా మారడానికి అనుమతించడమే అవుతుంది ఆ విధంగా భారత ఐక్యత నాశనమవడానికి దారి తెరచినట్లవుతుంది భాష ప్రయుక్త రాష్ట్రాలలో రాష్ట్రభాషను అధికార భాషగా చేయకుండా ఉన్నప్పుడే ప్రాంతీయ సంస్కృతులు సరళంగా ఉండి ఇచ్చి పుచ్చుకునే వైఖరికి మార్గం ఉంటుంది అందువల్ల రాష్ట్ర భాషలను అధికార భాషలుగా చేసుకోవడానికి భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఎట్టి పరిస్థితులలోనూ మనం అనుమతించకూడదు

11) కేంద్ర అధికార భాషను ఒక భాషా ప్రయుక్త రాష్ట్రంపై అమలు పరచడం వల్ల ఒకవేళ అది ఆ రాష్ట్ర భాషకు భిన్నమైనది అయినప్పటికీ ఆ రాష్ట్ర సంస్కృతి మనుగడకు

అవరోధం కాబోదు. అధికార భాష ప్రభుత్వరంగానికి మాత్రమే పరిమితమవుతుంది ప్రభుత్వేతర రంగంలో – ముఖ్యంగా సాంస్కృతిక రంగంలో రాష్ట్ర భాష తన పాత్రను నిర్వహించడానికి సమర్థంగానే వుంటుంది అక్కడ అధికార భాషకూ ప్రాంతీయ భాషకూ ఆరోగ్యకరమైన పోటీ ఉండవచ్చు ఒక దానిని మరొకటి తోసి వేయడానికి ప్రయత్నించనూ వచ్చు అధికార భాష సాంస్కృతిక రంగంలో ప్రాంతీయ భాషను తోసి వేయడమే గనక జరిగితే అంతకన్నా కావల్సిందేముంది ఒక వేళ అలా జరగకపోయినా పెద్దగా వాటిల్లే నష్టమేమీ ఉండదు అటువంటి పరిస్థితి దుర్భరమైనదని చెప్పడానికి వీలులేదు రాష్ట్రంలోని భాష అనధికార భాషగాను ఇంగ్లీషు భాష అధికార భాషగాను ఉన్న ప్రస్తుత పరిస్థితి కంటే అదేమంత దుర్భరమైనది కాదు వచ్చే ఒక్క తేడా ఎక్కడంటే అధికార భాషగా ఇంగ్లీషు ఉండదు మరొక భాష ఉంటుంది

## సంతృప్తికర పరిష్కారానికి అవసరమైనవి :

12 నేను సూచించిన ఈ పరిష్కారం ఆదర్శవంతమైన పరిష్కారం కాదన్న సంగతి మీకు తెలుసు ఇది రాష్ట్రాలలో రాజ్యాంగాన్ని ప్రజాస్వామ్య మార్గంలో పనిచేసేటట్లు చేయ గలుగుతుంది కాని కేంద్రంలో రాజ్యాంగం ప్రజాస్వామ్యయుతంగా పని చేసేటట్టు చేయలేదు ఎందుకంటే, కేవలం భాషా పరమైన ఐక్యత అంటే ఒకే భాషలో మాట్లాడగలిగే సదుపాయం ఉన్నంత మాత్రాన ఏకజాతి భావం సిద్ధించదు అది అనేక ఇతర కారకాల ఫలితంగా సిద్ధిస్తుంది కేంద్ర శాసన సభకు, రాష్ట్రాలు ఎంపిక చేసిన ప్రతినిధులు, తమ మాతృభాషను కాకుండా కేంద్ర అధికార భాషనే మాట్లాడుతున్నప్పటికీ, వారంతా పూర్వం లాగానే బెంగాలీలుగానో, తమిళులుగానో, ఆంధ్రులుగానో, మహారాష్ట్రులుగానో, మాత్రమే ఉండిపోతారు ఇంతకు మించి వెంటనే ఆచరించగల పరిష్కార మింకొకటి నాకు కనిపించడం లేదు అందువల్ల ఈ ద్వితీయోత్తమ పరిష్కారంతోనే మనం సంతృప్తి పడాలి అలా మనం తక్షణమే చేపట్టగల పరిష్కారం ఈ దిగువ పేర్కొన్న రెండు నియమాలకు అనుగుణంగా ఉంటుందన్న నమ్మకం మనకు ఉండి తీరాలి

1) ఆదర్శవంతమైన పరిష్కారానికి అది అతి దగ్గరదై ఉండాలి

2) తనంతట తానుగా అది ఆదర్శ పరిష్కారంగా అభివృద్ధి చెందగలిగేదై ఉండాలి

పై అంశాల వెలుగులో, నేను సూచించిన పరిష్కారం ఈ రెండు నియమాలకు అనుగుణంగానే ఉంటుందని చెప్పటానికి సాహసిస్తున్నాను

## రెండో భాగం

# మహారాష్ట్ర స్వయం పోషక రాష్ట్రం కాగలదా ?

## స్వయం పోషకత ప్రమాణాలు

13) ప్రత్యేకించి మహారాష్ట్ర సమస్యను ఇప్పుడు పరిశీలిద్దాం ప్రత్యేక రాష్ట్రంగా మహారాష్ట్ర స్వయం పోషక రాష్ట్రం కాగలుగుతుందన్న నమ్మకం మనకు కలిగి తీరాలి ఏదైనా ఒక రాష్ట్రం స్వయం పోషక రాష్ట్రమని చెప్పడానికి అది కొన్ని లక్షణాలను కలిగి ఉండాలి తగినంత విస్తీర్ణాన్నీ, తగినంత సంఖ్యలో జనాభానూ అందుకు సరిపడే శిస్తు ఆదాయాన్నీ అది కలిగి ఉండాలి అది స్వయం సహాయకమైనదై వుంటే చాలదు, కనిష్ఠ స్థాయిలో ఉండాలని నిర్ణయించుకున్నట్లయితే ఏ రాష్ట్రమైనా స్వయంపోషకమైనదే అవుతుంది అలా కాకుండా అది రాష్ట్ర ప్రజల సాంఘిక సంక్షేమ అవసరాలను తీర్చగలిగేదిగానూ, కనీస ప్రమాణాలు గల సమర్థవంతమైన పాలనను అందించడానికి సరిపడే శిస్తు ఆదాయాన్ని కలిగినదిగానూ ఉండాలి

## మహారాష్ట్ర స్వయం పోషకమైనదా?

14) మహారాష్ట్ర ఈ లక్షణాలన్నిటినీ కలిగి ఉన్నదా? భాషా ప్రాతిపదికపై మహారాష్ట్రను ఏర్పాటు చేస్తే దాని జనాభా, విస్తీర్ణం ఎంత ఉంటుందో ఈ క్రింది సంఖ్యలు తెలియ చేస్తాయి

| భూభాగం | చదరపు మైళ్ళలో విస్తీర్ణం | మొత్తం జనాభా | మరాఠీ మాట్లాడే ప్రజల సంఖ్య | మొత్తం జనాభాలో మరాఠీ మాట్లాడే వారిశాతం |
|---|---|---|---|---|
| బొంబాయి ప్రెసిడెన్సీ లోని 12 జిల్లాలు | 47,284 | 1,29,13,544 | 1,00,45,100 | 77 8 |
| సెంట్రల్ ప్రావెన్స్ బేరార్‌లోని 8 జిల్లాలు | 36,865 | 70,20,694 | 53,88,300 | 76 7 |
| మొత్తం | 84,151 | 1,99,34,238 | 1,54,33,400 | 77 4 |
| బొంబాయి ప్రెసిడెన్సీ లోని రాష్ట్రాలు | 11,314 | 27,20,207 | 21,20,700 | 77 9 |

| | | | | |
|---|---|---|---|---|
| హైదరాబాద్ రాష్ట్రంలోని మరాఠీ మాట్లాడే జిల్లాలు | 22,766 | 42,49,272 | 32,99,300 | 77 6 |
| గోవా | 1,534 | 5,80,000 | 5,20,000 | 89 6 |
| బస్తర్ రాష్ట్రం | 13,701 | 6,33,888 | 2,12,300 | 33 5 |
| మొత్తం | 49,315 | 81,83,367 | 61,42,300 | |
| వెరసి మొత్తం | 1,33,466 | 2,81,17,605 | 2,15,85,700 | 76 8 |

## మహారాష్ట్ర విస్తీర్ణం – జనాభా :

15) పైన పేర్కొన్న పట్టిక మహారాష్ట్ర జనాభాకూ విస్తీర్ణానికీ సంబంధించిన సంఖ్యలను రెండు రూపాల్లో తెలుపుతున్నది (1) సంక్షిప్త రూపం (2) విస్తృతరూపం అసంక్షిప్త రూపంలో ఇచ్చిన సంఖ్యలను బట్టి - అంటే మరాఠీ మాట్లాడే ప్రజలు ఉన్న ప్రాంతాలను ఒక రాష్ట్రంగా ఏర్పాటు చేసి నట్లయితే - అప్పుడు మహారాష్ట్ర విస్తీర్ణం 1,33,466 చదరపు మైళ్ళుగా ఉంటుంది జనాభా 2,15,85,700 అంకెలను పరిగణనలోకి తీసుకుంటే అంటే ఇతర రాష్ట్రాలలో మరాఠీ మాట్లాడే ప్రజలనూ వారు నివసించే ప్రాంతాలనూ వదిలి వేసినప్పటికీ, ప్రతిపాదిత మహారాష్ట్ర విస్తీర్ణం 84,151 చదరపు మైళ్ళుగాను, జనాభా 1,54,33,400గాను ఉంటుంది

## మహారాష్ట్ర ఆదాయం :

16) ఇక ఆదాయం విషయానికివస్తే ప్రస్తుతం అమలులో ఉన్న పన్నుల రేటును బట్టి సంక్షిప్త రూపంలోని మహారాష్ట్రకు సమకూరే ఆదాయం సుమారుగా 25,61,51,000 రూపాయలు ఉంటుందని అంచనా

## ఇతర రాష్ట్రాలతో మహారాష్ట్ర పోలిక :

17) ఇంత విస్తీర్ణమూ, ఇంత జనాభా ఇంత ఆదాయమూ కలిగి ఉన్న రాష్ట్రం స్వయం పోషకత గల రాష్ట్రం అవుతుందా కాదా అని చెప్పడానికి కొన్ని పోలికలు అవసరం అలా పోల్చి చూసుకోవటానికి వీలుగా - జనాభా- విస్తీర్ణాలనుబట్టి అమెరికాలోని అతి పెద్దదీ మొదటిదీ అయిన రాష్ట్రానికీ, 47వదీ అతి చిన్నదీ అయిన రాష్ట్రానికీ సంబంధించిన వివరాలను ఈ దిగువన ఇస్తున్నాను

| రాష్ట్రాలు | చదరపు మైళ్ళలో విస్తీర్ణం |
|---|---|
| టెక్సాస్-మొదటి రాష్ట్రం | 2,67,339 |
| డెలవారె-47వ రాష్ట్రం | 2,057 |

| | |
|---|---|
| న్యూయార్క్-మొదటిరాష్ట్రం | 1,26,32,890 |
| వైయోమింగ్-47వ రాష్ట్రం | 2,57,108 |

18) సంక్షిప్త రూపంలోని మహారాష్ట్రను తీసుకున్నా, అసంక్షిప్త రూపంలోని మహారాష్ట్రను తీసుకున్నా విస్తీర్ణంలో అమెరికాలోని అతిచిన్న రాష్ట్రమైన డెలవారెకన్న అనేక రెట్లు పెద్దదిగానూ, జనాభా విషయంలో అమెరికాలోని అతి పెద్ద రాష్ట్రమైన న్యూయార్క్ కన్నా అనేక రెట్లు పెద్దదిగానూ ఉంటుందని పై పట్టికలను బట్టి స్పష్టమవుతున్నది

19) ప్రస్తుతం భారతదేశంలో ఉన్న భాషా ప్రయుక్త రాష్ట్రాలతోను, భాషా ప్రయుక్త రాష్ట్రాలు కాగల ప్రాంతాలతోను మహారాష్ట్రను పోల్చి చూడడం కూడా ఇందుకు ఉపయుక్తంగా ఉంటుంది విస్తీర్ణం, జనాభా, ఆదాయ విషయాలలో వాటి స్థితి గతులు ఈ క్రింది విధంగా ఉన్నాయి

| రాష్ట్రం | విస్తీర్ణం (చ.మైళ్ళలో) | జనాభా | వార్షిక ఆదాయం (రూ॥లలో) |
|---|---|---|---|
| ప్రస్తుతంభాషా ప్రయుక్త రాష్ట్రాలుగా ఉన్నవి | | | |
| యునైటెడ్ ప్రావిన్స్ | 106,247 | 5,50,20,617 | 32,65,08,000 |
| బీహార్ | 69,745 | 3,63,40,151 | 16,26,78,000 |
| ఒరిస్సా | 32,198 | 82,28,544 | 4,60,62,000 |
| నూతన భాషా ప్రయుక్త రాష్ట్రాలు | | | |
| ఆంధ్ర | 70,000 | 1,90,00,000 | ——— |
| కర్ణాటక | 25,000 | 45,00,000 | ——— |
| కేరళ | 6,000 | 35,00,000 | ——— |

ఈ సంఖ్యలను మహారాష్ట్రకు సంబంధించిన సంఖ్యలతో పోల్చి చూస్తే, మహారాష్ట్ర స్వయం పోషకతగల రాష్ట్రమే కాకుండా, విస్తీర్ణమూ, జనాభా, ఆదాయం విషయాలలో గట్టి బలమైన రాష్ట్రం కూడ కాగలదనడానికి కించిత్తుకూడా సందేహించనక్కర్లేదని స్పష్టమౌతున్నది

## మూడో భాగం

# మహారాష్ట్ర, సమాఖ్య రాష్ట్రంగా ఉండాలా? యూనిటరీ రాష్ట్రంగా ఉండాలా?

20) మహారాష్ట్ర ఏర్పాటుకు సంబంధించిన వివాదాస్పద అంశాలను గురించి నేనిప్పుడు చర్చిస్తాను మహారాష్ట్ర నంతటినీ ఒక రాష్ట్రంగా ఏకం చేయడం అన్న అంశంపై ఎటువంటి

వివాదమూ లేదు అయితే ఉన్న వివాదమల్లా ఏ పద్ధతిలో దానిని సాధించాలి అన్న అంశానికి సంబంధించిందే ఒకే శాసన సభ, ఒకే కార్యనిర్వాహక వర్గమూ కలిగిన రాష్ట్రంగా నూతన మహారాష్ట్ర ఉండాలనేది ఒక అభిప్రాయం కాగా, రెండు ఉపరాష్ట్రాలు కలిగిన సమాఖ్యగా ఉండాలన్నది రెండో అభిప్రాయం అంటే- బొంబాయి ప్రెసిడెన్సీలోని మరాఠీ మాట్లాడే ప్రజలున్న జిల్లాలతో ఒక ఉపరాష్ట్రమూ-బీరారూ సెంట్రల్ ప్రావిన్సెస్‌లలో మరాఠీ మాట్లాడే వారున్న జిల్లాలతో మరొక ఉపరాష్ట్రమూ ఇలా రెండు ఉపరాష్ట్రాలతో కూడిన సమాఖ్య అన్నమాట ఉపరాష్ట్రాలను ఏర్పాటు చేయాలన్న ఆలోచన, బీరారూ, సెంట్రల్ ప్రావిన్సెస్‌లలోని మరాఠీ మాట్లాడే జిల్లాల ప్రతినిధుల నుండి ఉద్భవించింది ఇది ఐక్య మహారాష్ట్రలో తమ రాజకీయ జీవితానికి తెరపడుతుందని భావించిన కొంతమంది అగ్రవర్ణ రాజకీయ నాయకుల తలంపు మాత్రమే వీరి ఆలోచనకు సెంట్రల్ ప్రావిన్సెస్, బీరార్ ప్రజల నుండి ఎటువంటి మద్దతూ లేదు వాస్తవానికి ఈ అంశం గురించి నేనసలు చర్చించేవాడినే కాదు అయితే నేను అతి ముఖ్యమైన కీలక సూత్రమని భావిస్తున్న విషయాన్నొక దానిని వివరించడానికి ఈ అంశం అవకాశం కల్పిస్తోంది కాబట్టి, దీన్ని గురించి చర్చిస్తున్నాను భాషా ప్రయుక్త రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని నిర్ణయించినప్పుడు, దాని ఇరుగు పొరుగులలో ఉంటూ అదే భాషను మాట్లాడే ప్రాంతాలన్నీ ఆ రాష్ట్రంలో తప్పని సరిగా చేరేటట్లు చేయాలనేది నా అభిప్రాయం ఇష్టానిష్టాల ప్రకారం నిర్ణయించుకోవడానికి లేదా స్వయం నిర్ణయాధికారానికి అవకాశమే ఇవ్వకూడదు పెద్ద పెద్ద రాష్ట్రాలను సృష్టించడానికి అన్ని ప్రయత్నాలూ చేసి తీరాలి చిన్న చిన్న రాష్ట్రాలు అనేవి సాధారణ సమయాల్లో సదా భారంగానూ, అత్యవసర సమయాల్లో బలహీనతకు మూలంగానూ ఉంటాయి అటువంటి పరిస్థితి రాకుండా చూసుకోవాలి ఈ కారణంగానే నేను మహారాష్ట్రకు సంబంధించిన అన్ని ప్రాంతాలను ఏకం చేసి ఒకే పెద్ద రాష్ట్రంగా ఏర్పాటు చేయాలని గట్టిగా పట్టు బడుతున్నాను

## నాలుగో భాగం

# మహారాష్ట్ర – బొంబాయి నగరం

## బొంబాయి నగరంపై వివాదం

21) బొంబాయి నగరాన్ని మహారాష్ట్రలో కలపాలా వద్దా అన్నది మరొక వివాదాస్పదమైన అంశం బొంబాయిలోని ఇండియన్ మర్చంట్స్ చాంబర్ భవనంలో ఒక సమావేశం జరిగింది ఆ సమావేశానికి అరవై మందికి మించి హాజరు కాలేదు వారిలో ఒకరు మాత్రమే ఇండియన్ క్రిస్టియన్ మిగిలిన వారంతా గుజరాతీ మాట్లాడే వ్యాపారస్తులు, పారిశ్రామికాధిపతులు అది ఒక వర్గానికి సంబంధించిన చిన్న సమావేశమే అయినప్పటికీ,

దాని వివరాలు భారతదేశంలోని ప్రతి ముఖ్యమైన వార్తాపత్రికలోనూ మొదటి పేజీలో ప్రముఖంగా ప్రచురితమయ్యాయి టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రికైతే ఆ సమావేశ ప్రాధాన్యతకు బాగా మురిసిపోయి ఏకంగా సంపాదకీయమే రాసేసింది మహారాష్ట్రీయుల పట్ల సమావేశంలో పాల్గొన్న వక్తలు అనుసరించిన నిందాపూర్వక ధోరణిని మెత్త మెత్తగా మందలిస్తూనే, బొంబాయి భవిష్యత్తు గురించి సమావేశం ఆమోదించిన తీర్మానాన్ని ఆ సంపాదకీయం బలపరిచింది. కొన్నిసార్లు మైనారిటీయే మెజారిటీ అయిపోతుందని, ఐరిష్ వివాద సందర్భంలో ఐరిష్ నాయకుడైన రెడ్‌మండ్‌కు సమాధానంగా లార్డ్ బిర్కెన్‌హెడ్ చెప్పిన దానిలో నిజం ఉన్నదని, ఈ ఘటన రుజువు చేస్తోంది

ఈ వివాదానికి సంబంధించిన మంచి చెడులను చర్చించకుండా వదిలివేసినట్లయితే నా ఈ విజ్ఞాపన పత్రం అసమగ్రమైన పత్రం అవుతుందని నా బాధ దానికి రెండుకారణాలు ఉన్నాయి ఒకటి- పైన పేర్కొన్న సమావేశం అతి ముఖ్యమైన సమావేశంగా గుర్తించబడింది రెండు- ఆ సమావేశపు తీర్మానాలను ప్రసిద్ధులైన విశ్వవిద్యాలయ ఆచార్యులందరూ బలపరిచారు

## బొంబాయిని గురించిన ప్రతిపాదనలు :

22) ఆ సమావేశం ఈ క్రింది తీర్మానాలు చేసింది

(I) భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు సమస్యను వాయిదా వేయాలి

(II) అలా వాయిదా వేయక పోయినట్లయితే బొంబాయి నగరాన్ని ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పరచాలి, కొంకణిని ప్రత్యేక రాష్ట్రంగా చేసి దానికి బొంబాయినే ముఖ్య పట్టణంగా చెయ్యాలి అన్నది మూడవ ప్రతిపాదన దానికి అట్టే ఆమోదం లభించలేదు కాబట్టి దీన్ని గూర్చి చర్చించవలసిన అవసరం లేదు

## బొంబాయిని గురించి నిర్ణయం ఇప్పుడే తీసుకోవాలి :

23) బొంబాయిని మహారాష్ట్రంలో కలపాలా, వద్దా అన్న ప్రధాన సమస్య పరిష్కారమైనట్లయితే, భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటును వాయిదా వేయాలన్న తీర్మానంలోని భాగం గురించి నాకెటువంటి అభ్యంతరమూ లేదు బొంబాయి నగరానికి సంబంధించిన సమస్యపై ఇప్పుడు ఒక పరిష్కారానికి రాగలిగితే, అది అమలులోకి రావడానికి ఐదారు సంవత్సరాలు పట్టినా ఫర్వాలేదు కాని ఆ తీర్మానం అలా ఒక పరిష్కారాన్ని దాట వేస్తూవుంది కేవలం సమస్యను వాయిదా వేస్తోందే తప్ప పరిష్కరించడం లేదు అందువల్ల బొంబాయి నగరానికి సంబంధించిన ప్రధాన సమస్య ఇప్పుడే పరిష్కరింప బడాలి

## మహారాష్ట్ర నుండి బొంబాయిని మినహాయించడానికి గల ఆధారం

24) మహారాష్ట్ర నుండి బొంబాయిని వేరు చేయడానికి మద్దతుగా చెప్పిన వాదనలను ఈ దిగువ వివరిస్తున్నాను

1 బొంబాయి, మహారాష్ట్రలో ఎప్పుడూ భాగంకాదు

2 మరాఠా సామ్రాజ్యంలో బొంబాయి ఎన్నడూ భాగం కాలేదు

3 బొంబాయి నగర జనాభాలో మరాఠీ మాట్లాడే ప్రజలు అధిక సంఖ్యాకులుగా లేరు

4 గుజరాతీ వారే మొదటి నుండీ బొంబాయి నగర వాస్తవ్యులు

5 మహారాష్ట్ర వెలుపల ఉన్న విశాల ప్రాంతాలకు బొంబాయి వాణిజ్య కేంద్రం అందువల్ల మహారాష్ట్రీయులు అది తమదేనని వాదించకూడదు అది యావద్భారత దేశానికి చెందినది

6 బొంబాయిలోని గుజరాతీ మాట్లాడే ప్రజలే బొంబాయి వ్యాపారాన్ని, పరిశ్రమలను అభివృద్ధి చేశారు మహారాష్ట్రీయులు కేవలం గుమస్తాలుగాను కూలీలుగాను మాత్రమే ఉంటూ వచ్చారు వాణిజ్యంలోనూ పరిశ్రమలలోనూ యజమానులుగా ఉన్నవారిని తీసుకువెళ్ళి కార్మిక వర్గం అధిక శాతంగా వున్న మహారాష్ట్రుల రాజకీయ ఆధిపత్యం కింద పెట్టడం సరికాదు

7 బొంబాయిని మహారాష్ట్రలో కలపాలని మహరాష్ట్ర కోరుకోవటానికి కారణం అది బొంబాయి నగరం నుండి వచ్చే మిగులు పై బతకాలనుకోవడం వల్లనే

8 బహుళభాషా రాష్ట్రమే మేలు అల్ప సంఖ్యాక ప్రజల స్వేచ్ఛకుఅది ప్రాణాంతకం కాదు

9 రాష్ట్రాల పునర్విభజన అనేది హేతుబద్ధమైన ప్రాతిపదికపైనే జరగాలి కాని జాతుల ప్రాతిపదికపై కాదు

## రుజువు చేసుకోవలసిన బాధ్యత

25) పై అంశాలను పరిశీలించి చూస్తే మొదటి రెండు అంశాలు ప్రాథమిక మైనవని అర్థమయి తీరుతుంది ఎందుకంటే, రుజువు చేయవలసిన బాధ్యత ఎవరిమీద ఉంటుందో నిర్ణయించడానికి అవి తోడ్పడతాయి బొంబాయి, మహారాష్ట్రలో భాగమేని రుజువు చేయగలిగితే దాన్ని మహారాష్ట్ర నుండి వేరు చేయాలి అన్న రుజువు చూపించే బాధ్యత, అలా వేరు చెయ్యాలని చెప్పే వారిపైన పడతుందే గాని, బొంబాయి మహారాష్ట్రలో చేరాలనే వారిపై

పడదు అంచేత నేను మొదటి రెండు అంశాలను గూర్చి చర్చిస్తాను అంశాలు (1), (2)

## చరిత్ర తీర్పు

26) ఈ రెండు అంశాలను చారిత్రకంగానూ, భౌగోళికంగాను కూడా పరిశీలించవచ్చు మన ముందున్న సమస్యను పరిష్కరించడంలో చరిత్ర మనకేవిధంగానూ ఉపయోగపడదని నేను పూర్తిగా నమ్ముతున్నాను మన మొక నిర్ణయానికి రావడానికి కావలసిన వివరాలను సేకరించడానికి మనమెంతవరకు వెనక్కి వెళ్ళాలనేది ముందుగా మనకు ఎదురయ్యే ప్రశ్న ఈ విషయంలో ప్రాచీన చరిత్ర మనకెటువంటి ఉపయోగకారి గాను ఉండదన్నది స్పష్టం వర్తమానానికి ముందున్నగతం మనకు ఉపయోగపడవచ్చు అలాంటి గతానికీ ప్రస్తుత సమస్యకూ ఏ సంబంధమూ లేదనీ దానిపై ఆధారపడి ఏ నిర్ణయమూ చేయడానికి వీలుపడదని కొందరు వాదించవచ్చు చరిత్రలో ప్రజల మధ్య ఉన్న సంబంధాలన్నీ దాదాపుగా విజేతలు పరాజితుల మధ్యనున్న సంబంధాలే భారతదేశానికి సంబంధించిన విషయంలోనైనా, యూరప్‌కు సంబంధించిన విషయంలోనైనా వాస్తవం ఇదే అయితే అటువంటి సంబంధాల వల్ల వచ్చిన ఫలితాలు మాత్రం యూరప్‌లోనూ భారత్ దేశంలోను వేర్వేరుగా ఉన్నాయి యూరప్‌లో అటువంటి సంబంధాలు పరస్పర విరుద్ధ సామాజిక అంశాల మధ్య కలయికకు దారి తీశాయి తరచుగా జరిగే అంతర్వివాహాల వల్ల మూల జాతుల్లో కలవరపాటు కలిగించాయి అత్యధికంగా ఉపయోగపడే భాష గాని అత్యధిక ప్రజలు మాట్లాడే భాష గాని మరో భాషను తోసి పుచ్చి దాని స్థానాన్ని ఆక్రమించడం కూడా జరిగింది ఒక నాగరికత ఉన్నతమైనదైతే అది అదే దేశంలోని ఇతర నాగరకతలను తోసి పుచ్చి వాటి స్థానాన్ని కూడా ఆక్రమించుకోవటం జరిగింది కలయిక దిశగా యూరప్‌లో కనిపించే ఈ సంలీనత ఎంత బలంగా తయారయిం దంటే, దానిని నిరోధించడానికి ప్రతికూలంగా కొన్ని చర్యలు కూడా తీసుకోవాల్సి వచ్చింది కాని ఇక్కడ మన భారత దేశంలో ఉన్న ధోరణి ఏమిటి? ఇక్కడ అది కలయికకు పూర్తి విరుద్ధంగా ఉంది ముసల్మానులు హిందువులను జయించారు కాని ముసల్మానులు ముసల్మానులుగానే ఉండిపోయారు హిందువులు హిందువులుగానే ఉండిపోయారు గుజరాతీ యులను మహారాష్ట్రీయులు జయించి కొన్ని సంవత్సరాల పాటు పాలించారు కాని గుజరాతీయులపై అది ఎటువంటి ప్రభావాన్ని చూపగలిగింది? ఏమీ లేదు గుజరాతీయులు గుజరాతీయులుగానే– మహారాష్ట్రీయులు మహారాష్ట్రీయులుగానే ఉండిపోయారు మహారాష్ట్రీ యులను చాళుక్యులు జయించారు అదే విధంగా షిలహార్లూనూ కాని, వారి మధ్య ఎటువంటి సంలీనతా లేదు షిలహార్లు, షిలహార్లుగానే, చాళుక్యులు, చాళుక్యులుగానే ఉండి పోయారు మహారాష్ట్రీయుల విషయంలో కూడా అదే జరిగింది పరిస్థితి ఇలా ఉన్నప్పుడు, మన సమస్యకు సంబంధించి ఒక నిర్ణయానికి రావడంలో భారతదేశ చరిత్ర ఏ విధంగా మనకు సహాయ పడగలదు? అంతర్గతమైన ఒడిదుడుకులకూ, బయటినుంచి వచ్చిన

దండయాత్రలకూ సంబంధించిన చరిత్ర క్షణ భంగురదృశ్యంగానే మిగిలింది అంతకు మించి దాని నుండి గ్రహించేందుకేమీ లేదు జయాపజయాల నుండి మనం తెలుసుకునేందుకు గానీ, రుజువు చేసుకుందుకు గాని ఏమీలేదు

## భౌగోళిక తీర్పు

27) ఇక ఇప్పుడు భౌగోళిక అంశాన్ని పరిశీలించి అది ఇచ్చే తీర్పు ఏమిటో చూద్దాం చరిత్ర కంటె ఇదే చక్కటి సాక్షి కాగలదు అందుకు మనం, మహారాష్ట్రలో బొంబాయి యొక్క భౌగోళిక స్థానాన్ని పరిగణనలోకి తీసుకోవాలి మహారాష్ట్రను గనుక ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేసినట్లయితే అది త్రిభుజాకారంలో ఉంటుంది ఉత్తరాన డామన్, దక్షిణాన కర్వార్‌ల మధ్య గల పశ్చిమ సముద్ర తీరం, ఈ త్రిభుజాకార మహారాష్ట్రకు ఒక పార్శ్వం అవుతుంది డామన్, కార్వార్‌ల మధ్య బొంబాయి నగరం ఉంది డామన్ నుండి గుజరాత్ రాష్ట్రం ప్రారంభమై ఉత్తర దిక్కుగా వ్యాపిస్తున్నది కార్వార్ నుండి కర్నాటక రాష్ట్రం ప్రారంభమై దక్షిణ దిక్కుగా వ్యాపిస్తున్నది దాదాపుగా డామన్‌కు 85 మైళ్ళ దక్షిణాన బొంబాయి ఉన్నది డామన్ నుండి గుజరాత్ రాష్ట్రం ప్రారంభమవుతుంది కార్వార్‌కు ఉత్తరాన 250 మైళ్ళలో బొంబాయి ఉన్నది కార్వార్ నుండి దక్షిణ దిశవైపు కర్నాటక రాష్ట్రం ప్రారంభమవుతుంది డామన్ - కార్వార్‌ల మధ్య నున్న అఖండ భూభాగమంతా భౌగోళికంగా మహారాష్ట్రలో భాగమైనప్పుడు, బొంబాయి నగరం మహారాష్ట్రంలో భాగం ఎందుకు కాదు? ఇది ఏమాత్రమూ వివాదంలేని ప్రకృతి సిద్ధమైన వాస్తవం భౌగోళిక స్వరూపమే బొంబాయిని మహారాష్ట్రలో భాగంగా చేసింది ప్రకృతి సిద్ధమైన ఈ వాస్తవాన్ని సవాలు చేయాలనుకుంటున్న వారిని సవాలు చేసుకోమనండి నిష్పక్షపాతంగా ఆలోచించే వారికి బొంబాయి మహారాష్ట్రకు చెందిందేనని తప్పక తెలుస్తుంది

## బొంబాయి—మరాఠా సామ్రాజ్యం

28) బొంబాయి నగరాన్ని మరాటాలు తమ సామ్రాజ్యంలో ఒక భాగంగా చేసుకునేందుకు ఆసక్తి చూపలేదు, అంత మాత్రాన బొంబాయి మహారాష్ట్రలో భాగం కాదని చెప్పడానికి వీలులేదు మరాటాలు బొంబాయిని జయించక పోయినంత మాత్రాన అది మహారాష్ట్రలో భాగం కాకపోదు మరాటాల బలమంతా భూబలమే ననీ అందువల్లనే వారు నౌకాశ్రయమైన బొంబాయి నగరాన్ని జయించడానికి ఆసక్తి చూపలేదనీ దీనివల్ల తెలుస్తున్నది

29) ఒకటి రెండు అంశాలను పరిశీలించి ఒక నిర్ణయానికి వచ్చాం ఇక ఇప్పుడు, బొంబాయి నగరం మహారాష్ట్రలో భాగం కాదు, అని రుజువు చేయాల్సిన బాధ్యత బొంబాయి, మహారాష్ట్రలో భాగం కాదని వాదించే వారిపైనే ఉంది వారా పని చేశారా? అదే మిగిలిన అంశాలను పరిశీలనకు తెస్తుంది

## అంశం (3)

## మరాఠీ మాట్లాడే ప్రజలు అధిక సంఖ్యాకులా లేక అల్ప సంఖ్యాకులా?

30) ఈ విషయంలో ఏకాభిప్రాయం లేదు 1941 జనాభా లెక్కల ప్రకారం బొంబాయి నగర జనాభాలో మరాటీ మాట్లాడే వారి శాతం 51 అని, బొంబాయిని మహారాష్ట్రలో కలపాలని వాదిస్తున్న ప్రొఫెసర్ గాడ్గిల్ అంటున్నారు ప్రొఫెసర్ ఘీవాలా మరాటీ మాట్లాడే జనాభా 41 శాతమే అని అంటుండగా, ప్రొఫెసర్ వకీల్ దానిని 39 శాతానికి తగ్గించారు అది కూడా మరీ ఉదారంగా అంచనా వేస్తేనేనట ఈ సంఖ్యలను పరిశీలించేందుకు నాకు సమయం చిక్కలేదు ఏమైనప్పటికీ సరైన సంఖ్య తెలుసుకోవటానికి బొంబాయి జనాభా లెక్కలు పెద్దగా సహాయపడక పోవచ్చునని అనుకుంటున్నాను ప్రొఫెసర్ వకీల్ చెపుతున్న కారణాలను పరిశీలిస్తే ఆయన నిర్ణయం ఆయన అభిలాషకు అనుగుణమైన ఆలోచన కాకపోయినా సాహసమయిన ఊహ అని ఎవరికైనా అర్థమవుతుంది ఒకవేళ ప్రొఫెసర్ వకీల్ ఇచ్చిన అంకెలు సరైనవే అని అనుకున్నా, వాటిని బట్టి తేల్చుకోగలిగేదేమిటి? అవి సరైన సంఖ్యలు అయినంత మాత్రాన బొంబాయి మహారాష్ట్రదేనన్న వాదనను అవి తోసి పుచ్చగలుగుతాయా? బ్రిటిష్ వారు భారత దేశాధిపతులు అయిన దగ్గర్నుంచీ, ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి స్వేచ్ఛగా సంచరించే హక్కుగల దేశంగా అయింది భారతదేశం భారతదేశంలోని అన్ని ప్రాంతాల నుండి ప్రజలు బొంబాయికి తరలి రావడానికి అనుమతించారు అటువంటప్పుడు అందుకు మహారాష్ట్రీయులు ఎందుకు నష్టపడాలి? అది వారి తప్పుకాదు గదా! బొంబాయిని మహారాష్ట్ర నుండి వేరు చేయాలన్న వాదనకు ప్రస్తుత జనాభా లెక్కలు ప్రాతిపదిక కాకూడదు

## అంశం (4)

## గుజరాతీయులు బొంబాయి భూమిపుత్రులేనా ?

31) ఈ సమస్యను ఆమూలాగ్రంగా పరిశీలిద్దాం గుజరాతీయులు బొంబాయి భూమి పుత్రులేనా? కాకపోయినట్లయితే వారు బొంబాయి కెలా వచ్చారు? వారి సంపదకు మూలమేమిటి? తాము బొంబాయి భూమి పుత్రులమేనని ఏ గుజరాతీయుడూ చెప్పజాలడు మరి అలా కానప్పుడు వారు బొంబాయి కెలా వచ్చారు? పోర్చుగీసు, ఫ్రెంచి, డచ్, ఇంగ్లీషు వారి మాదిరిగానే సాహసోపేత యాత్ర చేస్తూ, సంకటాలను ఎదుర్కొనటానికి సిద్ధపడే, వచ్చారా? ఈ ప్రశ్నలకు చరిత్ర చెపుతున్న సమాధానాలేమిటో అందరికీ స్పష్టమే! గుజరాతీయులు స్వచ్ఛందంగా బొంబాయికి రాలేదు తమ వాణిజ్య సంధాన కర్తలు గానూ, దళారీలుగానూ పనిచేయించు కోవటానికి ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు గుజరాతీయులను బొంబాయికి పట్టుకొచ్చారు ఎందుకంటే, సూరత్ లో తమ మొట్టమొదటి ఫ్యాక్టరీని ఏర్పరచి

నప్పుడు తమ వాణిజ్య నిర్వహణలో సూరత్ బనియాలను మధ్య దళారులుగా ఉపయోగించుకోవడానికి ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు అలవాటు పడ్డారు గుజరాతీయులు బొంబాయిలో ప్రవేశించడానికి గల కారణమేమిటో పై అంశం వివరిస్తోంది ఇతర వ్యాపారస్తులతో స్వేచ్ఛా, సమాన ప్రాతిపదికలపై పోటీ పడి వాణిజ్యం చేయటానికి గుజరాతీయులు బొంబాయికి రాలేదు ఈస్ట్ ఇండియా కంపెనీ తమకు మాత్రమే ఇచ్చిన కొన్ని ప్రత్యేక వాణిజ్య హక్కులతో ప్రత్యేక సదుపాయాలు కలిగిన వ్యక్తులుగా వారు బొంబాయికి వచ్చారు వారు బొంబాయిలోకి రావాల్సిన అవసరాన్ని, ప్రాధాన్యాన్ని గవర్నర్ ఆంగ్యెర్ 1671లోనే పరిగణనలోకి తీసుకున్నారు బొంబాయి టౌన్ అండ్ ఐలాండ్‌కు సంబంధించిన గెజిటీర్, వాల్యూమ్‌లో, ఈ క్రింది మాటలలో ఆ వాస్తవాన్ని ప్రస్తావించారు (బొంబాయి గెజిటీర్ పుటలు 46-47)

"సూరత్ బనియాలు బొంబాయిలో స్థిరపడాలనేది బొంబాయికి ప్రయోజనకరంగా గవర్నర్ ఆంగ్యెర్ ఆసక్తి కనబరచిన మరోపథకం బొంబాయికి తరలి వచ్చే సాహసం చేయడానికి ముందుగానే తమకు కొన్ని ప్రత్యేక సదుపాయాలు కల్పించే విషయమై ఒక హామీ ఇవ్వాలని సూరత్ బనియా సమాజం (మహాజన్) కోరినట్లు కనిపిస్తున్నది మహాజన్ చేసిన ఈ ప్రతిపాదనను కంపెనీ కూడా స్థూలంగా ఆమోదించినట్లు కనపడుతోంది జనవరి 10వ తేదీన సూరత్ కౌన్సిల్, కంపెనీకి ఇలా రాసింది " బొంబాయిలో తమకు కల్పించవలసిన ప్రత్యేక సదుపాయాలను మీకు విన్న వించుకుంటూ శామ్‌సన్ నౌకద్వారా పంపిన అర్జీకి దయతో మీరు ఇచ్చిన సమాధానంతో సూరత్ బనియా కౌన్సిల్ ప్రధాని (మహాజన్) బాగా సంతృప్తి చెందారు గౌరవనీయులైన తమరిని మరోసారి ఇబ్బంది పెట్టాలని వారు కృతనిశ్చయులై ఉన్నట్టు కనపడుతోంది తమకు కల్పించనున్న ప్రత్యేక సదుపాయాలన్నిటినీ తమ రాజముద్రతో ఖాయపర్చాలని వారు కోరుకుంటున్నారు ఈ విషయాన్ని తమకు విన్నవించుకుంటూ తమకు లేఖ రాయవలసిందిగా తమ మధ్యవర్తి భీమ్‌జీ పరాఖ్‌ను కోరారు తాము అలా ఎందుకు కోరుకుంటున్నారో, అందుకుగల కారణాలేమిటో వారు తమ లేఖలో వివరించారు వారాలేఖను మాకు అందచేశారు ఫల్కాన్ నౌక ద్వారా రవాణా అవుతున్న మీ జాబుల సంచిలో ఆ లేఖను కూడా చేర్చి మీకు పంపాం తమ విన్నపానికి అనుకూలంగా వారు చేస్తున్న వాదనలో కొంత బలమున్నట్లు అనిపిస్తోంది గౌరవనీయులైన కంపెనీ వారెప్పుడూ శాశ్వతమైనవారేననీ, వారి ఆజ్ఞలు ఎల్లప్పుడూ శక్తి కలిగినవేనని వారు అంగీకరిస్తున్నారు అయితే, సమితులూ, అధ్యక్షులూ తరచుగా మారి పోవడమూ అంతకు ముందున్న సమితులూ అధ్యక్షులూ మంజూరు చేసిన వాటిని కూడా ఆ తరువాత వచ్చిన వారు మార్పు చేయడమూ అన్నది సాధారణంగా జరుగుతున్నదేనని కూడా వారు అంటున్నారు ఈ కారణంగా, తమ అర్జీపై ముద్రవేసి మరీ మంజూరు చేయమని వారు కోరుతున్నారు వారి కోరికను అంగీకరించడం వల్ల తమకు ఎటువంటి హానీ కలగకపోగా, ముందు ముందు

దానివల్ల చెప్పుకోతగ్గ మేలు జరుగుతుందని మేము తమకు వినయపూర్వకంగా తెలియచేస్తున్నాం అయితే, ఏ మేరకు ప్రత్యేక సదుపాయాలు కలుగ చేయాలి, ఎటువంటి సదుపాయాలు కలుగ చేయాలి అన్నది, తమరి విచక్షణకు సంబంధించినదే ఈ విషయంలో నిర్ణయం తమరు తీసుకోవలసినదే వారి లేఖకు దయతో తమరు సానుకూలంగా సమాధాన మిచ్చినట్లయితే అది వారికెంతో సంతోషం కలిగిస్తుందని, అది తమరి ప్రయోజనాలకు ఎటువంటి హానీ చేయబోదనీ మేము భావిస్తున్నాం"

32) తమకు ఎటువంటి ప్రత్యేక సదుపాయాలు కావాలని గుజరాతీ బనియాలు ఈస్ట్ ఇండియా కంపెనీని కోరారు? డయ్యూ నగరానికి చెందిన ప్రముఖ బనియా నిమాపరాఖ్ పెట్టుకున్న అర్జీని పరిశీలిస్తే బనియాలు కోరుకున్న సదుపాయాలేమిటో మనకొక అవగాహన కలుగుతుంది (బొంబాయి గెజిటీర్-I పే పే 74-76)

1 "ఒక ఇంటిని లేదా గిడ్డంగిని నిర్మించుకోవటానికి ఎంతస్థలం అవసరమని కంపెనీ భావిస్తుందో అంత స్థలాన్ని ప్రస్తుత పట్టణంలో కాని దాని సమీపంలో కాని ఎటువంటి కిరాయి లేకుండా ఉచితంగా గౌరవనీయమైన కంపెనీ అతనికి కేటాయించాలి"

2 "ఇతర వ్యక్తులెవరూ కించపరచడానికి వీలులేకుండా తమ ఇళ్ళల్లో తమ మతాచారాలను స్వేచ్ఛగా పాటించేందుకు తనకూ, తన కులస్థులకూ, తన పూజారులకూ వీలుండాలి వారి గృహ సముదాయంలోకి ఇంగ్లీషు వారిని కానీ, పోర్చుగీసు వారిని కానీ, ఇతర క్రైస్తవులనుకానీ, మహమ్మదీయులను కానీ నివసించటానికి అనుమతించకూడదు ఏ జీవినీ చంపటానికి కానీ, గాయ పరచటానికి కానీ, అవమాన పరచటానికి గానీ అనుమతించకూడదు ఒకవేళ అటువంటి వ్యక్తులెవరైనా ఆ ఆవరణలలో ఆ నేరాలకు పాల్పడినట్లు సూరత్‌లో ఉన్న గవర్నర్‌కు కానీ, బొంబాయిలో ఉన్న డిప్యూటీ గవర్నర్‌కు కానీ ఫిర్యాదు చేసినట్లయితే, ఆ నేరస్తులను కఠినంగా, శిక్షించాలి తమ ఆచారాల ప్రకారం మృతదేహాలను దహనం చేసుకునే స్వేచ్ఛ ఉండాలి అదే విధంగా వివాహాలలో కూడా తమ వేడుకలను జరుపుకునే స్వేచ్ఛ నివ్వాలి వారిలో, ఏ వృత్తులు చేసుకుంటున్న వారినైనా, ఏ వయసులో నున్న వారినైనా- స్త్రీనైనా, పురుషుడినైనా-ఎటువంటి పరిస్థితులలోనూ క్రైస్తవులుగా మారాలని ఒత్తిడి చేయకూడదు ఎటువంటి పరిస్థితులలోనూ వారి ఇచ్ఛకు వ్యతిరేకంగా ఏ పనులనూ చేయించగూడదు

3 "తననుగానీ తన కుటుంబంలో ఎవరినైనా గానీ, కాపలాదారులాంటి పనులకు నియోగించ గూడదు ప్రభుత్వ పరంగా కాని, ప్రైవేటు పరంగాకానీ, లేదా పరోక్ష ఉపయోగార్థం కానీ, సొమ్ము అప్పుగా ఇవ్వవలసిందిగా గవర్నర్ కానీ, డిప్యూటీ గవర్నర్‌గానీ, సమితికానీ, మరోవ్యక్తి కానీ, ఏ కారణంగానైనా సరే-ఎటువంటి పరిస్థితులలోనైనా సరే-తమను వత్తిడి చేయకూడదు "

4 "ఆ దీవిలోని ఇతరులతో తనకు గానీ, తన వకీలుకు గానీ, తన అటార్నీలకు గానీ,

తన బనియాకులం వారికి గానీ, ఎటువంటి తగవులు తలెత్తినా, న్యాయమైన రీతిలో మైత్రీపూర్వకంగా వ్యవహరించాలి న్యాయ విచారణకు పూనుకున్నపుడు ముందుగా నోటీసు ఇవ్వకుండా, కారణం తెలియ చేయకుండా బహిరంగంగా నిర్బంధించడమూ జైలుకు పంపడమూ యాతన పెట్టడమూ వంటి అగౌరవ చర్యలకు గవర్నరు కానీ డిప్యూటీ గవర్నర్‌కానీ పూనుకోకూడదు తనకు గానీ, తన అటార్నీకి గానీ తమ బనియా కులస్తులలోనే తగవులు వచ్చినప్పుడు వాటిని సామరస్య పూర్వకంగా, గౌరవనీయంగా తమలో తామే పరిష్కరించుకునే స్వేచ్ఛ ఉండాలి కోర్టుకు వెళ్ళి తీరాలన్న బలవంతం ఉండకూడదు "

5 "గవర్నరుకు డిప్యూటీ గవర్నరుకు క్రయదారులకు ముందే తెలియజేసి, అనుమతి పొందిన తర్వాత తాను సరైన సమయమనుకున్నప్పుడు రేవు సుంకం చెల్లించకుండానే తాను కోరుకున్న రేవులకు, తన సొంత నౌకలు – పడవల ద్వారా వాణిజ్యం చేసుకునేందుకూ, పడవల రాకపోకలకూ స్వేచ్ఛ ఉండాలి "

6 "ఒకవేళ 12 నెలల కాలంలో అమ్ముకోదగిన వాటికన్నా ఎక్కువ మోతాదులో వస్తువులను ఆ దీవికి తీసుకు వచ్చినట్లయితే ఎటువంటి ఎగుమతి సుంకం చెల్లించకుండానే వాటిని తిరిగి తాను కోరుకున్న రేవుకు ఎగుమతి చేసుకునే స్వేచ్ఛ ఉండాలి "

7 "ఒకవేళ ఎవరైనా వ్యక్తి తనకు గాని తన బనియా కులస్తులకు గాని బాకీ పడి ఆ బాకీ మొత్తాన్ని తిరిగి చెల్లించ లేక పోయినట్లయితే, ఆ వ్యవహారాన్ని తాము తమ బనియాల ముందు తేల్చుకునే వీలుండాలి "

8 "ఒకవేళ యుద్ధం కానీ, మరేదైన ప్రమాదం కానీ సంభవించి నట్లయితే, తన వస్తువులకు, తన సంపదకు, తన కుటుంబానికి రక్షణ కల్పించుకోటానికి కోటలో తనకొక గిడ్డంగి ఉండాలి "

9 "గవర్నర్, డిప్యూటీ గవర్నర్ల నివాసాలకు గానీ కోటకు గానీ రాకపోకలు సాగించేందుకు తనకూ, తన కుటుంబానికీ స్వేచ్ఛ ఉండాలి తమను పౌర మర్యాదతో ఆదరించాలి తమ తమ అర్హతలను బట్టి ఆసీనులు కావడానికి అనుమతి నివ్వాలి వాహనాలనూ, అశ్వాలనూ, పల్లకీలనూ, ఛత్రాలనూ తమ వీలును బట్టి నిరాటంకంగా స్వేచ్ఛగా వినియోగించుకోనివ్వాలి ఖడ్గాలూ, బాకులూ ధరించడానికి సేవకులకు అనుమతినివ్వాలి నేరం చేస్తేనే తప్ప వారిని దుర్భాషలాడడం కానీ, కొట్టడం కానీ, జైలు పాలు చేయడం కానీ చేయకూడదు ఒకవేళ ఇతర రేవుల నుండి తమ స్నేహితులు కానీ, సన్నిహితులు కానీ సందర్శించడానికి వచ్చినట్లయితే, వారి పట్ల గౌరవ మర్యాదలతో వ్యవహరించాలి "

10 "ముందే కిరాయి కివ్వని వస్తువులు – కొబ్బరి కాయలు, పోక చెక్కలు, తమల పాకులు తదితర వస్తువులు కొనడానికీ అమ్మడానికీ దీవిలో తనకూ, తన అనుమతి పొందిన వారికీ ఎటువంటి అవరోధాలూ కలిగించకుండా స్వేచ్ఛనివ్వాలి

33) నిమా ఫరాఖే పెట్టుకున్న ఈ అర్జీపై ఏ విధమైన నిర్ణయం తీసుకున్నదీ 1677 ఏప్రిల్ 3వ తేదీన బొంబాయి డిప్యూటీ గవర్నర్ ఇచ్చిన సమాధానంలో చూడవచ్చు ఆ నిర్ణయాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి

"నిమా పరాఖే బనియా కోర్కెలను వరుస క్రమంలో పరిశీలించాం సజావుగా అర్థం చేసుకుంటే వాటిని ఆమోదించడంలో ఎటువంటి శంకలూ ఉండాల్సిన పనిలేదని భావిస్తున్నాం అందులో ఎక్కువభాగం అత్యల్పమైన సౌకర్యాలను గురించినవే

"మొదటి కోర్కెను తీర్చడం చాలా సులభం కంపెనీకి కావలసినంత విశాలమైన భూమి ఉంది ఇక్కడ నివసించటానికి వచ్చిన బనియాలకూ, ఇతరులకూ మనం రోజూ భూములు ఇస్తూనే ఉన్నాం ఇక రెండో కోర్కె విషయం– తమ పండగలనూ, పబ్బాలనూ, వివాహాలనూ తమ తమ మతాచారాల ప్రకారం జరుపుకోటానికీ, మతాన్ని ఆచరించటానికీ అందరికీ స్వేచ్ఛ ఉండనే ఉంది ఎవరికీ ఇబ్బంది కలగకుండా బనియాలు దహన సంస్కారాలు జరుపుకుంటూనే ఉన్నారు తమ దారిన తాము బతికే బనియాల ఇళ్ళ దగ్గర జీవహింస చేయటానికి మేమెవ్వరినీ అనుమతించడమూ లేదు, ఎవరూ అటువంటి హింస చేయడమూ లేదు ఇక, యజమాని అనుమతి లేకుండా మరొకరు వారి ఇంట్లోకాని వారి ఇంటి ఆవరణ లోకి కాని అడుగు పెట్టడం అనే ప్రశ్నే ఉదయించదు వారిని వారి ఇష్టానికి వ్యతిరేకంగా క్రైస్తవులుగా మార్చడమనేది కూడా ఉండదు అలా చేసినట్లయితే మొత్తం ప్రపంచం మమ్మల్ని అసహ్యించుకుంటుంది బనియాగాని, బ్రాహ్మణుడుగాని, మూర్‌గాని ఎవరైనాగాని ఎవరి చేతనూ వారికి ఇష్టం లేని పనులు చేయించడమనేది ఉండదు అంటే కాపలాదారులుగా గాని అలాంటి వృత్తుల్లో గాని నియమించడం జరగదు ఎవరయినా రక్షణ కవసరమయిన ఆయుధాలు కొని ఉన్నట్లయితే ఆపద సమయంలో, రక్షణ బాధ్యతలు నిర్వర్తించవలసి ఉంటుంది ఇక పన్ను విషయానికొస్తే స్వంతంగా భూమి కలిగి ఉండనంత కాలం ఎటువంటి పన్నూ ఉండదు కాబట్టి నిమా కోరిన ఈ అంశాలను అంగీకరించవచ్చు అతడెప్పుడైనా భూమిని కొన్నట్లయితే అందుకు సంబంధించి పాటించవలసిన చిన్న చిన్న బాధ్యతలను అప్పుడే అతనికి తెలియపరచవచ్చు

"నిమా అడిగిన నాలుగవ కోర్కె నిజంగా ప్రత్యేక సదుపాయమే అయితే, గిరిధర్, మోడీ తదితరులూ ప్రస్తుతం అనుభవిస్తున్న సదుపాయాలకంటే ఏమంత ఎక్కువది కాదు అతను చట్టం నుండీ, న్యాయం నుండీ ఏమాత్రమూ మినహాయింపు కోరటం లేదు కాని న్యాయం అనేది మర్యాద పూర్వకంగా జరగాలంటున్నాడు అంతే, అందుకే సందేహించాల్సిన పనిలేదు ఇక, తమలో తమకు విభేదాలు తలెత్తినప్పుడు సమస్యను పరిష్కరించుకునే విధం గురించి– అటువంటి విషయాలలో వారిలో వారు పరిష్కరించుకునేందుకు అనుమతి ఇస్తూ గౌరవనీయులైన కంపెనీ వారి ఆదేశాలు ఇప్పటికే అమలులో వున్నాయి"

"ఇక ఐదవ కోర్కె విషయానికొస్తే, రేవులో సరుకు నిలిపినందుకుగాను ప్రతి టన్నుకు ఒక రూపాయి చెల్లించాలనే నియమాన్ని పూర్తిగా ఎత్తి వేయడం జరిగింది ఇప్పుడు అమలులో ఉన్న నియమం ప్రకారం ప్రతి 100 టన్నులకు ఒక రూపాయి మాత్రమే చెల్లించాల్సి ఉంటుంది అది బహు స్వల్పమైన మొత్తమే దాన్ని గూడా పరిగణనలోకి తీసుకోవాలని పట్టుపట్టాము ఒకేళ అతను అంతగా పట్టు పట్టి ట్లయితే, అతను కోరుతున్నది, తన పడవలకు మాత్రమే మినహాయింపు కాబట్టి, కంపెనీవారు అందుకు సులభంగానే అనమతించవచ్చు"

"మనం సరిగా అర్థం చేసుకున్నట్లయితే, ఆరవ అంశం అందరూ పొందుతున్న సౌకర్యమే ప్రజలందరూ తాము ఎగుమతి చేసే సరుకులకు మాత్రమే సుంకం చెల్లిస్తున్నారు తప్ప, తాము కొన్న వస్తువులకు ఎటువంటి పన్నూ చెల్లించడం లేదు నిమా కనుక తాను దిగుమతి చేసుకున్న వస్తువులకు కానీ, ఇక్కడ అమ్ముకోలేక పోయిన వస్తువులను ఎగుమతి చేసుకున్నందుకు గానీ ఎటువంటి పన్నూ వేయరాదన్నట్లయితే అది కంపెనీకి నిజంగా చాలా నష్టమే అవుతుంది"

"ఇక ఏడవ కోర్కెను పరిశీలిద్దాం మన చట్టం ప్రకారం ఎవరైనా ఒక వ్యక్తి అనేక మందికి బకాయి పడినప్పుడు, వారిలో ఎవరైతే ముందుగా కోర్టుకు వెళ్ళి తీర్పు పొందుతారో వారికి అప్పునంతా పూర్తిగా చెల్లిస్తారు అది తమకు నష్టదాయకమని ఎవరూ అనేందుకు వీలులేనిది ఒకసారి తీర్పు పొంది దాని ప్రకారం డబ్బు చెల్లింపబడితే ఆ చెల్లింపబడిన డబ్బు మీద ఇతర రుణదాతలకు హక్కు ఉండదు తీర్పు వచ్చిందంటే చట్టం ప్రకారం చెల్లింపు అయిపోయినట్టే ఒక వ్యక్తి ఇద్దరికి బకాయి పడినట్లైతే, వారిలో మొదటి వ్యక్తి దావావేసినప్పుడు, అది తెలిసి రెండవ వ్యక్తి కూడా దావా వేసినప్పుడు, ఆ రెండవ రుణదాతకు బకాయి పడిన వాని ఆస్తి నంతటినీ దఖలు పరచాలని మనం ఏ న్యాయం ప్రకారం అనగలం? అటువంటి సందర్భంలో ఆ రెండవ వ్యక్తికి మన చట్టం ప్రకారం వీలైనంత తొందరగా పూర్తి న్యాయం చేకూర్చగలమని హామీ ఇవ్వవచ్చు బకాయి దారుడు తన అప్పునంతటినీ చెల్లించగలిగే స్థితిలో ఉన్నట్లయితే చెల్లించేటట్లు వత్తిడి తెస్తాం లేనట్లయితే, రుణదాత కోరిక మేరకు అతను కోరుకున్నంత కాలం జైలులో పెడతాం దాంతో అతడు సంతృప్తి పడతాడనే మనం అనుకోవచ్చు

"8వ కోర్కెకు సంబంధించి- యుద్ధ సమయాలలో తమ విలువైన వస్తువులనూ, ధనాన్నీ కోటలో దాచుకొనేందుకు ఉన్నతులైన పెద్ద మనుషులందరికీ స్వేచ్ఛ ఉంది అల్పమైన వస్తువులతో అతడు కోటను నింపుతాడని నేను అనుకోవడం లేదు విలువైన గృహోపకరణాలు, దుస్తులు, ఆభరణాలు, ధనం మొదలైన వాటిని భద్ర పరుచుకోవడానికి ఒక చిన్న గది సరిపోతుందనుకుంటున్నాను వాటికోసం అతనికీ, అతని కుటుంబమూ

ఉండేందుకు ప్రత్యేకంగా ఒక గిడ్డంగిని ఇవ్వవచ్చు"

"ఇక 9,10 కోర్కెలు, వాస్తవానికి ఆ రెంటినీ మనం ఒకటిగానే చూడవచ్చు కేవలం నిండు సంఖ్య చూపటం కోసమే వాటిని రెండుగా చూపారు ఆ కోర్కెలను పరిశీలించినప్పుడు ప్రస్తుతం వారెటువంటి స్వభావం కలవారి వద్ద నివసిస్తున్నదీ అర్థమవుతుంది మన ప్రభుత్వంతో వ్యవహరించడం అనుభవంలోకి వచ్చిన తరువాత అటువంటి కోర్కెలు కోరినందుకు వారే నవ్వుకుంటారు తాము కోరిన స్వేచ్ఛకన్నా ఎక్కువ స్వేచ్ఛను అనుభవించగలరు ఏ విషయమైనా ముందుగా సగౌరవంగా తెలియ చేసినప్పుడు స్వేచ్ఛగా రాకపోకలు చేయటానికి వారికి ఎటువంటి సమయంలోనూ అనుమతి నిరాకరించడం జరగదు ఇక అశ్వాలు, వాహనాల విషయానికొస్తే ఆయన ఎన్నిటినైనా అట్టి పెట్టుకోవచ్చు వారి సేవకులకు కోరిన ఆయుధాలను ధరించే అనుమతి ఇస్తాము ఇది అందరికీ వర్తించేదే అమ్మకాలకు, కొనుగోళ్ళకు ఇస్తున్నంత స్వేచ్ఛ మనం మరి దేనికీ ఇవ్వడం లేదు వాణిజ్యానికి పునాదిరాయి అదే కదా"

"10 మణుగుల పొగాకును ఎటువంటి పన్నులు లేకుండా ఉచితంగా అనుమతించాలనేది ఆయన ఆఖరి కోరిక ఇదే వారు కోరిన వాటిల్లో కెల్లా తీర్చడానికి బాగా కష్టమైన కోరిక ఎందుకంటే అటువంటి అనుమతిని ఇవ్వాలంటే రైతులు పెద్ద ఒప్పందం కుదుర్చుకోవాలని అడుగుతారు. 10 మణుగుల పొగాకును అమ్మడం ద్వారా వారు బాగా లాభపడే విషయం ఇది అందువల్ల ఈ కోర్కెను ఎలా అంగీకరించడమన్నది మాకు బోధ పడటం లేదు కాని గౌరవనీయులైన తమరు ఈ విషయంలో మా కంటే మంచి నిర్ణయం తీసుకోగలరు" (బహుశ ఇది నిమా పరాఖ్ చేసిన కొత్త డిమాండ్ కావచ్చు)

34 దీనికి సమాధానంగా సూరత్ కౌన్సిల్ ఏప్రిల్ 26న ఈ విధంగా రాసింది (బొంబాయి గెజిటీర్ పే 77) బొంబాయిలో స్థిరపడటానికి నిమా పరాఖ్ ప్రతిపాదించిన కోర్కెలకు మీరిచ్చిన సమాధానాలను అంశాల వారీగా పరిశీలించాం మేమక్కడికి ఆయనతో విందు ఆరగించేందుకు వచ్చే సరికి, వ్యవహారమంతా ఎవరికీ ఎటువంటి అపోహలూ కలగని విధంగా పరిష్కార మవుతుందని అనుకుంటున్నాం అతని అభ్యర్థన ప్రకారం సుంకంలేకుండా సంవత్సరానికి 10 మణుగుల పొగాకును - అతడు ఎలా తెచ్చుకున్నాసరే లేదా దీవిలోనే సంపాదించినా సరే- మేం ప్రశ్నించం

## అంశం (5)

## బొంబాయి - భారత వాణిజ్య కేంద్రం

35) యావత్తు భారతదేశానికి బొంబాయి ఒక వాణిజ్య కేంద్రమని ఒప్పుకోవచ్చు అయితే, ఈ కారణంగానే బొంబాయిని మహరాష్ట్ర కోరగూడదని ఎలా వాదిస్తున్నారో అర్థం

చేసుకోవడం కష్టంగా ఉంది ప్రతి రేవు పట్టణమూ, తాను ఏదేశానికైతే చెందిందో ఆ దేశానికే కాక, విశాలమైన ఇతర ప్రాంతాలకు గూడా వాణిజ్య సేవలు అందిస్తుంటుంది అంత మాత్రం చేత ఆ రేవు పట్టణం గల దేశం, అది తన భూభాగమే అని అనుకుంటే దాన్ని యెవరూ ఆక్షేపించలేరు స్విట్జర్లాండ్‌కు రేవుపట్టణం లేదు అది జర్మనీ, ఇటలీ, ఫ్రెంచి దేశాల రేవు పట్టణాలను వినియోగించుకుంటోంది అంత మాత్రం చేత జర్మనీ, ఇటలీ, ఫ్రెంచి దేశాలకు తమ రేవు పట్టణాలపై గల భౌగోళిక హక్కులను స్విట్జర్లాండ్ తిరస్కరించగలదా! అటువంటప్పుడు, మహారాష్ట్ర ఒక్క దానికే కాకుండా ఇతర రాష్ట్రాలకు కూడా రేవు పట్టణంగా బొంబాయి ఉపయోగ పడుతున్నదన్న కారణంగా బొంబాయి తనదనే మహారాష్ట్ర హక్కును ఎందుకు తిరస్కరించాలి? ఒకవేళ మహారాష్ట్రేతరులను ఆ రేవుపట్టణాన్ని ఉపయోగించుకోనీయకుండా చేసే హక్కు మహారాష్ట్రకు సంక్రమించేటట్లయితే అప్పుడు పరిస్థితి భిన్నంగా ఉండొచ్చు కాని రాజ్యాంగం ప్రకారం మహారాష్ట్రకు అటువంటి హక్కు ఉండదు అంచేత బొంబాయిని మహారాష్ట్రలో చేర్చడం వల్ల, అంతకు ముందులాగానే ఇతరులు ఆ రేవుపట్టణాన్ని ఉపయోగించుకునే హక్కుకు భంగం కలగదు

## అంశం (6)

## గుజరాతీయులు—బొంబాయి వాణిజ్య, పారిశ్రామిక యజమానులు

36) వాణిజ్యంపై గుజరాతీయులు గుత్తాధిపత్యం కలిగి ఉన్నారని అంగీకరించవచ్చు వారు బొంబాయిలో స్థిరపడేందుకు గాను ఈస్ట్ ఇండియా కంపెనీ కొన్ని ప్రత్యేక సదుపాయాలను కల్పించింది ఫలితంగా వారు లాభాలను ఆర్జించ గలిగారు ఆ కారణంగానే వారు వాణిజ్యంపై గుత్తాధిపత్యాన్ని సంపాదించగలిగారు బొంబాయి వాణిజ్యాన్ని, పరిశ్రమలను నిర్మించిందెవరు, అనే విషయాన్ని తెలుసుకోవటానికి పెద్ద పరిశోధన అవసరం లేదు బొంబాయి వాణిజ్యాన్ని, పరిశ్రమలను గుజరాతీయులే నిర్మించారన్న ప్రకటనకు పునాది ఏమీ లేదు వాస్తవానికి బొంబాయి వాణిజ్యాన్నీ, పరిశ్రమలనూ నిర్మించింది, యూరోపియన్లే, కాని గుజరాతీయులు కాదు ఆ పని గుజరాతీయులే చేశారని నొక్కి చెప్పేవారు అటువంటి వాదన చేసే ముందు టైమ్స్ ఆఫ్ ఇండియా వారి డైరెక్టరీని చూడాలి గుజరాతీయులు కేవలం వ్యాపారస్తులే పారిశ్రామిక వేత్తలు అన్న పదానికీ దానికీ చాల తేడా ఉంది

37) బొంబాయి, మహారాష్ట్రకు చెందినదే అని ఒకసారి నిరూపితమైందనుకోండి అప్పుడు బొంబాయి యొక్క వాణిజ్యానికీ, పరిశ్రమలకూ యజమానులు గుజరాతీయులే అన్న వాదన, బొంబాయిని మహారాష్ట్రలో చేర్చాలన్న హక్కును తోసి పుచ్చలేదు తాకట్టు ద్వారా లభించిన భూభాగంపై ఆ తాకట్టును పొందిన వ్యక్తి కట్టడాలను నిర్మిస్తే ఆ కారణంగా, ఆ భూమిపైన తాకట్టు పెట్టిన వ్యక్తికి గల హక్కును తిరస్కరించలేము బొంబాయి

వాణిజ్యాన్ని, పరిశ్రమలనూ నిర్మించామని అనుకుంటున్న గుజరాతీయుల పరిస్థితి అలా తాకట్టు తీసుకున్న వాళ్ళకంటే గొప్పదేం కాదు

38) బొంబాయిని మహారాష్ట్రలో కలపాలా, వద్దా అన్న సమస్యపై నిర్ణయం తీసుకోవడానికి, బొంబాయిలో వాణిజ్యాన్ని, పరిశ్రమలనూ, నిర్మించిన దెవరన్న అంశానికి ఎటువంటి సంబంధమూ లేదు వాణిజ్యంపైనా పరిశ్రమలపైనా గల, గుత్తాధిపత్యాన్ని ప్రాతిపదికగా తీసుకుని చేస్తున్న వాదన నిజంగా రాజకీయ వాదనే యజమానులే కార్మికులను పాలించాలి కాని, కార్మికులు యజమానులను పాలించడానికి అనుమతించ కూడదనేదే ఆ వాదన అర్థం ఈ వాదన చేస్తున్న వారికి తాము దేనికి వ్యతిరేకంగా మాట్లాడుతున్నదీ తెలుస్తున్నట్లు లేదు ఈ వాదనను ఒక్క బొంబాయి నగరానికే పరిమితం చేయాలా, లేక సర్వత్రా వర్తింప చేయాలా, అన్నదానికి కూడా వారు విరుద్ధమే!

39) దానిని సర్వత్రా ఎందుకు వర్తింప చేయకూడదో కారణం కనిపించడం లేదు ఎందుకంటే బొంబాయి నగర సమాజం ఏ విధంగా అయితే యజమానులు శ్రామికులు లేదా పెట్టుబడి దారులు జీతాలు తీసుకునేవారుగా విభజింప బడిందో, అదే విధంగా గుజరాత్‌లోని సమాజం కూడా విభజింప బడింది ఆ మాటకొస్తే భారతదేశంలోని ప్రతి రాష్ట్రమూ అంతే బొంబాయి మహారాష్ట్రీయులు శ్రామిక వర్గాలకు చెందిన వారన్న కారణంగా, బొంబాయిలోని పెట్టుబడి దారులనూ, యజమానులనూ కాపాడటానికి మహారాష్ట్ర నుండి బొంబాయిని వేరు చేసేటట్లయితే, మరి గుజరాత్ శ్రామిక వర్గాలనుండి గుజరాత్ పెట్టుబడి దారులను రక్షించడానికి వారు సూచించే మార్గమేమిటో! బొంబాయిలోని గుజరాతీ పెట్టుబడి దారులను రక్షించడానికి తమ మేధనంతటినీ రంగరించి వాదనలను సరఫరా చేస్తున్న వకీలు, దంతవాలా లాంటి గుజరాతీ ప్రొఫెసర్లు, గుజరాతీ శ్రామిక వర్గాల నుండి గుజరాతీ పెట్టుబడి దార్లను రక్షించ డానికి కావల్సిన మార్గాల గురించి ఆలోచించినట్లు లేదు వారు సూచించ గలిగే ఒకే ఒక్క పరిష్కార మార్గమేమంటే వయోజన ఓటు హక్కును రద్దు చేయాలనేదే ప్రత్యేకించి బొంబాయికి చెందిన గుజరాతీ పెట్టుబడిదారులను మాత్రమే కాకుండా మొత్తంగా పెట్టుబడి దారులను రక్షించాలనుకుంటే వారికున్న ఏకైక మార్గం ఇదే

40) అయితే ప్రొఫెసర్లు మరొక వాదన కూడా చేయవచ్చు మహారాష్ట్రలో బొంబాయిని చేర్చినట్లయితే, మహారాష్ట్రీయులు మెజారిటీగా ఉంటారు కాబట్టి, బొంబాయికి చెందిన గుజరాతీయుల పట్ల వివక్షత చూపుతారని అటువంటి వాదన ప్రశంసించదగినదే అయితే, అటువంటి వాదన చేయాలనుకునే వారు రెండు విషయాలను తప్పని సరిగా గుర్తుంచుకోవాలి

(1) అటువంటి పరిస్థితి ఒక్క మహారాష్ట్రలోనే కాదు, ఏ రాష్ట్రంలోనైనా తల ఎత్త వచ్చు నేనిక్కడ బీహారు విషయం ప్రస్తావించ దలుచుకున్నాను బీహార్‌లో బొగ్గు లభిస్తున్న భూమి బీహార్ ప్రజలకు చెందిందే కాని గుజరాతీయులు, కథియవర్లు, యూరోపియన్లు

బొగ్గుగనుల యజమానులుగా ఉన్నారు అక్కడ బీహారీలు, బొగ్గు గనుల యజమానులైన గుజరాతీయులు, కథియ వర్ల పట్ల వివక్షత చూపే అవకాశం లేదా? బొగ్గు గనుల యజమానులైన గుజరాతీయులు, కథియవర్ల ప్రయోజనాల కనుగుణంగా బొగ్గు గనులున్న బీహార్ ప్రాంతాలను బీహార్ నుండి వేరుచేసి ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయాలా?

(2) మెజారిటీ వర్గాలు, మైనారిటీల పట్ల వివక్షత చూపే అవకాశాలున్నాయనే అంశాన్ని భారత రాజ్యాంగం గుర్తించింది దానిని నిరోధించడానికి గాను తగినన్ని నిబంధనలను రూపొందించింది ప్రాథమిక హక్కులున్నాయి వివక్ష చూపడాన్ని నిరోధించే నిబంధనలున్నాయి నష్ట పరిహార చెల్లింపుకు నిబంధనలున్నాయి వ్యక్తుల నుండి కాని, ప్రభుత్వాల నుండి కాని ఏ పౌరుడికీ ఎటువంటి హానీ, అన్యాయమూ, వేధింపూ లేకుండా నిరోధించడానికి గాను ప్రత్యేక రిట్ లు జారీ చేయగల హక్కులు కలిగిన హైకోర్టులున్నాయి వివక్షతావకాశాల నిరోధానికి బొంబాయికి చెందిన గుజరాతీ పారిశ్రామిక వేత్తలూ, వ్యాపారస్తులూ ఇంతకు మించి ఇంకా ఏమి రక్షణలు కావాలని కోరుతున్నారు?

## అంశం (7)

## బొంబాయి మిగులుపై మహారాష్ట్ర కన్ను

41) బొంబాయి మిగులుపై మహారాష్ట్రీయులు కన్ను వేశారని అభియోగం మోపే ముందు అసలు బొంబాయికి మిగులు ఉందా అనే విషయం రుజువు కావాలి మిగులుగా కనిపిస్తున్నదంతా నిజంగా మిగులు కాదు అపభ్రంశపు జమాఖర్చుల వల్ల అది మిగులుగా కనిపిస్తోంది (1) గవర్నర్‌కూ వారి సిబ్బందికీ, (2) మంత్రులకు వారి సిబ్బందికీ అయ్యే ఖర్చులూ (3) శాసనసభా ఖర్చులు, దానికి అనుబంధంగా ఉండే ఖర్చులూ, (4) న్యాయవ్యవస్థ (5) పోలీసు శాఖ, (6) పోలీసు కమీషనర్లు, విద్యాశాఖ డైరక్టర్లు వంటి రాష్ట్ర వ్యవస్థలకు అయ్యే వ్యవస్థాపక వ్యయాలను పరిగణనలోకి తీసుకోకపోవడం వల్ల, జమా ఖర్చుల ఖాతా, అపభ్రంశ ఖాతా అవుతున్నది వీటన్నిటికీ అయ్యే ఖర్చును బొంబాయి ఖాతాలో వేసినట్లయితే ప్రస్తుతం అమలులో ఉన్న పన్ను ప్రాతిపదికపై బొంబాయికి ఏదైనా మిగులు ఉంటుందా అన్నది నాకు సందేహమే ఆ ఖర్చులన్నిటి నుండీ బొంబాయికి మినహాయింపు ఇచ్చి వాటిని మహారాష్ట్ర ఖర్చుల్లో చూపి, బొంబాయికి మిగులు ఉందని వాదించడం సరి అయినదికాదు

42) బొంబాయి మిగులు ఆదాయంపై ఆధారపడి బతకడానికే మహారాష్ట్రీయులు బొంబాయిని కోరుకుంటున్నారనడం వాస్తవం కాకపోగా దురుద్దేశాలను అంటకట్టడం అవుతుంది మహారాష్ట్రీయులకు అటువంటి ఉద్దేశాలు ఉన్నాయేమో నాకు తెలియదు నాకు తెలిసినంత వరకు ఇతర జాతులకు మాదిరిగా మహారాష్ట్రీయులు వ్యాపార జాతికాదు డబ్బుకోసం పరుగులెత్తే తత్వం వారికి లేదు అది వారికున్న గొప్ప సుగుణాలలో ఒకటి అని నమ్మే

వాళ్ళలో నేను కూడా ఒకణ్ణి ధనం వారికెన్నడూ దైవం కాదు అది వారి సంస్కృతిలో భాగం కాదు అందువల్లనే వారు ఇతర అన్ని జాతుల వారిని మహారాష్ట్రకు వచ్చి, అక్కడి వాణిజ్యమూ, పరిశ్రమలపై గుత్తాధిపత్యం తీసుకోనిచ్చారు కాని నేను ఇంతకు ముందు చూపినట్లుగా బొంబాయికి ఎటువంటి మిగులు లేనందువల్ల, ఇక మహారాష్ట్రీయులు దానిపై కన్ను వేశారనే ప్రశ్నే ఉదయించదు

43) ఒకవేళ మహారాష్ట్రీయులకు అటువంటి ఉద్దేశ్యమే ఉందనుకుంటే, అందులో తప్పేమిటి? బొంబాయి మిగులుపై తమకే ఎక్కువ హక్కు ఉందని వాదించటానికి అవకాశాలు మహారాష్ట్రీయులకే ఉన్నాయి ఎందుకంటే బొంబాయి వాణిజ్యాన్నీ, పరిశ్రమలనూ పెంపొందించడానికి శ్రమను అందించడంలో ఇతర రాష్ట్రాల ప్రజలు నిర్వహించిన, నిర్వహించ బోయే పాత్రకంటే- మహారాష్ట్రీయులే ఎక్కువ పాత్రనిర్వహించారు, నిర్వహించగలరు అన్నది వాస్తవం ఉత్పత్తి అయిన సంపదపై పెట్టుబడి కన్నా శ్రమకే ఎక్కువ హక్కు కాకపోయినా పెట్టుబడికి ఉన్నంత హక్కును అయినా అంగీకరించని వారిని సమర్థించటానికి ఏ మాత్రం స్థాయిగల ఆర్థిక శాస్త్ర వేత్తకైనా కష్టమే అవుతుంది

44) రెండో విషయం, బొంబాయి మిగులును ఒక్క మహారాష్ట్రే వినియోగించుకోదు యావత్తు భారతదేశం దానిని వినియోగించుకుంటుంది కేంద్ర ప్రభుత్వానికి బొంబాయి చెల్లించే ఆదాయం పన్ను, సూపర్ టాక్స్ మొదలైన వాటి ద్వారా వచ్చే ఆదాయాన్ని అఖిల భారత ప్రయోజనాల కోసం కేంద్ర ప్రభుత్వం వినియోగిస్తున్నది అన్నిరాష్ట్రాలు అందులో భాగాన్ని పొందుతాయి యునైటెడ్ ప్రావిన్సెస్, బీహార్, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్, తూర్పు పంజాబ్, మద్రాస్ వంటి ఇతర రాష్ట్రాలు బొంబాయి మిగులులో భాగం పంచుకుంటే ప్రొఫెసర్ వకీల్‌కు పెద్ద పట్టింపు లేదు కాని, మహారాష్ట్ర బొంబాయి మిగులులో భాగం పంచుకోవడం పైనే ఆయనకు అభ్యంతరం ఇది వాదన కాదు, కేవలం మహారాష్ట్రీయులపట్ల తనకు గల ద్వేషాన్ని ప్రదర్శించడమే

45) బొంబాయిని ప్రత్యేక రాష్ట్రంగా చేశారే అనుకుందాం అప్పుడైనా బొంబాయి మిగులు ఆదాయంలో భాగం తీసుకోనీయకుండా మహారాష్ట్రను ప్రొఫెసర్ వకీల్ ఎలా అడ్డుకుంటారో నాకు అర్థం కావడం లేదు బొంబాయిని ప్రత్యేక రాష్ట్రంగా చేసినప్పటికీ అది ఇన్‌కంటాక్స్, సూపర్ టాక్స్ వంటి పన్నులను చెల్లించాల్సి ఉంటుంది అలా కేంద్ర ప్రభుత్వానికి బొంబాయి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, చెల్లించే ఆదాయం నుండి ఖచ్చితంగా మహారాష్ట్ర ఒక భాగాన్ని పొందుతుంది అంచేత వకీల్ వంటి వారు చేస్తున్న వాదనలో నేను ఇంతకు ముందు చెప్పినట్లుగా పసకన్నా ద్వేషం ఎక్కువగా ఉన్నది

## అంశాలు (8), (9)

## మహారాష్ట్రలో బొంబాయి చేర్పుకు వ్యతిరేకంగా సాధారణ వాదనలు

46) ప్రొఫెసరు దంత్వాలా, ఘీవాలాలు వాదిస్తున్న ఎనిమిదీ, తొమ్మిదీ అంశాలను నేనిప్పుడు పరిశీలిస్తాను వారి వాదనలు భాషా ప్రయుక్త రాష్ట్రాల సూత్ర పునాదులనే దెబ్బ తీసేవిగా ఉన్నాయి అసలు ఈ వాదనల గురించి నా ఈ మెమోరాండంలోని మొదటి భాగంలోనే చర్చించి ఉండాల్సింది కాని మహారాష్ట్ర నుండి బొంబాయిని వేరు చేయాలి అన్నదే వారి వాదనల ప్రధాన ఉద్దేశ్యం కావడం వల్లనూ, మహారాష్ట్రలో బొంబాయి చేర్పుకు అవి నిజంగా వ్యతిరేక వాదనలు కావడం వల్లనూ, వాటిని గురించి మెమోరాండంలోని ఈ భాగంలో చర్చించడమే సరైందని నేను భావించాను

47) ఆ ఇద్దరి ప్రొఫెసర్ల వాదనలలోని మొత్తం సారాంశ మేమంటే భాషా ప్రయుక్త రాష్ట్రాలనేవి మంచివి కావు అని భాషా ప్రయుక్త రాష్ట్రాలకు వ్యతిరేకంగా వారు పెడుతున్న ఈ గగ్గోలుకు కాలం చెల్లి చాలా కాలమైంది ఈ ప్రొఫెసర్లిద్దరూ ఎప్పటినుంచి ఈ అభిప్రాయాలను కలిగి ఉన్నారో తెలియదు గుజరాత్‌ను భాషా ప్రయుక్త రాష్ట్రంగా పునర్నిర్మాణం చేయటాన్ని కూడా వారు వ్యతిరేకిస్తున్నారేమో స్పష్టంగా చెప్పడం లేదు భాషా ప్రయుక్త రాష్ట్ర సూత్రాన్ని అంగీకరించి- తీరా ఆ సూత్రాన్ని అంగీకరించడం వల్ల బొంబాయిని మహారాష్ట్రకు దఖలు పరచవల్సి వస్తుందన్న విషయాన్ని గ్రహించి- హడావుడిగా దాన్ని వ్యతిరేకిస్తున్నారా? ఒక్కోసారి, తమ ప్రయోజనాలకు మాత్రమే పరిమితం కాగల వాదనలను కనుగొనడం సాధ్యం కాదు అటువంటప్పుడు, తాము ఇష్టపడని అంశాలను కూడా రుజువు చేసే వాదనలు చేయాల్సి వస్తుంది ప్రొఫెసర్ దంత్వాలా, ఘీవాలాల వాదన కూడా అటువంటిదే ఏమైనప్పటికీ వారి వాదనలోని సారాంశాన్ని పరిశీలించాలనే నేను నిర్ణయించుకున్నాను

48) భాషా ప్రయుక్త రాష్ట్రాలకు వ్యతిరేకంగా తాను చేసే వాదనలకు ప్రొఫెసర్ దంత్వాలా, లార్డ్ ఆక్టన్ అభిప్రాయాలపై ఆధారపడ్డారు తన వాదనలకు మద్దతుగా లార్డ్ ఆక్టన్ సుప్రసిద్ధ రచన అయిన 'ది హిస్టరీ ఆఫ్ ఫ్రీడమ్ అండ్ అదర్ ఎస్సేస్' అనే పుస్తకంలోని 'ఎస్సే ఆన్ నేషనాలిటీ' అనే వ్యాసం నుండి ఒక పేరాను ఉటంకించారు ఆయన ఉటంకించిన భాగం అర్థం ఇలా ఉంది

"నాగరిక జీవనానికి ఒక సమాజంలో వివిధ వ్యక్తుల కలయిక ఎంత అవసరమో, అదే విధంగా ఒక దేశంలో వివిధ జాతుల కలయిక కూడా అంతే అవసరం"

49) ఈ మాటలు లార్డ్ ఆక్టన్ చెప్పిన అంశాలను తప్పుగా ఉంటంకిస్తున్నాయని చెప్పడానికి నేను చింతిస్తున్నాను దంత్వాలా ఉటంకించిన భాగం ఆక్టన్ చెప్పిన,

ఒక పెద్ద పేరాలోని కొన్ని మొదటి పంక్తులు మాత్రమే పూర్తి పేరా ఈ క్రింది విధంగా ఉంది

"నాగరిక జీవనానికి ఒక సమాజంలో వివిధ వ్యక్తుల కలయిక ఎంత అవసరమో, అదే విధంగా ఒక దేశంలో, వివిధ జాతుల కలయిక కూడా అంతే అవసరం మేధాపరంగా పైస్థాయి జాతులతో రాజకీయంగా కలిసి జీవించేలా చేయడం ద్వారా కిందిస్థాయి జాతులను పైకి తీసుకు రాగలుగుతారు నిర్వీర్యమై, క్షీణిస్తున్న జాతులు జీవ పటుత్వచైతన్యం కలిగిన యువ సంయోజనం ద్వారా పునర్జీవనాన్ని పొందుతాయి నిరంకుశ పాలన వల్ల కలిగే నైతిక పతన ప్రభావం ద్వారా కానీ, ప్రజాస్వామ్యం వల్ల విడిపోయే చర్యలవల్ల కానీ, పాలనా సామర్థ్యాన్నీ, వ్యవస్థీకృత లక్షణాలనూ, కోల్పోయిన దేశాలు, తక్కువ అవినీతి కలిగినటువంటి శక్తివంతమైనటువంటి జాతి యొక్క క్రమ శిక్షణ సాయంతో, తిరిగి నిలదొక్కుకుని, జ్ఞానవంతమవుతాయి ఒక ప్రభుత్వం క్రింద కలిసి ఉండడం ద్వారా మాత్రమే ఈ సంయోజన,పునరుజ్జీవనప్రక్రియ సాధ్యమవుతుంది ఒక ప్రభుత్వం క్రింద కలిసి ఉన్నప్పుడు మాత్రమే ఈ సంయోజనం సాధ్యపడి, ఒక జాతి ప్రజల విద్యా, విజ్ఞానాలూ, శక్తి సామర్థ్యాలూ మరొకరు అందుకొనే వీలు కలుగుతుంది"

50) పేరాలోని ఈ భాగాన్నంతటినీ దంత్వాలా ఎందుకు వదిలి వేశారో అర్థం కావడం లేదు ఇది కావాలని నిజాన్ని మరుగు పరిచి, అబద్ధాన్ని ప్రచారం చేయటానికి చేసిన పని అని నేను అనడం లేదు కాని అది లార్డ్ ఆక్టన్ చెప్పిన దానికి ఏక్రీకరణ అన్నది మాత్రం వాస్తవం ఈ పేరాపైనే ప్రొఫెసరుగారు ఎందుకు ఆధారపడ్డారో నాకు అర్థం కావడం లేదు పై స్థాయి జాతులతో సమానంగా క్రిందిస్థాయి జాతులను ఉంచినప్పుడు, ఆ తక్కువ జాతులు అభివృద్ధి చెందడం అతి సహజం అయితే ఇక్కడ ప్రశ్న ఏమిటంటే ఎవరు ఉన్నతులు, ఎవరు తక్కువ వారు అన్నదే మహారాష్ట్రీయుల కంటే గుజరాతీయులు తక్కువ స్థాయి వారా? లేక గుజరాతీయుల కంటే మహారాష్ట్రీయులు తక్కువ స్థాయి వారా? గుజరాతీయుల, మహారాష్ట్రీయుల కలయికకు హామీ ఇవ్వగలిగేందుకు వారిద్దరి మధ్య అన్యోన్య సంబంధాలకు మార్గమేమిటి? ఈ ప్రశ్న గురించి ప్రొఫెసర్ దంత్వాలా ఆలోచించినట్లులేరు లార్డ్ ఆక్టన్ వ్యాసంలోని ఒక వాక్యాన్ని పట్టుకొని అమాంతం ఎగిరి గంతేశారు ఎందుకంటే తన వాదనను బలపర్చుకోవడానికి ఆయనకు మరో ఆధారమేమీ కనిపించలేదు అసలు విషయమేమంటే భాషా ప్రయుక్త రాష్ట్రాల సమస్యలో ఇమిడి ఉన్న సూత్రానికి సంబంధించిన ఎటువంటి అంశమూ ఆ పేరాలో లేదు

51) ప్రొఫెసర్ దంత్వాలా వాదనకు సంబంధించిన సంగతి అది ఇక నేనిప్పుడు ప్రొఫెసర్ ఘీవాలా వాదననూ పరిశీలిస్తాను తన వాదనకు మద్దతుకోసం ప్రొఫెసర్ ఘీవాలా కూడా లార్డ్ ఆక్టన్ పైనే ఆధారపడ్డారు లార్డ్ ఆక్టర్ రాసిన "ఎస్సే ఆన్ నేషనాలిటీ"లోని

ఒక పేరాలోని కొంత భాగాన్ని ఆయన ఉటంకించారు ఆ పేరాను పూర్తిగా ఈ దిగువన నేను తిరిగి ఇస్తున్నాను

"ఆధునిక జాతీయతా సిద్ధాంతమే జాతుల హక్కులకు బద్ధ శత్రువు ఆ సిద్ధాంతరీత్యా, రాజ్యాన్నీ, జాతినీ ఒకే అర్థంలో ఉపయోగించినా ఆచరణలో మాత్రం ఇది సరిహద్దు లోపల ఉండే ఇతర జాతులన్నిటినీ పాలిత జాతులుగా కుదించింది రాజ్యాన్ని పాలించే జాతితో ఇతర జాతులు సమానమని అది అంగీకరించదు ఎందుకంటే, అప్పుడు రాజ్యం అంతా ఒక జాతిగా ఉండదు గనుక, అది దాని మనుగడకే విరుద్ధమైనది అందువల్ల సమాజంలోని అధికృత వర్గమే ఆ సమాజపు హక్కులన్నిటినీ భుక్తం చేసుకుంటుంది అప్పుడు సమాజంలో ఉండే మానవతా, నాగరికతా స్థాయిలను బట్టి తక్కువ స్థాయి జాతులు పూర్తిగా నిర్మూలన అవటమో, లేక, బానిసత్వానికి కుదింపు కావటమో, లేక నిషేధం కావటమో, లేక ఇతరులపై ఆధారపడి బతికే స్థితికి దిగజారిపోవటమో జరుగుతుంది "

52) విజ్ఞుడైన ప్రొఫెసరుగారు లార్డ్ ఆక్టన్ పేరును ఈ సమస్యలోకి ఎందుకు ఈడ్చుకు వచ్చారో నాకు అర్థం కావడం లేదు ఈ పేరా నిజంగా ఆయన వాదనకు సహాయ పడేది కాదు బహుశా ఆయన మనసులో ఒక అంశం బాగా బలంగా నాటుకుని ఉండి ఉంటుంది అదేమంటే, బొంబాయిని మహారాష్ట్రలో కలిపినట్లయితే, అప్పుడు మహారాష్ట్ర రెండు జాతులను కలిగి ఉంటుందనీ, ఒకటి - మరాఠీ మాట్లాడే ప్రజల జాతి, రెండు- గుజరాతీ మాట్లాడే ప్రజల జాతి ఉంటాయని ఆయన అనుకొని ఉంటారు అప్పుడు అధికృత వర్గమైన మరాఠీ మాట్లాడే ప్రజలు, గుజరాతీ మాట్లాడే ప్రజలను అధీన జాతిగా చేసుకుంటారని ఆయన అనుకుని ఉండి ఉంటారు తన ఈ అభిప్రాయానికి మద్దతుగానే ఆయన లార్డ్ ఆక్టన్‌ను ఉటంకించి ఉంటారు ఆయన లేవనెత్తిన అనుమానాలకు ఎల్లప్పుడూ ఆస్కారం ఉంది సమస్యను ఆయన ప్రస్తావించిన తీరుపట్ల, ఎటువంటి అభ్యంతరం లేదు కానీ, ఆయన ఏర్పరచుకున్న నిర్ణయభావాలు మాత్రం అభ్యంతర కరంగా ఉన్నాయి

53) మొదటిగా మొత్తం సమాజమంతా కులమతాలుగా ఏర్పడి ఉన్న భారతదేశం లాంటి దేశంలో అధికార సౌలభ్యం కోసం ఏ విధమైన విభజనను అనుసరించినప్పటికీ, ప్రతి ప్రాంతంలోనూ జనాభా రీత్యా ఆధిక్యత పొందిన జాతి ఒకటి ఉంటూనే ఉంటుంది రాజకీయ అధికారాని కంతటికీ ఆ జాతి ఏకైక వారసురాలవుతుంది బొంబాయిని ఐక్య మహారాష్ట్రలో కలిపినట్లయితే గుజరాతీ మాట్లాడే ప్రజలపై మరాఠీ మాట్లాడే ప్రజల ఆధిపత్యం వుంటుంది ఈ ధోరణి ఒక్క మహారాష్ట్రకు మాత్రమే పరిమితమై ఉంటుందా? మరాటీ మాట్లాడే ప్రజల సముదాయానికి వర్తించదా? గుజరాత్ ప్రత్యేక రాష్ట్రమైతే ఈ ధోరణి అక్కడ పొడ చూపదా? మరాఠీ మాట్లాడే ప్రజలు - మరాఠాలు- మరాఠేతరులుగా చీలి ఉన్నారని నేను ఖచ్చితంగా చెప్పగలను ఆధిపత్య వర్గంగా ఉండే మరాఠాలు గుజరాతీ

మాట్లాడే ప్రజలనూ, మరాఠేతరులనూ తమ అధీనంలోకి వచ్చేటట్లు చేస్తారు అదే విధంగా గుజరాత్‌లోని కొన్ని ప్రాంతాలలో అనావిల్ బ్రాహ్మణులు ఆధిపత్య వర్గంగా ఉన్నారు ఇతర ప్రాంతాలలో పాటిదార్లు ఆధిపత్య వర్గంగా ఉన్నారు అనావిల్ బ్రాహ్మణులూ, పాటిదార్లూ ఇతరులను తమ ఆధిపత్యం కిందికిలాగే అవకాశాలు ఉన్నాయి అందువల్ల ఈ ఆధిపత్య సమస్య అనేది ఒక్క మహారాష్ట్రకు మాత్రమే ప్రత్యేకమైనది కాదు ఇది సర్వత్రా ఉన్న సమస్య

54) ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి? మిశ్రమ రాష్ట్రాన్ని ఏర్పరచటమే ఈ సమస్యకు పరిష్కారమని ప్రొఫెసర్ ఘీవాలా నమ్ముతున్నారు ఇది ఆయనకు సొంతంగా తట్టిన పరిష్కార మార్గం కాదు లార్డ్ ఆక్టన్ సూచించిన పరిష్కారాన్నే ఘీవాలా కూడా వల్లింప చేస్తున్నారు అయితే ఈ పరిష్కారాన్ని సూచించడంలో లార్డ్ ఆక్టన్ కూడా పొరపాటు పడ్డారని చెప్పటానికి నేను సందేహించడం లేదు తన అభిప్రాయానికి మద్దతుగా లార్డ్ ఆక్టన్ ఆస్ట్రియా దేశాన్ని ఉదహరించారు ఇప్పుడు ఆస్ట్రియా గతి ఏమైందో చూసేందుకు దురదృష్ట వశాత్తు లార్డ్ ఆక్టన్ బతికిలేరు ఆస్ట్రియా మిశ్రమ దేశమే కాని, అక్కడ జాతులకు రక్షణ లేకుండా పోయి, జాతుల ఘర్షణల కారణంగా ఆస్ట్రియా తునాతునకలైంది అందువల్ల ఈ సమస్యకు నిజమైన పరిష్కారం మిశ్రమ రాష్ట్రం కాదు కుల ఆధిక్యతతో అధికారంలోకి వచ్చి ప్రజల పేరుమీద అధికారం చెలాయించే ఒక నిరంకుశ రాజ్యం ఏర్పడటమే దీనికి పరిష్కారం ఇందులో ప్రజలకు ఏ అధికారాలూ ఉండవు ఈ పరిష్కార మార్గాన్ని అమలు చేయడానికి ప్రొఫెసర్ ఘీవాలా సిద్ధపడతారా? దీనికి ఆయన సమాధానం ఏమై ఉంటుందో ఎవరూ సందేహించాల్సిన అవసరం లేదు

55) రెండో విషయం ఏమంటే సామాజిక దృక్పథంతో ఉపయోగించే జాతీయతకూ, రాజకీయ చట్టపరమైన దృక్పథంతో ఉపయోగించే జాతీయతకూ, అర్థం ఒకటేనని ప్రొఫెసర్ ఘీవాలా భ్రమపడ్డారు భాషా ప్రయుక్త రాష్ట్రాలను గురించి మాట్లాడే సందర్భంలో తాము జాతీయత గురించే మాట్లాడుతున్నామని ప్రజలు తరుచుగా పొరపడుతుంటారు అటువంటి సమయాలలో ఉపయోగించే జాతీయత అనే శబ్దానికి ఉన్న అర్థం కేవలం చట్టపరమైన, రాజకీయ పరమైన అర్థంలో కాక ఇతరత్రా అర్థంతో ఉపయోగించినదే భాషా ప్రయుక్త రాష్ట్రాలకు సంబంధించి నేను సూచించిన పథకంలో ప్రత్యేక ప్రాంతీయ, జాతీయత పెరుగుదలకు కూడా స్థానం లేదు నేను ప్రతిపాదించిన సూత్రం దానిని మొగ్గలోనే తుంచేసింది అందరూ సర్వసాధారణంగా ప్రతిపాదిస్తున్నట్లుగా ప్రాంతీయ భాషనే అధికార భాషగా చేస్తూ భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు చేసినప్పటికీ, స్వతంత్ర దేశాలకు ఉండేటటు వంటి సార్వభౌమత్వాన్ని ఆ రాష్ట్రాలు పొందలేవు

56) ప్రొఫెసర్ ఘీవాలా స్పష్టంగా ఏం కోరుకుంటున్నారు ? అన్న విషయం అర్థం

కాకుండా ఉంది స్థూలంగా చూస్తే ఆయన రెండు అంశాలను కోరుకుంటున్నట్టు కనబడుతోంది మిశ్రమ రాష్ట్రాలుండాలని ఆయన కోరుకుంటున్నారు అల్ప సంఖ్యాక వర్గాలను అధిక సంఖ్యాక వర్గాలు అణచి వేసే పరిస్థితి ఉండకూడదని ఆయన కోరుకుంటున్నారు ఈ రెండు లక్ష్యాల సాధనకు భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏ విధంగా అవరోధ మవుతాయో నాకు అర్థం కావడం లేదు ఎందుకంటే, భాషా ప్రాతిపదికన రాష్ట్రాలను పునర్నిర్మించినప్పటికీ-

(1) రాష్ట్రాలు వివిధ జాతుల సమ్మిళిత ప్రాంతాలుగానే కొనసాగుతూ, ప్రొఫెసర్ షీవాలా కోరుకుంటున్న మిశ్రమ రాష్ట్రాలను అందిస్తాయి

(2) అల్ప సంఖ్యాక సముదాయాల, జాతుల, రక్షణలకు మరింత స్పష్టమైన మిశ్రమ రాజ్యం కావాలని ప్రొఫెసర్ షీవాలా కోరుకున్నట్లయితే, కేంద్రంలో కచ్చితంగా, ఆయనకు అటువంటి మిశ్రమ రాజ్యం లభిస్తుంది

మిశ్రమ రాజ్యం, మంచి రాజ్యంగా కాని, సుస్థిరమైన రాజ్యంగా కానీ ఉంటుందని నేను అనుకోవడం లేదు అయితే, మిశ్రమ రాజ్యాన్నే ప్రొఫెసర్ షీవాలా కోరుకుంటున్నట్లయితే ఏదో ఒక రూపంలో దానిని ఆయన అటు కేంద్రంలోనూ ఇటు రాష్ట్రాలలోనూ పొందవచ్చు వివిధ రాష్ట్రాల ప్రతినిధుల రూపంలో కేంద్రంలోనూ, మిశ్రమ రాజ్యం ఏర్పడుతుంది

57) ఇక రెండో లక్ష్యం విషయానికొస్తే దానికి రెట్టింపు రక్షణ ఉంటుంది మిశ్రమ రాష్ట్రాలు ఏ రక్షణనైతే పౌరుడికిస్తాయని ఆయన అనుకుంటున్నాడో, భాషా ప్రయుక్త రాష్ట్రాలు కూడా ఆ రక్షణను ఇస్తాయి భారతదేశ మంతటా ఒకే పౌరసత్వం ఉంటుంది రాష్ట్రాల పౌరసత్వమనేది ఉండదు మహారాష్ట్రలోని మహారాష్ట్రీయునికి ఎటువంటి పౌరసత్వ హక్కులు ఉంటాయో, మహారాష్ట్రలోని గుజరాతీయునికి కూడా అటువంటి పౌరసత్వ హక్కులే ఉంటాయి ఈ వాస్తవాలను పరిశీలించిన పిమ్మట, భాషా ప్రయుక్త రాష్ట్రాలకు ప్రొఫెసర్ షీవాలా చెప్పగలిగే అభ్యంతరమేమిటో నేను అర్థం చేసుకోలేక పోతున్నాను

58) ప్రొఫెసర్ షీవాలా మరో రెండు సిఫారసులు కూడా చేశారు (1) రాష్ట్రాలను పునర్నిర్మాణం చేయాల్సి వస్తే వాటిని భాషా ప్రాతిపదికన కాకుండా, హేతుబద్ధ ప్రాతిపదికన పునర్నిర్మించాలి (2)జాతీయత అనే విషయాన్ని వ్యక్తిగత విషయంగా చేయాలి

59) భాషా ప్రాతిపదికన కాకుండా రాష్ట్రాలను ఆర్థిక ప్రాతిపదికన సహేతుక పద్ధతిలో, అంటే నా దృష్టిలో ఆర్థిక ప్రాతిపదికన పునర్నిర్మించడం అన్నది మరింత శాస్త్రీయంగానే కనిపిస్తున్నది అశాస్త్రీయమైన భాషా ప్రాతిపదికన రాష్ట్రాలన్న పునర్నిర్మాణం జరిగినా భారతదేశ ఆర్థిక వనరులను సహేతుకంగా వినియోగించుకోవడంలో అది ఏవిధంగా అవరోధమవుతుందో నేను అర్థం చేసుకోలేక పోతున్నాను రాష్ట్రాల సరిహద్దులు అనేవి కేవలం పాలనా పరమైన సరిహద్దులు మాత్రమే ఆర్థిక వనరుల సక్రమ వినియోగానికి అవి

ఏ విధమైన ఆర్థిక అడ్డుగోడలను ఏర్పరచవు ఒక భాషా ప్రయుక్త రాష్ట్రంలోని వనరులను ఆ రాష్ట్రంలోని ప్రజలు మాత్రమే ఉపయోగించుకోవాలనీ, ఇతరులెవరూ వాటిని ఉపయోగించుకోకూడదనేదే నియమం కనుక అయినట్లయితే, అప్పుడు భాషా ప్రయుక్త రాష్ట్రాల పథకం దురుద్దేశంతో కూడుకున్నదని నిస్సందేహంగా చెప్పవచ్చు కాని భాషా ప్రయుక్త రాష్ట్రాల పరిస్థితి అది కాదు తమకు గల వనరులను వినియోగించ గల సామర్థ్యం ఉందనుకుంటున్న వారెవరిపైన, నిషేధాలు విధించడానికి భాషా ప్రయుక్త రాష్ట్రం అనుమతించనంత వరకూ, హేతువాద ప్రాతిపదికన ఏర్పాటు చేసిన రాష్ట్రం అందించే లాభాలన్నిటినీ భాషా ప్రయుక్త రాష్ట్రమూ అందిస్తుంది

60) జాతీయతను వ్యక్తిగత విషయంగాచేసి దానిని మతంతో సమానమైన స్థానంలో ఉంచాలనే ప్రతిపాదనను ఊహాజనితమైన ప్రతిపాదనగా తోసి పుచ్చవచ్చు అది అనేక పాలనా సంబంధమైన సమస్యలను లేవనెత్తుతుంది ప్రపంచమంతా ఒకటైనప్పుడూ, అన్ని జాతులు దాని పౌరులైనప్పుడు అది అమలు లోకి వస్తుంది అప్పుడు జాతీయత అనేది ఎటువంటి ఉపయోగం లేని అంశంగా మారి అదృశ్యమవుతుంది

61) మహారాష్ట్రలో బొంబాయిని చేర్చేందుకు వ్యతిరేకిస్తున్న వారు చేస్తున్న వాదనలను, నేనింతవరకూ చర్చించాను అవి బలవత్తరమైన వాదనలని కాదు, నేనింత శ్రమతోనూ వాదిస్తున్నది, వారి వాదనలతో సామాన్యుడు తప్పుదోవ పట్టకూడదని నేను కోరుకోవడం వల్లనే నేనీ పని చేశాను వారి వాదనలతో సామాన్యుడు తప్పుదోవ పట్టేందుకు అవకాశాలున్నాయి అందుకు రెండుకారణాలున్నాయి ఒకటి - ఈ వాదనలు చేస్తున్న వారు సాధారణ వ్యక్తులు కారు వారు యూనివర్సిటీ ప్రొఫెసర్లు రెండు- బొంబాయిని మహారాష్ట్రలో చేర్చాలి అని ప్రొఫెసర్ గాడ్గిల్ చెప్పిన తరువాతనే ఈ ప్రొఫెసర్లందరూ తమ వాదనలతో ముందుకొచ్చారు దురదృష్టవశాత్తు ప్రొఫెసర్ గాడ్గిల్ వ్యతిరేకులు చేస్తున్న వాదనలను ఖండించడానికి ఇంతవరకూ ఎటువంటి ప్రయత్నమూ జరగలేదు ఫలితంగా ప్రొఫెసర్ గాడ్గిల్ వ్యతిరేకులు చేస్తున్న వాదనలే సబబుగా ఉన్నాయన్న అభిప్రాయం ఏర్పడి పోయింది ఈ అభిప్రాయాన్ని తొలగించాల్సిన అవసరం ఆవశ్యకమైంది

## రెండో వైపు వాదనలు

62 మహారాష్ట్రలో బొంబాయిని చేర్చాలంటున్న మహారాష్ట్రీయులకు అనుకూలంగా చాల బలంగానూ, న్యాయంగాను ప్రతిపాదించతగ్గ వాదనలు కొన్ని ఉన్నాయి అయితే వీటి గురించి ప్రొఫెసర్ గాడ్గిల్ వ్యతిరేకులు ఆలోచించి ఉండరు ఈ వాదనలు రాష్ట్రాల పునర్నిర్మాణ కమీషన్‌కు స్వతహాగానే తట్టే అవకాశం ఉంది కానీ, ఆ విషయాన్ని నమ్మి, నేను వాటిని వదిలేయదల్చుకోలేదు అందువల్లే, నేను వాటిని ఈ దిగువ ప్రతిపాదిస్తున్నాను వాటిని ఇక్కడ ప్రస్తావించడం అనవసరమని కమీషన్ అనుకోచ్చు అయినప్పటికీ వాటిని

నేను ప్రతిపాదిస్తున్నాను

## కలకత్తా - బొంబాయి

63) బొంబాయిని మహారాష్ట్రంలో చేర్చకుండా వదలివేసే విషయంపై ఒక నిర్ణయం తీసుకునే సమయంలో కమీషన్ వారు కలకత్తా విషయాన్ని కూడా పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది బొంబాయి మాదిరిగానే కలకత్తా కూడా మొత్తం తూర్పు భారతదేశానికి వాణిజ్యకేంద్రం బొంబాయిలో మహారాష్ట్రీయుల మాదిరిగానే కలకత్తాలో బెంగాలీలు కూడా అల్ప సంఖ్యాకులు బొంబాయిలో మహారాష్ట్రీయుల మాదిరిగానే కలకత్తాలో బెంగాలీలు వాణిజ్యానికీ, పరిశ్రమలకూ అధిపతులు కారు బొంబాయిలోని మహారాష్ట్రీయుల పరిస్థితికంటే కలకత్తాలోని బెంగాలీల పరిస్థితి మరింత దారుణంగా ఉంది బొంబాయి పరిశ్రమలకూ, వాణిజ్యానికీ కావల్సిన పెట్టుబడిని అందించామని చెప్పుకోలేక పోయినా, శ్రమనన్నా అందిం చామని కనీసం మహారాష్ట్రీయులు చెప్పుకోగలరు, కాని, బెంగాలీలు కనీసం అది కూడా చెప్పుకోలేరు మహారాష్ట్ర నుండి బొంబాయిని వేరు చేయాలంటున్న వాదనలను కమీషన్ వారు అంగీకరించే టట్లయితే, దాంతో సమానంగా, పశ్చిమ బెంగాల్ నుండి కలకత్తాను వేరు చేయాలని సిఫారసు చేయడానికి కూడా కమీషన్ సిద్ధపడాలి ఎందుకంటే, ఏ కారణాల వల్లనైతే బొంబాయిని మహారాష్ట్రనుండి వేరు చేయవచ్చునంటున్నారో, అదే కారణాలవల్ల కలకత్తాను మాత్రం పశ్చిమ బెంగాల్ నుండి ఎందుకు వేరు చేయకూడదు అన్న ప్రశ్న ఎదురవుతుంది

## బొంబాయి స్వయంపోషక ప్రాంతమేనా?

64) బొంబాయి నగరాన్ని ప్రత్యేక రాష్ట్రంగా వేరు చేసే ముందు, అది ఆర్థికంగా స్వయం పోషకమేనా అన్న అంశం రుజువు కావాలి నేను ఇంతకు ముందే చెప్పినట్లుగా బొంబాయి జమాఖర్చు లెక్కలు సరిగా రాసినట్లయితే, ప్రస్తుతం అమలులో ఉన్న పన్నులను బట్టి, అది స్వయం సమృద్ధి గల రాష్ట్రం కాలేదు అదే కనుక నిజమైతే బొంబాయిని ప్రత్యేక రాష్ట్రంగా సృష్టించాలన్న ప్రతిపాదన వీగిపోతుంది బొంబాయిని ఒరిస్సా, అస్సాం లాంటి రాష్ట్రాలతో పోల్చి లాభం లేదు ఎందుకంటే, పాలనా ప్రమాణ స్థాయి, జీవన ప్రమాణ సాయి, వేతనాల స్థాయి మొదలైనవన్నీ బొంబాయిలో చాల ఎక్కువ ఎంత ఎక్కువంటే, పన్నుల రేటును ఒకవేళ విపరీతంగా పెంచినప్పుడు గూడా, బొంబాయి తన ఖర్చులకు సరిపడా ఆదాయాన్ని సమకూర్చుకో గలుగుతుందా అన్నది నాకు సందేహమే

## గ్రేటర్ బొంబాయి వెనుక ఉన్న ఉద్దేశం

65) బొంబాయిని అనుకుని ఉన్న మహారాష్ట్ర ప్రాంతాలను తీసుకువచ్చి బొంబాయి ఏర్పాటుకు బొంబాయి ప్రభుత్వం ప్రదర్శించిన అనుచితమైన తొందర పాటువల్ల ప్రత్యేక

రాష్ట్రంగా బొంబాయి స్వయం పోషకత పట్ల గల సందేహం మరింతగా పెరిగింది. చుట్టుపట్ల ప్రాంతాలను బొంబాయిలో చేర్చడంలో గల ఉద్దేశం బొంబాయిని స్వయంపోషక రాష్ట్రంగా చేయడం తప్ప మరొకటి కాదని అనిపిస్తోంది. వారి ఉద్దేశం అది కాకపోతే మరింకేమై ఉంటుంది? బొంబాయి మహారాష్ట్రలో ఒక భాగంగా ఉన్నంత కాలం మహారాష్ట్రకు సంబంధించిన ఒక భాగాన్ని ఏ పాలనా ప్రాంతంలో చేర్చారన్నది మహారాష్ట్రీయులు పట్టించుకోనవసరం లేదు. బొంబాయి ప్రత్యేక రాష్ట్రం కాబోతున్నప్పుడు తమ ప్రాంతం నుండి వేరు పడటానికీ, బొంబాయిని సుసంపన్నంగా, స్వయం పోషకత గల ప్రాంతంగా చేయడానికీ మహారాష్ట్రీయులకు చాల కాలం పడుతుంది. గ్రేటర్ బొంబాయి పథకంలో వీటన్నిటికన్నా అతిముఖ్యమైన అంశం మరొకటి ఉంది. అదేమంటే, భాషా ప్రయుక్త రాష్ట్రాల కమీషన్‌పై అది ఒక బాధ్యతను మోపుతున్నది. బొంబాయిని మహారాష్ట్రీయులు వదులుకోవాలన్న గుజరాతీయుల డిమాండ్‌తో పాటుగా, బొంబాయిని స్వయంపోషక రాష్ట్రంగా చేయటానికి మహారాష్ట్రలోని కొంత ప్రాంతాన్ని కూడా అప్పగించాలనే వారి కోరికను కూడా మహారాష్ట్రీయులు అంగీకరించేటట్లు న్యాయంగా ఒత్తిడి తేగలమా లేదా అన్నది, భాషా ప్రయుక్త రాష్ట్రాల కమిషన్ నిర్ణయించుకోవాల్సి ఉంటుంది. ఈ నిర్ణయం తీసుకోవాల్సిన బాధ్యత నుండి కమీషన్ తప్పించుకోలేదు.

66) బొంబాయి, మహారాష్ట్రలు ఒక దానిపై మరొకటి ఆధారపడిన ప్రాంతాలు మాత్రమే కాదు. అవి నిజంగా ఒకటే, ఒక దానిలో మరొకటి అంతర్భాగాలే. ఆ రెండింటి మధ్య ఎడబాటు ఆ రెండింటికీ ప్రమాదకరమే. బొంబాయికి కావల్సిన విద్యుచ్ఛక్తి, మంచి నీటి వనరులు బొంబాయి వెలుపల గల మహారాష్ట్రలో ఉన్నాయి. మహారాష్ట్ర మేధావి వర్గమంతా బొంబాయిలో నివసిస్తోంది. మహారాష్ట్ర నుండి బొంబాయిని వేరు చేయడమంటే బొంబాయి ఆర్థిక జీవనాన్ని కష్టాల పాలు చేయడమూ, తమ మేధావి వర్గం నుండి మహారాష్ట్ర ప్రజలను విడదీయడమూ అవుతుంది. వారి నాయకత్వం లేకుండా మహారాష్ట్ర ప్రజలు మనుగడ సాగించలేరు.

## పరిష్కార మార్గంగా మధ్యవర్తిత్వం

67) మధ్యవర్తిత్వం ద్వారా బొంబాయి సమస్యను పరిష్కరించాలన్న సూచనను కొంతమంది చేస్తుండటం నేను గమనించాను. ఇంతకంటే అర్థరహితమైన మరొక ప్రతిపాదనను నేనెన్నడూ వినలేదు. వైవాహిక సమస్యను మధ్యవర్తిత్వం ద్వారా పరిష్కరించుకోవాలని సూచిస్తే ఎంత అర్థరహితంగా ఉంటుందో ఇదీ అంతే అర్థరహితంగా ఉంది. వైవాహిక సంబంధమనేది మూడో వ్యక్తి విడదీయలేనంత వ్యక్తిగతమైంది. బైబిలు సూక్తి చెప్పినట్టుగా బొంబాయి, మహారాష్ట్రలను ఆ భగవంతుడే ముడి వేశాడు. ఏ మధ్యవర్తి వాటిని వేరు చేయలేడు. అలా చేసేందుకు అధికారమున్న ఏకైక సంస్థ రాష్ట్రాల పునర్నిర్మాణ కమీషనే. అదేం నిర్ణయిస్తుందో చూద్దాం.

అనువాదం : పి. బాలకృష్ణ


కాశ్మీర్
పశ్చిమ పంజాబ్
తూర్పు పంజాబ్
బెలుచిస్తాన్
సింధ్
రాజస్థాన్
నేపాల్
గుజరాత్
హిందీ ప్రాంతం
అస్సాం
తూర్పు బెంగాల్
పశ్చిమ బెంగాల్
డామన్
బొంబాయి
మహారాష్ట్ర
మరాఠ్వాడా
ఒరిస్సా
బర్మా
గోవా
కరవార్
కర్ణాటక
ఆంధ్ర
తమిళ్

# 4

# అదుపులు-సమతుల్యాల ఆవశ్యకత

భాషా ప్రయుక్త రాష్ట్రాలపై వ్యాసం

*టైమ్స్ ఆఫ్ ఇండియా, 23 ఏప్రిల్ 1953 నాటి పత్రిక నుంచి*

# అదుపులు – సమతుల్యాల ఆవశ్యకత

భారతదేశంలో భాషా ప్రయుక్త రాష్ట్రాల సమస్య ఎప్పటినుండో ఉన్నప్పటికీ, 150 సంవత్సరాలకు పైగా ఈ దేశాన్ని పాలించిన బ్రిటిష్ వారెన్నడూ ఆ సమస్య గురించి ఆలోచించ లేదు బహు భాషా ప్రాంతాలలో నివసిస్తున్న ప్రజల సాంస్కృతిక వాంఛలను ఈడేర్చే అంశంపై కన్నా, దేశం మొత్తం మీద శాంతిభద్రతల నిర్వహణ, సుస్థిర పరిపాలన ఏర్పరచడం అన్న అంశాలపైనే వారెక్కువగా ఆసక్తి చూపారు తాము నిర్మించిన పాలనా వ్యవస్థలో, భాషా సమస్యల దృష్ట్యా కొన్ని మార్పులు చేయడం అవసరమన్న విషయాన్ని, వారు తమ పాలన అంతిమ దశలో గ్రహించారన్నది పరమ సత్యం ముఖ్యంగా బహు భాషల సమ్మేళనం ప్రస్ఫుటంగా ఉన్న ప్రాంతాలలో ఎట్టి పరిస్థితులలోనైనా ఇవి తప్పని సరి అని వారు తెలుసుకున్నారు ఉదాహరణకు వారు ఈ దేశాన్ని వదలి వెళ్లి పోయే ముందు బెంగాల్, బీహార్, ఒరిస్సా రాష్ట్రాలను భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు చేశారు వారు తమ పాలనను కొనసాగించి ఉన్నట్లయితే, భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటును కడవరకూ కొనసాగించి ఉండేవారా లేదా అన్న అంశాన్ని ఇప్పుడు చెప్పడం కష్టం

భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు గురించి బ్రిటిష్ వారు ఆలోచించడానికి పూర్వమే చాలాకాలం క్రితమే, మహాత్మాగాంధి నాయకత్వంలోని కాంగ్రెస్ 1920 సంవత్సరంలోనే భాషా ప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికన తనకంటూ ఒక రాజ్యాంగాన్ని రూపొందించుకుంది సైద్ధాంతికంగా పూర్వాపరాలు లోతుగా ఆలోచించాకనే, కాంగ్రెస్ తన రాజ్యాంగాన్ని రూపొందించిందా లేక ప్రజలను తన పరిధిలోకి ఆకర్షించడానికే ఈ పని చేసిందా అన్న అంశంపై ఊహాగానాలు చేయడానికి ఇప్పుడు ఆగి ఆలోచించాల్సిన పని లేదు భాషా సమస్యలను పరిగణనలోకి తీసుకోవడం ముఖ్యమన్న విషయాన్ని బ్రిటిష్‌వారు గ్రహించారనడంలో సందేహం లేదు తాము పరిగణనలోకి తీసుకున్న అంశాలను అమలులో పెట్టేందుకు వారు కొంత మేరకు ప్రయత్నించారు

## వ్యతిరేకత

తనకు తానుగా 1920లో సృష్టించుకున్న రాజ్యాంగం ద్వారా భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు బాధ్యతను నిర్వహించాల్సిన అవసరం 1945 వరకూ కాంగ్రెస్‌కు రాలేదు 1945లో అధికారాన్ని చేపట్టిన తర్వాత మాత్రమే భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు బాధ్యతను నిర్వహించాల్సిన అవసరం కాంగ్రెస్‌కు కలిగింది ఈ విషయానికి సంబంధించి ఇటీవలి చరిత్రలోకి వెళ్లి చూద్దాం భారతదేశంలో భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు చేయాలని కోరుతూ పార్లమెంట్ సభ్యు డొకరు ప్రవేశపెట్టిన తీర్మానం ద్వారా ఈ సమస్య విషయంలో అవసరమైన చలనం కలిగింది ప్రభుత్వం తరపున ఆ చర్చకు సమాధానం ఇవ్వవలసిన బాధ్యత నాపై పడింది ఈ సమస్యకు సంబంధించి, పై స్థాయిలో ఉన్నవారి ఖచ్చితమైన అభిప్రాయం ఏమిటో తెలుసుకుందామన్న ఉద్దేశంతో, సహజంగానే, నేను ఆ విషయాన్ని వారి దృష్టికి తీసుకు వచ్చాను ఆశ్చర్యం కలిగించే విషయం ఏమిటంటే భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు అధిష్టానవర్గ మంతా పూర్తిగా వ్యతిరేకంగా ఉందని నాకు అప్పుడు స్పష్టమైంది ఇటువంటి పరిస్థితులలో చర్చకు సమాధానం ఇవ్వాల్సిన బాధ్యతను ప్రధానమంత్రి తీసుకోవడమే పరిష్కారంగా కనిపించింది ఆ చర్చకు సమాధానమిస్తూ ప్రధానమంత్రి వెంటనే ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేసేందుకు హామీ ఇస్తూ ఒక ప్రకటన చేశారు ప్రధానమంత్రి చేసిన ప్రకటనను ఆధారంగా తీసుకుని ఆ తీర్మానాన్ని ఉపసంహరించడం జరిగింది ఆ విషయం అక్కడితో ఆగిపోయింది

## రెండో పర్యాయం

రాజ్యాంగ రచనా కమిటీ ఛైర్మెనుగా రెండోసారి నేనా సమస్యను పరిశీలించాల్సి వచ్చింది రాజ్యాంగ రచన పూర్తయిన తర్వాత ప్రధానమంత్రికి నేనొక లేఖ రాశాను భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు తీర్మానంపై చర్చ జరిగిన సందర్భంలో ప్రధానమంత్రి ఇచ్చిన వాగ్దానం దృష్ట్యా రాజ్యాంగంలో పార్ట్ "ఏ" భాగం రాష్ట్రాల జాబితాలో, ఆంధ్రను ప్రత్యేకరాష్ట్రంగా చేర్చవచ్చా అని ఆ లేఖలో నేను ఆయనను కోరాను అప్పుడు కచ్చితంగా ఏం జరిగిందో, జ్ఞప్తి చేసుకుని చెప్పేందుకు ఇప్పుడు నా దగ్గర ఆధారా లేమీ లేవు కాని, రాజ్యాంగసభ అధ్యక్షుడుగా ఉన్న డాక్టర్ రాజేంద్రప్రసాద్, భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు సమస్యను పరిశీలించేందుకు గాను ఉత్తరప్రదేశ్‌కు చెందిన న్యాయవాది అయిన "ధార్" అధ్యక్షతన ఒక కమిటీని నియమించారు

ధార్ కమిటీని ప్రజలు ఏ విషయంలో గుర్తు పెట్టుకోకపోయినా ఒక విషయంలో మాత్రం బాగా గుర్తు పెట్టుకుంటారు- అదేమిటంటే, మహారాష్ట్రను కనుక భాషా ప్రయుక్త రాష్ట్రంగా ఏర్పాటు చేసినట్లయితే, ఎట్టి పరిస్థితుల్లోను బొంబాయి నగరాన్ని మహారాష్ట్రలో

చేర్చకూడదని ఆ కమిటి చెప్పింది ఆ నివేదికను అప్పటి జయపూర్ కాంగ్రెస్ సమావేశం పరిశీలించింది భాషా ప్రయుక్త రాష్ట్రాల సమస్యను పరిశీలించడానికి ప్రధానమంత్రి, వల్లభ్ భాయి పటేల్, డాక్టర్ పట్టాభి సీతారామయ్యలతో కూడిన త్రిసభ్య సంఘాన్ని జయపూర్ కాంగ్రెస్ నియమించింది ఆ కమిటీ ఒక నివేదికను తయారు చేసింది ఆ నివేదిక సారాంశం ఏమిటంటే వెంటనే ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలనీ మద్రాసు నగరం మాత్రం తమిళులకే ఉండాలనీ అందుకు సంబంధించిన వివరాలను పరిశీలించడానికి మరొక కమిటీని నియమించారు ఆ కమిటీ దాదాపుగా ఏకగ్రీవంగా ఒక నివేదికను తయారు చేసింది మద్రాసుపై తమకు గల హక్కును వదలుకోడానికి సిద్ధంగాలేని టంగుటూరు ప్రకాశం పంతులుతో సహా కొంతమంది ఆంధ్ర ప్రముఖులు ఆ నివేదికను వ్యతిరేకించారు దాంతో అది మరుగున పడిపోయింది

ఆ తరువాత ఆంధ్ర రాష్ట్రం కోసం శ్రీ పొట్టి శ్రీరాములు తన జీవితాన్నే త్యాగం చేయవల్సి వచ్చింది కాంగ్రెస్ వారు అందరూ న్యాయమైనదని అంగీకరించిన ఆశయం కోసమే శ్రీరాములు అసువులు బాయవల్సి రావడం నిజంగా అధికార పార్టీకి దురదృష్టకరమైన విషయం నూతన ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటు కోసం ప్రధానమంత్రి ఇప్పుడు చేస్తున్న ఆలోచన దివంగత శ్రీరాములు ఆత్మకు పిండదానం మాత్రమే అవుతుంది ప్రభుత్వం తరఫున ఇటువంటి పొరపాటు జరగడం మరే దేశంలోనైనా సహిస్తారా అన్న దానిని ఊహించుకొని ప్రయోజనం లేదు

నా ఉద్దేశంలో, భాషా ప్రయుక్త రాష్ట్రాన్ని ఏర్పాటు చేసేముందు అది తప్పనిసరిగా మూడు అంశాలను సంతృప్తి పరచగలిగి ఉండాలి మొదటి అంశం ఏమంటే అది తప్పనిసరిగా స్వయంపోషక రాష్ట్రమై ఉండాలి రాజ్యాంగాన్ని రూపొందించే సమయంలో భారత సంస్థానాల విలీన సమస్యను పరిశీలిస్తున్నప్పుడు ఈ నియమం తప్పని సరైనదిగా అంగీకరించారు స్వయంపోషకత గల భారత సంస్థానాలను మాత్రమే స్వతంత్ర రాష్ట్రాలుగా ఉండేందుకు అనుమతించారు మిగిలిన వాటిని ఇరుగు పొరుగు రాష్ట్రాలతో విలీనం చేశారు

## ఒక సహారా ?

ప్రతిపాదిత ఆంధ్ర రాష్ట్రం స్వయం పోషకత గల రాష్ట్రమేనా? ప్రతిపాదిత ఆంధ్ర రాష్ట్ర వార్షిక రెవిన్యూలోటు 5 కోట్ల రూపాయల వరకూ ఉండవచ్చునని జస్టిస్ వాంఛూ నిక్కచ్చిగా అంగీకరించారు వ్యయాన్ని తగ్గించుకోవడం ద్వారా గానీ, పన్నులను పెంచడం ద్వారా కానీ ఈ లోటును పూడ్చుకోవడం ప్రతిపాదిత ఆంధ్ర రాష్ట్రానికి సాధ్యమౌతుంది ఈ సమస్యను ఆంధ్ర రాష్ట్రం తప్పనిసరిగా ఎదుర్కోవాల్సి వస్తుంది ఈ లోటును పూడ్చే బాధ్యతను కేంద్రం తీసుకుంటుందా? అలా అయితే, అది ఒక్క ప్రతిపాదిత ఆంధ్ర రాష్ట్రం విషయంలోనేనా? అటువంటి సమస్య ఉన్న రాష్ట్రాలన్నిటికీ దానిని

విస్తరింప జేస్తారా? ఇవన్నీ పరిశీలించాల్సిన ప్రశ్నలే

నూతన ఆంధ్ర రాష్ట్రానికి స్థిరమైన రాజధాని అంటూ ఏదీ లేదు రాజధాని లేకుండా రాష్ట్రాన్ని ఏర్పాటు చేయడమన్నది నేనింతవరకు ఎన్నడూ వినలేదని సందర్భవశాత్తూ చెబుతున్నాను ప్రతిపాదిత ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం ఒక్క రాత్రయినా మద్రాసు నగరంలో ఉండేందుకు అనుమతించే కనీస మర్యాదను కూడా శ్రీ రాజగోపాలాచారి (నిఖార్సయిన తమిళ జాతీయ వాది) చూపడు. హిందువులంతా అతిథులపట్ల మర్యాద చూపాలని హిందూ ధర్మం ప్రబోధిస్తూ వుంది అటువంటి అతిథి మర్యాదను కూడా రాజగోపాలాచారి పాటించటం లేదు తన రాజధాని స్థలాన్ని ఎంపిక చేసుకునే బాధ్యతనూ, తన కార్యకలాపాల నిర్వహణ కోసం తాత్కాలింగా పాకలను నిర్మించుకునే భారాన్నీ నూతన ప్రభుత్వానికే వదలివేశారు ఏ ప్రాంతాన్ని అది ఎంపిక చేసుకుంటుంది? ఏం పెట్టి అది తన తాత్కాలిక కార్యాలయాలను నిర్మించుకుంటుంది ఆంధ్ర ఒక పెద్ద సహారా ఎడారి అందులో ఒయాసిస్సులు లేవు ఈ సహారాలో అది ఒక ప్రాంతాన్ని తాత్కాలికంగా ఎంపిక చేసుకున్నట్లయితే అది తప్పనిసరిగా మరింత మెరుగైన ప్రాంతానికి తన కార్యాలయాలను మార్చుకోవాల్సి వస్తుంది అప్పుడు తాత్కాలిక రాజధానిపై పెట్టిన ఖర్చు అంతా వృధ అవుతుంది ప్రభుత్వం ఈ అంశాన్ని గురించి ఆలోచించిందా? శాశ్వత రాజధాని కాగల ప్రాంతాన్ని వారికి ఇప్పుడే ఎందుకు ఇవ్వకూడదు?

ఈ దృష్ట్యా చూసినప్పుడు వరంగల్ బాగా అనువైన ప్రాంతమని నాకు అనిపిస్తున్నది అది ఆంధ్రుల పురాతన రాజధాని రైల్వే కూడలి కూడా అక్కడ పెద్ద పెద్ద భవంతులు అనేకం ఉన్నాయి అయితే అది హైదరాబాద్ రాష్ట్రంలో భాగంగా ఉన్న ఆంధ్ర ప్రాంతంలో ఉన్న మాట నిజం సూత్ర రీత్యా చూస్తే చాలా పెద్దగా భయంకరంగా ఉన్న హైదరాబాద్ రాష్ట్రాన్ని భాషా ప్రాతిపదికపై విడదీసి కొత్త ఆంధ్ర రాష్ట్రంలో చేర్చి సంపూర్ణ ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేసి ఉండాల్సింది ఈ ప్రతిపాదనలో ప్రధానమంత్రి అంతరాత్మకు అభ్యంతర మేదైనా ఉన్నట్లయితే కనీసం హైదరాబాదులోని ఆంధ్ర భాగాన్ని అంతః క్షేత్రంగా చేసి నూతన ఆంధ్ర రాష్ట్రానికి దానిని జతపరచి, రాజధానిగా వరంగల్‌కు మార్గం సుగమం చేయవచ్చు కదా? భారతదేశానికి విదేశీ అంతః క్షేత్రాలు కొత్తకాదు కాని ప్రధానమంత్రి హైదరాబాదు విషయంలోనూ, కాశ్మీర్ విషయంలోనూ భగవదేచ్ఛకు వ్యతిరేకంగా నడుచుకోవాలని చూస్తున్నారు అతి తొందరలోనే దాని ఫలితాలను ఆయన తెలుసుకుంటారని నేను కచ్చితంగా చెప్పగలను

## మొదటి అంశం

ఇది కేవలం ఆనుషంగిక విషయం కాని నేను ప్రధానంగా చెప్పే దేమంటే భాషా ప్రయుక్త రాష్ట్ర మనేది స్వయంపోషక రాష్ట్రంగా ఉండి తీరాలి అని భాషా ప్రయుక్త

రాష్ట్రాన్ని ఏర్పాటు చేసేటప్పుడు ఇదే మొదటి అంశంగా ఉండాలి ఇక రెండో అంశమేమంటే, భాషా ప్రయుక్త రాష్ట్రంలో ఏ పరిణామాలు జరగవచ్చునో గుర్తించడం అనేది దురదృష్ట వశాత్తూ భారతదేశ జనాభా సర్వేపై ఎవరూ శ్రద్ధ వహించి లెక్కలు సేకరించలేదు మన జనాభా నివేదికలను బట్టి ఎంతమంది హిందువులున్నారు? ఎంత మంది ముస్లింలున్నారు? ఎంతమంది యూదులున్నారు? ఎంతమంది క్రైస్తవులున్నారు? ఎంతమంది అంటరానివారు ఉన్నారు? అన్న విషయాన్ని మాత్రమే మనం తెలుసుకోగలుగుతాము నివేదికలు అందించే సమాచారం ఎన్ని మతాలు ఉన్నాయి అన్న విషయాన్ని తెలుసుకోవడానికి తప్ప మరెందుకూ పనికిరాదు మనం తెలుసుకోవాల్సిన విషయమేమంటే, వివిధ భాషా ప్రయుక్త ప్రాంతాలలో కులాల వారీగా జనవిభజన ఎలా ఉందన్నది ఈ విషయానికి సంబంధించి మన దగ్గర బహు తక్కువ సమాచారం మాత్రమే ఉంది ఎవరికి వారు తమకు తెలిసిన సమాచారంపైనా, తమకున్న అవగాహనపైనా మాత్రమే ఆధారపడాల్సి వస్తున్నది భాషా ప్రయుక్త ప్రాంతాల్లో ఒకటి రెండు ప్రధాన కులాలు పెద్ద సంఖ్యలో వుంటాయి అల్పసంఖ్యాక కులాలు ఆ ప్రధాన కులాలపై ఆధారపడి అణిగిమణిగి ఉండవలసి వచ్చే కుల వ్యవస్థ సాధారణంగా భాషా ప్రయుక్త ప్రాంతాల్లో ఏర్పడగలదనేది ఖండించతగ్గ అంశ మవుతుందని నేను అనుకోవడం లేదు

## కుల మత వ్యవస్థ

కొన్ని ఉదాహరణలు గమనించండి పెప్సులోని పంజాబ్‌నే తీసుకోండి జాట్‌లే ఆ ప్రాంతమంతా ఆధిపత్యం చెలాయిస్తుంటారు అంటరాని కులాలవారు వారిపై ఆధారపడి బతుకుతుంటారు ఆంధ్రనే తీసుకోండి- ఆ భాషా ప్రాంతమంతటా రెండు లేక మూడు ప్రధాన కులాలు విస్తరించి ఉన్నాయి వారు రెడ్లూ, కమ్మలూ, కాపులూ అయి ఉంటారు మొత్తం భూమి అంతా వారిదే అన్ని ఉద్యోగాలు, అన్ని వ్యాపారాలు వారివే అంటరాని కులాల వారు వారిపై ఆధారపడి బతుకుతుంటారు మహారాష్ట్ర ఉదాహరణ తీసుకుందాం మహారాష్ట్రలోని ప్రతి గ్రామంలోనూ మరాఠా కులస్థులు పెద్ద సంఖ్యలో ఉన్నారు బ్రాహ్మలూ, గుజార్లూ, కోలీలూ, అంటరానివారూ వారికి అణగి సహకరిస్తూ బతుకుతుంటారు బ్రాహ్మలూ, బనియాలూ ఎటువంటి భయం లేకండా జీవించిన కాల మొకటుంది కాని ఇప్పుడు కాలం మారిపోయింది గాంధీ హత్యానంతరం మరాటాలనుండి బ్రాహ్మలూ, బనియాలూ ఎంతటి వేధింపును ఎదుర్కొన్నారంటే భద్రత కోసం వారు పట్టణాలకు పారిపోవలసి వచ్చింది మెజారిటీ మరాటా కులస్తుల నిరంకుశత్వాన్ని భరించేందుకు దౌర్భాగ్యులైన అంటరానివారూ, కోలీలూ, మాలీలు మాత్రమే గ్రామాల్లో మిగిలారు ఈ కుల వ్యవస్థ ఏర్పాటును మరిచిపోయిన వారు తమకు తాము ఆపద కోరి తెచ్చుకున్నట్లే

భాషా ప్రయుక్త రాష్ట్రాల్లో చిన్న కులాలవారు ఎదురు చూసేందుకు ఏం మిగిలి

ఉంటుంది శాసన సభకు ఎన్నిక కాగలమని వారాశించగలరా? ప్రభుత్వ ఉద్యోగాలలో తమ కంటూ ఒక స్థానాన్ని నిలబెట్టుకోగలమని వారాశించగలరా? తమ ఆర్థికాభివృద్ధి కోసం ప్రభుత్వం శ్రద్ధ వహిస్తుందని వారాశించగలరా? ఈ పరిస్థితుల్లో భాషా ప్రయుక్త రాష్ట్రాలను సృష్టించడం అంటే దానర్థం మెజారిటీ కులస్తులకు స్వరాజ్యాన్ని అప్పగించడమే గాంధి కలలు కన్న స్వరాజ్యానికి ఎటువంటి ముగింపు! సమస్యలోని ఈ అంశాన్ని అర్థం చేసుకోలేనివారు, వాటిని భాషా ప్రయుక్త రాష్ట్రాలు అని కాకుండా, జాట్ రాష్ట్రం, మరాఠా రాష్ట్రం, రెడ్డి రాష్ట్రం అని అనేట్లయితే బాగా అర్థం చేసుకోగలుగుతారు

## మూడో అంశం

భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటు చేసే విషయంలో పరిశీలించాల్సిన మూడో అంశ మేమంటే, అలా ఏర్పాటు చేయడం వల్ల ఒకే భాష మాట్లాడే ప్రజలంతా ఒక రాష్ట్రంలోకి సంఘటిత మవుతారా లేదా అన్నది మహారాష్ట్రీయులందరిని కలిపి ఒక మహారాష్ట్ర రాష్ట్రంలోకి జమ చేయాలా? ఆంధ్రప్రాంత మంతటినీ ఆంధ్ర రాష్ట్రంలో చేర్చాలా? ఏకీకరణకు సంబంధించిన ఈ ప్రశ్న కేవలం కొత్త రాష్ట్రాలకు మాత్రమే సంబంధించినది ప్రస్తుతం భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా కొనసాగుతున్న యు పి , బీహార్, పశ్చిమ బెంగాల్ వంటి రాష్ట్రాలకు కూడా ఇది వర్తిస్తుంది యు పి లో జరిగినట్లుగా హిందీ మాట్లాడే ప్రజలందరిని ఒకే రాష్ట్రంలోకి ఎందుకు సంఘటితం చేయాలి సంఘటితం కావాలని కోరుతున్న వారందరినీ, వారేమైనా ఇతర రాష్ట్రాలపైకి యుద్ధానికి వెళ్లాలని కోరుకుంటున్నారా? అని అడిగి తీరాలి ఈ ఏకీకరణే కనుక ప్రత్యేక చైతన్యాన్ని కలుగజేస్తే, కాలక్రమేణా మనకు, మౌర్య సామ్రాజ్య విచ్ఛిన్నానంతరం ఎటువంటి భారతదేశమైతే ఉందో దాదాపుగా అటువంటి భారతదేశమే, మిగులుతుంది విధి మనల్ని ఆ దిశకు నడిపిస్తున్నదా?

భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు చేయకూడదని దీనర్థం కాదు దీని అర్థమేమి టంటే, భాషా ప్రయుక్త రాష్ట్రం ముసుగులో మెజారిటీకులస్తులు తమ అధికారాన్ని దుర్వినియోగ పరచకుండా చూసేందుకు కచ్చితంగా కొన్ని అదుపులు, సమతుల్యాలు ఉండితీరాలి, అని

**అనువాదం : పి.బాలకృష్ణ**

# భాషా ప్రయుక్త రాష్ట్రాలపై ఆలోచనలు

## ఉపోద్ఘాతం

భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు అనేది వెంటనే పరిష్కరించాల్సిన సమస్య ఈ సమస్యపై అనుకూల ప్రతికూల వాదులు తమతమ అభిప్రాయాలకు అనుకూలంగా దేశంలో సాగిస్తున్న ప్రచారంలో కాని, పార్లమెంటులో జరిగిన చర్చల్లో గాని నా అనారోగ్యం వల్ల పాలుపంచుకోలేక పోయినందుకు నేను చింతిస్తున్నాను కాని అది నేను మౌనంగా చూస్తూ ఊరుకోలేనంత అతి ముఖ్యమైన సమస్య నా నుండి ఎటువంటి ప్రతిస్పందన లేకపోవడానికి గల కారణమేమిటో తెలియకుండానే చాలమంది నన్ను ఆడిపోసుకుంటున్నారు

అందువల్లనే, నేను నా అభిప్రాయాలను రాతపూర్వకంగా తెలియ పరచాలనే ప్రత్యామ్నాయ మార్గాన్ని ఎంచుకున్నాను

నేను ఇంతకుముందు కొన్ని బహిరంగ ప్రకటనలలో వ్యక్తం చేసిన అభిప్రాయాలకూ, ఈ కరపత్రంలో వ్యక్తం చేస్తున్న అభిప్రాయాలకూ కొంత తేడా ఉన్నట్లు పాఠకులకు అనిపించవచ్చు నా దృష్టిలో అటువంటి తేడాలు బహుస్వల్పం మాత్రమే నేనింతకుముందు చేసిన ప్రకటనలు అసంపూర్ణ సమాచారం ఆధారంగా చేసినవి అప్పటికి ఈ సమస్యకు సంబంధించి నాకు సంపూర్ణ అవగాహన లేదు ఎస్ ఆర్ సి నివేదిక వెలువడినప్పుడు మొట్టమొదటి సారిగా అది నా దృష్టిలో పడింది విమర్శకుడికి కనిపించే నా అభిప్రాయాలలోని మార్పుకు ఈ సమర్థన చాలుననుకుంటాను

ద్వేషభావంతోనూ, దుర్బుద్ధితోనూ నా ఆలోచనలో వ్యక్తమైన వైరుధ్యాలను సాకుగా తీసుకుని నన్ను ఆడిపోసుకోదలచుకునే విమర్శకుడికి నేనిచ్చే సూటి సమాధానం ఇదే

నిలకడ అనేది గార్ధభ లక్షణమని ఎమర్సన్ వ్యాఖ్యానించి వున్నారు నన్ను నేను గాడిదను చేసుకోవాలని కోరుకోవటం లేదు ఆలోచించే ఏ మనిషైనా, నిలకడ పేరుతో ఒకే అభిప్రాయానికి కట్టుబడి ఉండాలని అనుకోకూడదు నిలకడ కన్నా ముఖ్యమైనది బాధ్యత తాను నేర్చుకున్న అంశాలను మరచిపోవటమెట్లాగో కూడా బాధ్యతాయుతమైన వ్యక్తి తెలుసుకుని ఉండాలి. పునరాలోచించి తన ఆలోచనలను మార్పు చేసుకోగల ధైర్యం కూడా బాధ్యతాయుతమైన వ్యక్తికి ఉండి తీరాలి తాను నేర్చుకున్న విషయాలను మరచిపోవడానికి తగిన సరైన కారణాలు ఉన్నప్పుడే ఆ పని చేయాలి ఆలోచించటంలో అంతిమదశ అంటూ ఏమీ ఉండకూడదు

భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు అత్యవసరమే అయినప్పటికీ దానిని ఏ విధమైన జబర్దస్తీతోనూ నిర్ణయించకూడదు రాగద్వేష రహితమైన హేతుబద్ధ పద్ధతిలో ప్రశాంతంగా ఆలోచించి ఆ సమస్యను పరిష్కరించాలి నేను చేసింది, నా పాఠకులను చేయవలసిందిగా కోరుతోంది కూడా అదే

బి ఆర్. అంబేడ్కర్

1955 డిసెంబర్ 23
మిలింద్ మహావిద్యాలయం,
నాగ్‌సేన్ వనం, కాలేజ్ రోడ్,
ఔరంగాబాద్ (డివిజన్)

## ఒకటవ భాగం

## అధ్యాయం–1

# కమిషన్ కృషి

## భాషావాదం తప్ప మరేమీలేదు

ప్రస్తుత భారత రాజ్యాంగం షెడ్యూలులో పేర్కొన్న ఈ క్రింది రాష్ట్రాలను గుర్తిస్తోంది

| పార్ట్ 'ఏ' రాష్ట్రాలు | పార్ట్ 'బి' రాష్ట్రాలు | పార్ట్ 'సి' రాష్ట్రాలు |
|---|---|---|
| 1 ఆంధ్ర | 1 హైదరాబాదు | 1 అజ్మీర్ |
| 2 అస్సాం | 2 జమ్ము, కాశ్మీర్ | 2 భోపాల్ |
| 3 బీహార్ | 3 మధ్యప్రదేశ్ | 3 కూర్ |
| 4 బొంబాయి | 4 మైసూర్ | 4 ఢిల్లీ |
| 5 మధ్యప్రదేశ్ | 5 పాటియాలా | 5 హిమాచల్ప్రదేశ్ |
| 6 మద్రాసు | 6 రాజస్థాన్ | 6 కచ్ |
| 7 ఒరిస్సా | 7 సౌరాష్ట్ర | 7 మణిపూర్ |
| 8 పంజాబ్ | 8 ట్రావెన్కోర్ | 8 త్రిపుర |
| 9 ఉత్తరప్రదేశ్ | 9 కొచ్చిన్ | 9 వింధ్యప్రదేశ్ |

నూతన రాష్ట్రాలను ఏర్పాటు చేసే అధికారాన్ని రాజ్యాంగంలోని మూడవ నిబంధన పార్లమెంటుకు ఇచ్చింది భాషా ప్రాతిపదిక రాష్ట్రాలను పునర్వ్యవస్థీకరించాలని ఎంతో డిమాండ్ ఉన్నా, అలా పునర్ వ్యవస్థీకరణకు సమయం లేనందున ఈ ఏర్పాటు చేశారు ఎడతెరిపి లేని ఈ కోరికలను దృష్టిలో ఉంచుకుని పరిశీలించేందుకు ప్రధానమంత్రి రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ సంఘాన్ని నియమించారు ఆ సంఘం తన నివేదికలో ఈ దిగువ రాష్ట్రాల ఏర్పాటుకు సిఫారసు చేసింది

ప్రతిపాదిత నూతన రాష్ట్రాలు

| | రాష్ట్రంపేరు | విస్తీర్ణం (చ॥మైళ్లలో) | జనాభా (కోట్లలో) | భాష |
|---|---|---|---|---|
| 1 | మద్రాసు | 50,170 | 3 00 | తమిళం |
| 2 | కేరళ | 14,980 | 1 36 | మళయాళం |
| 3 | కర్నాటక | 72,730 | 1 90 | కన్నడ |
| 4 | హైదరాబాదు | 45,300 | 1 13 | తెలుగు |
| 5 | ఆంధ్ర | 64,950 | 2 09 | తెలుగు |
| 6 | బొంబాయి | 1,51,360 | 4 02 | మిశ్రమభాష |
| 7 | విదర్భ | 36,880 | 0 76 | మరాఠీ |
| 8 | మధ్యప్రదేశ్ | 1,71,200 | 2 61 | హిందీ |
| 9 | రాజస్థాన్ | 1,32,300 | 1 60 | రాజస్థానీ |
| 10 | పంజాబ్ | 58,140 | 1 72 | పంజాబీ |
| 11 | ఉత్తరప్రదేశ్ | 113,410 | 6 32 | హిందీ |
| 12 | బీహార్ | 66,520 | 3 82 | హిందీ |
| 13 | పశ్చిమ బెంగాల్ | 34,590 | 2 65 | బెంగాలీ |
| 14 | అస్సాం | 89,040 | 0 97 | అస్సామీ |
| 15 | ఒరిస్సా | 60,140 | 1 46 | ఒరియా |
| 16 | జమ్మూ, కాశ్మీర్ | 92,780 | 0 14 | కాశ్మీర్ |

ఇక్కడ ముఖ్యమైన విషయమేమంటే రాష్ట్రాల పరిమాణాన్ని సరిపోల్చడం

జనాభాను కొలబద్దగా తీసుకొని ఫలితాన్ని ఈ క్రింది విధంగా చెప్పవచ్చు ఒకటి, రెండు, కోట్లమధ్య జనాభా ఉన్న రాష్ట్రాలు ఎనిమిది ఉన్నాయి రెండు నుండి నాలుగు కోట్ల మధ్య జనాభా ఉన్న రాష్ట్రం ఒకటి ఆరు కోట్లకు పైగా జనాభా ఉన్న రాష్ట్రం ఒకటి అధమ పక్షంగా చెప్పాలంటే ఫలితం మాత్రం ఆశ్చర్యకరం ఒక రాష్ట్ర పరిమాణం ఎంత ఉన్నా ఫరవాలేదని కమీషన్ భావించిందని స్పష్టంగా అర్థమవుతోంది ఫెడరేషన్‌గా ఏర్పడే రాష్ట్రాల పరిమాణం సమానంగా ఉండాల్సిన అవసరం లేదని కూడా కమీషన్ అనుకుంది

కమీషన్ చేసిన మొదటి ఘోరమైన తప్పిదం ఇదే ఈ తప్పిదాన్ని కనుక వెంటనే సరిదిద్దకపోతే, అది భారతదేశానికి పెద్ద ఎత్తున నష్టాన్ని తెచ్చిపెడుతుంది

## అధ్యాయం–2
## శృతి మించిన భాషావాదం

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమిషన్ సిఫారసులలోని ఒక తప్పిదాన్ని మొదటి అధ్యాయంలో చెప్పాం కమీషన్ సూచించిన రాష్ట్రాల ఏర్పాటులో వివిధ రాష్ట్రాల మధ్య పరిమాణంలో హెచ్చుతగ్గులు ఉన్నాయన్నదే అది

కమిషన్ సిఫారసులలో మరో తప్పిదం కూడా ఉంది అయితే అది బహిరంగంగా కనిపించకుండా అంతర్లీనంగా ఉన్నది

రాష్ట్రాల ఏర్పాటులో ఉత్తరాదినీ, దక్షిణాదినీ సమదృష్టితో చూడడం జరగలేదు ఈ క్రింది పట్టికను చూస్తే ఆ విషయం స్పష్టమౌతుంది

| దక్షిణాది రాష్ట్రాలు | | మధ్యరాష్ట్రాలు | | ఉత్తరాది రాష్ట్రాలు | |
|---|---|---|---|---|---|
| రాష్ట్రంపేరు | జనాభా (కోట్లలో) | రాష్ట్రంపేరు | జనాభా (కోట్లలో) | రాష్ట్రంపేరు | జనాభా (కోట్లలో) |
| మద్రాసు | 3 00 | మహారాష్ట్ర | 3 31 | ఉత్తరప్రదేశ్ | 6 32 |
| కేరళ | 1 36 | గుజరాత్ | 1 13 | బీహార్ | 3 82 |
| కర్నాటక | 1 90 | సౌరాష్ట్ర | 0 4 | మధ్యప్రదేశ్ | 2 61 |
| ఆంధ్ర | 2 09 | కచ్ | 0 5 | రాజస్థాన్ | 1 60 |
| హైదరాబాద్ | 1 13 | | | పంజాబ్ | 1 72 |

కొన్ని మధ్య రాష్ట్రాలను ఉత్తర రాష్ట్రాల్లో ఎందుకు చేర్చానంటే, వాటి భాష ఒకటే గనుక

భాషా ప్రయుక్త రాష్ట్రాల పేరుతో భారత దేశాన్ని విభజించే ఈ పథకం ఉపేక్షించదగింది కాదు కమీషన్ అనుకుంటున్నట్లుగా అది ప్రమాద రహితమైనదేమీ కాదు అది విష పూరితమైన పథకం ఆ విషాన్ని ఇప్పుడే వెంటనే తొలగించాలి

భారతదేశమంతా ఒక యూనియన్ అనుకోవడం ఒక ఆలోచన మాత్రమే అది అంత పెద్ద విషయమేమీ కాదు బ్రెస్ తన 'అమెరికన్ కామన్ వెల్త్, అనే గ్రంథంలో ఉదహరించిన ఈ దిగువ ఘటన ఇక్కడ పేర్కొనడం సందర్భోచితంగా ఉంటుంది

అది ఇలా ఉంది

"కొన్ని సంవత్సరాల క్రితం అమెరికన్ ప్రొటస్టెంట్ ఎపిస్కోపల్ చర్చివారు తమ వార్షిక సమావేశంలో తమ ప్రార్థనా గ్రంథాన్ని సవరించే కార్యక్రమంలో తలమునకలయ్యారు

యాపెన్మంది ప్రజలూ ప్రార్థన చేసుకునేందుకు వీలుగా చిన్న వాక్యాలతో కూడిన ఒక ప్రార్థనను ప్రవేశపెట్టాలన్న ఆలోచన వచ్చింది న్యూ ఇంగ్లాండ్ రాష్ట్రానికి సంబంధించిన సుప్రసిద్ధ మత బోధకుడొకరు "ఓ భగవంతుడా, మా దేశాన్ని దీవించు" అన్న మాటను ఒకరోజు మధ్యాహ్నం ప్రతిపాదించాడు అప్పటికప్పుడు దానిని ఆమోదించేశారు అయితే ఆ మరునాడే, ఆ ప్రార్థనా వాక్యాన్ని పునః పరిశీలించాలని కోరారు సామాన్యులనేక మంది 'దేశం' అన్న పదానికి అనేక అభ్యంతరాలు తెలియజేశారు ఆ ప్రార్థనా గీతంలోని 'దేశం' అన్న పదం ఏకజాతి సమైక్య రాష్ట్ర భావానికి సంకేతం గాబట్టి అమెరికా అలాంటిది కాదు గాబట్టి ఈ అభ్యంతరాలు రావడంతో, ఆ పదాన్ని తొలగించి దాని స్థానంలో 'ఓ భగవంతుడా' ఈ సంయుక్త రాష్ట్రాలను దీవించు' అన్న పదాలను చేర్చారు "

భారత సంయుక్త రాష్ట్రాలుగా తనను తాను పిలుచుకోవడానికి మానసికంగానూ, నైతికంగానూ కూడా భారతదేశం యోగ్యమైంది కాదు భారత సంయుక్త రాష్ట్రాలుగా కావడానికి మనం చాలా దూరం ప్రయాణించాల్సి ఉంది ఆ భారత సంయుక్త రాష్ట్రాలకి భారత యూనియన్ అనేది చాలా చాలా దూరంలో ఉంది కాని, ఆ స్థితికి చేరాలంటే, ఈ ఉత్తరాది సంఘటితత్వమూ, దక్షిణాది చీలిక అనేది మాత్రం మార్గం కాదు

## రెండవ భాగం

# భాషావాద పరిమితులు

## అధ్యాయం–3

## భాషా ప్రయుక్త రాష్ట్రం–లాభనష్టాలు

"ఒక దేశం, ఒక భాష" అనేది దాదాపుగా ప్రతి దేశానికి సార్వజనీన లక్షణంగా ఉంది జర్మనీ రాజ్యాంగాన్ని పరిశీలించండి, ఇటలీ రాజ్యాంగాన్ని పరిశీలించండి, ఫ్రెంచ్ రాజ్యాంగాన్ని పరిశీలించండి, అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగాన్ని పరిశీలించండి, ఒక దేశం ఒక భాష" అనేది నియమంగా ఉంది గదా!

ఈ నియమాన్ని పాటించని ప్రతిచోటా దేశానికి ముప్పు ఏర్పడుతోంది మిశ్రమ భాషా దేశాలకు ఏ గతి పడుతుందో చూడాలంటే ప్రాచీన ఆస్ట్రియా, టర్కీ సామ్రాజ్యాలను ఉదాహరణలుగా తీసుకోవచ్చు బహు భాషా దేశాలు కావటం వల్లనే అవి బద్దలయ్యాయి బహుభాషా రాష్ట్రాల సమ్మేళనంగా కొనసాగినట్లయితే భారత దేశం కూడా ఈ గతినుండి తప్పించుకో లేదు

ఏక భాషారాష్ట్రం స్థిరంగా ఉండడానికీ, బహుభాషా రాష్ట్రం అస్థిరంగా ఉండడానికీ గల కారణాలు సుస్పష్టమే ఏ రాజ్యమైనా సహోదర భావంపై నిర్మితమై ఉంటుంది ఈ

సోదరభావం అంటే ఏమిటి? క్లుప్తంగా చెప్పాలంటే ఇది తామంతా ఒకటేనన్న ఒక బంధు భావం ఈ భావం కలిగిన వారంతా తాము ఆత్మీయులమని భావిస్తారు ఇది రెండు వైపులా పదును కలిగిన భావం ఇది తమ బంధువర్గం పట్ల సహోదర భావాన్ని, ఇతరుల పట్ల ఆ భావం లేకపోవడాన్ని ఒకేసారి కలిగిస్తుంది ఇది ఒక రకమైన 'జాతి చైతన్య' భావం ఈ భావనను బలంగా కలిగిన వారందరినీ ఇది ఒకటిగా కట్టి ఉంచుతుంది సామాజిక తారతమ్యాలు, ఆర్థిక వైషమ్యాల కారణంగా తల ఎత్తే వైరుధ్యాలను కూడా ఇది అధిగమించేటట్లు చేస్తుంది ఇదే సమయంలో మరో పక్క, తమ వారు కాదు, అని అనుకున్న వారి నుండి ఇది వేరు చేస్తుంది ఇంకొక వర్గానికి చెందము, అనే ఆకాంక్ష దానిలో ఉంటుంది దేశ స్థిరత్వానికీ, దేశ ప్రజా స్వామ్యానికీ ఈ సోదరభావమే పునాది

భాషా ప్రయుక్త రాష్ట్రం ఎందుకు అంత అత్యవసరమో చెప్పడానికి ఇది ఒక కారణం కాని ఒక రాష్ట్రం ఏకభాషా రాష్ట్రంగా ఎందుకు ఉండాలో చెప్పడానికి ఇతర కారణాలు కొన్ని ఉన్నాయి "ఒకదేశం, ఒక భాష" అన్న విషయం ఎందుకు అవసరమో చెప్పడానికి మరో రెండు ఇతర కారణాలు ఉన్నాయి

ఒక కారణమేమంటే రాష్ట్రంలో ఉండే వారి మధ్య సహభావం లేకపోయినట్లయితే ఘర్షణలు తలెత్తుతాయి అప్పుడు ప్రజాస్వామ్యం పని చేయలేదు పాలనలో వివక్షత, నాయకత్వం కోసం ముఠా తగవులు అనేవి మిశ్రమ రాష్ట్రంలో ఎప్పుడూ ఉంటాయి అవి ప్రజాస్వామ్యానికి ప్రతికూలమైనవి

మిశ్రమ రాష్ట్రంలో ప్రజాస్వామ్యం ఎలా విఫలమవుతుందో చెప్పడానికి ప్రస్తుత బొంబాయి రాష్ట్రం ఒక చక్కటి ఉదాహరణ ఒక మిశ్రమ రాష్ట్రం ఎలా అభివృద్ధి చెందుతుందో అనుభవం గడించడానికి బొంబాయి రాష్ట్రం మనకు వీలు కల్పిస్తుంది కాబట్టి దానిని మిశ్రమ రాష్ట్రంగా కొనసాగించాలన్న రాష్ట్ర పునర్ వ్యవస్థీకరణ సంఘం చేసిన సూచన చూచి దిగ్భ్రాంతి చెందాను గత ఇరవై సంవత్సరాలుగా మిశ్రమ రాష్ట్రంగా ఉన్న బొంబాయిలో మహారాష్ట్రీయులు, గుజరాతీయుల మధ్యనున్న తీవ్ర వైషమ్యాన్ని చూసి కూడా ఇటువంటి ప్రతిపాదన చేయగలగడం అంటే అది ఏ ఆలోచనా రహితుడికో లేదా మతిమరుపు గల వ్యక్తికో మాత్రమే సాధ్యమవుతుంది మిశ్రమ రాష్ట్రంలో ప్రజాస్వామ్యం విఫలమవుతుందనడానికి పూర్వ మద్రాసు రాష్ట్రం మరొక ఉదాహరణ మిశ్రమ దేశంగా ఐక్య భారతదేశ ఏర్పాటు – భారత పాకిస్తాన్ దేశాలుగా భారత దేశాన్ని విభజించాల్సి రావడం – ఇవన్నీ, మిశ్రమ దేశాల్లో ప్రజాస్వామ్యాన్ని కలిగి ఉండడమనేది అసాధ్యమని చెప్పడానికి ఇతర ఉదాహరణలు

"ఒక రాష్ట్రం ఒక భాష" అన్న నియమాన్ని అమలు పరచడం ఎందుకు అవసరమౌతుందంటే, సంస్కృతి పరమైన, జాతిపరమైన, వైషమ్యాలకు అదొక్కటే పరిష్కారం గనుక

తమిళులు, ఆంధ్రులను ఎందుకు ద్వేషిస్తారు? ఆంధ్రులు, తమిళులను ఎందుకు ద్వేషిస్తారు? హైదరాబాదులోని ఆంధ్రులు మహారాష్ట్రీయులను ఎందుకు ద్వేషిస్తారు? మహారాష్ట్రీయులు ఆంధ్రులను ఎందుకు ద్వేషిస్తారు? గుజరాతీయులను, మహారాష్ట్రీయులు, మహారాష్ట్రీయులను గుజరాతీయులు ఎందుకు ద్వేషిస్తారు?

ఈ ప్రశ్నలకు సమాధానం చాల సులభమైంది వారిద్దరి మధ్య ఎటువంటి సహజసిద్ధమైన వ్యతిరేకత లేదు అయితే వారిరువురినీ ఒకరి ప్రక్కనొకరిని ఉంచి ప్రభుత్వం వంటి ఉమ్మడి భాగస్వామ్య చక్రంలో బలవంతంగా పాలుపంచుకునేటట్లు చేయడమే దీనికి కారణం వారి మధ్య ద్వేషం ఉండడానికి ఇంతకు మించి మరో కారణం లేదు

ఈ బలవంతపు సహజీవనం అనేది ఉన్నంతకాలం వారిమధ్య శాంతి ఉండదు

కెనడా, స్విట్జర్లాండ్, దక్షిణాఫ్రికా ఉదంతాలను కొంతమంది ఉదహరించవచ్చు అవి ద్విభాషా రాష్ట్రాలుగా ఉన్నమాట నిజమే అయితే, భారతదేశ స్వభావం కెనడా, స్విట్జర్లాండ్, దక్షిణాఫ్రికా దేశాల స్వభావానికి పూర్తిగా విభిన్నమైందనే అంశాన్ని మరచి పోకూడదు భారతదేశానిది విడివడే స్వభావమైతే– కెనడా, స్విట్జర్లాండ్, దక్షిణాఫ్రికాలది ఐక్యతా స్వభావం

రెండు భాషా వర్గాల వారు ఇప్పటివరకు కలిసి ఉన్నారన్నది వాస్తవమే అయినా ఆ కలయికలో సహజత్వం లేదు కాంగ్రెస్ క్రమశిక్షణకు వారివురూ కట్టుబడి ఉండడమే దానికి కారణం కాని కాంగ్రెస్ ఎంతకాలం మనగలుగుతుంది? కాంగ్రెస్ అంటే పండిట్ నెహ్రూ, నెహ్రూయే కాంగ్రెస్ అనే పరిస్థితి వచ్చింది నెహ్రూ ఏమైనా శాశ్వతమా? ఈ సమస్యను జాగ్రత్తగా ఆలోచిస్తే కాంగ్రెస్ సూర్య చంద్రాదుల వలె శాశ్వతంగా ఉండలేరనే విషయం తెలుసుకోగలుగుతారు ఏదో ఒక రోజున కాంగ్రెసు అంతమవుతుంది రాబోయే ఎన్నికలకు ముందే అది అంతమైనా కావచ్చు అది జరిగినప్పుడు బొంబాయి రాష్ట్రం అంతఃకలహాలు తల ఎత్తి పాలన కొనసాగించలేని స్థితిలో పడిపోతుంది

అందువల్ల రెండు కారణాల రీత్యా మనం భాషా ప్రయుక్త రాష్ట్రాలను కోరుతున్నాం ప్రజాస్వామ్యానికి మార్గం సుగమం చేయడానికీ, సాంస్కృతిక పరమైన, జాతి పరమైన ఉద్రిక్తతలను తొలగించడానికీ, భాషా ప్రయుక్త రాష్ట్రాలను కోరుతున్నాం

భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటు చేసుకునే యత్నంలో భారతదేశం సరైన బాటలోనే నడుస్తున్నది అన్ని ప్రాంతాలూ ఈ మార్గాన్నే అనుసరించాయి కొన్ని ఇతర దేశాలు భాషా ప్రయుక్త దేశాలుగా ఉన్నాయంటే, అవి మొదటి నుంచీ అలాగే ఉన్నాయి భారతదేశం విషయంలో అలా జరగలేదు కాబట్టి ఇప్పుడు అది తనంత తానుగా ఆ బాటలోకి అడుగుపెట్టాలి భారతదేశం తనకుతానుగా ప్రతిపాదించుకుంటున్న ఈ బాట కొత్తదేమీ

కాదు బాగా నలిగిన బాటే ఇతర దేశాలు అనుసరించిన బాటే ఇది

భాషా రాష్ట్రాలలో గల లాభాలను చెప్పిన తరువాత, అందులో ఉన్న ప్రమాదాలేమిటో కూడా చెప్పాలి

తన ప్రాంతీయ భాషను అధికార భాషగా కలిగిన భాషారాష్ట్రం అతి సులభంగా స్వతంత్ర జాతిగా రూపొందవచ్చు స్వతంత్ర జాతీయ భావానికీ, స్వతంత్ర దేశానికీ మధ్యగల ఎడం చాలా తక్కువ భాషారాష్ట్రాలు దేనికది స్వతంత్ర జాతిగా భావించడం గనక జరిగినట్లయితే భారతదేశం, ఆధునిక భారతదేశంగా ఉండజాలదు మధ్యయుగాల నాటి మాదిరిగా పరస్పర శత్రుత్వాల తోనూ, యుద్ధాలతోనూ తలమునకలైన రాష్ట్రాలుగల దేశంగా మారుతుంది

భాషా రాష్ట్రాల ఏర్పాటులోనే ఈ ప్రమాదం దాగి ఉంది అయితే భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడకపోవడంలో కూడా అంతే ప్రమాదం దాగి ఉంది తెలివీ, గట్టి రాజనీతిజ్ఞతా కలవాడు మొదటి ప్రమాదాన్ని తప్పించగలడు కాని మిశ్రమ రాష్ట్రాలవల్ల కలిగే ప్రమాదాలు అంతకంటే తీవ్రమైనవి, ఎంతటి నిపుణుడైన రాజనీతిజ్ఞునికైనా పరిష్కార సాధ్యం కానటువంటివి

మరి అయితే భాషా రాష్ట్రాల వల్ల కలిగే ప్రమాదాన్ని ఎలా నివారించుకోవడం? దానికి నాకు తోచిన పరిష్కారం ఒకటే ప్రాంతీయ భాషను రాష్ట్ర అధికార భాష కాకుండా చేసే ఏర్పాటును రాజ్యాంగంలో పొందు పరచడమే హిందీ రాష్ట్ర అధికార భాష కావాలి అందుకు భారతదేశం సిద్ధమయ్యేంతవరకు ఇంగ్లీషు అధికార భాషగా ఉంటుంది దీనిని భారతీయులు అంగీకరిస్తారా? వారందుకు అంగీకరించకపోతే భాషా రాష్ట్రాలు సులభంగా ప్రమాద హేతువులు కావచ్చు

ఒకేభాష ప్రజలను ఐక్యం చేస్తుంది రెండు భాషలు ప్రజలను కచ్చితంగా వేరు చేస్తాయి ఇది ఏ మాత్రమూ తప్పుకోలేని నియమబంధం

సంస్కృతి అనేది భాషతోనే పరిరక్షింపబడుతుంది ఐక్యం కావాలని, ఉమ్మడి సంస్కృతిని అభివృద్ధి చేసుకోవాలని భారతీయులందరూ కోరుకుంటున్నారు కాబట్టి హిందీని తమ భాషగా సొంతం చేసుకోవడానికి ప్రతి భారతీయుడూ బద్ధుడై ఉండాలి

భాషా ప్రయుక్త రాష్ట్రంలో అంతర్భాగంగా ఈ ప్రతిపాదనను అంగీకరించని ఏ భారతీయునికీ భారతీయుడుగా కొనసాగే హక్కులేదు అతడు నూటికి నూరు పాళ్లూ మహారాష్ట్రీయుడు కావచ్చు, నూటికి నూరు పాళ్లూ తమిళుడు కావచ్చు, నూటికి నూరుపాళ్లూ గుజరాతీయుడు కావచ్చు, కానీ భౌగోళిక దృష్ట్యా తప్ప వాస్తవానికి అతడు భారతీయుడు కాలేడు ఈ ప్రతిపాదనను అంగీకరించకపోతే భారతదేశం భారతదేశంగా ఉండదు అది ఒకరికి

వ్యతిరేకంగా మరొకరు పోరాటాలూ, వైరుధ్యాలూ పెంచుకోవడంలో తలమునకలైన విభిన్న జాతుల సమ్మేళనంగానే మిగులుతుంది 'ఓ భారతీయుల్లారా! మీరెప్పుడూ ఐకమత్యం లేకుండానే ఉండాలి, బానిసలుగానే కొనసాగండి, అంటూ దేవుడు భారతదేశానికి, భారతీయులకు ఏదో పెద్ద శాపమే పెట్టినట్లు కనపడుతోంది

పాకిస్తాన్ నుండి భారతదేశం వేరైనందుకు నేను సంతోషించాను ఒక విధంగా చెప్పాలంటే పాకిస్తాన్ నా చింతనమే విభజన వల్ల హిందువులు స్వతంత్రులు అవడమే కాకుండా స్వేచ్ఛా జీవులవుతారని కూడా భావించటం వల్ల నేను దేశ విభజనను సమర్ధించాను భారత్, పాకిస్తాన్‌లు కనుక ఒకే దేశంగా కలిసి ఉన్నట్లయితే హిందువులు స్వతంత్రులు అయినప్పటికీ ముస్లింల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉండేవాళ్ళు హిందువుల దృష్టినుండి చూసినట్లయితే ఆ స్వతంత్ర భారతదేశం స్వేచ్ఛా భారతదేశం అయి ఉండేది కాదు అది ఒక దేశం, రెండు జాతుల ప్రభుత్వం అయి ఉండేది హిందూ మహాసభ, జనసంఘ్ ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా ఆ రెండు జాతులలో ముస్లింలు నిస్సందేహంగా పాలక జాతి అయి ఉండేవారు దేశ విభజన జరిగినప్పుడు దేవుడు తన శాపాన్ని ఉపసంహరించుకున్నాడని, భారతదేశం ఒకటిగా, గొప్ప సుసంపన్న దేశంగా కావటానికి అనుమతించాడని అనుకున్నాను కాని, తిరిగి ఆ శాపం మళ్లీ మన నెత్తిన పడుతుందేమోనని నేను భయపడుతున్నాను ఎందుకంటే, భాషా ప్రయుక్త రాష్ట్రాలు కావాలని కోరుతున్న వారందరి హృదయాలలోనూ ప్రాంతీయ భాషనే తమ అధికార భాషగా చేసుకోవాలనే ఆశయం ఉన్నట్లు నాకు అనిపిస్తోంది

ఈ ఆశయం 'ఐక్య భారతదేశం' అన్న ఆలోచనకు చావుదెబ్బ అవుతుంది ప్రాంతీయ భాషలు అధికార భాషలైతే భారతదేశాన్ని ఒక ఐక్య దేశంగా చేయాలన్న లక్ష్యమూ, భారతీయులను ప్రప్రథమంగా తాము భారతీయులమని, సర్వదా తాము భారతీయులమేనని భావించేటట్లు చేయాలన్న ఆదర్శమూ కనుమరుగవుతుంది దీనికి పరిష్కార మార్గం చూపడం కన్నా నేనేం చేయలేను ఆలోచించి పరిశీలించాల్సింది భారతీయులే

## అధ్యాయం–4

## ఒక భాషకు ఒక రాష్ట్రం ఉండి తీరాలా?

### భాషా ప్రయుక్త రాష్ట్రమంటే అర్థమేమిటి?

దీని అర్థం రెండింటిలో ఏదైనా ఒకటి కావచ్చు ఒక భాష మాట్లాడే ప్రజలందరినీ ఒక రాష్ట్ర పరిధిలోకి తీసుకురావాలన్నది ఒక అర్థం కావచ్చు లేదా ఒక భాష మాట్లాడే ప్రజలకు అనేక రాష్ట్రాలుండవచ్చునన్నది మరొక అర్థం కావచ్చు అయితే ఈ రెండిట్లో ఏది సరైన వివరణ?

ఒకే భాష మాట్లాడే ప్రజలందరికీ కలిపి ఒకే ఒక రాష్ట్రాన్ని ఏర్పాటు చేయడమన్న ఏకైక నియమాన్నే పాటించాలన్న అభిప్రాయాన్ని కమిషన్ తీసుకుంది

పాఠకుడు పటం నెం 1 పరిశీలించవచ్చు ఆ పటాన్ని చూసిన వెంటనే ఉత్తరాది, దక్షిణాది రాష్ట్రాల మధ్య ఉన్న వ్యత్యాసాన్ని అతడు గుర్తిస్తాడు ఈ వ్యత్యాసం చాలా హెచ్చుగా ఉంది పెద్ద రాష్ట్రాల భారాన్ని మోయడం చిన్న రాష్ట్రాలకు అసాధ్యమై పోతుంది

ఈ వ్యత్యాసం ఎంత ప్రమాదకరమైందో కమీషన్ గ్రహించలేదు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఇటువంటి వ్యత్యాసం ఉందనడంలో సందేహం లేదు కాని ఆ వ్యత్యాసం వల్ల రావచ్చుననుకొన్న ప్రమాదాన్ని అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగంలో ఉన్న నిబంధనలు నిరోధించాయి

నివేదికపై భిన్నాభిప్రాయం ప్రకటిస్తూ శ్రీ ఫణిక్కర్ ఇచ్చిన వివరణలో అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగంలో ఉన్న అటువంటి రక్షణ నిబంధనను ఉదహరించారు (పట్టిక 2 చూడండి)

ఆయనిచ్చిన వివరణనుండి ఈ క్రింది భాగాన్ని ఉదహరిస్తున్నాను

"సమాఖ్య రాజ్యాంగం విజయవంతంగా పనిచేయడానికి రాష్ట్రాలు ఎక్కువగా సమతుల్యతలో ఉండడం అవసరమని నేను భావిస్తున్నాను వ్యత్యాసం మరీ ఎక్కువగా ఉన్నట్లయితే అది అనుమానాల్ని, అసంతృప్తిని కలిగించడమే కాదు, ఫెడరల్ వ్యవస్థనే విచ్ఛిన్నం చేయగల శక్తులను సృష్టించి దేశ ఐక్యతకే ప్రమాదకారి అవుతుంది సర్వత్రా దీనిని స్పష్టంగా గుర్తించారు అనేక ఫెడరల్ రాజ్యాంగాలలో జనాభా, వనరుల విషయాలలో రాష్ట్రాల మధ్య విస్తృత వ్యత్యాసం ఉన్నప్పటికీ, పెద్ద రాష్ట్రాల ప్రాబల్యాన్ని హద్దుల్లో ఉంచేందుకు జాగ్రత్త తీసుకున్నారు ఆ విధంగానే అమెరికా సంయుక్త రాష్ట్రాలలో కూడా జాగ్రత్తలు తీసుకున్నారు జనాభా వనరుల విషయంలో, ఆ రాష్ట్రాలు వ్యత్యాసాలతో ఉన్నాయి ఉదాహరణకు జనాభా విషయంలో నేవడా రాష్ట్రంతో పోలిస్తే న్యూయార్క్ రాష్ట్రం పెక్కు రెట్లు పెద్దది అయినప్పటికీ రాజ్యాంగం సెనెట్‌లో ప్రతి రాష్ట్రానికి సమాన ప్రాతినిధ్యం కల్పించింది

ఇదే అంశంపై శ్రీ ఫణిక్కర్ సోవియట్ యూనియన్, పాత జర్మనీ రాజ్యాంగాలను కూడా ప్రస్తావించారు ఆయన ఈ విధంగా చెప్పారు

"సోవియట్ యూనియన్‌లో కూడా ఈ జాగ్రత్త తీసుకున్నారు అక్కడి ఫెడరేషన్‌లోని చాలా రాష్ట్రాల కంటే, కొన్నింటిని కలిపి చూసినా కూడా, వాటికన్నా హెచ్చు జనాభా ప్రెష్యాకు ఉంది కాని హౌస్ ఆఫ్ నేషనాలిటీస్‌లో ప్రాతినిధ్యం విషయమై పెద్ద రాష్ట్రం ఫెడరేషన్‌లోని మిగిలిన రాష్ట్రాలపై ప్రాబల్యం చూపకుండా కట్టుదిట్టం

చేశారు బిస్మార్క్ రాజ్యాంగంలో కూడా, జనాభా దృష్ట్యా ప్రష్యా ఆధిక్య స్థానాన్ని కలిగి ఉన్నప్పటికీ రాష్ట్రాలకు ప్రాతినిధ్యం వహించే సభలో దానికి అర్హత ఉన్న స్థానాలకంటే తక్కువ (మూడింట ఒక వంతు కంటే తక్కువ) ప్రాతినిధ్యాన్ని కల్పించారు ఆ సభ శాశ్వత అధ్యక్ష స్థానాన్ని బవేరియాకు దఖలు పరచారు రాజకీయ, సైనిక, ఆర్థిక శక్తి ఒక రాష్ట్రంలో కేంద్రీకృతమై ఉన్న ఇక్కడ కూడా యూనియన్ ప్రయోజనాల రీత్యా చిన్న రాష్ట్రాలకు ప్రాధాన్యమివ్వడం అవసరమని భావించటం వల్ల ప్రజాప్రతినిధుల సభ (Reichstag or House of the people) కంటే ఎక్కువ అధికారాలను కలిగి ఉన్న రాష్ట్రాల సమితి (Reichsration states council)లో ప్రష్యాను మైనారిటీ స్థానంలో ఉంచడం జరిగింది

అయితే, వ్యత్యాస ప్రమాదాన్ని నివారించేందుకు అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగంలో కల్పించిన రక్షణ సదుపాయం గురించి శ్రీ ఫణిక్కర్ ప్రస్తావించలేదు మన రాజ్యాంగంలోని రెండు సభలు, అధికారంలో సమానం కాదు ఈ విషయంలో అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగం పరిస్థితి పూర్తిగా భిన్నంగాఉంది అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో అధికారంలో రెండు సభలూ సమానమే ఆర్థిక బిల్లులకు కూడా సెనెట్ ఆమోదం అవసరం భారతదేశంలో పరిస్థితి అలా లేదు దీనివల్ల జనాభాలో ఉన్న వ్యత్యాసం విషయంలో చాలా తేడా ఏర్పడుతుంది

జనాభా, అధికారాల విషయంలో రాష్ట్రాల మధ్య ఉన్న ఈ వ్యత్యాసం దేశానికి కచ్చితంగా అనర్థదాయక మవుతుంది దీనికి తగిన నివారణను రూపొందించడం అత్యవసరం

## అధ్యాయం–5
## ఉత్తర దక్షిణ పోటీ

యు పి , బీహార్ రాష్ట్రాలను యథాతథంగా ఉంచడం ద్వారాను వాటికి కొత్తగా మధ్యప్రదేశ్, రాజస్థాన్ వంటి పెద్ద రాష్ట్రాలను చేర్చడం ద్వారానూ రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ కమిషన్, రాష్ట్రాల మధ్య కేవలం వ్యత్యాసాన్నే కాదు, దక్షిణాది, ఉత్తరాది, అనే భేద భావాన్ని కూడా సృష్టించింది

ఉత్తరప్రాంతం హిందీ మాట్లాడే ప్రాంతం దక్షిణప్రాంతం హిందీయేతర భాషలు మాట్లాడే ప్రాంతం హిందీ మాట్లాడే ప్రజల సంఖ్య ఎంతో చాలా మందికి తెలియదు భారతదేశ జనాభాలో వారు 48 శాతం వరకూ ఉంటారు ఈ వాస్తవంపై దృష్టిని కేంద్రీకరించిన వారెవ్వరైనా కమీషన్ కృషి ఉత్తరాది సంఘటితత్వానికీ, దక్షిణాది చీలికకు దారి తీస్తుందనే చెబుతారు ఉత్తరాది ఆధిక్యాన్ని దక్షిణాది సహించగలదా?

భారత రాజ్యాంగ ముసాయిదాను పరిశీలిస్తున్నప్పుడు, హిందీని జాతీయ భాషగా ఆమోదించే సమస్యపై కాంగ్రెస్ సమావేశంలో ఏం జరిగిందో నేనిప్పుడు బహిరంగ

పరచినట్లయితే అది రహస్యాన్ని బయటపెట్టినట్లు కాకపోవచ్చు ఈ సమస్యకు సంబంధించిన 115 అధికరణ వివాదస్పదమైనంతగా మరే ఇతర అధికరణ వివాదాస్పదం కాలేదు ఈ అధికరణ సృష్టించినంత విరుద్ధ భావాన్ని మరే అధికరణ సృష్టించలేదు మరే అధికరణ ఇంతటి ఉద్రిక్తతను సృష్టించలేదు సుదీర్ఘ చర్చ జరిగిన తర్వాత ఈ సమస్యను ఓటింగుకు పెట్టినప్పుడు 78 ఓట్లు అనుకూలంగానూ 78 ప్రతికూలంగానూ వచ్చాయి ఈ చిక్కుముడి పరిష్కరించసలవి కాలేదు చాలాకాలం తరువాత ఈ సమస్యను కాంగ్రెస్ సమావేశంలో చర్చకు తీసుకువచ్చినప్పుడు ఫలితం హిందీకి అనుకూలంగా 78, ప్రతికూలంగా 77 ఓట్లుగా మారింది ఒక్క ఓటు తేడాతో హిందీ జాతీయ భాషగా తన స్థానాన్ని గెలుచుకుంది నాకీ విషయాలు స్వయంగా తెలుసు కాబట్టి, ఈ వాస్తవాలను తెలియ జేస్తున్నాను రాజ్యాంగ రచనా సంఘం అధ్యక్షుడిగా సహజంగానే కాంగ్రెస్ పార్టీ పరిధిలోకి నాకు ప్రవేశముండేది

ఉత్తరాది అంటే దక్షిణాదికి ఎంత అయిష్టమో, ఈ వాస్తవాలు తెలుపుతున్నాయి ఉత్తరాది సంఘటితమై అలాగే ఉంటూ, దక్షిణాది విచ్ఛిన్న మౌతుంటే భారత రాజకీయాలపై ఉత్తరాది మోతాదుకు మించి తన ప్రాబల్యం కొనసాగించితే ఈ అయిష్టతే ద్వేషంగా పెరగవచ్చు (మూ పటం 1)

ఏ ఒక్క రాష్ట్రానికైనా కేంద్రంలో అత్యధిక ప్రాబల్యం ఉండేట్లు అనుమతిస్తే అది ప్రమాదానికి దారి తీస్తుంది

శ్రీ ఫణిక్కర్ ఈ అంశం గురించి కూడా ప్రస్తావించారు ఆయన తన ప్రతికూలాభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ ఇచ్చిన వివరణలో ఇలా పేర్కొన్నారు:

"రాష్ట్రాల మధ్య సమానత్వం" పాటించాలన్న ఫెడరల్ సూత్రాన్ని తిరస్కరించడం వల్ల కలిగిన ఈ హెచ్చుతగ్గుల ఫలితంగా ఉత్తరప్రదేశ్ మినహా మిగతా అన్ని రాష్ట్రాలలో అవిశ్వాసం, అసంతృప్తి భావనలు ఏర్పడతాయి ప్రస్తుత ప్రభుత్వ వ్యవస్థ స్వరూపం అఖిల భారతానికి సంబంధించిన విషయాలలో ఉత్తరప్రదేశ్ ఆధిపత్యానికి దారి తీసేదిగా ఉందన్న అభిప్రాయాన్ని దక్షిణాది రాష్ట్రాలలోనే కాదు, పంజాబ్, బెంగాల్ లలోనూ ఇంకా అనేక చోట్ల కమీషన్ ముందు వ్యక్త పరచారు ఇలాంటి భావం ఉన్నదనే విషయాన్ని ఎవరూ కాదనలేరు అటువంటి భావాలు కొనసాగే అవకాశం ఉండగా దానికి తగిన విరుగుడును ఇప్పుడే కనుగొనకపోతే అది మన ఐక్యతకు కూడా ప్రమాదం తెస్తుందనే మాట కూడా ఎవరూ కాదనరు

ఉత్తరాది, దక్షిణాది మధ్య చాలా తేడా ఉంది ఉత్తరాది సంప్రదాయశీలమైంది దక్షిణాది పురోగమన శీలమైంది ఉత్తరాది మూఢ నమ్మకాలతో ఉంటే దక్షిణాది హేతుబద్ధంగా ఉంది విద్యాపరంగా దక్షిణాది ముందడుగు వేసిందైతే, ఉత్తరాది వెనుకబడి ఉంది దక్షిణాది సంస్కృతి ఆధునికమైనది ఉత్తరాది సంస్కృతి ప్రాచీనమైనది

స్వతంత్ర భారతదేశానికి ఒక బ్రాహ్మణుడు మొట్టమొదటి ప్రధాని అవుతున్న సందర్భంగా 1947 ఆగస్టు 15న కాశీ బ్రాహ్మణులు నిర్వహించిన యజ్ఞంలో ప్రధాని మంత్రి నెహ్రూ కూర్చోలేదా? వారిచ్చిన రాజదండం ధరించలేదా? వారు తెచ్చిన గంగాజలాన్ని పుచ్చుకోలేదా?

ఇటీవల ఎంతమంది స్త్రీలు బలవంతంగా సతీసహగమనం చేసి ఆత్మాహుతి చేసుకోలేదు? రాష్ట్రపతి ఇటీవల బెనారస్ వెళ్ళి, బ్రాహ్మణులను పూజించి, వారి పాదాలను కడిగి, ఆ జలాన్ని సేవించలేదా?

ఇప్పటికీ ఉత్తరాదిలో దిగంబర సాధువులను, 'సతి' సహగమనాలను చూస్తూనే ఉన్నాం గత హరిద్వార్ మేళాలో దిగంబర సాధువులు సృష్టించిన అలజడి అంతా ఇంతానా? దీనికి వ్యతిరేకంగా యు పి లో ఎవరైనా నిరసన తెలియజేశారా?

ఉత్తరాది పాలనను దక్షిణాది ఎలా సహించగలదు? ఉత్తరాది నుండి వేరు పడాలని దక్షిణాది కోరుకుంటున్న సూచనలు ఇప్పటికే కనిపిస్తున్నాయి

రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ కమీషన్ చేసిన సిఫారసులపై శ్రీ రాజగోపాలాచారి ఒక ప్రకటన చేశారు అది 1955 నవంబర్ 27 నాటి 'టైమ్స్ ఆఫ్ ఇండియా' సంచికలో వెలువడింది ఆ ప్రకటనలో ఆయనిలా అన్నారు

"రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ పథకాలను వచ్చే 15 సంవత్సరాల పాటు వాయిదా వేయడం అసాధ్యమయ్యేట్లయితే అప్పుడు దానికి మార్గాంతరం ఒక్కటే ప్రాంతీయ కమీషనర్ల అజమాయిషీలో జిల్లా బోర్డులు జిల్లా అధికారులతో నేరుగా వ్యవహరిస్తూ, భారతదేశాన్ని యూనిటరీ రాజ్యంగా పాలించడమొక్కటే కేంద్రానికున్న ఏకైక ప్రత్యామ్నాయం

"చారిత్రకంగా రూపొందిన పరిస్థితుల నేపథ్యంలో కాకుండా, గదిలో కూర్చుని రూపొందించిన సరిహద్దులపై చీలికలపైనా వివాదపడుతూ జాతీయ శక్తిని క్రమక్రమంగా వృథా చేయడం ఘోరమైన తప్పిదమే అవుతుంది

"నాకున్న సాధారణ దృఢ విశ్వాసాలను పక్కకు పెట్టి సమస్యను పరిశీలించి చూస్తే, దక్షిణాది వారి రాజకీయ ప్రాధాన్యతను పరిరక్షించడానికి ఒక పెద్ద దక్షిణాది రాష్ట్రం ఉండడం ఎంతైనా అవసరమని నేను భావిస్తున్నాను దక్షిణాదిని తమిళ, మళయాల రాష్ట్రాలతో పాటుగా మరికొన్ని ఇతర చిన్న రాష్ట్రాలుగా చీల్చడం వారిలో ప్రతి ఒక్కరి ప్రాధాన్యాన్ని తగ్గించడానికే దారి తీస్తుంది నికరంగా చివరకు తేలే ఫలితమేమంటే, మొత్తం భారతదేశం బాగా బలహీనపడుతుంది

తన అభిప్రాయాలను ఇక్కడ శ్రీ రాజగోపాలాచారి పూర్తిగా వ్యక్తీకరించలేదు ఆయన గవర్నరు జనరలుగా ఉన్నప్పుడు తన అభిప్రాయాలను పూర్తిగా, నిర్మొహమాటంగా నాకు తెలియజేశారు అప్పుడు నేను రాజ్యాంగ రచనా కమిటీకి బాధ్యత వహిస్తున్న న్యాయ మంత్రిగా ఉన్నాను ఆయనను నేను కలుసుకోవడానికి వెళ్లాను అలా కలుసుకోవడం ఆ రోజుల్లో మామూలు పద్ధతి అలా కలుసుకున్న ఒక సందర్భంలో అటువంటి, రాజ్యాంగ సభ రూపొందిస్తున్న రాజ్యాంగం గురించి ప్రస్తావిస్తూ ఆయన నాతో ఇలా అన్నారు "మీరొక పెద్ద తప్పు చేస్తున్నారు అన్ని ప్రాంతాలకూ సమాన ప్రాతినిధ్యం ఇస్తూ మొత్తం భారతదేశానికి ఒక ఫెడరేషన్‌ను ఏర్పాటుచేయాలని చూస్తున్నారు కాని అది, చక్కగా నడిచే వ్యవహారం కాదు అటువంటి ఫెడరేషన్‌లో భారత రాష్ట్రపతీ, ప్రధానమంత్రీ ఎల్లప్పుడూ హిందీమాట్లాడే ప్రాంతాల నుండి వచ్చినవారే అవుతారు మీరు రెండు ఫెడరేషన్‌లను ఏర్పాటు చేయాలి ఒకటి ఉత్తరాది ఫెడరేషన్, రెండోది దక్షిణాది ఫెడరేషన్ ఉత్తరాది, దక్షిణాదులకూ కలిపి మూడు అంశాలపై చట్టాలు చేసే అధికారంతో కాన్‌ఫెడరేషను ఏర్పాటు చేయాలి" రెండు ఫెడరేషన్‌లకూ సమాన ప్రాతినిధ్యం ఉండాలి

ఇవి శ్రీ రాజగోపాలాచారి గారి అసలైన ఆలోచనలు ఒక కాంగ్రెస్ వ్యక్తి హృదయాంతరాలలో దాగి ఉన్న నిగూఢ రహస్యాలు బయటకు వచ్చినట్లు నాకు అనిపించింది ఉత్తర, దక్షిణాలుగా భారతదేశం చీలిపోతుందని ఊహిస్తున్న జ్యోతిష్కుడిగా శ్రీ రాజగోపాలా చారిని నేనిప్పుడు గౌరవిస్తాను శ్రీ రాజగోపాలాచారి గారి జోస్యాన్ని వమ్ము చేయడానికి అవసరమైన వన్నీ మనం చేసి తీరాలి

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఉత్తరాది, దక్షిణాదుల మధ్య అంతర్యుద్ధం జరిగిందన్న విషయాన్ని మనం మరచి పోకూడదు భారతదేశంలో కూడా ఉత్తరాది, దక్షిణాదుల మధ్య అలాంటి అంతర్యుద్ధం తల ఎత్తవచ్చు అటువంటి ఘర్షణకు కావాల్సిన పెక్కు కారణాంశాలను కాలం సమకూర్చగలదు ఉత్తరాది, దక్షిణాదుల మధ్య విపరీతమైన సాంస్కృతిక వ్యత్యాస మున్నదన్న విషయాన్ని మరువగూడదు సాంస్కృతిక వ్యత్యాసాలే త్వరగా అగ్గి రగిల్చేవి అన్న విషయాన్ని కూడా మనం మరిచిపోకూడదు

కమీషన్, ఈ ఉత్తరాదిని సంఘటితం చెయ్యడం, దక్షిణాదిని ముక్కలు ముక్కలుగా చీల్చటంలో తాము కేవలం భాషా పరమైన సమస్యతోనే కాక రాజకీయ సంబంధమైన సమస్యతో వ్యవహరిస్తున్నామనే విషయాన్ని గ్రహించలేక పోయింది

అటువంటిది జరగకుండా నిరోధించడానికి ఇప్పుడే తగిన చర్యలు తీసుకోకపోవడమన్నది రాజనీతిజ్ఞతా రాహిత్యమే అవుతుంది మరి దీనికి నివారణోపాయాలేమిటి?

## మూడవ భాగం

# పరిష్కారం

## అధ్యాయం-6

## ఉత్తరాది విభజన

సమస్యేమిటో గ్రహించిన తరువాత మనమిప్పుడు పరిష్కారమార్గం కోసం వెదకాలి

రాష్ట్ర పరిమాణాన్ని నిర్ణయించడానికి ఒక ప్రమాణాన్ని అనుసరించడంలో ఈ సమస్యకు పరిష్కారం లభిస్తుంది అటువంటి ప్రమాణాన్ని నిర్ధారించడమన్నది అంత సులభమైన విషయమేమీ కాదు "రెండు కోట్ల జనాభా" అన్న పరిమాణాన్ని ప్రమాణంగా తీసుకుని అమలు చేస్తే పెక్కు దక్షిణాది రాష్ట్రాలు బహుభాషా రాష్ట్రాలవుతాయి అందువల్ల ఉత్తరాది రాష్ట్రాలవల్ల కలిగే ఉపద్రవాన్ని ఎదుర్కోవడానికి దక్షిణాది రాష్ట్రాలను విస్తరణ చేయడమన్నది అసాధ్యం ఉత్తరాదికి చెందిన యు పి, బీహార్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలను ముక్కలుగా విడగొట్టడమే ఏకైక పరిష్కారం ఇలాంటి తేటతెల్లమైన పరిష్కారమార్గం కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి ఎందుకు తట్టలేదో నేను అర్థం చేసుకోలేక పోతున్నాను

## ఉత్తరాది రాష్ట్రాల విభజన

లోగడ నేను చెప్పినట్లుగా భాషా ప్రయుక్త రాష్ట్రాల రూపకల్పన చేయడంలో, కమీషన్ ఉత్తరాది సంఘటితత్వాన్ని, దక్షిణాది చీలికనూ, సృష్టించింది కమీషన్ దీనిని ఉద్దేశపూర్వకంగా చేసింది కాదని నేను కచ్చితంగా చెప్పగలను కాని అది ఉద్దేశపూర్వకంగా చేసినా, చేయకపోయినా జరిగిందదే దాని దుష్పరిమాణాలు కూడా స్పష్టమే

అందువల్ల ఈ పరిస్థితిని చక్కదిద్దడమన్నది ఎంతైనా అవసరం దానికున్న ఏకైక పరిష్కార మార్గమేమిటంటే (1) ఉత్తర ప్రదేశ్ (2) బీహార్ (3) మధ్యప్రదేశ్ రాష్ట్రాలను చిన్న రాష్ట్రాలుగా విడగొట్టడమే!

ఈ అంశానికి సంబంధించి కొన్ని తాత్కాలిక ప్రతి పాదనలు చెయడానికి నేను సాహసిస్తున్నాను

ఇలా విభజించడమన్నది భాషా ప్రయుక్త రాష్ట్రాల మౌలిక సూత్రాలకు విరుద్ధంగా ఉండదు ఎందుకంటే పై సూచించిన మాదిరిగా రాష్ట్రాలను విభజించినట్లయితే, అప్పుడు ఏర్పడే ప్రతి రాష్ట్రమూ, ఒక భాషా ప్రయుక్త రాష్ట్రమే అవుతుంది కాబట్టి

ఈ అంశంపై పార్లమెంటులో ఇటీవల జరిగిన చర్చలో మాట్లాడుతూ ఉత్తర ప్రదేశ్‌ను విభజించడం పట్ల తన కెటువంటి అభ్యంతరం లేదని శ్రీ పంత్ చెప్పడం నాకు

సంతోషంగా ఉంది ఉత్తర ప్రదేశ్ విషయంలో ఆయన చెప్పిన దానిని బీహార్, మధ్యప్రదేశ్‌లకు కూడా వర్తించేదిగా పరిగణించవచ్చు

## ఉత్తరప్రదేశ్ విభజన

ఉత్తర ప్రదేశ్‌కు సంబంధించి దానిని మూడు రాష్ట్రాలుగా విభజించాలన్నది నా ప్రతిపాదన (పటం 2 చూడండి) అలా విభజించబడే మూడు రాష్ట్రాలలో ప్రతి రాష్ట్రమూ సుమారుగా 2 కోట్ల జనాభాను కలిగి ఉంటుంది సమర్థవంతంగా పాలించడానికి ఒక రాష్ట్రానికి అంత పరిమాణంలో జనాభా ఉండాలి ఈ మూడు రాష్ట్రాలకు సరిహద్దు రేఖలను ఎక్కడెక్కడ ఏర్పరచవచ్చో, దీనితో పాటుగా జతపరచిన పటం 2 లో చూపాను

ఉత్తరప్రదేశ్‌కు చెందిన ఈ మూడు రాష్ట్రాలు (1) మీరట్ (2) కాన్పూర్, (3) అలహాబాదులను తమ రాజధానులుగా ఏర్పాటు చేసుకోవచ్చు ఇవి ఆ మూడు రాష్ట్రాలకు కేంద్ర స్థానాలలోనే ఉన్నాయి

## బీహార్ విభజన

బీహార్‌కు సంబంధించి నా ప్రతిపాదన ఏమంటే, దానిని రెండు రాష్ట్రాలుగా విభజించాలి (పటం 3 చూడండి) అలా విభజించబడే రెండు రాష్ట్రాలలో ప్రతి రాష్ట్రానికి ఒకటిన్నర కోట్లకు కొంచెం ఎక్కువగా జనాభా ఉంటుంది ఒక ప్రభుత్వం పాలించడానికి ఇదేమంత తక్కువ జనాభా కాదు

సరిహద్దులు ఎక్కడ ఉండాలో పటం 3 లో చూపాను

బీహార్‌కు చెందిన ఈ రెండు రాష్ట్రాలు (1) పాట్నా, (2) రాంచీలను తమ రాజధానులుగా ఏర్పాటు చేసుకోవచ్చు అవి ఆయా రాష్ట్రాలకు కేంద్రస్థానలలోనే ఉన్నాయి

## మధ్యప్రదేశ్ విభజన

పాత మధ్యప్రదేశ్, కొత్త మధ్యప్రదేశ్ అనే రెండు రూపాలు కలిగిన మధ్యప్రదేశ్ మన ముందుంది

(1) పాత మధ్యప్రదేశ్‌లో ఒకప్పుడు సి పి అనబడిన రాష్ట్రమూ బేరార్

(2) తూర్పు రాష్ట్రాలు అనబడే వాటిలో కొన్ని భారతీయ రాష్ట్రాలు

ఈ పాత మధ్యప్రదేశ్ రాష్ట్రం రెండున్నర కోట్ల జనాభాను కలిగి ఉండేది అందులో 22 జిల్లాలు ఉండేవి 223 మంది శాసనసభ్యులు ఉండేవారు

కమీషన్ రూపొందించిన పథకం ప్రకారం నూతన మధ్య ప్రదేశ్ రాష్ట్రం ఈ క్రింద్

ప్రాంతాలను కలిగి ఉంటుంది (1) పాత మధ్యప్రదేశ్‌లోని 14 జిల్లాలు (2) భోపాల్ యావత్తూ (3) యావత్తు వింధ్యప్రదేశ్ (4) మంద్‌సార్ జిల్లాలోని సునెల్ ప్రాంతం తప్పించి మిగిలిన మధ్యభారత్ (5) రాజస్థాన్‌కు చెందిన కోటా జిల్లాలోని సిరోంజ్ సబ్ డివిజన్

ఈ కొత్త మధ్యప్రదేశ్ జనాభా రెండుకోట్ల అరవై ఒక్క లక్షలుంటుంది దీని విస్తీర్ణం 1,71,200 చదరపు మైళ్ల వరకూ ఉంటుంది

దీనిని (1) ఉత్తర మధ్యప్రదేశ్ (2) దక్షిణ మధ్యప్రదేశ్ అనే రెండు రాష్ట్రాలుగా విభజించాలన్నది నా ప్రతిపాదన (పటం 4 చూడండి)

ఉత్తర మధ్య ప్రదేశ్ రాష్ట్రం ఈ దిగువ ప్రాంతాలను కలిగి ఉండాలి

(1) మొత్తం వింధ్యప్రదేశ్, (2) భోపాల్ రాష్ట్రం మొత్తం

దక్షిణ మధ్యప్రదేశ్ రాష్ట్రం ఈ దిగువ ప్రాంతాలను కలిగి ఉండాలి

(1) ఇండోర్ రాష్ట్రం యావత్తూ (2) మహాకోసల్ ప్రాంతానికి చెందిన 14 జిల్లాలు

ఇండోర్ రాష్ట్ర జనాభా రెండు కోట్ల వరకూ ఉంటుంది వింధ్యప్రదేశ్ జనాభా 1 30కోట్ల వరకూ ఉంటుంది (పటం 4 చూడండి)

కమీషన్ ఇంతపెద్ద రాష్ట్రాన్ని ఎందుకు సృష్టించిందో అర్థం కాకుండా వుంది దీని ఏర్పాటు పట్ల ప్రధానమంత్రి నెహ్రూ కూడా ఆశ్చర్యపడ్డారు

ఒక భాష, ఒక రాష్ట్రం అన్న దానిని అనివార్యమైన అంశంగా భావించి అది అనుల్లంఘనీయమన్న అభిప్రాయంతోనే కమీషన్ ఈ పని చేసిందని అనుకోవాల్సి వస్తుంది ఒక భాష, ఒక రాష్ట్రం అన్నది ఎప్పుడూ అనివార్యమైన అంశంగా ఉండగూడదన్న విషయాన్ని నేను ఇంతకు ముందే చెప్పాను వాస్తవానికి "ఒక రాష్ట్రం, ఒక భాష" అన్నదే ముఖ్య సూత్రం కాబట్టి ఒకే భాష మాట్లాడే ప్రజలు ఎక్కువ రాష్ట్రాలుగా ఏర్పడవచ్చు

## అధ్యాయం–7

## మహారాష్ట్ర సమస్యలు

### I

### మహారాష్ట్ర వ్యవహారానికి సంబంధించిన ప్రతిపాదనలు

వివాదాస్పద ప్రాంతాలలో మహారాష్ట్ర మరొకటి దీనికి సంబంధించి, నాలుగు ప్రతిపాదనలు రంగంలో ఉన్నాయి

(1) బొంబాయి రాష్ట్రాన్ని యథాతథంగా ఉంచడం అంటే మహారాష్ట్ర, గుజరాత్, బొంబాయిలను కలిగి ఉన్న మిశ్రమ రాష్ట్రంగా అట్టి పెట్టుకోవడం

(2) ప్రస్తుత బొంబాయి రాష్ట్రాన్ని, మహారాష్ట్ర, గుజరాతులుగా వేరుచేసి, ఆ రెండిటినీ ప్రత్యేక రాష్ట్రాలుగా చేయడం

(3) బొంబాయితో కలిపి ఐక్య మహారాష్ట్రను ఒక రాష్ట్రంగా చేయడం

(4) బొంబాయి నగరాన్ని మహారాష్ట్ర నుండి వేరుచేసి దానిని ప్రత్యేక నగర రాష్ట్రంగా చేయడం

నేను నా ప్రతిపాదనలను తెలియ చేయాలనుకుంటున్నాను అవి ఇవి: మిశ్రమ రాష్ట్రంగా బొంబాయి ఉండాలి అన్న ఆలోచనను పూర్తిగా వదులు కోవాలి మహారాష్ట్రను నాలుగు రాష్ట్రాలుగా విభజించాలని నేను అనుకుంటున్నాను (పటం 5 చూడండి)

(1) మహారాష్ట్ర నగర రాష్ట్రం (బొంబాయి)
(2) పశ్చిమ మహారాష్ట్ర
(3) మధ్య మహారాష్ట్ర
(4) తూర్పు మహారాష్ట్ర

## మహారాష్ట్ర నగర రాష్ట్రం

బొంబాయి నగరమూ, దాంతో పాటుగా, దాన్ని శక్తివంతమైన చక్కటి నగర రాష్ట్రంగా చేయగల మహారాష్ట్ర ప్రాంతాలూ

## పశ్చిమ మహారాష్ట్ర

(1) రాణా, (2) కొలాబా, (3) రత్నగిరి, (4) పూనా, (5) ఉత్తర సతారా, (6) దక్షిణ సతారా, (7) కొల్హాపూర్, (8) కర్నాటకకు ఇచ్చిన మరాఠీ మాట్లాడే ప్రాంతాలు

## మధ్య మహారాష్ట్ర

(1) డంగ్, (2) తూర్పు ఖందేష్, (3) పశ్చిమ ఖందేష్, (4) నాసిక్, (5) అహ్మద్‌నగర్, (6) ఔరంగాబాద్, (7) నాందేడ్, (8) పర్బనీ, (9) బీడ్, (10) ఉస్మానాబాద్, (11) షోలాపూర్ నగరం, షోలాపూర్ జిల్లాలోని మరాఠీ మాట్లాడే ప్రాంతాలు, (12) తెలంగాణాకు ఇచ్చిన మరాఠీ మాట్లాడే ప్రాంతాలు

## తూర్పు మహారాష్ట్ర

(1) బుల్దానా, (2) యోత్మాల్, (3) అకోలా, (4) అమరావతి, (5) వార్ధా, (6) చందా,

(7) నాగపూర్, (8) భండారా, (9) హిందీ రాష్ట్రాలకు ఇచ్చిన మరాఠీ మాట్లాడే ప్రాంతాలు

ఇక నేనిప్పుడు ఈ ప్రతిపాదనలలో గల యోగ్యతలను పరిశీలిస్తాను

## II

## మిశ్రమ రాష్ట్రంలో మహారాష్ట్రీయులు

బొంబాయి మిశ్రమ రాష్ట్రంగానే ఉండి పోవాలా? అలా ఉంచడం ఒక అసాధారణ పద్ధతి అవుతుంది కలకత్తా నగరం ప్రత్యేక నగర రాష్ట్రంగా లేదు మద్రాసు ప్రత్యేక నగర రాష్ట్రం కాదు అటువంటప్పుడు బొంబాయి ఒక్కదానికి మాత్రమే ఆ మినహాయింపు ఎందుకు ఉండాలి?

మరొక విషయమేమిటంటే అది ఇప్పటికే మిశ్రమ రాష్ట్రంగానే ఉంది ఈ మిశ్రమ రాష్ట్రం క్రింద మహారాష్ట్రీయులు ఘోరమైన బాధలు పడ్డారు

బొంబాయి కాబినెట్‌లో మహారాష్ట్రీయుల స్థానమేమిటి? మంత్రుల సంఖ్య ఏ విధంగా ఉందో చూద్దాం

| | |
|---|---|
| గుజరాతీ మంత్రులు | 4 |
| మరాఠీ మంత్రులు | 4 |
| కన్నడ మంత్రులు | 1 |
| మొత్తం | 9 |

అసెంబ్లీలో గుజరాతీ సభ్యుల సంఖ్య 106 మాత్రమే మరాఠీ సభ్యుల సంఖ్య 149 అయినా గుజరాతీ మంత్రుల సంఖ్య మరాఠీ మంత్రుల సంఖ్యతో సమానంగా ఉంది

ఉపమంత్రుల సంఖ్యను పరిశీలిద్దాం

| | |
|---|---|
| మరాఠీ మాట్లాడేవారు | 5 |
| గుజరాతీ మాట్లాడేవారు | 2 |
| కన్నడ మాట్లాడేవారు | 2 |
| మొత్తం | 9 |

ఒక్క ఉపమంత్రుల విషయంలోనే మహారాష్ట్రీయులకు మెజారిటీ ఉంది అది కూడా ఒక్కటే

అయితే, మంత్రులు, ఉపమంత్రుల మధ్య అధికారం, శాఖలూ ఎలా పంపిణీ అయ్యాయన్నది అతి ముఖ్యమైన విషయంగా పరిగణించాలి బొంబాయి రాష్ట్ర మిశ్రమ మంత్రివర్గంలో మహారాష్ట్ర మంత్రులకు ఎంత అధికార బలం ఉన్నాయో అది తెలియజేస్తుంది

మంత్రుల మధ్య శాఖల కేటాయింపు

| గుజరాతీ మంత్రులు | | మహారాష్ట్ర మంత్రులు | |
|---|---|---|---|
| 1 మొరార్జీ దేశాయి | 105 అంశాలు | 1 హిరే | 49 అంశాలు |
| 2 దినకర్ రావు దేశాయి | 26 అంశాలు | 2 నింబాల్కర్ | 20 అంశాలు |
| 3 జీవరాజ్ మెహతా | 43 అంశాలు | 3 తాపసే | 15 అంశాలు |
| 4 శాంతీలాల్ షా | 28 అంశాలు | 4 చవాన్ | 4 అంశాలు |
| మొత్తం | 202 అంశాలు | మొత్తం | 88 అంశాలు |

ఉపమంత్రుల మధ్య కేటాయింపు కూడా ఇదే తరహాలో జరిగింది

| గుజరాతీ ఉప మంత్రులు | | మహారాష్ట్ర ఉపమంత్రులు | |
|---|---|---|---|
| 1 ఇందుమతి సేట్ | 12 | 1 వాంద్రేకర్ | 12 |
| 2 బాబూభాయి జె పటేల్ | 3 | 2 దేశ్‌ముఖ్ | 4 |
| | | 3 సర్వానే | 5 |
| | | 4 సాతే | 5 |
| | | 5 ఫకి | 3 |
| మొత్తం | 15 | మొత్తం | 15 |

అభివృద్ధి కార్యక్రమాలపై మహారాష్ట్ర, గుజరాత్‌లలో ఎంత ఖర్చు చేశారో ఇప్పుడు పరిశీలిద్దాం మూడు సంవత్సరాల కాలంలో మహారాష్ట్ర, గుజరాత్‌లపై వెచ్చించిన తలసరి వ్యయానికి సంబంధించి ఈ దిగువన ఇచ్చిన అంకెలు ఒక అవగాహన నందిస్తాయి

అభివృద్ధి పనులపై తలసరి వ్యయం రూపాయలలో

| | | సంవత్సరాలు | | |
|---|---|---|---|---|
| | జనాభా | 1950-51 | 1951-52 | 1952-53 |
| 1 మహారాష్ట్ర | 2,17,20,091 | 1 7 | 2 3 | 1 8 |
| 2 గుజరాత్ | 1,18,96,789 | 2 9 | 3 1 | 3 2 |

ఎంత చిన్న చూపు! ఎంత వివక్షత? ఎంత అన్యాయం? మిశ్రమ రాష్ట్రంతో మహారాష్ట్రీయులు విసిగి వేసారిపోయారంటే ఎవరైనా వారిని తప్పు పట్టగలరా?

ఇటువంటి అధీన స్థితిని మహారాష్ట్రీయుడు సహించలేడు మిశ్రమ రాష్ట్రమనే ఆలోచనను శాశ్వతంగా తుడిచివేయాలి

III

## బొంబాయి నగర స్థానం

బొంబాయి నగరం వివాదాస్పద ప్రాంతం ఈ నగరానికి సంబంధించిన వివాదం తీవ్రస్థాయికి చేరుకుంది

బొంబాయి నగరం మహారాష్ట్రలో భాగంగా ఉండాలని మహారాష్ట్రీయులు కోరుతున్నారు వివాదంపై తలలు బద్దలయ్యాయి కాని ఎటువంటి అంగీకారం కుదరలేదు అందువల్ల, ఈ అంశం మూలాల్లోకి వెళ్లి పరిశీలించాల్సిన అవసరం ఉంది

బొంబాయి నగరం తమదేనని గుజరాతీలు వాదించటంలేదు కాని, దానిపై తమకున్న పట్టును వదులుకోదలచుకోరు నగర వాణిజ్యాన్ని, పరిశ్రమలను తామే నియంత్రిస్తున్నామన్న వాస్తవం కారణంగా, నగరంపై తమకు అనుభవరీత్యా హక్కు ఉందని వాదిస్తారు దానిని మహారాష్ట్రలో భాగంగా చేయాలా? లేక ప్రత్యేక రాష్ట్రంగా కొనసాగించాలా? అన్నదే సమస్య ఈ సమస్యపై గుజరాతీలు, మహారాష్ట్రీయులు తీవ్రంగా చీలిపోయారు నూతన మహారాష్ట్ర రాష్ట్రంలో బొంబాయి పూర్తిగా దానికే చెందిన భాగం కావాలని మహారాష్ట్రీయులు కోరుకుంటున్నారు దానిని గుజరాతీలు గట్టిగా వ్యతిరేకిస్తున్నారు వారు రెండు ప్రత్యామ్నాయాలను చూపెడుతున్నారు ప్రస్తుతం ద్విభాషా రాష్ట్రంగా ఉన్న బొంబాయిని మహారాష్ట్ర, గుజరాత్ అనే రెండు భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా విభజించకూడదనేది ఒక ప్రత్యామ్నాయం బొంబాయి నగరాన్ని ప్రత్యేక రాష్ట్రంగా చేయాలనేది కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ నిర్ణయం

ఈ నిర్ణయంపట్ల గుజరాతీలు సంతోషంగా ఉంటే సహజంగానే మహారాష్ట్రీయులు ఆగ్రహించారు

మహారాష్ట్రీయుల ఆగ్రహం పూర్తిగా న్యాయమైంది మహారాష్ట్రీయుల హక్కుకు వ్యతిరేకంగా చెబుతున్న వాదనల్లో ఎటువంటి పసలేదు

బొంబాయి నగర మొత్తం జనాభాలో మరాఠీ మాట్లాడే ప్రజలు మెజారిటీ కాదన్నది వారి మొదటి వాదన బొంబాయి నగర మొత్తం జనాభా చాలా ఎక్కువ (గణాంక అనుబంధం చూడండి) మరాఠీ మాట్లాడే ప్రజలు 48 శాతమే

ఈ రకమైన వాదనను ఉపయోగిస్తున్న వారు అందులోని బలహీనతను గుర్తించినట్లు లేరు

బొంబాయి నగర జనాభాలో మొత్తం నగరంలో ఉన్న మరాఠీ ప్రజలు 50 శాతం కన్నా తక్కువగానే ఉంటారు అందులో సందేహం లేదు అయితే రెండు అంశాలను

దృష్టిలో ఉంచుకుని మరీ దీనిని పరిశీలించాలి ఒకటేమంటే, నగరంలో మహారాష్ట్రీయులు మైనారిటీగానే ఉన్నప్పటికీ, భౌగోళికంగా బొంబాయి మహారాష్ట్రలో భాగమన్న విషయాన్ని ఎవరూ తోసిపుచ్చలేరు బొంబాయి నగరం మహారాష్ట్రలో భాగమేనన్న విషయాన్ని, మొరార్జీ దేశాయి కూడా గుజరాత్ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ సమావేశంలో ఉపన్యసిస్తూ అంగీకరించారు

జనాభా విషయం గురించి చర్చించేటప్పుడు పరిగణనలోకి తీసుకోవాల్సిన రెండో అంశమేమంటే వ్యాపారంలో లాభాల ఆర్జన కోసమో లేక పొట్ట నింపుకోవడానికో మిగిలిన భారతదేశం నుండి బొంబాయికి తరలివస్తున్న జనాభా ఇలా తరలి వచ్చే వారెవరూ బొంబాయిని స్వస్థలంగా పరిగణించరు అందువల్ల వారిని బొంబాయి నగర శాశ్వత నివాసులుగా లెక్కించకూడదు వారిలో పెక్కుమంది కొద్ది నెలల పాటు బొంబాయిలో ఉండి తిరిగి వెనక్కి ఎళ్లిపోతుంటారు

బొంబాయి మహారాష్ట్రీయులకు మాత్రమే స్వస్థలం వేరెవ్వరికీ కాదు అందువల్ల బొంబాయి నగర జనాభాలో ఎవరు మెజారిటీయో ఒక నిర్ణయానికి రావడం కోసం మహారాష్ట్రేతరులను లెక్కలోకి తీసుకోవడం హేతుబద్ధమూ కాదు, సమంజసమూ కాదు

పౌరసత్వాన్ని పొందకుండా చేసే, స్థానిక చట్టాలేవీ లేకపోవడం కూడా, బొంబాయిలో మరాఠీయేతర భాషలు మాట్లాడే వారి సంఖ్య పెరగడానికి కారణమవుతున్నదన్న విషయాన్ని ఎవరూ గ్రహించడం లేదు అటువంటి చట్టమేదయినా ఉండి ఉన్నట్లయితే మిగిలిన భారతదేశం నుండి వచ్చే ఈ జనప్రవాహం ఆగిపోయి ఉండేది మహారాష్ట్రీయుల మెజారిటీ అలా నిలబడి ఉండేది

బొంబాయిలో మహారాష్ట్రేతరులు ఎక్కువ కావడానికి బొంబాయి రేవు పట్టణమవడం, అది పశ్చిమ తీరంలో ఉండడమూ ముఖ్య కారణమన్న విషయం ఎవరూ గుర్తించడం లేదు యూరప్ నుండి కలకత్తాకు కాని, మద్రాసుకు కాని ఉన్న మార్గం కన్నా యూరప్ నుండి బొంబాయికి ఉన్న మార్గం బాగా దగ్గరైనది అందువల్లనే మిగిలిన భారతదేశం నుండి హెచ్చు సంఖ్యలో పేద ప్రజలు తమ స్వస్థానాలను వదలి బొంబాయిలో తాత్కాలిక నివాసులుగా ఉండేందుకు వస్తున్నారు మరే ఇతర ప్రాంతంలో కన్నా బొంబాయిలో ఉద్యోగం సంపాదించుకోవడం సులభం

నిజం చెప్పాలంటే, ఈ విషయాన్ని మరో దృక్కోణం నుంచి పరిశీలించాలి సుమారుగా గత రెండు వందల సంవత్సరాల నుండి ప్రజలు బొంబాయికి తరలి వస్తున్నారు అయినా ఈ తరలి రావడమన్నది బొంబాయి నగరంలో మహారాష్ట్రీయుల జనాభాను 48 శాతం కంటే దిగువకి తగ్గించలేకపోయింది రెండు వందల సంవత్సరాల తరువాత కూడా జనాభా శాతంలో మార్పు లేదు నగర వలస లక్షణమే దీనికి కారణం (అనుబంధం

మాడండి) గుజరాతీయులు వలస జనాభా మాత్రమే

బొంబాయిని మహారాష్ట్రలో భాగంగా ఉండడానికే అనుమతించాలన్న కోరికకు అనుకూలంగా మరికొన్ని ఇతర వాదనలు కూడా ఉన్నాయి

భారతదేశంలో బొంబాయి ఒక్కటే మిశ్రమ నగరం కాదు కలకత్తా, మద్రాసులు కూడా మిశ్రమ నగరాలే కలకత్తా పశ్చిమ బెంగాల్ లో భాగంగా ఉండగలిగినప్పుడు, మద్రాసు నగరం మద్రాసు రాష్ట్రంలో భాగంగా ఉండగలిగినప్పుడు, బొంబాయిని మహారాష్ట్రలో భాగంగా చేయడానికి అభ్యంతర మేముంటుంది? ప్రతి మహారాష్ట్రీయుడు అడిగే ప్రశ్న ఇదే ఈ ప్రశ్నకు ఎటువంటి సమాధానం నాకు కనిపించడం లేదు ఇతరులను పాలించడానికి మహారాష్ట్రీయులు యోగ్యులు కారు అని కాంగ్రెస్ అధిష్ఠాన వర్గం అనుకుంటుందన్న సమాధానమొక్కటే ఎవరికైనా తడుతుంది ఇది మహారాష్ట్రీయుల వ్యక్తిత్వానికే కళంకం దానిని వారు సహించలేరు

మహారాష్ట్రీయులు కాని వారి పెట్టుబడితో బొంబాయి నిర్మాణం జరిగిందని అంటున్నారు అది కావచ్చు మరి అయితే మద్రాసు నగరం మద్రాసీల పెట్టుబడితోనే అభివృద్ధి చెందిందా? కలకత్తా బెంగాలీల పెట్టుబడితోనే అభివృద్ధి చెందిందా? యూరోపియన్ల పెట్టుబడే లేకపోయినట్లయితే మద్రాసు, కలకత్తా నగరాలు గ్రామాలుగానే ఉండి ఉండేవి ఆ రెండింటికీ వర్తింప చేయని నియమాన్ని బొంబాయి తమదని మహారాష్ట్రులు వాదించినప్పుడే ఎందుకు రుద్దాలని చూస్తున్నారు? మహారాష్ట్రీయులు కనీసం శ్రమనైనా ధారపోశారు వారి శ్రమే లేకపోయినట్లయితే బొంబాయి నేడు ఇలా ఉండగలిగేదే కాదు బొంబాయి నగర జీవన ఆధారాలు మహారాష్ట్రలో ఉన్నాయన్న విషయాన్ని ఎల్లప్పుడూ గుర్తుంచుకోవాలి దాని విద్యుచ్ఛక్తి వనరులు మహారాష్ట్రలోనే ఉన్నాయి నీటి సరఫరా వనరులు మహారాష్ట్రలోనే ఉన్నాయి కార్మిక వనరులు మహారాష్ట్రలో ఉన్నాయి మహారాష్ట్ర ఏ సమయంలోనైనా సరే బొంబాయిని నిర్జీవ "మొహంజొదారో" నగరంగా మార్చివేయగలదు

మహారాష్ట్రీయులు తమపట్ల వివక్షతను పాటిస్తారేమోనన్న భయం గుజరాతీలలో బాగా నాటుకుపోయింది కాని మన రాజ్యాంగం ప్రకారం వివక్షత పాటించడం సాధ్యంకాదు రాజ్యాంగంలో ప్రాథమిక హక్కుల జాబితా వుంది వాటికి భంగం కలిగినప్పుడు, హైకోర్టు, సుప్రీంకోర్టులకు రిట్ ల ద్వారా నివారణ పొందవచ్చును వివక్షతతో కూడిన ప్రతి అన్యాయానికీ, నివారణోపాయాన్ని రాజ్యాంగం కల్పించింది అటువంటప్పుడు గుజరాతీలకు భయం ఎందుకు ఉండాలి?

బొంబాయిని ప్రత్యేక నగర రాష్ట్రంగా రూపొందిస్తే, గుజరాతీయులు పొందే ప్రయోజనమేమిటో ఇప్పుడు పరిశీలిద్దాం బొంబాయి నగరంలో వారి జనాభా కేవలం పదిశాతం మాత్రమే బొంబాయి నగర రాష్ట్ర శాసనసభలో వారెన్ని స్థానాలను పొందగలుగుతారు?

కనీసం 10 శాతం కూడా పొందలేరు ఈ పదిశాతం మంది గుజరాతీలు 90శాతం మందికి వ్యతిరేకంగా తమవారిని ఎలా రక్షించుకోగలుగుతారు?

ఇకనుండి గుజరాతీల మహారాష్ట్రీయుల మధ్య ఉద్రిక్తతలు ఇంతకు ముందెన్నడూ లేనంత ఉధృత స్థాయిలో ఉంటాయన్న విషయాన్ని మనం తప్పని సరిగా గుర్తుంచుకోవాలి గుజరాతీ అభ్యర్థికి మహారాష్ట్రీయుడు ఓటు వేయడు మహారాష్ట్రీయ అభ్యర్థికి గుజరాతీ ఓటు వేయడు ఇప్పటి వరకూ గుజరాతీయులు తను ధనంతో మహారాష్ట్రపై ఆధిపత్యం చెలాయించగలిగారు కాని ఒకసారి ఆత్మగౌరవభావం అన్నది పెల్లుబికిన తర్వాత ధనం పనిచేయక పోవచ్చు నగర ప్రభుత్వంలో అల్పమైన వాటాకన్నా తమపట్ల మహారాష్ట్రీయుల సద్భావం మెరుగైందా కాదా అన్నది గుజరాతీయులు ఆలోచించాలి

మహారాష్ట్రీయుల వాదన ఉక్కులాంటి పటిష్టతను కలిగి ఉన్నప్పటికీ, అవతలి పక్షంలోని వారి వాదనలో కూడా కొన్ని పరిగణించదగ్గ అంశాలున్నాయన్న సత్యాన్ని పరిశీలించడం మహారాష్ట్రీయులు ఏదో కోపంలో ఉండి విస్మరించకూడదు

బొంబాయి మహారాష్ట్ర లోపలే ఉండాలని వారు కోరుకుంటున్నారు అయితే వారు తప్పనిసరిగా ఆలోచించాల్సిన అంశమొకటి ఉంది వారు కోరుకుంటుందేమిటి? సుసంపన్నమైన బొంబాయినా లేక క్షీణించిన బొంబాయినా వారు కోరుకునేది! కేవలం మహారాష్ట్రలో భాగంగా బొంబాయి సుసంపన్నంగా ఉండగలదా? దీనిని మరో మాటలో చెప్పుకుంటే పెరుగుతున్న నగర వాణిజ్యానికీ, పరిశ్రమలకూ అవసరమైన పెట్టుబడిని మహారాష్ట్ర సమకూర్చకలదా? ఈ ప్రశ్నకు మహారాష్ట్రీయుడు అవునని సమాధానం చెప్పలేడు కొంతకాలం తరువాత పెట్టుబడి అవసరాన్ని మహారాష్ట్రీయులు తీర్చగలరేమో కాని కచ్చితంగా ఇప్పుడు మాత్రం తీర్చలేరు

మహారాష్ట్రీయులు పరిశీలించాల్సిన రెండో అంశమేమంటే । పెట్టుబడి తరలి వెళ్ళిపోవడం వల్ల నగరం యొక్క సుసంపన్నత క్షీణించేటట్లయితే బొంబాయి నగరంలో జీవిస్తున్న మహారాష్ట్రీయుల జీవన ప్రమాణంపై అప్పుడు ఎటువంటి ప్రభావం ఉటుంది తాము గుమస్తాలూ, కూలీల జాతివారమన్న విషయాన్ని మహారాష్ట్రీయులు మరువకూడదు ఇది వారి అహాన్ని దెబ్బ తీసేదే అయినా దానిని వారు మరవ కూడదు క్షీణిస్తున్న నగరంలో వారికెలాంటి బతుకు తెరువు దొరుకుతుంది?

ఈ దృక్కోణం నుండి మహారాష్ట్రీయులు బొంబాయి సమస్యను పరిశీలించాలి లోకోక్తి ఇలా ఉంది "సర్వనాశే, సముత్పన్నే అర్థత్యజతి పండితః" (సర్వనాశనం సముత్పన్నమయినపుడు జ్ఞాని అయినవాడు అర్థాన్ని త్యజిస్తాడు)

బొంబాయి నగరాన్ని ప్రత్యేక రాష్ట్రంగా ఎందుకు చేయాలి అన్నదానికి మరొక

కారణం కూడా ఉంది గ్రామాల్లో నివసిస్తున్న అల్ప సంఖ్యాక వర్గాలూ, షెడ్యూలు కులస్తులూ నిరంతరంగా మెజారిటీ కులాల దౌర్జన్యాలకీ, దోపిడీకీ, అణచివేతకీ, హత్యలకు కూడా గురౌతున్నారు మెజారిటీ కులాల దౌర్జన్యం నుండి రక్షణ పొందగలిగే ఆశ్రయం ఒకటి అల్పసంఖ్యాక వర్గాలకు కావాలి బొంబాయిని చేర్చిన ఐక్య మహారాష్ట్ర ఉన్నట్లయితే భద్రత కోసం వారెక్కడికి పోగలరు? గాంధీని గాడ్సే హత్య చేసినప్పుడు గ్రామాల్లో నివసిస్తున్న బ్రాహ్మణులపైనా, మార్వాడీలపైనా గుజరాతీయులపైన కూడా ఇటువంటి దౌర్జన్యాలే జరిగాయి ఒకప్పుడు గ్రామాల్లో నివసిస్తున్న బ్రాహ్మణులూ, మార్వాడీలూ, గుజరాతీలూ అంతా గ్రామాల నుండి పారిపోయి, ఇప్పుడు పట్టణాల్లో నిసిస్తున్నారు సురక్షితమైన గూటికి చేరుకున్న తరువాత వారంతా తమ పాత అనుభవాలను మరచిపోయి, ఇప్పుడు ఐక్యమహారాష్ట్రకోసం గావు కేకలు పెడుతున్నారు

తాత్కాలికంగా కాంగ్రెస్ అధిష్టాన వర్గ నిర్ణయాన్ని మహారాష్ట్రీయులు అంగీకరిస్తేనే బాగుంటుందని నాకనిపిస్తోంది

బొంబాయిని కోల్పోతామేమోనని మహారాష్ట్రీయులు భయపడాల్సిన అవసరం లేదు మహారాష్ట్రీయుల నుండి బొంబాయిని ఎవరూ వేరు చేయలేరు బొంబాయిని ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయడం పట్ల తలెత్తుతున్న అసలైన అభ్యంతరానికి గల కారణమేమంటే, బొంబాయి అన్న పదం అది మహారాష్ట్రలో భాగమన్న అర్థాన్ని స్ఫురింప చేయడం లేదు అని ఈ అభ్యంతరాన్ని తొలగించడానికే నేను నూతన బొంబాయి రాష్ట్రానికి పేరును బట్టి మహారాష్ట్ర అని స్ఫురించేటట్లుగా కొత్తపేరు పెట్టాలని ప్రతిపాదిస్తున్నాను ఈ ప్రతిపాదన ననుసరించి బొంబాయిని ప్రత్యేక రాష్ట్రంగా చేయాలి అని అనేకన్నా మహారాష్ట్రను నాలుగు రాష్ట్రాలుగా విభజించాలి అని కోరవచ్చు (1) మహారాష్ట్ర నగర రాష్ట్రం (అదే బొంబాయి నగరం) 2 పశ్చిమ మహారాష్ట్ర (3) మధ్య మహారాష్ట్ర 4 తూర్పు మహారాష్ట్ర అని ఇప్పుడు బొంబాయిని ప్రత్యేక రాష్ట్రం చేయడానికి చెప్పగలిగే అభ్యంతరమేముంటుంది

ఈ ప్రతిపాదన బొంబాయిని విడదీసినట్లే అవుతుంది నగరం పేరులో పై విధంగా మార్పు వచ్చిన తరువాత కూడా, మహారాష్ట్ర నుండి బొంబాయి వేరు పడుతోందన్న కారణంగా, బొంబాయి నగరాన్ని ప్రత్యేక రాష్ట్రంగా చేయడానికి ఏ మహారాష్ట్రీయుడు అభ్యంతరం తెలియచేయగలడు? బొంబాయిని ప్రత్యేక రాష్ట్రంగా చేయాలని చెప్పడం, కేవలం మహారాష్ట్రను నాలుగు రాష్ట్రాలుగా విభజించాలని చెప్పడమే అవుతుంది మహారాష్ట్రను రెండు మూడు రాష్ట్రాలుగా విభజించడానికి అభ్యంతరం లేనప్పుడు మహారాష్ట్రను నాలుగు రాష్ట్రాలుగా విబజించడానికి మాత్రం అభ్యంతరం ఏమిటి? అలా ఎదురు అయ్యే అభ్యంతరం నాకేమీ కనిపించడం లేదు

భాషాపరమైన సామ్యంకోసం కలకత్తాను బెంగాల్ నగర రాష్ట్రంగాను, మద్రాసును తమిళ నగర రాష్ట్రంగాను పిలవాలని నేను ప్రతిపాదిస్తున్నాను

మహారాష్ట్రీయుల, గుజరాతీల మధ్య ఉన్న ఉద్రిక్తతను సడలించడానికి నేను చేస్తున్న ఒక ప్రతిపాదన ఇది

మహారాష్ట్ర నగర రాష్ట్రం తప్పక మిగులు రాష్ట్రం అవుతుంది బొంబాయితో కూడిన మహారాష్ట్ర కావాలని కోరుకుంటున్న వారు ఈ మిగులు ప్రయోజనం మహారాష్ట్రకు దక్కుతుందని ఆశిస్తున్నారు

(1) ఆస్తిపన్ను, (2) విద్యుత్ పన్ను కారణంగా నగర రాష్ట్రం మిగులు ఆదాయాన్ని పొందుతుంది బొంబాయిని కనుక ప్రత్యేక నగర రాష్ట్రంగా చేసినట్లయితే, ఈ రెండు మార్గాల ద్వారా వచ్చే ఆదాయం కేవలం మహారాష్ట్ర పరమే అవుతుందా?

బొంబాయి నగర రాష్ట్ర ఆస్తిపన్ను నుండి వచ్చే ఆదాయాన్ని పొందడానికి మరెవరికీ వీలు పడదు అది స్థానికంగా ఉన్న ఆస్తిపై విధించే పన్ను ఆ ఆస్తి ఏ రాష్ట్రంలో ఉంటుందో, ఆ రాష్ట్రమే దాని నుండి వచ్చే ఆదాయాన్ని పొందే హక్కు కలిగి ఉంటుంది

విద్యుత్ పన్నుకు సంబంధించిన పరిస్థితి భిన్నంగా ఉంది

గుజరాత్, మహారాష్ట్రలు వేరు చేయబడినప్పుడు - (అవి వేరు చేయబడాలి) గుజరాత్‌లో ఉత్పత్తి అవుతూ అందులోనే వినియోగపడుతున్న విద్యుత్ నుండి వచ్చే ఆదాయం తనకే చెందాలని గుజరాత్ వాదిస్తుంది మహారాష్ట్రలో ఉత్పత్తి అయి అక్కడ వినియోగమవుతున్న విద్యుత్ నుండి వచ్చే ఆదాయం తనకే చెందాలని మహారాష్ట్ర వాదిస్తుంది రాష్ట్రంగా రూపొందిన బొంబాయి నగర రాష్ట్రం కూడా అదే వాదనలు చేస్తుంది అయితే అలా వచ్చే ఆదాయాన్ని వినియోగించు కోవడానికి బొంబాయికి మాత్రం ఇవ్వడానికి వీలవుతుందా? అలా చేయడం న్యాయమేనా? బొంబాయి నగరం విద్యుత్‌ను ఉత్పత్తి చేయదు? బొంబాయి నగరానికి వెలుపల గల మహారాష్ట్రలో అది ఉత్పత్తి అవుతుంది అందువల్ల విద్యుత్ నుండి వచ్చే మొత్తం ఆదాయాన్ని తనే వినియోగించుకోవడానికి బొంబాయి నగర రాష్ట్రానికి హక్కులేదు

అటువంటప్పుడు అందరికీ న్యాయం జరగాలంటే, వనరులను వేరు చేయడం, ఆదాయాన్ని పంపకం చేయడమన్న సూత్రాన్ని అమలు చేయడమే సరైన పద్ధతి అవుతుంది అర్థశాస్త్రవేత్తలందరికీ ఈ సూత్రం బాగా తెలుసు స్పష్టరూపంలో ఇలా చెబుతాను విద్యుత్ పన్ను బాధ్యతను కేంద్రమే తీసుకుని, దాని నుండి వచ్చే ఆదాయాన్ని నాలుగు మహారాష్ట్ర రాష్ట్రాల మధ్య - 1 బొంబాయి, 2 పశ్చిమ మహారాష్ట్ర, 3 మధ్య మహారాష్ట్ర 4 తూర్పు మహారాష్ట్రల మధ్య - వాటి అవసరాలకనుగుణంగా విభజించాలి

బొంబాయి నగరం వేరే రాష్ట్రంగా రూపొందడం వల్ల మిగిలిన మూడు మహారాష్ట్ర రాష్ట్రాలు ఎదుర్కొనే ఆర్థిక ఒత్తిడిని కూడా ఇది సడలిస్తుంది

## IV

## ఐక్యంగా ఉండడమా? విడిపోవడమా?

బొంబాయి నగరానికి కొత్త ప్రాంతాలను అనుసంధించి, దాన్ని ప్రత్యేక నగర రాష్ట్రంగా చేయాలని నేను ఇదివరకే చెప్పాను

ఇప్పుడు మిగిలిన మహారాష్ట్రకు సంబంధించిన సమస్యను ఎలా పరిష్కరించాలన్న ప్రశ్న మిగులుతుంది మిగిలిన మహారాష్ట్రనంతా మూడు రాష్ట్రాలుగా విభజించాలని నేను సూచించే ఉన్నాను

అతి ప్రాచీన కాలం నుండి కూడా మహారాష్ట్ర మూడు రాష్ట్రాలుగా విభజించబడే ఉంది

అశోకుని కాలంలో మొదటి సారిగా చరిత్రలో మనకు మహారాష్ట్ర ప్రస్తావన కనిపిస్తుంది బౌద్ధమతాన్ని ప్రచారం చేయడం కోసం భారతదేశంలోని వివిధ ప్రాంతాలకు అశోకుడు పంపిన ప్రచారకుల గురించి చెప్పే సందర్భంలో "మహావంశ"లో మహారాష్ట్ర ప్రస్తావన ఉంది కాని ఆ తరువాత పాళీ సాహిత్య మంతటా 'త్రైమహారాష్ట్ర', (మూడు మహారాష్ట్రలు) అని చెప్పబడి ఉంది అంటే అతి ప్రాచీన కాలం నుండి మూడు మహారాష్ట్రలు ఉన్నాయని అర్థం అందువల్ల నా ప్రతిపాదనేమీ కొత్తదికాదు

మూడు మహారాష్ట్రాల విస్తీర్ణం, వాటి మధ్య జనాభా, ఆదాయాల పంపిణీ, దిగువ సూచించిన పట్టికలో చూపినట్లుగా ఉంటుంది

మూడు రాష్ట్రాల విస్తీర్ణమూ, సరిహద్దులూ, పటం 5 లో చూపిన మాదిరిగా ఉంటాయి

ప్రస్తుతానికి మూడుగా విభజించిన మహారాష్ట్రాల విస్తీర్ణమూ, జనాభాల విషయంలో కూడా ఏ ఆక్షేపణా ఉండడానికి వీలులేదు ప్రాచీన కాలంనుండి కూడా అవి త్రై మహారాష్ట్రాలుగానే వ్యవహరింపబడుతూ వచ్చాయి

భాషా నియమానికి కూడా ఈ విభజన ఏ నష్టమూ కలిగించదు వాస్తవానికి మూడు మహారాష్ట్రాలూ ఒకే భాషను కలిగి ఉన్నాయి కాబట్టి వాళ్లంతా సముచిత మని భావించినట్లయితే, అది మరాఠీ భాష అభివృద్ధికి తోడ్పడగలదు స్వయం పోషకతా సమస్యను గూర్చి నేను తరువాత వేరే ప్రకరణంలో పరిశీలిస్తాను

ప్రాచీన కాలంలో 'బొంబాయి' అనేది అజ్ఞాత విషయం అది ఉండి ఉన్నట్లయితే

మహారాష్ట్రలో నాలుగోభాగంగా పేర్కొనబడి ఉండేదే

ఇకపోతే మిగిలిన మూడు భాగాలలో నేను "తూర్పు మహారాష్ట్ర" అని అంటున్న ప్రాంతం ఇప్పటికే ప్రత్యేక రాష్ట్రంగా ఉంది దానికి మనం చేయవల్సిందేమంటే, దానిని, అలా ప్రత్యేక రాష్ట్రంగా ఉండేందుకు అనుమతించడమే సుస్థిరమైన పాలనా వ్యవస్థ, సుస్థిరమైన ఆదాయ వ్యవస్థ, సుస్థిరమైన న్యాయవ్యవస్థ దానికున్నాయి అది, హిందీ, మాట్లాడే ప్రజల ప్రతి బంధకాలనుండి కూడా వేరు చేయబడి ఉంది

ఇక మిగిలిన ఏకైక సమస్య ఏమంటే, ప్రస్తుత బొంబాయి రాష్ట్రంలో ఉన్న మహారాష్ట్ర ప్రాంతాన్నీ, హైదరాబాద్ రాష్ట్రంలో ఉన్న మరాట్వాడా ప్రాంతాన్నీ ఎలా విభజించాలన్నదే

ఆ రెండు ప్రాంతాలనూ ఒకటిగా చేసి, దానిని మూడవభాగంతో- అంటే, నేను తూర్పు మహారాష్ట్రగా పిలుస్తున్న ప్రాంతంతో జతపర్చే కన్నా, బొంబాయిలోని మహారాష్ట్ర ప్రాంతాన్ని, మరాట్వాడాను రెండు సమాన రాష్ట్రాలుగా ఎందుకు చేయకూడదు? దానికి నేనొక పథకం రూపొందించాను ఆ పథకం ఇలా ఉంటుంది బొంబాయి రాష్ట్రంలోని ఆరు మహారాష్ట్ర జిల్లాలను వేరు చేయాలి వాటిని మరాట్వాడాలో కలపాలి (పటం -5 చూడండి) అప్పుడు మూడు మహారాష్ట్ర రాష్ట్రాల జనాభా, విస్తీర్ణం, ఆదాయం ఎలా ఉంటాయో ఈ దిగువన ఇస్తున్నాను

**మూడు మహారాష్ట్ర రాష్ట్రాల జనాభా, విస్తీర్ణం, ఆదాయం దాదాపుగా ఈ దిగువ చూపిన విధంగా ఉంటాయి**

| రాష్ట్రం పేరు | మొత్తం జనాభా (కోట్లలో) | మొత్తం విస్తీర్ణం (చదరపుమైళ్లు) | మొత్తం ఆదాయం | మొత్తం వ్యయం |
|---|---|---|---|---|
| పశ్చిమ మహారాష్ట్ర | 1,26,77,316 | 30,028 | 26,24,20,441 | తెలియదు |
| మధ్యమహారాష్ట్ర | 1,24,09,044 | 55,482 | 21,63,80,095 | తెలియదు |
| తూర్పుమహారాష్ట్ర | 80,27,130 | 39,004 | 9,41,11,012 | తెలియదు |
| మొత్తం | 3,31,13,490 | 1,24,514 | 57,29,11,548 | |

ఈ పథకానికి మద్దతుగా నాకు గల కారణాలను ఇప్పుడు వివరిస్తాను

మహారాష్ట్ర ఎల్లప్పుడూ మూడు భాగాలుగా విభజింపబడే ఉండేదని నేను చెప్పాను ఇది చారిత్రక సత్యం ఐక్య మహారాష్ట్రగా నేడు పిలవబడుతున్న ప్రాంతపు సాంప్రదాయం, జీవన విధానం, ఆర్థిక పరిస్థితి ఒకటి కాదు అన్న విషయాన్నైనా ఇది కనీసం రుజువు చేస్తుంది

ఐక్య మహారాష్ట్ర కావాలని తొందరపడుతున్న వారు దీనిని ముఖ్యమైన అంశంగా

పరిగణించకపోవచ్చు అయితే ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా తలెత్తుతున్న వాదనలు కూడా కొన్ని ఉన్నాయి వాటిని విస్మరించడానికి కుదరదు అటువంటి వాటిలో కొన్నిటిని నేనిక్కడ పేర్కొంటున్నాను

నా మొదటి వాదన ఏమంటే ఐక్య మహారాష్ట్ర అంతపెద్ద రాష్ట్రాన్ని ఒకే ఒక ప్రభుత్వం పాలించలేదని

మరాఠీ భాష మాట్లాడే ప్రాంతంలో ఉండే మొత్తం జనాభా సంఖ్య 13,31,13,490 మరాఠీ భాష మాట్లాడే ప్రజలు ఉన్న ప్రాంత విస్తీర్ణం 1,74,514 చదరపు మైళ్ళు ఇంత విశాలమైన ప్రాంతానికి సమర్థవంతమైన పాలన అందించడం ఒక్క రాష్ట్ర ప్రభుత్వానికి అసాధ్యం అవుతుంది సంయుక్త మహారాష్ట్ర గురించి మాట్లాడే వారికి తమ మహారాష్ట్ర జనాభా, విస్తీర్ణాల విస్తృతి గురించి అవగాహన లేదు

కాని ఒక మహారాష్ట్రమే ఎందుకు ఉండాలో నేను బొత్తిగా అర్థం చేసుకోలేక పోతున్నాను ప్రత్యేక మహారాష్ట్ర రాష్ట్రాన్ని కోరడం వేరు ఏక మహారాష్ట్ర రాష్ట్రాన్ని కలిగి ఉండడం వేరు ఈ రెండింటికీ చాలా తేడా ఉంది ప్రత్యేక మహారాష్ట్రకు అంటే గుజరాతీలనుండి, హిందీ మాట్లాడే ప్రజల నుండి వేరయిన ప్రత్యేక మహారాష్ట్రకు నేను అనుకూలంగా ఉన్నాను స్వేచ్ఛాయుతమైన మహారాష్ట్రను ఒక ఏక రాష్ట్రంగా ఎందుకు చేయాలంటున్నారో నేను అర్థం చేసుకోలేక పోతున్నాను యు పి పై యుద్ధం ప్రకటించాలని మహారాష్ట్రీయులు ఏమీ అనుకోవడం లేదు అందువల్ల ఉమ్మడి ఫ్రంట్ ఉండాల్సిన అవసరం వారికి లేదు

మరాఠీల దృష్టినుండి చూసినా ఈ సంఘటితం ఎందుకు ఉండాలట? సతారాకు చెందిన మరాఠీకి ఔరంగాబాద్‌కు చెందిన మరాఠీతో ఉన్న అనుబంధం ఏమిటి? నాసిక్ మరాఠీలకున్నూ రత్నగిరి మరాఠీలకున్నూ ఉన్న అనుబంధం ఏమిటి? ఔరంగాబాద్‌కు చెందిన మరాఠీవ్యక్తి యొక్క సమస్యలను పరిష్కరించడానికి సతారా మరాఠీ చూపబోయే ఆసక్తి కానీ, వారి సంరక్షణకు తీసుకోబోయే జాగ్రత్తలు కానీ ఏమున్నాయి? రత్నగిరికి చెందిన మరాఠీ వ్యక్తి సమస్యలను పరిష్కరించడానికి నాసిక్ మరాఠీ తీసుకోబోయే రక్షణలు కాని చూపే ఆసక్తి కాని ఏముంది? ఈ సంఘటితం అర్థరహితం, నిష్ప్రయోజనం

ప్రస్తుత బొంబాయి మంత్రి వర్గంలో ఉన్న మరాఠీలంతా సతారా నుండి లేదా నాసిక్ నుండి వచ్చినవారే కొంకణ ప్రాంతం నుండి ఒక్క మరాఠీ కూడా మంత్రివర్గంలో లేదు పరిగణనలోకి తీసుకోవాల్సిన రెండో అంశమేమంటే మహారాష్ట్ర యొక్క మూడు భాగాల మధ్య ఆర్థిక అసమానత ఉంది మరాఠ్వాడాను నిజాంనవాబులు పూర్తిగా నిర్లక్ష్యం చేశారు ఐక్య మహారాష్ట్ర ఏర్పడితే ఈ మరాఠ్వాడా అంటే నేను చెప్పే మధ్య మహారాష్ట్ర గురించి మిగిలిన రెండు మహారాష్ట్రలు పట్టించుకుంటాయనడానికి హామీ ఏమిటి?

పరిగణనలోకి తీసుకోవాల్సిన మూడో అంశ మేమంటే మహరాష్ట్ర మూడు భాగాలా మధ్య ఉన్న పారిశ్రామిక అసమానత పశ్చిమ మహారాష్ట్ర తూర్పు మహారాష్ట్రలు పారిశ్రామికంగా అభివృద్ధి చెంది వున్నాయి మరి మధ్య మహారాష్ట్ర సంగతేమిటి? దాని పారిశ్రామిక అభివృద్ధికి ఉన్న హామీ ఏమిటి? మధ్య మహారాష్ట్ర పారిశ్రామిక అభివృద్ధి గురించి పశ్చిమ మహారాష్ట్ర తూర్పు మహారాష్ట్రలు ఆసక్తి చూపుతాయా?

పరిగణనలోకి తీసుకోవాల్సిన నాలుగో అంశమేమంటే ఒకవంక తూర్పు మహారాష్ట్రకి, పశ్చిమ మహరాష్ట్రకీ గల విద్యా విషయకమైన తేడాకూ మరొకవంక ఆ రెండిటికీ, మధ్య మహారాష్ట్రకూ మధ్య విద్యాపరంగా ఉన్న అసమానతా చాలా స్పష్టంగా ఉంది మధ్య మహారాష్ట్ర కనుక పూనే విశ్వ విద్యాలయ పరిధిలోకి వచ్చినట్లయితే ఒక దాని భవిష్యత్తు నాశనమయినట్లే

మరాట్వాడా గురించి నేను బాగా ఆందోళన పడుతున్నాను గత రెండువందల సంవత్సరాలుగా అది నిజాం పాలనా ప్రాంతంగా ఉంది ఈ ప్రాంతాన్ని నిజాం నవాబులు దారుణంగా నిర్లక్ష్యం చేశారు ఈ ప్రాంతంపై నిజాం ఎటువంటి ఆసక్తి చూపలేదు మరాట్వాడాలో ఒకమైలు అయినా నీటి సాగుకాలువ లేదు మరాట్వాడాలోని తాలూకా ప్రాంతాల్లోకూడా హైస్కూలు ఉండడమన్నది అపూర్వం నిజాం ప్రభుత్వ సర్వీసులో మరట్వాడాకు చెందిన యువకుడు ఒకడయినా ఉండడం అరుదు నా అనుభవం, అవగాహనల నుండే నేనీ విషయాలు చెపుతున్నాను ప్రజలు పూర్తిగా అణగారిపోయి, వెనకబడి ఉండటమేకాదు, అజ్ఞానంలో కూడా ఉన్నారు ఇరుపక్కలా బాగా పురోగమించిన ప్రజల చేత వారు కబళింప బడుతున్నారు వారి ఉద్యోగావకాశ ద్వారాలు మూసుకుపోయినప్పుడు వారి పరిస్థితి మరింతగా దిగజారుతుంది గదా!

మరాట్వాడా ప్రాంతం పూనే విశ్వవిద్యాలయ పరిధిలోకి వచ్చినప్పుడు ఏం జరుగుతుంది అని ఆలోచించడానికి కూడా నేను భయపడుతున్నాను పూనే విశ్వవిద్యాలయ పరిధిలో ఉన్న పాఠశాలలయొక్క, కళాశాలలయొక్క విద్యా ప్రమాణం చాలా హెచ్చు స్థాయిలో ఉంది మరాట్వాడా నుండి వచ్చే ఏ బాలుడూ కూడా అక్కడి పరీక్షలో ఉత్తీర్ణుడు కాగలనని ఆశించలేదు ఐక్యమహారాష్ట్ర కోరిక విషయంలో వున్న ఉన్మాదం మాదిరిగానే ఒకే ఒక ఉమ్మడి విశ్వవిద్యాలయం వుండాలనే ఉన్మాదం కూడా అభివృద్ధి చెందే అవకాశాలున్నాయి

ఐక్య మహారాష్ట్ర ఏర్పాటును అనుసరించి జరిగే పరిణామమేమంటే ఉద్యోగాలు సంపాదిం చేందుకు పూనే, నాగపూర్ బ్రాహ్మణుల రద్దీ మరాట్వాడాలో ఎక్కువవుతుంది

మహారాష్ట్రను మూడు భాగాలుగా ఎందుకు విభజించాలో చెప్పడానికి మరొక కారణం కూడా ఉంది

బొంబాయి శాసన సభలో మొత్తం సభ్యుల సంఖ్య 315 వారిలో 149 మంది సభ్యులు మరాఠీ మాట్లాడే వారు బొంబాయి శాసన సమితిలో మొత్తం సభ్యుల సంఖ్య 72, వారిలో 34 మంది మరాఠీ మాట్లాడే వారు మరాఠీ మాట్లాడే సభ్యుల్లో ఎవరో ఒకరు బొంబాయి రాష్ట్ర ముఖ్యమంత్రి కాగలగాలి అనేది స్పష్టంగా అర్థమౌతోంది ముఖ్యమంత్రి పదవికి అభ్యర్థిగా శ్రీ హిరే పోటీకి దిగారు కాని కాంగ్రెస్ అధిష్టానవర్గం ఆయన పోటీనుండి ఉపసంహరించుకునేటట్లు చేసింది అంతేకాదు మొరార్జీ దేశాయిని బొంబాయి ముఖ్యమంత్రిగా చేయాలన్న తీర్మానాన్ని కూడా ఆయన చేత బలవంతంగా ప్రతిపాదింప చేశారు మహారాష్ట్రీయ నాయకుడికి ఎటువంటి అవమానం? మహారాష్ట్రీయుల రాజకీయ విజ్ఞతకు కాంగ్రెస్ అధిష్టాన వర్గం ఇస్తున్న విలువ ఎటువంటిది?

ఇంతకు ముందు ప్రస్తావించిన మంత్రి వర్గ శాఖల పంపిణీ సమాచారం కూడా మరాఠీ మంత్రులు అసమర్థులు అనే భావన కలిగింపజేసేటట్లుగా వుంది

పైన ఉదహరించిన వాస్తవాలను బట్టి మరాఠీలకు రాజకీయ ప్రతిభ లోపించిందన్న విషయం స్పష్టమౌతుంది తిలక్, గోఖలే, రెనడే వంటి ప్రజ్ఞాశాలురు వారిలో ఒక్కరూ లేరు నేడు మహారాష్ట్రీయులు ఏ విషయంలోనూ పరిగణనలోకి రాకుండా పోతున్నారు కాంగ్రెస్ మహారాష్ట్రీయులు, కాంగ్రెస్ సంస్థలో విలువ తక్కువ వారుగా పరిగణించ బడుతున్నారు కాంగ్రెసేతర మహారాష్ట్రీయులు కూడా ఏ విషయంలోనూ పరిగణనలోకి రారు అందువల్ల రాజకీయ రంగంలో మహారాష్ట్రీయులను తర్ఫీదు పొందించడం అత్యంతావశ్యకం ప్రజలకు అధికారం బదిలీ అవడం వల్ల రాజకీయ శిక్షణ మౌలిక మైన అంశం అయింది మరాఠీలు, అన్న పదాన్ని రెండు అర్థాలతో ఉపయోగిస్తున్నారు ఒక అర్థంలో మరాఠీలు అంటే మరాఠీ భాష మాట్లాడే ప్రజలందరూ అని మరొక అర్థంలో కులపరంగా మరాఠాలు అయిన వారంతా అని అయితే ఈ రెండు రకాల వారినీ మరాఠీలు అనే సంబోధిస్తున్నారు అయితే భాషా పరంగా మరాఠీలు అయిన వారికి, కుల పరంగా మరాఠీలు అయిన వారికి గల తేడాను గుర్తించడంలో వారు విఫలమవుతున్నారు

మహారాష్ట్రను పాలించ వలసి వారు భాషా పరంగా మాత్రమే మరాఠీలు అయిన వారు కాదు కులపరంగా మరాఠాలు అయినవారే బ్రాహ్మణుల ఆశలు ఇందుకు వ్యతిరేకమే మరాఠీలు రాజకీయంగా బాగా వెనుకబడిన కులస్తులన్న విషయం ఇప్పుడు తోసిపుచ్చలేని వాస్తవం అందువల్ల వారు రాజకీయ శిక్షణ పొందడం అతి ముఖ్యం అవుతుంది మొత్తానికి ఒకే ఒక్క మహారాష్ట్ర కనుక ఉన్నట్లయితే ఒక మరాఠీ వ్యక్తి ముఖ్యమంత్రిగాను, ఐదుగురు లేదా ఆరుగురుకి మంత్రులుగాను మాత్రమే తర్ఫీదు పొందగలుగుతారు మూడు మహారాష్ట్రలు ఉన్నట్లయితే ముగ్గురు మరాఠీ వ్యక్తులు ముఖ్యమంత్రులుగానూ, ముప్పయి మంది మరాఠీ వ్యక్తులు మంత్రులుగానూ తర్ఫీదు పొందగలరు ఈ విషయంలో మన అధిపతులు

విద్యావంతులు కావడానికి సహాయ పడడం ద్వారా మనకు మనమే బాగా సేవ చేసుకో గలవారం అవుతాము

తమ సామర్థ్యాలను ప్రదర్శించటానికి, తమ సామర్థ్యాలను అభివృద్ధి చేసుకోవటానికీ మరింత విస్తృతరంగాన్ని కల్పించడమే మరాఠీలను విద్యావంతుల్ని చేయడానికిగల ఏకైక మార్గం మూడు మహారాష్ట్ర రాష్ట్రాల ఏర్పాటు మాత్రమే ఈ పని చేయగలుగుతుంది

ఇక్కడ సందర్భోచితంగా ఉండే కథ ఒకటి ఉంది ఒక యువతిని ఆమె తండ్రి ఆహారం కోసమని అడవిలోకి తీసుకు వెళ్ళాడు అక్కడ పెద్ద పెద్ద వృక్షాల క్రింద చిన్న చిన్న పొదలుండడం ఆమెకంట పడింది పెద్ద వృక్షాల క్రింద ఉన్న పొదులు ఎందుకు ఎదగలేదని ఆమె తన తండ్రిని అడిగింది ఆమె తండ్రి వృక్షశాస్త్రజ్ఞుడు కాకపోవడంవల్ల సమాధానం ఇవ్వలేక అది నాకు తెలియదని బదులిచ్చాడు అయితే, ఆ ప్రశ్న చాలా ప్రాధాన్యత కల ప్రశ్న అని ఆయన భావించాడు ఆయన ఒక కళాశాల ప్రొఫెసర్ కావడంతో, ఆ మరునాడు తన కళాశాలలో పనిచేస్తున్న వృక్ష శాస్త్ర నిపుణుడైన తన సహోద్యోగికి అదే ప్రశ్న వేశాడు దాని కాయన ఇలా సమాధానమిచ్చాడు (ఎందుకు! ఈ ప్రశ్నకు సమాధానం చాలా సులభమైంది సూర్య కిరణాలన్నిటినీ పెద్ద వృక్షాలే ఉపయోగించేసు కుంటాయి పొదలకు సూర్య కిరణాలు సోకవు అవి పెరగక పోవడానికి కారణం అదే) ఈ కథలోని నీతిని మరాట్వాడా ప్రజలు మరువకూడదు

ఐక్య మహారాష్ట్రకు అనుకూలంగా ఉన్న ఒకే ఒక్క వాదనేమంటే , అది, రామాయణంలో చాలా కాలం ఎడబాటు తరువాత జరిగిన రామభరత సోదరుల కలయిక లాగా ఉంటుందన్నది ఇది వివేకమైన వాదనాకాదు, పరిగణించతగ్గ వాదనా కాదు

కొన్ని రాయితీలకు హామీ ఇచ్చే ఒక రకమైన రాజకీయ ఒప్పందం పశ్చిమ మహారాష్ట్రతో ఉంటే చాలునని సంతృప్తి పడుతున్న మహరాష్ట్రీయులు కొంతమంది ఉన్నారు ఒప్పందాలు చెత్త కాగితాల వంటివి అవి అమలు జరగనివి ఎవరూ అమలు చేయించలేని రాజకీయ ఒప్పందాలకంటె, అధికారాన్ని తమ సొంత చేతుల్లో కలిగి ఉండడం, మెరుగైన విషయం కాదా?

బొంబాయి ప్రభుత్వంలో మహారాష్ట్రీయుల పనితీరు ఎంత దౌర్భాగ్యంగా, ఎంత హీనంగా ఉంది! మహారాష్ట్రీయులలో బాగా చదువుకున్న బాగా పురోగమించిన వారి తీరే ఇలా ఉంటే, మరాట్వాడా ప్రజల నుండి ఇంకేమి ఆశించగలం?

తమ సొంత రాష్ట్రాన్ని ఏర్పాటు చేసుకొమ్మని మరాట్వాడా, (మధ్య మహారాష్ట్ర) ప్రజలకు నేను సలహా ఇస్తున్నాను అప్పుడు తమ స్థితి గతులను మెరుగు పర్చుకోగల అధికారం వారికి తమ చేతుల్లో ఉంటుంది

## V

## కోల్పోయిన భూభాగాన్ని తిరిగి పొందడం

మరాఠీ మాట్లాడే ప్రజలందర్నీ ఒకే రాష్ట్రంలో మందలాగా కుక్కి వేయవలసిందేనా? లేక వారిని రెండు లేక అంతకన్నా ఎక్కువ రాష్ట్రాలుగా విభజించవలుందా?

బొంబాయి ప్రాంతాన్ని వేరు చేసినప్పుడు మిగిలిన ప్రాంతాన్ని ఏంచేయాలన్న ప్రశ్న ఎదురవుతుంది ఆ మిగిలిన రెండు ప్రాంతాలు (1) గుజరాత్ (2) మహారాష్ట్ర

నేను మహారాష్ట్ర ప్రాంతం గురించే చర్చిస్తాను

భాషా ప్రయుక్త రాష్ట్రాలను యేర్పాటు చేస్తూ కమీషన్ మరాఠీ మాట్లాడే ప్రాంతాలను కొన్నిటిని, మరాఠీ మాట్లాడని ప్రాంతాలలో చేర్చి వేసింది అలా వేరు చేయబడిన ప్రాంతాల సంఖ్య ఇలా వుంది

1 బెల్గాం నగరంతో సహా బెల్గాంతాలూకా
2 ఖానాపూర్ తాలూకా
3 నిపానితో సహా చికోరీ తాలూకా
4 సుప తాలూకా
5 కార్వార్ తాలూకా
6 బీదర్‌లోని నిలంగ తాలూకా
7 బీదర్‌లోని అహ్మద్‌పూర్ తాలూకా
8 బీదర్‌లోని ఉద్గిర్ తాలూకా
9 ఆదిలాబాద్‌లోని రాజ్‌గిర్ తాలూకా
10 పొరుగునే ఉన్న హిందీ మాట్లాడే రాష్ట్రానికి ఇచ్చిన కొంత విదర్భ ప్రాంతం

ఈ విధంగా మహారాష్ట్ర నుండి వేరు చేయబడిన మహారాష్ట్రీయుల జనాభా సంఖ్యరీత్యా చూసినట్లయితే 13,89,648 మంది అని తేలింది

బొంబాయిని మిశ్రమ రాష్ట్రంగా కొనసాగించడానికి కమీషన్ రెండు అతి ముఖ్యమైన లక్ష్యాలను సాధించాల్సి వచ్చింది ఒకటి, బొంబాయిని మహారాష్ట్రీయుల చేతుల్లోకి వెళ్ళకుండా అడ్డుకోవడం మిశ్రమ రాష్ట్రాన్ని ఏర్పాటు చేయడంద్వారా కమీషన్ ఈ లక్ష్యాన్ని సాధించింది వారు సాధించాల్సి వచ్చిన రెండో లక్ష్యమేమంటే మహారాష్ట్రీయుల గుజరాతీల మధ్య సమానత్వాన్ని ఏర్పరచడం భవిష్యత్తులో ఏర్పడబోయే బొంబాయి రాష్ట్ర శాసనసభలో గుజరాతీల, మహారాష్ట్రీయుల మధ్య సంఖ్యా సమానత్వం అవసరమని కమీషన్ ఒక పథకం వేసింది ఇంతవరకూ పాత శాసన సభలో గుజరాతీలు తమ మెజారిటీ కోసం కర్నాటక సభ్యులపై, ఆధారపడేవారు నూతన కర్ణాటక రాష్ట్రం ఏర్పాటుతో ఆ సభ్యులంతా పోవడం వల్ల, గుజరాతీల మెజారిటీ మాయమైంది దాంతో గుజరాతీ,

మహారాష్ట్రీయుల మధ్య అవసరమైన సమానత్వం ఇపుడు మరింతగా అత్యావశ్యకమైంది మరాఠీ మాట్లాడే ప్రజలను, మరాఠీయేతర భాషా రాష్ట్రాలకు అప్పగించడం ద్వారా మహారాష్ట్ర రెక్కలు విరిచి కమీషన్ ఈ సమానత్వ లక్ష్యాన్ని సాధించింది ఈ రాజకీయ మూర్ఖతకు ఇంతకు మించిన కారణం ఇంకొకటి కనిపించడం లేదు

మహారాష్ట్రకు కమీషన్ చేసిన ఈ అన్యాయాన్ని ఇప్పుడు తొలగించి తీరాలి అదృష్ట వశాత్తూ అది తిరిగి సరిదిద్దుకోగినదే ఇపుడు మిశ్రమ రాష్ట్రమన్న ప్రతిపాదన మాయమైంది మహారాష్ట్రీయుల, గుజరాతీలా మధ్య సమానత్వాన్ని సాధించాల్సిన అవసరం ఇకలేదు

## అధ్యాయం–8

## ఈ విషయానికి సంబంధించిన సూత్రాల సారాంశం

భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు ఆధారం కాగల సూత్రాలను ఇంతకు ముందు పేజీలలో వివరించాను కాని అవన్నీ చెల్లా చెదరుగా ఉన్నాయి పాఠకుడి సౌలభ్యం కోసం వాటినన్నిటినీ క్లుప్తీకరించి వాటి సారాంశాన్ని ఈ దిగువ పొందుపరుస్తున్నాను

1 మిశ్రమ రాష్ట్ర ఆలోచనకు పూర్తిగా తిలోదకాలు ఇచ్చి తీరాలి

2 ప్రతిరాష్ట్రం, ఏకభాషా రాష్ట్రం కావాలి ఒక రాష్ట్రం, ఒకభాష

3 ఒక రాష్ట్రం, ఒక భాష అన్న సూత్రాన్ని ఒక భాష, ఒక రాష్ట్రం అన్న సూత్రంతో గందరగోళ పరచకూడదు

4 ఒకభాష, ఒక రాష్ట్రం అన్న సూత్రం అర్థమేమంటే, విస్తీర్ణాన్నీ, జనాభానూ, ఆ భాష మాట్లాడే ప్రజల మధ్య ఉన్న వైవిధ్యాన్నీ పరిగణనలోకి తీసుకోకుండా, ఒకే భాష మాట్లాడే ప్రజలందర్నీ ఒకే ప్రభుత్వం క్రిందకు తీసుకురావడం అన్నది బొంబాయితో ఐక్య మహారాష్ట్రను ఏర్పరచాలన్న ఆందోళనకు ఆధారమైన ఆలోచన ఇదే ఇది ఒక అర్థరహిత సూత్రం దీనిని ఇంతకు ముందు ఎక్కడా అమలు చేసిన ఉదాహరణ లేదు ఈ ఆలోచనను వదలి వేయాలి ప్రపంచంలోని ఇతర ప్రాంతాలలో చేసిన మాదిరిగానే ఒక భాష మాట్లాడే ప్రజలను పెక్కు రాష్ట్రాలుగా విభజించవచ్చు

5 ఒక భాష మాట్లాడే ప్రజలను ఎన్ని రాష్ట్రాలుగా విభజించవచ్చు అనేది 1 పాలనా సామర్థ్య అవసరాలు, 2 వివిధ ప్రాంతాల అవసరాలు, 3 వివిధ ప్రాంతాల మనోభావాలు, 4 మెజారిటీ, మైనారిటీ ప్రజల మధ్య ఉండే నిష్పత్తిపైన ఆధారపడి ఉండాలి

6 రాష్ట్ర విస్తీర్ణం పెరిగే కొద్దీ, మెజారిటీ, మైనారిటీల మధ్య ఉండే నిష్పత్తి దెబ్బతిని క్షీణ దశకు చేరుకుంటుంది మైనారిటీ పరిస్థితి ఇంకా శూన్యంగా మారుతుంది మైనారిటీలపై మెజారటీ దౌర్జన్యాలు చేసేందుకు గల అవకాశాలు బాగా పెరుగుతాయి అందువల్ల రాష్ట్రాలు చిన్నవిగా ఉండాలి

7 మెజారిటీల దౌర్జన్యాలను నిరోధించడానికి మైనారిటీలకు రక్షణ కల్పించాలి ఇలా రక్షణ కల్పించడం కోసం రాజ్యాంగాన్ని సవరించాలి గుత్త పద్ధతి బహుసభ్య (ఇద్దరు లేక ముగ్గురు) నియోజకవర్గాల వ్యవస్థ ఏర్పాటుకు కావలసిన నిబంధనలను రూపొందించాలి

## నాలుగవ భాగం

# భాషా ప్రయుక్త రాష్ట్రాల సమస్యలు

## అధ్యాయం-9

## స్వయంపోషకత

మూడు మహారాష్ట్ర రాష్ట్రాలు స్వయం పోషక రాష్ట్రాలవుతాయా? వాటి ఆదాయం వాటి వ్యయానికి సరిపోతుందా? ఇటువంటి ప్రశ్న తప్పని సరిగా ఉత్పన్నమౌతుంది ఒక్క మహారాష్ట్ర గురించే ఇటువంటి ప్రశ్న అడగాలని కాదు ఈ ప్రశ్నను భారతదేశంలోని మరే ఇతర రాష్ట్రం గురించైనా అడగవచ్చు

డాక్టర్ జాన్ మత్తయి అధ్యక్షత వహించిన టాక్సేషన్ ఎంక్వయిరీ కమిటీ నివేదిక పార్ట్ III నుండి, కేంద్ర ప్రభుత్వమూ పార్ట్ బి రాష్ట్రాలూ, పార్ట్ ఎ రాష్ట్రాలకు సంబంధించిన నాలుగు పట్టికలను నేను ఇస్తున్నాను (పట్టికలు 4,5,6,7 చూడండి)

ఈ పట్టికలనుండి ఈ దిగువ అంశాలు స్పష్టమవుతున్నాయి

1 గత కొన్ని సంవత్సరాల వరకూ రాష్ట్రాలలో లోటు అనేది లేదు అన్నీ స్వయంపోషకత గల రాష్ట్రాలుగానే ఉన్నాయి కాంగ్రెస్ అధికారంలోకి వచ్చిన తరువాత మాత్రమే అవి స్వయంపోషకతను కోల్పోయాయి

2 కాంగ్రెస్ అధికారంలోకి వచ్చిన దగ్గర నుండి ఎక్సైజ్ పన్నుద్వారా వచ్చే ఆదాయం క్షీణించడం ప్రారంభమై, పూర్తిగా అంతమయ్యే స్థాయికి చేరుకుంది

3 ఆదాయపు పన్ను, అమ్మకపు పన్ను అపారంగా పెరిగాయి

స్వయంపోషకతను కోల్పోవడాన్ని వివరించే కారణాలు ఇవి

అర్థంలేని, వాస్తవికతలేని, వివేక రహితమైన తప్పుడు సిద్ధాంతం కోసం ఎక్సైజ్ ఆదాయం త్యాగం చేయబడుతోంది

కాంగ్రెస్ అనుసరిస్తున్న మద్యపాన నిషేధ విధానానికి సంబంధించి,సవాలు చేయబడతాయేమోనన్న భయం లేకుండా ఈ క్రింది సూత్రీకరణలను చేయవచ్చు

1 వృథాగా అపారమైన ఆదాయాన్ని త్యాగం చేస్తున్నారు

2 మద్యపానం చేయడం మానలేదు విస్తృత పరిమాణంలో మద్యం అక్రమంగా తయారు చేస్తున్నారు, రహస్యంగా ప్రజలకు అమ్ముతున్నారు

3 ప్రభుత్వం కోల్పోయిన ఆదాయాన్ని ఆ అక్రమ తయారీ దారులు పొందుతున్నారు

4 మద్యపాన నిషేధం సమాజాన్ని నైతికంగా పతనం చేసింది ఇంతకు ముందు కుటుంబంలోని పురుషులు మాత్రమే మద్యపానం చేసేవారు ఎందుకంటే కొనుక్కోడానికి దుకాణానికి వెళ్ళ గలిగేవారు వారే కాబట్టి కాని ఇప్పుడు అక్రమ సారాయి తయారీ అనేది గృహ పరిశ్రమగా మారి ఇంట్లో తయారవుతుండటంతో, స్త్రీ, పురుషులు ఉభయులూ సేవిస్తున్నారు

5 మద్యపాన నిషేధం వల్ల ప్రభుత్వం ఆదాయాన్ని కోల్పోవడమే కాకుండా మద్యపాన నిషేధాన్ని అమలు చేయడానికి పోలీసులపై అదనంగా ఖర్చు చేయవలసి వస్తోంది అయితే పోలీసులు ఆ పనిని ఎన్నడూ చేయరు

మద్యపానాన్ని నిషేధించలేని ఈ మద్యనిషేధం ఏం మేలు చేసింది? ఈ నిషేధాన్ని యావత్తు భారతదేశానికి విస్తరింప చేస్తానని కాంగ్రెస్ బెదిరిస్తోంది ఆ భగవంతుడే కాంగ్రెస్‌ను రక్షించాలి! దేవుడు తాను నాశనం చేయాలనుకున్న వారిని, ముందుగా పిచ్చివాళ్ళని చేస్తాడని అంటుంటారు కాంగ్రెస్ వారి విషయంలో భగవంతుడు అదే చేస్తున్నాడు

స్వయంపోషకతా మద్యపాన నిషేధమూ ఈ రెండిటినీ కాంగ్రెస్ ఒకేసారి సాధించలేదు అని చెప్పడానికి ఇది సరిపోతుందనుకుంటాను

ఇక భూమి శిస్తు విషయానికొస్తే, దానిని కచ్చితంగా పెంచుకోవచ్చు కాని ఓట్లు కోల్పోతామేమోనన్న భయం కారణంగా కాంగ్రెస్ వ్యవసాయ దారుల జోలికి పోవడానికి భయపడుతోంది అందువల్లనే అది అమ్మకం పన్నునూ, ఆదాయపు పన్నునూ పెంచుతోందన్నది స్పష్టం (పట్టిక 6 చూడండి) ఆ రెండు పన్నులు నగర జనాభాపై అధిక భారాన్ని మోపేవే

దీనిని బట్టి స్వయం పోషకత అనేది సమస్య కాదని కాంగ్రెస్ తన పన్నుల విధానాన్ని మార్చుకోవాల్సి ఉందని స్పష్టమవుతోంది స్వయం పోషకత అనేది పన్నులు భరించగల సామర్థ్యానికీ, పన్నులు విధించే సంకల్పానికీ సంబంధించిన సమస్య సామర్థ్యం అపారంగా ఉంది, కావల్సింది సంకల్పమే

మొత్తం భారత దేశ పన్నుల వ్యవస్థనే మార్పు చేయాల్సిన అవసరం ఉంది అది రాజ్యాంగ సవరణకు సంబంధించిన సమస్య దాని గురించి నేనిప్పుడు చర్చించను మరొక సందర్భంలో చర్చిస్తాను

## అధ్యాయం–10

# మెజారిటీలు – మైనారిటీలు

వాస్తవికంగా లేకపోతే రాజకీయాలు నిరర్థకం విజ్ఞానానికి సంబంధించినది ఇందులో యేమీ లేదు అందువల్ల ఏ రాజకీయ పథకం పైనైనా ఎటువంటి తీర్పు ఇచ్చేందుకైనా, ముందుగా దానికి సంబంధించిన ప్రాథమిక ప్రణాళికను పరిశీలించడం తప్పని సరి అవుతుంది

"ప్రాథమిక ప్రణాళిక" అంటే మీ ఉద్దేశమేమిటని ఎవరైనా నన్ను అడగవచ్చు ఏ సమాజానికైతే రాజకీయ పథకాన్ని వర్తింపచేయాలనుకుంటున్నారో, ఆ సమాజపు సామాజిక నిర్మాణమే ప్రాథమిక ప్రణాళిక అని నా ఉద్దేశం

సామాజిక నిర్మాణం పై రాజకీయ నిర్మాణం ఆధారపడి ఉందని చెప్పడానికి ఎటువంటి సమర్థనా అసరం లేదు వాస్తవానికి రాజకీయ నిర్మాణంపై సామాజిక నిర్మాణం హెచ్చు ప్రభావాన్ని కలిగి ఉంటుంది రాజకీయ నిర్మాణం పనిచేసే తీరును అది మార్చవచ్చు నిరర్థకం చేయవచ్చు లేదా అపహాస్యం పాలు కూడ చేయవచ్చు

భారతదేశ విషయంలో సామాజిక నిర్మాణం అనేది, హిందూ నాగరికతా సంస్కృతుల ప్రత్యేక సృష్టి అయిన కుల వ్యవస్థపై నిర్మితమై ఉంది

కుల వ్యవస్థ స్వభావం గురించి ఎవరికీ వివరించాల్సిన అవసరం లేదు దాని గురించి అందరికీ బాగా తెలుసు అందువల్ల భాషా ప్రయుక్త రాష్ట్రాలపై కుల వ్యవస్థ ఎటువంటి ప్రభావాన్ని కలుగ చేయబోతోంది అనే అంశాన్ని చెప్పేందుకు నేరుగా ప్రయత్నించవచ్చు

అందువల్ల కుల వ్యవస్థకు ఉన్న కొన్ని ప్రత్యేక లక్షణాలను గుర్తించి తీరాలి

1 కులాలు ఎలా పంపిణీ అయ్యాయి అంటే ప్రతి ప్రాంతంలోనూ ఒక ప్రధాన కులమూ కొన్ని ఇతర చిన్న కులాలు ఉన్నాయి జనాభా రీత్యా ప్రధాన కులంతో పోల్చినప్పుడు చిన్నవి కావడం వల్లనూ, గ్రామంలో ఉన్న భూమిలో ఎక్కువ భాగం సొంతం చేసుకున్నటువంటి ప్రధాన కులంపై ఆర్థికంగా ఆధారపడి ఉండడం వల్లనూ ఈ చిన్న కులాలు ప్రధాన కులానికి లోబడి ఉండేవిగా ఉన్నాయి

2 కేవలం అసమానతే కుల వ్యవస్థ ప్రత్యేకత కాదు క్రమబద్ధంగా శ్రేణీకరింప బడిన అసమానతతో అది ప్రభావితమై ఉంది అన్ని కులాలు ఒక దాని కొకటి సమానంగా ఉండవు అవి ఒక దానిపై మరొకటి ఉంటాయి అదొక రకమైన ఆరోహణా క్రమపు ద్వేషమూ అవరోహణా క్రమపు ఏవగింపూ కలిగి వున్నాయి

3 ఒక ప్రత్యేక దేశానికి ఉండేటటువంటి ప్రత్యేకతలూ, అహమూ, అభిమానమూ అన్నీ కులానికి ఉన్నాయి అందువల్ల కులాల సమూహాన్ని మేజర్, మైనర్ జాతులుగా

పేర్కొనడం అసమంజసం కాదు

వాస్తవాలతో అంకెలతో ప్రస్తావిస్తూ ఈ అంశాలను వివరించలేక పోతున్నందుకు నేను చింతిస్తున్నాను సమాచారానికి ఏకైక ఆధారమైన జానాభా వివరాలు నాకా అంశాలపై సహాయపడడంలో విఫలమయ్యాయి భారత దేశంలో జనగణన, ప్రారంభమైన నాటి నుండీ ప్రత్యేక లక్షణంగా ఉన్న కుల పట్టికలను, ఈ సారి జనగణన నుండి తొలగించారు ఈ తొలగింపుకు బాధ్యులైన భారత ప్రభుత్వ హోం శాఖా మాత్యులు ఒక పదాన్ని నిఘంటువులో లేకుండా చేసినంతమాత్రాన ఆ పదాన్ని వ్యవహారంలోనే లేకుండా చేయవచ్చుననే అభిప్రాయంతో ఉన్నారు అలా అనుకొనేవారి అల్ప జ్ఞానాన్ని చూసి జాలి మాత్రమే పడగలం

రాజకీయాలపై కుల వ్యవస్థ ప్రభావాలు సుస్పష్టమే ఏక సభ్య నియోజక వర్గాల వ్యవస్థపై ఆధారపడిన ప్రాతినిధ్య ప్రభుత్వానికి, పునాది అయిన ఎన్నికలపై, కుల వ్యవస్థ ఎటువంటి ప్రభావాల్ని కలుగ చేస్తుంది అన్న అంశాన్ని పరిశీలించడం ఆసక్తి దాయకంగా ఉంటుంది

ఆ ప్రభావాల్ని సంగ్రహ రూపంలో ఇలా చెప్పవచ్చు

1 ఓటింగ్ అనేది ఎప్పుడూ కులపరంగానే ఉంటుంది తన కులానికి చెందిన అభ్యర్థికే ఓటరు ఓటు వేస్తాడుకాని, ఇతరకులాల అత్యుత్తమ అభ్యర్థికయినా వెయ్యడు

2 మెజారిటీ కులం కేవలం కులపరంగా ఉన్న ఆధిక్యత ద్వారా సీటును సంపాదిస్తుంది

3 మెజారిటీ కులం అభ్యర్థికే మైనారిటీ కులం ఓటు వేయవలసి వస్తుంది

4 మెజారిటీ కులం నిలబెట్టిన అభ్యర్థిపై తమ అభ్యర్థిని గెలిపించు కోవడానికి మైనారిటీ కులానికి ఉన్న ఓట్లు సరిపోవు

5 సామాజిక వ్యవస్థలోని శ్రేణీగత అసమానత ఫలితంగా ఉన్నత కులాల (మెజారిటీ కులాలు)కు చెందిన ఓటరు మైనారిటీ కులాల అభ్యర్థికి తన ఓటు వేయటానికి ఇష్టపడు మైనారిటీ కులానికి చెందిన ఓటరు మాత్రం, మెజారిటీ కులానికి చెందిన అభ్యర్థికి తన ఓటు వేయడానికి గర్వ పడతాడు మైనారిటీ కులానికి చెందిన అభ్యర్థి, ఎన్నికల్లో ఓడిపోవడానికి ఇది మరొక కారణం

కాంగ్రెస్ ఎప్పుడూ గెలుస్తూ వుంది కాని కాంగ్రెస్ ఎందుకు గెలుస్తోంది అని ఎవరూ అడగరు దానిని సమాధాన మేమిటంటే కాంగ్రెస్ బహుళ ప్రజాదరణ పొందింది అని కాని కాంగ్రెస్ ఎందుకు అంత ప్రజాదరణ పొందింది? దీనికి నిజమైన సమాధానమేమంటే, నియోజక వర్గాలలోని మెజారిటీ కులాలకు చెందిన వారిని మాత్రమే కాంగ్రెస్ తన

అభ్యర్థులుగా ఎప్పుడూ నిలబెడుతుంది కులాలూ, కాంగ్రెస్, అతి సన్నిహితంగా ముడిపడి ఉన్నాయి ఈ కుల వ్యవస్థను జబర్దస్తీగ ఉపయోగించుకోవడం ద్వారానే కాంగ్రెస్, ఎప్పుడూ గెలుస్తుంటుంది భాషా ప్రయుక్త రాష్ట్రాలవల్ల ఈ కుల వ్యవస్థ దుష్పరిణామాలు ఖచ్చితంగా తీవ్రతర మవుతాయి మైనారిటీ కులాలను నలిచి పారవేస్తారు అది కాకపోతే వాటిని నిరంకుశంగా అణగద్రొక్కవచ్చు ప్రజా జీవనంలో సమాన అవకాశాలూ చట్టం ముందు సమానతా, మైనారిటీలకు దక్కకుండా చేసి వారిపట్ల ఖచ్చితంగా వివక్షత చూపడం జరుగుతుంది

జాతుల చరిత్రనూ, వాటి సిద్ధాంతాలలో వచ్చిన మార్పులనూ, లార్డ్ ఆక్టన్ బాగా గుర్తించారు

"ప్రాచీన యూరప్ వ్యవస్థలో, జాతుల హక్కులను ప్రభుత్వాలూ గుర్తించలేదు, ప్రజలూ వాటికోసం పట్టు పట్టలేదు పాలక కుటుంబాల ఆసక్తి, సరిహద్దుల భద్రతపైనే ఉండేది కాని, జాతులపై కాదు ప్రజల ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండానే పరిపాలన సాగేది ఫెనిలాన్ మాటల్లో చెప్పాలంటే, స్వేచ్ఛలన్నీ, అణచివేయబడిన చోట, జాతి స్వాతంత్ర్య హక్కును నిర్లక్ష్యం చేయడం ఆవశ్యకమైంది ప్రతి రాణివల్లా కలిగే సంతానమే వంశాను క్రమ పాలనకు తోడ్పడింది

మొదట్లో జాతులకు జాగృతి ఉండేది గాదు వారు చైతన్యవంతులయినప్పుడు మొదట్లో తమ చట్టబద్ధమైన పాలకులకు మద్దతుగా దురాక్రమణ దారులకు వ్యతిరేకంగా నిలబడ్డారు దురాక్రమణదారుల చేత పాలించబడటానికి వారు తిరస్కరించారు ఆ తరువాత, తమ పాలకులు చేసే తప్పిదాలు తమకు హాని చేస్తున్నప్పుడు ప్రజలు తిరుగుబాటు చేసే కాల మొచ్చింది నిర్దిష్ట ఆరోపణలతో సమర్థించదగిన సాయుధ పోరాటాలకు ప్రేరణ గలిగింది

ఆ తరువాత ఫ్రెంచ్ విప్లవం వచ్చింది ఇది పరిస్థితుల్లో పూర్తి మార్పు తీసుకువచ్చింది తమకు సంబంధించి తామేది చేయాలనుకుంటే అది చేసే హక్కును, తమ కోర్కెలూ అభిలాషలే, ప్రధాన గీటురాయిగా పరిగణించడాన్ని అది ప్రజలకు ప్రబోధించింది. గత రాచరిక వ్యవస్థకుగానీ ప్రస్తుత రాజరిక వ్యవస్థకుగానీ లోబడని ప్రజా సార్వభౌమత్వ ఆలోచనా ప్రకటనకు దారి తీసింది

కులం ఒక జాతే అయితే ఒక జాతిపై మరొక జాతి పాలన మాదిరిగా, ఒక కులంపై మరొక కులం పాలనను అనుమతించడానికి లేదు అయితే విషయం ప్రస్తుతం అక్కడి దాకా రాలేదనుకుంటే, అది ప్రస్తుతానికి మెజారిటీ, మైనారిటీ అన్నవరకే పరిమితమై ఉందనుకుంటే అప్పటికీ మైనారిటీని పాలించడానికి మెజారిటీకి ఏం హక్కు ఉంది? అన్న ప్రశ్న మిగిలే ఉంది

మెజారిటీ ఏం చేస్తే అదే సరైంది అన్నది సమాధానంగా ఉంది అటువంటప్పుడు ఇక మైనారిటీలు ఆరోపించిందుకేం ఉంది?

మెజారిటీ పాలన అన్న అంశంపై ఆధారపడిన ప్రజలు, మెజారిటీలలో (1) కుల పరమైన మెజారిటీ, (2) రాజకీయ పరమైన మెజారిటీ, అనే రెండురకాల మెజారిటీలున్నా యన్న వాస్తవాన్ని మరిచిపోతున్నారు

వర్గ సమ్మిశ్రణం రీత్యా రాజకీయ మెజారిటీ మార్చడానికి వీలు కలిగి వుండి రాజకీయ మెజారిటీ అనేది పెరిగే స్వభావం గలది కాని కులపరమైన మెజారిటీ పుట్టుకతో ముడిపడి ఉంది కాని కులపరమైన మెజారిటీలోకి ప్రవేశం కొందరికే పరిమితం అయింది రాజకీయ మెజారిటీకి సంబంధించిన రాజకీయాలను చేయడానికీ, చేయక పోవడానికీ, అందరికీ స్వేచ్ఛ ఉంటుంది కాని కులపరమైన మెజారిటీలో ఆ కులంలో పుట్టిన సభ్యులు మాత్రమే రాజకీయ మెజారిటీ దానికి సంబంధించిన రాజకీయాలను నిర్వహిస్తారు

పాలించడానికి, రాజకీయపరమైన మెజారిటీకి ఇచ్చిన హక్కులను కులపరమైన మెజారిటీ, ఏ విధంగా నిర్వహించగలదు? అటువంటి హక్కులను కులపరమైన మెజారిటీకి ఇవ్వడమూ అంటే, ఆనువంశిక ప్రభుత్వం ఏర్పడటానికి, ఆ కుల పరమైన మెజారిటీ నిరంకుశ పాలనకు మార్గాన్ని సుగమం చేయడమే అవుతుంది కులపరమైన ఈ మెజారిటీ నిరంకుశమనేది పగటికల కాదు అది అనేక మంది మైనారిటీలకు అనుభవంలో ఉన్నదే మహారాష్ట్ర బ్రాహ్మణుల అనుభవంలో ఇది ఇటీవలే ఎదురైంది కాబట్టి ఇక దాన్ని గురించి పెద్దగా వివరించాల్సిన పనిలేదు

మరి దీనికి నివారణేమిటి? కులపరమైన మెజారటీ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా కొన్ని రక్షణలు అవసరమే ననడంలో సందేహం లేదు అయితే ప్రశ్న ఏమిటంటే ఆరక్షణలు ఏమిటి అని? మరీ పెద్ద రాష్ట్రాన్ని కలిగి ఉండకపోవడమే మొదటి రక్షణ రాష్ట్రం మరీ పెద్దగా ఉండడం వల్ల అందులో ఉండే మైనారటీల జీవితాలపై అది కలుగ చేసే ప్రభావాలను చాల మంది అర్థం చేసుకోలేక పోతున్నారు రాష్ట్రం పెద్ద దయ్యేకొలదీ మెజారటీతో మైనారటీల నిష్పత్తి తగ్గుతూ వుంటుంది ఒక ఉదాహరణ చూద్దాం– మహావిదర్భ విడిగా ఉన్నట్లయితే హిందూ ముస్లింల నిష్పత్తి నాలుగు : ఒకటిగా ఉంటుంది అదే ఐక్య మహారాష్ట్రలో అయితే ఆ నిష్పత్తి పద్నాలుగు: ఒకటిగా ఉంటుంది అంటరాని వారి విషయం కూడా అంతే ఒక చిన్నరాయి వంటి సంఘటిత మెజారిటీని మైనారిటీ గుండెల మీద పెడితే, దానిని వారు మోయవచ్చు కాని ఒక పెద్ద పర్వతాన్ని తీసుకువచ్చి పెడితే అది మైనారిటీలను నుగ్గునుగ్గు చేస్తుంది అందువల్ల చిన్న రాష్ట్రాలను ఏర్పాటు చేయడమే మైనారిటీలకు రక్షణ కవచం

రెండో రక్షణ కవచమేమంటే, శాసన సభలు మైనారిటీలకు ప్రాతినిధ్యం ఉండేటట్లు ఏదో ఒక ఏర్పాటు చేయడం పాత రాజ్యాంగంలో (1) కొన్ని స్థానాలను రిజర్వు చేయడం,

(2) ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పాటు చేయడం ఉండేది ఈ రెండు రక్షణ కవచాలను గుత్త రాజ్యాంగంలో తొలగించేశారు గొర్రె పిల్లలకు బొచ్చు కత్తిరించేశారు చలి తీవ్రతకు అవి బాధపడుతున్నాయి ఏదో ఒకరకమైన స్వాభావిక రక్షణ వాటికి ఏర్పరచడం అవసరం

కొన్ని స్థానాలను రిజర్వు చేయడం, ప్రత్యేక నియోజకవర్గాలను ఏర్పాటు చేయడం అన్న వాటిని పునరుద్ధరించాల్సిన అవసరం లేదు ప్రస్తుత రాజ్యాంగం ఏర్పాటు చేసిన ఏకసభ్య నియోజకవర్గ వ్యవస్థ స్థానంలో గుత్త పద్ధతి ఓటింగ్‌తో కూడిన బహుసభ్య (ఇద్దరు లేక ముగ్గురు) నియోజక వర్గాల వ్యవస్థను ఏర్పాటు చేస్తే సరిపోతుంది భాషా ప్రయుక్త రాష్ట్రాల గురించి మైనారిటీలకు ఉన్న భయాందోళనలను ఇది దూరం చేస్తుంది

## ఐదవ భాగం

# రెండో రాజధాని ఆవశ్యకత

## అధ్యాయం–11

## భారతదేశం–రెండో రాజధాని ఆవశ్యకత

### ఉత్తరాది, దక్షిణాదుల మధ్యనున్న ఉద్రిక్తతను తొలగించే ఒక మార్గం

మరొక రాజధానిని భారతదేశం భరించగలదా? భారతదేశానికి ఇప్పుడు ఒక రాజధాని ఉంది కదా అన్న జవాబుతో ఈ ప్రశ్నకు సమాధానం పూర్తికాదు భారత రాజధాని సంతృప్తి కరమైన స్థానంలో లేదు అని భావించినట్లయితే, ఈ ప్రశ్నను పరిశీలించడానికి ఇదే సరైన సమయం

బ్రిటీష్ వారి నిష్క్రమణ తరువాత భారతదేశానికి ఒకే ఒక రాజధాని ఉంది అది ఢిల్లీ బ్రిటీష్ వారు రాకముందు భారత దేశానికి ఎప్పుడూ రెండు రాజధానులుండేవి మొగలాయిల కాలంలో భారతదేశానికి ఢిల్లీలో ఒక రాజధానీ, కాశ్మీర్‌లోని శ్రీనగర్‌లో మరొక రాజధానీ ఉండేవి బ్రిటీష్‌వారు వచ్చిన తరువాత, వారుకూడా రెండు రాజధానులను ఏర్పాటు చేసుకున్నారు ఒకటి కలకత్తా, మరొకటి సిమ్లా కలకత్తానుండి ఢిల్లీకి రాజధానిని మార్చుకున్న తరువాత కూడా వారు సిమ్లాను వేసవి రాజధానిగా అట్టేపెట్టుకున్నారు వాతావరణ పరిస్థితుల కారణంగానే మొగలాయిలూ, బ్రిటీష్ వారూ కూడా ఈ రెండు రాజధానులను ఉంచుకున్నారు బ్రిటీష్ వారు కాని, మొగలాయిలు కాని అవిరామంగా 12 నెలలపాటు ఢిల్లీలోకానీ, కలకత్తాలోకానీ ఉండలేక పోయేవారు ఢిల్లీలో వేసవి కాలాన్ని మొగలాయిలు భరించలేకపోయేవారు వేసవి నెలలకోసం వారు శ్రీనగర్‌ను తమ రెండవ రాజధానిగా చేసుకున్నారు కలకత్తాలోని వేసవి నెలలు బ్రిటీష్ వారికి గూడా అంత

భరింపశక్యం కానివిగానూ ఉండేవి అందువల్ల వారు రెండో రాజధానిని ఏర్పాటు చేసుకున్నారు ఇప్పుడు వాతావరణ పరిస్థితులతోపాటుగా మరో మూడు విషయాలను కూడా జోడించుకుని ఆలోచించాలి మొగలాయిలు పాలించినప్పుడు కానీ, బ్రిటీష వారు పాలించినప్పుడు కానీ ప్రజా ప్రభుత్వం లేదు మనకిప్పుడు ప్రజా ప్రభుత్వం ఉంది ప్రజా సౌలభ్యమనేది ముఖ్యమైన అంశం అయింది దక్షిణాది ప్రజలకు ఢిల్లీ పూర్తి అసౌకర్యంగా ఉంటుంది దూరాభారమూ, చలీ ఈ రెండింటి వల్లా వారు ఎక్కువగా ఇబ్బంది పడుతున్నారు ఉత్తరాది ప్రజలు కూడా వేసవి నెలల్లో ఇబ్బంది పడతారు అయితే అధికార పీఠానికి దగ్గర కావడమూ రాజధానికి సమీపంలో ఉండటమూ వల్ల వారు వ్యతిరేకతను చూపరు ఆలోచించాల్సిన రెండో అంశమేమంటే దక్షిణాది ప్రజల మనోభావాల గురించి మూడవ అంశం దేశ రక్షణకు సంబంధించినది దేశ రాజధాని తమకు చాలా దూరంలో ఉందనేదీ, తాము ఉత్తర భారతదేశ ప్రజల చేత పాలింపబడుతున్నామనేదీ, దక్షిణాది ప్రజల అభిప్రాయంగా ఉంది ఇక పరిశీలించాల్సిన మూడో అంశం అతి ముఖ్యమయింది అది దేశరక్షణ ఢిల్లీ దాడికి అనువైన ప్రాంతం ఇరుగు పొరుగు దేశాలు బాంబింగ్ చేయగలిగే దూరంలో ఉంది ఇరుగు పొరుగు దేశాలతో శాంతియుతంగా ఉండేందుకే భారతదేశం ప్రయత్నిస్తోంది అయినప్పటికీ ఏదో ఒక సమయంలో మనం యుద్ధాన్ని ఎదుర్కోవల్సిన అవసరం రాదనుకోడానికి వీలులేదు యుద్ధం వచ్చినట్లయితే భారత ప్రభుత్వం ఢిల్లీ వదలి పెట్టాల్సి వస్తుంది భారత ప్రభుత్వం తరలి వెళ్ళగలిగే అటువంటి ప్రాంతం ఏది? కలకత్తాను అటువంటి ప్రాంతంగా కొందరు అనుకోవచ్చు కాని కలకత్తా కూడా టిబెట్ నుండి బాంబు దాడులకు ఆమడ దూరంలోనే ఉంది భారత్, చైనాలు నేడు స్నేహదేశాలుగానే ఉన్నప్పటికీ ఈ స్నేహం ఎంతకాలం నిలుస్తుందనేది ఎవరూ కచ్చితంగా చెప్పలేరు భారత్, చైనాల మధ్య సంఘర్షణకు అవకాశం ఎప్పుడూ ఉంది అటువంటి పరిస్థితుల్లో కలకత్తా నిరుపయోగమవుతుంది కేంద్ర ప్రభుత్వం తరలి రాగల సురక్షిత ప్రాంతంగా కలకత్తా తరువాత ఆలోచించతగింది బొంబాయి అయితే బొంబాయి అనేది రేవుపట్టణం మన నౌకా దళం మరీ దుర్బలమైంది కేంద్ర ప్రభుత్వం బొంబాయికి వచ్చినట్లయితే దానిని పరిరక్షించలేనంత బలహీనంగా ఉంది మరిక రాజధానిగా ఆలోచించగలిగే నాలుగో ప్రదేశమేదైనా ఉందా?

హైదరాబాద్ అటువంటి ప్రదేశమేనని నేను అనుకుంటున్నాను హైదరాబాద్, సికిందరాబాద్, బొలారాంలను కలిపి చీఫ్ కమీషనర్ రాష్ట్రంగా మార్చి దానిని భారతదేశ రెండో రాజధానిగా చేయాలి భారత దేశ రాజధానికి కావల్సిన అవసరాలన్నిటినీ హైదరాబాద్ తీర్చగలదు హైదరాబాద్ అన్ని రాష్ట్రాలకు సమాన దూరంలో ఉంది ఈ దిగువ పట్టికను పరిశీలించిన వారెవరైనా ఆ విషయాన్ని గ్రహించగలరు

| | ఢిల్లీ నుండి మైళ్ళు | హైదరాబాద్ నుండి మైళ్ళు |
|---|---|---|
| బొంబాయికి | 798 | 440 |
| కలకత్తాకి | 868 | 715 |
| మద్రాసుకి | 1,198 | 330 |
| కర్నూల్ కి | 957 | 275 |
| త్రివేంద్రంకి | 1,521 | 660 |
| పాటియాలాకి | 124 | 990 |
| చండీఘర్ కి | 180 | 1,045 |
| లక్నోకి | 275 | 770 |

రక్షణ దృష్ట్యా హైదరాబాదు కేంద్ర ప్రభుత్వానికి భద్రత కల్పిస్తుంది భారతదేశంలోని అన్ని ప్రాంతాల నుండి అది సమానమైన దూరంలో ఉంది తమ ప్రభుత్వం కొంత కాలంపాటు తమతో ఉందన్న సంతృప్తిని కూడా అది దక్షిణాది ప్రజలకు ఇస్తుంది శీతాకాలంలో భారత ప్రభుత్వం ఢిల్లీలో ఉండి మిగిలిన కాలమంతా అది హైదరాబాద్ లో ఉండవచ్చు ఢిల్లీలో ఉన్న సదుపాయాలన్నీ, హైదరాబాద్ కూ ఉన్నాయి అది ఢిల్లీకన్న మెరుగైన నగరంకూడా ఢిల్లీకున్న వైభవాలన్నీ హైదరాబాద్ కూడ ఉన్నాయి భవనాలు అక్కడ చౌక అని నిజంగా అందమైనవి కూడా ఢిల్లీ భవనాలకన్నా అవి ఉన్నతమైనవి అవన్నీ ఇప్పుడు అమ్మకానికి ఉన్నాయి హైదరాబాద్ లో ఇక కావల్సిందల్లా ఒక్క పార్లమెంట్ భవనమే! భారత ప్రభుత్వం దానిని సులభంగానే నిర్మించుకోగలదు సంవత్సరం పొడుగునా పార్లమెంట్ సమావేశమై పని చేయడానికి హైదరాబాద్ అనువైన ప్రదేశం అది ఢిల్లీలో సాధ్యంకాదు హైదరాబాద్ ను భారతదేశ రెండో రాజధానిగా చేయడంలో నాకెటువంటి అభ్యంతరం కనిపించడం లేదు రాష్ట్రాలను పునర్ వ్యవస్థీకరిస్తున్న ఈ సమయంలోనే, ఆ పని చేయాలి

హైదరాబాద్, సికిందరాబాద్ బొలారాంలను కలిపి భారతదేశ రెండో రాజధానిగా ఏర్పాటు చేయాలి అదృష్టవశాత్తు, యావత్తు దక్షిణ భారతదేశానికీ, మహారాష్ట్రకూ, ఆంధ్రులకూ సంతృప్తికరంగా- ఉండేటట్లు ఆ పనిని చాలా సులభంగా చేయవచ్చు

ఉత్తరాదికి, దక్షిణాదికీ మధ్య ఉన్న ఉద్రిక్తతను సడలించడానికి గల మరో మార్గం ఇది

పటం సంఖ్య – 6


భారతదేశం
ఉత్తరం – దక్షిణం
రాజస్థాన్
ఉత్తరప్రదేశ్
హిందీ భాషా ప్రాంతం
బీహార్
వింధ్యప్రదేశ్
మధ్య భారత్
భూపాల్
మధ్యప్రదేశ్
మహా గుజరాత్
పశ్చిమ బెంగాల్
ఒరిస్సా
బొంబాయి
మహారాష్ట్ర
హైదరాబాద్
ఆంధ్ర
కర్ణాటక
మద్రాసు
కేరళ

పటం సంఖ్య – 2


ఉత్తరప్రదేశ్ విభజన
డెహ్రా డూన్
గర్వాల్
అల్మోరా
పశ్చిమ ఉత్తరప్రదేశ్
మిరట్
మధ్య ఉత్తరప్రదేశ్
అలీగఢ్
షాజహాన్‌పూర్
ఇటావ్
ఆగ్రా
లక్నో
గోరాన్‌పూర్
కాన్పూర్
రాయ్‌బరేలి
ఫైజాబాద్
చాందా
అలహాబాద్
బెనారస్
ఝాన్సి
తూర్పు ఉత్తరప్రదేశ్

పటం సంఖ్య – 3


బీహార్ విభజన
ఉత్తర
బీహార్
చాంపరాన్
డర్చాంగా
పాట్నా
పూర్ణియా
షాబాద్
గయా
శాంతాల్ పరగణాలు
హజారీబాగ్
రాంచి
దక్షిణ బీహార్

పటం సంఖ్య - 4

# మధ్యప్రదేశ్ విభజన



పటం సంఖ్య – 5

## మహారాష్ట్ర విభజన



అనుబంధం – 1

భాషా కుటుంబాల ప్రకారం జనాభా

| భాషా సముదాయాలు | | మాట్లాడుతున్న భాషల సంఖ్య | మాతృభాష సహాయక భాష మాట్లాడుతున్న వారి సంఖ్య 1931 (రెండు భాషలూ మాట్లాడే వారిని రెండు సార్లు పేర్కొన్నారు) | మాట్లాడే వారి సంఖ్య 1931 | మాతృభాష మాత్రమే మాట్లాడే వారి సంఖ్య 1931 | 4,5 లమధ్య ఉన్న తేడా (+1931లో పెరుగుదల – 1931లో తరుగుదల | 4,3 ల మధ్య ఉన్న తేడా (+ పెరుగుదల – తరుగుదల |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| ఎ | భారత, బర్మా భాష | 225 | 366,430,537 | 315,525,177 | 349,887,527 | +94,362,350 | +50905,360 |
| (I) | ఆస్ట్రిక్ భాషలు | | | | | | |
| 1 | ఇండోనేషియాభాషలు | 2 | 6,542 | 5,561 | 6,542 | +981 | +981 |
| 2 | మాంఖ్మేర్ భాషలు | 10 | 734,204 | 549,917 | 726,578 | +176,661 | +184,287 |
| 3 | ముండా భాషలు* | 7 | 4,710,685 | 3,973,873 | 4,609,588 | +635,715 | +736,812 |
| (II) | టిబెటో–చైనీస్‌భాషలు | | | | | | |
| 1 | టిబెట్ బర్మన్ భాషలు | 128 | 14,167,611 | 11,959,011 | 12,982,840 | +1,023,829 | +2,208,600 |
| 2 | తాయ్‌చైనీస్ భాషలు | 11 | 1,150,220 | 926,335 | 1,027,656 | +101,321 | +223,885 |
| 3 | మన్, కరెన్ భాషలు* | 17 | 1 351,291 | 1,114,617 | 1,342,278 | +227,661 | +236,674 |
| (III) | ద్రావిడ భాషలు | | | | | | |
| 1 | ద్రావిడ భాషలు | 7 | 47,032,874 | 37,285,594 | 41,454,593 | +4,168,999 | +9,747,280 |

| 1 | | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|
| 2 | అనుసంధాన భాషలు | 5 | 3,661,277 | 3,056,598 | 3,609,418 | +552,820 | +604,679 |
| 3 | ఆంధ్రభాష | 1 | 28,195,824 | 23,601,492 | 26,373,727 | +2,772,235 | +4,594,332 |
| 4 | వాయవ్య ప్రాంత భాష | 1 | 231,581 | 184,368 | 207,049, | +22,681 | +47,213 |
| (IV) | ఇండో-యూరోపియన్ భాషలు | | | | | | |
| 1 | ఇరేనియన్ భాషలు | 3 | 2,457,134 | 1,981,675 | 2,270,466 | +288,791 | +475,459 |
| 2 | దర్దిక్ భాషలు | 5 | 1,354,031 | 1,304,319 | 1,522,936 | +218,617 | +238,712 |
| 3 | ఇండో-ఆర్యన్ భాషలు | 19 | 261,105,909 | 229,560,555 | 253,699,403 | +24,138,848 | +31,545,354 |
| (V) | వర్గీకరణలేని భాషలు- | | | | | | |
| 1 | అండమాన్ భాషలు | 2 | 466 | 580 | 466 | +114 | -114 |
| 2 | బురుషస్కీ | 1 | 26,076 | | 26,076 | +26,076 | +26,076 |
| 3 | జిప్సీమాండలికాలు+ | 6 | 25,999 | 15,018 | 25,999 | +10,981 | +10,981 |
| 4 | సజీసంకాని అనిష్టభాషలు | | 29,813 | 5,664 | 2,912 | +3,752 | +24,149 |
| బి | ఇతర ఆసియా-ఆఫ్రికా భాషలు | 17 | 305,386 | 211,894 | 302,324 | +90,430 | +93,492 |
| సి | యూరప్ భాషలు | 10 | 452, 099 | 319,112 | 339,706 | +20,594 | +132,987 |

* ఈ రెండు భాషల సరియైన వర్గీకరణపై సందేహం ఉంది పిజిలుస్కీ వీటిని తాయ్ భాషలుగా పరిగణిస్తున్నారు (Meillet and cohen, languaes do Monde 380) లాంగ్వేజప్ వీటికి ఆస్ట్రిక్ సంబంధాలు ఉండే అవకాశం ఉంది

\+ ఈ మాండలికాలను వివిధ భారత భాషలనుండి తీసుకోవడమైంది ఇవి ఏదో ఒక కూటంలో వర్గీకరించలేనంతగా వైవిధ్య లక్షణాలను కలిగి ఉన్నాయి

\+ ఆదిమ జాతుల, కొండ జాతుల భాషలు కూడా ఇందులో కలిసి ఉన్నాయి (27,841)

## అనుబంధం - 2

### అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోని రాష్ట్రాల విస్తీర్ణం, జనాభా

| | రాష్ట్రంపేరు | చదరపు మైళ్ళలో విస్తీర్ణం | జనాభా (1944 అంచనాలు) |
|---|---|---|---|
| 1 | అలబామా | 51,609 | 2,818,083 |
| 2 | అరిరోనా | 113,909 | 638,412 |
| 3 | అర్కాన్సాస్ | 53,102 | 1,776,446 |
| 4 | కాలిఫోర్నియా | 158,693 | 8,746,989 |
| 5 | కొలరడా | 104,247 | 1,147,269 |
| 6 | కన్నెక్టికట్ | 5,009 | 1,176,807 |
| 7 | డిలవేర్ | 2,057 | 283,802 |
| 8 | ఫ్లారిడా | 58,560 | 3,367,217 |
| 9 | జార్జియా | 58,876 | 3,223,727 |
| 10 | ఇండాహా | 83,557 | 531,573 |
| 11 | ఇల్లినాయిస్ | 56,400 | 7,729,720 |
| 12 | ఇండియానా | 36,291 | 3,419,707 |
| 13 | జోవా | 56,280 | 2,269,759 |
| 14 | కాన్సాస్ | 82,276 | 1,774,447 |
| 15 | కెంటకీ | 40,395 | 2,630,194 |
| 16 | లాసియానా | 48,523 | 2,535,385 |
| 17 | మైయినే | 33,215 | 793,600 |
| 18 | మేరీలాండ్ | 10,577 | 2,127,874 |
| 19 | మెసాచుసెట్స్ | 8,257 | 4,162,815 |
| 20 | మిచిగన్ | 58,216 | 5,429,641 |
| 21 | మిన్నెసోటా | 84,008 | 2,508,663 |
| 22 | మిస్సిసిపి | 47,716 | 2,175,877 |
| 23 | మిస్సోరీ | 69,674 | 3,589,538 |
| 24 | మోంటానా | 147,138 | 464,999 |
| 25 | నెబ్రాస్కా | 77,237 | 1,213,792 |
| 26 | నెవాడా | 110,540 | 156,445 |
| 27 | న్యూహాంప్షైర్ | 9,304 | 457,231 |
| 28 | న్యూజెర్సీ | 7,836 | 4,167,840 |
| 29 | న్యూమెక్సికో | 121,666 | 532,212 |
| 30 | న్యూయార్క్ | 49,576 | 12,632,890 |
| 31 | నార్త్ కరోలినా | 52,712 | 3,534,545 |

| రాష్ట్రంపేరుచదరపు మైళ్ళలో | | జనాభా విస్తీర్ణం | (1944 అంచనాలు) |
|---|---|---|---|
| 32 | నార్త్ డకొటా | 70,665 | 528,071 |
| 33 | ఓహియో | 41,222 | 638,667 |
| 34 | ఒక్లహోమా | 69,919 | 2,064,679 |
| 35 | వొరిగాన్ | 96,981 | 1,214,226 |
| 36 | పెన్‌సిల్‌వేనియా | 45,332 | 9,247,088 |
| 37 | రోడ్‌ఐలాండ్ | 1,214 | 778,972 |
| 38 | సౌత్‌కరోలినా | 31,055 | 1,923,354 |
| 39 | సౌత్‌డకోటా | 77,047 | 558,629 |
| 40 | టెన్నెస్సీ | 42,246 | 2,870,158 |
| 41 | టెక్సాస్ | 267,339 | 6,876,248 |
| 42 | ఉతా | 84,916 | 606,994 |
| 43 | వెర్మాంట్ | 9,609 | 310,941 |
| 44 | వర్జీనియా | 40,815 | 3,119,115 |
| 45 | వాషింగ్టన్ | 68,192 | 2,055,378 |
| 46 | వెస్టన్ వర్జీనియా | 24,181 | 1,715,984 |
| 47 | విస్కాన్‌సిన్ | 56,154 | 2,975,910 |
| 48 | వ్యోమింగ్ | 97,914 | 257,108 |

## అనుబంధం – 3

1941 జనగణన లెక్కల ప్రకారం మతాల వారీగా బొంబాయి నగర జనాభా

| | |
|---|---|
| హిందువులు | 8,99,398 |
| షెడ్యూల్డు కులాలు | 1,21,352 |
| ముస్లిములు | 2,51,518 |
| ఇండియన్ క్రిస్టియన్లు | 1,22,683 |
| ఆంగ్లో ఇండియన్లు | 8,787 |
| పార్సీలు | 58,813 |
| సిక్కులు | 2,418 |
| జైనులు | 33,281 |
| బౌద్ధులు | 912 |
| గిరిజనులు | 4,606 |
| ఇతరులు | 29,847 |
| మొత్తం | 1,489,883 |

1941 లెక్కల ప్రకారం బొంబాయి నగర విస్తీర్ణం 30 చదరపు మైళ్ళు

అనుబంధం – 3 ఎ

భారతదేశంలో అంతర్ రాష్ట్ర వలస, రాక–పోకలు 1921 లెక్కలతో పోల్చినప్పుడు వలస పరిమాణంలో గల తేడా

| రాష్ట్రం లేదా ప్రావిన్స్ | నికరలాభం+ లేదా నికర నష్టం– | 1931 | | నికరలాభం+ లేదా నికర నష్టం– | 1921 | | 1921–31తేడా | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | వలస వచ్చిన వారు | వలస పోయిన వారు | | వలస వచ్చిన వారు | వలస పోయిన వారు | వలస వచ్చిన వారు | వలస పోయిన వారు |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| లాభపడిన రాష్ట్రాలు ప్రావిన్సులు- | | | | | | | | |
| అస్సాం | +1,241,011 | 1,314,047 | 73,036 | +1,140,752 | 1,216,661 | 75,909 | +97,386 | -2,873 |
| బెంగాల్ | +771,936 | 1,726,370 | 954,434 | +1,132,192 | 1,817,775 | 685,581 | -91,405 | +268,853 |
| బర్మా | +593,324 | 617,521 | 24,197 | +553,471 | 572,530 | 19,059 | +44,991 | +5,138 |
| బొంబాయి | +596,707 | 1,188,901 | 592,194 | +472,023* | 1,039,672 | 567,599* | +256,074 | +318,230* |
| సెంట్రల్ ప్రావెన్సులు బేరారు, | +27,003 | 649,064 | 422,061 | +197,323 | 603,924 | 406,601 | +45,140 | +15,460 |
| మైసూరు | +215,462 | 340,700 | 125,238 | +210,064 | 309,850 | 99,786 | +30,850 | +25,452 |
| ఢిల్లీ | +189,736 | 259,163 | 69,427 | +113,158 | 182,485 | 69,327 | +76,678 | +100 |
| బరోడా | +129,907 | 333,077 | 105,176 | +10,674 | 231,880 | 221,206 | +101,197 | -16,030 |
| సెంట్రల్ ఇండియా | +115,566 | 598,102 | 482,536 | +58,056 | 544,688 | 486,632 | +53,414 | -4,096 |
| ట్రావెన్ కోర్ | +83,919 | 133,852 | 49,953 | +49,732 | 71,973 | 22,241 | +61,879 | +27,692 |
| అజ్మీర్-మేర్వార్ | +44,029 | 104,938 | 60,909 | +66,033 | 108,452 | 42,419 | -3,514 | +18,490 |
| కొచ్చిన్ | +41,424 | 87,214 | 45,790 | +15,792 | 39,689 | 23,897 | +47,525 | +21,893 |

F N B R Wide

అనుబంధం – 3 (ఎ) (తరువాయి భాగం)

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
|---|---|---|---|---|---|---|---|---|
| కూర్గ్ | +35,388 | 38,619 | 3,231 | +30,988 | 33838 | 2,850 | +4,781 | +381 |
| బెలూచిస్తాన్ | +23,779 | 66,542 | 42,763 | +5,924 | 66,166 | 60,242 | +376 | -17,479 |
| వాయవ్య సరిహద్దు (ప్రావిన్సు) | +21,187 | 111,868 | 90,681 | +50,835 | 118,395 | 67,560 | -6,527 | +23,121 |
| అండమాన్, నికోబార్ | +13,703 | 14,255 | 582 | +14,080 | 14,396 | 316 | -141 | +236 |
| నష్టపడిన రాష్ట్రాలు, ప్రావిన్సులు – | | | | | | | | |
| సిక్కిం | -4,782 | 2,403 | 7,212 | -2,297 | 1,836 | 4,133 | +594 | +3,079 |
| గ్వాలియర్ | -14,471 | 281,350 | 296,821 | +632 | 289,657 | 289,025 | -8,307 | +7,796 |
| జమ్మూ, కాశ్మీర్ | 33,266 | 61,189 | 94,445 | -22,685 | 61,561 | 84,246 | -372 | +10,029 |
| పంజాబ్ | -67,792 | 635,025 | 702,817 | +60,940 | 591,885 | 530,942 | +43,140 | +171,875 |
| హైదరాబాద్ | 19,788 | 312,814 | 332,602 | -166,326 | 197,127 | 363,453 | +115,687 | -30,851 |
| వెస్టర్న్ ఇండియా స్టేట్స్ ఏజెన్సీ | -186,890 | 106,795 | 293,685 | బొంబాయి లెక్కల్లో కలిపారు | | | | |
| రాజ్‌పురానా | -516,898 | 329,913 | 864,811 | -625,650 | 242,234 | 867,893 | +87,670 | -21,082 |
| మద్రాసు | -888,339 | 246,892 | 1,135,231 | -718,183 | 196,609 | 914,792 | +50,283 | +220,439 |
| యునైటెడ్ ప్రావిన్సులు | -1,063,143 | 494,308 | 1,557,451 | -974,649 | 425,152 | 1,399,794 | +69,156 | +157,657 |
| బీహార్, ఒరిస్సా | -1,291,567 | 466,563 | 1,758,130 | -1,567,968 | 387,068 | 1,955,036 | +79,495 | -196,906 |

* వెస్టర్న్ ఇండియా ఏజెన్సీ అంకెలు కూడా కలుపుకుని పంజాబ్ స్టేట్ ఏజెన్సీ కలుపుకొని,

గమనిక ప్రావిన్సులకు ఇచ్చిన సంఖ్యల్లో వాటికి జతపడి ఉన్న రాష్ట్రాల సంఖ్యలు కూడా కలిసి ఉన్నాయి ఒక మద్రాసు ప్రావిన్సు విషయంలో మాత్రం కొచ్చిన్, ట్రావెన్‌కోర్ సంఖ్యలను చేర్చలేదు

బ్రిటిష్ ఇండియాకు వెలుపల ఉన్న దేశాల నుండి వలసవచ్చిన వారినీ, వలసపోయిన వారినీ ఈ లెక్కల్లో చేర్చలేదు

అనుబంధం – 4

ప్రావిన్షియల్/ రాష్ట్ర ఆదాయం

| | రాబడి (కోట్ల రూపాయలలో) | | | | | మొత్తం ఆదాయంలో వాటా (శాతం) | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1921–22 | 1936–37 | 1938–39 | 1944–45 | 1953–54 (రెవిన్యూ అంచనాలు) | 1921–22 | 1936–37 | 1938–39 | 1944–45 | 1953–54 (రెవిన్యూ అంచనాలు) |
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| మొత్తం రెవిన్యూ | 58 48 | 7486 | 7678 | 193 87 | 462 04 | 100 0 | 100 0 | 100 0 | 100 0 | 100 0 |
| భూమి శిస్తు | 29 08 | 25 96 | 25 40 | 30 21 | 69 20 | 49 7 | 34 7 | 33 1 | 15 6 | 15 0 |
| స్టేట్ ఎక్సైజ్ | 15 67 | 13 63 | 13 08 | 43 42 | 44 81 | 26 8 | 18 2 | 17 0 | 22 4 | 9 7 |
| స్టాంపులు | 10 14 | 10 80 | 9 53 | 15 20 | 23 50 | 17 3 | 14 4 | 12 4 | 7 8 | 5 1 |
| రిజిస్ట్రేషన్ | 1 07 | 1 11 | 1 09 | 2 39 | 3 91 | 1 8 | 1 5 | 1 4 | 1 2 | 0 9 |
| సాధారణ అమ్మకపు పన్ను | – | – | – | 7 91 | 57 25 | – | – | – | 4 1 | 12 4 |
| అడవులు (నికరం) | 0 66 | 0 71 | 0 63 | 4 58 | 10 82 | 1 1 | 0 9 | 0 8 | 2 4 | 2 3 |
| మూలధన ఖాతాలు (నికరం) నిర్వహించిన ఇరిగేషన్ వర్క్స్ | 5 55 | 7 53 | 7 57 | 10 14 | 8 09 | 9 5 | 10 0 | 9 9 | 5 2 | 1 8 |
| ఆదాయ ప్రాప్తి కేంద్రాలనుండి నిధులు (–) | 9 02 | 2 67 | 6 45 | 36 89 | 117 92 | – | 3 6 | 8 4 | 19 1 | 25 6 |

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రాష్ట్రాలకు దఖలు చేసిన జౌళి సుంకంలో వాటా | - | 2 13 | 2 51 | 1 48 | - | - | 2 8 | 3 3 | 0 8 | - |
| రాష్ట్రాలకు దఖలు చేసిన కేంద్ర ఎక్సైజ్‌లో వాటా | - | - | - | - | 15 94 | - | - | - | - | 3 5 |
| కేంద్రం నుండి గ్రాంట్స్ ఇన్ ఎయిడ్ మొదలైనవి | 12 11 | 0 50 | 2 47 | 9 66 | 45 08 | - | 0 7 | 3 2 | 5 0 | 9 8 |

- 1921-22 అంకెలు బర్మాను వదిలి వేసి లెక్కించినవి సింధ్‌ను బొంబాయిలో భాగంగా లెక్కించారు
- 1936-37 అంకెలు బర్మాను, సింధ్‌ను వాయువ్య సరిహద్దు రాష్ట్రాలను వదిలివేసి లెక్కించినవి
- 1938-39, 1944-45 అంకెలు సింధ్ రాష్ట్రాన్ని, వాయువ్య సరిహద్దు రాష్ట్రాన్ని వదిలివేసి, తొమ్మి ప్రావిన్సులకు లెక్కించినవి
- 1953-54 అంకెలు, పార్ట్ ఎ పార్ట్ బి, రాష్ట్రాలన్నిటికీ, అరు పార్ట్ సి రాష్ట్రాలకూ సంబంధించినవి
- నిధుల బదలాయింపును పరిగణనలోకి తీసుకోలేదు
- అడవుల ఖాతాలో, మొత్తం జమల నుండి యాజమాన్య వ్యయాన్ని మినహాయించిన తరువాత, వచ్చే, నికరమైన జమనే తీసుకున్నారు ఇతర ప్రజా వినియోగాలు ప్రభుత్వ సంస్థలు మొదలగు వాటి విషయంలో నికర జమలను (నిర్వహణ వ్యయాలను మినహాయించిన తరువాత) జత చేశారు

అనుబంధం –5

రెవిన్యూ ఖాతాపై రాష్ట్రాల బడ్జెట్ స్థితి

పార్ట్ (ఎ) రాష్ట్రాలు

| | 1950–51 | 1951–52 | 1952–53 | 1953–54 రెవిన్యూ అంచనాలు | 1954–55 బడ్జెట్ అంచనాలు |
|---|---|---|---|---|---|
| ఆదాయం | 214 37 | 315 60 | 229 32 | 357 49 | 367 17 |
| వ్యయం | 293 08 | 309 10 | 329 37 | 371 64 | 400 89 |
| మిగులు (+) లేదా లోటు (–) | (+)1 29 | (+)6 50 | (–)0 15 | (–)14 15 | (–)33 72 |
| మిగులు (+) లేదా లోటు (–) (రెవిన్యూ రిజర్వ్ నిధుల నుండి, నిధులకు బదలాయింపులనూ వేర్పులనూ మినహాయించి) | (–)3 15 | (–)2 25 | (–)12 01 | (–)20 82 | (–)39 86 |

అనుబంధం – 6

రెవిన్యూ ఖాతాపై రాష్ట్రాల బడ్జెట్ స్థితి

పార్ట్ (బి) రాష్ట్రాలు

(కోట్ల రూపాయలలో)

| | 1950–51 | 1951–52 | 1952–53 | 1953–54 రెవిన్యూ అంచనాలు | 1954–55 బడ్జెట్ అంచనాలు |
|---|---|---|---|---|---|
| ఆదాయం | 93 33 | 106 70 | 108 12 | 112 21 | 121 76 |
| వ్యయం | 81 93 | 100 53 | 105 88 | 115 85 | 127 65 |
| మిగులు (+) లేదా లోటు (–) లేదా | + 1 45 | + 6 17 | + 3 24 | - 3 64 | - 5 89 |
| మిగులు (–) లేదా లోటు (–) (రెవిన్యూ (రిజర్వు నిధులనుండి, నిధులకు జరిగిన బదలాయింపునూ వేర్పులనూ మినహాయించి) | + 1 45 | + 5 97 | + 3 24 | - 3 64 | - 5 89 |

+ 1953-54 అంకెల్లో అవిభక్త మద్రాసు రాష్ట్ర బడ్జెట్ అంచనాలు కూడా ఉన్నాయి ఆ తరువాత ఆరు నెలలకు మాత్రమే అందుబాటులో ఉన్నాయి

## అనుబంధం - 7

### కేంద్ర ఆదాయాలు (ఎంపిక చేసిన సంవత్సరాలలో)

| | 1921-22 | | 1936-37 | | 1938-39 | | 1944-45 | | 1953-54 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మొత్తం ఆదాయం | 80 00 | 100 00 | 81 45 | 100 00 | 82 90 | 100 00 | 334 40 | 100 | 394 30 | 100 |
| కస్టమ్స్ (నికరం) | 31 61 | 39 5 | 38 11 | 46 8 | 40 51 | 48 9 | 39 77 | 11 9 | 160 00 | 40 6 |
| ఆదాయంపై పన్నులు (నికరం) | 18 74 | 23 4 | 15 33 | 18 8 | 13 74 | 16 6 | 80 52 | 24 1 | 69 31 | 17 6 |
| కార్పొరేషన్ టాక్స్ | - | - | - | - | 2 04 | 2 5 | 84 22 | 25 2 | 38 40 | 9 7 |
| సెంట్రల్ ఎక్సైజ్ సుంకాలు (నికరం) | 2 80 | 3 5 | 13 35 | 16 4 | 8 66 | 10 5 | 38 14 | 11 4 | 78 00 | 19 8 |
| ఉప్పుపన్ను | 6 34 | 7 9 | 8 81 | 10 8 | 8 12 | 9 8 | 9 29 | 2 8 | - | - |
| వాణిజ్యశాఖలు- | | | | | | | | | | |
| రైల్వేలు (నికరపు వాటా) | (-)9 09 | - | - | - | 1 37 | 1 7 | 32 00 | 9 6 | 7 50 | 1 9 |
| పోస్టల్ టెలిగ్రాఫ్ (నికరం) | - | - | 0 14 | 0 2 | 0 19 | 0 2 | 10 25 | 3 1 | 2 02 | 0 5 |

* మొత్తం ఆదాయంలో సల్లిమందు, నీటిపారుదల, అడవులు, విద్యుత్, రవాణా పథకాల జమలన్నీ చేర్చబడి ఉన్నాయి

1921-22, 1936-37, సంవత్సరాలకు సంబంధించిన అంకెల్లో బర్మా లెక్కలు కూడా కలపబడి ఉన్నాయి

1938-39, 1944-45కు సంబంధించిన అంకెలు అవిభాజ్య భారతదేశానికి సంబంధించినవి

అనుబంధం – 8

మతాలవారీగా ఇండియన్ యూనియన్ జనాభా

| | జనాభా | | | షెడ్యూల్డు కులాలు | | | ఇతరులు | | | ముస్లిములు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు |
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| మద్రాసు | 49,841 | 24,800 | 25,041 | 8,152 | 4,064 | 4,088 | 35,095 | 17,466 | 17,630 | 3,927 | 1,939 | 1,987 |
| బొంబాయి | 29,384 | 15,184 | 14,200 | 2,526 | 1,217 | 1,256 | 20,691 | 10,680 | 10,011 | 2,463 | 1,321 | 1,142 |
| పశ్చిమబెంగాల్ | 21,837 | 11,834 | 10,003 | 3,520 | 1,847 | 1,673 | 11,206 | 6,160 | 5,046 | 5,544 | 3,011 | 2,533 |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 56,346 | 29,542 | 26,804 | 11,931 | 6,128 | 5,803 | 34,923 | 18,411 | 16,512 | 8,692 | 4,574 | 4,117 |
| తూర్పు పంజాబ్ | 12,697 | 6,853 | 5,844 | 1,028 | 540 | 487 | 4,489 | 2,435 | 2,053 | 4,427 | 2,380 | 2,047 |
| బీహార్ | 36,546 | 18,325 | 18,220 | 4,344 | 2,135 | 2,209 | 22,263 | 11,252 | 11,010 | 4,719 | 2,340 | 2,379 |
| సి పి, బీరార్ | 19,949 | 9,845 | 9,802 | 3,310 | 1,639 | 1,671 | 10,920 | 5,491 | 5,428 | 811 | 425 | 387 |
| అస్సాం | 7,685 | 4,068 | 3,617 | 377 | 203 | 174 | 2,885 | 1,564 | 1,321 | 1,754 | 939 | 815 |
| ఒరిస్సా | 13,768 | 6,706 | 7,062 | 1,865 | 906 | 956 | 8,187 | 3,963 | 4,224 | 166 | 81 | 85 |
| అజ్మీర్ | 589 | 310 | 279 | 1 | 05 | 05 | 380 | 198 | 182 | 90 | 49 | 41 |
| అండమాన్, నికోబార్ దీవులు | 34 | 21 | 12 | - | - | - | 9 | 6 | | 8 | 6 | 2 |

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| బిలాస్పూర్ | 110 | 57 | 53 | 16 | 8 | 7 | 93 | 48 | 45 | 1 | 08 | 06 |
| భోపాల్ | 785 | 410 | 375 | 187 | 96 | 91 | 410 | 215 | 195 | 110 | 59 | 51 |
| కూర్గ్ | 169 | 92 | 76 | 26 | 15 | 11 | 105 | 56 | 49 | 14 | 9 | 6 |
| కచ్ | 501 | 239 | 262 | 39 | 19 | 20 | 279 | 135 | 144 | 117 | 57 | 60 |
| ఢిల్లీ | 918 | 535 | 383 | 123 | 69 | 53 | 445 | 262 | 182 | 305 | 176 | 128 |
| హిమాచల్ ప్రదేశ్ | 935 | 495 | 441 | 229 | 120 | 109 | 672 | 356 | 316 | 29 | 16 | 13 |
| మణిపూర్ | 512 | 249 | 263 | - | - | - | 304 | 148 | 156 | 30 | 15 | 15 |
| త్రిపుర | 513 | 272 | 241 | 12 | 6 | 6 | 336 | 178 | 158 | 124 | 66 | 57 |
| వింధ్యప్రదేశ్ | 3,568 | 1,819 | 1,750 | 399 | 202 | 197 | 2,851 | 1,455 | 1,397 | 95 | 49 | 46 |
| మధ్యభారత్ | 7,141 | 3,734 | 3,407 | 437 | 221 | 216 | 5,025 | 2,648 | 2,377 | 475 | 251 | 224 |
| పెప్సు | 3,424 | 1,868 | 1,557 | 214 | 112 | 102 | 978 | 530 | 448 | 899 | 483 | 416 |
| రాజస్థాన్ | 13,085 | 6,868 | 6,217 | - | - | - | 9878 | 5,196 | 4,682 | 1,256 | 663 | 593 |
| సౌరాష్ట్ర | 3,556 | 1,809 | 1,747 | 242 | 122 | 120 | 2,737 | 1,402 | 1,336 | 436 | 220 | 226 |
| ట్రావెన్‌కోర్, కొచ్చిన్ | 7,493 | 3,742 | 3,751 | 537 | 269 | 268 | 3,902 | 1,931 | 1,971 | 543 | 276 | 268 |
| హైదరాబాద్ | 16,339 | 8,347 | 7,992 | 2,928 | 1,487 | 14,42 | 10,382 | 5,303 | 5,073 | 2,097 | 1,080 | 1,017 |
| కాశ్మీర్ | 4,022 | 2,130 | 1,892 | 113 | 61 | 53 | 694 | 369 | 325 | 3,074 | 1,627 | 1,446 |
| మైసూర్ | 7,329 | 3,763 | 3,566 | 1,405 | 723 | 682 | 5,282 | 2,702 | 2,580 | 485 | 258 | 227 |

## అనుబంధం – 9

### ప్రధాన కులాల గణాంక వివరాలు

| కులం | బలం | ప్రధాన నివాసం |
|---|---|---|
| ఆగ్ర | 265,285 | బొంబాయి |
| అహర్, అహిర్, గోపి, గోషి, గోయిలా, గొల్ల, గొవారి, గొరా, కవుండన్ ఇడియవ్ | 14,170,032 | పెక్కు రాష్ట్రాలలో |
| అహోం | 249,434 | అస్సాం |
| అరియన్, కుంజరా, కొయిరీ, కచ్చిమురావ్ | 5,048,849 | పెక్కు రాష్ట్రాలలో |
| అరోరా, బాన్స్లీ, లోహణ | 1,499,407 | బెలుచిస్తాన్, బొంబాయి, వాయవ్య సరిహద్దు రాష్ట్రాలు పంజాబ్, జమ్మూ–కాశ్మీర్, వెస్ట్రన్ ఇండియా రాష్ట్రాలు |
| ఒఖాన్, భూమిహార్ | 1,113,541 | బీహార్, ఒరిస్సా, యు పి , సి పి |
| బైద్య | 110,739 | బెంగాల్ |
| బైగా, భైనా, బింజేవార్, బారియా, కదర్, భూమియా, భూంజియా, భూహియా, ఘట్వార్,నయియా, పావ్ | 1,050,760 | బెంగాల్, బీహార్, ఒరిస్సా, సి పి , సి ఐ , రాజపురానా, సిక్కిం |
| బైరాగి | 838,285 | పెక్కు రాష్ట్రాలలో |
| బలూచ్ | 1,333,215 | బెలుచిస్తాన్, బొంబాయి, పంజాబ్ వాయవ్య' సరిహద్దు రాష్ట్రాలు |
| బనియా, భాటియా, చెట్టి, ఖత్రి, కోమటి (వైశ్య) | 5,176,383 | పెక్కు రాష్ట్రాలలో |

| కులం | బలం | ప్రధాన నివాసం |
|---|---|---|
| ంజారా, లంబాడీ, లబనా, లమాని | 951,022 | బొంబాయి, సి పి,సి ఐ గ్వాలియర్ హైదరాబాద్, మైసూర్, రాజపురానా |
| రియా, భలియా, చోద్రా, గేడియా, ఖాంట్, కోలీ, కొత్వాల్, నాయకడ ప్టేలియా, పతనే వాడియా, తకార్దా, లాబ్దా, వాల్వి | 3,418,643 | పెక్కు రాష్ట్రాలలో |
| ర్, బగ్గీ | 1,671,481 | బెంగాల్, బీహార్, ఒరిస్సా, రాజపురానా |
| వారియా, బావురీ, బాయురీ, బగారి, వాగ్రీ, బాధిక్ | 309,720 | పెక్కు రాష్ట్రాలలో |
| యర్, బర్మానా, ధంగర్, ముసాహర్ | 811,746 | బెంగాల్, బీహార్, ఒరిస్సా, యు పి; సెంట్రల్ ఇండియా |
| బేదర్, బోయ | 991,536 | బొంబాయి, మద్రాసు, హైద్రాబాద్, సి పి |
| ండారీ, ఈడిగ, ఇరువాన్ యాల్, | 1,253,403 | బీహార్, ఒరిస్సా, కొచ్చిన్, మైసూర్, మద్రాస్, ట్రావెన్‌కోర్, రాజ్‌పురానా, బరోడా |
| భంగీ | 797,599 | అజ్మీర్,-మేర్వార్, బొంబాయి, యు పి, బరోడా, రాజపురానా గ్వాలియర్, వెస్టర్న్ ఇండియా రాష్ట్రాలు |
| భర్వాడ్, ధంగర్, గదారియా, కురుబా, | 1,816,283 | పెక్కు రాష్ట్రాలలో |
| భట్, బ్రహ్మభట్, చరన్, జసొంది | 397,274 | పెక్కు రాష్ట్రాలలో |
| ప్రధాన్, పర్హాన్, భత్రా | 353,183 | మద్రాసు, సి పి, బేరార్ |
| భిల్, బరేలా, భిలాలా, ధంకా, మంకర్, మావ్చా పతియా, రతియా, తడ్వీ | 1 454,144 | పెక్కు రాష్ట్రాలలో |
| భిస్తీ, బాయి, ధిమర్, జిన్‌వార్, కహర్‌మచ్చె, తియార్ | 3,575,941 | పెక్కు రాష్ట్రాలలో |
| బొహరా | 212,752 | బొంబాయి, బరోడా, గ్వాలియర్ సి పి, రాజపురానా, |

| కులం | బలం | ప్రధాన నివాసం |
|---|---|---|
| | | సి ఐ, ట్రావెన్‌కూర్, వెస్ట్రన్ ఇండియా రాష్ట్రాలు |
| బ్రాహ్మణ | 15,207,277 | పెక్కు రాష్ట్రాలలో |
| బ్రహూయీ | 224,415 | బెలూచిస్థాన్, బొంబాయి |
| చమర్, కల్పా, సమాగరా | 12,195,516 | పెక్కు రాష్ట్రాలలో |
| చాసా, రాజు | 835,236 | బెంగాల్, బీహార్, ఒరిస్సా |
| చాసి, కాజ్‌బర్తా (మహిసియా) | 2,381,266 | బెంగాల్ |
| చుహరా | 721,981 | పంజాబ్, ఢిల్లీ, వాయువ్య సరిహద్దు రాష్ట్రాలు |
| ధనుక్, కంద్రా | 758,671 | బీహార్, ఒరిస్సా, బెంగాల్, సి పి ,సి ఐ, అజ్మీర్ మెర్వార్, రాజపురానా, ఢిల్లీ, గ్వాలియర్ |
| ధోబీ, పరిత్, వనరన్, వెల్లుట్టిదన్ | 3,161,428 | పెక్కు రాష్ట్రాలలో |
| దోమ్, దోంబర్, బన్సఫోర్, ధర్కార్, ధాలీ | 907,776 | పెక్కు రాష్ట్రాలో |
| ధోరే, చక్లియాన్ | 671,926 | బొంబాయి, సి పి , మద్రాసు, కొచ్చిన్, ట్రావెన్‌కూర్ వెస్ట్రన్ ఇండియా రాష్ట్రాలు |
| డుసధ్ | 1,400,878 | బెంగాల్, బీహార్, ఒరిస్సా, యు పి |
| ఫకీర్ | 820,577 | పంజాబ్, యు పి సి పి రాజ్‌పురానా, సి ఐ , ఏజెన్సీ గ్వాలియర్ |
| గరో, హజంగ్, కచరీ, మెచ్, రభా | 695,648 | అస్సాం, బెంగాల్ |
| గోండ్, ధన్వార్, కలొటా, కమర్, కర్వార్, కొలమ్, కోంధా, కోండా, | | |

| కులం | బలం | ప్రధాన నివాసం |
|---|---|---|
| దొర, కోయ, మరియా, మౌర్యా, నాగర్చి | 4,719,222 | అండమాన్, నికోబార్, బెంగాల్, బీహార్, ఒరిస్సా బొంబాయి, సి పి బేరార్, మద్రాసు, యు పి , సి ఐ, హైదరాబాద్, గ్వాలియర్, రాజ్‌పురానా, |
| గుజర్ | 2,430,669 | అజ్మీర్, మేర్వార్, బొంబాయి, సి పి , బేరార్, ఢిల్లీ, వాయవ్య సరిహద్దు రాష్ట్రాలు, పంజాబ్, యు పి, సి ఐ , రాజ్‌పురానా |
| గురియా, హల్వాయి | 246,583 | బీహార్, ఒరిస్సా, యు పి , సి ఐ, రాజపురానా, గ్వాలియర్ |
| హజ్జమ్, అమ్పట్టం, భండారేఈ, కెలాషీ, మహలీ, నడిగ్, నాయి, నాయి బ్రాహ్మన్, నాపిట్, నహవి, పండితార్, వెల్ల కట్టల్వన్ | 3,725,860 | పెక్కు రాష్ట్రాలలో |
| హరి | 418,830 | అస్సాం, బెంగాల్, బీహార్, ఒరిస్సా, మద్రాసు |
| జాట్ | 8,377,819 | వాయవ్య సరిహద్దు రాష్ట్రాలు, పంజాబ్, యు పి , కాశ్మీర్, రాజపురానా, జమ్మూ కాశ్మీర్ |
| జోగి | 1,11,586 | గ్వాలియర్, సి ఐ, వాజెన్సీ, రాజ్‌పుటానా, జమ్మూ కాశ్మీర్ |
| కెకులన్ | 419,078 | మద్రాసు, కొచ్చిన్, ట్రావెన్‌కోర్ |
| కలార్ | 1,017,179 | అజ్మీర్,మెర్వార్, బెంగాల్, సి పి బేరార్, యు పి , బరోడా, సి ఐ గ్వాలియర్, హైదరాబాద్, సిక్కిం, రాజపురానా |
| కల్లవన్, మరవన్ | 948,630 | మద్రాసు, కొచ్చిన్, ట్రాన్‌న్‌కోర్ |
| కమలన్ (విశ్వబ్రాహ్మణ్ పంచల్ | 7,735,393 | పెక్కు రాష్ట్రాలలో |

| కులం | బలం | ప్రధాన నివాసం |
|---|---|---|
| కరేన్ | 1,367,673 | బర్మా |
| కాయస్త, కరణ్, ప్రభు | 2,946,228 | పెక్కు రాష్ట్రాలలో |
| కేవత్, కైబర్తా | 1,813,278 | అస్సాం, బెంగాల్, బీహార్, ఒరిస్సా, సి పి బెరార్, యు పి |
| కొలితా | 109,250 | బీహార్, ఒరిస్సా, సి పి, బీరార్ |
| కోస్తి, దేవాంగ్ | 921,201 | బెంగాల్, బొంబాయి, సి పి బెరార్, మద్రాసు, సి ,ఐ, హైదరాబాద్, మైసూర్, గ్వాలియర్, కొచ్చిన్ |
| ఖాండ్యత్, పాయక్ | 1,060,587 | బీహార్, ఒరిస్సా, బెంగాల్, మద్రాసు, |
| కిసాన్ | 431,044 | బెంగాల్, బీహార్, ఒరిస్సా, యు పి |
| ఖాసి, సింతెంగ్ | 232,595 | అస్సాం, అండమాన్-నికోబార్ |
| ఖతికే, చిక్ | 412,520 | యు పి, సి పి, బెంగాల్, ఢిల్లీ, అజ్మీర్,మేర్వార్, బెలూచిస్థాన్, హైదరాబాద్, రాజపురానా, గ్వాలియర్ |
| కోరి, కటియా, బాలె, చౌపల్, జుగి | 2,165,953 | పెక్కు రాష్ట్రాలలో |
| కుర్కు, కొర్వా | 246,765 | బీహార్, ఒరిస్సా, సి పి, సి ఐ, యు పి |
| కుమ్హర్, కుసవన్ | 3,580,143 | పెక్కు రాష్ట్రాలలో |
| కుంబి, కర్బి, కుర్మి, క్షత్రియ, కాపు, కపెవర్, రెడ్డి, వక్కలిగ, వెల్లాల | 11,082,108 | పెక్కు రాష్ట్రాలలో |
| లబ్బాయి | 374,829 | కూర్గ్, మద్రాస్, మైసూర్, ట్రావెన్‌కూర్ |
| లోధీ | 1,742,470 | సి పి, బేరార్, యు పి, సి ఐ, బెంగాల్, ఢిల్లీ, రాజపురానా, గ్వాలియర్, హైదరాబాద్ |

| కులం | బలం | ప్రధాన నివాసం |
|---|---|---|
| లుషేయి, సాక్తే, ధాడు | 192,520 | అస్సాం, బర్మా, బెంగాల్ |
| మహార్, మెహ్రా, ధేడ్, వంకర్, హోలియా, పులయన్, చరుమన్ | 4729,405 | పెక్కు రాష్ట్రాలలో |
| మాల | 852,050 | సి పి , బేరార్, మద్రాసు |
| మాలి, ఫుల్‌మాలి, సాయిని, మలకర్ | 2,332,143 | పెక్కు రాష్ట్రాలలో |
| మల్లా, గొరియా,గొన్రిహి | 894,951 | బెంగాల్, బీహార్, ఒరిస్సా, యుపి వాయవ్య సరిహద్దు రాష్ట్రాలు, సి ఐ , గ్వాలియర్, రాజపురానా |
| మంగ్, మేఘ్, మేఘ్ వాల్, మాదిగ, మాద్గ | 2,556,765 | పెక్కు రాష్ట్రాలలో |
| మపిళ్ళ | 139,621 | ట్రావెన్‌కోర్, కూర్గ్, బర్మా, కొచ్చిన్, |
| మరాఠా | 6,113,061 | బొంబాయి, సి పి ,బేరార్, గ్వాలియర్, హైదరాబాద్, బరోడా, మైసూర్, సి ఐ |
| మెయిధీ | 330,545 | అస్సాం, బర్మా |
| మినా మియో | 1,110,479 | పెక్కు రాష్ట్రాలలో |
| మిరాసీ | 283,637 | పంజాబ్, వాయవ్య సరిహద్దు రాష్ట్రాలు, గ్వాలియర్ సి ఐ , జమ్మూ కాశ్మీర్, అజ్మీర్, మేర్వార్, రాజపురాణా |
| మోచి, జింగర్, దబగర్ | 1,026,405 | పెక్కు రాష్ట్రాలలో |
| మోమిన్ | 3,122,100 | పెక్కు రాష్ట్రాలలో |
| ముండా, మువాసీ, హో, కొల్, ఖర్వార్, కారియా, భోగియా, భూమ్జి, కురా | 2,315,276 | బీహార్, ఒరిస్సా, సి పి, బీహార్, బెంగాల్, సి పి , యు పి , రాజపురానా |

| కులం | బలం | ప్రధాన నివాసం |
|---|---|---|
| నాగ | 272,529 | అస్సాం, బర్మా, గ్వాలియర్ |
| నామశూద్ర | 2,265,476 | అస్సాం, బెంగాల్ |
| నాయర్ | 1,550,641 | మద్రాస్, ట్రావెన్‌కూర్, కొచ్చిన్ |
| నేపాల్ | 371,906 | పెక్కు రాష్ట్రాలలో |
| నునియా, జీడ్, బెల్దార్, బింద్, రెహగీర్ | 561,926 | పెక్కు రాష్ట్రాలలో |
| ఒరయన్ | 1,021,334 | బెంగాల్, బీహార్, ఒరిస్సా, సి పి, బీరార్, |
| పళ్ళన్ | 825,224 | మద్రాసు |
| పన్, పన్కా, గండా, పైడి, బరియక్ | 1,241,322 | బెంగాల్, బీహార్, ఒరిస్సా, మద్రాసు, సి పి, బేరార్, సి ఐ |
| పరియన్, తురి | 1,277,365 | మద్రాసు, బొంబాయి, బరోడా, కొచ్చిన్, కూర్గ్, వెస్టర్న్ ఇండియా రాష్ట్రాలు |
| పాశి, అరఖ్ | 1,743,166 | బీహార్, ఒరిస్సా, బెంగాల్, సి ఐ |
| ఒయిలంజీరా, సారాహిరా, దునియా | 565,254 | యు పి, బొంబాయి, గ్వాలియర్, రాజపురానా, పంజాబ్, మైసూర్, సి ఐ, వెస్టర్న్ ఇండియా రాష్ట్రాలు జమ్మూ-కాశ్మీర్, వాయవ్య సరిహద్దు రాష్ట్రాలు |
| రాజభర్, రాజ్‌హర్, రాజ్వేర్‌భర్ | 630,708 | యు పి, బీహార్, ఒరిస్సా, బెంగాల్, సి పి, బేరార్ |
| రాజ్‌పుట్ | 10,743,001 | పెక్కురాష్ట్రాలు |
| సొంతాల్, సొంధా, కర్మాలి, | 2,524,472 | బెంగాల్, బీహార్, ఒరిస్సా, సి ఐ |
| షాన్ | 480,131 | యు పి, సి ఐ |

| కులం | బలం | ప్రధాన నివాసం |
|---|---|---|
| సవర, సౌర్రు, సవారా, సహోరియా | 675,628 | బీహార్, ఒరిస్సా, సి పి -బేరార్, మద్రాసు, యు పి, సి ఐ , గ్వాలియర్, రాజపురానా |
| సహో, సుర్రి | 533,825 | బెంగాల్, మద్రాసు, సిక్కిం |
| షాన్ | 900,204 | బర్మా |
| శిల్పకార్ | 333,036 | యు పి |
| సింగ్ఫో,కచిన్ | 156,253 | బర్మా, అస్సాం |
| తలవ్ల, దుబ్బా | 229,190 | బొంబాయి, బరోడా, వెస్ట్రన్, ఇండియా రాష్ట్రాలు |
| తంబోలి, బరాయి | 452,423 | బెంగాల్, యు పి, రాజపురానా, గ్వాలియర్, బరోడా, సి ఐ |
| టంక్ క్షత్రియ | 926,274 | పెక్కు రాష్ట్రాలలో |
| తంతి, ట్వా, బురియా చదర్, సారి | 1,132,563 | బెంగాల్, బీహార్, ఒరిస్సా, బొంబాయి, సి పి, బేరార్ |
| తెలగ | 1,669,559 | సి ఐ |
| తెలి, తిలి, చక్కన్, గనిగ్, చంచి, వనియన్, | 5,024,496 | మద్రాసు, హైదరాబాద్, కూర్గ్ |
| ధక్కర్, రాతి, రావత్, కనేట్, గిరాతే | 714,503 | బొంబాయి, పంజాబ్, గ్వాలియర్, సి ఐ, రాజపురానా, జమ్మూ-కాశ్మీర్ |

అనుబంధం – 10

వివిధ మతాల జనాభా సాపేక్షత

1921, 1931లలో భారతదేశం, ప్రావిన్సులు, రాష్ట్రాలలో ప్రతి పదివేల మందిలో మతాలవారీ జనాభా విభజన

| ప్రావిన్సులు, మొదలైనవి | సంవత్సరం | హిందువులు | ముస్లింలు | బౌద్ధులు | గిరిజనులు | క్రైస్తవులు | సిక్కులు | జైనులు | ఇతరులు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| భారతదేశం | 1921 | 6,856 | 2,174 | 366 | 309 | 150 | 103 | 37 | 5 |
| | 1931 | 6,824 | 2,216 | 365 | 236 | 179 | 124 | 36 | 20 |
| ప్రావిన్సులు | 1921 | 6,606 | 2,407 | 465 | 280 | 123* | 96 | 18 | 5 |
| | 1931 | 6,548 | 2,469 | 468 | 213 | 142 | 118 | 17 | 25 |
| అజ్మీర్-మేర్వార్ | 1921 | 7,356 | 2,055 | – | 96 | 112 | 4 | 372 | 5 |
| | 1931 | 7,755 | 1,734 | – | 27 | 124 | 6 | 348 | 6 |
| అండమాన్-నికోబార్ | 1921 | 3,278 | 1,515 | 979 | 3,387 | 586 | 144 | – | 111 |
| | 1931 | 2,586 | 2,280 | 988 | 3,379 | 496 | 220 | – | 51 |
| అస్సాం | 1921 | 5,434 | 2,896 | 17 | 1,479 | 168 | 1 | 5 | – |
| | 1931 | 5,720 | 3,196 | 17 | 825 | 235 | 3 | 3 | 1 |
| బలూచిస్థాన్ | 1921 | 920 | 8,731 | 4 | – | 159 | 182 | – | 4 |
| | 1931 | 894 | 8,744 | 1 | 1 | 174 | 181 | 1 | 4 |
| బెంగాల్ | 1921 | 4,327 | 5,399 | 57 | 181 | 31 | – | 3 | 2 |
| | 1931 | 4,304 | 5,487 | 63 | 105 | 36 | 2 | 2 | 1 |
| బీహార్-ఒరిస్సా | 1921 | 8,284 | 1,085 | – | 553 | 76 | 1 | 1 | – |
| | 1931 | 8,231 | 1,132 | – | 544 | 91 | 1 | 1 | – |
| బొంబాయి | 1921 | 7,658 | 1,974 | 1 | 64 | 137 | 4 | 111 | 51 |
| | 1931 | 7,605 | 2,039 | 1 | 59 | 145 | 10 | 92 | 49 |

| కులం | బలం | ప్రధాన నివాసం |
|---|---|---|
| సవర, సౌౌన, సవారా, సహారియా | 675,628 | బీహార్, ఒరిస్సా, సి.పి.-బేరార్, మద్రాసు, యు.పి, సి.ఐ., గ్వాలియర్, రాజపుతానా. |
| సహో, సురని | 533,825 | బెంగాల్, మద్రాసు, సిక్కిం. |
| షాన్ | 900,204 | బర్మా |
| శిల్పకార్ | 333,036 | యు.పి. |
| సింగ్‌ఫో,కచిన్ | 156,253 | బర్మా, అస్సాం |
| తలవ్‌ల, దుబ్బా | 229,190 | బొంబాయి, బరోడా, వెస్ట్రన్, ఇండియా రాష్ట్రాలు. |
| తంబోలి, బరాయి | 452,423 | బెంగాల్, యు.పి, రాజపుతానా, గ్వాలియర్, బరోడా, సి.ఐ. |
| టంక్ క్షత్రియ | 926,274 | పెక్కు రాష్ట్రాలలో |
| తంతి, ట్వా, బురియా | 1,132,563 | బెంగాల్, బీహార్, ఒరిస్సా, |
| చదర్, సారి | | బొంబాయి, సి.పి, బేరార్ |
| తెలగ | 1,669,559 | సి.ఐ. |
| తెలి, తిలి, చక్కన్, గనిగ్, చంచి, వనియన్, | 5,024,496 | మద్రాసు, హైదరాబాద్, కూర్గ్ |
| ధక్కార్, రాతి, రావత్, కనేట్, గిరాతే | 714,503 | బొంబాయి, పంజాబ్, గ్వాలియర్, సి.ఐ, రాజపుతానా, జమ్మూ-కాశ్మీర్. |

అనుబంధం – 10

వివిధ మతాల జనాభా సాపేక్షత

1921, 1931లలో భారతదేశం, ప్రావిన్సులు, రాష్ట్రాలలో ప్రతి పదివేల మందిలో మతాలవారీ జనాభా విభజన

| ప్రావిన్సులు, మొదలైనవి | సంవత్సరం | హిందువులు | ముస్లింలు | బౌద్ధులు | గిరిజనులు | క్రైస్తవులు | సిక్కులు | జైనులు | ఇతరులు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| భారతదేశం | 1921 | 6,856 | 2,174 | 366 | 309 | 150 | 103 | 37 | 5 |
| | 1931 | 6,824 | 2,216 | 365 | 236 | 179 | 124 | 36 | 20 |
| ప్రావిన్సులు | 1921 | 6,606 | 2,407 | 465 | 280 | 123* | 96 | 18 | 5 |
| | 1931 | 6,548 | 2,469 | 468 | 213 | 142 | 118 | 17 | 25 |
| అజ్మీర్-మేర్వార్ | 1921 | 7,356 | 2,055 | – | 96 | 112 | 4 | 372 | 5 |
| | 1931 | 7,755 | 1,734 | – | 27 | 124 | 6 | 348 | 6 |
| అండమాన్-నికోబార్ | 1921 | 3,278 | 1,515 | 979 | 3,387 | 586 | 144 | – | 111 |
| | 1931 | 2,586 | 2,280 | 988 | 3,379 | 496 | 220 | – | 51 |
| అస్సాం | 1921 | 5,434 | 2,896 | 17 | 1,479 | 168 | 1 | 5 | – |
| | 1931 | 5,720 | 3,196 | 17 | 825 | 235 | 3 | 3 | 1 |
| బలూచిస్థాన్ | 1921 | 920 | 8,731 | 4 | – | 159 | 182 | – | 4 |
| | 1931 | 894 | 8,744 | 1 | 1 | 174 | 181 | 1 | 4 |
| బెంగాల్ | 1921 | 4,327 | 5,399 | 57 | 181 | 31 | – | 3 | 2 |
| | 1931 | 4,304 | 5,487 | 63 | 105 | 36 | 2 | 2 | 1 |
| బీహార్-ఒరిస్సా | 1921 | 8,284 | 1,085 | – | 553 | 76 | 1 | 1 | – |
| | 1931 | 8,231 | 1,132 | – | 544 | 91 | 1 | 1 | – |
| బొంబాయి | 1921 | 7,658 | 1,974 | 1 | 64 | 137 | 4 | 111 | 51 |
| | 1931 | 7,605 | 2,039 | 1 | 59 | 145 | 10 | 92 | 49 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| బర్మా | 1921 | 368 | 380 | 8,506 | 534 | 195 | 4 | 1 | 12 |
| | 1931 | 390 | 399 | 8,430 | 444 | 226 | 7 | 1 | 103 |
| సి.పి-బేరార్ | 1921 | 8,354 | 405 | - | 1,160 | 30 | 1 | 49 | 1 |
| | 1931 | 8,601 | 440 | - | 872 | 33 | 3 | 50 | 1 |
| కూర్గ్ | 1921 | 7,733 | 795 | 1 | 1,265 | 194 | - | 12 | - |
| | 1931 | 8,939 | 844 | - | - | 210 | - | 5 | 2 |
| ఢిల్లీ | 1921 | 6,569 | 2,904 | - | - | 273 | 57 | 96 | 1 |
| | 1931 | 6,285 | 3,253 | 1 | - | 267 | 101 | 84 | 9 |
| మద్రాస్ | 1921 | 8,864 | 671 | - | 137 | 322 | - | 6 | - |
| | 1931 | 8,831 | 707 | - | 75 | 380 | - | 7 | - |
| వాయవ్య సరిహద్దు ప్రాంతం | 1921 | 666 | 9,162 | - | - | 47 | 125 | - | - |
| | 1931 | 590 | 9,184 | - | - | 51 | 175 | - | - |
| పంజాబ్ | 1921 | 3,181 | 5,533 | 1 | - | 159 | 1,109 | 17 | - |
| | 1931 | 2,684 | 5,655 | 2 | - | 176 | 1,299 | 15 | 169 |
| యునైటెడ్ ప్రావిన్సులు | 1921 | 8,509 | 1,428 | - | - | 44 | 3 | 15 | 1 |
| | 1931 | 8,440 | 1,484 | - | - | 42 | 10 | 14 | - |
| రాష్ట్రాలు | 1921 | 7,748 | 1,343 | 12 | 415 | 250 | 126 | 104 | 2 |
| | 1931 | 7,771 | 1,347 | 12 | 316 | 307 | 141 | 101 | 5 |

గమనిక :
* పై పట్టికలో ఉన్న ఖాళీలు అక్కడ 10,000 మంది జనాభాలో వారి సంఖ్య లేశ మాత్రమని సూచిస్తాయి
* 1921 లెక్కల్లో కాశీ రాష్ట్రాలను అస్సాంలో చేర్చడమైంది మిగిలిన రాష్ట్రాలన్నిటినీ ప్రావిన్సుల నుండి మినహాయించడమైంది.

# 6

# రెనడే - గాంధీ - జిన్నా

*మహదేవ్ గోవింద రెనడే*
*101వ జన్మదినోత్సవాల సందర్భంగా*
*గోఖలే మెమోరియల్ హాల్*
*పూనాలో 18–1–1943 న చేసిన ప్రసంగం*

6.4.43

My dear Manohar,

Pray Excuse me for not replying to your letter of the 19th March earlier than to-day. I am glad you liked my address on Ranade. I share your regret over the omission of the part dealing with Phule. I am however far from losing sight of its importance. I will take some occasion to enlarge it and publish it. I don't know what Thackers have done with Ranade. I have not had any news from them. I am busy now with the new edition of Pakistan. I am writing three more chapters. They will be very short. I propose to set out in those chapters my conclusions. I thank you

డాక్టర్ అంబేడ్కర్ ప్రొ॥ ఎం.బి. చిట్నీస్‌కు రాసిన లేఖ నుంచి తీసుకున్న
ఆయన స్వదస్తూరీ.

# రెనడే – గాంధీ – జిన్నా

## ఉపోద్ఘాతం

దక్కన్‌సభ 'పూనా'వారు జస్టిస్ మహాదేవ్ గోవింద రెనడే 101వ జన్మదిన సందర్భాన్ని పురస్కరించుకొని, 18.11.1940 తేదీన నన్ను ఉపన్యసించ వలసిందిగా కోరారు. వారి ఆహ్వానాన్ని అంగీకరించడానికి అంతగా ఇష్టం చూపలేకపోయాను. ఎందుకంటే- రెనడేపై నేను చేసే ప్రసంగంలో నేను చెప్పకుండా ఉండలేని సాంఘిక రాజకీయ సమస్యల మీద నా అభిప్రాయాలు, సభికులకు, ముఖ్యంగా దక్కన్ సభ సభ్యులకు, అంతగా ఆమోదకరంగా ఉండకపోవచ్చు. చివరకు నేను వారి ఆహ్వానాన్ని అంగీకరించాను. ఉపన్యసించి నప్పుడు ఈ ఉపన్యాసాన్ని ప్రచురించాలనే ఉద్దేశం నాకు లేదు. మహాపురుషుల వార్షికోత్స వాలపై చేసే ప్రసంగాలు సాధారణంగా ఆయా సందర్భాలకు తగినట్టు మాత్రమే ఉంటాయి. వాటికి శాశ్వతమైన విలువలు ఉండవు నా ఉపన్యాసం కూడా ఇందుకు భిన్నంగా ఉంటుందని నేననుకోవడం లేదు. కాని నాకు కాస్త ఇబ్బంది పెట్టే మిత్రులు కొందరున్నారు. అదంతా అచ్చు కావాల్సిందేనని వాళ్ళు పట్టుబట్టారు. దానికి నాకైతే అంత పట్టింపు లేదు. దానికి లభించిన ప్రచారం చాలుననిపించింది నాకు. ఇంకా ఎక్కువ ప్రచారం కావాలన్న కోరిక నాకు లేదు. అయితే ఇది కనుమరుగైపోకుండా కాపాడవలసినంత విలువైనదని భావించేవారు కొందరున్నప్పుడు వారిని ఎందుకు నిరుత్సాహపరచాలని కూడా నాకనిపించింది !

ముద్రించిన ఉపన్యాస పాఠానికి ఆనాడు నేను చేసిన ప్రసంగానికి రెండు విధాలుగా తేడా వుంది. కాలాతీత మౌతుందన్న భయంతో కొంతభాగం ముద్రిత పాఠంలోని పదవ భాగం, అక్కడ నేను చదవలేదు. అది లేకుండానే నా ప్రసంగానికి గంటన్నర పట్టింది. ఇది ఒక తేడా. రెండో తేడా ఏమంటే ఎనిమిదవ భాగంలో-రెనడే-ఫులేలను పోలుస్తూ చేసిన ప్రసంగంలో చాలా తొలగించవలసి వచ్చింది. ఇందుకు మళ్ళీ రెండు కారణాలున్నాయి. మొదటి కారణం - ఈ పోలిక ఈ ఇద్దరికీ న్యాయం చేకూర్చేంత పరిపూర్ణంగాను,

సవివరంగాను లేకపోవడం. రెండో కారణం - ముద్రణకు చాలినంత కాగితం లేనందువల్ల ప్రసంగంలోని ఈ భాగాన్ని వదిలేస్తే ఉత్తమం అనిపించింది.

ఈ ప్రసంగం ప్రచురణ కొన్ని విచిత్రమైన పరిస్థితుల్లో జరుగుతున్నది సాధారణంగా ప్రచురణ తర్వాత సమీక్షలు వస్తాయి. ఈ సందర్భంలో ఇది తారుమారయింది. దారుణ మేమిటంటే - ఈ సమీక్షలు ప్రసంగాన్నే చీల్చి చెండాడాయి. అసలిది ప్రచురణ కర్తలు పడవలసిన బాధ మన ప్రచురణ కర్త ఇందులోని సాధక బాధకాలు తెలిసే సిద్ధపడినందుకు నాకు సంతోషం. ఇది నాలుగు కాలాలపాటు ఉండవలసిన ప్రసంగ పాఠమని చెప్పిన, నా మిత్రుల అభిప్రాయం సరైనదే అనటానికి, ఇంతకంటే వేరే ఏమీ చెప్పనక్కర లేదు. నా ప్రసంగంపై పత్రికలు చేసిన ఖండనలు నన్నేమాత్రం వ్యాకుల పరచలేదు. ఈ ఖండనలకు ఆధార మేమిటి? ఈ ఖండనలు చేయటానికి ముందు కొచ్చిన దెవరు?

భారత రాజకీయాలను గాంధీ, జిన్నా గబ్బు పట్టించినందుకు నేను వారిని విమర్శించానని, అలా విమర్శించటంలో నేను వారి పట్ల ద్వేషాన్ని అగౌరవాన్ని చూపించానని నాపై అభియోగం మోపి నన్ను ఖండించారు. ఈ అభియోగానికి చెప్పవలసిన సమాధానం ఏమిటంటే నేను విమర్శకుణ్ణి అని, విమర్శకుడిగానే ఉంటానని మాత్రమే. నేను తప్పులు చేస్తుండవచ్చు. ఎవరో చెప్పినట్లల్లా నడుచుకోవటం కన్నా పరిస్థితులు దిగజారిపోతున్నా కిమ్మనకుండా కూర్చోవటం కన్నా తప్పులు అయినా చేయటం మంచిదని నా కెప్పుడూ అనిపిస్తుంది. నేను ద్వేష భావంతో వ్యవహరించానని ఆరోపిస్తున్నవారు రెండు విషయాలను మరిచి పోతున్నారు. మొదటిది - ద్వేషం అంటున్నారే అది వైయక్తిక మనదగిన ఏ భావనలో నుంచీ వచ్చినది కాదు. నేను వారిని వ్యతిరేకిస్తున్నానంటే, దానికి కారణం నేను పరిష్కారం కోరుతున్నాను కాబట్టి. ఆదర్శ ప్రాయమైన పరిష్కారం కోసం వేచి ఉండటానికి నేను సిద్ధంగా లేను. నాకు ఏదో ఒక పరిష్కారం కావాలి. మొగలు పాదుషాలా కూర్చుని తన ఇష్టాయిష్టాల ప్రకారమే పరిష్కారం కుదరాలని ఎవరైనా అనుకుంటే కూడా దానిని నేను సహించను. ఇక రెండోది - గాఢమైన రాగ ద్వేషాలు లేని వ్యక్తి ఎవరు కూడా తన కాలంపై ప్రగాఢమైన ముద్ర వేయలేడు. ఉదాత్తమైన సిద్ధాంతాలకు, పోరాట లక్ష్యాలకు తగిన దోహదం చేయలేడు. అన్యాయం అన్నా క్రూరంగా వ్యవహరించి తన మాటే నెగ్గించుకోవటం అన్నా డాంబికం అన్నా దగాకోరుతనం అన్నా నాకు పరమ అసహ్యం,. ఈ అవలక్షణాలు ఉన్న ఎవరన్నా నాకు అసహ్యం. నా ద్వేష భావనలే సిసలైన బలం అని నా విమర్శకులకు చెప్పదలుచుకున్నాను. నేను నమ్ముతున్న ఆదర్శాల పట్ల ప్రేమే అవతల ద్వేషంగా ప్రతిఫలిస్తుంది. అందుకు నేను ఎంత మాత్రమూ సిగ్గు పడటం లేదు. భారత రాజకీయాలను ముందుకు సాగనివ్వకుండా చేసిన ఈ ఇద్దరిని- గాంధీని, జిన్నాను- విమర్శించినందుకు ఈ కారణాల చేత నేను ఎవరికీ క్షమాపణ చెప్పను.

నా మీద దుమ్మెత్తి పోస్తున్నది కాంగ్రెస్ పత్రికలు. వాటిని గురించి నాకు బాగా తెలుసు. ఈ పత్రికల విమర్శలకు నేను ఎలాంటి విలువా ఇవ్వను. ఈ పత్రికలు నా వాదనలను ఎప్పుడూ ఖండించలేదు. నేను చేసిన ఏ పని నయినా దుమ్మెత్తిపోయటమే వీటికి తెలుసు - నిందించటమే తెలుసు. నేను చెప్పింది చెప్పినట్టు రాయవు, లేనిపోనివి ఏవో రాస్తాయి. వక్ర భాష్యాలు చేస్తాయి. నేను ఏం చేసినా సరే ఈ కాంగ్రెసు పత్రికలకు నచ్చదు. అంటరాని వారి పట్ల హిందువులకు ఉండే ద్వేషమే-కాంగ్రెస్ పత్రికలకు నా పట్ల ఉన్న వ్యతిరేకతగా ప్రతి ఫలిస్తున్నదని చెప్పుకోవచ్చు. ఇది నేనేమీ అనుచితంగా అంటున్న మాట కాదు. గడిచిన అనేక సంవత్సరాలుగా, కాంగ్రెస్ వారు తిట్టి పోస్తూ వచ్చిన జిన్నాను, నేను విమర్శిస్తే ఈ కాంగ్రెస్ పత్రికలు భరించలేక పోతున్నాయి. నా పట్ల ఈ కాంగ్రెస్ పత్రికల వ్యతిరేకత ఎంత వ్యక్తిగతమైనదో దీనినిబట్టే స్పష్టమౌతున్నది.

కాంగ్రెస్ పత్రికలు నన్నెంత తీవ్రంగా నీచంగా తిట్టిపోసినా, నేను మాత్రం నా విధిని నిర్వర్తించ వలసిందే. నేనేమీ విగ్రహారాధకుడను కాను. వాటిని పగల గొట్టాలన్నదే నా విశ్వాసం. నేను గాంధీని, జిన్నాను ద్వేషిస్తున్నానంటే నేను భారత దేశాన్ని మరింతగా ప్రేమిస్తున్నందువల్లనే. ఇది ద్వేషం కూడా కాదు- అయిష్టతే! ఒక జాతీయ వాది అసలైన విశ్వాసమదే. మనుష్యుల కంటె దేశమే మిన్న అనీ. గాంధీనీ, జిన్నానూ ఆరాధించడం భారతదేశానికి సేవచేయడం అనేవి రెండు వేరు వేరు విషయాలనీ, ఒక్కొక్కసారి ఇవి పరస్పరం విరుద్ధం కూడా కావచ్చుననీ, ఏదో ఒకనాడు, నా దేశ ప్రజలు గ్రహిస్తారన్న ఆశలు నాకున్నవి.

బి.ఆర్. అంబేద్కర్

22-పృధ్వీరాజ్ రోడ్
న్యూఢిల్లీ
15 మార్చి, 1943.

# రెనడే – గాంధీ – జిన్నా

## I

ఈ ఆహ్వానానికి నేనంతగా సంతోషించలేదన్న మాట ముందుగా మీకు చెప్పి తీరాలి. ఈ సందర్భానికి తగిన న్యాయం చేయలేనేమోనని నా భయం. బొంబాయిలో క్రిందటేడు – రెనడే శతజయంతి జరిగినప్పుడు-రైటానరబుల్ శ్రీనివాసశాస్త్రిని మాట్లాడమని పిలిచారు. ఎన్నో విధాల ఆయన అందుకు తగినవాడు. తన జీవితంలో కొంతకాలం రెనడేకు సమకాలీనుడనని ఆయన చెప్పుకోగలరు. రెనడేను ఆయన దగ్గర నుండి చూశాడు. రెనడే తన జీవితాన్ని ఏ కృషి కోసం అంకితం చేశారో దానికి శాస్త్రి స్వయంగా సాక్షి. రెనడేను అంచనా వేసి-సహకార్యకర్తలతో ఆయనను పోల్చటానికి శాస్త్రికి అవకాశం వుంది. వ్యక్తిగత పరిచయంతో ఏర్పడిన సాన్నిహిత్యం వల్ల రెనడే గురించి శాస్త్రి సాధికారంగా తన అభిప్రాయాలు చెప్పగలిగాడు. ఏదో ఒక సంఘటనను ఉదహరించి రెనడే ఆకృతిని శ్రోతల ముందు ప్రకాశమానంగా ఆవిష్కరించగలిగాడు. నాకీ యోగ్యత లేమీ లేవు. రెనడేతో నాకున్న సంబంధం చాలా తక్కువ. నేను ఆయన్ని చూడను గూడా లేదు. రెనడేకు సంబంధించిన రెండే రెండు సంఘటనలు నేను జ్ఞప్తికి తెచ్చుకోగలను. మొదటిది ఆయన మరణానికి సంబంధించినది. అప్పుడు నేను సతారా హైస్కూల్లో ఒకటవ తరగతిలో ఉన్నాను 1901 జనవరి 16వ తేదీన హైస్కూలు మూసి వేశారు. ఆరోజు మా అందరికీ సెలవు. ఎందుకు మూసి వేశారని అడిగితే- రెనడే పోయారని చెప్పారు. అప్పుడు నాకు సుమారు తొమ్మిదేళ్ళు. రెనడే ఎవరో ఏమి చేసారో ఆయన గురించి నాకేమీ తెలియదు. మిగతా పిల్లలలాగానే సెలవు దొరికిందని సంబరపడ్డాను. చనిపోయిన వారెవరో, ఏమో, నాకు తెలుసుకోవాలనిపించలేదు. రెనడేని జ్ఞాపకం చేస్తున్న రెండో సంఘటన, మొదటిది జరిగిన చాలా కాలం తర్వాత జరిగింది. ఒకసారి, మా నాన్నగారి పాత కాగితాల కట్టలు తీసి చూస్తూంటే ఒక అర్జీ దొరికింది. 1892లో సైన్యంలోనికి మహర్ల నియామకాన్ని నిషేధించారు. దానిమీద మహర్ కులస్థులైన కమిషన్డ్ ఆఫీసర్లు, నాన్‌కమీషన్డ్ ఆఫీసర్లు దానిని వ్యతిరేకిస్తూ పెట్టుకొన్న అర్జీ తాలూకు కాగితం అది! విచారిస్తే అది, బాధితులైన మహర్ల న్యాయం సాధించేందుకు సహాయపడుతూ రెనడే స్వయంగా తయారు చేసిన

అగీ ప్రతి అని తెలిసింది. ఈ రెండు సంఘటనలకు మించి రెనడే గురించి నేను జ్ఞాపకం చేసుకోగలిగింది మరేమీ లేదు. ఆయన గురించిన నా పరిజ్ఞానం ఇతరుల నుండి తెలుసుకున్నదే కాని వ్యక్తిగతం కాదు. ఇది ఆయన గురించి చదివి తెలుసుకున్నదీ, ఎవరో చెప్పగా విన్నదీ మీకు ఆసక్తి కలిగించటానికి గాని మీరేదైనా నేర్చుకోటానికి గాని స్వానుభవం నుంచి నేనేమైనా చెప్పాలని ఆశించవద్దు. తన కాలంలో ఒక ప్రజా ప్రముఖుడుగా ఆయన గురించి నేనేమి అనుకుంటున్నానో భారత రాజకీయాలలో ఈనాడు ఆయన స్థానమేమిటో చెపుదామనుకొంటున్నా.

## II

రెనడే గొప్ప వాడని నిస్సంకోచంగా చెప్పే ఆయన స్నేహితులూ ఉన్నారు; అంతే గట్టిగా, ఆయనకు అలాంటి స్థానం లేదనే వారూ ఉన్నారు. ఈ విషయం మీకు తెలుసు ఇందులో ఎక్కడుంది నిజం? ఈ ప్రశ్నకు ముందు మరొక ప్రశ్న వుంది. అదేమిటంటే- చరిత్ర అంటే గొప్ప వాళ్ళ చరిత్రేనా? ఈ ప్రశ్న సందర్భ శుద్ధి కలిగినదీ ముఖ్యమైనదీ కూడా! ఎందుకంటే- అటువంటి మహా వ్యక్తులు చరిత్ర నిర్మాతలు కాకపోతే- సినిమా నటులకంటే వారిని ఎక్కువగా గుర్తించలసిన అవసరం ఏముంది? అభిప్రాయాలుంటాయి! ఒక మనిషి ఎంత గొప్పవాడైనా, కాలమే అతణ్ణి నడిపించిందని అనేవారు కొందరున్నారు. కాలమే అతణ్ణి ముందుకు రొప్పుస్తుంది, కాలమే ప్రతిదీ చేస్తుంది, అతడు చేసింది ఏమీ లేదు- అని వారి వాదన. ఈ అభిప్రాయమున్నవారు నా అంచనాలో చరిత్రని తప్పుగా వ్యాఖ్యానిస్తున్నారు. చారిత్రకమైన మార్పులకు కారణాల విషయమై మూడు విభిన్నమైన అభిప్రాయాలున్నాయి. చరిత్రకు సంబంధించి అగస్టిన్ సిద్ధాంతం ఒకటున్నది. దీని ప్రకారం దైవం నిర్ణయించిన రీతిలో మానవ చరిత్ర ఆవిష్కృతమౌతూ వుంటుంది. దేవుని తీర్పు రోజువరకు మానవాళి యుద్ధాలు చేసుకొంటూ, కష్టాల భరిస్తూ మనుగడ సాగిస్తారు చరిత్ర అంటే భూగోళ శాస్త్రం, భౌతిక శాస్త్రం కలిసి నిర్మించినదే, అని అంటాడు బకిల్. మూడవ అభిప్రాయం కారల్‌మార్క్స్ చెప్పినది. ఈ అభిప్రాయం ప్రకారం ఆర్థిక శక్తుల వలననే చరిత్ర పుట్టుకొచ్చింది. ఈ ముగ్గురులో ఎవరూ కూడా మహావ్యక్తుల జీవిత చరిత్రయే మానవ చరిత్ర అవుతుందని అంగీకరించరు. అసలు ఈ ముగ్గురూ, చరిత్ర నిర్మాణంలో మనిషికి ఎలాంటి స్థానమూ ఇవ్వలేదు. మత సైద్ధాంతికులు తప్ప మరెవరూ అగస్టిన్ చెప్పిన చరిత్ర సిద్ధాంతాన్ని ఒప్పుకోరు. బకిల్, మార్క్స్‌ల సిద్ధాంతాల విషయాని కొస్తే, వారు చెప్పిందాంట్లో కొంత నిజంలేక పోలేదు. కాని అదే పూర్తి నిజం మాత్రం కాదు. మానవేతర శక్తులే సమస్తం చేస్తాయనీ, చరిత్ర నిర్మాణంలో మానవేతర శక్తులే సమస్తం చేస్తాయనీ మనిషి చేసిందేమీ లేదనీ వారు చెప్పిన అభిప్రాయం పొరపాటు అయితే మానవేతర శక్తుల వలన కలిగే ఫలితం మనిషి మీద ఆధారపడి ఉంటుందన్న దాన్ని ఒప్పుకొని తీరాలి. 'చెకుముకి' రాయి ఎక్కడ బడితే అక్కడ ఉండకపోవచ్చు. కాని

అది ఉన్నచోట ఒక చెకుముకితో మరొక చెకుముకి రాయిని కొట్టి నిప్పు పుట్టించడానికి మనిషి కావాల్సి వస్తాడు. తిండి గింజలు ఎక్కడపడితే అక్కడ దొరక్కపోవచ్చు. కాని దొరికిన చోట వాటిని పిండిచేసి, రుచికరమైన పుష్టికరమైన ముద్ద చేయడం కోసం మళ్ళీ మనిషి అవసరం అవుతున్నాడు. తద్వారా వ్యవసాయానికి మనిషి ప్రాతిపదిక వేస్తున్నాడు లోహాలు లేని ప్రాంతాలు చాలా ఉన్నాయి. కాని అవి ఉన్నచోట నాగరికతకు, సంస్కృతికి, ఆధారమైన పరికరాలను, యంత్రాలను వాటినుంచి తయారు చేయటానికి మనిషి అవసరం అవుతున్నాడు.

సామాజిక శక్తుల విషయం తీసుకోండి. విషాదకరమైన పరిస్థితులు అనేకం ఉత్పన్నం అవుతూ వుంటాయి. థామర్ వ్రాసిన థియోడర్ రూజ్‌వెల్టు జీవిత చరిత్రలో అటువంటి పరిస్థితి వర్ణన ఒకటుంది.

"ప్రతి వర్గానికి- పార్టీకి లేదా సంస్థకు, పెరుగుదల స్థంభించిపోయి, జీవనాడులు క్రుంగిపోయి యువత ఆశలుడిగి వృద్ధులు కలలు గూడా కనలేని ఒకానొక సమయం వస్తుంది. అప్పుడది గతాన్ని నెమరేసుకుంటూ, నిస్సహాయంగా దాన్నే పట్టుకొని వేలాడు తుంది. రాజకీయాలలో ఈ జడత్వం దాపురించినపుడు దాన్ని మనం బోర్బానిజం అంటాం. దీని ఒక ముఖ్య లక్షణం ఏమిటంటే తన నరాలు క్రుంగిపోయినవని గాని తనకు చికిత్స చేయించుకొనవలసిన అవసరం ఉన్నదని గాని తెలియదు. మారిన కొత్త పరిస్థితులకు అనుగుణంగా మారలేక పాత పడక కుర్చీలో పడి ఉన్న ముసలివానిలాగా గతంలో పడివుంటాడు"

ఇక రెండో పరిస్థితి. ఇది కృశించడం కాదు ధ్వంసం చేయడం, ఒక క్లిష్ట పరిస్థితి ఏర్పడినప్పటికీ ఇలాంటి అవకాశాలు ఉంటూనే వుంటాయి. పాత ధోరణులు, పాత అలవాట్లు పాత ఆలోచనలు సమాజాన్ని పైకి ఎదగనివ్వవు, ముందుకు సాగనివ్వవు. కొత్తవి కనుగొంటేనే గాని మనుగడ సాగించే అవకాశాలే ఉండవు. ప్రతి సమాజానికి క్షీణ దశలు, విధ్వంసకావకాశాలు ఉంటాయి. కొన్ని బ్రతక గలుగుతాయి కొన్ని ధ్వంసమై పోతాయి. కొన్ని ఎదుగు బొదుగూ లేకుండా పోయి క్రమంగా క్షీణిస్తాయి. ఎందుకిలా జరుగుతుంది? కొన్ని మనుగడ సాగించడానికి కారణాలేమిటి? కార్లైల్ దీనికి ఒక సమాధానమిచ్చాడు తన సహజ ధోరణిలో ఆయన అంటాడిలా-

"వివేకి, మంచివాడు దేశ కాల అవసరాలు తెలిసిన విజ్ఞుడు, సమాజాన్ని సన్మార్గంలో నడిపించగల సాహసి దొరికితే, ఏ యుగమూ క్షీణయుగమై ఉండేది కాదు. ఏ యుగానికైనా ఇవే ముక్తి మార్గాలు".

చరిత్ర నిర్మాణంలో మనిషికి ఎలాంటి స్థానం ఇవ్వాని వారికి ఇది తిరుగులేని సమాధానం అనిపిస్తుంది. ఒక కొత్త మార్గాన్ని కనుగొని సంక్షోభాన్ని పరిష్కరించుకోవచ్చు.

కొత్త దారి ఏదీ దొరకనప్పుడు సమాజం అధోగతి పాలవుతుంది. కాలమే తగిన కొత్త మార్గాల్ని చూపవచ్చు. అందులో ఏది సరియైన మార్గమో చూపడం కాలం పనికాదు. అది సరియైన దారిలో పెట్టడం మనిషి చేయవలసిన పని. కనుక చరిత్ర నిర్మాణంలో మనిషి పాత్ర ఉన్నది. మానవేతరమైనదైనా, సామాజికమైనదైనా; పరిసరాల శక్తులకు; ఇందులో కొంత పాత్ర ఉన్నదేమోకాని సమస్తమూ అవే అనడానికి వీలు లేదు.

III

ఎవర్ని గొప్ప వారంటాం? అలెగ్జాండర్ అట్టిలా సీజర్, తామర్లైన్‌లాంటి యుద్ధ వీరులను గురించి అడిగితే సమాధానం చెప్పడం కష్టం ఏమీ కాదు. సైనిక యోధులు నూతన శకాలను ఆవిష్కరిస్తారు. గొప్ప పరిణామాలు తీసుకొస్తారు. మహత్తర విజయాలను సాధించి ఒక వెలుగు వెలిగి సాటి యోధులను భయభ్రాంతుల్ని చేస్తారు. ఎవరో వచ్చి వారికి గొప్పతనం ఆపాదించవలసిన అవసరం లేదు. వారే గొప్ప వారవుతారు. లేళ్ళ మధ్య సింహమెలాగో సాటి మనుష్యుల మధ్య వారు అలాగ. ఇక్కడ ఒక మాట చెప్పవలసి వుంది. మానవాళి చరిత్రపై వీరు వేసే శాశ్వత ముద్ర అతి స్వల్పం. వారి విజయపరంపరలు కుంచించుకుపోతాయి. నెపోలియన్ అంతటి మహాసేనాని దండయాత్రలన్నీ విజయవంతంగా ముగించాక చూస్తే అతడు నెలకొల్పినప్పటికంటే ఫ్రాన్సు తరిగిపోయి ఉన్నది. దూరం నుంచి చూస్తే ఇలాంటివారు ఆయా కాలాలలో ఒక వెలుగు వెలిగి పోయి కనిస్తారు. ప్రపంచ గమనంలో కొన్ని ముఖ్య సంఘటనలకు కారకులౌతారు. అయితే సమకాలీన సమాజ ధర్మంపై వారి శాశ్వత ముద్ర ఏమీ ఉండదు. అలాంటి వారి జీవిత విశేషాలు, వారి జీవితాలు అందించే నీతి సందేశాలు ఆసక్తిదాయకంగా ఉండవచ్చు. కాని అంతమాత్రాన సంఘాన్ని వారు ప్రభావితం చేయలేరు. పాలను 'తోడు'వలె సమస్తాన్నీ మార్చలేరు.

సేనాని కానివ్యక్తిని గురించి ఇదే ప్రశ్న అడిగితే సమాధానం కష్టమౌతుంది. ఎందుకంటే, ఈ ప్రశ్నకు సమాధానం చెప్పేటప్పుడు గీటురాళ్ళు అవసరం అవుతాయి. ఎవరి గీటురాళ్ళు వాళ్ళ కుంటాయి.

వీర పురుషుల ఆరాధనను ప్రబోధించిన కార్లైల్ తన గీటురాయి ఒకటి పెట్టారు. ఇదీ ఆయన చెప్పింది –

"మరీ ముఖ్యంగా సత్య నిష్ఠలేని వాడెవడైనా గొప్పవాడైనాడంటే అది నమ్మశక్యం కాదు. మౌలికంగా అదే అతడి ఉన్నతికి పునాది. చిత్తశుద్ధి అనేది ఉంటేనే ఏదైనా ఒక పని చేయడానికి యోగ్యత కలుగుతుంది. నేనంటాను. .... అలాంటివాడే నిజాయితీగల మనిషి అని. ఎవరు ఎలా మహాపురుషులైనప్పటికీ వారందరిలో మొట్టమొదట ఉండవలసిన లక్షణం "నిజాయితీ" అని చెప్పి తీరాలి. నిజాయితీ అంటే ప్రగాఢమైన, సమున్నతమైన, సిసలైన నిజాయితీ"

ప్రత్యేకించి కార్లై 'నిజాయితీగా' గీటురాయి అంటే ఏమిటో చాలా కచ్చితమైన పదాలలో చెప్పాలని ప్రయత్నించారు. ఇలా చేయడంలో నిజాయితీ అంటే (తన ఉద్దేశంలో) ఇది సుమా నిర్వచనం, అని పాఠకులను హెచ్చరించాడు కూడా.

"నిజాయితీ అనేది ఒకరు చెప్పుకునేది కాదు. అంతే కాదు సరుకులేకుండా ప్రగల్భాలు పలుకుతూ నిజాయితీపరుడనని అనుకోవడం ప్రధానంగా చాలా సందర్భాలలో ఆత్మవంచనే అవుతుంది. మహాపురుషుల నిజాయితీ చెప్పుకొనేది కాదు. తాము నిజాయితీ పరులమని వారు అనుకోరు కూడా. అంతేకాదు, తాము నిజాయితీ పరులం కామనుకుంటారేమో! దీనికోసం, మనిషి ఒక్కనాడైనా సత్య నిష్ఠతో నిక్కచ్చిగా నడుచుకుంటాడనా? లేదు. మహనీయులు తాము నిజాయితీ పరులమని ప్రగల్భాలు పలకరు. బహుశా వారికి అలాంటి ఆలోచన కూడా రాదు. ఇంకా చెప్పాలంటే వారు నిజాయితీ పరులు కావడంలో వారి ప్రయత్నం లేదు నిజాయితీపరులు కాకుండా ఉండడం వారికి చేతకాదు!"

నెపోలియన్ గురించి చెపుతూ లార్డ్ రోజ్‌బెరీ మరొక గీటురాయిని చూపించాడు. నెపోలియన్ ఎంత గొప్పసేనా నాయకుడో అంత గొప్ప పరిపాలనా దక్షుడు. నెపోలియన్ గొప్పవాడా అన్న ప్రశ్నకు సమాధానంగా రోజ్‌బరీ వాడిన భాష ఇది.

"సునిశిత మేధస్సుకు నైతిక లక్షణాలు తోడవడం గొప్పతనం అనదలచుకుంటే - అలాంటి లక్షణాలున్నవాడు గొప్పవాడు ఎంత మాత్రమూ కాదు. అయితే అసాధారణ వ్యక్తి, అత్యధికుడు అనే అర్థంలో అతడు గొప్పవాడు అని అంటే అందుకేమీ సందేహం లేదు సహజ శక్తికి, ఆధిక్యానికి, మానవాళికి అతీతమైన గొప్పతనమే సంకేతమైతే అప్పుడు నెపోలియన్ ఖచ్చితంగా గొప్పవాడే. మనం మేధ అని అంటున్నామే - మాటల్లో చెప్పలేని ఆ ప్రజ్ఞకు తోడు బుద్ధి కుశలత, అసమాన శక్తి సామర్థ్యాలు అతడికున్నాయి."

తత్త్వవేత్తలు, ఇంకా కచ్చితంగా చెప్పాలంటే- మానవాళిని దైవశక్తే నడిపిస్తోందని నమ్మేవారు - సూచించే మూడవ గీటురాయి ఉంది. గొప్పవాడు అంటే వారి ఉద్దేశం వేరు. రోజ్‌బరీ చెప్పినట్లు వారు చెప్పిన దాని సారాంశానికి సారాంశం చెప్పుకోవాలంటే మహా పురుషులను మహత్తరమైన ఒక ప్రకృతి శక్తి లేదా ఒక అలౌకిక శక్తి ఈ ప్రపంచంలోనికి అవతరింప చేస్తున్నది. అలా వచ్చిన మహాపురుషులు సమాజాన్ని ప్రక్షాళనం చేస్తారు. కొరడా ఝుళిపిస్తారు. సరియైన మార్గంలో నడిపిస్తారు. రక్షించేది తక్కువ, శిక్షించేది ఎక్కువ అయిన ఈ బృహత్ కార్యం ప్రధానంగా సమాజ సముద్ధరణకు ఉద్దేశించింది.

ఇందులో ఏది సరియైన గీటురాయి? నా ఉద్దేశంలో అన్నీ పాక్షికమైనవే. సంపూర్ణమైనదేదీ లేదు. క్లైమెన్సో ఒకసారి అన్నారు - రాజనీతిజ్ఞులలో చాలామంది దుష్టులని. రాజనీతిజ్ఞులు మహావ్యక్తులై వుండవలసిన అవసరం లేదు. నిజాయితీలేని వారిని చూచిన అనుభవంతోటే ఆయన ఈ అభిప్రాయాన్ని ఏర్పరచుకొని వుంటాడు. ఏమైనప్పటికీ

నిజాయితీయే ప్రాధమికమైన– లేదా– ఏకైక పరీక్ష అంటే ఎవరూ ఒప్పుకోరు. ఎందుకంటే నిజాయితీ ఒక్కటే చాలదు. గొప్పవారికి నిజాయితీ ఉండి తీరాలి. ఎందుకంటే నైతిక లక్షణాలన్ని కలిస్తేనే నిజాయితీ అవుతుంది. మరి అది లేకుండా ఎవరూ గొప్పవారు కాలేరు. ఒక మనిషి గొప్పవాడు కావటానికి నిజాయితీకి మించి, అతడిలో మరేదో ఉండాలి. ఒకరు నిజాయితీపరుడూ కావచ్చు, అతడు బుద్ధిహీనుడు గూడా కావచ్చు. బుద్ధిహీనుడు గొప్పవాడు కాడు గదా? సంక్షుభిత సమయంలో సమాజాన్ని కాపాడటానికి ఒక మార్గాన్ని కనుగొన్న మనిషినే గొప్పవాడంటారు. అయితే ఈ మార్గాన్ని కనుగొనటానికి సహాయపడేది ఏది! బుద్ధిబలంతోనే అతడు పరిష్కారమార్గాన్ని కనుగొనగలడు. బుద్ధి బలమే వెలుగు. మరేదీ ఉపయోగపడదు. నిజాయితీ, బుద్ధిబలం, ఈ రెండూ కలవకుండా ఏ మనిషీ గొప్పవాడు కాలేడు. గొప్పవాడు కావటానికి ఈ రెండు కలిస్తే చాలునా? ఇక్కడ, నేననుకుంటా, ఒక ప్రముఖ వ్యక్తికి ఒక గొప్ప వ్యక్తికి మధ్య తేడాను చూసి తీరాలి. ఎందుకంటే, ఒక ప్రముఖ వ్యక్తి కంటే ఒక గొప్ప వ్యక్తి చాలా భిన్నమైన వాడని నా నిశ్చితాభిప్రాయం. ఒక వ్యక్తి సాటి వారికంటే ప్రముఖుడుగా గుర్తింపు పొందడానికి నిజాయితీ, బుద్ధిబలం ఉంటే చాలు. అయితే అతడిని ఒక గొప్ప వ్యక్తి స్థాయికి పెంచాలంటే అది చాలదు. కేవలం ఒక ప్రముఖ వ్యక్తికి ఉన్న వాటికంటే మరేదో ఎక్కువ వుంటేనే ఆ మనిషి గొప్పవాడవుతాడు. ఆ "మరేదో" ఏది? ఇక్కడ, "గొప్ప వ్యక్తి"కి తత్వవేత్త చెప్పిన నిర్వచనం ముఖ్యం. ఒక సాంఘిక ప్రయోజనానికి సంబంధించిన చైతన్య శక్తుల వలన ప్రేరణ పొందినవాడే గొప్పవాడు. అతడే దుష్టుల్ని శిక్షించాలి. సమాజాన్ని క్షాళనం చేయాలి. ఇవే ఒక ప్రముఖ వ్యక్తికి, ఒక గొప్ప వ్యక్తికి మధ్య తేడాలు. ఇవే గొప్ప వ్యక్తికి గౌరవాన్ని సాధిస్తాయి. పూజనీయుణ్ణి చేస్తాయి.

## IV

రెనడే గొప్పవాడా? శారీరకంగా అతడు ఘనుడే. ఒడ్డూ పొడుగూ ఎక్కువ ."యువర్ ఎమినెన్స్" అని సంబోధించడం చేతకాక తన యజమాని కార్డినల్ వైజ్‌మన్‌ని, ఆయన సేవకుడు, "యువర్ ఇమ్మెన్స్" అని సంబోధించాడట. "ఎమినెన్సు" అనేది సంఘంలో గౌరవ స్థానాన్ని సూచించే మాట. "ఇమ్మెన్స్" అనేది శరీర పరిమాణాన్ని సూచించే మాట. రెనడే కూడా "యువర్ ఇమ్మెన్స్" అని సంబోధించ తగినవాడు. ఆయన చాలా సరదా మనిషి. కలుపుగోలు తనమెక్కువ. బహుముఖ ప్రజ్ఞాశాలి. నైతిక లక్షణాలన్నీ మూర్తీభవించిన నిజాయితీ గల వ్యక్తి. కార్లైల్ అభివర్ణించిన నిజాయితీ అది. తెలిసి డంబాలు కొట్టుకొన్న.నిజాయితీ కాదది. అది సహజమైన నిజాయితీ. స్వాభావికంగా కలిగిన నిజాయితీ. స్వతహాగా కలిగిన లక్షణ మది. తెచ్చి పెట్టుకొన్నది కాదు. శారీరకంగానే కాదు, నిజాయితీలోనే కాదు. ధీశక్తిలో కూడా అతడు ఘనుడే. రెనడేకున్న మేధాశక్తిని ఎవరూ ప్రశ్నించలేరు. ఆయన ఒక న్యాయవాదే కాదు; హైకోర్టులో ఒక న్యాయమూర్తే కాదు; ఆయనొక

ప్రథమశ్రేణి అర్థ శాస్త్రవేత్త, ఒక ప్రథమశ్రేణి చరిత్రకారుడు. ఒక ప్రథమ శ్రేణి విద్యావేత్త. ఇంకా ఒక ప్రథమ శ్రేణి దివ్యపురుషుడు. ఆయన ఒక రాజకీయవేత్త కారు. బహుశా అలా కాకపోవడమే మంచిదయింది. ఎందుకంటే ఆయన రాజకీయవేత్త అయిఉంటే బహుశా గొప్పవారు మాత్రం అయి ఉండేవారు కాదు. అబ్రహాంలింకన్ చెప్పినట్లు రాజకీయ వాదులకు ప్రజల ప్రయోజనాలు కాకుండా వేరే ప్రయోజనాలు కొన్ని ఉంటాయి. వారందరినీ ఒక మొత్తంగా చూస్తే నిజాయితీపరులకూ వారికీ మధ్య కనీసం ఒక పెద్ద మెట్టు దూరముంటుంది. రెనడే రాజకీయవాది కాకపోయినా, ఆయన రాజకీయ శాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసినవాడు. పాండిత్యంలో, విజ్ఞతలో, దూరదృష్టిలో అతనితో సరి తూగగల వ్యక్తి భారతదేశ చరిత్రలో మరొకడు దొరకడు. ఆయన నేర్వని విషయం లేదు. ఆయన స్పృశించని విషయమంటూ లేదు. స్పృశించిన విషయాలలో లోతుగా అధ్యయనం చేయనిదీ లేదు. ఆయన అధ్యయనం అపారం. ఆయన అణువణువునా మహాపండితుడు. సమకాలీన ప్రమాణాల ప్రకారమే కాదు, ఏ ప్రమాణాల ప్రకారం చూచినా గొప్పవాడే. నేనింతకుముందు చెప్పినట్లు విడివిడిగా గాని, ఉమ్మడిగా గాని నిజాయితీ, బుద్ధి కుశలతల పునాదుల మీదనే ఆయన గొప్పతనం ఆధారపడి లేదు. ఈ రెండు లక్షణాలు మాత్రమే ఉండి, మరేమీ లేకపోతే రెనడేను గొప్పవాడని అనే వారం కాము. ఆయన ఆశించిన సాంఘిక ప్రయోజనాన్ని బట్టి వాటిని సాధించటానికి ఆయన అనుసరించిన విధానాల్ని బట్టి, ఆయన గొప్పవాడైనాడు. ఆ విషయంలో సందేహానికి ఆస్కారం లేదు. చరిత్ర కారుడుగా కంటె అర్థశాస్త్రవేత్తగా కంటె విద్యావేత్తగా కంటె, సంఘసంస్కర్తగా ఆయన ఎక్కువ ప్రసిద్ధుడు. ఆయన యావత్ జీవితమూ సంఘ సంస్కరణ కోసం నిర్విరామంగా సాగిన మహోద్యమమే. సంఘ సంస్కర్తగా ఆయన నిర్వహించిన పాత్ర మీదనే, గొప్పవాడని ఆయన తెచ్చుకొన్న పేరు, నిలిచి ఉంది. రెనడేకి సంస్కర్తకు కావలసిన భవిష్యత్‌ను దర్శించే శక్తి ధైర్యం రెండూ ఉన్నాయి. ఆయన పుట్టినప్పటి పరిస్థితులు దృష్టిలో పెట్టుకొని చూస్తే ఆయన భవిష్యద్దర్శన శక్తి, ధైర్యం, కంటే తక్కువ సుగుణ మేమీ కాదు ఆయన పుట్టిన కాలాన్ని దృష్టిలో పెట్టుకొంటే, ప్రవక్తకు ఉండదగిన భవిష్యద్దర్శన శక్తి ఆయనకు ఉండడం ఆశ్చర్యం కలిగించకమానదు. నేనిక్కడ 'ప్రవక్త' అనే పదాన్ని యూదుల అర్థంలో వాడాను. రెనడే 1842లో పుట్టాడు. అంటే మరాఠా సామ్రాజ్యాన్ని అంతం చేసిన కిర్కీయుద్ధం జరిగిన 24 సంవత్సరాల తర్వాత, అన్నమాట. మరాఠా సామ్రాజ్య పతనం విభిన్న ప్రజల మధ్య, విభిన్న భావాల్ని రేకెత్తించింది. ఇది జరగటానికి ముందు ఇందుకు సహకరించిన నాటూ లాంటి వారున్నారు. ఇది జరిగిన తర్వాత బ్రాహ్మణ పీష్వాల దుష్టపాలన అంతరించిందని సంతోషపడి ఈ పరిణామానికి తోడ్పడినవారూ ఉన్నారు. అయితే మహారాష్ట్ర ప్రజలలో ఈ సంఘటన పట్ల నిశ్చేష్టులైనవారే అత్యధిక సంఖ్యాకులనడంలో సందేహం లేదు. విదేశీమూకలు యావత్ భారతదేశాన్ని ఒక్కొక్క

ముక్కను లొంగదీసుకుంటూ ఆక్రమించుకొంటున్న దశలో, ఇక్కడ ఈ మహారాష్ట్రలోని ఈ మారుమూల ప్రదేశంలో, స్వేచ్ఛ అంటే ఏమిటో తెలిసి, అంగుళం అంగుళం పోరాడి మైళ్ళకు మైళ్ళను విముక్తం చేసిన ఒక దృఢమైన జాతి ఉండేది. బ్రిటీషు వారి విజయయాత్ర వల్ల వీరు తాము అత్యంత విలువైనదిగా భావించుకొన్నది పోగొట్టుకున్నారు. అందుకు మహారాష్ట్రలోని మహామేధావులు ఎంత కలవరం చెంది ఉంటారో, అక్కడ అన్ని దిశలలోనూ అంధకారం ఎంత దట్టంగా అలముకొని వుండి వుంటుందో ఊహించుకొనవచ్చు. ఇంతటి మహా విపత్తు వల్ల అక్కడ సహజంగా కలిగిన భావోద్వేగం ఏమై ఉంటుంది? నిరాశ, నిస్పృహ, తప్పనిసరి పరిస్థితులకు తలొగ్గడం తప్ప మరెలాంటి భావనలు కలుగుతాయి? మరి రెనడే ఎలా స్పందించారు? ఆయన ఇందుకు భిన్నంగా స్పందించారు. పడినవాడు లేవక మానడని ఆయన ఆశ కలిగించారు ఈ ఆశకు పునాదిగా ఒక కొత్త విశ్వాసాన్ని పెంపొందించారు. ఆయన మాటల్లోనే-

"నా ధర్మానికి చెందిన రెండు అంశాల పట్ల నాకు ప్రగాఢమైన విశ్వాసం ఉంది. మనదైన ఈ దేశమే మహోత్కృష్టమైన దేశం. మనదైన ఈ జాతే మహోత్కృష్టమైన జాతి"

ఆశా విశ్వాసాల ఈ దివ్య సూక్తిని ప్రవచించి ఆయన మిన్నకుండలేదు ఈ ఆశను ఎలా నెరవేర్చుకోవాలా అని ఆలోచన చేశారు. రాగ ద్వేషాలకు అతీతంగా మన పతనానికి కారణాలేమిటని విశ్లేషించడం ఆయన మొదట చేసిన పని. హైందవ సాంఘిక వ్యవస్థలో ఉన్న కొన్ని బలహీనతలు పతన హేతువులనీ, వాటిని తొలగిస్తేనే కాని ఆశయం నెరవేరదనీ గ్రహించారు. కనుకనే నూతన సూక్తులను ప్రవచించి కర్తవ్య బోధ చేశారు అలా సంఘ సంస్కరణ ఆయనకు ముఖ్యమైన జీవిత ధ్యేయం అయింది. సంస్కరణపట్ల అభిలాష పెంచుకొని అందుకోసం ఎన్ని విధాలుగా పాటు పడవచ్చునో, అన్ని విధాలుగాను పాటు పడ్డారు. సభలు పెట్టారు; సందేశాలు అందించారు; ఉపన్యాసాలిచ్చారు; ప్రవచనాలు చేశారు; వ్యాసాలు ప్రచురించారు; ఉత్తరాలు రాశారు; ఇంటర్వ్యూలు జరిపారు; ఎన్నో సంఘాలను ఏర్పాటు చేశారు. చాలా పత్రికలు పెట్టారు. ఇవన్నీ ఎంతో ఉత్సాహంగా చేశారు. ఇన్ని చేసినా ఆయనకు సంతృప్తి కలగలేదు. సంఘ సంస్కరణను ప్రోత్సహించడంకోసం మరింత శాశ్వతంగా నిలిచేటట్లు, మరింత క్రమబద్ధంగా ఉండేటట్లు ఇంకేనైనా చేయాలనుకొన్నారు. అఖిల భారత స్థాయిలో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌కు అనుబంధంగా "సోషల్ కాన్ఫరెన్సు" అనే సంస్థను నెలకొల్పారు. సాంఘిక రుగ్మతలను చర్చించడానికి వాటికి పరిష్కారాలు కనుగొనడానికి ఈ సంస్థ సంవత్సరం సంవత్సరం మహాసభలు జరుపుతూ ఉండేది. ఒక పుణ్యయాత్ర చేసినంత శ్రద్ధగా ఏటా ఆయన ఈ సభలకు హాజరై సంఘ సంస్కరణోద్యమానికి కృషి సాగించారు.

సంఘ సంస్కరణకు పాటు పడడంలో ఆయన గొప్ప ధైర్య సాహసాలు చూపించారు. ఈ మాట విని ఈ తరం వాళ్ళు చాలామంది నవ్వవచ్చు. జైలుకు పోవటాన్ని భారతదేశంలో ఆత్మత్యాగంగా అనుకుంటున్నారు. దేశభక్తిపూరిత చర్యగాను సాహసోపేత చర్యగాను, చూస్తున్నారు ముక్కు మొగం తెలియని మనుష్యులూ, తప్పుడు పనులు చాలాచేసి చివరగా రాజకీయాల్లో దిగిన కొందరు దుష్టులూ, జైలుకుపోయి వీర పురుషులనిపించు కొన్నారు, గొప్ప పేరు ప్రఖ్యాతులు గడించారు. ఇంతకంటే విడ్డూరం మరొకటి ఉండదు. తిలక్ వలెనో, ఆయనతరం నాటి మరికొందరి వలెనో జైలులో నానా కష్టాలు పడివుంటే అనుకోవచ్చు. ఈనాడు జైలు జీవితంలో బాధ లేమీ లేవు. ఇప్పుడది నిర్బంధం మాత్రమే. రాజకీయ ఖైదీలను నేరస్థుణ్ణి చూసినట్లు ఇప్పుడు చూడడం లేదు. వాళ్లను ప్రత్యేకంగా ఒక తరగతిలో ఉంచుతున్నారు. వారనుభవించే బాధలూ లేవు, వారికి పోయే పరువూ లేదు. పడే కష్టాలూ లేవు. దీనికసలు ధైర్యమే అక్కర లేదు. తిలక్ కాలంలోవలె జైలులో అనేక కష్టాల్ని అనుభవించినప్పుడు సహితం ఒక సంఘ సంస్కర్త కంటే తమకు ధైర్యం ఎక్కువని రాజకీయ ఖైదీలు చెప్పుకోవడానికి లేదు. ప్రభుత్వం కంటె సంఘం మనిషిని మరింత రాచి రంపాన పెట్టగలదన్న సంగతి చాలా మందికి తెలియదు. అణిచి వేయడానికి ప్రభుత్వానికంటే సంఘానికి ఎక్కువ అవకాశాలున్నాయి. మార్గాలున్నాయి. ఫలితం గూడా మరింత తీవ్రంగా ఉంటుంది. వెలి వేయటానికి మించిన శిక్ష ఏమి ఉంది? ప్రభుత్వాన్ని సవాలు చేసి కొద్దినెలలో, సంవత్సరాలో జైలు శిక్ష వేయించుకొనే రాజకీయ ఖైదీ, సమాజాన్ని ఎదిరించి సంఘ బహిష్కారాన్ని కొని తెచ్చుకొనే సంఘ సంస్కర్త, ఈ ఇద్దరిలో ఎవరికి ఎక్కువ ధైర్యం కావాలి? సంఘ సంస్కర్త, రాజకీయ దేశభక్తుడు, ఈ ఉభయులూ చూపించే ధైర్యాన్ని అంచనా వేయడంలో మరొక తేడాని కూడా తరచుమరిచి పోతుంటాం. ఒక సంస్కర్త సమాజాన్ని ఎదిరించినప్పుడు అతడి నెవరూ వీరపురుషుడని శ్లాఘించరు. కనీసం పిలిచి ఆదరించేవారు కూడా ఉండరు. ఎక్కడ కంటబడవలసి వస్తుందోనని తప్పించు కొని తిరుగుతారు. ఒక రాజకీయ దేశభక్తుడు ప్రభుత్వాన్ని ఎదిరించినప్పుడు మొత్తం సంఘం అతడికి మద్దతు నిస్తున్నది. అతడిని పొగుడుతారు, అభిమానిస్తారు. తమని ఉద్ధరించిన మహానుభావుడిగా ఆకాశానికెత్తుతారు. ఏకాకిగా పోరాడే సంఘసంస్కర్తా లేక అసంఖ్యాక జన బాహుళ్యం ఛత్రచ్ఛాయలో పోరాడే రాజకీయ దేశభక్తుడా, ఈ ఇద్దరిలో ఎవరు ఎక్కువ ధైర్య సాహసాలు చూపిస్తున్నారు? సంఘసంస్కరణోద్యమాన్ని చేపట్టడంలో రెనడే ధైర్యంగా వ్యవహరించారన్న మాటను కాదనడం వృధా ప్రయాస. నిజానికి ఆయన తగినంత ధైర్యాన్నే చూపారు. ఎంత అసహ్యకరమైన, నీతి బాహ్యమైన, సాంఘిక మత సంప్రదాయాలనైనా పరమ పవిత్రమైనవిగా భావిస్తూ, అవి దైవికం కావేమోననిగానీ నీతి విరుద్ధమైనవేమోననికానీ ప్రశ్నించడం, ధర్మహానిగా మాత్రమే గాక- సహించరాని దైవనిందగా, అపచారంగా భావించిన కాలంలో ఆయన జీవించాడన్నది మనం గుర్తు పెట్టుకోవలసి ఉంది.

## V

సంఘ సంస్కర్తగా ఆయన ఎంచుకొన్న మార్గం నల్లేరు మీద నడక కాదు. దానికి అన్నివైపుల నుండి అడ్డంకులున్నాయి. ఎవరిని సంస్కరించాలని ఆయన అనుకొన్నాడో వారి విశ్వాసాలు అత్యంత ప్రాచీనతలో వేళ్ళు తన్నుకొని ఉన్నాయి. తమ పూర్వీకులకు మించిన తెలివితేటలు మరెవరికీ లేవనీ, వారంతటి ఘనులు మరెవరూ లేరనీ వారు రూపొందించిన సాంఘిక వ్యవస్థే అత్యంత ఆదర్శప్రాయమైనదనీ వారు విశ్వసిస్తూ ఉండేవారు. రెనడే వేటిని సిగ్గుచేటైన విషయాలనీ అపరాధాలనీ అనుకున్నాడో- అవి వారి దృష్టిలో మతం నిర్దేశించిన పరమ పవిత్ర ధర్మాలు. ఇది జన సామాన్యం వైఖరి. మేధావి వర్గంలో రెండు రకాల వారు ఉన్నారు. ఒక వర్గంవారి విశ్వాసాలేమో ఛాందసమైనవి. దృక్పథంలో మాత్రం రాజకీయం లేదు. రెండవవర్గం వారి విశ్వాసాలేమో ఆధునికమైనవి, కాని లక్ష్యాలు, ధ్యేయాలు ప్రాథమికంగా రాజకీయమైనవి. మొదటి వర్గానికి 'చిప్లుంకర్" నాయకుడైతే, రెండవవర్గానికి "తిలక్" నాయకుడు. రెనడేకి వ్యతిరేకంగా ఈ ఇద్దరూ ఏకమై ఎన్ని కష్టాలు సృష్టించడానికి వీలున్నదో అన్నీ సృష్టించారు. సంఘ సంస్కరణోద్యమానికి ఎంత హాని చేయవచ్చునో అంతా చేయడమే కాక, భారత దేశంలో రాజకీయ సంస్కరణోద్యమానికి గూడా చేయగల్గినంత హాని చేశారు. రాజకీయేతరమైన ఛాందస వర్గం ఉందే- వీరికి ఆదర్శాన్ని ఆచరణలోనికి తెచ్చి, ఆచరణలో ఉన్న దాన్ని ఆదర్శం చేయడం అనే 'హెగిల్' సిద్ధాంతం పట్ల విశ్వాసం ఉంది. వారిలా నమ్మటం నాకు తికమకగానే ఉంది. ఏమైనా వారిలా నమ్మి మహాచెడ్డ తప్పు చేశారు. హైందవ మత సాంఘిక వ్యవస్థ ఎటువంటి దంటే- ఆదర్శానికి వాస్తవ రూపం ఇవ్వడానికి నీవు ముందుకు పోలేవు. ఎందుకంటే ఆదర్శమే చెడ్డది. అలాగే యదార్థ స్థితిని ఆదర్శ స్థాయికి పెంచనూ లేవు. ఎందుకంటే ఇప్పుడున్న స్థితి ఘోరాతి ఘోరంగా ఉంది. ఇందులో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు. హిందూమత వ్యవస్థనే తీసుకోండి లేదా హైందవ సాంఘిక వ్యవస్థనే తీసుకోండి. సాంఘిక ప్రయోజనం, సాంఘిక న్యాయం దృక్కోణాల నుంచి పరిశీలించి చూడండి. ఆవిర్భావ దశలో ఏ మతమైనా మంచిదనే అంటారు. కాని హిందూమతం పుట్టుక నుంచే 'చిల్లి నాణెం'. హైందవ ధర్మం నిర్దేశించిన సామాజిక ఆదర్శం హైందవ సమాజాన్ని నిర్వీర్యం చేసింది, దిగజార్చింది. రూపంలో, సారాంశంలో ఇది గ్రీక్ తత్త్వవేత్త నిషే సిద్ధాంతానికి (Nietzschean) అనుగుణంగా ఉంటుంది. నిషే పుట్టటానికి చాలాకాలం ముందే మనువు, నిషే చెప్పదలచు కొన్నది చెప్పేశాడు. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతతలను నెలకొల్పడం కోసం ఉద్దేశించిన మతం కాదిది. అతి మానుషుడిని (superman) అంటే బ్రాహ్మణుడిని హిందూ సమాజంలో మిగతా అందరూ ఆరాధించాలని చెప్పే తత్వమిది. అతి మానుషుడు, ఆతడి వర్గమూ మాత్రమే బతకడానికీ ఏలడానికీ పుట్టారని చెబుతుందీ మతం. మిగతా అందరూ వీరికి సేవ చేయడానికి పుట్టారట. ఇంకేమీ లేదట. వారికి తమదంటూ ఒక

జీవితం లేదట. తాము గూడా మనుషులుగా ఎదిగే హక్కు లేదట. హిందూమతం చెపుతూ వచ్చిన సూక్తులివి. వేదాంతమైన, సాంఖ్యమైనా, న్యాయ వైశేషికాలైనా హిందూతత్వం హిందూమతాన్ని ఏ విధంగానూ ప్రభావితం చేయకుండా స్వీయ పరిధిలో గుడిగుడి గుంచం తిరుగుతూ వచ్చింది. ఈ మాటలను సవాలు చేసే ధైర్యం తత్త్వానికి ఎన్నడూ లేకపోయింది. అంతా బ్రహ్మమయం, అనిచెప్పే తత్త్వం మేథకే పరిమితం అయింది. అది ఏనాడూ సామాజిక తత్త్వంగా మారలేకపోయింది. హిందూ తాత్త్వికులు ఒకచేత తత్త్వాన్ని, మరొకచేత మనుధర్మాన్ని పట్టుకొన్నారు. ఒక చేతిలో ఏమున్నదో, రెండో చేతికి తెలియదు. ఎందువల్ల ఇలా పొంతన లేకపోయిందన్న ఆలోచనే వారికి కలగలేదు.

సాంఘిక వ్యవస్థ విషయానికొస్తే ఇంతకంటే ఘోరంగా ఇంకేమైనా ఉంటుందా? హిందువులు ఆదర్శం అనుకున్న చాతుర్వర్ణ్య వ్యవస్థ దిగజారిపోయి ఇప్పటి కుల వ్యవస్థగా మారింది. పరమ శుంఠలు కాకపోతే ఎవరైనా చాతుర్వర్ణ్య వ్యవస్థ ఆదర్శ ప్రాయమైన దనగలడా? వైయక్తికంగా చూసినా, సామాజికంగా చూసినా ఇది పెద్ద తప్పిదం, నేరం. ఒకే ఒక వర్గానికి చదువుకొనే, నేర్చుకొనే యోగ్యతా? ఒకే ఒక వర్గానికి ఆయుధాలు పట్టే అర్హతా? ఒకే ఒక వర్గానికి వాణిజ్యం చేసుకొనే హక్కా? ఒకే ఒక వర్గం సేవ చేయడమా? ఈ వ్యవస్థ వల్ల ఎవరికేమి నష్టం జరుగుతుందన్నది స్పష్టమే. బ్రతుకు తెరువులేని ఏ పండితుడు చదువును దిగజార్చకుండా ఉంటాడు? చదువు సంస్కారమూ లేని ఏ యోధుడు ధ్వంసకాండకు కాక పరిరక్షణకు తన ఆయుధాలు ఉపయోగిస్తాడు. ఆర్జన మినహా మరో దృష్టి లేని ఏ వర్తకుడు పశువు స్థాయికి దిగజారకుండా ఉంటాడు? ఇక మిగిలిన వర్గం- వీరు చదువుకొన కూడదట. ఆయుధాలు సొంతం చేసుకొనకూడదట. ఇంకెలాంటి బ్రతుకు దెరువు ఏర్పరచుకొనకూడదట. మరి, ఇవేవీ లేకుండా సృష్టికర్త ఉద్దేశించినట్లు మనిషిగా బ్రతకమంటే ఏ సేవకుడికైనా ఎలా కుదురుతుంది? వ్యక్తికి అరిష్టం కలిగేటట్లుంటే సమాజం గాయపడుతుంది. సమాజ వ్యవస్థ నిర్మాణం సాధారణ వాతావరణానికి అనువుగా ఉంటే చాలదు. తుఫానుకు గూడా తట్టుకొనేటట్లుగా ఉండాలి. హైందవ కులవ్యవస్థ దురాక్రమణ అనే గాడ్పులకు, పెనుగాడ్పులకు తట్టుకొని నిలవగలదా? నిలవలేదన్నది సుస్పష్టం. రక్షించుకోవడానికైనా మరొకరి మీదికి దాడికైనా సమాజం తన శక్తులను సమాయత్తం చేసుకొనగలగాలి. దడికట్టినట్లు విద్యలను, బాధ్యతను పంచి కేటాయించినప్పుడు ఇక సమాయత్తం చేయడం ఎలా కుదురుతుంది? హైందవ సాంఘిక వ్యవస్థ ప్రకారం హిందువులలో నూటికి 90మంది- బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు ఆయుధాలు పట్టడానికి వీలులేదు. ముప్పు ముంచుకొని వచ్చినప్పుడు సైన్యాన్ని పెంచకుండా దేశాన్ని రక్షించడం ఎలా? కొందరు తరుచు ఆరోపిస్తున్నట్లుగా, హిందూ సమాజాన్ని అహింసా సిద్ధాంతంతో బలహీన పరిచింది బుద్ధుడు కాదు, హిందూ సమాజం. ఓటమి చెందటానికి క్షీణించటానికి బ్రాహ్మణులు చెప్పిన చాతుర్వర్ణ సిద్ధాంతమే కారణం. హైందవ సమాజంపై సాంఘికంగా

మత సంబంధంగా హిందువులు రూపొందించుకున్న ఆదర్శం, అరిష్టదాయకం అని నేను చెప్పటం కొందరికి బాధ కలిగించవచ్చు. కాని నిజం ఏమిటి? దీనిని ఎవరైనా కాదనగలరా? దగ్గరకు పోవటానికి వీలులేని, నీడ కూడా పడటానికి వీలులేని, చూడరాని, వారంటూ ఎవరైనా ప్రపంచంలో ఏ సమాజంలో అయినా ఉన్నారా? నేరస్థ జాతులున్న సమాజం ఎక్కడైనా ఉంటుందా? బట్టలు వేసుకోవటం కూడా తెలియకుండా అడవుల్లో నివసిస్తున్న ఆదిమ జాతులు ఈనాడు కూడా ఉన్నారే! మరే సమాజంలో అయినా ఇలా ఉంటారా? ఎంతమంది ఉంటారు అలాంటి వారు? వందలా, వేలా? బహుకొద్ది మంది అయితే ఎంత బాగుణ్ణు? విషాదకరమైన విషయం ఏమంటే వారు లక్షోప లక్షల్లో ఉన్నారు.

లక్షలాది మంది అంటరాని వారు, లక్షలాది మంది నేరస్థ జాతులవారు, లక్షలాది మంది ఆదిమ జాతులవారు!! హిందూ నాగరికత అనేది నాగరికతా కళంకమా? ఇది ఆదర్శాన్ని గురించిన మాట. ఇక రెండవ రంగంలోకి అడుగు మోపినపుడు ఉన్న పరిస్థితులను చూద్దాం. మేధావి వర్గం పరిస్థితులతో మొదలు పెడదాం. నాగరికతను పెంచి పోషించటం, దానిని నడిపించటం కేవలం మేధావివర్గం పని. బ్రాహ్మణులు చూపవలసినది దారి. వెనుకటి హిందూ ధర్మ శాస్త్రాల ప్రకారం బ్రాహ్మణులకు మతాధికారి ప్రతిపత్తి ఉండేది. హంతకుడని రుజువయినా అతనిని ఉరి తీయటానికి వీల్లేదు. ఈస్ట్ ఇండియా కంపెనీవారు 1817 దాకా బ్రాహ్మణులను ఇలానే చూశారు. సందేహం లేదు. ఒకప్పుడు పరిస్థితి అంతే. కాని అప్పటి పరిస్థితి ఇప్పుడెక్కడుంది? బ్రాహ్మణుల వృత్తిలో ఘనంగా చెప్పటానికి ఏమీ మిగల్లేదు. అతడు చీడపురుగులాగా మారాడు. సమాజం మీదపడి దండుకోవటం సాగించాడు. మతం పేరిట డబ్బు సంపాదించటం సాగించాడు. బ్రాహ్మణులు బండ్లకొద్దీ సృష్టించిన శాస్త్రాలూ, పురాణాలూ వారికి- పేదరికం, నిరక్షరాస్యత, మూఢ విశ్వాసాలలో కూరుకుపోయిన జన సామాన్యాన్ని వెర్రివాళ్లను చేసి, దగాచేసి దోచుకోవటానికి- ఉపయోగపడ్డాయి. ఇదంతా ఎలా జరిగిందో సోదాహరణంగా చెప్పటం ఈ ప్రసంగంలో సాధ్యం కాదు. బ్రాహ్మణులు తమకున్న హక్కులు, సదుపాయాలను సొమ్ము చేసుకోవటానికి హిందువులకు వ్యతిరేకంగా ప్రయోగించిన కొన్ని నిర్బంధ విధానాలు గురించి మాత్రమే ప్రస్తావించగలను. తెలుసుకోవాలనుకొనేవారు 1795 సంవత్సరం నాటి 21వ శాసన నిబంధన ప్రవేశిక చదవవచ్చు. బ్రాహ్మణుడు ఎవరినుంచి అయినా, ఏదయినా లాగాలనుకున్నప్పుడు, అవతలివాడు దానిని ఇష్టపూర్వకంగా ఇవ్వకపోతే, కత్తితోగాని చాకుతో గాని ఒంటిమీద గాట్లు పెట్టుకోవటమో విషం తాగి చస్తాననటమో ఇంకా ఏవో ఇలాంటి ఇతర ఎత్తులువేసి, తన స్వార్థ ప్రయోజనాన్ని నెరవేర్చు కొనేవాడు. హిందువులను బలవంత పెట్టటానికి బ్రాహ్మణులు ఉపయోగించిన ఇంకా కొన్ని అసాధారణమైన, సిగ్గుమాలిన పద్ధతులున్నాయి. సాధారణమైన ఒక పద్ధతి ఏమంటే తను బలవంతం పెట్టదలుచుకున్న వ్యక్తి ఇంటి ఎదురుగా ఒక గిరిగీసి, గిరిమధ్య కట్టెలు పేర్చి దానిమీద ఒక ముసలామెను ఉంచి తగలబెట్టటానికి సర్వం సిద్ధం చేసినట్టు

అనిపించే వాడు. రెండో పద్ధతి ఏమంటే ఎవరిని బలవంతం చెయ్యాలనుకున్నాడో ఆ వ్యక్తి కనుచూపు మేరలోకి తన ఆడవాళ్లను, పిల్లలను తీసుకువచ్చి వారి తలలు నరకటానికి సిద్ధపడేవాడు. మూడో పద్ధతి ధర్నా. ఎవరిని బలవంత పెట్టదలుచుకున్నాడో అతని గడపల మీద తిండి తినకుండా పడి ఉండటం. ఇదేమంత పెద్ద విషయంకాదు. బ్రాహ్మణేతర స్త్రీలను వెరచటానికి బ్రాహ్మణులు తమకు హక్కు ఉందనటం ప్రారంభించారు. కాలికట్‌కు చెందిన జమొరిన్ కుటుంబంలోను, వల్లభాచార్య సంప్రదాయానికి చెందిన వైష్ణవ తెగల్లోను ఈ అనాచారం ఉండేది. బ్రాహ్మణులు ఎంత అధోగతికి దిగజారారో! బైబిలు చెబుతున్నట్టు ఉప్పుకే ఉప్పదనం పోతే మరి దానికి ఉప్పదనం ఎలా తెచ్చేట్టు? హైందవ సమాజం నైతిక బంధాలు అత్యంత ప్రమాద స్థాయికి జారిపోయాయంటే ఏమీ ఆశ్చర్యం లేదు. ఈ నైతిక పతనాన్ని ఆపటానికి ఈస్ట్ ఇండియా కంపెనీ 1819లో ఒక శాసన నిబంధన (1819 సంవత్సరపు 7వ నిబంధన) తీసుకురావలసి వచ్చింది. ఇల్లాండ్రను, కన్నెపిల్లలను ఎరవేసి వ్యభిచారంలోకి దింపటంకోసం పెద్ద సంఖ్యలో ఆడవాళ్ళను నియమిస్తూ ఉండేవారని ఆ నిబంధన ఉపక్రమణిక చెబుతున్నది. మగవాళ్లు పిల్లలనూ, కుటుంబాలను విడిచిపెట్టి వెళ్ళిపోవటం సర్వసాధారణంగా జరుగు తుండేది. అయ్యో పాపం అని జాలి తలిచేవారుగాని, అదేమని అడిగేవారుగాని లేరు. ఇటువంటి పరిస్థితుల్లో సాంఘిక దురాచారాల పట్ల సమాజం ఆగ్రహించాలనుకోవటం వృధా. నిజానికి బ్రాహ్మణులు తమ ప్రతి తప్పునూ సమర్థించు కుంటూ వచ్చారు. అవే వాళ్ళ బ్రతుకు దెరువులు. లక్షలాది మందిని బానిసలుగా మార్చిన అంటరానితనాన్ని సమర్థించారు. కులాన్ని సమర్థించారు. కులవ్యవస్థకు పట్టుకొమ్మలైన పసి బాలికల వివాహాలను, బలవంతపు వైధవ్యాలను సమర్థించారు. సతీ సహగమనాన్ని సమర్థించారు. పెళ్లిళ్లు చేయలేక కన్నకూతుళ్లను వేలసంఖ్యలో హతమార్చటానికి ఆస్కారం కలిగించిన రాజపుత్రులు సాంఘిక వ్యవస్థను సమర్థించారు. ఎన్ని అవమానాలు! ఎన్ని అపరాధాలు! ఇలాంటి సమాజం నాగరిక జాతులకు ముఖం చూపించగలదా? అసలు ఇలాంటి సమాజం ఎలా బ్రతకాలనుకుంటున్నది? రెనడే అడిగిన ప్రశ్నలు ఇలాంటివి. సమాజాన్ని కాపాడటానికి ఒకే ఒక మార్గమున్నదని ఆయన అనుకున్నారు. అదేమిటంటే తీవ్రమైన సాంఘిక సంస్కరణ.

## VI

రెనడేను తీవ్రంగా వ్యతిరేకించినవారు రాజకీయ వర్గంలోని మేధావులు. ఈ రాజకీయ వాదులు ఒక కొత్త సిద్ధాంతాన్ని లేవదీశారు. ఈ సిద్ధాంతం ప్రకారం సంఘసంస్కరణకు ముందు రాజకీయ సంస్కరణ కావాలి. బొంబాయి హైకోర్టు న్యాయమూర్తి శ్రీ తెలాంగ్ వంటి ప్రముఖ వ్యక్తులు, ఆరితేరిన న్యాయవాదుల పరిపూర్ణ వాదనా పటిమతో వేదిక లెక్కి ఉపన్యాసాలిచ్చారు. ఈ సిద్ధాంతం జనాన్ని ఆకట్టుకున్నది. సంఘసంస్కరణకు ప్రతిబంధకమైన ఒకే ఒక కారణాన్ని చెప్పవలసి వస్తే అది ఈ రాజకీయ సంస్కరణ

నినాదమే! ఇది సమర్థనీయమైన సిద్ధాంతం కాదు. ఇలా వాదించి రెనడే ప్రతికూల వర్గం దేశ ప్రయోజనాలకేమీ మేలు చేయలేదు. న్యాయమూర్తి తెలాంగ్ రాజకీయవాదుల సిద్ధాంతాన్ని సమర్థిస్తూ చేసిన వాదనలు మాత్రం తార్కికంగానే ఉన్నాయి. అయితే తర్కించటం అంటే హేతుబద్ధంగా మాట్లాడటం కాదనీ, సాదృశ్యాలు చూపటం వాదన కాదనీ ఆయన పూర్తిగా మరిచిపోయాడు. రెనడేకి ఉన్నట్టు "సాంఘిక" "రాజకీయ" సంస్కరణల మధ్య ఉన్న పరస్పర సంబంధాల అవగాహన కూడా ఆయనకు లేదు. ఈ సిద్ధాంతానికి ఉన్న కారణాలను పరిశీలిద్దాం. అవతలి వారు చూపిన కారణాలేమో సంతృప్తికరంగా లేవు. అయినా ఉన్న వాటిలో చాలా మంచి కారణాలు అనకొనదగిన వాటిలో అత్యుత్తమమైన వాటిని ఎదుర్కొనటానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఈ దిగువ కారణం నాకు అత్యుత్తమమైనదిగా తోస్తున్నది. అత్యుత్తమమైనదనుకుంటున్న కారణాన్ని తీసుకున్నప్పటికీ ఈ సిద్ధాంతం నిలవటం లేదు. ప్రజల హక్కులను కాపాడాలని కోరుతున్నాం, కనుక రాజకీయాధి కారం కావాలన్న వాదాన్ని మొదట తీసుకుందాం. రాజకీయాలంటే ప్రజల హక్కులకు ఎలాంటి భంగం కలగని రీతిలో ప్రభుత్వం దండనీతిని పాటించే వ్యవహారమే అని చెప్పిన అమెరికా రాజనీతిజ్ఞుడు జఫర్సన్ వాదనలోంచి పుట్టుకు వచ్చిందే ఈ పసలేని వాదం. ఇది గట్టి సిద్ధాంతమే అనుకుందాం. ఇక్కడ ఉత్పన్నమైన ప్రశ్న ఏమంటే, అసలు హక్కులే లేనపుడు వాటిని ప్రభుత్వం కాపాడటం అనే ప్రసక్తి ఎక్కడుంటుంది? దండనీతి ప్రాధాన్యత సంతరించుకొనే ముందు అసలు హక్కులు అనేవి ఉండాలి కదా! హక్కులు అసలు ఏవీ లేని వారిని దండించటం కోసం స్వార్థపూరితమైన హక్కులు ఉన్నవారిని కాపాడటమే ప్రభుత్వ ఉద్దేశం కాకపోతే సంఘ సంస్కరణకు ముందు రాజకీయ సంస్కరణ జరగాలనేది అసంబద్ధమైన వాదం అవుతుంది. ఈ సిద్ధాంతాన్ని సమర్థించు కుంటూ చెప్పదగిన రెండో కారణం ఏమిటంటే, ప్రతి వ్యక్తికీ చట్టరీత్యా కొన్ని ప్రాథమిక హక్కులు ఇవ్వాలనుకున్నారు గనుక రాజకీయాధికారం కావాలనుకున్నారు. మొదట రాజకీయాధికారం ఉంటేనే గాని రాజకీయ హక్కులు ఇవ్వటం కుదరదు. ఈ వాదన బాగానే ఉందనిపిస్తుంది. కాని లోతుగా చూస్తే ఈ వాదనలో ఏదైనా పస ఉందా? అమెరికా రాజ్యాంగంలోను, విప్లవాన్ని సాధించి ఫ్రాన్స్ రూపొందించుకున్న రాజ్యాంగంలోను ప్రాథమిక హక్కుల్ని పొందుపరిచిన తర్వాత మనం ప్రాథమిక హక్కుల ఆలోచనలు చేస్తూ వచ్చాం. ప్రతి ఒక్క వ్యక్తికీ ప్రాథమిక హక్కుల్ని బహూకరించాలనుకోవటం నిస్సందేహంగా ప్రశంసనీయమే. వీటిని ఎలా ఆచరణ సాధ్యం చేస్తామన్నదే ప్రశ్న. హక్కులను ఒకసారి శాసన బద్ధం చేసేస్తే వాటికి రక్షణ ఉంటుందన్నది చాలామంది అనుకుంటున్న మాట. ఇలా అనుకోవటం కూడా సరికాదు. మళ్లీ మనకు అనుభవం నిరూపించినట్టు, హక్కులను చట్టాలు కాపాడవు. వాటిని సంఘ చైతన్యం సమాజ నైతిక బలము మాత్రమే కాపాడతాయి. చట్టం పొందుపరుచుకొనే హక్కులను కాపాడటానికి సంఘ చైతన్యం సిద్ధపడితే అపుడు హక్కులు క్షేమంగా, భద్రంగా ఉంటాయి.

కాని ప్రాథమిక హక్కులను సమాజమే వ్యతిరేకిస్తే ఇక ఏ చట్టమూ, ఏ పార్లమెంటూ, ఏ న్యాయ యంత్రాంగమూ వాటిని కాపాడ లేవు. వాటికి నిజంగా హామీ ఇవ్వలేవు. అమెరికాలో నీగ్రోలకు, జర్మనీలో యూదులకు, భారతదేశంలో అంటరాని వారికి ప్రాథమిక హక్కులు ఉండి ఏమి ప్రయోజనం? బర్క్ అన్నట్టు మహా జనాన్ని శిక్షించే మార్గం దేనినీ, ఎవరూ కనుగొనలేదు. ఇక్కడ మొండి నేరస్థుడు ఒకడో అరో అయితే చట్టం శిక్షించగలదు. చట్టాన్ని ఉలంఘించి తీరాలని కూర్చున్న మొత్తం జనానికి వ్యతిరేకంగా అది ఎన్నటికీ పని చేయదు. కాలరిడ్జ్ మాటల్లో చెప్పాలంటే అవినీతి సోకనిదీ, నిశ్చలమైనదీ, ఆత్మ శాసకమైనదీ అయిన సామాజిక చైతన్యం ఒక్కటే ప్రాథమిక, ప్రాథమికేతర మక్కులన్నింటినీ పరిరక్షించగలదు. అది లేనినాడు మిగతావన్నీ నామమాత్రపు ప్రతిఘటనలే అవుతాయి.

స్వీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకొనే హక్కును ఆధారం చేసుకొని రాజకీయులు మూడవ వాదాన్ని రూపొందించారు. 'మంచి ప్రభుత్వం కన్న స్వీయ ప్రభుత్వం మేలు' అన్నది ప్రసిద్ధమైన వారి నినాదం. సాధారణ నినాదం కంటే దీనికి ఎక్కువ విలువ ఇవ్వవలసిన అవసరం లేదు, కాని స్వీయప్రభుత్వం కూడా మంచి ప్రభుత్వం కావాలని అందరం కోరుకుంటాం. రాజకీయులు మంచి ప్రభుత్వాన్నే కోరుకుంటారనటంలోగాని ప్రజాస్వామిక పద్ధతి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయటమే వారి లక్ష్యం అనటంలో గాని ఎలాంటి సందేహం లేదు. కాని, వారు ప్రజాస్వామ్య పద్ధతి ప్రభుత్వం సాధ్యమా కాదా అని ఆగి ఆలోచించలేదు. చాలా తప్పుడు అభిప్రాయాలను ఆధారం చేసుకొని వారు తమ వాదాన్ని నిర్మించుకున్నారు. ప్రజాస్వామికమైన ప్రభుత్వం ఏర్పడాలంటే అంతకు ముందు ప్రజాస్వామిక సమాజం ఉండి తీరాలి. సామాజిక ప్రజాస్వామ్యం లేకుండా లాంఛన ప్రాయమైన ప్రజాస్వామ్య చట్టాన్ని తెచ్చి పెడితే దానికి విలువ లేకపోగా పనికిమాలినది అవుతుంది. ప్రజాస్వామ్యమంటే ఒకానొక ప్రభుత్వ పద్ధతి కాదన్న సంగతి రాజకీయులు ఎన్నటికీ గుర్తించ లేరు. ప్రజాస్వామ్యం అంటే ప్రధానంగా ఒకానొక సామాజిక స్వరూపం. ప్రజాస్వామిక సమాజం అంటే అంతా కట్టకట్టుకొని ఏకంగా ఉండవలసిన అవసరం లేదు. ఒకేవిధమైన ప్రయోజనాలు కలిగి ఉండాలనీ లేదు. ఫలానా ప్రజా ప్రయోజనాలకు అంతా బద్ధులై ఉండాలనీ లేదు. సానుభూతిని ఇచ్చి పుచ్చుకోవాలనీ లేదు. అయితే అందులో కచ్చితంగా రెండు విషయాలున్నాయి. మొదటిది మానసిక దృక్పథం. అంటే సాటివారిపట్ల గౌరవాన్ని చూపించటం, సమదృష్టితో చూడటం. రెండవది– మనుషుల మధ్య కఠినమైన అడ్డుగోడలు లేని సాంఘిక వ్యవస్థ. కొందరిని దూరంగా ఉంచటం, తమకు మాత్రమే అన్నీ అన్నట్టు ప్రవర్తించటం ప్రజాస్వామ్యంలో పొసగవు, ఇమడవు. వీటి వల్ల కొందరు మాత్రమే బాగుపడి మరికొందరికి అవకాశాలు నిరాకరించినట్టవుతుంది. దురదృష్ట వశాత్తు రెనడే వ్యతిరేకులు ఇందులోని సత్యాన్ని గుర్తించలేక పోయారు.

ఈ వివాదంలో రెనడే తీసుకున్న వైఖరి, ఆయన కార్యాచరణ పథకం రెండూ

కూడా రాజకీయ సంస్కరణకు ప్రాథమిక అవసరాలు కాకపోతే కనీసం మౌలికమైనవనీ సరైనవనీ చెప్పవచ్చు. ఎలా పరీక్షించినా తేలేది ఇదే. మానవుడి నైతిక దృష్టి గుర్తించే హక్కు లేవీ హిందూ సమాజంలో లేవని రెనడే వాదించారు. కొందరికి సుఖపడే హక్కులున్నాయి, కొందరికి అవి అందకుండా అయోగ్యతలు ఉన్నాయి. హక్కులేమో కొద్దిమందికి, అయోగ్యతలేమో అత్యధిక సంఖ్యాకులకు. హక్కులను సృష్టించాలని రెనడే చాల కష్టపడ్డారు. వ్యాధిగ్రస్థమై, అవసానదశకు వచ్చిన హిందూ సమాజంలో చైతన్యాన్ని రగిలించి ప్రాణం పోయాలని రెనడే అనుకున్నారు. నిజమైన సామాజిక ప్రజాస్వామ్యం లేకపోతే రాజకీయాలలో స్థిరత్వంగాని, నిశ్చయత్వంగాని ఉండదు. గనుక దానిని ముందు సృష్టించాలని రెనడే లక్ష్యం పెట్టుకున్నారు. రెండు విరుద్ధమైన దృక్కోణాల మధ్య ఈ సంఘర్షణ తలెత్తింది. జాతి మనుగడకు, రాజకీయ స్వాతంత్ర్యానికి, దృఢమైన నైతిక సూత్రానికి, అత్యంత ముఖ్యమైన ప్రశ్న చుట్టూ ఈ సంఘర్షణ ఆవహించింది. రాజకీయ స్వాతంత్ర్యం కంటె నైతిక బలం ఎక్కువ ముఖ్యమని రెనడే భావించారు. చరిత్రాంశాలు జాగ్రత్తగా తారతమ్య పరిశీలన చేసిన గొప్ప చరిత్రకారుడు లెకీ (Lecky) కూడా ఇదే అభిప్రాయం వ్యక్తపరిచారు. ఆయన నిర్ణయం ఇది.

"ఒక జాతి బల సంపదల పునాది- పవిత్ర గృహ జీవితంలో, వాణిజ్య నీతిలో, నైతిక విలువల ఔన్నత్యంలో, జనహితేచ్ఛలో, ఆడంబరం లేని అలవాట్లలో, ధైర్యంలో, రుజువర్తనలో, మేధనుంచీ, సచ్ఛీలత నుంచీ సమంగా ఉద్భవించే సమర్థ సమతుల్య నిర్ణయాత్మకతలో నిర్మితమవుతుంది. ఒక జాతి భవిష్యత్తు ఎలా ఉంటుందో అంచనా వేయవలసి వస్తే ఈ లక్షణాలు క్షీణిస్తున్నాయా? వృద్ధి చెందుతున్నాయా? అని జాగ్రత్తగా గమనించండి. జన జీవితంలో ఇలాంటి ధోరణులకు విలువ ఉంటుందని జాగ్రత్తగా గమనించండి. సచ్ఛీలతకు ప్రాముఖ్యం పెరుగుతున్నదా? తరుగుతున్నదా? జాతి జీవితంలో అత్యున్నతమైన పదవులు సంపాదించుకున్న వారి గురించి అంచనా వేయగల సామర్థ్యం కలవారు చాటుమాటు సంభాషణలో పార్టీలకు అతీతంగా ఏమని మాట్లాడతారు? అలాంటి ప్రముఖుల విశ్వాసాలలో చిత్తశుద్ధి ఉన్నదా? చెప్పే దొకటి చేసేది ఒకటి కాకుండా ఉంటున్నారా? వేలెత్తి చూపించటానికి వీలు లేనంత నిజాయితీ పరులా? ఇదిగో, ఈ ధోరణులను గమనించటం ద్వారానే ఒక జాతి జాతకాన్ని చెప్పగలుగుతారు".

## VII

రెనడే వివేకవంతుడే కాదు, తార్కికంగా ఆలోచించగలడు కూడా. సాంఘికంగా మితవాదులు గాను, రాజకీయంగా అతివాదులు గానూ ప్రవర్తించవద్దని ఆయన తన ప్రతిపక్షాలకు చెప్పేవారు. స్పష్టంగా పొరపాటుకు ఆస్కారం లేనివిధంగా ఆయన ఇలా హెచ్చరించేవారు.

"మీరు సగంసగం ఉదారవాదులుగా ఉంటామంటే కుదరదు. రాజకీయాల్లోనేమో ఉదార విధానమూ, మత విశ్వాసాలలోనేమో మితవాదమూ అంటే సరికాదు. హృదయగతంగాను, మనోగతంగాను ఒకే విధమైన ఆలోచన చెయ్యాలి. ఒక వంక హృదయ కవాటాలను మూసివేసి, గుండెను బండబారేట్టు చేసి, మరొకవంక మేధకు పదును పెడదామనుకుంటే ఆలోచనలను సుసంపన్నం చేద్దామనుకుంటే, మీ రాజకీయ హక్కులను, అవకాశాలను, విస్తృతపరుచుకుందా మనుకుంటే అది సాధ్యం కాదు. పాలకులనుంచి హక్కులను, అవకాశాలను, సాధించుకొనటానికి ఎంతో కష్టపడి పోరాటం సాగిస్తున్న వారు ఇంకా తమ మూఢ విశ్వాసాలలో, సాంఘిక దురాచారాలలో అలాగే శృంఖలా బద్ధులై పడి ఉండాలనుకోవటం పగటికలే అవుతుంది. అచిర భవిష్యత్తులోనే ఈ కలలు కల్లలు కాకమానవు."

రెనడే పలికిన ఈ పలుకులు నిజ మవ్వటమే కాక భవిష్యవాణిని ఆయన వినిపించి నట్టయింది. కాదనే వారు ఎవరైనా ఉంటే ఆలోచించండి. రాజకీయాలలో నేడు మనం ఎక్కడున్నాం? ఇప్పుడున్న స్థితిలోనే మనం ఉండటానికి కారణం ఏమిటి? జాతీయ కాంగ్రెసు పుట్టి ఇప్పటికి ఏభై ఏళ్లయింది. దాని నాయకత్వం చేతులు మారుతూ వచ్చింది. బుద్ధిమంతుల నుంచి ఉన్మత్తుల చేతుల్లోకి కాని, యదార్థ వాదులనుంచి ఆదర్శవాదుల చేతుల్లోకి కాని నాయకత్వం మారిందని నేను అనటం లేదు. మితవాదుల నుంచి అతివాదుల చేతుల్లోకి పోయిందని మాత్రం నేనంటాను. 50 సంవత్సరాల రాజకీయ పురోగమనం తర్వాత దేశం ఇపుడు ఎక్కడుంది? ఈ ప్రతిష్టంభనకు కారణం ఏమిటి? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటం సులభం. వివిధ మతవర్గాల మధ్య పరిష్కారం లేకపోవటమే ఈ ప్రతిష్టంభనకు కారణం. రాజకీయ పరిష్కారానికి మత పరిష్కారం ఎందుకు అవసరమని ప్రశ్నించుకుంటే రెనడే అనుసరించిన విధానపు మౌలిక ప్రాముఖ్యం తెలిసివస్తుంది. అత్యంత అప్రజాస్వామికమై, ఉన్నతవర్గాలకు మాత్రమే అనుకూలమై, జన సామాన్యానికి వ్యతిరేకమై తీవ్ర వర్గతత్వంతో, అంతే తీవ్రమైన మతతత్వంలో నిండినదైన తప్పుడు సాంఘిక వ్యవస్థలో ఈ ప్రశ్నకు సమాధానం ఉంది. రాజకీయ ప్రజాస్వామ్యాన్ని రాజకీయమైన పునాదులపైనే నిర్మిస్తే అది ఎంతమాత్రమూ ప్రజాస్వామికం అనిపించుకోదు. అందుచేత అగ్రకులస్థులైన హిందువులు తప్పిస్తే మరెవరూ తీవ్రమైన సర్దుబాట్లు జరగకుండా రాజకీయ ప్రజాస్వామ్యం కావాలని అనరు. ఇది బ్రిటిషు ప్రభుత్వం సృష్టించిన ప్రతిష్టంభన అని కొందరు వాదించి సంతృప్తి పడుతుండవచ్చు. తాము మాత్రం హాయిగా ఉండి, బాధ్యతలను ఇతరుల మీద నెట్టి వేయటం కొందరికి ఇష్టం. ఇది పలాయనవాద మనస్తత్వం. మతతత్వ సమస్య తల ఎత్తటానికి కారణమై, ఇండియా రాజకీయాధికారాన్ని సాధించుకోవటానికి ప్రతిబంధకంగా నిలచినది– ఈ సాంఘిక వ్యవస్థలోని లోపాలే, అన్నది సత్యం. నింద బ్రిటిష్ వారిమీద వేస్తే పరిస్థితి మారదు.

కొత్త వ్యవస్థను నిర్మించటం కాకపోయినా పాత వ్యవస్థను క్షాళనం చేయటం రెనడే

లక్ష్యం. హైందవ సమాజం నైతిక స్థితి గతులను మెరుగు పరచాలని ఆయన పట్టుపట్టారు. ఆయన మాటలు ఆలకించి పాటించి ఉంటే వ్యవస్థలోని తీవ్రతలు, కాఠిన్యమూ తొలగి ఉండేవి మతపరమైన పరిష్కారమే అవసరంలేని పరిస్థితులను ఆయన సృష్టించి ఉండలేక పోవచ్చు గాని, ఆయన మాట విని ఉంటే పరిష్కారం సులభ సాధ్యమై ఉండేది. పరిమితమైన ప్పటికీ ఆయన ప్రయత్నాలు పరస్పర విశ్వాసానికి బాటవేసి ఉండేవి. కాని రాజకీయులకు రాజకీయాధికార తృష్ణ ఎంతగా పెరిగిపోయి, వారి దృష్టిని కమ్మివేసిందంటే వారికి మరెందు లోనూ మంచే కనిపించలేదు. ఈ పరిస్థితుల్లో తగిన శాస్తి జరగాల్సిందే అనుకున్నారు రెనడే. సాంఘిక సంస్కరణ అవసరాన్ని కాదన్నందుకు రాజకీయ రక్షణ కల్పించటం అన్నది శాస్తి కాదా?

తాను అంతగా ప్రముఖపాత్ర వహించిన రంగంలో రెనడే సాధించినది ఎంత? ఒక విధంగా అయితే ఈ ప్రశ్న అంత ముఖ్యమైనది కాదు. ఏమి సాధించారన్నది గొప్పతనానికి ఎప్పుడూ నిజమైన కొలబద్ద కాదు. కార్లైల్ అన్నట్టు "ఆదర్శాలకు పూర్తిగా కార్యరూపం ఇవ్వటం అనేది సాధ్యం కాదని మనకు బాగా తెలుసు. అవి అలా దూరంగా ఉండేవే. ఈ దూరం దుస్సహం కాకపోతే అక్కడికి మనం ధన్యులమనే సంతృప్తి చెందవచ్చు". సిల్లర్ ఎంతో బాధతో చెప్పినట్లుగా,మన ఈ సామాన్య ప్రపంచంలో, ఏం కొంచెం సాధించినవాడైనా పరిపూర్ణత అనే కొలబద్దతో కొలవకూడదు. అతనిని తెలివైనవాడిగా మనం గౌరవించవద్దు; నిరాశగా డీలాపడిపోయిన మూర్ఖుడిగానే చూద్దాం. అయినా రెనడే సాధించినది బొత్తిగా ఏమీ లేకపోలేదు. రాయ్‌బహదూర్ పి. ఆనందచార్లు, సంఘసంస్కరణపై తయారుచేసిన నివేదిక ప్రకారం అప్పటి సంస్కర్తలు ఎదర్కొన్న సమస్యలు ఐదు. అవి (1) బాల్య వివాహాలు (2) విధవా పునర్వివాహాలు (3) మన దేశస్థులు విదేశాలకు ప్రయాణించటానికీ, అక్కడ ఉండటానికీ స్వేచ్ఛ, (4) స్త్రీలకు ఆస్తిహక్కు, (5) స్త్రీలకు చదువు. ఈ కార్యక్రమాలలో ఆయన చాలా భాగం సాధించారు. అన్నింటినీ సాధించలేక పోయారంటే అందుకు ఆయన ఎన్నో ప్రతిబంధకాలను ఎదుర్కొన వలసి రావడం కారణమని మరచిపో కూడదు. పూర్వాచారాలను సమర్థిస్తూ రెనడేతో పోరాడటానికి కొందరు సిద్ధపడ్డారు. వారందరూ తెలివైన వాళ్లూ దృఢచిత్తులూ, నిజాయితీ లేని వాళ్లూ.ఆ దృశ్యాలు ఉత్తేజకరంగా ఉండేవి. హెూరా హెూరీ పోరాటంలో వలె ఉద్రిక్తపూరిత దృశ్యాలు కనిపిస్తుండేవి. సంఘ సంస్కరణ లపై దేశంలో ఈ వివాదం చెలరేగినప్పటి కాలపరిస్థితిని ఇప్పుడు చెప్పాలంటే కుదరదు. సంఘ సంస్కర్తలపై సనాతనులు వేసిన అపనిందలను, తిట్టిన తిట్లను, పన్నిన వ్యూహాలను చెప్పాలంటే సభ్యత అడ్డు వస్తుంది. వయసురాని ఆడపిల్లలతో సంభోగాన్ని నిషేధించడానికి ఉద్దేశించిన బిల్లును వ్యతిరేకించడం లో సనాతనుల వాదనలను సమర్థిస్తూ రాసిన రాతలను చూస్తుంటే ప్రజానాయకులనబడే వాళ్లు ఎంతగా పతనమై పోయారో సులభంగా అర్థమవుతుంది. పన్నెండు సంవత్సరాల వయస్సు రాని భార్యతో లైంగిక సంపర్కం

చేసిన భర్తను శిక్షించడం ఈ బిల్లు ఉద్దేశం. మతి ఉన్నవాడెవడైనా, సిగ్గూ లజ్జా ఉన్న వాడెవడైనా ఇంత చిన్న విషయాన్ని వ్యతిరేకిస్తాడా? కాని, వ్యతిరేకించారు. మతి మాలిన సనాతనవాదం దెబ్బంతా రెనడే భరించవలసి వచ్చింది. పోనీండి, రెనడే సాధించినవన్నీ చిన్నవే అనుకొందాం. ఆయన వైఫల్యానికి, ఇంకా ఎక్కువ సాధించనందుకు గర్వపడేదెవరు? పొంగిపోయే దెవరు? ఇందులో విర్రవీగిపోవలసిన కారణమేమీ లేదు. సంఘ సంస్కరణ తిరోముఖం పట్టడం అనేది చాలా సహజమైన విషయం. సంఘ సంస్కరణ పట్ల ద్వేష పూరిత వైముఖ్యం చాలా ఎక్కువగా ఉంది. మరొకవంక రాజకీయాధికారం ఆకర్షణ బలంగా ఉంది. ఫలితంగా సంఘ సంస్కరణకు ప్రయత్నించేవారు క్రమంగా తక్కువ అవుతూ వచ్చారు. కొంత కాలానికి సంఘ సంస్కరణ వేదికమీద ఒక్కరూ మిగల లేదు. అంతా ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌లో చేరిపోయారు. సంఘ సంస్కర్తల మీద రాజకీయవాదులు ఘనంగా నెగ్గారు. అది గర్వించ దగిన విజయమంటే ఇప్పుడెవరూ ఒప్పుకొనరని నా నమ్మకం. అది ముమ్మాటికీ దుఃఖపడవలసిన విషయం. రెనడే మొత్తం మీద, గెలిచిన పక్షం వైపు ఉండి ఉండకపోవచ్చు. కాని, ఆయన తప్పుచేసిన పక్షం వైపు మాత్రం లేరు. ఆయన ప్రత్యర్థులలో కొందరివలె తప్పు చేసిన పక్షంవారిలో ఆయనలేడన్నది నిశ్చయం.

## VIII

ఇతరులతో పోలిస్తే రెనడే ఎలాంటివాడు? పోలికలు ఎప్పుడూ బాధాకరంగానే ఉంటాయి, అయిష్టంగానే ఉంటాయి. పోల్చి చెప్పడాన్ని మించి ఇంకా స్పష్టంగా ప్రకాశ మానంగా చెప్పడానికి మరొక మార్గం లేదన్నది కూడా నిజం. ఐతే, ఆసక్తిదాయకం కావడానికి, సుబోధకం కావడానికి ఒకే విధమైన వారినే పోల్చాలన్నది కూడా మనసులో పెట్టుకొని తీరాలి. అదృష్టవశాత్తూ ఇక్కడ పోల్చదగిన వారున్నారు. రెనడే సంఘ సంస్కర్త. సంఘ సంస్కర్తగా ఆయనను ఇతర సంఘ సంస్కర్తలతో పోల్చడం సముచితంగా ఉంటుంది. ముఖ్యంగా రెనడేను జోతిబా ఫూలేతో పోల్చడం విజ్ఞానదాయకంగా ఉంటుంది. ఫూలే 1827లో పుట్టి 1890లో కాలం చేశారు. రెనడే 1842లో పుట్టి 1901లో పోయారు. అలా ఫులే, రెనడే సమకాలికులు. ఉభయులూ అగ్రగాములైన సంఘ సంస్కర్తలు. రెనడేను ఇతర రాజకీయ వాదులతో పోల్చడంలో విజ్ఞత లేదని కొందరు అభ్యంతర పెట్టవచ్చు. రెనడే ఒక రాజకీయ వాది కాదనుకొన్నప్పుడే ఇలా అభ్యంతరపెట్టడం జరుగుతుంది. రెనడే రాజకీయ వాది కాదనడం రాజకీయవాది, అనే పదానికి అతి సంకుచిత మైన, అత్యంత పరిమితమైన అర్థాన్ని ఆపాదించడమవుతుంది. రాజకీయవాదికి రాజకీయాలొక్కటే వ్యాపకం కాదు. రాజకీయ పద్ధతీ, సిద్ధాంత భాగం– ఈ రెండిటితో కూడిన మార్గం ఆయనది. పద్ధతిలోనూ, సిద్ధాంతభాగంలోనూ ఒక విలక్షణత కలిగిన రాజకీయ మార్గానికి ఆయన నిర్దేశకుడు. ఈ అర్థంలో రెనడే ఒక రాజకీయవాది. ఆయనను ఇతర రాజకీయ వాదులతో పోల్చడం ఉపయోగకరమే అవుతుంది. నిజానికి సమయం, అభిరుచులదే ప్రశ్న.

సంఘ సంస్కర్తలతోటి, రాజకీయ వాదులతోటి కూడా విస్తృతంగా పోల్చాలంటే సమయం చాలదు. సంఘ సంస్కర్తలతో, రాజకీయ వాదులతోనా ఎవరితో పోల్చాలన్నది నేను తేల్చుకోవాలి. ఇది అభిరుచికి సంబంధించిన విషయం. నా మట్టుకు నేను ఎంచుకోవలసి వస్తే నాకున్న సమయాన్ని రెనడే, ఫూలేలను పోల్చడానికే వినియోగించి ఉండేవాడిని. ఎందుకంటే రాజకీయ సంస్కరణ కంటె సంఘ సంస్కరణ మరింత మౌలికమైనదని నేననుకొంటున్నాను. దురదృష్టవశాత్తు నా అభిరుచి వేరు, శ్రోతల అభిరుచి వేరు. శ్రోతలను నిలిపి ఉపన్యాసం వినిపించేటప్పుడు, నా వాటికంటె వారి ఇష్టాయిష్టాలను బట్టే నేను పోవలసి ఉంటుంది. సంఘ సంస్కరణోత్సాహం చల్లబడిపోయింది. భారత ప్రజానీకం రాజకీయ వ్యామోహం గుప్పిటలో చిక్కుకుపోయారు. రాజకీయాలు ఆకలి పుట్టించే ఆహార పదార్థాలై పోయాయి. వీటిని రుచి చూస్తున్న కొలదీ ఇంకా తినాలని అనిపిస్తుంది నేను చేస్తున్న పని అనాహ్లాదకరమైనది. అయినా సాహసం చేస్తున్నానంటే అందుకు కారణం రెనడే రాజకీయ సిద్ధాంతాల విలువ ఏమిటో, ఈ నాటి రాజకీయవాదులలో ఆయన స్థానం ఏమిటో నిజంగా తెలుసుకోవాలన్న ప్రజా వాంఛను నెరవేర్చటం కోసం విషయాన్ని పూర్తిగా వివరించి చెప్పడం నా విధి కనుకనే.

రెనడేతో పోల్చదగిన ఈనాటి రాజకీయ వాదులెవరు? తన కాలంలో రెనడే గొప్ప రాజకీయవాది. కనుక ఆయనను ఈనాటి చాలా గొప్ప రాజకీయవాదులతో పోల్చాలి. భారత దిక్చక్రంలో ఇద్దరు మహా వ్యక్తులు ఉన్నారంటే- పేర్లు చెప్పకపోయినా వారు గాంధీ, జిన్నాలని గుర్తుపట్టగలంత గొప్ప వ్యక్తులు. వారెలాంటి చరిత్రను నిర్మిస్తారన్నది ముందుతరాలవారు చెప్పవలసిన విషయం. మనకు సంబంధించినంతవరకు వారు పతాక శీర్షికలకు ఎక్కుతుంటారన్నది, నిర్వివాదాంశం. వాళ్ల చేతుల్లో పగ్గాలు ఉన్నాయి. ఒకరు హిందువులకు నాయకుడు. మరొకరు ముస్లిములకు నాయకుడు. ప్రస్తుతం వారు విగ్రహ మూర్తులు, కథానాయకులు. రెనడేను వారితో పోల్చాలనుకొంటున్నాను. రెనడేతో వారు ఎలా సరిపోలతారు? ఇందుకుమనకు సుపరిచితమైన వారి మనస్తత్వాలను గురించి, పద్ధతులను గురించి కొంత పరిశీలన చేయడం అవసరం. వారిని గురించి మంచో చెడో నా అభిప్రాయాలను మాత్రమే నేను చెప్పగలను. వారిలో మొట్టమొదటగా నాకు కనిపించేదేమిటంటే అమితమైన వారి ఆత్మస్తుతి పరత్వం. అంతటి స్వార్థం ఉన్న మరో ఇద్దరు మనకు కనిపించరు. తాము పైకి ఎగబాకడమే వారికి కావలసింది. దేశ ప్రయోజనం వారికి ఒక సాధనం మాత్రమే. భారత రాజకీయాలను వారుభయులూ సొంత తగాదాగా మార్చుకొన్నారు. పర్యవసానాలేమైనా వారికి భయం లేదు. ఏది జరిగినా అవి వారికి పట్టదు. ఫలితాలు పొడగట్టి నప్పుడయినా కారణాలు వారికి జ్ఞాపకం రావు. జ్ఞాపకం వచ్చినా నిర్లిప్తంగా తోసిపారేసి తిరుగుతారు గనుక వారికి పశ్చాత్తాప బాధ కలగదు. చుట్టూ గిరిగీసుకొని ఎవ్వరికీ అందకుండా బ్రహ్మాండంగా ఉండగలరు. సరిసమానులు సైతం దగ్గరకు రాకుండా

ఒకవేళ దగ్గరికి రానిస్తే తమకంటె తక్కువ వాళ్లను మాత్రమే రానివ్వడానికి ఇష్టపడతారు. ఎవరైనా విమర్శిస్తే బాధపడి పోతారు. విమర్శను వినే సహనం ఉండదు. కుక్కల్లా కాళ్ళ దగ్గర పడుండి స్తోత్ర పాఠాలు చెపుతుంటే మహదానంద పడతారు. ఉభయులూ గొప్ప రంగస్థల నైపుణ్యం పెంపొందించుకొని, ఎక్కడికి వెళ్ళినా అందరి దృష్టి తమ మీదనే ఉండేటట్లు ఏర్పాట్లు చేసుకొంటారు. ఇద్దరిలో ప్రతి ఒక్కరూ తామే సర్వోన్నతులమంటారు. ఈ సర్వాధిక్య స్థితి ఒక్కటే వారు చెప్పుకొంటున్నదైతే అదేమంత ఆశ్చర్యం కాదు. అందరిలోకీ అధికులమని చెప్పుకోవడమే గాక తాము తప్పులకు అతీతులమని గూడా వారు చెప్పుకొంటారు.

"పయస్ IX పోప్‌గా ఉన్న కాలంలో పోప్ తప్పులు చేయడన్న సిద్ధాంతం బలంగా ఉండేది. 'నేను పోప్ కాక మునుపు పోప్ తప్పుచేయడన్న సిద్ధాంతాన్ని నమ్మేవాడిని. పోప్ అయిన తరువాత ఇప్పుడది అనుభ విస్తున్నాను' అని ఆయన అన్నారు. ఈ ఇద్దరు నాయకులు సరిగా ఇలాగే అనుకొంటున్నారు. దేవుడు ఏమరుపాటుగా ఉన్న ఏ క్షణంలోనో పొరపాటున ఈ ఇద్దరినీ మనకు నాయకత్వం వహించడానికి పంపించి ఉంటారు. తామే అందరికంటె అధికులమని, తప్పులేమీ చేయమనీ వీరిద్దరికీ ఉన్న అభిప్రాయానికి పత్రికలు బలం చేకూర్చాయి. ఈ మాట అనక తప్పదు మరి. నార్త్‌క్లిఫ్‌బ్రాండు జర్నలిజాన్ని వర్ణించడానికి గార్డినర్ ఉపయోగించిన భాష మన దేశంలో జర్నలిజం ఇప్పుడున్న స్థితిని వర్ణించడానికి సరిగా సరిపోతుంది. ఇండియాలో జర్నలిజం ఒకప్పుడు వృత్తిగా ఉండేది ఇప్పుడది వ్యాపారంగా తయారైంది. సబ్బులు తయారు చేయడం ఎలాంటిదో ఇదీ అలాంటిదే. అంతకుమించిన నైతిక ధర్మం ఏదీ ఇందులో లేదు. ప్రజలకు హితవు చెప్పవలసిన బాధ్యత తమకు ఉన్నదని పత్రికలు అనుకోవడం లేదు. ఉద్దేశమేదో పెట్టుకొని వార్తలకు రంగు పులమకుండా ఉండటం, పబ్లిక్ పాలసీ సంబంధంగా సమాజానికి మేలు చేస్తుందని తాము నమ్మిన అభిప్రాయాన్ని వ్యక్తం చేయడం, భయపడకుండా ఎంత పెద్ద స్థానంలో ఉన్నవారినైనాసరే, తప్పుమార్గం పట్టినా, నిరర్థకమైన పనిచేసినా దిద్దుబాటుచేసి మందలించడం వంటివి తన ప్రథమ లేదా ప్రధానమైన కర్తవ్యంగా ఇండియాలో జర్నలిజం అనుకోవడం లేదు ఫలానావాడు వీర పురుషుడని ఒప్పుకోవడం, అతడిని ఆరాధించడం, జర్నలిజం ముఖ్యవిధి అయిపోయింది. ఈ పరిస్థితిలో వార్తలకు బదులు సంచలనం చోటు చేసుకొంటున్నది. హేతుబద్ధమైన అభిప్రాయాలకు బదులు, హేతు విరుద్ధమైన మనో వికారానికి చోటు కలిగిస్తున్నది. బాధ్యత కలిగిన వారి ఆలోచనలను ప్రభావితం చేయడానికి బదులు, బాధ్యతా రహితులైన వారిని ఉద్రేక పరుస్తున్నది. నార్త్‌క్లిఫ్ జర్నలిజాన్ని లార్డ్ శాలిస్బరీ "ఆఫీసు పనిపిల్లలు, ఆఫీసు పనిపిల్లలకోసం రాసే రాతల"న్నాడు. మన దేశంలో జర్నలిజమూ అంతే. అంతకంటే అధ్వాన్నం కూడా. తాము ఆరాధించే నాయకులు అంతటివారనీ, ఇంతటి వారనీ కీర్తిస్తూ, తప్పెటకొట్టే డబ్బారాయుళ్ళ రాతలు ఇప్పటి జర్నలిజం.

నాయకారాధన ప్రచారం కోసం ఇంత బుద్ధిహీనంగా దేశ ప్రయోజనాలను త్యాగం చేయడం ఇదివరకెన్నడూ లేదు. వీర పురుషారాధన ఇంత గుడ్డిగా ఇండియాలో ఇంతకు ముందెన్నడూ చూసి ఎరుగం. ఈ విషయంలో గౌరవంగా మినహాయించదగిన సందర్భాలు కొన్ని ఉన్నాయని చెప్పడానికి సంతోషంగా ఉంది. కాని వారి సంఖ్య బహు తక్కువ. వాళ్ల గొంతు ఎప్పుడూ వినిపించదు. పత్రికల మెచ్చుకోళ్ల వెనుక పదిలంగా ఉండి, ఈ ఇద్దరు మహావ్యక్తులు ప్రదర్శించిన పెత్తందారీ ధోరణి అన్ని పరిధులూ దాటిపోయింది. వీరు తమ పెత్తందారీతనంతో తమ అనుచర వర్గాలను బెంబేలెత్తించి, రాజకీయాలను గందరగోళం చేశారు. తమ పెత్తందారీ తనంతో సగంమంది అనుచరులను దద్దమ్మలను చేశారు; సగం మందిని ఆత్మవంచకులను చేశారు. తమ ఆధిక్యాన్ని ప్రతిష్ఠించుకోవడంలో 'బడా వ్యాపారస్తుల' 'ధనాఢ్యుల' సహాయాన్ని తీసుకొన్నారు. మనదేశంలో మొదటిసారిగా డబ్బు ఒక సమీకృత శక్తిగా రంగంలో ప్రవేశిం చింది. అమెరికా ప్రజల ఆలోచన కోసం ప్రెసిడెంట్ రూజ్వెల్ట్ ప్రతిపాదించిన ప్రశ్నలు, ఇదివరకే ఉత్పన్నమై ఉండకపోతే, ఇక్కడ ఉత్పన్నమవుతాయి. పరిపాలించేదెవరు? సంపదా, మనిషా? దారిచూపే దెవరు? ధనమా, మేధస్సా? ప్రజారంగంలో పదవులను అధిష్ఠించే దెవరు? చదువుకొన్న, దేశభక్తి కలిగిన స్వతంత్ర వ్యక్తులా పెట్టుబడిబలం కలిగిన సంస్థానా ధీశులా? ప్రస్తుతానికి భారత రాజకీయాలు, హిందువులకు సంబంధించి నంతవరకైనా ఆధ్యాత్మికం కావడానికి బదులు విపరీతంగా వ్యాపారమయమై పోయాయి. ఎంతగా ఎలా మారిపోయాయంటె రాజకీయాలంటే అవినీతికి మారుపేరై పోయింది. రాజకీయాలు దుస్సహ దుర్గంధ భరితమై, అపరిశుభ్రత గూడు కట్టుకొన్న ఒక విధమైన మురికి కూపమై పోయాయి. రాజకీయవాది కావడం అంటే మురుగుకాలవలో పని చేయడానికి పోవడమే.

ఈ ఇద్దరు మహాపురుషుల చేతుల్లో రాజకీయాలు వికార ప్రదర్శనల పోటీ అయింది. గాంధీని 'మహాత్మా' అంటే, జిన్నాని 'కాయిదే అజిం' (Qaid-I-Azim) అనవలసిందే. గాంధీకి కాంగ్రెస్ ఉంటే, జిన్నాకు ముస్లింలీగ్ ఉండాలి. కాంగ్రెస్‌కు వర్కింగ్ కమిటీ, ఆలిండియా కాంగ్రెస్ కమిటి ఉంటే, ముస్లిం లీగ్‌కూ ఒక వర్కింగ్ కమిటి ఉండాలి, ఒక కౌన్సిల్ ఉండాలి. కాంగ్రెస్ మహాసభ జరిగితే వెనువెంటనే లీగ్ సభ జరగాలి. కాంగ్రెస్ ఒక ప్రకటన చేసిందంటే, దాని వెంటనే లీగ్ ప్రకటన వస్తుంది. ఒకవేళ కాంగ్రెస్ 17,000 పదాలతో ఒక తీర్మానం చేసిందనుకొంటే లీగ్ కనీసం మరొక వెయ్యి పదాలు వేసి తీర్మానం చేస్తుంది. కాంగ్రెస్ అధ్యక్షుడు పత్రికా గోష్ఠి పెడితే ముస్లింలీగ్ అధ్యక్షుడూ పత్రికా గోష్ఠి పెడతాడు. కాంగ్రెస్ ఐక్యరాజ్య సమితికి ఒక విజ్ఞాపన పంపాలనుకొంటే, ముస్లింలీగ్ అందులోనూ వెనక పడగూడదనుకొంటుంది. ఇదంతా ఎప్పుడు ఆఖరవుతుంది? పరిష్కారం జరిగేదెన్నడు? సమాధానం దరిదాపుల్లో కనిపించడం లేదు. ఏవేవో విపరీతమైన షరతులు పెట్టకుండా అసలు వారు కలవనే కలవరు. తాను హిందువునని గాంధీ ఒప్పుకొని తీరాలంటారు జిన్నా. ముస్లిం నాయకులలో తానూ ఒకడినని జిన్నా ఒప్పుకొని తీరాలి అంటారు గాంధీ.

ఈ ఇద్దరు భారత నాయకులలో కనిపించేటంత రాజనీతిజ్ఞతాదారిద్ర్యం ఇంత ఘోరంగా మునుపెన్నడూ లేదు. ప్రతీదీ కాదంటూ, ఏదీ ఒప్పుకొనకుండా, వంతు ప్రకారం సమయాన్న నుసరించి మాట్లాడే లాయర్ల మాదిరి అంతూ పొంతూలేని సుదీర్ఘ ప్రసంగాలు చేస్తారు. ప్రతిష్ఠంభన తొలగించడం కోసం ఏదైనా పరిష్కారం సూచిస్తే ఎప్పుడూ "కాదు" అనే సమాధానమే చెపుతారు. ప్రస్తుతానికి ఇది పనికొస్తుందేమో చూడమని ఏదైనా పరిష్కారాన్ని సూచిస్తే ఇద్దరిలో ఎవరూ పరిశీలించడానికైనా ఒప్పుకోరు బ్యాంకింగ్ పరిభాషలో చెప్పాలంటే వారుభయుల మధ్య, రాజకీయ కార్యకలాపం "స్తంభించి"పోయిందనీ చెప్పాలి. రాజకీయంగా ఏపనిచేయడానికీ వీలులేని పరిస్థితి ఏర్పడిందనీ చెప్పాలి

ఈ యిద్దరితో పోలిస్తే రెనడే ఎలాంటి వాడనిపిస్తారు? సొంతంగా నేనేమీ చెప్పలేను. ఇతరులు ఏమి చెప్పారో చదివి ఆయన ఎలాంటి వాడనిపించి ఉంటాడో చెప్పగలను. ఆయనకు ఇసుమంత అహంభావం కూడా ఉండేది కాదు. మేధ ద్వారా ఆయన సాధించిన విజయాలను బట్టి ఆయన ఎంతటి గర్వోన్నతి చెందినా– కాదు– అహం పెంచుకొన్నా చెల్లుబాటయి ఉండేది. శ్రద్ధావంతులైన యువకులు ఆయన విద్వత్తునీ, మృదు స్వభావాన్నీ చూసి ముగ్ధులయ్యేవారు. చాలామంది ఆయనకు పూర్తిగా వశులైపోయి, ఉన్నతిని కలిగించే ఆయన ప్రభావానికి స్పందించి, తమ ఆరాధ్య గురువుపట్ల ప్రగాఢభక్తి భావంతో తమ జీవితాలను సంపూర్ణంగా తీర్చిదిద్దుకొన్నారు. బుద్ధిహీనుల స్తోత్ర పాఠాలు ఆయనకు తృప్తి నిచ్చేవి కావు. తనకు సమానులైన వారితో తిరగడానికి అలా తిరిగేటప్పుడు అవసరమైన ఇచ్చిపుచ్చుకొనే ధోరణిలో వ్యవహరించడానికీ ఆయన వెనుకాడే వాడు కాడు. అంతర్వాణి మీద ఆధారపడే మహాత్ముడనని ఆయన ఎన్నడూ చెప్పుకోలేదు. హేతువు ద్వారా అనుభవం ద్వారా తన అభిప్రాయాలను పరీక్షకు పెట్టడానికి సిద్ధపడిన హేతువాది ఆయన. ఆయన గొప్పతనం స్వతస్సిద్ధమైనది నాటకంలోవలె ఆయనకు రంగస్థలాన్ని సిద్ధంచేసి ఉంచవలసిన అవసరం లేదు. తెచ్చిపెట్టుకొన్న విపరీత లక్షణాలు అవసరం లేదు. ఎవరి డబ్బు ఆసరాతోనో నడిచే పత్రికా సాధనాలూ అక్కర లేదు. నేను చెప్పినట్లు రెనడే ప్రధానంగా సంఘ సంస్కర్త. రాజకీయాన్ని వ్యాపారంగా చేసుకొనే అర్థంలో ఆయన రాజకీయవాదికారు. అయినా, ఆయన భారత రాజకీయ పురోగమనంలో ఒక ముఖ్యపాత్ర నిర్వహించారు. గణనీయమైన విజయాలను సాధించి, తమ ప్రజ్ఞతో విమర్శకులను అచ్చెరు వొందించిన కొందరు రాజకీయ వేత్తలకు ఆయన గురువు. కొందరికి ఆయన మార్గదర్శి. కాని, అందరిపట్ల ఆయన తత్వజ్ఞుడుగా వ్యవహరించేవారు.

రెనడే రాజకీయతత్వం ఏమిటి? మూడు సిద్ధాంతాలుగా దీనిని సంక్షిప్తీకరించవచ్చు.

1) కేవలం ఊహాజనితమైన దానిని మనం ఆదర్శంగా పెట్టుకొనకూడదు. ఆదర్శం ఆచరణ సాధ్యం అన్న హామీని నెరవేర్చేదై ఉండాలి.

2) రాజకీయాలలో మేధ కంటె, సిద్ధాంతం కంటె ప్రజల ఇష్టాయిష్టాలూ, మనస్తత్వాలూ మరింత ముఖ్యం. రాజ్యాంగానికి రూపకల్పన చేసే విషయంలో ఇది మరీ ముఖ్యం. కట్టుకొనే గుడ్డలు ఎలా అభిరుచికి సంబంధించినవో రాజ్యాంగమూ అలాగే అభిరుచికి సంబంధించినది. రెండూ సరిపోవాలి, నచ్చాలి.

3) రాజకీయ సంప్రతింపులలో ఏది ఆచరణ సాధ్యం అన్నదే నియమంగా ఉండాలి. అంటే, అవతలివారు ఇస్తామన్నదానికెల్లా సంతృప్తి పడమని అర్థం కానేకాదు. మీ ఆంక్షలు ఎదుటివారికి తప్పనిసరై, వారిని ఒప్పుకొనేలా చేయడానికి చాలలేదని తెలిసినప్పుడు అవతలివారు ఇస్తానన్న దానికి తిరస్కరించవద్దని మాత్రమే అర్థం.

రెనడే రాజకీయ తత్త్వంలో ఈ మూడూ ముఖ్య సిద్ధాంతాలు. ఆయన రచనల నుంచి ఉపన్యాసాలనుంచి ఈ సిద్ధాంతాలకు తగిన ఉదాహరణ లివ్వడం సులభం. రెనడే ప్రసంగాలను, రచనలను అధ్యయనం చేసిన ప్రతి ఒక్కరికీ ఇవి సుస్పష్టమే గనుక ఉదాహరణలు ఇవ్వవలసిన అవసరమూ లేదు. అందుకు సమయమూ లేదు. ఈ మూడు సిద్ధాంతాల మీద రెనడేతో ఎవరు తగాదా పడతారు? తగాదా పెట్టుకుంటే దేనిమీద పెట్టుకొంటారు? మొదటి దానిమీద ఎవరో గొంతెమ్మ కోర్కెలు కోరేవారు మాత్రమే పేచీ పెట్టుకొంటారు. అలాంటి వారిని మనం పట్టించు కొనవలసిన అవసరం లేదు. రెండవ సిద్ధాంతం ఎంత ప్రత్యక్షంగా అనుభవమవుతున్నదంటే దాన్ని అలక్ష్యం చేయడం అంటే కోరి కీడు తెచ్చుకోవడమే అవుతోంది. మూడవదాని మీద అభిప్రాయభేదం ఉండవచ్చు. నిజానికి కాంగ్రెస్ వాదుల నుంచి ఉదారవాదులను చీల దీసినది ఇదే. నేను ఉదారవాదిని కాను. కాని, రెనడే అభిప్రాయం సరైనదని నేను నిశ్చయంగా అనుకొంటున్నాను. సిద్ధాంతాల విషయంలో రాజీ పడటానికి వీల్లేదు. రాజీ పడకూడదు. కాని, సిద్ధాంతాన్ని ఒకసారి ఒప్పేసుకొన్న తరువాత, దానిని అంచెలంచెలుగా ఆచరణలోకి తీసుకొని రావడానికి ఎలాంటి అభ్యంతరం ఉండవలసిన పని లేదు. రాజకీయాలలో క్రమపద్ధతి అనివార్యం. ఈ సూత్రానికి ఒప్పుకొన్నప్పుడు దానివల్ల జరిగే కీడు ఏమీలేదు. అంతేగాక, కొన్ని పరిస్థితులలో మేలే జరగవచ్చు. ఈ మూడవ సిద్ధాంతం మీద రెనడేకూ, తిలక్‌కూ మధ్య నిజంగా పెద్ద అభిప్రాయభేదమేమీ లేదు. ఒక్క విషయంలో తప్ప. నైతిక ఒత్తిడుల ద్వారా ఎంతవరకు రాబట్టడానికి వీలైతే అంతవరకు రాబట్టాలంటారు తిలక్. అలాంటి ఒత్తిడులు అంటేనే పెడమొగం పెడతారు రెనడే. ఇంతే. మిగతా అన్నింటిమీద వారిది ఏకాభిప్రాయమే. రెనడే రాజకీయతత్త్వంలో నైతిక ఒత్తిడులు తెచ్చే విధానం లేనంతమాత్రాన ఆయన రాజకీయతత్త్వపు విలువను చిన్నచూపు చూడవలసిన పనిలేదు. మనం తీసుకురాగల ఒత్తిడులు ఏమున్నాయో మనందరికీ తెలుసు. పాతవీ, కొత్తవీ అన్నీ ప్రయత్నించి చూశాం. ఫలితం గురించి ప్రత్యేకంగా ఇక్కడ అభివర్ణించనవసరం లేదు.

రెనడే జయంతిని జరుపుకొనేప్పుడు విమర్శకులూ, వ్యతిరేకులూ ఏమేమి అనడానికి అవకాశం ఉన్నదో గమనించకుండా ఉండలేము. రెనడే జయంతి ఉత్సవాన్ని ఎందుకోసం జరుపుకొంటున్నట్టు అని విమర్శకులు అడగవచ్చు. వీరారాధనరోజులు ఎప్పుడో పోయాయని వారు వాదిస్తారు. గాంధీ విషయంలోనూ, జిన్నా విషయంలోనూ వ్యక్తిపూజ కూడదని ఖండించే నేను రెనడే ఆరాధకులలో ఎలా చేరానని నా వ్యతిరేకులు ప్రశ్నిస్తారు. ఇవి అడిగి తీరవలసిన ప్రశ్నలే. నిజమైన వీరారాధన నశిస్తున్నది. ఆ విషయంలో సందేహం లేదు. తన యుగం మీద కోపతాపాలు చూపించిన కార్లైల్ జీవిత కాలంనాటికే నాయకారాధన నశిస్తుండేది. ఆయన ఇలా ఆక్రోశించారు –

"మహాపురుషులనేవారు ఉన్నారంటేనే ఒప్పుకోని యుగం ఇది. మహాపురుషుల ఆవశ్యకతను కాదంటుంది ఇది"

ఆయన ఇంకా ఇలా అన్నారు. "మన విమర్శకులకు ఒక మహావ్యక్తిని చూపించండి. వాళ్ళ భాషలో అతడి చిట్టా లెక్కలన్నీ వాళ్లు చెపుతారు. ఆరాధించడం కోసం కాదు, అతడి ఒడ్డూ పొడుగూ తేల్చి చెప్పటానికే".

కాని, భారతదేశంలో మాత్రం వీరారాధన చావలేదు. ఆరాధనలో ఇండియా అంతటి దేశం మరొకటి లేదు. మతంలో ఆరాధన ఉంది. రాజకీయాలలో ఆరాధన ఉంది. దురదృష్టమే అయినా భారత రాజకీయ జీవితంలో వీరపురుషులనేవారు ఉండటమూ, వారిని ఆరాధించడమూ కూడా కాదనడానికి వీలులేని వాస్తవం. వీరారాధన భక్తుడిని భంగపరుస్తుందనీ, దేశానికి ప్రమాదకరమనీ నేను ఒప్పుకొంటాను. మీరు ఎవరినైనా ఆరాధించే ముందు అతడు నిజంగా గొప్పవాడని తెలుసుకో వలసిందని హెచ్చరించడం వరకే విమర్శ ఆంతర్యమైతే, అలాంటి విమర్శను నేను ఆహ్వానిస్తాను. దురదృష్టవశాత్తూ ఇది అంత సులభంగా జరిగే పనికాదు. ఎందుకంటే పత్రికలు చేతిలో ఉన్నప్పుడు గొప్పవాళ్లను భారీయెత్తున ఉత్పత్తిచేసేయవచ్చు. చారిత్రక మహాపురుషులను వర్ణించడానికి కార్లైల్ ఒక మంచి పదప్రయోగం చేశాడు. వాళ్లను 'బ్యాంకునోట్లు'గా చెప్పవచ్చునన్నాడు. బ్యాంకు నోట్ల మాదిరివారు స్వర్ణ సమానులన్నమాట. మనం చేయవలసినదల్లా అవి దొంగనోట్లు కాకుండా చూసుకోవడమే. మహావ్యక్తులను ఆరాధించే విషయంలో ఇంకా జాగ్రత్తగా ఉండాలంటే నేనొప్పుకొంటాను. ఎందుకంటే, మనదేశంలో 'జేబు దొంగలుంటారు జాగ్రత్త' అని హెచ్చరికలు రాసిన బోర్డుల ప్రక్కనే "గొప్పవాళ్లుంటారు జాగ్రత్త" అని రాసిన బోర్డులు పెట్టుకోవలసిన దశ వచ్చింది. గొప్పవాళ్లను ఆరాధించడాన్ని సమర్థించిన కార్లైల్ కూడా తన పాఠకులను ఇలా హెచ్చరించాడు–

స్వార్థపరులు, నకిలీ మనుషులు చాలామంది చరిత్రలో గొప్ప మనుషులుగా ప్రత్యక్షమయ్యారు. స్వార్థపరులైన గొప్పవాళ్లుగా చెలామణి అయిన ఇలాంటి వారే లోకం చేత

నీరాజనాలు పట్టించుకొంటారు వీరి వల్ల లోకానికి జరిగే మేలు ఏమీ ఉండదు. మహాపురుషులు గతించారు. కపట నాయకులు రంగం మీదకు వస్తున్నారు".

మహాత్ములుగా దైవత్వ స్థాయిలో గౌరవాలను అందుకొంటున్న ఈనాటి మహా నాయకుల వలె రెనడే ఎప్పుడూ ఆరాధనలను అందుకొనలేదు. ఎలా అందుకొంటాడు? ఆయనేమీ సెనాయ్ (Senai) నుంచి తాజాగా దైవ సందేశాన్ని మోసుకొని రాలేదు. మహాద్భుతాలు చేయలేదు, అరచేతిలో వైకుంఠాన్ని చూపించలేదు. ఆయన మహామేధో సంపన్నుడూ కాదు, మానవాతీత లక్షణాలను చూపించనూలేదు. చూపకపోతే పోయాడు కాని నష్టం మాత్రం చేయలేదు. వైకుంఠాన్ని సంప్రాప్తింప చేయలేకపోయినా, మహా విపత్తును మాత్రం తీసుకొని రాలేదు. భారత దేశ సేవలో మానవతా లక్షణాలు చూపించకపోయినా, వాటిని దుర్వినియోగపరచి భారతదేశాన్ని దుంపనాశనం చెయ్యలేదు. మహామేధావి కాకపోవచ్చునుగాని అతితెలివి చూపించీ, మౌలికంగా నిజాయితీ లేని వైఖరిని ప్రదర్శించీ, తద్వారా అపనమ్మకపు బీజాలను నాటి, పరిష్కారం దుష్కరం కావించలేదు. రెనడేలో అతిశయమూ లేదు, ఆడంబరమూ లేదు.

అతివాది పాత్ర వహించి చౌకబారు పేరు సంపాదించుకోవడానికి ఆయన ఒప్పుకోలేదు. ప్రజలలో నాటుకొని ఉన్న దేశభక్తి భావాలను ప్రకోపింపజేసిగాని, వాడుకొని గాని, ప్రజలను తప్పుదోవ పట్టించలేదు. మొరటైన పద్ధతులకూ, ఘనంగా కనిపిస్తూనే ఫలితం ఇవ్వని పద్ధతులకూ ఆయన అంగీకరించలేదు. పొరపాట్లకు, మోసాలకు తావులేనివా అంటే 'కావు' అని చెప్పక తప్పని కొన్ని పద్ధతులు ఉంటాయి. అయినా వాటిని పాటిస్తూ, దీక్షాపరులూ, నిజాయితీపరులు అయిన దేశ సేవకుల నడుములు విరగ్గొట్టి, ఇకవారు మరేమీ చేయలేని పరిస్థితి కల్పించే పద్ధతులను పాటించటంలో ఆయన భాగస్వామికాలేదు. తానెంతో సమర్థుడననిపించుకోవడానికీ ప్రదర్శనకూ ఏవేవో చమత్కారాలు చేసేవాడిలాగా కాదు, ఆయన సముద్రమధ్యంలో నౌకను భద్రంగా అనుకొన్న రేవుకు చేర్చే నావికునిలాంటివాడు రెనడే. ఒక్కముక్కలో చెప్పాలంటే రెనడే దొంగనోటు లాంటివాడు కాదు. ఆయనను ఆరాధించేటప్పుడు ఏదో మోసపూరితమైనచోట సాగిలపడుతున్నామనే భావన మనకు కలగదు.

రెండవ విషయ మేమిటంటే రెనడే జన్మదినం జరుపుకోవడమంటే ఎవరో ఒక మహాపురుషుడిని ఆరాధించడం కాదు; అంతులేని అభిమానాన్ని చూపించుకోవడం. మహాపురుషుల ఆరాధన వేరు; ఒక మహాపురుషుడు చెప్పినట్లల్లా నడుచుకొనడం వేరు. మొదటి దానిలో తప్పేమీ లేదు. కాని, రెండవది నిస్సందేహంగా అత్యంత హానికరమైనది. మొదటిది మహోన్నతమైన దనుకొన్న ప్రతిదానిపట్లా, అవన్నీ మూర్తీభవించాయనుకొన్న గొప్పవ్యక్తి పట్లా మనిషి గౌరవం చూపించడం అవుతుంది. కాని తరువాతది దుష్టపాత్ర చూపించే స్వామిభక్తి లాంటిది. మొదటిది గౌరవానుగుణమైనది. రెండవది నీచలక్షణం. మొదటి

దానివల్ల ఆలోచించేశక్తిపోదు. ఏదైనా చేయడానికి ఒకరికి ఉన్న స్వేచ్ఛను అది ఎక్కడికీ తీసికొనిపోదు. కాని, తరువాతది ఉన్నదే అది మనిషిని అన్నివిధాలా బుద్ధిహీనుని చేస్తుంది. మొదటి దానివల్ల దేశానికి కలిగేనష్టం ఏమీ లేదు, రెండవ దానివల్ల తప్పనిసరిగా ప్రమాదం వాటిల్లుతుంది. ఒక ముక్కలో చెప్పాలంటే రెనడే జయంతిని జరుపుకోవటంలో మనం ఎవరూ ఎన్నుకొనని, ఎవరికీ జవాబుదారీ కాని, ఎవరూ తొలగించరాని ఒక పెత్తందారుని మాత్రం ఆరాధించడంలేదు. ఒక నాయకుడికి అభిమానంతో నివాళులర్పిస్తున్నాము. ఆ నాయకుడు జనాన్ని పశువుల మందను తోలినట్టు తోలినవాడుకాడు, వారికి నాయకత్వం వహించినవాడు. ఆ నాయకుడు జిత్తుల ద్వారానో, హింసా కాండ ద్వారానో తన సొంత ఆలోచనలను జనంమీద రుద్దినవాడు కాడు; జనం ఆలోచించి చేసిన నిర్ణయాలను అమలులోకి తీసుకొని రావాలని ఆశించినవాడు.

మూడవ విషయమేమిటంటే ఇక్కడ జరుగుతున్న సమావేశం వీరపుజకోసం కాదు. రెనడే రాజకీయతత్త్వాన్ని మనం జ్ఞాపకం చేసుకొంటున్న సందర్భమిది. ఆయన రాజకీయ తత్త్వాన్ని మనం అప్పుడప్పుడు జ్ఞాపకం చేసుకొంటుండటం అవసరమని నాకు తోస్తున్నది. ఎందుకంటే ఆయన తత్త్వం భద్రమైనదీ, సమర్థవంతమైనదీ. కాస్త నెమ్మదిగా ఫలితానికి రావచ్చునేమోగాని ఫలితం తప్పకుండా ఇస్తుంది. మెరవక పోవచ్చునేమోగాని అది నిజంగా బంగారమే. ఎవరికైనా సందేహమా? ఉంటే, బిస్మార్క్ ఏమన్నాడో, బాల్ఫర్ ఏమన్నాడో, మోర్లీ ఏమన్నాడో చదివి ఆలోచించమనండి. "పరిస్థితులను బట్టి పని చేసుకొని పోయే క్రీడే రాజకీయాలు" అని గొప్ప జర్మన్ రాజనీతిజ్ఞుడైన బిస్మార్క్ అన్నాడు.

ఇంగ్లాండ్ రాజ్యాంగంపై వాల్టర్ బేగ్‌హాట్ సుప్రసిద్ధ గ్రంథానికి పీఠికలో బాల్ఫర్ అన్నాడిలా :-

"మధ్య యుగాల రాజరిక వ్యవస్థ క్రమంగా ఆధునిక ప్రజాస్వామ్యంగా మారింది. ఈ సుదీర్ఘ పరిణామం ఎంతో తక్కువ విధ్వంసంతో ఎంతో ఎక్కువ మార్పును తెచ్చింది. దీనికి నిజమైన మూలం ఏమిటో తెలుసుకోవాలంటే ఇందుకు సంబంధించిన మేధనూ, సిద్ధాంతాన్నీ గాక, గుణాన్ని, స్వభావాన్ని పరిశీలించవలసి ఉంది. బ్రిటిష్ వ్యవస్థ ఏకమొత్తంగా అనుసరించాలని కోరేవారు ఈ సత్యాన్ని గుర్తిస్తే మంచిది. అలాంటి ప్రయోగంలో ప్రమాదాలు కలగకమానవు. రాజ్యాంగాలను అనుకరించవచ్చు, గుణాలను అనుకరించటం కుదరదు. ఎరువుతెచ్చుకొన్న రాజ్యాంగమూ, స్థానికుల స్వభావమూ ఒకదాని కొకటి పొసగకపోతే, అతకని ఆ వ్యవస్థల వల్ల తీవ్ర దుష్ఫలితాలు కలుగుతాయి. ఈ దృష్టితో చూస్తే చాలా ముఖ్యమైన ఈ లోపాలు ఉన్నప్పుడు, ప్రజలలో మరెన్ని సద్గుణాలున్నా అవన్నీ నిరుప యోగమే అవుతాయి. ఉదాహరణకు – తమలో, ఎవరి విధేయతలు ఎలాంటివో, విధేయతలు ఎవరిని ఎలా నడిపిస్తున్నాయో అంచనా వేసుకొనే శక్తి లేకపోతే, స్వేచ్ఛను అనుభవించాలనే

సహజ వాంఛా, చట్టం పట్ల సహజ గౌరవమూ లేకపోతే, సంతోషాంతరంగులు కాకపోతే, మోసాలను సహించేవారైతే, ఎప్పుడు ఎలా సమాధాన పడాలో తెలియనివారైతే, తర్కరాహిత్యం చూసి అప్పుడప్పుడు తప్పుగా నిర్ణించుకొనే అతితీవ్ర నిర్ణయాల పట్ల అపనమ్మకం లేకపోతే, అవినీతి వారిని వికర్షించకపోతే, తమలోని చీలికలు అసంఖ్యాకమై, అలవిమాలిన లోతులకుపోతే బ్రిటిష్ వ్యవస్థలు మనకు విజయవంతంగా పనిచేయడం అసాధ్యమవుతుంది. చేసినా చాలా కష్టంగా పని చేస్తాయి. పార్లమెంటరీ సంప్రదాయాలను పాటిస్తూ, ఒకరు మరొకరిని ఒప్పించే కళలూ, పార్టీని నిర్వహించుకునే చాకచక్యమూ, అత్యున్నతమైన, పరిపూర్ణమైన స్థాయికి చేరినప్పుడు సైతం, బ్రిటిష్ వ్యవస్థలు పనిచేయడం సాధ్యం కాకపోవచ్చు. మోర్లీ ఇలా అన్నాడు -

"తార్కికంగా చాలా బాగుంది గనుక వెంటనే అలా చేసేద్దామని తొందరపడటం అంటే రాజకీయవాది తాను వ్యవహరించవలసిన సంఘ నిర్మాణ వ్యవస్థలో మూల పదార్థాన్ని గురించిన అజ్ఞానాన్ని బయట పెట్టుకోవటమే ఆలోచనలోగాని, వ్యవస్థలోగాని మౌలికం కానట్టి ఏమార్పునైనా ఏవగించుకోవడం మూర్ఖత్వమవుతుంది. సాధ్యమైనంత మాత్రాన తరచు అలాంటి మార్పులు చేయాలనుకోవడం తెంపరితన మవుతుంది గొప్ప సంస్కరణ లకు చిన్న సంస్కరణలవల్లనే అత్యధికహాని కలుగుతుందని దారుణమైన ఫ్రెంచి సూక్తి ఒకటి ఉంది. చాలామంది సాధారణంగా అర్థం చేసుకొనే పద్ధతిలో చూస్తే అది సంఘ వినాశం కలిగించేసూత్రం."

రాజకీయాలలో విజయం ఈ ధర్మాలమీదనే ఆధారపడి ఉంటుంది రెనడే ప్రవచించిన సూత్రాలకంటె అవిభిన్నమైనవా? బిస్మార్క్ కంటె, బాల్ఫోర్ కంటె, మోర్లీ కంటె ఎన్నో సంవత్సరాల ముందు ఈ విషయాలు చెప్పడం రెనడే ఘనతను చాటుతున్నది

రెనడేను మార్గదర్శిగా, స్నేహితుడుగా, తత్త్వప్రదాతగా స్వీకరించిన ఆయన తరం వారు తెలివైనవారు. ఆయన గొప్పతనం ఎక్కడ ఉన్నదంటే ఇప్పటి తరానికే కాదు, భావితరాలకుసైతం ఆయన మార్గదర్శి, స్నేహితుడు, తత్త్వప్రదాత కాగలగడంలోఉంది

రెనడే మీద తరచు ఒక నింద వేస్తుంటారు దాన్ని ఖండించవలసిన అవసరం ఉందనుకొంటున్నాను ఇండియాను బ్రిటిష్‌వారు జయించడం దైవికమనీ, అది ఇండియా మహద్భాగ్యమనీ బ్రిటిష సామ్రాజ్యంలో ఉండటమే ఇండియాకు గొప్ప అదృష్టమవుతుందనీ రెనడే విశ్వాసమున్నట్టు చెప్తుతారు. ఒక ముక్కలో చెప్పాలంటే ఇండియా స్వాతంత్ర్యానికి రెనడే వ్యతిరేకి అని ఆయనపై నింద

రెనడే చెప్పిన ఈ క్రింది మాటలను బట్టే ఆయనపై ఈ నిందవేశారు

"భారతీయ జాతులకు ఎక్కడెక్కడ లోపాలు ఉన్నాయో అక్కడల్లా వాటిని

తొలగించి, ప్రజలకు శక్తినీ, సకలసంపదనూ పెంపొందించడం విధి నిర్ణయం కాకపోతే, ఇండియాలోని ఇంతటి జనబాహుళ్యం శతాబ్దాల కాలం పరదేశీయుల అధీనంలో ఉంటూ, వారి ప్రభావాలకు లోనవుతూ, వారు పెట్టే నిర్బంధాలను భరిస్తూ ఉండేవారని ఒకంతట అనుకోలేము. ఒకటి మాత్రం ఖాయంగా చెప్పగలం. ఐదువందల సంవత్సరాలకుపైగా సాగిన మహమ్మదీయ సామ్రాజ్యం అంతరించి, పంజాబ్‌లో, మధ్య హిందూస్తాన్‌లో, దక్షిణ భారతంలో పూర్వస్వదేశీ జాతులు లోగడ మహమ్మదీయ విజేతలు దండయాత్రలకు వచ్చినప్పటికంటె, ఎంతో దృఢమైన పునాదులపై, తిరిగి ఆధిపత్యాన్ని నెలకొల్పుకొన్నారన్న విషయం మనకు ఖాయంగా తెలుసు

"ఒక పద్ధతి, క్రమం ప్రకారం నడచుకోవాలనే అభిలాష; నియమబద్ధమైన అధికార వ్యవస్థలో వ్యక్తమయ్యేకొన్ని సద్గుణాలూ హిందువులలోనూ లేవు; మహమ్మదీయులలోనూ లేవు. స్థానిక సంస్థలకు స్వేచ్ఛగా పనిచేసే అవకాశం కల్పించడంలో, పౌరజీవితానికి కావలసిన సద్వర్తనలో యంత్రశక్తి వినియోగ నైపుణ్యాన్ని పెంపొందించుకోవడంలో విజ్ఞానంలో పరిశోధనలలో సాహసోపేతంగా కొత్త విషయాలను కనుగొనడంలో ఉభయులకూ అనురక్తి లేదు. కష్టాలను ఓర్చి, వాటినుంచి బయటపడాలన్న దృఢ నిశ్చయంలో, స్త్రీత్వాన్ని గౌరవించే వీరలక్షణంలో ఉభయులూ వెనుకబడే ఉన్నారు. ప్రాచీన హైందవ నాగరికతగాని, ప్రాచీన మహమ్మదీయ నాగరికతగాని, భారత దేశంలోని జాతులను, పశ్చిమ యూరప్ దేశాల జాతులతో సమాన స్థాయికి పెంచే విధంగా ఈ మంచి లక్షణాలను పెంపొందించే స్థితిలో లేదు. కాగా, ఇందుకు అవసరమైన విద్యాకృషిని తిరిగి మొదలెత్తుకొనవలసి వచ్చింది బ్రిటిష్ సంరక్షణలో గత శతాబ్దికాలంగా ఇప్పుడు అదే జరుగుతున్నది.. ఫలితాలను మనకు మనమే ప్రత్యక్ష సాక్షులుగా చూస్తున్నాం."

ఈ వివరణలను ఒక్కసారి అలా చూస్తేనేచాలు, ఆయనపై వేసిన నింద వీటిని తప్పుగా అర్థం చేసుకొనడం వల్లనో, పొరపాటు అవగాహనవల్లనో వేసినదని తెలిసిపోతుంది. ఈ వివరణలు స్పష్టంగానూ, సులభంగా అర్థమయ్యేవిగానూ ఉన్నాయి. భారత స్వాతంత్ర్యానికి రెనడే వ్యతిరేకి అయి ఉండవచ్చునని అనుకోవడానికి కూడా ఆస్కారం లేదు. ఆ విధంగా ఆయనపై నింద అసత్యమైనదీ, నిరాధారమైనదీ.

రెనడేచేసిన ఈ ప్రకటనలు ఆయన ఆత్మగౌరవానికి మచ్చ తెచ్చేవి కాకపోగా ఆయన విజ్ఞతను, ముందు చూపును సూచిస్తున్నాయి. ఈ ప్రకటనల ద్వారా ఆయన చెప్పదలచుకొన్న దేమిటి? నాకు అర్థమైనంతలో, రెనడే రెండు విషయాలను చెప్పాలను కొన్నారనిపిస్తున్నది. ఆయన చెప్పదలచుకొన్న మొదటి విషయమేమిటంటే బ్రిటన్ ఇండియాను జయించడం వల్ల ఇండియాకు తన ఆర్థిక, సాంఘిక వ్యవస్థలను పునర్ నిర్మించుకొనడానికి, పునరుద్ధరించుకొనడానికి, మరమ్మత్తులు చేసుకొనడానికి సమయం,

అవకాశం, సంరక్షణ లభించాయి. రెనడే చెప్పదలచుకొన్న రెండవ సంగతేమిటంటె, ఆలోచనలో, అనుభూతిలో ఒక్కటై, ఒకే జాతిగా సంఘటితమై, అందరిదీ ఒకే గమ్యమన్న అవగాహన కలిగినట్టు నమ్మకం కుదరకముందే, బ్రిటిష్ సామ్రాజ్యంనుంచి ఇండియా బయట పడటమంటే స్వాతంత్ర్యంపేరిట అరాచకాన్ని, విచ్ఛిత్తిని కొనితెచ్చుకోవడమే అవుతుంది.

ఈ నిజాలు ఎంత ముఖ్యమైనవి? ముందుకు పోదలచుకొన్న ఏ సమాజంలోనైనా అనివార్యమైన సాంఘిక ఆర్థిక, రాజకీయ సంఘర్షణలను నెమ్మదిగా పరిష్కరించేసుకోవడంలో ఒకరి సంరక్షణలో ఉండడం ఎంత అవసరమో జనం గుర్తించడం లేదు. 'పార్లమెంటరీ సంస్థలు ఇంగ్లాండ్‌లో ఎందుకు వర్థిల్లుతాయి. యూరప్‌లో అవి ఎందుకు వేళ్లూనడం లేదు'? అని కీర్తి శేషుడు ప్రొఫెసర్ మెయిట్‌లాండ్‌ను ఎవరో అడిగారు. ఆ తేడా ఇంగ్లీష్ ఛానల్ వల్ల వచ్చిందని ఆయన బదులిచ్చాడు. ఈ జవాబు ద్వారా ఆయన చెప్పదలచుకొన్న దేమిటంటే ఇంగ్లీష్ ఛానల్ వల్ల విదేశీ దురాక్రమణలనుంచి ఇంగ్లాండ్‌కు రక్షణ కలిగింది. ఇలా రక్షణ కలిగిన సమయంలో ఇంగ్లాండ్ తన రాజకీయ వ్యవస్థను బాగు చేసుకొన్నది. స్వేచ్ఛకోసం రాజ్యాంగ వ్యతిరేకంగా పోరాడటంలో ప్రజకు భద్రత కలిగింది. ప్రజలకు స్వేచ్ఛ ఇవ్వడంలో రాజకీయ భద్రత కలిగింది. ఇలాంటి ప్రాపు, ప్రాముఖ్యాన్ని గురించి అబ్రహాం లింకన్‌గూడా నొక్కి చెప్పారు. అమెరికన్ రాజకీయ సంస్థలను ఎలా శాశ్వతంగా మననీయగలుగుతున్నారో వివరిస్తూ ఒక ప్రసంగంలో ఆయన ఇలా అన్నారు.

"యూరప్, ఆసియా, ఆఫ్రికా ఖండాల దేశాల సైన్యాలన్నీ కట్ట కట్టుకొని... ఒ వెయ్యేళ్లుతంటాలుపడినా ఒక బోనపార్టీ సేనాధిపతిగా, బలవంతంగా ఓహియోలో ఒక గుక్కెడు పానీయం సేవించలేరు. బ్లూరిడ్జ్ శిఖరం మీదకు ఒక్కసారి అలా వెళ్లిరాలేరు."

సాంఘిక పునర్ నిర్మాణంకోసం ప్రాపు అవసరాన్ని, ప్రాముఖ్యాన్ని గురించి కూడా లింకన్ ఈ వాక్యంద్వారానొక్కి చెప్పాడు. ఇంగ్లాండ్‌లాగా, అమెరికాలాగా ఇండియా ఇలా ప్రాపు ఉన్నదేశం కాదు. ఇటు నుంచి అటు దాకా పరచినట్లున్న ఇండియా, బాట మీద ఉన్నట్టే ఉంటుంది – ఆ బాటనేలమీద మార్గంకావచ్చు; ఆకాశ, జలమార్గాలూకావచ్చు. తనకు ప్రాపు లేదు గనుక, తనునుతాను సరిచేసుకొంటున్నప్పుడు బయటినుంచి దాడి జరిగితే దేశం ముక్కలు చెక్కలవుతుందని భయం. తనను తాను సరిచేసుకొంటున్నంత సేపూ అవసరమైనప్పుడు నీటిని తోడి పారబోసి నౌకలకు మరమ్మతులు చేసుకొనే "డ్రెడాక్" లాంటి సౌకర్యం కావాలి. అది ఇండియాకు కావలసిన ప్రాపు. బ్రిటిష్ సామ్రాజ్యం ఇవ్వగలిగిన, మనకు ఎంతో అవసరమైన అలాంటి ప్రాపు ప్రాముఖ్యాన్ని మనసులో పెట్టుకోవలసిందిగా తన దేశస్థులను కోరిన రెనడే వివేకి కాదని ఎవరు అనగలరు?

బానిస దేశం కట్టుతాడును తెంపుకొని స్వాతంత్ర్యాల ప్రకటించుకోవాలని సదా ఆరాటపడుతూనే ఉం... అలా స్వాతంత్ర్యం వచ్చిన తరువాత జరిగేదేమిటని కాస్త

ఆగి ఎప్పుడూ ఆలోచించరు. మరి అలా ఆలోచించడం చాలా ముఖ్యం. భృత్యదేశాన్ని పెత్తందారీ దేశానికి బంధించి ఉంచే తాడు పెత్తందారీ దేశం కంటె భృత్యదేశానికే ఎక్కువ అవసరమని చాలా సందర్భాలలో పలువురు గుర్తించరు. భృత్యదేశం ముక్కలు ముక్కలుగా ఉండవచ్చు. ఎలాంటి ముక్కలంటే అవన్నీ తిరిగి ఒక్క ముక్క కావడం ఎన్నటికీ జరగదు. ఇప్పుడు అవన్నీ ఏకఖండం కాకపోయినా, అలా పట్టి ఉంచితే కొంతకాలానికి ఏకమయ్యే అవకాశం ఉండవచ్చు. తాడు తెగగొట్టడం వల్ల భృత్యదేశంలో పని జరుగు తుందన్నది ఆ దేశం ఆంతరంగిక పరిస్థితులను బట్టి ఉంటుంది. ఏకఖండమైన ఒక భృత్య దేశం దాస్య శృంఖలాన్ని ఛేదించుకొంటే అంతామంచే జరగవచ్చు. భాగాలు భాగాలుగా ఉన్నవి తిరిగి ఒకటి కాలేని దేశం, బంధాన్ని తెంచుకోవడం వల్ల మంచి జరగదనిగాని, మరింక జరిగే చెడు ఏమీ ఉండదనిగాని అనుకోవడం వారివారి దృక్పథాలను బట్టి ఉంటుంది. ఈ మూడవ విషయంలో తప్పక వాటిల్లే ప్రమాదం మాత్రం ఒకటి ఉంది. తగిన సమయం రాకముందే బంధాన్ని తెంపి వేసుకోవడం వల్ల, ఎక్కడ ఏకీకరణ వాంఛనీయమో, సాధ్యమో అక్కడ అది విచ్ఛిత్తికి దారి తీస్తుంది. ఇది కోరి తెచ్చు కొన్నదవుతుంది రెనడే వివేకం చూపలేదని ఎవరనగలరు? దీని అవసరాన్ని ఎవరైనా ప్రశ్నించాలనుకొంటే చైనాలో జరుగుతున్నది చూస్తే చాలు. చైనీయులు కుదుటపడ్డారా? లేదు. చైనా విప్లవ పరిభ్రమణం ఎప్పుడు ఆగుతుందని జనం ఇప్పటికే అడుగుతున్నారు. చైనాలో పరిస్థితులు తెలిసినవారు "బహుశా ఇంకొక వందేళ్లు" అని బదులు పలకడం మించి మరింకేమీ చెప్పలేరు. చైనీయు లందరూ తమదనుకొనే సుస్థిర ప్రభుత్వాన్ని చైనా ఏర్పరచుకొన్నదా? ఆ గమ్యం బహుదూరం. నిజం చెప్పాలంటే విప్లవం తరువాత చైనాలో ఇంతకు ముందెన్నడూ లేనంత అనైక్యత ఏర్పడింది. విచ్ఛిన్నత కలిగింది. విప్లవం వల్ల ఎంత గందరగోళం ఏర్పడిందంటే చైనా స్వాతంత్ర్యానికే ముప్పు వాటిల్లింది. గందరగోళం వల్ల చైనా తన స్వాతంత్ర్యాన్ని కోల్పోలేదంటే అందుకు కారణం చైనాకు చాలామంది శత్రువులు ఉండి, వారిలో ఎవరు చైనాను కబళించారో వారిలో వారికి తేలిక పోవడమేనని భారతీయులలో బహుకొద్ది మందికి తెలుసు. చైనీస్ విప్లవం గొప్ప పొరపాటు. యువాన్ షి-కాయ్(Yuan-Shih-Kai) అభిప్రాయమది. ఆయన ఇలా అన్నారు:

"చైనా ప్రజలు రిపబ్లిక్ ఏర్పరచుకోవడానికి కావలసిన పరిణతి పొందారా? ప్రస్తుత పరిస్థితులలో చైనా ప్రజలకు రిపబ్లిక్ అవతరణ సమంజసమా? అన్నది నా సందేహం. చైనాలో ప్రస్తుత పరిస్థితులకు కాని, చైనా ప్రజల స్వభావానికి గాని సరిపడని ఏదో ప్రయోగాత్మక ప్రభుత్వ వ్యవస్థ ద్వారా కంటె, పరిమిత రాజరిక వ్యవస్థను స్వీకరిస్తే మరింత వేగంగా సాధారణ పరిస్థితుల పునరుద్ధరణ జరిగి సుస్థిరత నెలకొంటుంది. ఇప్పుడున్న చక్రవర్తి కొనసాగాలనడానికి నా ఏకైక కారణం రాజ్యాంగ బద్ధమైన రాచరిక వ్యవస్థలో నాకు ఉన్న విశ్వాసమే. మనకు అలాంటి ప్రభుత్వం కావాలంటే ఆయన స్థానంలో ప్రజలు

ఆమోదించే మరొకరు లేరు... ఈ సంక్షోభంలో నా ఏకైక లక్ష్యం, చైనా రూపుమాయకుండా తద్వారా రాగల అనర్థాలు రాకుండా కాపాడటమే."

భారతీయులకు చైనా ఒక ఉదాహరణగా గాక ఒక హెచ్చరికగా ఉండాలనుకొనేవారు, భారత స్వాతంత్ర్యాన్ని వ్యతిరేకిస్తున్నందుకు రెనడేను నిందించడానికి బదులు తగిన సమయం రాకముందు విప్లవం వల్ల కలిగే అనర్థాలను ముందుగానే చూపి, అలాంటివి కూడదని తన దేశస్థులను హెచ్చరించిన ఆయన విజ్ఞతకు సంతోషిస్తారు.

## X

గొప్పవారు తమ చివరి ఘడియలలో పలికిన చివరిమాటలు ఏమిటనీ, చివరగా ఏయే విషయాలకు సంబంధించి వారు విచారించారనీ తరువాతి తరాలవారు ఆసక్తిగా గమనిస్తారు. చివరిమాటలు వారి ప్రాపంచికానుభవాన్ని సూచించడంలో ముఖ్యమైనవి కాకపోవచ్చు. భవిష్యత్తును గురించిన వారి ఊహలను ప్రతిబింబించకపోనూవచ్చు. ఉదాహరణకు సోక్రటీస్ చివరి ఆలోచనలు ఏమిటంటే- క్రిటోను పిలిచి "ఈస్క్యూ లపియస్‌కు ఒక కోడిపుంజును బాకీ ఉన్నాం. బదులు తీర్చు. ఎంతమాత్రం వదిలివేయకు" అనేవి. ఫలానా పని చేశామనో, చేయలేకపోయామనో అలాంటివారు చివరి ఘడియలలో అనుభవించే చింతలకు మాత్రం ఎప్పుడూ ప్రాముఖ్యం ఉంటుంది. అవి ఆలోచించదగిన విషయాలు. నెపోలియన్ సంగతే తీసుకోండి - సెయింట్ హెలెన్ వద్ద తన మరణానికి ముందు మూడు ముఖ్యమైన విషయాలకు సంబంధించి బాధపడినట్టు దాఖలాలు ఉన్నాయి. అవి- తన జీవితంలో ఏదో ఒక మహత్తర ఘడియలో మరణించకపోవడం; ఈజిప్టును వదిలేసి, తూర్పున సాధించాలనుకొన్నవి సాధించకపోవడం, చివరగా చెప్పవలసిందీ అనల్పమైనదీ వాటర్లూ వద్ద తన ఓటమి. రెనడే అలా చివరకు బాధపడిన విషయాలేమైనా ఉన్నాయా? ఒకటి మాత్రం ఖాయం. ఉన్నాయేమోగాని, నెపోలియన్ మనశ్శాంతిని భగ్నపరచినటువంటి చింతలు మాత్రం ఆయనకులేవు. రెనడే బ్రతికింది సేవచేయడానికేగాని, ఘనకీర్తికోసం కాదు. తనచావు ప్రతిష్ఠాత్మకమా, అప్రతిష్ఠాత్మకమా, తనది వీరమరణమా, తను విజేతా, తను ఒకరికి పై వాడా, ఒక సామాన్యుడు సామాన్యమైన జలుబు చేసి చచ్చినట్టు తనదీ సామాన్య మరణమా? లాంటి విషయాలు ఆయనకు పట్టలేదు. వాస్తవానికి ఆయన దేనికోసమూ చింతించలేదు. తను చేసిన ఏదైనా పని విషయంలోగాని ఏదైనా సంఘటన విషయంలోగాని ఆయన చింతించిన దాఖలా ఎక్కడా లేదు. ఆయన హాయిగా శాంతిగా దాటిపోయారు. ఈవేళ ఆయన మళ్లీ బ్రతికివస్తే దేనికోసమైనా చింతించేవాడా అన్నది అడగదగిన ప్రశ్న. ఒక్క విషయంలో మాత్రం ఆయన మహాదుఃఖపడి ఉండేవాడు. అది ఇండియాలో లిబరల్‌పార్టీ ఇప్పుడున్న స్థితి!

ఇండియాలో ఇప్పుడు లిబరల్ పార్టీ స్థితి ఏమిటి? లిబరల్ పార్టీ ధ్వంసమైపోయింది.

నిజానికి ఇది చాలా మృదువైన మాట. ఇండియా రాజకీయాలలో లిబరల్స్ అసహ్యించు కొనదగినవారు. నార్టన్ మరేదో సందర్భంలో వాడిన భాషవాడాలంటే వాళ్లను ప్రజలు వదిలేశారు, ప్రభుత్వం తమకు సంబంధం లేదంటున్నది. ఉభయులలోని ఏ మంచీ వారిని అంటదు, ఉభయులలోని చెడు అంతామాత్రం పూసుకొన్నారు. ఒకప్పుడు కాంగ్రెస్‌కు లిబరల్ పార్టీ పోటీగా ఉండేది. ఈ వేళ కాంగ్రెస్‌కూ లిబరల్ పార్టీకి మధ్య ఉన్న సంబంధం యజమానికీ, అతడి కుక్కకీ మధ్య ఉన్న సంబంధంలాంటిది. అప్పుడప్పుడు యజమానిని చూసి కుక్క అరుస్తుంది. కాని, ఎక్కువ కాలం వెంటపడి తిరుగుతుంది. కాంగ్రెస్‌కు తోక కాకపోతే లిబరల్ పార్టీ ఏమిటి? చాలామంది అడుగుతున్నారు- లిబరల్స్ కాంగ్రెస్‌లో కలిసిపోకూడదా? అని. లిబరల్ పార్టీ అస్తిత్వం అంత దండగమారిదైంది. ఏ భారతీయుడైనా ఎలా విచారించకుండా ఉంటాడు?

లిబరల్ పార్టీ కుప్పకూలిపోవడం లిబరల్స్‌కు విషాదకరం. కాని దేశానికి నిజంగా ఒక మహావిపత్తు. ఒక ప్రజాదరణ గల ప్రభుత్వానికి పార్టీ అస్తిత్వం ఎంత ముఖ్యమంటే అది లేకుండా కొనసాగగలమన్న ఊహే అసాధ్యం. ఒక ప్రముఖ అమెరికన్ చరిత్రకారుడు ఇలా అన్నారు.

"రాజకీయ కలయికలు లేకుండా మనం కొనసాగడాన్ని ఊహించడం కష్టం. అంత కంటె మన రాజ్యాంగ వ్యవస్థలోని ఏ భాగాన్నైనా కూలగొట్టడాన్నీ, రాజ్యాంగంలో అత్యధిక భాగాన్ని నాశనం చేయటాన్నీ ఊహించడం సులభం." అవే మన ప్రధాన సంస్థలు.

ఒకపార్టీ అదుపు, క్రమశిక్షణ లెకుండా ఒకదేశాన్ని పరిపాలించాలని ప్రయత్నించడ మంటే నిజానికి, జేమ్స్‌బ్రైస్ భాషలో "తెలిసీ తెలియని వాటాదార్ల వోట్లతో బోర్డ్ నిర్వహించడం లాంటిది, లేదా ప్రయాణీకుల వోట్లతో నౌకను ఎటు తీసుకొని వెళ్లాలో నిర్ణయించడం లాంటిది".

ప్రజా ప్రభుత్వంలో పార్టీ ఒక ముఖ్య భాగమన్నది కాదనడానికి వీలులేదు ఒకేపార్టీ పరిపాలన సాగించడం ప్రజాప్రభుత్వానికి చేటు తెస్తుందన్నది కూడా అదే విధంగా కాదనడానికి వీలులేదు. నిజానికి ప్రజా ప్రభుత్వానికే అది విరుద్ధం. జర్మనీ, ఇటలీ దేశాల దృష్టాంతం ఇందుకు బలమైన దాఖలా నియంతృత్వ దేశాలనుంచి గుణపాఠం నేర్చుకోవడానికి బదులు ఆ దేశాలను ఆదర్శంగా తీసుకొంటున్నాం. జాతీయ సంఘటితత్వం పేరిట ఈ దేశంలో ఏకపక్ష వ్యవస్థను శ్లాఘిస్తున్నారు. అలా చేస్తున్నవారు ప్రజా నీడన ఉన్న ప్రమాదాన్నీ, ఒకే రాజకీయపక్షం ప్రభుత్వంలో ఉంటే ప్రజా వ్యవహారాలు తప్పనిసరిగా పెడదోవపట్టే అవకాశాలు ఉంటాయన్న విషయాన్నీ గుర్తించడం లేదు. ఒకే పార్టీ చేత ప్రభుత్వాన్ని నడిపించడం అంటే ప్రజాస్వామ్యాన్ని బొమ్మగా అలా ఉండనిచ్చి, దాని వెనుక నుంచి నియంతృత్వ పాలనను సాగనివ్వడమే. ఏకపక్ష ప్రభుత్వం అత్యధిక సంఖ్యాకుల నిరంకుశ పాలనగా

మారుతుందన్నది వట్టి మాట కాదనీ దారుణమైన నిజమనీ ఇండియాలో కాంగ్రెస్ పాలన క్రింద అనుభవ పూర్వకంగా తెలుసుకొన్నాం. బ్రిటిష్ పాలన క్రింద అవసరమనుకొన్న ప్రభుత్వ న్యాయయంత్రాంగాల ఏర్పాటు ఇక ఇప్పుడు అవసరంలేదని రాజగోపాలాచారి మనకు చెప్పలేదా? నిరంకుశ పాలకుల రక్తదాహాన్ని అది సూచించడం లేదా? ఎన్నికద్వారా ఏర్పడినంత మాత్రాన నిరంకుశ పాలన నిరంకుశ పాలన కాకుండాపోదు. నిరంకుశ పాలకులు మన వాళ్లయినంత మాత్రాన నిరంకుశ పాలన మనకు ఆమోదయోగ్యం కాదుకూడా. అధికారచ్యుతి జరగవచ్చునని, పడగొడతారని, పోటీపార్టీ ముందుకొస్తుందని భయాన్ని కలిగించడమే నిరంకుశ పాలన రాకుండా చేస్తుంది. ప్రతి ప్రభుత్వమూ పొరపాటు అంచనాలు వేయవచ్చు. అనేకానేక ప్రభుత్వాలు చెడు పరిపాలన చేయవచ్చు. మరెన్నో ప్రభుత్వాలు అవినీతికి పాల్పడవచ్చు, అన్యాయాలు చేయవచ్చు, దమననీతిని పాటించవచ్చు, అపనమ్మకం కలిగించవచ్చు. ఏ ప్రభుత్వమూ విమర్శకు అతీతంగా ఉండరాదు. కాని, ప్రభుత్వాన్ని ఎవరు విమర్శించగలరు? వ్యక్తులకు వదిలేస్తే అదెన్నటికీ జరగదు. ఒకడు తన శత్రువుతో ఎలా వ్యవహరించాలో సర్ టోబీ సలహా ఇచ్చిపోయాడు. ఆయన ఇలా అన్నాడు. "వెంటనే అతనిని చూసిన వెంటనే...పిలిచి, దగ్గరికి పిలిచిమరీ... చెడామడాతిట్టు.." ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిలబడాలనుకొన్న ఒక వ్యక్తికి ఇది సాధ్యంకాదు. వ్యక్తులు ఈ పాత్ర నిర్వహించాలంటే అందుకు చాలా ప్రతిబంధకాలు ఉన్నాయి. మొదటగా పేర్కొనవలసింది, బ్రైస్ మాటల్లో, జన బాహుళ్య కర్మవాదం. మనుషుల వ్యవహారాలన్నీ ఏవో మహాశక్తులు నడిపిస్తుంటాయనీ, మనిషి దాన్ని మార్చలేడనీ నమ్మడం వల్ల కలిగిన నిస్సహాయతా భావం పురుష ప్రయత్నం నిష్ఫలమనిపింప జేస్తుంది. అన్నింటికీ సరేనంటూ తలొగ్గాలనిపిస్తుంది. అధిక సంఖ్యాకులకు సాంఘిక వైఫల్యాలకు, ఇతర శిక్షలకూ గురి చేస్తూ వ్యక్తమయ్యే అధిక సంఖ్యాకుల నిరంకుశత్వావకాశం రెండవ అడ్డంకి. కాంగ్రెస్ పాలనలో ఇలాంటి మంచి అనుభవాలు మనలో కొందరికి ఉన్నాయి. మూడవది సి.ఐ.డి భయం. నీడలా వెన్నంటి విమర్శకుల నోళ్లు మూయించే గెస్టాపో లాంటి సహాయక అంగాలు ప్రభుత్వానికి ఉండటం.

స్వేచ్ఛ రహస్యం ధైర్యమే. వ్యక్తులు కలసి ఒక పార్టీగా ఏర్పడడం నుంచి ధైర్యం పుట్టుకొస్తుంది. ప్రభుత్వాన్ని నడిపించడానికి ఒక పార్టీ అవసరం కాని, ప్రభుత్వం నిరంకుశ పాలక వ్యవస్థగా మారకుండా చూడటానికి రెండు పార్టీలు అవసరం. అధికారంలో ఒక పార్టీ, ప్రతిపక్షంగా ఒక పార్టీ. రెండు పార్టీలు పనిచేస్తేనే ఒక ప్రజాస్వామిక ప్రభుత్వం ప్రజాస్వామికంగా ఉండగలుగుతుంది. జెన్నింగ్స్ అన్నట్టు -

"ప్రతిపక్షంలేకపోతే ప్రజాస్వామ్యం లేదు. 'ప్రభువులవారి ప్రతిపక్షం' అనే పదబంధం వ్యర్థమైనది కాదు. ప్రభువులవారికి ప్రభుత్వమూ ఉండాలి, ప్రతిపక్షమూ కావాలి"

వీటన్నింటి వెలుగులో చూస్తే ఇండియాలో లిబరల్ పార్టీ పతనం మహా విపత్తుకాదని

ఎవరు అనగలరు? లిబరల్ పార్టీని మళ్లీ బతికించుకొనలేకపోతే, లేక మరొక కొత్త పార్టీని ఏర్పాటు చేసుకొనకపోతే స్వేచ్ఛ కోసం జరుగుతున్న పోరాటం వల్ల స్వేచ్ఛనూ కోల్పోవలసి వస్తుంది. నిరంకుశత్వం దేశీయమైనా, విదేశీయమైనా అది స్వేచ్ఛకు విరుద్ధం. ఈ సత్యాన్ని ఇండియన్లు గమనించకపోవడం విచారకరం. కాంగ్రెస్ ఒక్కటే పార్టీ అనీ, కాంగ్రెసే జాతి అనీ పెడబొబ్బలు పెడుతున్న వారు కొంతకాలం బతికుంటే తమ నిర్ణయానికి దుఃఖించి తీరతారనడంలో నా కెలాంటి సందేహం లేదు.

లిబరల్ పార్టీ ఎందుకు కుప్పగూలింది? రెనడే తత్త్వంలో ఏమైనా దోషం ఉన్నదా? లిబరల్ పార్టీ మనుషులలో ఏమైనా లోపం ఉన్నదా? లేక లిబరల్ పార్టీ పనిచేయడంలో ఏమైనా తప్పుజరిగిందా? నా మట్టుకు నేను రెనడే తత్త్వంలో మౌలికంగా దోషమేమీ లేదంటాను. రెండుపార్టీలలో కాంగ్రెస్‌పార్టీ పోరాట లక్ష్యం మంచిదనీ అనలేము; లిబరల్‌పార్టీకే అత్యుత్తములైన మనుషులున్నారనీ చెప్పలేము. లిబరల్ పార్టీకి రెండూ ఉన్నాయి. పార్టీ వ్యవస్థాపన లోపం వల్లనే లిబరల్‌పార్టీ కుప్పకూలిపోయిందని నాకు అనిపిస్తున్నది.

లిబరల్ పార్టీ వ్యవస్థాపన బలహీనతలను బయటపెట్టడం ఆసక్తిదాయకమే అవుతుంది. "పాలిటిక్స్ ఆఫ్ డెమోక్రసీ" అనే గ్రంథంలో పెండెల్టన్ హెర్రింగ్ ఒక పార్టీ నిర్వహణ ఏక కేంద్రం గల మూడు వలయాల మధ్య విస్తరించి ఉంటుందన్నాడు. లోపలి తొలి వలయంలో పార్టీ నిర్వహణను అదుపు ఆజ్ఞల్లో పెట్టుకొన్న కొందరు పెద్ద మనుషుల పెత్తనానికి ప్రతీక. ఈ పెద్ద మనుషులను 'అధిష్టానవర్గం' అన్నాడు. అధికార పదవులలో ఉంటూనో పార్టీ పదవులను నిర్వహిస్తూనో పార్టీ యంత్రాంగం ద్వారా పొట్టపోసుకొంటున్నవారు ఈ వలయంతో సంబంధం కలిగి ఉంటారు. వారిని వృత్తి రాజకీయవాదులంటారు. పార్టీ యంత్రాంగం వాగితోనే నిర్మితమవుతుంది. అధిష్టానవర్గం పార్టీ యంత్రాంగాల నెలవైన ఈ వలయానికి వెలుపల ఉండే పెద్ద వలయంలో సాంప్రదాయిక, రాగ బంధాల కారణంగా పార్టీకి విధేయులైన చాలామంది ఇందులో ఉంటారు. పార్టీ చెప్పే సిద్ధాంతాలతోనే వీరికి అనుబంధం. వృత్తిరీత్యా కార్యకర్తలైనవారూ నాయకులూ చేస్తున్న పనుల మీదకంటె పార్టీ ఆదర్శాల మీద, పార్టీ ప్రతీకల మీద, మాత్రమే వారి దృష్టి ఉంటుంది. పార్టీ ఏమి చేసిందన్న దానికంటె పార్టీ ఆదర్శమేమిటన్నది మాత్రమే చూసి వారు వోట్లు వేస్తారు. ఈ రెండవ వలయానికి వెలుపల, ఏ పార్టీతోనూ సంబంధం లేని జనబాహుళ్యం ఉంటారు. వీరంతా ఏదైనా ఒక ఊరికి పనిమీద వచ్చిపోతుండే పొరుగూళ్ల మనుషులు. ఏ పార్టీతోనూ వీరు సంబంధం లేకుండా ఉండటానికి కారణం వీరికి ఒక లక్ష్యమంటూ లేకపోవడం కావచ్చు. ఆలోచనలు లేకపోవడమూ కావచ్చు. ఏపార్టీ వేదికమీదనూ కనిపించని ఏవోకొన్ని అభిప్రాయాలు ఉండటంకూడా కారణం కావచ్చు. రెండవ వలయానికి బయట ఉన్నవారే ఒక రాజకీయ పక్షానికి అతి ముఖ్యమైన కార్యక్షేత్రమవుతారు. ఒక రాజకీయ పక్షం గెలుచుకోవలసింది వారినే. ఇందుకోసం సిద్ధాంతాలను ప్రవచించి విధానాలను రూపొందిస్తే

సరిపోదు. సిద్ధాంతాలు, విధానాలలో ఎవరికీ ఆసక్తి ఉండదు. ఎవరికైనా ఏదైనా సాధించాలనే ఆసక్తి ఉంటుంది. పార్టీకి కావలసినదేమిటంటే సంఘటిత కృషి. ప్రెసిడెంట్ వుడ్రో విల్సన్ మాటల్లో చెప్పాలంటే అధిక సంఖ్యాకపాలనతో స్వీయ ప్రభుత్వం లభించినప్పుడు వ్యష్టి ప్రయత్నం ద్వారాగాక సంఘటిత కృషి ద్వారా కార్యసాధన చేయవచ్చు. ఇప్పుడు సంఘటిత కృషికి కావలసిందేమిటంటే వ్యక్తుల అభిప్రాయాలు జనాభిప్రాయంగా రూపు దిద్దుకోవటం. ఒకానొక సిద్ధాంతానికి వెనుక ఆమోదముద్రగా ప్రజాభిప్రాయం రూపుదిద్దు కోవటం, లేదా నిర్మాణం కావడమన్నది పార్టీ ముఖ్య విధులలో ఒకటి అవుతున్నది. సైద్ధాంతికంగా చూస్తే ప్రజాభిప్రాయం వ్యక్తం కావడానికీ, దాన్ని అమలులోకి తీసుకొని రావడానికీ రాజకీయ పార్టీలు సాధనాలు. కాని, ఆచరణలో అవి ప్రజాభిప్రాయాన్ని సృష్టిస్తాయి, ప్రభావితం చేస్తాయి., తరచు అదుపు చేస్తాయిగూడా. నిజానికి ఇదే ఒక పార్టీముఖ్యవిధి. ఇందుకోసం పార్టీ రెండుపనులు చేయాలి. మొదటగా అది ప్రజలతో సంబంధాలు పెట్టు కోవాలి. తన సామగ్రి, అంటే సిద్ధాంతాలూ, విధానాలూ, ఆలోచనలూ, అభ్యర్థులతో ప్రజలలోకి వెళ్లిపోవాలి. రెండవది– తన సామగ్రిగురించి జనం మధ్య ప్రచారం చేసుకోవాలి. వారిని చైతన్యవంతులుగా, జ్ఞానవంతులుగా చేయాలి. మరోసారి బ్రైస్‌మాటల్లో చెప్పాలంటే "వోటర్లకు వారు నిర్ణయించ వలసిన వ్యవహారాన్ని గురించీ, వారి నాయకుల గురించీ, వ్యతిరేక వర్గం వారి తప్పిదాలను గురించి కొంత తెలియజెప్పండి." ఈ మౌలికాంశాలనుంచి సంఘటిత కృషి ఉత్పన్నమవుతుంది. అందరినీ కలుపుకుని పనిచేయలేని పార్టీకి పార్టీ అని పిలిపించుకొనే హక్కు కూడా లేదు.

ఒక సంస్థగా లిబరల్ పార్టీ వీటిలో ఏమి చేసింది? లిబరల్ పార్టీకి ఒక అధిష్ఠానవర్గం మాత్రం ఉంది. దానికొక యంత్రాంగం లేదు. యంత్రాంగం ఏదీలేని అధిష్ఠానవర్గం ఒక ఛాయ మాత్రమే. దాని అనుచరవర్గం సంప్రదాయబంధాలకు కట్టుబడిన వారితో కూడిన రెండవ వలయానికి మాత్రమే పరిమితం. మానసికానుబంధాన్ని కలిగించడం ఏదీ నాయకులు చేయలేదు. జనాన్ని చేర్చగల ఉద్యమ నినాదమేదీ వారివద్ద లేదు. జన బాహుళ్యంతో సంబంధాలు పెట్టుకోవాలనే విషయంలో వారికి విశ్వాసం లేదు. జన బాహుళ్యంనుంచి ఇంతగా దూరమై, ఎవరినీ అంటకుండా ముట్టకుండా దడి కట్టుకొన్న మరొక పార్టీ ఏదైనా ఉంటుందా అనిపిస్తుంది. మార్పు (ఇతరులను తమలోకి మార్చుకొనడం) లో లిబరల్ పార్టీకి విశ్వాసం లేదు. అంతమాత్రాన ప్రబోధించడానికి దాని వద్ద ఏమీ లేక కాదు. హిందూమతం వలెనే దీనిది కూడా ఇతరులను మతం మార్పించి తనలో చేర్చుకొనే విధానంకాదు. సూత్రాలు, విధానాలు ఏర్పరచటంలో మాత్రమే దీనికి విశ్వాసం ఉంది. కాని వాటికి కార్యరూపం ఇవ్వటానికి అది కృషి చెయ్యదు. ప్రచారం, సంఘటితకృషి లిబరల్‌పార్టీకి సరిపడని విషయాలు. స్వతంత్ర వ్యక్తులుగా ఏదోమాట్లాడటం, వార్షిక సభలు జరుపుకోవడం, ఒక క్రిప్స్ వచ్చినప్పుడో, వైస్రాయ్ ఎవరైనా కొందరు ముఖ్యులను ఆహ్వానించ దలచుకొ

న్నప్పుడో ఆహ్వాన పత్రాలకోసం ప్రయత్నించడం – వీటికే పార్టీ రాజకీయ కార్యకలాపాలు పరిమితమైనాయి.

లిబరల్ పార్టీ అపకీర్తిపాలైనదంటే అందులో ఆశ్చర్యం ఏమున్నది? ఏ ప్రయోజనాన్ని నెరవేర్చుకొనడానికైనా, ముఖ్యంగా వైవిధ్యం కలిగిన ఎన్నో శక్తులు కలిసి పనిచేసేటట్టు ఎంతగానో ప్రయత్నించి సన్నద్ధం చేయవలసిన రాజకయాలలో ఒక వ్యవస్థ స్థాపన అత్యంతా వశ్యకమన్న ప్రాథమిక సత్యాన్ని లిబరల్ పార్టీ మరిచిపోయింది.

ఇండియాలో లిబరల్ పార్టీ పతనానికి ఎవరు బాధ్యులు? ఇలా చెప్పుతున్నందుకు మనం ఎంత విచారించవలసి వచ్చినా, ఈ విపత్తుకు బాధ్యత కొంతవరకు రెనడేపై పడుతుందని అంగీకరించక తప్పదనుకొంటాను. రెనడే ఉన్నత తరగతులకు చెందినవాడు. వారిలోనే పుట్టాడు, వారితోనే పెరిగాడు. ఆయన జనంమనిషి ఎన్నటికీ కాలేదు. లిబరల్ పార్టీకి ఒక యంత్రాంగమంటూ లేదు. అందుకు కారణం జనబాహుళ్యంతో సంబంధాలు పెట్టుకోవాలనే విషయంలో ఆ పార్టీకి విశ్వాసంలేదు. జన బాహుళ్యంతో సంబంధాలపట్ల వైముఖ్యం రెనడేనుంచి వచ్చిన వారసత్వం. జన బాహుళ్యంతో సంబంధాలను పెట్టుకోకపోవడంలో పార్టీ, రెనడే వదలిపోయిన సంప్రదాయాన్ని పాటిస్తున్నది. లిబరల్ పార్టీకి రెనడే వదలిన మరొక వారసత్వంకూడా ఉంది. అది, సిద్ధాంతాలకు, విధానాలకు వెనుక వాటిని నడిపించే శక్తి ఏదో ఉన్నదన్న తప్పుడు నమ్మకం. మజ్జిని (Mazzini) ఒకసారి అన్నాడు. "నీవు మనుషులను చంపవచ్చు, ఒక గొప్ప ఆలోచనను చంపడం నీతరంకాదు" అని. నామట్టుకు నాకు అది చాలాపొరపాటు అభిప్రాయమనిపిస్తుంది. మనిషికి మరణం తప్పదు. ఆలోచనలకు అంతే. ఒక ఆలోచన దానంతట అది పెరుగుతుందనుకోవటం పొరపాటు. ఒక చెట్టును నీరు పోసిపెంచటం ఎలా అవసరమో, ఒక ఆలోచనను ప్రచారం చేయడం కూడా అలాగే అవసరం. లేకపోతే అదైనా, ఇదైనా ఎండిపోయి చస్తుంది. రెనడే మజ్జినితో ఏకీభవించాడు. ఒక ఆలోచన ఫలితానికి రావాలంటే కష్టపడి పెంచి పోషించడానికి కావలసిన వనరులు అవసరమని ఆయన అనుకోలేదు. కేవలం, కొన్ని సిద్ధాంతాలను, విధానాలను రూపొందించు కొనడంతో లిబరల్ పార్టీ తృప్తి పడిందంటే అదికూడా రెనడే పాటించిన ఈ పద్ధతివల్లనే.

లిబరల్స్ విధులేమిటి? లిబరల్స్ అందరూ నాయకుడిని అనుసరించడమే తమ విధి అంటారని నాకు తెలుసు. భక్తిభావం కలిగిన శిష్యబృందం వైఖరి మరో విధంగా ఎలా ఉంటుంది? కాని, ఇంతకంటె పొగపాటు, ఇంతకంటె విచక్షణా రాహిత్యం మరేమైనా ఉంటుందా? ఈ ధోరణిలో రెండు అపార్థాలు కూడా ఉన్నాయి. ఒక గొప్ప మనిషి తన సూక్తులను శిష్యులమీద రుద్దుతూ వ్యవహారం చేస్తాడని ఒక అర్థం. శిష్యులు గురువును మించిన వివేకవంతులు కారాదని మరొక అర్థం ఈ రెండూ తప్పుడు అభిప్రాయాలే. ఇలా అనుకోవడం నాయకుడికి అన్యాయం చేసినట్లవుతుంది ఏ గొప్పవాడు కూడా శిష్యుల

మీద తన సూక్తులను, నిర్ణయాలను రుద్ది శిష్యుడిని పనికిమాలినవాణ్ణి చేయడు. గొప్ప మనిషి చేసే పని శిష్యుల మీద తన సూక్తులను రుద్దడం కాదు. అతడు చేసేది శిష్యుల మానసికశక్తులను ఉద్దీపన చేయడమ్, బహుముఖంగా ప్రజ్వరిల్ల జేయడం. ఇందులోనూ శిష్యుడు గురువు మార్గదర్శకత్వాన్ని స్వీకరిస్తాడు. ఐతే, గురువు ఎలాంటి అభిప్రాయాలకు వస్తే అలాంటివన్నీ శిష్యుడు ఒప్పుకోవలసిన అవసరంలేదు. అలా గురువు అభిప్రాయాలను కాదన్నప్పుడు సైతం శిష్యుడు గురువుపట్ల పరమపవిత్ర భావంతో ఇలా విన్నవించుకొంటాడు- "నేను నేను అయ్యేటట్టు జాగృతం చేసినది మీరు. అందుకు మీకు నా ధన్యవాదాలు". గురువుపట్ల ఇంతకంటె తక్కువభావం చూపకూడదు. శిష్యుడు ఇంతకంటె ఎక్కువ ఇవ్వవలసిన అవసరమూ లేదు.

గురువు చెప్పిన సూక్తులకు, ఆయన ఏర్పరచుకొన్న అభిప్రాయాలకు శిష్యుడు కట్టుబడి వుండటం గురువుకూ, శిష్యుడికీ కూడా మంచిదికాదు. సిద్ధాంతాలను నీతులను తెలుసుకొని, వాటి విలువ విషయమై నమ్మకం కుదిరితే వాటిని వ్యాప్తిచేయడం శిష్యుడి విధి. ఏ గురువైన కోరేది అదే. జీసస్ అదే కోరాడు. బుద్ధుడు అదే కోరాడు. రెనడే కూడా అదే కోరి ఉంటాడని నా నమ్మకం. దీన్నిబట్టి తేలేదేమిటంటే లిబరల్స్‌కి రెనడే పట్ల ప్రేమ ఉంటే, గౌరవం ఉంటే, కేవలం సభలు జరుపుకొని ఆయన కీర్తిని గానం చేయడమ్ మాత్రమేగాక రెనడే పవిత్ర సందేశాన్ని వ్యాప్తి చేయడానికి పూనుకోవడం వారి పరమకర్తవ్యం.

లిబరల్స్ ముందుకు వచ్చి ఈ విధిని నిర్వర్తిస్తారన్న ఆశ ఏమి ఉన్నది? లక్షణాలు చూస్తే నిరాశాజనకంగా ఉన్నాయి. క్రిందటి ఎన్నికలలో లిబరల్స్ పోటీ చేయనైనాలేదు. అదే కాస్తంత ఆశ్చర్యకరమైన విషయం. "కాంగ్రెస్ గెలవాలని కోరుకొంటున్నా" అని లిబరల్ పార్టీ అగ్రనాయకుడు రైట్ ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రిచేసిన ప్రకటనను జ్ఞాపకం చేసుకొంటే ఇది అల్పమైన విషయమనిపిస్తుంది. కౌరవుల ఔదార్యంమీద బతుకుతూ, కౌరవ శత్రువులైన పాండవుల విజయాన్ని కోరి, అందుకోసం పనిచేసిన భీష్ముడి నమ్మకద్రోహ రాజద్రోహ ప్రవర్తన తప్పిస్తే ఇందుకు సమానమైన మరొక దృష్టాంతం ఏమీలేదు. లిబరల్స్‌కు కూడా రెనడే పవిత్ర సందేశంలో నమ్మకం పోయిందని ఇది సూచిస్తున్నది. లిబరల్ పార్టీ ఆరోగ్య పరిస్థితి ఇలా ఉంటే అది చావడమే మేలు అలా జరిగితే ఒక కొత్త సర్దుబాటుకు బాట ఏర్పడి, లిబరల్స్ గురించీ, లిబరలిజం గురించీ ఊరికే రణగొణ ధ్వని చేసుకొనే శ్రమ మనకు తప్పుతుంది. రెనడే సైతం సమాధినుంచి సంతృప్తినే వ్యక్తం చేయవచ్చు.

అనువాదం :

బొజ్జా తారకం, పొత్తూరి వెంకటేశ్వరరావు, జె. అమ్మలయ్య

# 7

## ఓటుహక్కుపై

## సౌత్‌బరో కమిటీకి ఇచ్చిన వాంగ్మూలం

విచారణ

*27, జనవరి 1919*

## సౌత్‌బరో కమిటీకి ఇచ్చిన వాంగ్మూలం

కమిటీ ఈ క్రింది వారితో ఏర్పాటు అయింది.

రైట్ ఆనరబుల్ లార్డ్ సౌత్‌బరో,
జి.సి.బి; జి.సి.వి.ఓ; జి.సి.ఎం.సి. (ఛైర్మన్)
సర్‌ఫ్రాంక్ జి.స్లై. కె.సి.ఎస్.ఐ., ఐ.సి.ఎస్.
సాహిబ్‌జాదా ఆఫ్తాబ్ అహ్మద్‌ఖాన్
మాన్యశ్రీ బాబూ సురేంద్రనాథ్ బెనర్జీ
మాన్యశ్రీ ఎం.ఎన్. హాగ్
డబ్ల్యు.ఎమ్. హైలే సి.ఎస్.ఐ; సి.ఐ.ఇ; ఐ.సి.ఎస్.
మాన్యశ్రీ శ్రీనివాసశాస్త్రి (25-1-1919, 27-1-1919 తేదీలలో హాజరుకాలేదు)
తర్వాత చేర్చిన ఇతర సభ్యులు :
ఎల్.సి.క్రంప్, ఐ.సి.ఎస్.
కె.నటరాజన్
పి.సి.టాలెంట్స్, ఐ.సి.ఎస్ (కార్యదర్శి)

# సౌత్‌బరో కమిటీకి ఇచ్చిన వాఙ్మూలం

## లిఖిత నివేదిక

## వాఙ్మూలం

వ్యక్తిగత అభిప్రాయశక్తిని, ప్రాధాన్యాన్ని ప్రజల కార్యంగా మార్చడం ఎలా అనేది "ప్రభుత్వానికి ఎదురయ్యే అతి కష్టమైన, అతి ముఖ్యమైన ప్రశ్న. ప్రజా సంస్థలకు ఇది క్లిష్ట సమస్య" అంటారు ప్రొఫెసర్ ఎ.బి.హార్ట్. అయితే ఇది ప్రజా ప్రభుత్వానికి సగం నిర్వచనం మాత్రమే. అందువల్ల, మరీ ముఖ్యం కాదనుకున్నా దీనితో సరి సమానమైన మిగిలిన సగానికి కూడా ప్రాముఖ్యం ఇవ్వడం అవసరం. వ్యక్తిగత శక్తియుక్తులను వినియోగించుకునే అత్యంత ముఖ్య భూమిక ప్రభుత్వమే కావడం వల్ల ప్రజా ప్రయోజనాల దృష్ట్యా ప్రభుత్వ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనే అవకాశాన్ని ఏ ఒక్కరికీ కాదనకూడదు. ప్రజా ప్రభుత్వం అంటే ఆ ప్రభుత్వం కేవలం ప్రజలకోసమే కాదు, ప్రజలతోనూ ఏర్పడాలి. దీనినే మరో విధంగా చెప్పాలంటే, ప్రజా ప్రభుత్వం ఏర్పాటులో ఆయా అభిప్రాయాలకు ప్రాతినిధ్యం ఇచ్చినంత మాత్రాన సరిపోదు. దీనిని నిజంగా అర్థవంతం చేయాలంటే వ్యక్తిగత ప్రాతినిధ్య కల్పన కూడా అవసరం. తరచు జరుగుతున్నదేమిటంటే, ప్రజా ప్రభుత్వంలో వ్యక్తిగత ప్రాతినిధ్యం లోపిస్తున్నది. అందువల్ల, భారతదేశంలో ఓటుహక్కు నియోజకవర్గాల ఏర్పాటులో అభిప్రాయాల ప్రాతినిధ్యమే కాకుండా వ్యక్తుల ప్రాతినిధ్యం సైతం లభించేటట్లు ఈ ఓటు హక్కు కమిటీ అవకాశం కల్పించాలి. దీనిని సాధించలేని ఓటుహక్కు పథకంగాని, నియోజకవర్గ పథకంగాని ప్రజాప్రభుత్వం ఏర్పాటును విఫలం చేస్తుంది.

**2.** ప్రజా ప్రభుత్వాన్ని తీర్చిదిద్దే ఈ కార్యసాధన తుదకు– వాస్తవికంగా ఉన్న సమాజ భావనపై, దాని నిర్దుష్టతపై ఆధారపడి ఉంటుంది. లార్డ్ డఫరిన్ భారతదేశంలో వున్న వాస్తవ పరిస్థితులను ఈ క్రింది విధంగా చక్కగా చిత్రించారు...

"వివిధ మతాలను స్వీకరించి, విభిన్న ఆచారాలను అనుసరిస్తూ వివిధ భాషలు మాట్లాడే

వారూ - వారిలో చాలామంది పరస్పరం పొసగని దురభిప్రాయాలతో ఆయా రివాజుల తేడా పాడాలతో లౌకిక ప్రయోజనాల వైరుధ్యంతో ఇంకా విడిపోయి ఉంటారు- ఇలాంటి అనేకానేక విలక్షణమైన జాతీయుల సమ్మేళనం ఈ జనాభా. మన భారతదేశంలో రెండు సాంఘిక వర్గాలు ఎదురెదురు ధృవాల మాదిరిగా ఒకదానికొకటి సుదూరంగా- రెండు బలిష్ఠమైన రాజకీయ పక్షాలుగా విడిపోయాయి. ఒక వంక- అపారంగా వున్న విభిన్న కులాల హిందువులు, మరోవంక సామాజిక సమానత్వంకల మహమ్మదీయులు. పై రెండు వర్గాలతోపాటు పరస్పరం ఘర్షించే ఇతరవర్గాలు మరెన్నో ఉన్నాయి. జాతి పరంగానేమి, విభిన్న రాజకీయ దృక్పథంతోనేమి, తమ సంప్రదాయాలతోనేమి, తమ తమ మత విశ్వాసాలతోనేమి ఆయా వర్గాలు నిరంతరం ఘర్షణ పడుతుంటాయి. సిక్కులు, రోహిల్లాలు, పఠానులు, అస్సామీయులు, బలూచీలు, మన సరిహద్దులలోని ఇతర ఆటవిక, సంకర తెగలు, హిమాలయ సానువులలోనివసించే కొండ జాతులు, జాతిరీత్యా మంగోలులైనా మతరీత్యా బౌద్ధులైన మనబర్మా పౌరులు, గోండులు, మహారులు, భిల్లులు, భారతదేశంలోని మధ్య, దక్షిణ ప్రాంతాలలోని ఆర్యేతర ప్రజలు, పారిశ్రామిక, వాణిజ్య వేత్తలుగా దినదిన ప్రవర్థమానులవుతున్న ఔత్సాహిక పార్శీల వంటి చిన్నచిన్న జాతీయులు లక్షలలో వున్నాయి. ఇంతేకాదు, ఈ జాతీయులను పరిశీలిస్తే చరిత్ర పూర్వయుగం నుంచి ప్రస్తుత కాలం వరకు మానవాళి పుంజుకున్న వివిధ నాగరికత దశలు ఒకే తరంలో అగుపిస్తాయి.

3. భారతదేశ జనాభా కులాలు, తెగలుగా విడిపోయి ఉన్నందువల్ల ఈ దేశం ప్రాతినిధ్య ప్రభుత్వానికి పనికిరాదని ఇంగ్లీషువారు నొక్కి చెబుతూ వచ్చారు. భారతదేశంలోని ఆధునిక పక్షాన్ని ఈ వాదం ఒప్పించలేక పోయింది. భారతదేశం మాదిరిగానే యూరప్‌లోనూ సామాజిక విభజనలు ఉన్నవనీ, అందుకు తగినన్ని సాక్ష్యాధారాలు ఉన్నాయని ఆధునికులు వాదిస్తారు. అమెరికా వంటి దేశంలోనూ ఇండియాలోవలెనే కొంచెం అటూ ఇటూ సాంఘిక తేడాలు తక్కువేమి లేవు. ఇండియాలో వలెనే అమెరికాలోనూ విభిన్న సాంఘిక వర్గాలు, వాటిలో తేడాలు అనేకం ఉన్నాయి. అవి ఘోరమైన కుట్రలతో జనాలను ఎరగా వాడుకొనే సంస్థలకు కట్టుబడి వున్నాయి. రాజకీయంగా ఉన్న తేడా పాడాలే కాదు. పారిశ్రామిక, వైజ్ఞానిక, మత సంస్థలు కూడా తమ తమ లక్ష్యాల్లో, వైఖరుల్లో పరస్పరం విభేదిస్తాయి. విభిన్న లక్ష్యాల రాజకీయ పక్షాలకు తోడు, సామాజిక వర్గాలు, ఆయా ముఠాలు ఉన్నాయి. అమెరికా జనాభాలో పోలెండువారు, డచ్ వారు, స్వీడన్లు, జర్మన్లు, రష్యన్లు తదితరులు తమతమ సొంత భాష, మతాలు, నీతి నియమాలు, సంప్రదాయాలు వగైరాలతో శాశ్వతంగా విడిపోయినట్లే ఉన్నారు. సామాజిక తేడాలవల్ల ఒక దేశం ప్రాతినిధ్యం ప్రభుత్వానికి అనర్హమనుకుంటే భారతదేశం ఎంత అనర్హమవుతుందో అమెరికా కూడా అంతే అవుతుంది. అన్ని సామాజిక తేడాలు ఉన్న అమెరికా ప్రాతినిధ్య ప్రభుత్వానికి అర్హమైనప్పుడు, భారతదేశం ఎందుకు కాదు? భారతదేశంలో పాదుకుపోయిన రాజకీయవాదులను అడిగి చూడండి. ఈ దేశంలోని సామాజిక

పరమైన తేడాలు అమెరికాలోవలె కాకుండా వేరే విధమైనవని వారు చెప్పగలుగుతారో! లేదా వారుదాన్నే అంగీకరిస్తారో- ఈ రెండు మినహా మూడవ ప్రత్యామ్నాయం సాధ్యంకాదు.

4. నా అభిప్రాయంలో ఆ రాజకీయుల వాదం అంగీకరించరానిది. ఎందుకంటారా? ఇండియాలోని సాంఘిక తేడాలు రాజకీయాలను ప్రభావితం చేస్తూనే వుంటాయి. వాటి జోక్యంలేని పరిస్థితులను చూసివాటి ప్రభావం తెలుసుకోవచ్చు. ఉమ్మడిగా వుండే తమ వ్యవహారాల ధర్మాన్ని బట్టి మానవులు సమాజంగా ఏర్పడతారు. మానవులు ఒక సమాజంగా ఏర్పడాలంటే వారి ఉద్దేశాలు, నమ్మకాలు, ఆకాంక్షలు, పరిజ్ఞానం, ఉమ్మడి అవగాహన ఒకే మోస్తరువై ఉండాలి. లేదా సామాజిక శాస్త్రవేత్తల పరిభాషలో చెప్పాలంటే వారికి భావసారూప్యం ఉండాలి. ఈ వ్యవహారాలన్నీ వారికి ఉమ్మడిగా ఎలా వస్తాయి? భావ సారూప్యం వారికి ఎలా అలవడుతుంది? కేకు ముక్కను పంచుకున్నట్లు కాదు. ఒకే మోస్తరు వైఖరులను ఒకరి నుంచి ఒకరు పెంపొందించుకోవటంతో భావసారూప్యం ఏర్పరచుకోవటంతో ఉమ్మడి కార్యక్రమాలలో ాలు పంచుకోవటంతో ఒకటవుతారు. ఒకరికొకరు సమీపంగా ఉన్నంత మాత్రాన భావసారూప్యం కలవారు కాలేరు. భావ సమైక్యత కలవారు ఒకరికొకరు దూరంగా ఉన్నప్పటికీ భావ సారూప్యతకు కొరతేమీ లేదు.

ఒకబృందంతో భావసారూప్యత ఏర్పడాలంటే ఆ బృందం కార్యక్రమాలలో పాల్గొనటమే మార్గం. ప్రతి బృందం విలక్షణ రీతిలో తనదైన భావ సారూప్యాన్ని సంతరించుకుంటుంది. ఒక రాజకీయ సంఘంలోకి ఒకటి కంటె ఎక్కువ బృందాలను కూడగట్టినప్పుడు విభిన్న భావసారూప్యాల మధ్య ఘర్షణ ఉంటుంది. ఆ బృందాలు విడిపోయి ఉన్నంతకాలం ఘర్షణ కొనసాగుతుంది. సామరస్య చర్యను నిరోధిస్తుంది. బృందాలు విడిపోయి ఉండడం పెద్ద అపాయమే. ఈ బృందాల మధ్య కలసిపోయే చొరవ (rendosmosis) ఉంటే ఈ అపాయం అంతరిస్తుంది. తద్వారా ఈ బృందాలు ఒకప్పుడు ఏర్పడిన సాంఘిక వైఖరులను మార్చి కొత్తవిగా తీర్చవచ్చు. పాతవాటిస్థానే వివిధ బృందాల ప్రయోజనాలకు, ఉద్దేశాలకు, ఆశయాలకు ప్రాతినిధ్యం వహించే కొత్త భావ సారూప్యతను సృష్టించవచ్చు. సామరస్య జీవనానికి, సాంఘిక-రాజకీయ వ్యవహారాలకు భావసారూప్యం అత్యవసరం. అది భావాల పరస్పరావగాహనలపై చొరవతో కలిసి పనిచేయటంపై ఆధారపడి వుంటుంది. దీన్ని భారతదేశంలోని విభిన్న వర్గాలకు విస్తరింపజేసి చూస్తే సామరస్య రాజకీయ జీవితం సాధించటానికి బృందాలవైఖరి ఆటంకంగా ఉందని చెప్పవలసి వస్తుంది.

5. నిశ్చిత భావసారూప్యంతో ఘర్షణపడే బృందాలు, తెగలు ఈ క్రింద చూడవచ్చు:

1. హిందువులు
2. మహమ్మదీయులు
3. క్రైస్తవులు

4. పార్శీలు
5. యూదులు, తదితరులు

హిందువులు మినహా మిగతా తెగలలో వారిలో వారికి పరస్పర అవగాహన ఉన్నట్లు ఆయా తెగల సభ్యులు తగినంత భావసారూప్యంతో, పరస్పర గౌరవంతో ఉంటున్నట్లు భావించవచ్చు. హిందువులకు సంబంధించి ఈ విశ్లేషణ మరికొంచెం ముందుకు సాగాలి. హిందువులకు సంబంధించినంతవరకు ప్రధాన విషయమేమిటంటే వారు మొదట ఒక కులానికి చెందినవారుగా భావించి తర్వాతనే హిందువులుగా చెప్పుకుంటారు. హిందువు అనే భావన హిందువులు లేనివారు తటస్థపడినప్పుడే పొడచూపుతుంది. ఇతరత్రా కులభావనే ప్రధానంగా మిగులుతుంది. వేరే కులానికి చెందిన హిందువనే సంగతి వచ్చే సరికల్లా కులభావన పొడచూపుతుంది. అంటే ఇద్దరు హిందువుల మధ్య, ఆ ఇద్దరూ హిందువులయినందువల్ల కలిగే భావసారూప్యంకంటే, కుల భావ సారూప్యం బలవత్తరంగా ఉంటుందని తెలుసున్నది. ఆ విధంగా హిందువులకు, హిందువులు కానివారికీ ఉన్నట్లే హిందువులలోనే భావసారూప్యత కల వ్యక్తుల మధ్య ఘర్షణ వుండవచ్చు. ఈ ఘర్షణ మొత్తం కుల వ్యవస్థ యావత్తును ఆవరించిందని కొందరు వాదిస్తారు. ఇది కొంత అతివాదమే. హిందువుల మధ్య కులాలున్నప్పటికీ పరస్పర అవగాహన దృష్ట్యా వారు అంట తగినవారు, అంటరానివారుగా వేరుబడి ఉన్నారు. అంటతగిన వారి మధ్య కలయిక సౌకర్యాలు ఉన్నందువల్ల భావ ఘర్షణ అంత ప్రమాదమైంది కాదని అనుకోవచ్చు. కాని యదార్థమైన తేడా అంటతగినవారికీ, అంటరానివారికీ మధ్య ఏర్పడటంవల్ల అది భావఘర్షణకు దారి తీసేదయింది. వారి మధ్య భావ సమైక్యసాధనకు అంటరానితనం పెద్ద అవరోధం. ఈ రెండువర్గాలు పూర్తిగా విడిపోయి వుండటం వీరి భావ ఘర్షణకు కారణమవుతున్నది.

భారతదేశంలోని సాంఘికవర్గాలు అసలుకు ఈ విధంగా వున్నాయి.

1. అంటతగిన హిందువులు
2. అంటరాని హిందువులు
3. మహమ్మదీయులు
4. క్రైస్తవులు
5. పార్శీలు
6. యూదులు

6. ఒక విధానం రూపకల్పనలో అది ప్రజా ప్రభుత్వరూపం దాల్చుతున్నప్పుడు అసలైన ఈ సాంఘిక వర్గాలను విస్మరించడం భావ్యంకాదు. ఈ నియోజకవర్గాలు, ఓటు హక్కు సామాజిక శక్తులను ఎంత చక్కగా నడిపిస్తాయో, అవి వ్యక్తిగత ప్రాతినిధ్యాన్ని ఎలా సాధిస్తాయో అనే వాటిపై ప్రజా ప్రభుత్వ విజయం ఆధారపడుతుందనుకొంటే మనం ముందు ఈ బృందాల మధ్యగల ఘర్షణ ఎన్నికలలో ఏ రూపం ధరిస్తుందో పరిశీలించాలి.

7. ఒక ప్రాదేశిక నియోజకవర్గంలో పైన పేర్కొన్న బృందాలు ఓటర్ల బృందాలుగా ఏర్పడి, మెజారిటీ ఓటర్లతో ఆ నియోజకవర్గం ప్రతినిధిని ఎన్నుకుంటారు. ఇప్పుడు ఎదురయ్యే ప్రశ్న ఏమిటంటే, ఆ అభ్యర్థి ఆ నియోజకవర్గంలోని బృందాలకు నిజమైన ప్రతినిధియేనా? ఆ నియోజక వర్గం ప్రజల హృదయానికి అతడు నిజమైన దర్పణమేనా? ఆ నియోజకవర్గం ప్రయోజనాలన్నిటికీ అతడు ప్రతినిధియేనా? వాస్తవానికి హిందూ అభ్యర్థి మహమ్మదీయుల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తాడా? ఈ దశలో పైన పేర్కొన్న వివిధ వర్గాలు అలౌకికమైన లేదా కేవలం మతపరమైన సామాజిక ప్రయోజనాలకోసం ఒకటిగా ఉంటారని గుర్తు చేసుకోవాలి. ప్రతి సాంఘిక వర్గం లౌకిక లేదా ఆర్థిక పరమైన, సామాజిక ప్రయోజనాలకై కలసికట్టుగా ఉంటున్నదని మనం చెప్పలేము. అందువల్ల, లౌకిక ప్రయోజనాలకై ఆయా బృందాలు విడిపోతాయి. భౌతిక, ఆర్థిక ప్రయోజనాల దృష్ట్యా చూస్తే మహమ్మదీయులు, పార్శీలు, హిందువులు తదితర ప్రజలు అంటూ ఉండరు. ఈ ప్రతి బృందంలో భూస్వాములు, కార్మికులు, ధనస్వాములు, స్వేచ్ఛా వ్యాపారులు, దేశీయ గుత్తా వ్యాపారులు తదితరులు ఉంటారు. హిందువులు, మహ్మదీయులు, పార్శీలు మొదలైన వారితో కూడిన ప్రతి బృందానికి భౌతిక మనతగిన సామాజిక ప్రయోజనాలు ఉంటాయి. ఫలితంగా హిందూ అభ్యర్థి మహమ్మదీయుల భౌతిక ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తారు. అలాగే, మహమ్మదీయ అభ్యర్థి హిందువుల భౌతిక ప్రయోజనాలకు ప్రతినిధి కాగలడు. ఆ విధంగా ఆయా సమాజాలలో ప్రధానంగా భౌతిక ప్రయోజనాలకు సంబంధించి ఘర్షణ ఉండదు. ఒకవేళ, మానవ వ్యవహారాలలో భవిష్యత్తులో మత ప్రయోజనాల ప్రాధాన్యం తగ్గుతుందనుకుంటే ఒక బృందం లౌకిక ప్రయోజనాలకు, మరో బృందం అభ్యర్థి బాగానే ప్రాతినిధ్యం వహించగలడు.

8. ఈ అభిప్రాయం దృష్ట్యా, ప్రజా ప్రభుత్వానికి ప్రాదేశిక నియోజకవర్గం సరిపోతుంది. కొద్దిగా ఆలోచిస్తే ప్రజా ప్రభుత్వ నిర్వచనంలో సగం మాత్రమే సాధించబడుతుంది. ఇది ఎంతవరకు నిజమో ఇప్పుడే చెప్పుకుందాం. ప్రాదేశిక నియోజకవర్గంలో వివిధ బృందాల మధ్య ఎన్నికల పోటీ జరిగినప్పుడు ఓటర్లు సహజంగా తమకు సానుభూతిగల అభ్యర్థికి అనుకూలంగా ఓట్లు వేస్తారు. కానీ, ఎవరిపై సానుభూతి చూపాలో ముందే నిర్ణయమవుతుంది. వేరువేరు బృందాలకు చెందిన ఇద్దరు అభ్యర్థులు ఒకే మోస్తరు ప్రయోజనం కోసమని పోటీ చేస్తుంటే ఓటర్లు తమ సమాజానికి చెందిన అభ్యర్థికే ఓట్లు వేస్తారు. ఎక్కువ ఓటర్లు ఉన్న బృందం తమ స్వంత అభ్యర్థులను ఎన్నుకోగలుగుతుంది. ఈ ఓటర్ల విచక్షణ వల్ల చిన్నచిన్న బృందాల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం లభించినా, వ్యక్తిగత ప్రాతినిధ్యానికి అవకాశం పూజ్యం.

9. ప్రయోజనాలకు, అభిమతాలకు తగిన ప్రాతినిధ్యం కల్పించే పథకాల పనిలో ఉండిపోయిన వారికి, వ్యక్తిగత ప్రాతినిధ్య ప్రాముఖ్యాన్ని విస్తారంగా చర్చించడం వ్యర్థమని

పించవచ్చు. అయినంత మాత్రాన, వ్యక్తిగత ప్రాతినిధ్యం అప్రధానమని అనుకోరాదు. ఇటీవలి కాలంలో- "ప్రజలతో ప్రభుత్వం" అనే దానికంటే "ప్రజలకోసం ప్రభుత్వం" అనేదే బాగా ఆకర్షిస్తున్నది. నిజానికి "ప్రజలతో ప్రభుత్వం" లేకపోయినా "ప్రజలకోసం ప్రభుత్వం" బాగుంటుందనటానికి నిదర్శనాలు ఉన్నాయి. రాజకీయ సిద్ధాంతకర్తలంతా ఏక కంఠంతో ఇలాంటి ప్రభుత్వాన్ని ఖండిస్తారు. ఇది ఎందువల్లనో తెలుసుకోవాలి. ప్రతి సంస్థా సుబోధక వాతావరణంతో తన సభ్యుల క్రియాశీల స్వభావాలను తీర్చిదిద్దుతుంది. ఫలితంగా, ఇతరులతో కలిసివున్నప్పుడు ఆ వ్యక్తి ఎలా ఉన్నాడో ఒక వ్యక్తిగా కూడా అలాగే వుంటాడు. ప్రజలతో కాకుండా ప్రజలకోసమనే ప్రభుత్వం కొందరిని పాలకులుగా ఇతరులను పాలితులుగా తయారు చేయడం ఖాయం. సదరు కలయిక ప్రతిబింబింప చేసే ఫలితాలే దీనికి కారణమని భావించవచ్చు. వ్యక్తిత్వ వికాసాన్ని లెక్కగట్టవచ్చు. వ్యక్తిత్వ వికాసం కల్పించటం సమాజం పరమలక్ష్యం. సమాజం వాంఛించే రీతిలో, ఏ వ్యక్తి అయినా తన శక్తి సామర్ధ్యాల మేరకు ఏ పాత్రనైనా నిర్వహించేందుకు స్వేచ్ఛాయుతమైన చొరవను, అవకాశాన్ని, కలిగించే విధంగా సామాజిక ఏర్పాట్లు ఉండాలి. ఒక కొత్త పాత్ర వ్యక్తిత్వ వికాసానికీ, వ్యక్తి అభివృద్ధికీ తోడ్పడుతుంది సమాజం. ప్రభుత్వమూ ఒక సమాజం వంటిదే. అందరూ అన్ని పాత్రలు నిర్వహించలేరు. సమాజం ఎందరి జీవితాలనో పణంగాపెట్టి కొద్దిమంది వ్యక్తిత్వాలనే వికసింప జేస్తుంది. ప్రజాస్వామ్య ప్రయోజనం దృష్ట్యా, ఈ పరిణామానికి స్వస్తి చెప్పాలి. నిర్దిష్టంగా చెప్పాలంటే ప్రజలు కేవలం ఓటర్లుగానే ఉండిపోరాదు. శాసనకర్తలూ కావాలి. లేనిపక్షంలో శాసనకర్తలు కాగలిగినవారు ఓటర్లకు యజమానులవుతారు

**10.** ప్రాదేశిక నియోజక వర్గాలు ఈ దుష్ఫలితాన్ని నిరోధించలేవనే ఉద్దేశంతోనే వాటిని గట్టిగా వ్యతిరేకించవలసి వస్తుంది. ఆయా అభ్యర్థులను, వ్యక్తులను బట్టి కాకుండా వారి వారి కార్యక్రమాల్ని బట్టి ఓటర్లు ఓటు వేస్తారనే తప్పుడు భావనను అవి కల్పిస్తాయి. వాస్తవం ఏమిటంటే ఎన్నుకొనేవారు అలా అర్హులు కావటానికి మొదట్లో ఒక సంఘంలోని సభ్యులు, అభ్యర్థుల వ్యక్తిత్వంతో వారికి సంబంధం కలిగి వుంటుంది. అందువల్ల, ఇద్దరు లభ్యర్థులు ఒకే ప్రయోజనానికి ప్రాతినిధ్యం వహిస్తున్నప్పటికీ వేరే బృందం అభ్యర్థులకే ప్రాముఖ్యం ఇవ్వటం సహజం. ఇలాంటి ప్రాముఖ్యం ఫలితంగా ఒక పెద్ద బృందానికి చెందిన ఓటర్లు క్రమేణా శాసనకర్తలుగా ఉన్నత స్థాయికి ఎదుగుతారు. చిన్న బృందం ఓటర్లు, తమ తప్పిదం లేక పోయినా క్రింది స్థాయిలో ఓటర్లుగానే ఉండిపోకతప్పదు. ప్రజా ప్రభుత్వానికి ఎదురయ్యే ఒక క్లిష్ట సమస్య ఏమిటంటే- ప్రయోజనాలకూ, అభిమతాలకూ ప్రాతినిధ్యం వహించవలసి రావటం. మరోక్లిష్ట సమస్య- వ్యక్తిగత ప్రాతినిధ్యం ప్రాదేశిక నియోజకవర్గాలు చిన్న బృందాల సభ్యులకు వ్యక్తిగత ప్రాతినిధ్యం కల్పించడంలో విఫలమవుతాయి గనుక అవి ప్రజా ప్రభుత్వం ఏర్పాటులోనూ విఫలమవుతాయి.

**11.** కొన్ని సమాజాల రాజకీయ జీవన హక్కు విషయంలో సామాజిక వర్గాలు ఎలా పనిచేస్తాయనే ఈ విశ్లేషణ సరైనదే అనుకొంటే, ఈ పరిస్థితి ఎదుర్కొనేందుకు దామాషా ప్రాతినిధ్యం ఉందనడం – అవకతవక దామాషా ప్రాతినిధ్యం అంటే ఆయా అభిప్రాయాలకు దామాషాలో ప్రాతినిధ్యం ఇవ్వడం. ఓటర్లు ఒక అభ్యర్థికి, అతని వ్యక్తిత్వాన్ని బట్టిగాక, అభిప్రాయాన్ని బట్టి ఓటు చేస్తారని అనుకోవలసి వస్తుంది. ప్రస్తుత ప్రయోజనానికి దామాషా ప్రాతినిధ్యం సరిపడదు.

**12.** ఈ పరిస్థితిని ఎదుర్కొనేందుకు రెండు అనువైన పద్ధతులు ఉన్నాయి. వ్యక్తిగత ప్రాతినిధ్యాన్ని సంతరించుకోలేని మైనారిటీలకు ద్వంద్వ నియోజక వర్గాలలో రిజర్వేషన్లను కేటాయించాలి. లేదా కుల మతపరమైన ఓటర్ల విధానాన్ని అనుమతించాలి. రెంటికీ ప్రయోజనమున్నది. మహమ్మదీయుల ప్రాతినిధ్యం సంగతిచూస్తే ద్వంద్వ నియోజకవర్గాలలో తమకు రిజర్వు చేసిన స్థానాలకు పోటీచేసి, వారు సార్వత్రిక ఎన్నికలలో పాల్గొనడం అత్యంత వాంఛనీయం. హిందువులు, మహమ్మదీయుల మధ్యగల విభజన కారణం. ఈ వరకే పదునెక్కింది. మత ప్రాతినిధ్యం కోరుకుంటే అది మరింత పదునెక్కుతుంది. మత పరమైన ఎన్నికల సంగతి మహమ్మదీయుల మేరకు నిర్ధారణ అయినట్లు అనిపించినప్పటికీ అది మార్చే అవకాశం కనిపించినప్పటికీ మార్పు చేస్తేనే లాభదాయకం.

**13.** మొత్తంపై హిందువులందరికి ప్రాతినిధ్యం– ప్రత్యేకించి అంటరాని హిందువులకు ప్రాతినిధ్యం ఉండాలని ఈ వాదం ముఖ్య ఉద్దేశం. వివిధ హిందూ బృందాలలో తలెత్తిన నవచైతన్యాన్ని వ్యక్తంచేసే ఒక ఉటంకింపుతో హిందువుల ప్రాతినిధ్యంపై చర్చను ప్రారంభించటం సముచితం అదేమిటంటే :

"ప్రత్యేక ప్రయోజనాలకు అవసరమైన రక్షణ దృష్ట్యా మాత్రమే ఒక సమాజం ప్రాతినిధ్యాన్ని కోరుకుంటుంది. భారతదేశంలో ఆ ప్రయోజనాలు మూడు రకాలు: అవి - భారతదేశంలో మరీ బలీయమైన మత వైరుధ్యాలవల్ల తలెత్తుతాయి. లేదా విద్యా విషయకంగా ఒక సమాజంలోని వెనుకబాటుతనం వల్లగానీ, లేదా ఒక సమాజం గురైన సామాజిక మతపరమైన అవలక్షణాల వల్లగానీ తలెత్తవచ్చు. హిందూ సమాజాలకు మనం పరిమితమై చూస్తే కొన్ని సమాజాలు బాగా వెనుకబడి ఉండటమే కాదు, దారుణ సామాజిక నియంతృత్వం క్రింద మగ్గి పోతున్నాయి. అంటరానివారికి తమ దుస్థితులను రూపుమాపుకొనే పోరాటానికై చట్ట సభలో సొంతమనుషులు అంటూ ఉండాలి. బ్రాహ్మణేతర వర్గం బ్రాహ్మణ పూజారుల పెత్తనానికీ, సాంఘిక పెత్తనానికీ, మేధావితనానికీ బలి అవుతున్నారు. అందువల్ల వారికి ప్రత్యేక ప్రాతినిధ్యం అవసరమని వాదించడం సమంజసం".

**14.** హిందువులు కొత్త చైతన్యంతో, అంటరానివారి ప్రత్యేక ప్రయోజనాలను గుర్తించినా– అంటతగిన హిందువులు తమకు తామై ఒక సమైక్య బృందంగా ఆమోదించుకోలేరు.

కొత్త చైతన్యం అంటతగిన వారిని, తమ సొంత ప్రత్యేక ప్రయోజనాల దృష్ట్యా, బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు అనే విభజనను చేయిస్తుంది. మూడు బృందాలుగా విడిపోయే హిందువులకు–మిశ్రమ ఓటర్ల వర్గంలో రిజర్వు సీట్లుగానీ, లేదా ప్రత్యేక ఓటర్ల స్థాయి గాని అవసరమవుతున్నది. అంటరానివారి ప్రాతినిధ్య సమస్యను చర్చించే ముందు బ్రాహ్మణుల, బ్రాహ్మణేతరుల గురించి కూడా కొంత చెప్పాలి.

**15.** బ్రాహ్మణేతరులు విద్యా విషయకంగా వెనుకబడి ఉన్నారనే దాన్ని ప్రత్యేక ప్రయోజనాంశంగా పరిగణించటానికి వీలులేదు. విద్యావిషయకంగా వెనుకబడిన బ్రాహ్మణులతో సహా అందరికీ సర్వ సాధారణంగా ఈ అంశం వర్తిస్తుంది. "బ్రాహ్మణుల మేధాశక్తి సామాజిక పెత్తనం"– బ్రాహ్మణేతరులపై మాత్రమే ప్రభావాన్ని చూపదు. ఇది అందరిపైనా ప్రభావం చూపుతుంది. ఇది అందరి ప్రయోజనాలకు సంబంధించినది. అలాంటప్పుడు బ్రాహ్మణేతరుల ప్రత్యేక ప్రయోజనాల పరిరక్షణకోసం అవసరమైందేమిటి? బ్రాహ్మణేతరులకు ఉమ్మడి ప్రయోజనం ఉన్నదని రుజువుకావటం లేదు. కాబట్టి ఈ వర్గానికి ప్రత్యేక ప్రాతినిధ్యం అవసరమనేవాదం విఫలమవుతున్నది.

**16.** అయితే, వారు వ్యక్తిగత ప్రాతినిధ్య సాధనలో విఫలమవుతారా? దీనిని ఈ క్రింది అంకెలతో చక్కగా వివరించవచ్చు.

| | బృందం – 1 | | బృందం – 2 | |
|---|---|---|---|---|
| స్థానిక బోర్డు ఓటర్ల కులం | బెల్గాం బీజాపూర్, ధార్వాడ్ జిల్లాల స్థానిక బోర్డుల ఓటర్ల సంఖ్య | ఈ మూడు జిల్లాల మొత్తం జనాభా | రత్నగిరి, కొలాబా జిల్లాల స్థానిక బోర్డుల ఓటర్ల సంఖ్య | ఈ రెండు జిల్లాల మొత్తం జనాభా |
| బ్రాహ్మణులు | 4,600 | 85,739 | 4,477 | 89,786 |
| లింగాయతులు | 12,730 | 9,33,123 | – | – |
| మరాఠాలు | 1,074 | 2,55,526 | 3,667 | 4,46,077 |
| మహారులు | 22 | 1,96,751 | 33 | 1,38,738 |
| మహమ్మదీయులు | 661 | 2,95,838 | 1,169 | 1,06,273 |
| ఇతరులు | 4,241 | 1,065,821 | 2,837 | 1,016,930 |
| మొత్తం | 23,328 | 28,32,798 | 12,183 | 17,97,804 |

పైపేర్కొన్న అంకెలను వెయ్యి ప్రాతిపదికకు కుదిస్తే, ఆసక్తికరమైన ఈ క్రింది ఫలితాలు వస్తాయి.

| | బృందం - 1 | | | బృందం - 2 | | |
|---|---|---|---|---|---|---|
| కులాల పేర్లు | ప్రతి వెయ్యి మంది జనాభాకి ఆ కులం జనాభా నిష్పత్తి | అదేకులం జనాభాలో ప్రతివెయ్యి మందికి ఆ కులం ఓటర్ల నిష్పత్తి | ప్రతివెయ్యి మంది ఓటర్లకి ఆ కులం ఒటర్ల నిష్పత్తి | ప్రతివెయ్యి మంది జనాభాకి ఆ కులం జనాభా నిష్పత్తి | అదేకులం జనాభాలో ప్రతివెయ్యి మందికి ఆ కులంఓటర్ల నిష్పత్తి | ప్రతి వెయ్యి మంది ఓటర్లకి ఆ కులం ఓటర్ల నిష్పత్తి |
| బ్రాహ్మణులు | 30.2 | 53.7 | 197.2 | 50.8 | 49.8 | 367.4 |
| లింగాయతులు | 329.4 | 13.6 | 545.7 | - | - | - |
| మరాఠాలు | 90.2 | 4.2 | 46.0 | 248.8 | 8.2 | 300.9 |
| మహారులు | 69.5 | 0.1 | 0.9 | 74.5 | 0.2 | 2.7 |
| మహమ్మదీయులు | 104.4 | 2.2 | 28.3 | 59.2 | 10.9 | 95.9 |
| ఇతరులు | 376.2 | 3.9 | 181.3 | 562.2 | 2.8 | 232.8 |

ఈ లెక్కల ప్రకారం తేలిన సంగతులకు చాలా ప్రాముఖ్యం ఉన్నది.

1. రెండవ గ్రూపు ప్రకారం- అందరికీ ఒకే మోస్తరు ఓటింగు హక్కు ఇస్తే, సంఖ్యాపరంగా అది చిన్న అల్ప సంఖ్యాక వర్గమైనా మొత్తం ఓట్లతో చూస్తే బ్రాహ్మణులు మెజారిటీ వారవుతారు.

2. లింగాయతులు, మరాఠాల వంటి బ్రాహ్మణేతర సమాజాలకు ఒకే మోస్తరు ఓటింగు హక్కు ఇచ్చినప్పుడు వారు ఓటర్ల జాబితాలో కనిపించినప్పటికీ బ్రాహ్మణ జనాభాలో బ్రాహ్మణ ఓటర్ల నిష్పత్తిని బట్టి పోల్చి చూస్తే - బ్రాహ్మణేతరుల జనాభాలో, బ్రాహ్మణేతరుల ఓటర్ల నిష్పత్తి అంత గణనీయం కాదు.

**17.** బ్రాహ్మణులకు వారి ఓటర్ల నిష్పత్తి నిజంగా ఎక్కువే. వారి పట్ల విశ్వాసం వల్లగాని, వారి వర్గ సంఖ్యను బట్టిగాని ఇది సమంజసం కాదు. లింగాయతులు తమ ఓటర్ల నిష్పత్తి తక్కువని న్యాయంగా వాదించినప్పటికీ వ్యక్తిగత ప్రాతినిధ్యంలో విజయం సాధించుకోగలరు. మరారాలు బ్రాహ్మణులకంటే ఎక్కువ సంఖ్యలో వున్నప్పటికీ ఓటర్ల జాబితాలో వారి ఓటర్ల నిష్పత్తి చిన్నదే అయినప్పటికీ తమకు వ్యక్తిగత ప్రాతినిధ్యం సాధించుకోవటంలో విఫలమయ్యే అవకాశం వుంది.

అందువల్ల మరాఠాలకు ప్రత్యేక అవకాశం కల్పించాలనే వాదం సమంజసం, అమోదయోగ్యం.

**18.** ఈ అవకాశం ఏ రూపంలో వుండాలనేది ప్రశ్న. నా అభిప్రాయం ప్రకారం ఇది

రిజర్వుడు స్థానాల ప్రత్యేక ఓటర్ల వర్గంగా కాకుండా ఓటింగు హక్కుకు తక్కువ అర్హతలు వుండే రూపం ధరించాలి. బ్రాహ్మణేతరులకు ఓటు హక్కు ఇచ్చే అర్హతలు బ్రాహ్మణులకంటే తక్కువ స్థాయిలో వుండాలి. ఈ ఏర్పాటువల్ల మరాఠాలు ఓటర్ల జాబితాలో తమ స్థాయిని పెంచుకో గలుగుతారు. తద్వారా పైస్థాయిలో వున్న బ్రాహ్మణులతో వారు సమాన స్థాయిని సాధించవచ్చు. అందరి ప్రయోజనాల దృష్ట్యా, బ్రాహ్మణులు ఇంతవరకు రాజకీయాలలో వహిస్తున్న ప్రముఖ పాత్రను ఇక వహించరానివ్వరాదు. దేశ సామాజిక జీవనంపై వారు హానికరమైన ప్రభావం చూపుతున్నారు. అందరి ప్రయోజనాల దృష్ట్యా, అలాంటి హానికరమైన ప్రభావాన్ని రాజకీయాలలో తగ్గించాలి. ఎందుకంటే బ్రాహ్మణునిది మరీ ప్రత్యేక దృష్టి. అతను సాంఘిక ప్రగతికి వ్యతిరేకి.

**19.** రాజ్యాంగ సంస్కరణల నివేదిక కర్తలు సైతం పరిమితి ఓటు హక్కుకు గానీ, ఒకే మోస్తరు ఓటు హక్కుకు గానీ అనుకూలత వ్యక్తం చేయలేదు. వారు ఇలా అంటారు:–

"సాధ్యమైనంతవరకు విస్తృతంగా ఉండవలసిన ఓటుహక్కు పరిమితులను, విద్యను, ఆదాయాన్ని అర్హతగా భావించవచ్చనే పూర్వపు ఆలోచనలతో కాకుండా ఆచరణలో ఎదురయ్యే ఇబ్బందులను బట్టి నిర్ణయించాలని మేము భావిస్తాము. జనాభా, సంపద – వీటి పంపిణీ సమానంగా లేని దృష్ట్యా ఓటు హక్కు అర్హతలు కేవలం ఆయా రాష్ట్రాల మధ్య కాకుండా ఒకే రాష్ట్రంలోని ఆయా ప్రాంతాలను బట్టి వేరువేరుగా ఉండవలసిన అవసరం ఉన్నది." (పుట 147). అయితే ఓటు హక్కు అర్హతలు కేవలం రాష్ట్రాలకు మధ్య లేదా ఒకే రాష్ట్రంలోని ప్రాంతాలకు ప్రాంతాలకు మధ్య కాకుండా ఒకే రాష్ట్రంలోని ఆయా కులమత వర్గాల మధ్య వేరు వేరుగా ఉండాలని నేను భావిస్తాను. ఇలాంటి వేర్పాటు లేకుంటే సంపన్నులు విద్యావంతులు ఎక్కువగా ఉండే తక్కువ జనాభా సమాజం వారే– ఎక్కువ జనాభా కలిగి కూడా పేదవారుగా, విద్యలేని వారుగా ఉండే సమాజం వారికంటె ఎక్కువ ఓట్లను పొందగలుగుతారు. అందువల్ల ఓటు హక్కులో ఏకరీతి ఉండరాదు. ఫలితంగా కొన్ని బ్రాహ్మణేతర సమాజాలు ఇప్పుడు గొంతెత్తి కోరుతున్న కులమత పరమైన ప్రాతినిధ్యం లేదా స్థానాల రిజర్వేషనుకు స్వస్తి చెప్పాల్సి వుంటుంది.

**20.** అంటరానివారిని మామూలుగా దయనీయులుగా పరిగణిస్తారే తప్ప వారికంటూ పరిరక్షించాల్సిన ప్రయోజనాలు ఏవీలేవనే సాకుతో వారిని రాజకీయ పథకాలలో విస్మరిస్తారు. కాని, వారి ప్రయోజనాలు ఘనాతి ఘనమైనవి. జప్తు కాకుండా పరిరక్షించాల్సిన అపారమైన ఆస్తిపాస్తులు వారికి వున్నవని కాదు. కాని వారి వ్యక్తిత్వమే జప్తు అయిపోతున్నది. సామాజిక, రాజకీయ అనర్హతలు అంటరాని వారిని మానవులుగానే పరిగణించనివ్వడం లేదు. బలి అయిపోతున్న ప్రయోజనాలు, మానవతా ప్రయోజనాలే ఆస్తిపాస్తుల ప్రయోజనాలు. ఇలాంటి ప్రాథమిక ప్రయోజనాలను మించినవి మాత్రం కావు.

**21.** మరొకరికి తన జీవిత విధానాన్ని శాసించే హక్కును ధారాదత్తం చేసిన వ్యక్తే బానిస అనే ప్లేటో నిర్వచనాన్ని అంగీకరిస్తే, అంటరాని వారు నిజంగా బానిసలే. అంటరాని వారు ఎన్నడూ తన హీన స్థితిని గురించి మొరపెట్టుకోలేనంతగా సంఘ చట్రంలో ఇరికి పోయారు. ఇతరులు ఒకరి కొకరు ఇచ్చిపుచ్చుకొనే సాధారణ గౌరవ మర్యాదలను తమకూ ఇవ్వాలని ఇతర వర్గాలను గట్టిగా బలవంత పెట్టి తమ పరిస్థితిని మెరుగుపరచుకోవచ్చని వారు కలలోనైనా ఊహించరు. తమ దురదృష్టానికి తాము పుట్టామనే ఆలోచన వారి మనసులో ఎంతగానో హత్తుకొని పోయి తమ దుర్విధి తిరుగులేనిదని వారు భావిస్తారు. మానవులంతా ఒకే మట్టి నుంచి పుట్టారని; తమను హీనంగా కాకుండా గౌరవ ప్రదంగా చూడాలని పట్టుపట్ట వచ్చనే హక్కు తమకు ఉన్నదని వారిని ఒప్పించడం సాధ్యంకాదు.

**22.** వారిని సంఘం ఎలా చూస్తున్నది అనేది వర్ణనాతీతం. అంటరాని వాడు అనే పదం వారి కష్టనష్టాలకు దుస్థితికి సంక్షిప్త రూపం. అంటరాని తనం వ్యక్తిత్వ వికాసాన్ని అరికట్టడమే కాదు, నిత్య జీవిత సంక్షేమానికీ అడ్డకట్టవేసింది. వారికి కొన్ని పౌర హక్కులు కూడా లేకుండా చేసింది. ఉదాహరణకు కొంకణ ప్రాంతంలో అంటరానివారు పబ్లిక్ రోడ్డుపై నడవడం కూడా నిషేధం. ఎక్కువ కులస్తుడు ఎవరైన ఎదురుపడితే అంటరానివాడు తన నీడకూడా అవతలివానిపై పడకుండా ఆ దారినుండి వైదొలగి నిలవాలి. అంటరానివాడు అసలు పౌరుడే కాదు. పౌరసత్వం అంటే-

1. వ్యక్తి స్వేచ్ఛ
2. వ్యక్తి భద్రత
3. సొంత ఆస్తి హక్కు
4. చట్టం ముందు సమానత
5. అంతరాత్మ స్వేచ్ఛ
6. అభిప్రాయ వ్యక్తీకరణల స్వాతంత్ర్యం
7. సమావేశహక్కు
8. ప్రభుత్వంలో ప్రాతినిధ్యహక్కు
9. ప్రభుత్వంలో ఏదైన పదవిని పొందే హక్కు- వంటి హక్కుల సముదాయం.

బ్రిటిష్‌ప్రభుత్వం క్రమేణా భారత ప్రజలకు సిద్ధాంత రీత్యానైనా వీటిని అంగీకరించిందని చెప్పవచ్చు. ప్రాతినిధ్యహక్కు, పదవిని పొందే హక్కు అనేవి పౌరసత్వ కల్పనలో ముఖ్యమైన రెండు హక్కులు. కాని అంటరాని వారి అంటరానితనం - వారిని ఈ హక్కులకు అందరానంత దూరం చేస్తున్నది. కొన్ని ప్రాంతాలలో వ్యక్తి స్వేచ్ఛ, వ్యక్తి భద్రత, చట్టం ముందు సమానత వంటి మామూలు హక్కులు సైతం వారికి ఎల్ల వేళలా వుండవు. ఇవి, అంటరాని వారి ప్రయోజనాలకు సంబంధించినవి. ఇంకా తేటగా చెప్పాలంటే వారికి

ప్రాతినిధ్యం వహించేది అంటరానివారే అయి ఉండాలి. అవి ప్రత్యేకించి వారి సొంత ప్రయోజనాలు. మరొక వర్గంవారు వాటిని సరిగ్గా ప్రకటించలేరు. స్వేచ్ఛా వాణిజ్య హక్కు- ప్రయోజనాన్ని ఒక బ్రాహ్మణుడుగానీ, ఒక మహమ్మదీయుడు గానీ, లేదా ఒక మరాఠాగానీ బాగా చెప్పగలడు. కానీ వీరెవరూ అంటరాని వర్గానికి చెందిన వారు కాదు కాబట్టి వారి ప్రయోజనాల గురించి మాట్లాడజాలరు. అంటరాని వారికి సంబంధించి సాధించాల్సిన నిర్దిష్ట ప్రయోజనాలు ఉన్నాయి. వాటిని గురించి అంటరాని వారు మాత్రమే మాట్లాడగలరు. అందువల్ల అంటరాని వారి దుస్థితులను రూపుమాపే హక్కులకై వారికి ప్రాతినిధ్యం ఉండి తీరాలి. రెండవది- వారి దుస్థితులను రూపుమాపేందుకు అవసరమైన సంఖ్యాబలంతో ప్రాతినిధ్యం ఉండాలి.

**23.** ఇప్పుడు శాసన నిర్మాణ సభకు తగినంత మంది అంటరాని వారిని ఎన్నుకొనేందుకు సార్వత్రిక ప్రాదేశిక ఓటర్ల వర్గం ఉన్నదా? వెనుకపట్టికలోని అంకెలను పరిశీలిస్తే, అంటరానివారు (పట్టికలో మహారులు) ప్రతి వెయ్యిమంది జనాభాకు 69.4 మంది వంతున ఉన్నప్పటికీ, తమ వర్గంనుంచి వారికి ఒక్క ఓటరు కూడా లేరు. ఇలాంటి పరిస్థితులలో సార్వత్రిక ఓటర్ల వర్గంలో వారికి తమ సొంత మనుషులను ఎన్నుకోవడం అసాధ్యం. పై పెచ్చు అంటతగిన హిందువులు- అంటరాని అభ్యర్థికి ఓట్లు వేస్తారనే ఆశను వారు వదులుకోవాలి. కులాల హెచ్చు తగ్గులు, మత సిద్ధాంత రీత్యా అంటరాని వారిని రెండిందాల కోత పెడతాయి. క్రింది కులాలవారి మదిలో పై కులాల వారికే ప్రాధాన్యం లభిస్తుంది. పై కులాల వారి మదిలో క్రింది కులాల వారిపట్ల తిరస్కారభావం నెలకొంటుంది. ఆ విధంగా - ఎగువ క్రమంలో అంగీకారభావం దిగువ క్రమంలో తిరస్కారం, ద్వేషం- అంటరాని వారిని రెండు విధాలా బికారులను చేస్తాయి. అంటరాని వారికి అంట తగిన వారు ఒక్క ఓటు కూడా ఇవ్వకుండా, అసలే అతి తక్కువ ఓటింగుబలం వున్న అంటరాని వారి ఓట్లను చాలా వరకు లాగివేయడం తథ్యం.

**24.** ఈ పరిస్థితిలో ఎన్నో ప్రయోజనాలను సాధించుకోవాల్సిన అంటరానివారు సార్వత్రిక ప్రాదేశిక నియోజకవర్గంలో మరీ బాధలకు గురి అవుతారు. వారికో ప్రారంభం కల్పించడానికి తగిన ప్రాతినిధ్యం కల్పించేందుకు ప్రత్యేక ఏర్పాటు చేయాలి. ఒక పథకాన్ని రూపొందించే ముందు బొంబాయి రాష్ట్రంలో అంటరానివారి జనాభా ఎంతో చూడడం అవసరం.

బొంబాయి రాష్ట్రంలో 1911 సంవత్సరపు జనాభా లెక్కల నివేదిక ప్రకారం 'కాలుష్యకారణ'మయ్యే కులాల లెక్కలు ఈ క్రింది విధంగా ఉన్నాయి :

| | |
|---|---|
| భంగీలు | 93,691 |
| చమారులు, మోచీలు మాచిగారులు | 3,06,478 |
| సోచీలు, మహరులు, హెూలియాలు, ధేడులు | 1,470,992 |
| మాంగులు, మాదిగలు | 274,037 |
| మొత్తం | 2,145,193 |

ధోడుల సంఖ్యను కూడా చేర్చాలి 13,506

మొత్తం అంటరానివారు 2,158,699

ఆయా జిల్లాలోని అంటరాని వారి జనాభా వివరాలు :

| జిల్లా | మొత్తం జనాభా | హిందువుల జనాభా | అంటరాని జనాభా | మొత్తం జనాభాలో అంటరాని వారిశాతం | హిందువుల జనాభాలో అంటరాని వారిశాతం |
|---|---|---|---|---|---|
| ఆడెన్ మినహా | | | | | |
| బ్రిటిష్ జిల్లాలు | 196,28,477 | 149,20,267 | 16,27,980 | 8 | 10.9 |
| 1. బొంబాయి నగరం | 979,445 | 664,042 | 89,052 | 9 | 11.6 |
| ఉత్తరాది డివిజన్ | 36,85,383 | 3,117,263 | 2,45,050 | 6.6 | 7.8 |
| 2. అహ్మదాబాద్ | 8,27,809 | 6,93,155 | 78,869 | 10 | 11.4 |
| 3. బ్రోచ్ | 3,06,717 | 1,92,935 | 22,390 | 7 | 11.6 |
| 4. కైరా | 6,91,744 | 5,98,164 | 41,497 | 5.9 | 6.9 |
| 5. పంచ్‌మహల్లు | 3,32,695 | 2,74,339 | 14,410 | 4 | 5 |
| 6. సూరత్ | 6,54,109 | 5,71,745 | 36,509 | 5.6 | 6 |
| 7. రాణా | 8,82,309 | 7,86,925 | 50,010 | 5.6 | 6 |
| మధ్యడివిజన్ | 63,87,064 | 59,98,828 | 7,73,184 | 12 | 13 |
| 8. అహ్మదాబాద్ | 9,45,305 | 8,55,676 | 1,16,929 | 12 | 13.6 |
| 9. ఖాన్‌దేశ్ (తూర్పు) | 10,34,886 | 9,02,131 | 1,12,391 | 10.8 | 12 |
| 10. ఖాన్‌దేశ్ (పశ్చిమ) | 5,80,723 | 4,74,200 | 36,809 | 6 | 7.7 |
| 11. నాసిక్ | 9,05,030 | 8,43,705 | 97,740 | 10.7 | 11 |
| 12. పూనా | 1,071,512 | 9,91,725 | 1,13,118 | 12.4 | 13.3 |
| 13. సతారా | 1,081,278 | 1,028,176 | 1,44,688 | 13 | 14 |
| 14. షోలాపూర్ | 7,68,330 | 703,215 | 1,29,063 | 16.7 | 18 |
| దక్షిణాది డివిజన్ | 50,61,150 | 45,02,708 | 3,85,470 | 7.6 | 8.5 |
| 15. బెల్గాం | 9,43,820 | 8,17,797 | 83,199 | 8.8 | 10.1 |
| 16. బీజాపూర్ | 8,62,973 | 7,57,542 | 80,501 | 9 | 10.6 |
| 17. ధార్వాడ్ | 10,26,005 | 8,72,885 | 52,540 | 5 | 6 |
| 18. కనరా | 4,30,548 | 3,83,624 | 10,767 | 2.4 | 2.9 |
| 19. కొలాబా | 5,94,156 | 560,266 | 51,108 | 8.5 | 9.1 |
| 20. రత్నగిరి | 12,03,638 | 11,10,594 | 1,07,354 | 8.9 | 9.7 |
| సింధ్ (బ్రిటిష్ జిల్లాలు) | 3,513,435 | 837,426 | 135,224 | 3.8 | 16 |

**25.** 1911 జనాభా లెక్కల ప్రకారం బొంబాయి ప్రెసిడెన్సీ (బ్రిటిష్ జిల్లాలు మాత్రమే) మొత్తం జనాభా 19,628,477. ఇందులో అంటరాని వారి జనాభా 1,627,980 లేదా మొత్తం జనాభాలో 8 శాతం. బొంబాయి శాసన మండలికి ఎన్నికైన ప్రతినిధులు 100 మంది ఉన్నారనుకొంటే, మండలిలో అంటరాని వారికి ప్రాతినిధ్యం వహించేందుకు 8 మంది ప్రతినిధులు ఉండాలి. ప్రతి 2,00,000 మందికి (20 మిలియన్ల జనాభాకు 100 మంది ప్రతినిధుల నిష్పత్తి) ఒక ప్రతినిధి వంతున కేటాయిస్తే అంటరానివారు తమకు 8 మంది ప్రతినిధులు ఉండాలని ఖచ్చితంగా కోరవచ్చు. అయితే బొంబాయి ప్రెసిడెన్సీలోని అంటరాని వారికి మొత్తం మీద 9 మంది ప్రతినిధులను అనుమతించవచ్చు. అదనంగా ఒక సభ్యుని ఎన్నుకోవడం ఎలా సమంజసమో తర్వాత చూద్దాం.

**26.** తొమ్మిది మందిని ఎన్నుకొనేందుకు అనుమతించి, వారిని ఎన్నుకొనే నియోజక వర్గాలు ఈ కింది విధంగా ఉండేలా చూడాలి.

1. బొంబాయి నగరం, సింధ్ రాష్ట్రం మినహా ప్రెసిడెన్సీలోని అన్ని జిల్లాలను ఈ క్రింది విధంగా భాషా ప్రాతిపదికపై ఒక్కొక్క బృందంగా కలపాలి.

| 1. గుజరాతీ మాట్లాడే జిల్లాలు | | 2. మరాఠీ మాట్లాడే జిల్లాలు | | 3. కన్నడం మాట్లాడే జిల్లాలు | |
|---|---|---|---|---|---|
| 1. అహ్మదాబాద్ | 78,969 | 1. ఠాణా | 50,010 | 1. ధార్వాడ్ | 52,540 |
| 2. బ్రోచ్ | 22,390 | 2. కొలాబా | 51,108 | 2. బీజాపూర్ | 80,503 |
| 3. కైరా | 41,497 | 3. రత్నగిరి | 1,07,354 | 3. బెల్గాం | 83,199 |
| 4. పంచమహల్లు | 14,410 | 4. అమ్మద్‌నగర్ | 1,16,929 | 4 కనరా | 10,758 |
| 5. సూరత్ | 36,509 | 5 ఖాన్‌దేశ్ (పశ్చిమ) | 36,809 | | |
| | | 6. ఖాన్‌దేశ్ (తూర్పు) | 1,12,391 | | |
| | | 7. సతారా | 1,44,738 | | |
| | | 8 పూనా | 1,48,118 | | |
| | | 9. నాసిక్ | 96,740 | | |
| | | 10. షోలాపూర్ | 1,29,063 | | |

**27.** అంటరాని వారి నియోజక వర్గాల, ప్రతి నియోజకవర్గం ఎన్నుకోవాల్సిన సభ్యుల సంఖ్య ఇలా ఉండాలి.

| | జిల్లా | ప్రతి జిల్లా జనాభా | ప్రతినియోజక వర్గం జనాభా | నియోజక వర్గం సంఖ్య | ఆ నియోజకవర్గం ఎన్నుకోవాల్సిన ప్రతినిధులసంఖ్య |
|---|---|---|---|---|---|
| | బొంబాయినగరం | 89,052 | 89,052 | I | 1 |
| | 1. అహ్మదాబాద్ | 78,869 | | | |
| | 2. బ్రోచ్ | 22,390 | | | |
| I గుజరాతీ | 3. కైరా | 41,497 | 1,93,67.5 | II | 1 |
| | 4. పంచమహళ్లు | 14,410 | | | |
| | 5. సూరత్ | 36,509 | | | |
| | 1. ఠాణా | 50,010 | 2,08,472 | III | 1 |
| | 2. కొలాబా | 51,108 | | | |
| | 3. రత్నగిరి | 1,07,354 | | | |
| | 4. అహ్మద్‌నగర్ | 1,16,929 | | | |
| II మరాఠే | 5. ఖాన్‌దేశ్ (తూర్పు) | 1,12,391 | 3,63,869 | IV | 2 |
| | 6 ఖాన్‌దేశ్ (పశ్చిమ) | 36,809 | | | |
| | 7. నాసిక్ | 97,740 | | | |
| | 8.సతారా | 1,44,688 | | | |
| | 9. పూనా | 1,33,118 | 4,06,869 | V | 2 |
| | 10. షోలాపూర్ | 1,29,063 | | | |
| | 1. బెల్గాం | 83,199 | | | |
| | 2. బీజాపూర్ | 80,501 | | | |
| III | 3. ధార్వాడ్ | 52,540 | 2,27,007 | VI | |
| కన్నడులు | 4. కనరా | 10,767 | | | |
| | 5 సింధ్ | 1,35,224 | 135,224 | VII | 1 |

ప్రెసిడెన్సీలోని అంటరానివారు ఎన్నుకోవాల్సిన మొత్తం ప్రతినిధుల సంఖ్య

ఎన్నికైన ఈ 9 మంది సభ్యులూ ఒక నియోజకవర్గంగా ఏర్పడి, తమలో ఒకరిని ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లోని ఈ ప్రెసిడెన్సీకి చెందిన అంటరాని వారికి ప్రాతినిధ్యం వహించేందుకు ఎన్నుకోవాలి.

**28.** అంటరాని వారి జనాభాకు ఈ 8 మంది ప్రతినిధులూ ఎక్కువ కాకపోయినా,

అంటరాని వారి ఓటింగు బలం ప్రకారం ఎక్కువ అనే అభ్యంతరం రావచ్చు. అంటరాని వారు పేదవారు. ఒకే మోస్తరు ఓటు హక్కు అర్హతలతో, ఇతర సమాజాలతో పోల్చి చూస్తే ప్రతి వెయ్యిమందికి వారికి వచ్చే ఓటర్ల సంఖ్య అతి తక్కువగా ఉంటుందనేది వాస్తవం. అయితే, అంటరాని వారి ఈ పరిస్థితి తీవ్రమైందని భావిస్తే, వారి ప్రతినిధుల సంఖ్యను కుదించడానికి బదులు వారి ఓటర్ల సంఖ్యను పెంచాలనేది ధ్యేయం కావాలి. అంటే, అంటరాని వారికి సంబంధించి ఓటు హక్కు అర్హతలను తగ్గించేందుకు మనం పాటు పడాలి.

**29.** ఓటుహక్కు అర్హతలు ఎలా వుండాలి అనేది ఒక ముఖ్య విషయం. తెలివితేటలతో ఉపయోగించే వారికే ఓటు హక్కు ఇవ్వాలనే వాదం ఒకటుంది. ఈ అభిప్రాయానికి విరుద్ధంగా ప్రొఫెసర్ ఎల్.టి.హాబ్‌హౌజ్ మాటలలో ఈ వాస్తవాన్ని చెప్పాలి.

"ప్రజాస్వామ్య విజయం ఓటర్లు తమకు లభించే అవకాశాలపై, ప్రతిస్పందించే తీరుపై ఆధారపడి వుంటుంది. మరో విధంగా చెప్పాలంటే ఆ అవకాశాలు ప్రతిస్పందనను కలిగించే క్రమ పద్ధతిలో ఉండాలి. ప్రజా ప్రభుత్వాన్ని అమలులో పెట్టించటం స్వయంగా అన్ని రకాల శిక్షణను ఇస్తుంది. ఓటు హక్కును కలిగించటం అంటే వాళ్లలోని ఆశక్తిని పురికొల్పే ప్రేరణను ఇవ్వడమే. ఘోషించే నిరంకుశత్వం ఆటలాడించే వారినుండి స్తబ్దులైన పౌరులకు సమర్థవంతంగా విమోచన కలిగించేది బ్యాలెటు మాత్రమే. బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని అందించక పోవటానికి గానీ, ఓటు హక్కు పరిధిని కుదించడానికిగానీ స్తబ్దత ఒకటే కారణం కాదు". ఓటు హక్కు ఒక శిక్షణ అనుకొన్నప్పుడు, సాంఘిక బృందాలమధ్య సంపదలు, విద్యవీటి పంపిణీ సమానంగా లేనప్పుడు ఆ బృందాలకు భావసారూప్య సానుభూతి లేనప్పుడు సమాన ఓటుహక్కు సాధ్యం కాదని ఆయా నివేదికల కర్తలు సవ్యంగా వాదిస్తారు.

**30.** కాని, అంటరానివారి విషయానికొస్తే వారి ప్రతినిధుల సంఖ్యను తగ్గించేందుకు కొద్ది కారణాలు ఉంటే వారి నియోజక వర్గాన్ని విస్తరింపజేయాలనటానికి అనేక కారణాలు ఉన్నాయి. అమలులో వున్న ఓటు హక్కుతో అంటరాని వారు విస్తారమైన ఓటర్ల బలం పుంజుకోని పక్షంలో అది వారి తప్పిదం కాదు వారికి వ్యక్తిగతంగా పెనవేసుకొన్న అంటరానితనమే వారిని నైతికంగా, ఆర్థికంగా అభివృద్ధి చెందనీయదు. సంపదలు కూడగట్టుకొనే ముఖ్య సాధనాలు వాణిజ్యమూ, పరిశ్రమలూ, ఉద్యోగాలూ. అంటరానివారు తమ అంటరానితనం కారణంగా వీటిలో ఏ ఒక్కదాన్ని చేపట్టలేరు. అంటరానివాడైన వ్యాపారి వద్ద హిందువులు ఏవీ కొనుక్కోరు ఒక అంటరాని వ్యక్తి లాభసాటి వృత్తిని చేపట్టలేడు. తూర్పు ఇండియా కంపెనీ కాలం నుంచీ సైనిక ఉద్యోగాలు అంటరాని వారికి గుత్తాగా ఉండేవి. వారు అధిక సంఖ్యలో సైన్యంలో చేరారు. మార్క్వెస్ ట్వీడిల్ డేల్ భారత సైనిక కమిషన్ (1859)కు సమర్పించిన పత్రంలో ఇలా పేర్కొన్నారు.

"నిమ్న కులస్థుల వారి సహాయంతోనే భారతదేశాన్ని జయించామనే విషయాన్ని

మరువరాదు" అయితే, తిరుగుబాటు తర్వాత బ్రిటిష్‌వారు మరాఠాను సైన్యంలో చేర్చుకొన్నప్పుడు బొంబాయి సైన్యం ప్రాపకంలో ఉన్న నిమ్న జాతీయులు సంకట పరిస్థితిలో ఎందుకు పడ్డారంటే- మరాఠాలు వారికంటే మెరుగైన సైనికులని కాదు, నిమ్న కులాల అధికారుల క్రింద పనిచేయరాదనే మతాచారం వల్లనే. ఈ దురభిప్రాయం ఎంత బలంగా పాదుకొన్నదంటే కులాతీతులైన బ్రిటిషువారు సైతం అంటరాని వారి నియామకాలకు స్వస్తి చెప్పవలసి వచ్చింది. అలాగే, అంటరాని వారిని పోలీసు ఉద్యోగాలలో నియమించేందుకు కూడా నిరాకరించారు. ఎన్నో ప్రభుత్వ కార్యాలయాలలో అంటరాని వ్యక్తికి స్థానం లభించటం అసాధ్యం. మిల్లులో సైతం వివక్ష ఉన్నది. చాలామంది అంటరాని వారు నేతపనిలో మంచి నేర్పరులైనా నూలు మిల్లుల నేత విభాగాలలో వారిని చేర్చుకోరు. బొంబాయి మున్సిపాలిటీ విద్యావిధానంలోని ఒక దృష్టాంతాన్ని ఇక్కడ చెప్పుకోవచ్చు. భారతదేశంలోని వివిధ కార్పొరేషన్ల కంటే ఎక్కువ స్వాతంత్ర్యంగల కార్పొరేషన్ పాలనలో ఉన్న సర్వజాతి సమభావంగల బొంబాయి నగరంలో రెండు వేరువేరు రకాల పాఠశాలలు ఉన్నాయి. ఒకటి అంటతగిన వారి పిల్లలది. మరొకటి అంటరాని వారి పిల్లలది. ఇందులోనే గమనించాల్సిన ముఖ్యఅంశం ఒకటి ఉంది. మరీ ముఖ్యంగా గమనించాల్సిన అంశం మరొకటి వుంది. పాఠశాలల్లో విభజనలు ఉన్నందువల్ల ఉపాధ్యాయులలోనూ అంటతగినవారు, అంటరానివారు అనే తేడా వచ్చింది. అంటరాని ఉపాధ్యాయుల కొరత కారణంగా కొన్ని అంటరాని వారి పాఠశాలలను, అంటతగిన తరగతికి చెందిన ఉపాధ్యాయులే నడపవలసి వచ్చింది. ఇందులో హృదయ విదారకమైన విషయం ఉంది. అంటరాని వారి బడి సర్వీసులో హైయర్ గ్రేడు పదవి వస్తే, అది ఎలాగూ వచ్చేదే గనక శిక్షణ పొందిన అంటరాని ఉపాధ్యాయులు తక్కువగా ఉన్నందువల్ల అంటతగిన ఉపాధ్యాయుడిని ఆ గ్రేడుకు పంపవచ్చు. కాని అంటతగిన వారి బడిలో గ్రేడు ప్రారంభించినప్పుడు మాత్రం అంటరాని ఉపాధ్యాయుడిని ఆ గ్రేడుకు పంపటానికి వీల్లేదు. అంటరాని బడిలో ఖాళీవచ్చే వరకు అతను వేచి ఉండాలి!! హిందూ సామాజిక జీవన నీతి ఇలాంటిది. ఇలాంటి పరిస్థితులలో అంటరాని వారు పేదవారైతే చిన్నదైన వారి ఓటర్ల జాబితా కారణంగా వారికి ఈ కమిటీ ప్రాతినిధ్యాన్ని నిరాకరించదని ఆశిద్దాం. అంతే కాకుండా అంటరాని వారిని దారిద్ర్యంలోకి నెట్టిన దుష్ట పరిస్థితులను తొలగించుకొనేందుకు వీలుగా వారికి తగిన ప్రాతినిధ్యం కల్పించే మార్గాన్ని అన్వేషించాలి. ప్రస్తుతం సంపదను కూడబెట్టుకొనే మార్గాలన్నీ మూతపడినప్పుడు అంటరాని వారికి ఓటుహక్కు ఇచ్చేందుకు హెచ్చు ఆస్తి, అర్హత కావాలనటం అవివేకం. వారికి ఆస్తులు సమకూర్చుకొనే అవకాశాలను మృగ్యంచేసి, మళ్లీ ఆస్తి అర్హత కావాలనటం పుండుపై కారం చల్లినట్లే కాగలదు. అంటరాని వారిలో తగిన బెట్టు బలం పెరగటానికి ఎలాంటి అర్హతలు, ఎలాంటి యోగ్యతలు అవసరమవుతాయి? తగిన సమాచారం లేనందువల్ల ఈ విషయాన్ని కమిటీ నిర్ణయానికే వదలివేస్తున్నాను. సాధ్యమైనంత ఎక్కువ మంది అంటరాని వారికి రాజకీయ జీవన

కలిగించేందుకు వీలుగా ఓటు హక్కు అర్హతలను తగ్గించటం శ్రేయస్కరం. వారు తమ గురించి తాము తెలుసుకోలేనంతగా దిగజారి పోయారు. అంటరాని వారికి ప్రాతినిధ్యం ఎలా వుండాలి అని నిర్ణయించేటప్పుడు అంటరాని వారి ప్రయోజనాలను పరిరక్షించడానికి పూనుకొన్న ఈ కమిటీ నియోజక వర్గంలో ఉన్న ఓటర్ల సంఖ్యను బట్టి ప్రతినిధుల సంఖ్య నిర్ణయించటం గాక, నిర్ధారించిన ప్రతినిధుల సంఖ్యను బట్టి నియోజక వర్గంలోని ఓట్ల సంఖ్యను విస్తరింప జేయాలనే విషయం నొక్కి చెప్పదలచాను.

**31.** ఈ సందర్భంగా, లార్డ్ మోర్లే చెప్పినదాన్ని కమిటీకి గుర్తు చేయడం అప్రస్తుతం కాదని భావిస్తాను. "సిసలైన సామాజిక శక్తుల మధ్య సమతుల్యతను సాధించేందుకు ఆయా సమాజాల కోర్కెలు, అవసరాలను తీర్చేందుకు శాసనమండలి సహేతుక రీతిలో సమర్థవంతంగా నిజాయితీగా ప్రాతినిధ్యం వహించాలనేది ప్రభుత్వ ఆశయం. బీజగణిత, అర్థగణిత, రేఖాగణిత పద్ధతితోనో లేదా తర్క పద్ధతితోనో విశాల దృక్పథంతోనో ఇది సాధ్యమవుతుంది. ప్రాతినిధ్యాన్ని ఒక మేరకు నిర్ణయించేటప్పుడు సంఖ్యలు ప్రధానమైన అంశం. అయినప్పటికీ ప్రతినిధుల సంఖ్యను ప్రభావితం చేసే సవరణలు ఏవైనా జరిగినా రాజీపడటం హానికరం కాకపోవచ్చు" అంటారాయన. అందువల్ల బొంబాయి ప్రెసిడెన్సీ పైన పేర్కొన్న విధంగా ఏర్పడిన నియోజక వర్గాల నుంచి అంటరానివారిని 9 మందిని ఎన్నుకొనేందుకు అనుమతించాలి. ఈ 9 మంది సభ్యులూ మళ్లీ ఒక నియోజక వర్గంగా ఏర్పడి తమలో ఒకరిని ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు అంటరానివారి ప్రతినిధిని ఎన్నుకోవాలి. మిగిలిన 8 మందినీ బొంబాయి శాసన మండలిలో అంటరానివారి ప్రతినిధులుగా మిగిల్చాలి.

**32.** మత ప్రాతిపదిక ఓటర్ల పద్ధతితో పాటు అంటరానివారి ప్రాతినిధ్యానికి ఇతర పథకాలు ఉన్నాయి. ఆ పథకాల గురించి ఏమి చెప్పకుండా ఈ ప్రసంగం ముగించడం సబబు కాదు.

**33.** మహమ్మదీయుల విషయంలోతప్ప మిగిలిన వారి విషయంలో మత ప్రాతిపదిక ప్రాతినిధ్యాన్ని కాంగ్రెస్ నిరాకరించింది. నామినేషన్ల పద్ధతిని విస్తారంగా వాడడాన్ని కూడా వ్యతిరేకిస్తున్నది. అలాంటప్పుడు అంటరానివారికి మిగిలిన ఏకైక మార్గం సార్వత్రిక ఎన్నికలలో పోరాడడమే. అందరూ సమానంగా పోరాడగలిగిన అవకాశమే ఉన్నట్లయితే ఇది బాగానే ఉండేది. అంటరాని వారికి శాస్త్ర బోధలు చేసి వారిని అంటతగిన వారికి అనుకూలమైన వారిగా మార్చి, అంటతగిన వారిని మాత్రం అంటరాని వారి వ్యతిరేకులుగానే ఉంచి– ఆ రెండు వర్గాలను బహిరంగ పోటీకి దించాలని ప్రతిపాదించడం కుటిల మనస్తత్వం– అయితే కాంగ్రెస్‌వారు ఎక్కువగా రాజకీయంగా మౌలిక విప్లవాదులూ, సామాజికంగా సంప్రదాయ వాదులు అనే సంగతి మరువరాదు. సమాజం, రాజకీయం– రెండూ విలక్షణ అంశాలనీ ఒక దానికొకటి సంబంధం లేనివని వారి ఉద్ఘాటన. సమాజం, రాజకీయం రెండూ వేరువేరు ఉడుపులనీ,

ఋతువులను బట్టి ఒక్కొక్కసారి ఒక్కొక్క దానినే ధరించాలనీ వారంటారు. ఇలాంటి మనస్తత్వం హాస్యాస్పదం. ఇందులో దాగిన వారి స్వార్థం దృష్ట్యా దీనిని ఆమోదించడానికైనా, త్రోసి పుచ్చడానికైనా ముందు మనం లో గా గమనించవలసిందేమి లేదు. అలాంటిది వారి లాభసాటి నమ్మకం. అది కుక్క చావు చస్తు ది. ఇలా కృత్రిమ పూర్వక సిద్ధాంతంతో మొదలైన కాంగ్రెస్ కార్యక్రమాలు వాటికే సహజంగా అలవాటు పడ్డాయి. కాంగ్రెస్ సభకు హాజరైన వారికి అదే పందిరిలో జరిగిన జాతీయ సామాజిక సభకు హాజరు కావాలనే ధ్యాస లేకపోయింది. నిజం చెప్పాలంటే కాంగ్రెస్ సభకు హాజరైన వారు సామాజిక సభ ఇదే పందిరిలో జరుగరాదని ప్రచారం మొదలెట్టారు. మన ప్రెసిడెన్సీలో మేధావులకు నిలయమైన పూణే నగరంలో కాంగ్రెస్ పందిరి క్రింద ఆ సభను జరిపేందుకు ఒకసారి నిరాకరించారు. కాంగ్రెస్ సంస్థ జాతీయేతరమైంది. జాతీయ విరుద్ధమైంది. గనుక, కుల-మత ప్రాతిపదిక ఓటుహక్కుపై ఆ సంస్థ అభిప్రాయాలు తీవ్రంగా పరిశీలించతగినవి కావు.

34. మితవాదులు తమ ప్రత్యేక సమావేశంలో న్యాయం చూపక పోయినా జాలినెంతో ప్రకటించారు. బహుసభ్య నియోజక వర్గంలో వెనుకబడిన కులాల వారికి రిజర్వేషన్లు ఇవ్వాలని వారు ప్రతిపాదించారు. అంటరాని వారికి ఎన్నిసీట్లు కేటాయించాలో వారు నిర్దిష్టంగా చెప్పలేదు. మొత్తంపై మితవాదులలో కొందరు ప్రాజ్ఞులు, దయామయులూ అయిన వారి అభిప్రాయం ప్రకారం శాసనమండలిలో అంటరాని వారికి ఒకటో, రెండో స్థానాలు ఇస్తే చాలన్నారు. ఈ మాత్రం సానుభూతి చూపినందుకు వారికి కృతజ్ఞతలు చెప్పవలసి వున్నా ఈ పెద్ద మనుషుల వాదం అంగీకరించడం సాధ్యం కాదు. అంటరాని వారికి ఒకరిద్దరు ప్రతినిధులను కేటాయించినా ఒకటే కేటాయించకపోయినా ఒకటే. శాసన మండలి అంటే పాతరకం మోజుల దుకాణం కాదు. సామాజిక సంక్షేమం కల్పించడానికైనా భంగ పరచడానికైనా అధికారాలు కలది శాసనమండలి. కేవలం ఒకరిద్దరు అంటరానివారు తమపరిస్థితి మెరుగు పరచుకొనేందుకు శాసన పరమైన చర్యలను ఎలా చేపట్టగలరు? లేదా తమ పరిస్థితిని మరీ దిగజార్చే శాసన చర్యలను ఎలా అడ్డుకోగలరు? నిక్కచ్చిగా చెప్పాలంటే అగ్రజాతి హిందువులకు సంక్రమించే రాజకీయ అధికారం నుంచి అంటరాని వారు అంతగా మేలు ఆశించలేరు ఆ అధికారాన్ని అంటరాని వారికి వ్యతిరేకంగా వినియోగించరేమో, అదీ నమ్మకం లేదనుకోండి, అయినా వారి అభ్యున్నతికి మాత్రం వెచ్చించబోరని ఖచ్చితంగా చెప్పవచ్చు. శాసన మండలికి తనకు ఇష్టమైన ఏ పనైనా చేసే సర్వసత్తాక అధికారాలు ఉంటే ఉండవచ్చు కాని అది చేసే పనులు దాని సొంత లక్షణాలపై ఆధారపడి ఉంటాయి. ఇంగ్లీషు పార్లమెంటుకు ఏ పనైనా చేసే సర్వసత్తాక అధికారాలు వున్నా అభిమానుల పాత్ర రక్షణను మాత్రం చట్ట విరుద్ధమని ప్రకటించలేదు. సుల్తాన్ సర్వాధికారి అయినా మహమ్మదీయుల మతాన్ని మార్చగలిగి కూడా మార్చలేడు. అలాగే పోపు క్రైస్తవమతాన్ని తోసి వేయడు. అదే మాదిరిగా, ప్రధానంగా పైకులాల వారితో కూడిన శాసనసభ అంటరానితనాన్ని నిర్మూలించేందుకు వర్ణాంతర

వివాహాలను అనుమతించేందుకు పబ్లిక్ రోడ్లపై అంటరానివారు నడువరాదనే నిషేధాన్ని తొలగించేందుకు పబ్లిక్ దేవాలయాలు, పబ్లిక్ పాఠశాలలకు అంటరాని వారిని కూడా వెళ్లనిచ్చేందుకు ఒక్క ముక్కలో చెప్పాలంటే ఒక వ్యక్తిని అంటరాని తనంనుంచి పరిశుద్ధుణ్ణి చేసేందుకు చట్టాలు చేయలేదు. అంటే వారు చేయలేరని కాదు, అసలు చేయకూడదనుకుంటారు మరి. కొన్ని సామాజిక పరిస్థితుల నుంచి చట్టం పుడుతుంది. సమాజం దేనికి నిర్దేశిస్తుందో అదే దాని శక్తి అవుతుంది. ఇంత స్పష్టంగా తెలిసే దాన్ని త్రోసి పుచ్చలేము. గతంలో జరిగినదాన్ని బట్టి భవిష్యత్తులో జరగబోయే దాన్ని ఊహించవచ్చు. మండలిలోని ఎక్కువ కులాలవారు సామాజిక సమస్యలపై చట్టాలను చేయనివ్వరు. గౌరవనీయులు శ్రీ దాదాభాయి 1916లో ఇంపీరియల్ లెజిస్లేట్ కౌన్సిల్ లో ప్రవేశ పెట్టిన తీర్మానం దీనికి నిదర్శనం అంటరానివారి ప్రయోజనాలకోసం పాటుపడతామని చెప్పుకొనే అనేకులు సైతం ఈ తీర్మానాన్ని తీవ్రంగా దుయ్యబట్టిన విషయం అందరికీ తెలిసినదే. బయట పడని విషయం ఏమిటంటే ఆ తీర్మానం వీగిపోయినా ప్రతిపాదకుణ్ణి మాత్రం క్షమించలేక పోయారు. ఇలాంటి హేయమైన తీర్మానం ప్రవేశపెట్టడం పాపంతో సమానమన్నారు. "అసలు దిగజారిపోయిన వారే అంటరాని వారి ఉద్ధరణకు పాటు పడతారు" అని ఒక వ్యాసంలో రాసిన గౌ॥ కపర్దీ వంటి పెద్ద మనిషికి తదుపరి ఎన్నికలలో స్థానం కల్పించేందుకే పై ప్రతిపాదకుడు ఎన్నిక నుంచి తప్పుకోవాల్సి వచ్చింది.

ఎక్కువ కులాలవారు అంటరాని వారిపై చూపించే ఇది సానుభూతి పేరిట కక్షసాధింపు కాదు గదా?

35. అంటరాని వారికి ఒకరిద్దరు ప్రతినిధులు చాలుననే వారు రాజకీయ హక్కు నిజ భావాన్ని గ్రహించలేక పోతున్నారు. రాజకీయ హక్కుకు గల పరమార్థం సాంకేతికంగా ఓటు హక్కులో ఇమిడి వున్నప్పటికీ చట్టాలు చేసేందుకు ఓటు వేయడంతో, లేదా చట్టాలు చేసే వారికి ఓటు వేయడంతో ఈ ఓటు శక్తి సార్థకం కాదు. కొన్ని చర్యలకు అనుకూలంగా గాని, ప్రతికూలంగా గానీ మాట్లాడే వీలు కల్పించడంతో గానీ, సభకు హాజరై అవుననో, కాదనో-చెప్పే అవకాశం కల్పించడంతో గానీ ఓటు హక్కు పూర్తికాదు. అనేక మంది పేర్లు వున్న కాగితం ముక్కను బ్యాలెటు పెట్టెలో వేసే హక్కు ఇది కల్పిస్తుందనుకున్నా అనేక మామూలు దైనందిన కార్యక్రమాలకంటే ఈ ఓటు వేయడం ఏ రకంగానూ అధికమైన విలువగలది కాదు. ఓటు వినియోగంలోని వ్యవహారాల పరిజ్ఞానం కలిగిస్తాయి గానీ అది మామూలు వ్యవహార పరిజ్ఞానం వంటిదే. సంఘ జీవనానికి ఆధారభూతమైన నియమ నిబంధనల రూపకల్పనలో మరుకుగా, నేరుగా పాల్గొనే అవకాశాన్ని కలిగించడమే ఓటు హక్కు (రాజకీయ హక్కు) పరమావధి. అంటతగిన వారికీ, అంటరాని వారికీ మధ్య ఇప్పుడు సంఘజీవన పద్ధతుల దృష్ట్యా చూస్తే ఇవి అంటతగిన వారికి ఎంతో సిగ్గుమాలిన తనంగానూ అంటరాని వారికి తీవ్ర హానికరంగానూ వుంది. ప్రజల శక్తియుక్తులను సమర్థవంతం చేయాలంటే వారు నిర్వహించే విధులను, వారి సామాజిక పరిస్థితులను నిర్ణయించే శక్తి ఒకటి వుండాలి. ఆ పరిస్థితులు మరీ

కఠినమైనవైతే అంటరాని వారి ప్రయోజనాల దృష్ట్యానే గాకుండా అంటతగినవారి ప్రయోజనాల దృష్ట్యానూ వాటిని సవరించాలి. ఆ సవరణలపై అంటరాని వారి ప్రభావం ఉండాలి. అంటరాని వారు సాధించుకోవాల్సిన ప్రయోజనాల తీవ్రతను బట్టి చూస్తే మునుపు ప్రతిపాదించిన మేరకు వారి జనాభా దామాషా ప్రకారం వారికి ప్రాతినిధ్యం కల్పించాలి. ఒకరిద్దరికి ప్రాతినిధ్యం కల్పించడం ఏదో దయ చూపించినట్టవుతుంది తప్ప, న్యాయమూ కాదు, సరిపడినంత ప్రాతినిధ్యం ఇవ్వడం అంతకన్నా కాదు. లార్డ్ మార్లే మాటల్లో ఇంతకు ముందే చెప్పినట్టు "ప్రాతినిధ్యాలు సంఖ్యలను బట్టికాదు అవసరాలను బట్టి ఏర్పరచాలి"

36. ఇటీవల అంటరాని వారి ప్రాతినిధ్యానికి సంబంధించి అట్టడుగు వర్గాల సంస్థ ఒక పోటీ పథకాన్ని ముందుకు తెచ్చింది. దీని పేరు కోఆప్షన్ పథకం. మండలికి ఎన్నికైన సభ్యులు కో ఆప్షన్ ద్వారా అంటరాని వారిని నామినేట్ చేయవచ్చని ఈ పథకం ప్రతిపాదించింది. అంటరాని వారికోసం ఈ సంస్థ ఇచ్చిన సలహాకు నవ్వాలో ఏడవాలో తేల్చుకోవడం కష్టం. ఇలాంటి అవివేక పథకం ఎప్పుడైన అమలులోకి వస్తుందని నమ్మితే ఏడవాలి. దానికంటే నవ్వి ఊరుకోవడం మంచిది. ఎవరైనా జాలి ఒలకబోస్తున్నారంటే అది అయిష్టతను కప్పి పుచ్చుకొనే ముసుగు అన్నమాట. వారు ఇతరులకు ఏది మంచిదో స్వంతంగా తెలుసుకొని సాధించే అవకాశం ఇచ్చేందుకై వారితో అంగీకారానికి వచ్చే కృషికిబదులు వారికి ఏది మేలో తామే శాసించాలని యత్నిస్తారు. ఈ పథకం ద్వారా దీనిని తేలిగ్గా అర్థం చేసుకోవచ్చు. అట్టడుగు వర్గాల వారిని ఎక్కువ కులాలకు చెందిన తమ యజమానుల సామాజిక నియంతృత్వం నుంచి విముక్తులను చేసి, వారి పరిస్థితులను మెరుగు పరచాలనే ఆశయంతో ఈ సంస్థ తమ పిల్లలు, లేదా వారి ప్రతినిధులను మునుపటి యజమానులకు కట్టుబానిసలను చేసే పథకాన్ని విధిగా ప్రబోధించాల్సి వచ్చిన చేటు కాలంలో పడింది. యజమానులూ, సంస్థవారూ కలసి అట్టడుగు వర్గాల వారిని శాశ్వతంగా అట్టడుగు వారిగానే విముక్తి ఆశలేని వారిగానే ఉంచే పథకాన్ని రూపొందించారు. అంటరాని వారు అమాయకులైనప్పటికీ ఇలాంటి ఎత్తుగడలు వారిని మోసగించలేవు. ఓటు హక్కు కమిటీని అసలే మోసగించలేవు. మరో అభిప్రాయంతో చూసినా ఈ సంస్థ పథకం ఆమోదయోగ్యం కాదు! అంటరాని వారికి ప్రాతినిధ్యానికి ఒక పథకాన్ని ప్రతిపాదిస్తున్న ఈ సంస్థ తన సొంత పాలక మండలిలో ఒక అంటరాని వారిని చేర్చుకొనేందుకు హఠం పట్టి నిరాకరించడం మరీ చిత్రమైన విషయం. పక్షపాతంతోను అనవసర జోక్యంగాను ఉన్న ఈ పథకాన్ని యధాతథంగా త్రోసి పుచ్చాలి.

37. ఇంతకు ముందు పేర్కొన్న నామినేషన్ పద్ధతి కంటే ప్రభుత్వం తన తరపున చేసే నామినేషన్‌కు ప్రాధాన్యం ఇవ్వాలనే వాదనకు సైతం అంటరానివారి దృక్పథం నుంచి అభ్యంతరం చెప్పాలి. ఈ పద్ధతి ప్రతినిధుల స్వాతంత్ర్యానికి ఆంక్షలు పెట్టడమే కాదు అన్ని సమాజాల వారికి ముఖ్యంగా అంటరాని వారికి- తక్షణ అవసరమైన రాజకీయ పరిజ్ఞానాన్ని

కల్పించటంలో ఇది విఫలమైంది.

**38.** ఈ దశలో కుల– మత ప్రాతిపదిక ప్రాతినిధ్యానికి వ్యతిరేకంగా వచ్చిన వాదాలను మనం పరిశీలించాలి. నివేదిక రచయితలు లేవనెత్తిన మొదటి వాదం ప్రకారం "స్వయం పరిపాలనను అభివృద్ధి చేసుకొన్న దేశాల చరిత్రను చూస్తే అవి కుల-మత ప్రాతిపదిక ప్రాతినిధ్యాన్ని ఖచ్చితంగా వ్యతిరేకించాయని తెలుస్తుంది." కాని ఈ రచయితలు ముందు పుటలో ఇలా అంటారు– ఆలోచనలలో సామరస్యం లేని భారత సమాజానికి ఒక ఆకృతి కల్పించేటప్పుడు కులాల, తెగల భేదాలను కూడా పరిగణించాలి. ప్రపంచంలోని ఇతర ప్రాతినిధ్య సంస్థలు సామరస్యంపై ఆధారపడి ఉన్నాయి. (పుట.97) ముందు రాసినదానికీ, తర్వాత చేసిన. విశ్లేషణకు పొంతనలేదు. లేదా రచయితలకు ఒకేసారి రెండు విభిన్న అభిప్రాయాలు ఉన్నాయనుకోవాలి. రచయితలు విరుద్ధాభిప్రాయాలను వ్యక్తం చేసారంటే ప్రత్యేక పరిస్థితులను ఎదుర్కొనేందుకు ప్రత్యేక చికిత్సగా కుల ప్రాతిపదిక ప్రాతినిధ్యం అవసరమని వారు అభిప్రాయపడుతున్నట్టు భావించాలి.

**39.** కులమత ప్రాతిపదిక ప్రాతినిధ్యం, సామాజిక విభజనలను శాశ్వతం చేస్తుందనే వాదం మరొకటుంది. ఇందులో తమాషా ఏమిటంటే సామాజిక విభజనలను సమర్థించేవారే ఈ విరుద్ధ వాదనను గొంతెత్తి చాటుతున్నారు. ఈ వాదనలతో కుల ప్రాతిపదిక ప్రాతినిధ్యాన్ని వ్యతిరేకిస్తున్నవారే శ్రీ పటేల్ కులాంతర వివాహాల బిల్లును ప్రతిపాదించినప్పుడు అది కులాలను విచ్ఛిన్నం చేస్తుందంటూ తీవ్రంగా వ్యతిరేకించారు. దీన్ని కమిటీ వారు గుర్తించాలి. ఈ వాదం చేస్తున్న వారి చిత్తశుద్ధిని గట్టిగా శంకించక తప్పదు. నివేదిక రచయితలు సైతం కులప్రాతిపదిక ప్రాతినిధ్యానికి రెండవ ప్రాముఖ్యం ఇచ్చారు. కాబట్టి సాధ్యమైతే ఈ ముఖ్య వాదనను కూడా పరిశీలించాలి.

కుల ప్రాతిపదిక ప్రాతినిధ్యం సామాజిక విభజనలను శాశ్వతం చేస్తుందా?కుల ప్రాతిపదిక ప్రాతినిధ్యం సామాజిక విభజనలు కల ఓటర్లను తయారు చేస్తుందనుకొంటే ఈ విమర్శ చెల్లుతుంది ఈ విభజనలు నిజమైన విభజనలు కావనీ, ఇవి అప్రస్తుతమైనవనీ ముందే భావిస్తే ఇది నిజమనుకోవాలి. ఇంగ్లీషు వారు ఒక సమాజంగా ఏర్పడక ముందే తయారైన భారతదేశాన్ని ముందే ప్రస్తావించతలిస్తే, ఇది తప్పనుకోవాలి. విభజనల దుష్ఫలితాలను తొలగించే సాధనం కుల ప్రాతిపదిక ప్రాతినిధ్యం. ఈ ప్రత్యేక ప్రయోజనాన్ని అంగీకరిస్తూ ఇది సామాజిక విభజనలను శాశ్వతం చేస్తుందంటూ దీనిని వ్యతిరేకించే వారికి మరో కోణం నుంచి ఇది విభజనలను శాశ్వతం చేయడానికి బదులు, వాటిని నిర్మూలించే మార్గాలలో ఒకటని చెప్పవచ్చు.

**40.** కుల ప్రాతిపదిక ఓటర్లు, సామాజిక విభజనలు ఇవి ఒకే పరిధిలోనివి సమాజంలో కలవని వివిధ కులాలవారిని శాసన మండలిలో ఒకటిగా కలపడం వీటి ముఖ్య ప్రయోజనం

కాగలదు. తద్వారా అంతకు ముందు వరకు విడివిడిగా వున్న కులాల వారితో శాసన మండలిలో క్రొత్త ప్రాతినిధ్య వలయం ఏర్పడుతుంది. విడివడి పోయినందువల్ల సంఘ వ్యతిరేకులుగా రూపొందిన వారిని సంఘ జీవనానికి రాబట్టవచ్చు. సంఘ జీవనంలో అంతా చురుకుగా భాగస్వాములు కావడం వల్ల సదరు భాగస్వాముల ఇష్టాలూ అభిప్రాయాలూ పరస్పరంగా ప్రభావితం కాకుండా ఉండవు. ఈ రోజుల్లో ఒక కుల బృందమైనా, మత బృందమైనా ఒక వైఖరితో ఉంటుంది. ఏ కులమైనా ఏ బృందమైనా ఏకాంతంగా ఉన్నంతకాలం, వాటి అభిప్రాయాలు శిలాజాలుగానే ఉంటాయి. కాని వివిధ కులాలు, బృందాలు పరస్పర సంబంధాలను ఏర్పరచుకొని సహకారం అందించుకోవడం ప్రారంభించిన మరుక్షణం నుంచి శిలాజాలైన అభిప్రాయాలే సరికొత్త సామాజిక రూపుధరిస్తాయి. మహమ్మదీయులు, క్రైస్తవులు తదితరులపట్ల హిందువుల సామాజిక వైఖరి మారితే, హిందువుల పట్ల మహమ్మదీయులు, క్రైస్తవుల అభిప్రాయాలు మారితే; లేదా అంటరాని వారి పట్ల అంటుతగిన హిందువుల వైఖరి మారితే కులాలు- విభజనలు మటుమాయమవుతాయి. కులం ఒక వైఖరి అయితే, అది అంతకంటే మరేమి కాదనుకొంటే సదరు అభిప్రాయం కులానికి ప్రతీక అయితే ఆ వైఖరిని రూపుమాపితే కులం రద్దవుతుంది. విభిన్న కులాలకు, బృందాలకు ప్రాతినిధ్యం వహించే ఆ నిశ్చిత వైఖరిని రూపుమాపాలంటే వివిధ బృందాలు కలసి సమావేశమై ఉమ్మడి కార్యాచరణకు దిగాలి. ఇష్టాలకూ అభిప్రాయాలకూ సంబంధించిన అలాంటి మార్పులు క్షణభంగురమైనవి కావు. అవి మండల సభాభవనం వెలుపల కూడా సంఘజీవనాన్ని ప్రభావితం చేయగలుగుతాయి ఇలాంటి సంయుక్త కార్యక్రమాలకు ఎన్ని ఎక్కువ అవకాశాలు కల్పిస్తే అంత మేలు. అప్పుడు సంఘ పునర్నిర్మాణం పెద్ద ఎత్తున ప్రారంభమవుతుంది. కులాలకు, బృందాలకు త్వరితంగా స్వస్తి చెప్పేందుకు వీలు కలుగుతుంది. అప్పుడు కుల-మత ప్రాతిపదిక ప్రాతినిధ్యం వల్ల ప్రస్తుత సామాజిక విభజనలు శాశ్వతమవుతాయని ఖండించేవారే వాటిని రద్దుచేసే గట్టిమార్గం ఇదేనని దాని ఫలితాలను బట్టి హర్షిస్తారు

41. అంటరానివారికి కుల ప్రాతిపదికపై తగినంత ప్రాతినిధ్యం ఇవ్వాలనేది నిర్వివాదాంశం. ఈ అంశంపై మాట్లాడేటప్పుడు అంటరాని వారి భావోద్రేకం మహాతీవ్రంగా వుంటుంది. భారతదేశానికి హోమ్‌రూల్ ఇచ్చేటప్పుడు అంటరాని వారికి కుల ప్రాతిపదిక ప్రాతినిధ్యం కూడా కల్పించకపోతే రక్తపాతం తప్పదని·మద్రాస్ ప్రెసిడెన్సీ అంటరానివారు మాంటేంగుకు చెప్పినదాన్ని బట్టి ఆ తీవ్రతను గ్రహించవచ్చు. అంటరాని వారిని అవమానాల నుంచి, వెలివేత నుంచి శాశ్వతంగా దూరంచేసేందుకు అన్ని సంస్కరణలూ మేధావి వర్గం ప్రవేశ పెడుతుందనే నమ్మకం ఈ నివేదిక రచనకు ప్రేరణనిచ్చింది. "విద్యావంతుడైన భారతీయుడు కేవలం రాజకీయ ప్రయోజనాల కోసమే కాక, వివిధ రకాల ప్రజాసేవ, సామాజిక సేవలకు కూడా ప్రయత్నం కొనసాగిస్తున్నాడు" అని నివేదిక కర్తలంటారు. ఈ వాదన వల్ల నివేదిక రచయితలు అంటరాని వారి డిమాండ్లకు సుముఖంగా ఉన్నట్టు అగుపిస్తే,

వారి విశ్వాసానికి గట్టి పునాది వున్నదా, లేదా అనే విషయాన్ని ఆరా తీయడం శ్రేయస్కరం. విద్య, దాని సామాజిక విలువల గురించి జోసెఫ్ ఎడిసన్ చెప్పిన మాటలను స్మరించేందుకు, వాటికి ఈ నాటికి కాలదోషం పట్టలేదు. ఆయన ఇలా అన్నాడు. "మనుషులలో మంచి లక్షణాలను గౌరవిస్తూ మంచి లక్షణాలు కలిగిన వ్యక్తులు వాటిని ఎలా ఉపయోగించినా సరే పట్టించుకోకుండా మనుషులలో మంచి లక్షణాలకు మర్యాద ఇవ్వటంకంటే మానవ సమాజానికి పెద్ద హానికరమైనది ఏదీ ఉండదు". ప్రకృతి ప్రసాదించిన కానుకలు, కళాసాధకాలు విలువైనవే కాని సన్మార్గ ప్రయోజనాలకోసం వాటిని ఉపయోగించినప్పుడు మనం ఎరిగిన వారు ఉత్కృష్టులనే భావం నుంచి వారిమనోభావాలు మనం తెలుసుకొనేంత వరకు లేదా కొంత మంచి సమాచారం దొరికే వరకు మనమనసును వాటినుంచి కొంచెం దూరంగా ఉంచాలి. లేకపోతే, మన హేతువు, తీర్పు ఎవరినయితే అసహ్యించుకోమని చెబుతుందో వారినే మనం అభిమానించేలా చేస్తాయి."

**42.** మేధావులు, బ్రాహ్మణకులం ఒకరినొకరు మార్చుకోదగిన పదాలని గణాంక వివరాలు మనకు తెలుపుతున్నాయి. మేధావుల ఇష్టంఅంటే బ్రాహ్మణుల ఇష్టమే దాని దృక్పథం బ్రాహ్మణ దృక్పథం. అందరి గురించి మాట్లాడటం అతను నేర్చుకున్నా, బ్రాహ్మణ నాయకుణ్ణి ప్రజా నాయకుడు అనలేము. మహాఅయితే అతను తన కులానికి నాయకుడు అవుతాడు. ఎందుకంటే తనకులం వారిని పట్టించుకున్నంతగా వేరే వారిని పట్టించుకోడు. ఇలా అంటున్నానంటే అంటరాని వారికోసం పట్టించుకొనే బ్రాహ్మణులే లేరని నా ఉద్దేశం కాదు. న్యాయంగా చెప్పాలంటే అంటరాని తనం వ్యవస్థ భయంకరమైన స్వభావం కలదని అంగీకరించి, అది ఉండటం వల్ల సమాజానికి ఎంత ప్రమాదకరమో చూడగలిగిన ఆధునికులు, హేతువాదులైన బ్రాహ్మణులు కొంతమంది ఉన్నారు. ఏ విషయంలో కూడా తేలేనంత సాక్ష్యాధారాలను విస్తారమైన అనుభవాలను పట్టుకువచ్చి చూపినా ఈ వ్యవస్థ భీతావహమైనదని అంగీకరించటానికి నిరాకరించే బ్రాహ్మణులే ఎక్కువగా ఉన్నారు. వారు స్వేచ్ఛ గురించి మాట్లాడుతున్నారంటే, తన తోటి మనుషులను అణిచి వేయటానికి స్వేచ్ఛ గురించి, వారిపట్ల పాశవికంగా, నిర్దయగా, క్రూరంగా ఉండటమే అని వారి ఉద్దేశం. పరాధీనం చేయరాని హక్కులు అంటరాని వారికి హాని చేయటంలో మాత్రమే పెరుగుతాయని వారు భావిస్తారు. వారి సున్నితమైన మర్యాద ఆంగ్లేయులు తమకంటే గొప్పవారని అంగీకరించదు. అలాగే అంటరాని వారు తమతో సమానులనీ ఒప్పుకోడు "నా ఎంటే పైవారని నేను ఎవరినీ ఒప్పుకోను. నాకంటే కింద ఉన్న వారు ఎవరూ నాకు దగ్గరగా రాకూడదు". ఇదే వారి నిజమైన సామాజిక రాజకీయ సిద్ధాంతసారం. బ్రాహ్మణ నాయకుల సమాజ వ్యతిరేక ధోరణి గురించి ఎవరైనా మాట్లాడారంటే, ఆనిందలో వారు బ్రాహ్మణ నాయకులలో ప్రథమ శ్రేణి నాయకులపట్ల తగిన గౌరవాన్ని ప్రదర్శించటం లేదని తప్పు పడుతున్నారు. ఇది నిజమే కావచ్చు. తమ అసహజమైన శక్తి ప్రదర్శనలో కొంత మెత్తదనం కనిపించినట్టుగా వారిలో ఉత్కృష్టమైన అరుదైన వైయక్తిక,

ఆర్థిక త్యాగాలు కనిపిస్తాయనటంలో సందేహం లేదు. అయినప్పటికీ మానవత్వం, సత్యం శోధించవలసిన విషయాలనుంచి ఈ అన్యాయాన్ని విడదీయటానికి వీల్లేదు. కొందరు సున్నిత మనస్కులు సానుభూతి ప్రదర్శించినంత మాత్రాన అంటరాని వారి ఈ దౌర్భాగ్యస్థితి సహించగలిగేదిగా మారదు. ఎందుకంటే వేలమంది దోషులలో కొంతమేరకు నిర్దోషులెవరైనా ఉంటే వారిని ముంచి వేస్తుందనే భయంతో యదార్థమైన ఆగ్రహావేశాల ప్రవాహం నిశ్చలంగా నిలబడిపోదు.

43. భారతదేశంలో జాతీయ వాదం తీరును పరిశీలిస్తే సానుభూతి పరుల సంఖ్య పెరిగే అవకాశం ఉన్నట్టు మనకు ఏమీ అనిపించటం లేదు అది లేకపోగా దోషుల సంఖ్యే పెరిగే అవకాశాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. రాజకీయ ఆందోళన పెరగటంతో, సాంఘిక సంస్కరణల కోసం ఆందోళన తగ్గిపోయింది. కనుమరుగై పోయింది కూడా. ఉన్నతస్థితి అందజేసే ప్రభావం కల ప్రార్థనా సమాజం బ్రహ్మసమాజం మొన్నటి విషయాలై పోయాయి భవిష్యత్తులో ఇటువంటివి వచ్చే అవకాశాలు కనిపించటం లేదు విద్యాభివృద్ధి ఒకే వర్గానికి పరిమితమై పోతే, ఉదారవాదానికి అది దారితీయకపోవచ్చు. వర్గ ప్రయోజనాన్ని న్యాయమే అనిపింప చేస్తుంది. ఆ ప్రయోజనాన్ని కాపాడుతుంది. దళితులను విముక్తి చేసే వారిని సృష్టించకపోగా, గతాన్ని సమర్థించేవారిని మార్పును అంగీకరించని వారిని బలపరిచేవారిని తయారు చేస్తాయి. ఇంతవరకు విద్య కలిగించిన ప్రభావం ఇదే కదా? భవిష్యత్తులో కొత్తదారిని ఎన్నుకుంటుందని అనుకోవటానికి ఆధారాలు ఏమీ కనిపించటం లేదు అందువల్ల, అగ్రకులాల దయాధర్మం మీద అంటరాని వారిని విడిచి పెట్టి వేయకుండా ఇతరుల మాదిరిగా అధికారం చేజిక్కించుకోవాలని కాకుండా సమాజంలో తమ సహజమైన స్థానంకోసం ఆత్రుతపడుతున్న అంటరాని వారికి అధికారం అందజేయటమే తెలివైన విధానం అవుతుంది.

44. ఈ బ్రహ్మాండమైన ప్రపంచ యుద్ధం భవిష్యత్తులో అంతర్జాతీయ సంబంధాలను పరిపాలించే ఒక స్వయం నిర్ణయాధికారం అనే సూత్రాన్ని - అది కల్పించినదే అయినా ప్రవేశ పెట్టింది. 1917 ఆగస్టు 20 నాటి తీర్మానం ఏ పరిస్థితులలో తాము జీవించాలో నిర్ణయించుకొనే స్వేచ్ఛ ప్రతి ప్రజలకూ ఉండాలనే సూత్రాన్ని భారతదేశానికి వర్తిస్తుందని ప్రకటించింది. ఈ సూత్ర అన్వయం అంతర్జాతీయ సంబంధాలకే కుదించి వేస్తే ఈ సూత్ర ప్రాధాన్యాన్ని సంపూర్ణంగా సముపార్జించుకోలేదని చెప్పవచ్చు. ఎందుకంటే విభేదం జాతుల మధ్యనే ఉండదు. ఒక జాతిలో ఉన్న వివిధ వర్గాల మధ్యకూడా విభేదం ఉంటుంది. భారతదేశ రాజకీయవేత్తలు తమ ఉపన్యాసాలలో ప్రసంగాలలో భారతీయులంటే చట్టంలో ఉండే భావనను పట్టుకొని ఉన్నట్టు కనిపిస్తారు. ఈ చట్టపరమైన భావనలో వారేమనుకుంటారంటే స్వభావరీత్యా భారతీయులంతా ఒకటే అని, ఉమ్మడి ప్రయోజనం, శ్రేయస్సు ఆశించే శ్లాఘనీయమైన లక్షణాలు కలిగి ఉన్నవారని ఈ ఐక్యతతోవస్తున్న సమాజ ప్రయోజనాలకు

విధేయులుగా ఉండేవారని. చట్టపరంగా వారు భావించటంలోను వాస్తవంగా వారి ఆచరణలోను ఒకదాని నొకటి విభేదించుకుంటాయనేదాన్ని ఈ సంఘం గుర్తించక పోదనుకుంటాను. ఉదాహరణగా ఈ క్రింది విషయాన్ని గమనించాలి. బ్రిటిషు వారు భారతీయులను జయించి లొంగదీసుకోవడంలో తమకు జరిగిన నైతిక హాని బ్రాహ్మణ రాజకీయ వేత్తలకు చాల ఆకర్షణీయమైన అంశం అయింది. దానిని వాడుకోవటంలో ఎప్పుడూ విఫలం కాలేదు. 1832లో జాన్ షోర్ "నోట్స్ ఆన్ ఇండియన్ ఎఫైయిర్స్" అనే పుస్తకంలో ఈ నైతిక వేత్తలను ఉల్లేఖించాడు. "విదేశీ సంస్థ విపరీతమైన ఖరీదు" అనేవిషయం గూర్చి స్వర్గీయ గౌరవనీయ గోఖలే మాట్లాడుతూ ఒకసారి ఈ అభిప్రాయాలనే వెలిబుచ్చాడు.

"దేనికయినా కూడా నైతిక హాని చాలా పెద్దది. ఈనాటి వ్యవస్థక్రింద భారత జాతి ఒకరకంగా కుదించుకుపోతున్నది, ఎదగలేకపోతున్నది. మనమంతా తక్కువ వాళ్లమనే పరిస్థితుల్లో మన బ్రతుకులన్నీ గడిచిపోవాల్సిందే, ప్రస్తుత వ్యవస్థ అవసరాలకు అనుగుణంగా మనలోని పెద్ద వాళ్లు కూడా ఒదిగిపోయి ఉండాలి. ఈటన్, హరోల్లో పాఠశాలకు వెళ్లే ప్రతి విద్యార్థి ఒక రోజున తానుకూడా గ్లాడ్‌స్టన్ లేదా నెపోలియన్ లేదా వెలింగ్‌టన్ అవుతాననే భావన, తనలోని శక్తి సామర్థ్యాలను వెలికితీసే భావన, ఈ మాట అనవచ్చేమోనేను పైకి ఎదగాలనే భావన– మనకు లేకుండా పోయింది. ఈ ప్రస్తుత వ్యవస్థకింద మనపురుషత్వం ఎదగ గలిగినంత ఎత్తుకు ఎదిగేఅవకాశాలు లేవు. స్వయం పరిపాలన చేసుకొనే ప్రజలందరూ అనుభవించే నైతిక ఆధిక్యత మనం పొందలేము. మనలోని పరిపాలన యుద్ధసామర్థ్యాలు ఉపయోగింలో పెట్టకపోవటంవల్ల క్రమంగా నశించిపోయి, మనదేశంలోనే కాయకష్టం చేసుకొని బ్రతికే స్థితికి చివరకు దిగజారిపోతాము."

**45.** బ్రిటిషు అధికార యంత్రాంగాన్ని అగౌరవపరుస్తూ ఒక బ్రాహ్మణుడు (గొప్ప బ్రాహ్మణుడే ఆయన ఖచ్చితంగా) వెలిబుచ్చిన అభిప్రాయాలను బ్రాహ్మణత్వాన్ని అగౌరవపరుస్తూ అంటరాని వారు అనే అభిప్రాయాలను వెలిబుచ్చలేరా అనే విషయాన్ని ఈ సంఘంవారు గమనించాలని నేను మనవిచేస్తున్నాను. స్పందన లేకుండా ఉండిపోయిందని కాకుండా ఎవరికోసమయితే ప్రభుత్వం ఏర్పడిందో వారిని కుంచింపచేసిన ప్రభుత్వ విధానలలో మార్పును తీసుకువచ్చి ప్రజలపట్ల అనుకంపన చూపించిందని అధికార యంత్రాంగాన్ని మనం అభినందించ వచ్చు. అందులో సగం అయినా గొప్ప పనులు చేశామని బ్రాహ్మణ రాజ్యాధిపత్యం చెప్పుకోగలదా? భావికాలాలకు సరిపడే అనంతమైన ఏర్పాట్లు చేయటంకోసం మానవాతీతమైన దృష్టి, అలౌకిక శక్తులు కలిగి ఉన్న తమ పూర్వులు హిందూసాంఘిక వ్యవస్థ అన్ని కాలాలకు సరిపోయేటంత సమగ్రంగాతయారు చేశారని వారి అభిప్రాయం. వారి మనసులలో పేరుకుపోయిన ఈ స్వోత్కర్ష భావమే హిందూ సమాజ పునర్నిర్మాణాన్ని నిరోధించింది. అందరి శ్రేయస్సుకోసం స్వంత హక్కులను పునః పరిశీలించుకో నీయకుండా అడ్డుపడింది. బొంబాయిలో 1918 మార్చిలో అంటరానితనం నిర్మూలన కోసం ఒక

ప్రహసనం లాంటి సమావేశం జరిగింది. కర్వీర్ ప్రసిద్ధుడైన శంకరాచార్యుడు డాక్టర్ కుర్టకోటి సభకు వస్తానని వాగ్దానం చేసి సమావేశం జరగటానికి ఒకటి రెండు రోజుల ముందు ఏదో అత్యవసరమైన పని ఉన్నదని ఉత్తర భారతదేశం వెళ్లిపోయాడు. ఈ సమావేశంలో తిలక్ చాల చిన్న ప్రసంగం చేశాడు. ఆయన అదృష్టంకొద్దీ అది పత్రికలలో రాలేదు. ఇది అంటరాని వారిని మోసం చెయ్యటానికి చెప్పిన పైపైమాటలే, ఎందుకంటే అంటరానితనం నిర్మూలనకోసం తయారుచేసిన ఒక ప్రకటన ముసాయిదా తిలక్ దగ్గరకు తీసుకువెళ్తే దానిపై సంతకం చేసి దానికి గౌరవం ఆపాదించటానికి నిరాకరించాడని నమ్మదగిన ఒక సాక్ష్యంద్వారా తెలిసింది.

**46.** జాతిలోనే ప్రధానంగా ఉన్న అనైక్యత ఇక్కడ బయటపడుతున్నది అందుకనే స్వయంపరిపాలన సూత్రం అమలు చేయటానికి ఇది అనువైన ప్రదేశం. భారతదేశానికి ఈ సూత్రాన్ని అమలు పరచమని అగ్రవర్ణాలు ఆతురత చూపుతున్నాయంటే, భారత దేశ ప్రజలు భవిష్యత్తులో కుంచించుకుపోకుండా, ఎదగకుండా అడ్డుపడుతున్న శక్తులనుంచి కాపాడటానికి ఎంత పాక్షికమైనవైనా కొన్ని అధికారాలు అగ్రవర్ణాలకు లభ్యమైతే, అంటరానివారు తమ ప్రయోజనాలకోసం వాటిని కోరటం ధర్మంకాదా? స్వయం పరిపాలన అవసరం అంటరాని వారికి అవసరమని అంగీకరిస్తే కమ్యూనల్ ప్రాతినిధ్యం వారికి ఉపసంహరించకూడదు. ఎందుకంటే కమ్యూన్ ప్రాతనిధ్యమూ స్వయంపరిపాలన రెండూ ఒకే అభిప్రాయాన్ని వ్యక్తంచేస్తున్న రెండు పదాలు.

## భీమ్‌రావ్ ఆర్. అంబేడ్కర్ అందచేసిన అనుబంధ లిఖిత ప్రకటన

**1.** ఈ అనుబంధ ప్రకటన ఉద్దేశం ప్రధానంగా ఏమంటే నా పూర్వ వాంగ్మూలంలో బొంబాయి రాష్ట్రంలోని అంటరాని వారికోసం నేడు ప్రతిపాదించిన ప్రాతినిధ్య పద్ధతి బొంబాయి ప్రభుత్వం శాసన మండలికోసం ప్రతిపాదిస్తున్న పద్ధతికి సరిపోతుందని చూపటమే.

**2.** వివిధ ప్రధాన నియోజక వర్గాలకు ప్రభుత్వం కేటాయించిన సీట్ల సంఖ్యకు కొన్ని మార్పులు నేను ప్రతిపాదిస్తున్నాను. ఈ దిగువ చూపిన పట్టికలో నేను ప్రతిపాదిస్తున్న వివిధ మార్పులు కనబడతాయి.

| తమమధ్యసీట్ల పంపకం | ప్రభుత్వ ప్రతిపాదన | నా ప్రతిపాదన |
|---|---|---|
| 1. సింధ్ జమీందార్లు, జాగీర్దార్లు | 1 | 1 |
| 2. గుజరాత్ సర్దార్లు | 1 | 1 |
| 3. దక్కన్ సర్దార్లు | 1 | 1 |
| 4. బొంబాయి విశ్వవిద్యాలయం | 2 | 2 |
| 5. యూరోపియన్లు | 4 | 4 |
| 6. సింధ్ హిందువులు | 3 | 4 |

| | | | |
|---|---|---|---|
| 7. | మహమ్మదీయులు | 18 | 10 |
| 8. | ఆరు నగరాలు | 18 | 17 |
| 9. | ప్రెసిడెన్సీలోని ఇరవై ఆరు జిల్లాలు | 52 | 60 |
| | మొత్తం | 100 | 100 |

3. I, II, III, IV, V నియోజకవర్గాలకు ఎన్నిక విధానం విషయంలో ప్రభుత్వంతో నేను ఏకీభవిస్తున్నాను.

4. సింధుహిందువులకు ప్రభుత్వం 3 సీట్లు కేటాయించింది. వారికి నేను 4 సూచించాను, అందులో ఒకటి సింధ్‌లోని అంటరానివారికోసం, అది కమ్యూనల్ ఓటర్లతో ఎన్నికవుతారు.

5. 6నగరాలకు నేను 17 కేటాయించాను. ఇందులో 10 బొంబాయికి వెళ్లాలని నా ప్రతిపాదన. నగరంలోని ఈ 10 సీట్లలో 1 అంటరాని వారికి ఇవ్వాలి. దీనిని మళ్లీ కమ్యూనల్ ఓటర్లతోనే ఎన్నుకోవాలి.

6. ఇంతవరకు సింధ్ అంటరానివారు, బొంబాయిలో ఉన్న అంటరాని వారికి సీట్ల కేటాయింపు ఎలా జరిగిందో చూశాం. ఈ రెండు సీట్లకు అదనంగా బొంబాయి నగరం మినహాయించి బొంబాయి రాష్ట్రంలో ఉన్నవారికోసం 7 సీట్లు ఇవ్వవలసి ఉంటుంది. ఈ 7 సీట్లను ఎలా కేటాయించాలో ఇంతకు ముందు నేను అందజేసిన ప్రకటనలో 7వ పేజీలో తెలియజేశాను. ఈ విధంగా రాష్ట్రంలోని అంటరాని వారికోసం 9 సీట్లను కేటాయించటం జరిగింది. దళిత వర్గాలను నిర్వచించటంలో బొంబాయి ప్రభుత్వానికి కొంత కష్టం కలగవచ్చు.

ఈ కష్టం నిజమైన కష్టంకాదు. అన్ని విధాలా అంటరాని వారన్నా దళిత వర్గాలన్నీ ఒకటే. అంటరాని వారి అధోగతి బొంబాయి ప్రభుత్వానికి పూర్తిగా తెలిసి ఉండి కూడా ఇంత నిర్లక్ష్యం చూపటం చాలా ఘోరం. దళితవర్గాలకు ప్రాతినిధ్యం ఇవ్వటానికి నిరాకరించటం ద్వారా ప్రభుత్వం చాలా ముఖ్యమైన ప్రయోజనాలకు ఎంతో హాని కలుగచేసింది. ఈ ప్రమాదాన్ని ఈ సంఘం వారు తప్పిస్తారని నాకు నమ్మకం ఉన్నది.

7. 60లో నుంచి 7 సీట్లు తీసివేసిన తర్వాత మిగిలిన 53 సీట్లను 26 జిల్లాల్లో ఉన్న సవర్ణ హిందువులు పంచుకుంటారు.

జిల్లాకు 2 చొప్పున 7 సింధ్ జిల్లాలు 14 సీట్లు ఎన్నుకోటం అనే దాన్ని ప్రభుత్వంతో నేనంత అంగీకరించకపోయినా ఒప్పుకుంటాను. సింధ్ వెలుపల ఉన్న 19 జిల్లాల్లోను ద్విసభ్య నియోజకవర్గం ఒకటి సరిపోదనుకుంటాను. ముఖ్యంగా ఎందుకంటే సవర్ణ హిందువులు ఏక జాతివారు కాకపోవటం. సవర్ణ హిందువులలో ఉన్న ఉప విభాగాల వారి ఆశలను సంతృప్తి

పరచటానికి కొన్ని సందర్భాలలో ద్విసభ్య నియోజకవర్గ సూత్రాన్ని వదులోకవ ఉంటుంది (91(2)) 19 జిల్లాల్లోని 39 సీట్ల పంపకం విషయంలో ముందు భ ప్రాతిపదికపైన జిల్లాలను విభజిస్తాను.

| | జిల్లాలు | సవర్ణ హిందువుల జనాభా |
|---|---|---|
| | | **1. గుజరాతీ** |
| 1. | అహమ్మదాబాద్ | 614,286 |
| 2. | బ్రోచ్ | 170,545 |
| 3. | కైరా | 556,667 |
| 4. | పంచ్‌మహళ్లు | 259,929 |
| 5. | సూరత్ | 535,236 |
| | మొత్తం | 21,36,663 |
| | | **2. మరాఠీ** |
| 1. | థాణా | 736,915 |
| 2. | కొలాబా | 509,158 |
| 3. | రత్నగిరి | 1003,240 |
| 4. | అహమ్మద్‌నగర్ | 738,747 |
| 5. | తూర్పు ఖండేష్ | 789,740 |
| 6. | పశ్చిమ ఖండేష్ | 437,391 |
| 7. | నాసిక్ | 745,965 |
| 8. | సతారా | 883,488 |
| 9. | పూనా | 858,607 |
| 10. | షోలాపూర్ | 574,152 |
| | మొత్తం | 72,77,403 |
| | | **3. కన్నడ** |
| 1. | బెల్గాం | 734,598 |
| 2. | బీజాపూర్ | 677,041 |
| 3. | ధార్వాడ | 820,345 |
| 4. | కనరా | 372,857 |
| | మొత్తం | 26,04,841 |

19 జిల్లాల్లో మొత్తం సవర్ణ హిందువుల సంఖ్య 12,018,907

పంపకం జరగవలసి ఉన్న 39సీట్లలో గుజరాతీయులకు 8 సీట్లు, మరాఠీ వారికి 23 సీట్లు కన్నడిగులకు 8 సీట్లు ఇస్తాను.

వాస్తవంగా నియోజకవర్గాలు ఇలా ఉండవచ్చు.

| భాష జిల్లాలు | | ఒక్కో నియోజక వర్గంలో జనాభా | నియోజక వర్గసంఖ్య | ఒక్కో నియోజక వర్గం నుంచి ఎన్నిక కావలసిన సంఖ్య |
|---|---|---|---|---|
| | | I. గుజరాతీ | | |
| 1 | అహమ్మద్ నగర్ | 614,286 | I | 2 |
| 2. | బ్రోచ్ | 727,212 | II | 3 |
| 3. | కైరా | | | |
| 4. | పంచమహల్లు | | | |
| 5. | సూరత్ | 795,165 | III | 3 |
| | | II. మరాఠీ | | |
| 1. | థాణా | 1,246,073 | IV | 4 |
| 2. | కొలాబా | | | |
| 3. | రత్నగిరి | 1,003,240 | V | 4 |
| 4. | అహమ్మద్‌నగర్ | | | |
| 5. | నాసిక్ | 1,484,712 | VI | 3 |
| 6. | తూర్పుఖండేష్ | | | |
| 7. | పశ్చిమ ఖండేష్ | 1,227,131 | VII | 3 |
| 8. | సతారా | 883,488 | VIII | * |
| 9. | పూనా | 858,607 | IX | 3 |
| 10. | షోలాపూర్ | 574,152 | X | 3 |

* సతారా జిల్లా విషయంలో మూలంలో సంఖ్య చూపలేదు.

| | | III కన్నడిగ | | |
|---|---|---|---|---|
| 1 | బెల్గాం | | | |
| 2. | బీజాపూర్ | 1,411,639 | XI | 4 |
| 3 | ధార్వార్ | | | |
| 4 | [illegible] | 1,193,202 | XII | 4 |

[illegible] మొత్తం ప్రతినిధులు 39

ఈ విధంగా కేటాయింపు చేయటంలో ప్రధాన ప్రయోజనం ఏమంటే కమ్యూనల్ ప్రాతినిధ్యంకు పోకుండా మరాఠాల లింగాయతుల అభ్యర్థనలను సంతృప్తి పరచటం. కమ్యూనల్ ప్రాతినిధ్యాన్ని సాధ్యమైనంత వరకు తగ్గించటంలో జిల్లాలు సరిహద్దులు దాటి సాగుతున్నపుడు రాజకీయ ప్రయోజనాలకోసం జిల్లాలు ఎల్లలు దాటకూడదని వాదించటంలో తప్పు ఏమీ కనబడదు.

8. మహమ్మదీయులకు ఇవ్వవలసిన సీట్ల విషయంలో బొంబాయి ప్రభుత్వంతో నేను ఏకీభవించటం లేదు. జనాభా, కాంగ్రెసు ఒడంబడిక ఈ రెండు ప్రాతిపదికలలో బొంబాయి ప్రభుత్వం హేతువు ఏమీ చూపకుండా రెండో పద్ధతిని అంగీకరించింది. ఇలా చేయటంలో అది కాంగ్రెస్‌లీగ్ ఒడంబడికలో నిర్ణయమైన మహమ్మదీయుల ప్రాతినిధ్యభాగం నిర్ణయించటంలో సంప్రదింపులు తప్ప మరొక విధానం ఏదీ లేదని ఎంతో బాగా ఆలోచించి చెప్పిన సంస్కరణ వాదుల అభిప్రాయాన్ని ఇది వ్యతిరేకించటమే.

కాంగ్రెస్‌పార్టీ నిర్మాణం గనక చూస్తే అది చేసే వాగ్దానాల విషయంలో ప్రజలకు కట్టుబడి ఏమీ ఉండదు. వారి చర్చలలో ప్రజలు ఏమాత్రమూ పాలు పంచుకోరు.

9. రాష్ట్రమొత్తం జనాభాలో మహమ్మదీయుల శాతం 20. జనాభా ప్రాతిపదికను బట్టి 100 సీట్లలో వారికి 20 సీట్లు రావాలి. అవసరాన్ని బట్టి జనాభాను కుదిస్తే 24 సీట్లు ఇస్తే వారికి సంతృప్తి కలిగిస్తాయనుకుంటాను. దీనకంటే ఏమాత్రం ఎక్కువ అయినా అది ఇతరుల ప్రయోజనాలకు భంగం కలుగుతుంది కాబట్టి దీనిని ఒప్పుకోలేము. ఈ 24లో జిల్లాకు రెండు చొప్పున 7 సింధ్ జిల్లాలు 14 మందిని ఎన్నుకుంటారు. మిగిలిన 10 సీట్లు ఇలా పంచవచ్చు.

| | | జనాభా | ప్రతినిధులసంఖ్య |
|---|---|---|---|
| 1 | బొంబాయినగరం | 179,246 | 2 |
| 2. | ఉత్తర విభాగం | 342,696 | 2 |
| 3. | కేంద్ర విభాగం | 367,509 | 3 |
| 4. | దక్షిణవిభాగం | 457,997 | 3 |
| | | మొత్తం | 10 |

మహమ్మదీయుల విషయాలలో కూడా ప్రాంతీయ విభజనకంటే భాషా విభజనే మంచిదని నేను అనుకుంటాను ఠాణాలో ఉన్న మహమ్మదీయునికి సూరత్‌లో ఉన్న మహమ్మదీయునికి రెండూ ఒకే విభాగంలో వచ్చినా ఏ రకమైన సంబంధం ఉంటుందో నాకయితే బోధపడదు. జాతిరీత్యా విభిన్నమైన ప్రజలను రాజకీయ అవసరాలకోసం ఒక సముదాయంగా చేయటం అర్థంలేనిది.

## భీమ్‌రావ్ ఆర్.అంబేడ్కర్‌ని పిలిచి వాంగ్మూలం తీసుకోవటం :

సర్ ఫ్రాంక్ స్లై : ఆయన సిడెన్ హాంకామర్స్ కళాశాలలో ప్రొఫెసర్. బొంబాయిలోని ఎల్ఫిన్‌స్టన్ కళాశాల నుంచి పట్టభద్రుడయ్యాడు. న్యూయార్క్‌లోని కొలంబియా విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఏ. చేశాడు. ఆయన మహర్ కులానికి చెందినవాడు. ఆయన వాంగ్మూలం ఎక్కువగా దళితవర్గాల గురించి చెప్పినది.

హిందూ సమాజం సంబంధించి ఆయన దానిని రెండు వర్గాలుగా విభజించాడు. ఆచరణ రీత్యా ఈ విభజనలో పొరపాటు పడటానికి వీల్లేదు. కులాల వారీగా విభజన కాక ఎక్కువగా సౌకర్యం కోసం చేసినట్టిది. బ్రాహ్మణుల మధ్య బ్రాహ్మణేతరుల మధ్య కూడా ఉన్న వ్యత్యాసాన్ని ఆయన గుర్తించాడు. కాని అది అంత ప్రధానంకాదు. బ్రాహ్మణులు బ్రాహ్మణేతరుల మధ్య ఉన్న వ్యత్యాసం అభ్యర్థిపట్ల ఓటరుకు ఉండే ప్రవర్తనలా పెద్దంత తేడా ఏమీ ఉండదు, కాని అంటరానివారికి సవర్ణులకు మధ్య ఉన్న వ్యత్యాసంలో పెద్ద తేడా కనబడుతుంది.

బ్రాహ్మణేతరులకు ప్రత్యేక నియోజక వర్గాలు ఉండవలసిన అవసరం ఏమీ లేదని ఆయన భావించాడు. ఎందుకంటే ఆయన తన అనుబంధ వాంగ్మూలంలో చెప్పినట్టుగా త్రిసభ్య నియోజక వర్గాలను గనుక మంజూరు చేసినట్లయితే బ్రాహ్మణేతరులకు కొన్ని సీట్లు వస్తాయి. తన లిఖిత వాంగ్మూలంలో 16వ పేరాలో ఏకరీతిగా ఉన్న ఆస్తి అర్హతలపై జనాభా పరంగా అల్ప సంఖ్యాకులుగా ఉన్న ఒక కులం ఓటింగు బలం వచ్చేసరికి అధిక సంఖ్యగా కావచ్చని ఆయనకి చూపటానికి ఉద్దేశించాడు, ఆయన చెప్పిన కొన్ని కులాలు రాష్ట్రం మొత్తంలోనే అల్పసంఖ్యాకమైనవి కావచ్చు, కాని జిల్లాలు వచ్చేసరికి అధిక సంఖ్యలో ఉండవచ్చు. సాధ్యమైనంత వరకు కమ్యూనల్ ప్రాతినిధ్యంకోసం ఆవేశాన్ని తగ్గించుకోవాలి. అందుకు ఆయన త్రిసభ్య నియోజక వర్గాలను సూచించాడు.

అంటరాని వారికోసం ఓటుహక్కు విషయంలో వ్యత్యాసం ఉండాలన్నాడు కాని ఇద్దరు సభ్యుల కంటె ఎక్కువ ఉన్న నియోజక వర్గాలను ఎంచుకుంటే ఓటు హక్కు తగ్గించటంలో అంత ప్రాధాన్యత ఉండదు. చిన్న నియోజకవర్గం విషయంలో ఉదాహరణకు మరాఠాల విషయంలో వారిని ఒక సముదాయంగా చేర్చటం అభిలషణీయం అవుతుంది.

ఒక నియోజక వర్గంలో ఒక నిర్దిష్టమైన కులానికి ఎక్కువ ఓట్లు ఉన్నాయంటే ఆ కులానికి ప్రత్యేక నియోజక వర్గం ఉండవలసిన అవసరం లేదు. ఒక నిర్దిష్టమైన నియోజకవర్గంలో అంటరాని వారికి ఓట్లు ఎక్కువగా ఉన్నాయంటే... అతను కమ్యూనల్ ప్రాతినిధ్యం అడగడు. వారు అల్పసంఖ్యాకులుగా ఉన్నందువల్ల, అలానేవారు ఉంటూడటం వల్ల ఆయన ఏకరూపమైన ఓటు హక్కుపై ప్రత్యేక ప్రాతినిధ్యం కావాలని కోరాడు. ఓటుహక్కు అర్హతను తగ్గించాలని అడగటంలో అతని ధర్మం ఏమిటంటే అతను అంటరానివాడు కాబట్టి. అంటరానివారికి

ఆస్తులు లేవు, వారి దగ్గర కొనేవారు ఎవరూ ఉండరు కాబట్టి వారు వ్యాపారాలు చెయ్యలేరు. ఆయన ఒక దృష్టాంతాన్ని విమర్శించాడు, పుచ్చకాయలు అమ్ముతున్నందుకు ఒక మహర్ స్త్రీని పోలీసు కచేరికి తీసుకువెళ్లారు. బొంబాయి రాష్ట్రం వెలుపల ఉన్న పరిస్థితులేమిటో ఆయనకు తెలియవు. బొంబాయి రాష్ట్రంలో మిల్లుల్లో అంటరాని వారిని నేత విభాగంలో పని చెయ్యటానికి ఇంకా అనుమతించరు. మహమ్మదీయుడనని చెప్పుకొని ఒక మహర్‌వ్యక్తి బొంబాయిలో ఒక మిల్లులో పని చేశాడు. అతను ఫలానా అని తెలుసుకున్న తర్వాత అతనిని విపరీతంగా కొట్టారు.

ఎన్నికల అవసరాలకోసం "అంటరానివాడు" అంటే తాను ముట్టుకోవటం ద్వారా మైల కలుగచేసే వాడని చెప్పుకుంటేసరి పోతుంది. కొన్ని కులాలు కొన్ని జిల్లాల్లో అంటరానివిగాను కొన్ని జిల్లాల్లో అంటదగినవి గాను ఉంటాయని ఇక్కడ ఎవరూ చెప్పుకోవటం లేదు

ఆయన వర్గీకరణ ప్రకారం మొత్తం జనాభాలో అంటరానివారు నూటికి 8 మంది ఉంటారు. కాని ఆయన 9 సీట్లు ప్రతిపాదించాడు, అంటే జనాభా శాతం 9 అయింది. ఈ సీట్లను ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా ఎన్నుకోవలసి ఉంటుంది.

అంటరానివాడు ఇప్పుడున్న అభివృద్ధి స్థితిలో బాధ్యతాయుతంగా ఓటు చేయగలిగిన పరిస్థితిలో లేడని ఆయనకు తెలుసు. ఈ నిమ్న వర్గాల్లో మొత్తం బొంబాయి రాష్ట్రంలో బి.ఏ. చదువుకున్న వ్యక్తి ఒకడు, 6 లేదా 7 గురు మెట్రిక్యులేషన్ చదువుకున్న వాళ్లు ఉన్నారు. ఇంగ్లీషు చదువుకున్న వారి శాతం మరీ తక్కువగా ఉన్నది. అయితే వెనకబడిన తరగతుల వారికంటే ఏమంత తక్కువకాదు. నిమ్నవర్గాలు ముఖ్యంగా మహర్లు, చమార్లు ఓటు వినియోగించుకొనే స్థితిలోనే ఉన్నారు. చదువుకున్న వారికి ఓటు ఇవ్వడంద్వారా ఆయన వారికి ఓటుహక్కును ఇస్తాడు. వారిలో హైస్కూలులో 6 లేదా 7వ తరగతిలో ఉత్తీర్ణులైన వారు కనీసం 25మంది అయినా ఆయనకు దొరుకుతారు. ఈ సంఖ్య పెద్దది కాకపోయినా నిమ్నవర్గాలకోసం ఆయన ప్రతిపాదించిన 9 సీట్లు వారినుంచి ఎంపిక చేయవచ్చని ఆయన సూచిస్తాడు. వాస్తవ పరిస్థితులు వచ్చే సరికి అటువంటి వ్యక్తి పట్టభద్రునితో సమానమవుతాడు. అయితే పట్టభద్రుడు తన అభిప్రాయాలను ఇంకా బాగా వ్యక్తం చేయవచ్చు.

నిమ్నజాతి ప్రతినిధులు ఇతర వర్గాలలోనుంచి ఏ విధంగా ఎన్నుకొనే పద్ధతిని అయినా ఆయన వ్యతిరేకించాడు. ఉదాహరణకు మిషనరీల ద్వారా ప్రాతినిధ్యం కలగచేయటం అనేది వాస్తవంగా అసలు ప్రాతినిధ్యమే కాదని ఆయన అభిప్రాయం

నిమ్న జాతి వర్గాలకు పెద్ద నియోజక వర్గాలుండాలని ఆయన సూచిస్తాడు మహమ్మదీయులకు అంత పెద్ద నియోజక వర్గాలను ఏర్పాటు చేయడం ఆమోదయోగ్యమైతే, అది నిమ్నజాతి వారి విషయంలో ఎందుకు ఆమోదయోగ్యం కాదో ఆయనకు బోధపడలేదు.

నిమ్న జాతివారికి కావలసిన ప్రాతినిధ్యం సంపాదించటంకోసం, మహమ్మదీయుల కోసం ప్రభుత్వం ప్రతిపాదించిన దానిని 18నుంచి ఆయన 10కి తగ్గించాడు. ఈ తగ్గింపు సమంజసమే. ఎందుకంటే జనాభా ప్రాతిపదికపైన మహమ్మదీయులకు 20శాతం సీట్లు మాత్రమే రావాలి. కాంగ్రెస్ లీగ్ ఒప్పందం అందరిని బద్ధులను చేస్తుందనే విషయాన్ని ఆయన అంగీకరించలేదు.

శ్రీ హై లే : అంటరాని వారంటే పౌరులకున్న హక్కులు కొన్ని నిరాకరింపబడినవారు. ఉదాహరణకు వీధిలో నడిచేహక్కు ప్రతిపౌరునికీ ఉంది. ఎవరినైనా అలా నడవనియ్యకుండా చేశారనుకోండి– అది తాత్కాలికమే అయినా– అది అతని హక్కును భంగం చేయటమే. తన హక్కును వినియోగించుకో లేకుండా తనని చట్టమే నిరోధించిందా సాంఘిక ఆచారం నిరోధించిందా అనే దానిలో అతనికి తేడా ఏమీ లేదు. ఆచారాన్ని ప్రభుత్వం గుర్తించింది అంటరాని వర్గాలకు చెందిన వ్యక్తులను ప్రభుత్వ ఉద్యోగాలలోకి తీసుకోరు.

నిమ్నవర్గాల వారి విషయంలో ఓటుహక్కు వినియోగానికి పెట్టిన అర్హతలు తగ్గించమని ఆయన సూచిస్తాడు. ఎందుకంటే వారి జీవన స్థితిని మెరుగు పరచటమే ప్రభుత్వ ఆదర్శం కావాలి కాబట్టి.

గణాంక నివేదికను బట్టి అంటరానివారు, అంటలేనివారు అనే సమస్య సింధ్‌లో ఉందంటాడాయన. మహమ్మదీయుల జనాభా ఎక్కువ ఉన్న మాట నిజమే కాని అక్కడ హిందువులు కూడా ఉన్నారు. సింధ్‌లో హిందువుల కోసం ప్రత్యేకమైన ఏర్పాట్లు చేస్తున్నపుడు వాటిని నిమ్న జాతి వర్గాలకు ఎందుకు చేయకూడదో ఆయనకు బోధపడదు.

బెనర్జీ : నిమ్నజాతి వర్గాలు ఇంగ్లీషు మాట్లాడగలిగిన వారు 9 మందిని తమలోనుంచి తీసుకురాగలరు, వారు తమ ప్రయోజనాలను కౌన్సిల్‌లో సమర్పించగలరు. మెట్రిక్యులేషన్ కంటే కిందిది 6వ తరగతి. ఇందులో ఉత్తీర్ణుడైన వ్యక్తి శాసన మండలిలో జరిగే చర్చలను అర్థం చేసుకోగలడు. ఈ తరగతిలో ఉత్తీర్ణులైన వ్యక్తులు వారిలో 25 మంది ఉన్నారు.

రాజకీయ అవసరాలకోసం నిమ్న జాతులను నిర్వచించటం పెద్ద కష్టం ఏమీకాదు. వారూ అంటరానివారిలానే ఉంటారు. ఏ వ్యక్తీ కూడా తాను నిమ్నజాతి వాడు కాకుండా బయటికి అవునని అందరితోనూ ఎవరూ చెప్పుకోరు. ఆ పని కొందరు వెనుకబడిన తరగతుల వారు చేస్తారు.

నిమ్న జాతి వారికి కనీసం 8 సీట్ల వరకూ ఆయన అంగీకరిస్తాడు. వాటికి ఎన్నిక జరగాలి. ప్రభుత్వం నిర్దేశించిన వ్యక్తి ఎవరూ కూడా ఆ వర్గం వారి ప్రయోజనాలకు సరిగ్గా ప్రాతినిధ్యం వహించలేదు.

క్రంప్ : సింధ్‌లో ఉన్న అంటరానివారి సమస్యలు స్థితిగతుల పట్ల ఆయనకు పెద్ద

అనుభవం ఏమీలేదు. అక్కడ భంగీ అనేది ఒక్కటే ఉన్నదని చేసిన వ్యాఖ్యానం విషయంలో ఆయన ఏమీ చెప్పలేకపోయాడు. సింధ్‌లో మొత్తం హిందూ జనాభా 837,426 అని అందులో అంటరాని వారి జనాభా 135,224 అనేది ఆయనవద్ద ఉన్న సమాచారం.

నటరాజన్ : భారతదేశంలో బ్రిటీషు పరిపాలన అందరికీ సమమైన అవకాశాలు అందచేయటానికే ఉన్నదని ఆయన అభిప్రాయం. ప్రజా ప్రతినిధి సభలకు ఎక్కువ అధికారాలను సంక్రమింప చేస్తున్నపుడు సాంఘిక వ్యవస్థ కలిగించిన కష్టాలు, అయోగ్యతలు మళ్ళీ రాకుండా ఉండేలాగ రాజకీయ సంస్థల్లో పాతుకు పోకుండా ఏర్పాట్లు చేయాలని ఆయన అంటాడు. ప్రస్తుత పరిస్థితి వచ్చేవరకూ, ఉదాహరణకు నిమ్నజాతి వారికోసం ఏర్పాటు చేసిన ఏరేల్ పాఠశాలలో అగ్రకులాలకు చెందిన విద్యార్థులే ఎక్కువమంది ఉన్నారు. ఎందుకంటే అది చాలమంచి పాఠశాల కాబట్టి, ఇది ఆయనే ఒప్పుకున్నాడు. ప్రొఫెసర్‌గా ఆయనపని చేస్తున్నపుడు తాను నిమ్నజాతికి చెందిన వాడే అయినప్పటికీ తన తరగతిలో అన్ని వర్గాలకు చెందిన విద్యార్థులూ ఉండేవారు, అగ్రకులాలకు చెందిన వారితో వ్యవహరించటానికి ఆయనకు ఏ కష్టమూ రాలేదు. సీట్ల కేటాయింపు ద్వారా ప్రభుత్వం గనుక అంటరాని వారిని గుర్తిస్తే, వారి హెూదా పెరుగుతుంది. వారి శక్తులు ప్రజ్వలిస్తాయి. ఎన్నిసీట్లు కావాలనే దానిలో ఆయనకు అంత పట్టింపు లేదు. ఏదో సరిపోయేటంత కావాలనేదే ఆయన కోరుకుంటున్నాడు. 1919 జనవరి 24, 31ల మధ్య ఈ దిగువ వ్యక్తులను బొంబాయిలో పిలిచి, విచారించారు.

## ఈ క్రింది వ్యక్తులను బొంబాయికి పిలిపించి 24 జనవరి 1919, 31 జనవరి 1919 తేదీలలో విచారించారు.

1. ఎల్.సి.క్రంప్, ఐ.సి.ఎస్, బొంబాయి ప్రభుత్వానికి ప్రాతినిధ్యం వహించారు. (24, జనవరి 1919)

2. గౌరవనీయ మేజర్ సి.ఫెర్నాండెజ్, ఎం.డి, ఐ.ఎం.ఎస్ (తాత్కాలిక) (24 జనవరి 1919)

3. రెవరెండ్ కానన్ డి.ఎల్.జోషి, బొంబాయి ఇండియన్ క్రైస్తవ (ప్రొటెస్టెంట్) సంఘానికి ప్రాతినిధ్యం వహించారు (24, జనవరి 1919)

4. లెఫ్టినెంట్ కల్నల్ హెచ్.ఎ.జె.గిడ్నే, ఐ.ఎం.ఎస్ (రిటైర్డ్) ఆంగ్లో ఇండియన్ ఎంపైర్ లీగ్ (బొంబాయిశాఖ)కు ప్రాతినిధ్యం వహించారు. (జనవరి 25, 1919.)

5. సర్ జమ్‌సెట్‌జీ జీజీభాయి, బిఏఆర్‌టి (25, జనవరి 1919.)

6. గౌరవనీయ డబ్ల్యు. ఎ.హేగ్ బ్రౌన్, యూరోపియన్ అసోసియేషన్, బొంబాయికి ప్రాతినిధ్యం వహించారు (25 జనవరి, 1919).

7. శ్రీ డి.డి.సథయ్, బొంబాయి నేషనల్ యూనియన్‌కు ప్రాతినిధ్యం వహించారు (25 జనవరి 1919).

8. ఆనరబుల్ శ్రీ ఎం.ఏ. జిన్నా (25 జనవరి 1919).

9. శ్రీ సి.ఎన్.పాడియా, బొంబాయి మిల్లు యజమానుల సంఘానికి ప్రాతినిధ్యం వహించారు (27 జనవరి 1919)

10. శ్రీ వి.ఆర్.షిండే (27 జనవరి 1919)

11. శ్రీ కె.ఆర్.కోరేగావ్‌కర్, మరాఠా ఐక్యేచ్ఛు సభకు ప్రాతినిధ్యం వహించారు. (27 జనవరి 1919).

12. గౌరవనీయ ఎం.ఏ.జిన్నా (27 జనవరి 1919).

13. మీర్జా ఆలీ మహమ్మద్‌ఖాన్ (27 జనవరి 1919).

14. శ్రీ భీమ్‌రావ్ ఆర్.అంబేద్కర్ (27 జనవరి 1919).

15. గౌరవనీయ శ్రీ వి.జె.పటేల్ (28 జనవరి 1919).

16. గౌరవనీయ శ్రీ సాహెబ్ హీరాలాల్ దేశాయ్‌భాయ్ దేశాయ్ (28 జనవరి 1919).

17. గౌరవనీయ శ్రీ చునిలాల్ వి.మెహతా (28 జనవరి 1919).

18. శ్రీ ఎ.బి.లాఠే (28 జనవరి 1919).

19. గౌరవనీయ శ్రీ ఆర్.పి. పరంజపే (28 జనవరి 1919)

20. శ్రీ వి.ఆర్. కొఠారి, దక్కన్ రైతు సంఘానికి ప్రాతినిధ్యం వహించారు (28 జనవరి 1919).

21. శ్రీయుతులు ఉమర్ శోభాని, ఎస్.జి. బ్యాంకర్, బొంబాయి హోంరూల్ లీగ్‌కు ప్రాతినిధ్యం వహించారు. (29 జనవరి 1919).

22. శ్రీ హెచ్,ఎన్.ఆప్టే దక్కన్‌సభ, పూనాకు ప్రాతినిధ్యం వహించారు (23 జనవరి 1919).

23. శ్రీ ఎన్.సి. కేల్కర్ (29 జనవరి 1919).

24 గౌరవనీయ శ్రీ డి.వి. బెల్వీ (29 జనవరి 1919).

25. రావుబహుదూర్ రాకోరామ్ కపిల్‌రామ్ (29 జనవరి 1919).

26. శ్రీ ఎన్.ఎం.జోషి, సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ సభ్యుడు (30 జనవరి, 1919).

27. గౌరవనీయ రావుబహదూర్ వెంకటేష్ శ్రీనివాస్ నాయక్ (30 జనవరి 1919).

28. పండిట్ ఆర్.చికోడి (30 జనవరి 1919).

29. గౌరవనీయ శ్రీ ఎస్.జె.గిల్లమ్, సర్ శ్రీ థామస్ బిర్కెట్, బొంబాయి ఛాంబర్ ఆఫ్ కామర్స్‌కు ప్రాతినిధ్యం వహించారు. (30 జనవరి 1919).

30. శ్రీ అంబాలాల్ షారాభాయ్, శ్రీ కస్తూరి భాయ్ లాల్‌భాయ్, దల్‌ఫత్ భాయ్, అహమ్మదాబాద్ మిల్లు యజమానుల సంఘానికి ప్రాతినిధ్యం వహించారు (30 జనవరి 1919).

31. శ్రీ దేవిదాస్ మాధవ్ జీ ధాకర్‌సే, బొంబాయి నేటివ్ పేస్‌గూడ్స్ మర్చెంట్స్ అసోసియేషన్‌కు ప్రాతినిధ్యం వహించారు (30 జనవరి 1919).

32. గౌరవనీయ శ్రీ గులామ్ హుసేన్ హిదాయతుల్లా (31 జనవరి 1919).

33. శ్రీ బి.వి.జాధవ్ (31 జనవరి 1919).

34. గౌరవనీయ సర్ శ్రీ పజుల్‌భాయ్ కురీంభాయ్ సి.ఐ.ఇ. (31 జనవరి 1919).

35. శ్రీ హెచ్.పి. మోడి (31 జనవరి 1919).

36. సర్దార్ వి.ఎన్. ముతాలిక్, ఇనాందార్ సెంట్రల్ అసోసియేషన్ సతారాకు ప్రాతినిధ్యం వహించారు. (31 జనవరి 1919).

అనువాదం :

ఎం.ఎస్.బాబూరావు

బొజ్జా తారకం

# 8

భవిష్య కాలానికి ప్రసంగాలు : సంఖ్య – 3

## సమాఖ్యకు పోటీగా స్వేచ్ఛ

(కాలే స్మారకోపన్యాసం)

*పూనా గోఖలే హాలులో ఏర్పాటయిన గోఖలే రాజకీయ ఆర్థికసంస్థ వారి వార్షికోత్సవంనాడు 29 జనవరి 1939లో చేసిన ప్రసంగం*

*"ఈ రోజున నీవు ఏ దిక్కు-కేసి ప్రయాణం చేస్తున్నావనేది ముఖ్యం కాని ఎంత దూరం వెళ్లావనేది కాదు"*

– టాల్‌స్టాయ్

# సమాఖ్యకు పోటీగా స్వేచ్ఛ

## ప్రస్తావన

ఈ చిన్న పుస్తకానికి మూలమేమిటో, ఇప్పుడు దీనిని ప్రచురించడంలో నా ఉద్దేశ్యమేమిటో ఒకటి రెండు మాటలు చెప్పడం అసందర్భమేమి కాదనుకుంటాను. డాక్టర్ డి.ఆర్.గాడ్గిల్ నేతృత్వంలో పూనాలో గోఖలే ఇనిస్టిట్యూట్ ఆఫ్ పొలిటిక్స్ అండ్ ఎకనమిక్స్ అనే ఒక విద్యా సంస్థ ఉందని ఈ దేశంలోని చాలామందికి తెలుసుననుకుంటాను. ప్రతి సంవత్సరం ఈ సంస్థ స్థాపకుల దినోత్సవం నాడు రాజకీయాలకు లేదా అర్థశాస్త్రానికి సంబంధించిన ఏదో ఒక అంశంపై ప్రసంగించడానికి ఎవరో ఒకరిని ఆహ్వానిస్తారు. ఈ సంవత్సరం డా.గాడ్గిల్ నన్ను ప్రసంగించమని ఆహ్వానించారు. నేను ఆహ్వానాన్ని ఆమోదిస్తూ నా ఉపన్యాసానికి "సమాఖ్య స్వరూపం" అనే అంశాన్ని ఎన్నుకున్నాను. ఈ ఉపన్యాసం రెండు విషయాలను విపులీకరించింది. 1. సమాఖ్య నిర్మాణం 2. ఆ నిర్మాణానికి సంబంధించిన విమర్శ. పూనాలోని గోఖలే హాలులో 29 జనవరి 1939 నాడు నేను ఆ ప్రసంగంచేశాను. నా ప్రసంగ పాఠం మరీ సుదీర్ఘంగా సాగింది. సాధారణంగా ఒక గంటపాటు ఉపన్యసించవలసిన చోట నేను శ్రోతలను రెండు గంటలపాటు కూర్చోపెట్టాను. అయినప్పటికి సమాఖ్య నిర్మాణం అనే అంశంనుంచి మొత్తం భాగాన్ని, నిర్మాణానికి సంబంధించిన విమర్శలోంచి కొంత భాగాన్ని నేను మినహాయించ వలసి వచ్చింది. అయితే ఈ పుస్తకంలో మాత్రం మౌలికంగా నేను వ్రాసుకున్న సంపూర్ణ ప్రసంగపాఠం ఉన్నది.

ఈ పుస్తకం మూలం గురించి చెప్పిన తర్వాత దీని ప్రచురణ విషయమై చెప్పవలసి వుంది. గోఖలే విద్యాసంస్థలో చేసిన ప్రసంగ పాఠాలను అన్నింటిని ప్రచురిస్తారు. ఆ వరుస క్రమంలో ఇది కూడా ప్రచురింతం కావాలి కాని ఇతర కారణాల మూలాన నేనే ఈ పుస్తకాన్ని ప్రచురిస్తున్నాను. సమాఖ్య గురించి భారతీయ జన సామాన్యంలో అస్పష్టత వ్యాపించి వుంది. సమాఖ్య అవసరమే అనుకున్నా ఆ సమాఖ్య మంచిది కాదని జన సామాన్యం భావిస్తున్నది. అసలు సమాఖ్య స్వభావం గురించి స్పష్టమైన అభిప్రాయం లేనందువల్ల దాని గురించి విజ్ఞతా పూర్వకమైన అభిప్రాయాన్ని ఏర్పరచుకోలేక పోతున్నారు. అందువల్ల సమాఖ్య నిర్మాణ రూపురేఖల గురించి, ఆ నిర్మాణానికి సంబంధించిన విమర్శ గురించి ప్రజలకు సక్రమమైన

అవగాహనను చేకూర్చే ఒక కరపత్రం అందుబాటులో ఉండవలసిన అవసరం ఉంది. ఆ అవసరాన్ని ఈ పుస్తకం తీర్చగలదని నేను భావిస్తున్నాను.

ఈ పుస్తక ప్రచురణ సకాలంలోనే జరుగుతున్నదని కూడా నేను భావిస్తున్నాను. సమాఖ్య అనే అంశం సజీవమైనది. అందువల్ల అత్యవసరమైనది కూడా. 'బ్రిటిష్ ఇండియా'లోని ప్రజలు తాము సమాఖ్య స్వరూపాన్ని ఆమోదించాలా లేకా అవసరం లేదా అనే అంశాన్ని త్వరలోనే నిర్ణయించుకోవలసి వుంది. ఈ దేశంలోని ప్రధానమైన రాజకీయ సంస్థ కాంగ్రెస్‌పార్టీ ప్రాంతీయ స్వయం ప్రతిపత్తిని గతంలో ఆమోదించింది కాబట్టి ఈ సమాఖ్య పథకాన్ని కూడా ఆమోదించవచ్చు. ముస్లింలీగ్‌తో జరుగుతున్న చర్చలు, భారతదేశంలోని ఇతర రాష్ట్రాలతో సాగుతున్న మంతనాల సరళి చూస్తుంటే కాంగ్రెస్ పార్టీ తప్పకుండా సమాఖ్యను అంగీకరించగలదనే విషయాన్ని సూచిస్తున్నది. ఈ చర్చలో ఇతర మంతనాలూ పన్నాగాలూ మిగతా రాజకీయ పక్షాలతో ఒక ఆచరణాత్మకమైన ఏర్పాటు చేసుకోవటానికే జరుగుతున్నాయి. వాటి సాయంతో ఇతర ప్రాంతాలలో వున్నట్లుగానే కేంద్రంలో కూడా కాంగ్రెస్ అధికారానికి రావచ్చును. శ్రీ సుభాష్ చంద్రబోస్ కాంగ్రెస్‌లోని మితవాద వర్గం సమాఖ్య ఏర్పాటుకు అంగీకరించిందని, చివరికి మంత్రివర్గాన్ని కూడా ఎన్నుకున్నదని సూచించే మేరకు వెళ్లారు. ఇది అంతా నిజమా కాదా అనేది ప్రధాన విషయం కాదు. ఇది అసత్యమేనని నేను ఆశిస్తున్నాను. ఏది ఏమైనా ఈ విషయం చాలా తీవ్రమైనది. అత్యవసరమైనది. అందువల్ల దీనిని గురించి ఏదైనా చెప్పదలుచుకున్నవారు వెంటనే తమ అభిప్రాయాలను ప్రకటించాలని నేను భావిస్తున్నాను. ఇప్పుడు మౌనాన్ని పాటించటమంటే నేరం చేసినట్లే లెక్క. అందువల్ల నా ఈ ప్రసంగాన్ని ఇంతత్వరగా ప్రచురిస్తున్నాను. సమాఖ్య గురించి నాకు అభిప్రాయాలున్నాయని, అవి ఇతరులకు నచ్చకపోయినా కనీసం ఆలోచనకైనా ప్రేరణ ఇస్తాయని నేను నమ్ముతున్నాను.

– బి.ఆర్.అంబేడ్కర్

1–3–39.

రాజగృహ

దాదర్, బొంబాయి–14

# ఉపోద్ఘాతము....

డాక్టర్ గాడ్గిల్, గోఖలే విద్యాసంస్థ విద్యార్థులారా!

మీ ఆహ్వానంపై ఈ సాయంత్రం మిమ్మల్ని ఉద్దేశించి ప్రసంగించటం గొప్ప గౌరవంగా నేను భావిస్తున్నాను. మీ సంస్థ సంస్థాపకుల దినోత్సవాన్ని జరుపుకునేందుకు ఈ రోజు మీరిక్కడ సమావేశమయ్యారు. మీ విద్యాసంస్థ సంస్థాపకులైన స్వర్గీయ రావుబహదూర్ ఆర్.ఆర్.కాలే గారితో నాకు వ్యక్తిగతంగా పరిచయం వున్నందుకు గర్వపడుతున్నాను. పాత బొంబాయి శాసనమండలిలో మేమిద్దరం సహచర సభ్యులుగా ఉన్నాం. తాను చేపట్టదలచుకున్న ఏ విషయాన్నయినా ఆయన ఎంత కూలంకషంగా పరిశీలించేవారో నాకు తెలుసు అధ్యయనం, జ్ఞానం ద్వారా ఈ విద్యాసంస్థను సుస్థిరం చేయడానికి సహాయపడుతున్న వారందరు ఆయనకు కృతజ్ఞులై ఉండాలని నేను నమ్ముతున్నాను. జ్ఞానానికై అన్వేషించటమే కాక, జ్ఞానాన్ని ఉపయోగించుకునేందుకు శ్రద్ధ తీసుకునేవారి కోసమే విద్యాసంస్థను తయారు చేయటం సంస్థ ముఖ్యోద్దేశ్యంగా నాకు అవగతమైంది. జ్ఞానం కంటె మరేదీ శక్తివంతం కాదనేది మొదటి విషయం కాగా ఇక రెండోది, జ్ఞానార్జన కోసం కృషి చేసే చాలామందికి తీరికగాని, ఓపికగాని లేవు. జ్ఞాన సాధనలో వుండే శ్రమను ప్రశంసించే వారితో నేను ఈ విధంగా భాగస్వామ్యం పొందడం సంతోషంగా ఉంది.

1935లో భారత ప్రభుత్వ చట్టం, చేర్చిన 'సమాఖ్య స్వరూపం' అనే అంశాన్ని నా ఉపన్యాస విషయంగా ఎన్నుకున్నాను. ఈ విషయ శీర్షికను బట్టి సమాఖ్య రాజ్యాంగాన్ని గురించి మీకు వివరిస్తాననే భావన మీలో కలిగి వుండవచ్చు. అలా చేయటం ఒక అసాధ్యమైన పని. సమాఖ్య స్వరూపం విస్తారమైనది. 1935లోని భారత ప్రభుత్వ చట్టం, 321వ అధ్యాయంలో మొదట అదే చట్టంలోని తొమ్మిదవ షెడ్యూల్ లో రెండోచోట, ఈ చట్టంలో జారీ చేసిన 31వ మండలి ఉత్తర్వులలో మూడోచోట, భారత దేశంలోని రాష్ట్రాలు జారీచేసిన వందలాది విలీన ఉపకరణాలలో నాలుగో చోట ఈ సమాఖ్యకు సంబంధించిన ఒడంబడికలు వున్నాయి.

అతి విస్తారంగా ఉన్న ఈ విషయం పట్ల అతి కొద్దిమందికి మాత్రమే అవగాహనవున్నా, ఆ విషయమై వివరించాలంటె వారికి కొన్ని సంవత్సరాలు పడుతుంది. కాని నేను పరిమితమైన కార్యాన్ని మాత్రమే ఎన్నుకున్నాను. ఆమోదం పొందిన కొన్ని పరీక్షల వెలుగులో ఈ స్వరూపానికి సంబంధించిన వాటిని పరిశీలించి, వాటి ఫలితాలను మీ సమక్షంలో నివేదిస్తే, దాని వలన మీరు స్వయంగా ఈ స్వరూపంలోని ఉత్తమమైన వాటిని అంచనా వేసుకోడానికి వీలవుతుంది. ఈ స్వరూపానికి సంబంధించిన రూపురేఖలనీ నేను వివరించక తప్పదు. దీనిలోని ప్రాథమిక అంశాన్ని తెలియజేయని పక్షంలో నా విమర్శ నిరర్థకమై పోవచ్చును.

నా ఈ ఉద్దేశాన్ని వివరించే ఈ స్వరూపం క్లుప్తంగా వుంటుంది దాని ఉత్తమ లక్షణాలను మీరు గ్రహించటానికి వీలుగానూ వుంటుంది.

II

## భారత సమాఖ్య పుట్టుక, దాని అభివృద్ధి

ఆధునిక యుగంలో అయిదు దేశాలు సమాఖ్యతరహా (ఫెడరల్) ప్రభుత్వాలను అనుసరిస్తున్నాయి. అవి 1. అమెరికా సంయుక్త రాష్ట్రాలు 2. స్విడ్జర్ లాండ్ 3. ఇంపీరియల్ జర్మని 4 కెనడా 5. ఆస్ట్రేలియా. ఈ అయిదింటితోపాటుగా అఖిలభారత సమాఖ్యను జతచేయాలని అనుకుంటున్నారు. ఈ సమాఖ్య అంతర్భాగాలుగా ఏమేం వుంటాయి? ఈ ప్రశ్నకు సమాధానంగా అయిదవ అధ్యాయాన్ని పరిశీలిద్దాం. అది ఈ విధంగా వుంది :

ఈ దిగువ తెలిపిన షరతు ఆమోదయోగ్యమైనపుడు, పార్లమెంటు ఉభయ సభలు నివేదించిన పక్షంలోను ప్రకటించిన తేదీన సమాఖ్యలో కలిసిన రాష్ట్రాలు భారతీయ సమాఖ్యగా వ్యవహారంలోకి వస్తాయని బ్రిటిషు రాజు ప్రకటించవచ్చును

1 ఇకనుంచి ఈ రాష్ట్రాలను గవర్నర్ల రాష్ట్రాలుగా పిలుస్తారు.

2 సమాఖ్యలో చేరడానికి అంగీకరించిన భారత రాష్ట్రాలు, అనంతరం చేరబోయేవి; ఈ విధంగా ఏర్పడిన సమాఖ్యలో ఇక మీదట చీఫ్ కమీషనర్ రాష్ట్రాలుగా వ్యవహారంలోకి వచ్చే రాష్ట్రాలు చేరతాయి.

దీనిపై ప్రస్తావించిన షరతు ఏమంటే- నియమాలలో రాష్ట్రాలు

1. ఈ చట్టంలోని మొదటి షెడ్యూల్లో వున్న రెండవభాగం అనుసరించి ఇకనుంచి పాలకులు రాష్ట్ర మండలికి 52 సభ్యులకంటె తక్కువ కాకుండా ఎన్నుకునే హక్కు వుంటుంది

2 చట్టంలో పేర్కొన్న విభాగాన్ని అనుసరించి సరాసరిని వుండె జనసంఖ్య మొత్తం గా ష జనసంఖ్యలో కనీసం ఒకటిన్నరకు సమానము అలా నిర్ధారించుకున్న తర్వాత దానిని

సమాఖ్యలో లీనం చేయవలసి వుంటుంది.

సమాఖ్యను ప్రారంభించడానికి ఈ అధ్యాయం నిర్దేశించిన నియమాలను పక్కనపెడితే సమాఖ్యలో 1. గవర్నర్ల రాష్ట్రాలు 2. చీఫ్ కమీషనర్ రాష్ట్రాలు 3. భారత రాష్ట్రాలు అనే అంశాలుంటాయనేది స్పష్టం అవుతుంది.

భారత సమాఖ్య పరిమాణం ఏ విధంగా ఉంటుంది?

భారత సమాఖ్యను గురించి మాట్లాడే చాలామంది అది ఎంత విస్తృతమైన పరిమాణంలో ఉంటుందో గ్రహించినట్టులేదు.

| | జనాభా | వైశాల్యం | విభాగాలు (యూనిట్లు) |
|---|---|---|---|
| అమెరికా సంయుక్త రాష్ట్రాలు | 122,755,040 | 2,973,773 | 480 రాష్ట్రాలు ఇంకొక జిల్లా సమాఖ్య |
| జర్మనీ | 67,00,000 | 2,08,780 | 25 |
| స్విట్జర్లాండ్ | 466,400 | 15,976 | 22 |
| కెనడా | 10,376,786 | 3,729,665 | 9 |
| ఆస్ట్రేలియా | 6,629,839 | 2,974,581 | 6 |
| భారతదేశం | 352,837,778 | 1,808,679 | 162 |

భారత సమాఖ్యను ఇతర దేశాలతో పోల్చితే అది అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఆస్ట్రేలియాలోని 3/5వంతు వైశాల్యము కలదిగా, కెనడాలోని సగభాగంగా ఉన్నది జర్మనీతో పోల్చుకుంటే తొమ్మిదిరెట్లు ఎక్కువగా, స్విట్జర్లాండు కంటే నూట ఇరవైరెట్లు ఎక్కువగా ఉన్నది. జనాభా విషయానికి వస్తే అమెరికా సంయుక్త రాష్ట్రాలకంటె మూడు రెట్లు, జర్మనీ కంటే అయిదురెట్లు ఎక్కువగా, కెనాడా కంటే ముప్పై అయిదురెట్లు, ఆస్ట్రేలియా కంటే యాభై ఎనిమిది రెట్లు, స్విట్జర్లాండు కంటే ఎనభైరెట్లు ఎక్కువగా వున్నది. విభాగాల విషయంలో పోల్చుకుంటే అమెరికా సంయుక్త రాష్ట్రాల కంటే మూడురెట్లు, జర్మనీ కంటే ఆరున్నర రెట్లు, స్విట్జర్లాండు కంటే ఎనిమిదిరెట్లు, కెనడా కంటే పద్దెనిమిది రెట్లు, ఆస్ట్రేలియా కంటే ఇరవై ఏడు రెట్లు ఎక్కువగా ఉన్నది ఈ విధంగా భారతీయ సమాఖ్య అనేది అతి పెద్దదనేదే కాకుండా సమాఖ్యలలో విస్తారమైన ఆకారం కలది!

## సమాఖ్యతన ప్రభుత్వాధికారాల్ని, ప్రమాణాన్ని ఏ మూలం నుంచి పొందుతున్నది?

సెక్షన్ 7 ప్రకారం సమాఖ్య కార్యనిర్వహణ అధికారాన్ని రాజు పక్షాన గవర్నర్ జనరల్

నిర్వహిస్తాడు. సమాఖ్యతన అధికారాన్ని రాజుమూలంగా పొందగలదని దీనివల్ల స్పష్టమవుతుంది. ఈ విషయంలో భారతీయసమాఖ్య అమెరికా సంయుక్త రాష్ట్రాల సమాఖ్యకంటె భిన్నమైనది. అమెరికా సంయుక్త రాష్ట్రంలో సమాఖ్య అధికారం ప్రజలనుంచి ఉత్పన్న మవుతున్నది. అమెరికన్ ప్రజలే ఆ అధికారానికి మూలం అయితే అమెరికా సంయుక్త రాష్ట్రంతో భిన్నంగా వున్న భారతీయ సమాఖ్య మాత్రం ఆస్ట్రేలియా, కెనడాలతో పోలివున్నది. ఆస్ట్రేలియా కెనడాల సమాఖ్యల అధికారాలకు కూడా ఇంగ్లాండు రాజు మూలం. ఆ విధంగా భారత ప్రభుత్వ చట్టంలోని సెక్షన్ 7 అనేది ఆస్ట్రేలియన్ ప్రభుత్వ చట్టంలోని సెక్షన్ 61తో, కెనడియన్ ప్రభుత్వ చట్టంలోని సెక్షన్ 9తో సమానం. భారతీయ సమాఖ్య అమెరికన్ సంయుక్త రాష్ట్రాల సమాఖ్యలకు భిన్నమై, ఆస్ట్రేలియన్, కెనడియన్ సమాఖ్యలతో ఏకీభవిస్తున్నదని అర్థం చేసుకోవచ్చు. అమెరికా సంయుక్త రాష్ట్రాలు గణతంత్రంగా వుంటే కెనడా, భారతదేశాలు మాత్రం రాజరికానికి లోబడివున్నాయి. మొదటిదానిలో అధికారానికి మూలం ప్రజలైతే తర్వాతి దానిలో రాజరికమే ఈ అధికారానికి మూలం.

## రాజు తన అధికారాన్ని ఎక్కడనుండి పొందుతున్నాడు?

కెనడా, ఆస్ట్రేలియాల విషయంలో ఈ ప్రశ్న అవసరమైనది. ప్రభుత్వాధికారానికి ఆదేశాల్లో మూలం రాజరికమే అనేది నిస్సందేహంగా అంగీకరించవలసిందే. మరి ఇదే అంశాన్ని భారతీయ సమాఖ్యకు వర్తింప చేయగలమా? ఈ సమాఖ్యకు రాజరికమే (రాజు) అంతిమ ప్రమాణం కాగలదా? రాజరికానికి వెనకాముందు ఈ సమాఖ్య అధికారాన్ని పొందామంటే ఆధారం ఏదీలేదా? ఈ ప్రశ్నకు సమాధానం భారతీయ సమాఖ్యకు సంబంధించిన అధికారంలో కొంతభాగం మాత్రమే రాజరికం నుంచి పొందగా మిగతా భాగానికి రాజరికం మాత్రం అంతిమ ప్రమాణం కాదు.

సంవిలీన పత్రంకు సంబంధించిన షరతులను పరిశీలించినపుడు ఇది యదార్థమని స్పష్టమవుతున్నది. చిత్తుదస్తావేజునుంచి క్రింది అంశాలను ఉటంకిస్తున్నాను.

"భారతీయ సమాఖ్య స్థాపనకు సంబంధించిన ప్రతిపాదనల గురించి విలీనం కాగోరే భారతీయ రాష్ట్రాలు, బ్రిటిషు పార్లమెంటు ఆధీనంలో వున్న రాజు ప్రతినిధులు, బ్రిటిషు ఇండియాలోని స్వయం ప్రతిపత్తిగల సంస్థానాలు, భారతరాష్ట్రాల పాలకుల మధ్య చర్చలు జరిగాయి.

ఉద్దేశించబడిన ఆ ప్రతిపాదనల ప్రకారం బ్రిటిషు పార్లమెంటు ఆమోదించేచట్టం ఆధారంగా భారతరాష్ట్రాలు విలీనంకాగా భారతీయ సమాఖ్య రూపొందాలి.

భారతీయ సమాఖ్య నిర్మాణానికి సంబంధించిన ఏర్పాటు ఇప్పుడు 1935 భారత ప్రభుత్వ చట్టం, ప్రకారం జరిగింది.

అయితే ఆ చట్టం నిర్దేశించిన ప్రకారమే సమాఖ్య ఏర్పాటు రాజు ఒక తేది ప్రకటించిననాడే, అవసరమైన సంఖ్యలో భారతరాష్ట్రాలు విలీనంకాగలిగినపుడే జరుగుతుంది.

ఆ చట్టం నా ఆమోదం పొందినా ఇతర ప్రాంతాలకు, సమాఖ్యలో విలీనం కాలేని పక్షంలో వర్తింపజాలదు".

ఇప్పుడు ఇందుమూలంగా, నేను (పూర్తి పూరు మరియు బిరుదును పేర్కొనాలి.) పాలకుడిగా (రాష్ట్రంపేరు) నా రాజ్యంపై వున్న సార్వభౌమిక హక్కులతో బ్రిటిషు రాజు అధీనంలో ఏర్పాటు కానున్న భారతీయ సమాఖ్యలో భారతదేశ సంక్షేమం, ప్రయోజనలను కాపాడే నిమిత్తం సహకరించే ఉద్దేశంతో - గవర్నర్ ప్రాంతాలుగా పిలువబడే వాటితో, చీఫ్ కమీషనర్ అధీనంలోని ప్రాంతాలను, విలీనం కానున్న ఇతర సంస్థానాల ప్రాంతాలతో పాటు ఇక్కడ ఈ సంవిలీన పత్రం అమలుకు అంగీకరిస్తున్నాను. ఈ భారత సమాఖ్య ఏర్పాటును బ్రిటీషు రాజు సంవిలీన పత్రాన్ని ఆమోదించే పక్షంలో, 1935 భారత ప్రభుత్వచట్టం, ప్రకారం నేను సమ్మతిస్తున్నాను.

ఇదే భారతీయ సమాఖ్యలోని ప్రత్యేకలక్షణం. కెనెడియన్, ఆస్ట్రేలియన్ సమాఖ్యలకు, భారతసమాఖ్యకు నడుమ వున్న ఈ తేడా దేనివలన వచ్చింది? ఇందులో ఏ విభాగానికి బ్రిటీషు రాజరికం అంతిమ ఆధారం, ఏ విభాగానికి కాదు? ఈ ప్రశ్నలను అర్థం చేసుకోవాలంటే మీరు రెండు అంశాలను గ్రహించాలి. మొదటిది, భారత సమాఖ్యలో రెండు ప్రత్యేక లక్షణాలు వున్నాయి. బ్రిటిష్ ఇండియా మరియు భారతీయ సంస్థానాలు. సెక్షన్ 5ను పరిశీలించిన పక్షంలో ఇది స్పష్టమవుతుంది. రెండోదేమిటంటే ఆపై రెండు ప్రాంతాల రాజరికంతో ఉన్న సంబంధాలు ఒకటేకాదు. బ్రిటిషు ఇండియా అనే ప్రాంతాలన్నీ బ్రిటిషు రాజు ఆధీనంలో వుండగా, భారత సంస్థానమనేది అక్కడి పాలకుడి ఆధీనంలో ఉంది. 2-311 పరిచ్ఛేదాల మీరు పరిశీలిస్తే ఇది అర్థమవుతుంది. ఇక బ్రిటిషు ఇండియాలోని ప్రాంతాలసార్వభౌమత రాజరికానికి లోబడి ఉంది. సంస్థానాల సార్వభౌమికత ఆ ప్రాంతాల సంస్థానాధీశుల ఆధీనంలో ఉంది.

భారత సమాఖ్యలోని కొంత భాగానికి మాత్రమే బ్రిటిషు రాజు ఏ విధంగా ఆధారమవుతున్నాడో, సమాఖ్యలో బ్రిటిషు ఇండియా అంతర్భాగం కాబట్టి దానిపై అంతిమ అధికారమనేది ఆ బ్రిటిషు సింహాసనం చేరి ఎలా వుందో నేను చెప్పిన విషయం ఇప్పుడు మీకు అర్థం కాగలదు. అలాగే భారతదేశంలోని సంస్థానాధీశుడు కూడా సమాఖ్యలో తాను భాగం కాబట్టి ఆ ప్రాంతానికి అతనే అంతిమ అధికార స్రోతస్సు కాగలడు. 7వ పరిచ్ఛేదం ప్రకారం సమాఖ్య పాలనాధికారం బ్రిటిషురాజ్యానికి ప్రతినిధిగా వున్న గవర్నర్ జనరల్‌కు వుంటుంది. అలాగే ఈ భారత సమాఖ్య కార్యనిర్వహణ భారత రాష్ట్రాల్లో సంస్థానాధీశులమూలంగా ఆయనకే చెందుతుంది.

భారతీయ సమాఖ్యలో బ్రిటిషు రాజ్యాధిపత్యమే అధికారానికి అంతిమ ఆధారం. బ్రిటిషు ఇండియా సమాఖ్యలో అంతర్భాగంగా వున్నంత మేరకు ఆ రాజరికమే ప్రమాణము. ఇక సంస్థానాధీశుడు తన రాష్ట్రం సమాఖ్యలో భాగంగా వున్నంతకాలం అధికారానికి మూలమవుతాడు అనే విషయాన్ని ఇప్పుడు మీరు అర్థం చేసుకున్నారనుకుంటాను.

భారత సంస్థానాధీశుడికి చెందిన అధికారాన్ని బ్రిటిషు రాజరికం ఏ క్రమంలో స్వాధీనం చేసుకుంటుంది? ఈ పద్ధతిని భారతీయ చట్టంలో సంలీనం అంటున్నారు. ఈ విలీనం ఆ రాజ్యపాలకుడి ఆమోదంతో సంలీనపత్రం కిందికి రాగలదు. సంలీన పత్రానికి సంబంధించిన అంశాలు 6(1)వ పరిచ్ఛేదంలో వున్నాయి. ఆ పరిచ్ఛేదం ఇలా వుంది.

"ఆ రాజ్యపాలకుడు, అతని వారసుల ఆమోదంతో సంలీన పత్రాన్ని అతని బ్రిటిషు ప్రభువు అంగీకరించగా ఒక రాజ్యం' సమాఖ్యలో విలీనమైనదిగా భావించటం జరుగుతుంది".

(a) ఈ చట్టానికి అంతర్గతంగా, బ్రిటిషు రాజు కోరికమేరకు, భారత గవర్నర్ జనరల్, సమాఖ్య శాసనసభ, సమాఖ్య న్యాయస్థానం, అలాగే సమాఖ్య అవసరనిమిత్తం ఏర్పడే ఎలాంటి సమాఖ్య అధికారమైనా, సంలీన పత్రం ఆధారంగా సమాఖ్యలో విలీనమైనదిగా ఆయన ప్రకటిస్తున్నారు. అయితే ఇది కొన్ని షరతులకు లోబడి, సమాఖ్యకోసం మాత్రమే ఆయన కార్యనిర్వహణకోసం సంబంధించినవి ఆ చట్టం అంతర్గతంగా అమలు చేస్తారు. అంతేకాక

(b) "ఈ సంలీన పత్రం ఆధారంగా తమకువర్తించే ఈ చట్టానికి సంబంధించిన నిబంధనలను తమ రాజ్యంలో అమలు చేసే బాధ్యతను స్వీకరిస్తారు."

ఈ సంలీనపత్రం, సమాఖ్యలోని భారతరాజ్యం ఒకభాగం కావడంవల్ల రాజరికానికి అధికారాన్ని కట్టబెడుతున్నది. దీని మూలంగానే రాజరికపు అధికారం సమాఖ్యపై ఆంశికంగా వుంటున్నది.

సమాఖ్య పుట్టుకకు సంబంధించిన శాసనమిది. సమాఖ్య పెరుగుదలకు సంబంధించిన చట్టమేమిటి? మరో మాటలో చెప్పాలంటే ఈ మార్పుకు సంబంధించిన చట్టమేమిటి? ఈ మార్పుకు సంబంధించిన చట్టం 6(1) a విభాగంలో IIవ అనుచ్ఛేదం, (5) విభాగంలో వున్నది.

సెక్షన్ 6(1) (a) ఈ అంశాన్ని ఇలా స్పష్టం చేస్తున్నది. తన సంలీనపత్రం ద్వారా విలీనాన్ని అమలు చేస్తున్న యువరాజు, ఈ చట్టం ద్వారా స్థాపించబడిన సమాఖ్యలో చేరుతున్నాడు. షెడ్యూలు II రాజ్యాంగం యొక్క భవిష్యత్ సవరణలకు సంబంధించినది. దాని ప్రకారం సంలీన పత్రంలో చేయవలసిన సవరణలు లేదా రాజ్యాలలో సంలీన పత్రం సవరణ అమలుకాలేని అంశాల గురించి భారతప్రభుత్వ చట్టంలోని నిబంధనలగురించి ప్రకటన వున్నది.

సెక్షన్ 6(5) రెండు విషయాలను అమలు చేస్తుంది. అందులో మొదటి అంశం ప్రకారం - షెడ్యూల్ II అనుసరించి సంలీనపత్రంపై ఎలాంటి ప్రభావం లేకుండా సవరణలకు అవకాశమున్నది. అలాగే ఈ సంలీనపత్రం పార్లమెంటుకు అందులోని నిబంధనలను సవరించే అధికారాన్ని ప్రదానం చేస్తున్నది. రెండో అంశంప్రకారం సంలీన పత్రంలోని నిబంధనలను సవరించే హక్కు పార్లమెంటుకు ఉన్నప్పటికి, (షెడ్యూల్ IIననుసరించి) అలాంటి సవరణకు రాజ్యాలు కట్టుబడి ఉండనవసరం లేదు. రాజ్యాలు అదనపు సంలీనపత్రం ద్వారానే అంగీకరించగలిగినపుడే ఆ పద్ధతిలో కట్టుబడి వుండగలవు.

చివరికి సారాంశం - సమాఖ్యలోని విభాగాలన్నీ ఒకే ఆచరణ సూత్రంపై నిలబడి ఉండేరూపంలో ఉండవు. విభాగాలన్నీ విడిగానే ఉంటాయి. కేవలం ఒక చోటే కలసి వున్నా, వాటిని ఏవైనా ఇతర ఉద్దేశాలకోసం మార్చగలిగే ప్రసక్తిరాదు. అయితే ఇతరత్రా వాటిని మార్చగలిగినా, ఆ మార్పుకోసం మిగతా విభాగాలు కట్టుబడి ఉండవు. కొన్ని ఆమోదించినా మిగతా విభాగాలు తమ అంగీకారాన్ని తెలియజేస్తే తప్ప అది సాధ్యంకాదు. మరోమాటలో చెప్పాలంటే ఈ సమాఖ్యలో పెరుగుదలకు ఎలాంటి నిబంధనలేదు. అది స్థిరమైనది. నిర్మితమైనది. వికాస సూత్రంగా ఇందులో మార్పు సాధ్యంకాదు. ఒకవేళ సాధ్యమైనా దాన్ని ఆమోదించినపుడే అది కట్టడి కాగలదు.

III

# సమాఖ్య స్వరూపం

## (a) సమాఖ్య శాసనసభ

సమాఖ్య శాసనసభ ఉభయసభలతో కూడుకుని ఉంటుంది. శాసనసభ అనే దిగువసభ శాసనమండలి అనే ఎగువసభ ఉంటాయి. ఈ ఉభయసభల స్వరూపం ప్రత్యేక లక్షణాలతో ఉంటుంది. మిగతా శాసనసభలతో పోల్చినపుడు ఇవి చాలా చిన్న సభలే. జనాభా లెక్కలు, ప్రాంత విస్తీర్ణతను బట్టి సమాఖ్య శాసనసభలోని సభ్యులసంఖ్య మూడు వందల డెబ్బై అయిదు శాసనమండలి సభ్యుల సంఖ్య రెండువందల అరవై (260), ఈ సభ్యులసంఖ్యను బ్రిటిష్ ఇండియాకు భారత రాజ్యాలకు మధ్య ఒక విధమైన నిష్పత్తిలో విభజించడం జరిగింది. సమాఖ్య శాసనసభలోని 375 సభ్యులలో, 250 సభ్యులను బ్రిటిష్ ఇండియాకు, మిగతా 125 సభ్యులను భారత రాజ్యాలకు కేటాయించడమైనది. శాసన మండలిలోని 260 మంది సభ్యులలో,156 స్థానాలు సీట్లు బ్రిటిష్ ఇండియాకు, 104 స్థానాలు భారత రాజ్యాలకు కేటాయించారు. బ్రిటిష్ ఇండియాకు, భారత రాజ్యాలకు మధ్య ఈ సీట్ల పంపకం సమాన ప్రాతిపదికపై జరగలేదని అర్థం చేసుకోవచ్చు. జనాభా లెక్కలను ప్రాతినిధ్యానికి ఆధారం చేసుకోవచ్చును. అలాగే భూమిశిస్తు ఆదాయాన్ని బట్టి ఈ ప్రాతినిధ్యం ఉండవచ్చు. కాని స్థానాలే పంపకంలో ఈ రెండింటిని కూడ ఆధారం చేసుకోలేదు. జనాభాను తీసుకున్నా

రెవిన్యూను ఆధారం చేసుకున్నా బ్రిటిష్ ఇండియాకు తక్కువ ప్రాతినిధ్యమే లభించిందని మీరు గమనించగలరు. భారతరాజ్యాలకేమో ఉభయ సభలలో అధిక ప్రాతినిధ్యం లభించింది. ఈ సభ్యత్వాన్ని ఇచ్చే పద్ధతి కూడా గమనించదగిన విషయం. ఉభయసభలలోని బ్రిటిష్ ఇండియా ప్రతినిధులను ఎన్నికద్వారా తీసుకుంటారు. భారత రాజ్యాలలోని ప్రతినిధులను ఆ రాజ్యం పాలకులు నియమిస్తారు. ఆ రాజ్యాలలోని ప్రతినిధులను పాలకుడే నియమించినా అక్కడి ప్రజలు అతన్ని ఎన్నుకోవచ్చును. కాని అది కూడా ఆయన ఇష్టాయిష్టాలకే వదిలివేయబడింది. ఆ పాలకుడు ప్రజలు ఎన్నుకున్న వ్యక్తిని తాను నియమించవచ్చును. లేదా ఆయనే ఒక వ్యక్తిని ఎన్నుకుని నియమించవచ్చును. అంతిమ ఫలితం ఏమిటంటే రాజ్యానికి సంబంధించిన ప్రతినిధిని ప్రజలు ఎన్నుకోకుండా అక్కడిపాలకుడే నియమిస్తాడు. ఇక బ్రిటిష్ ఇండియా విషయానికివస్తే అక్కడి ప్రతినిధులు ఎన్నుకోవాలి. కాని అక్కడ కూడా ఒక విచిత్రమైన పరిస్థితి ఉన్నదని మనం గమనించాలి. ఉభయసభల్లో దిగువసభ అనేది ప్రజలకు ప్రాతినిధ్యం వహించేది. సభ్యులను ప్రజలే ప్రత్యక్షంగా ఎన్నుకుంటారు. ఎగువసభకు మాత్రం పరోక్ష ఎన్నికలు జరుగుతాయి. భారతీయ సమాఖ్యలో ఈ శాసనసభా పద్ధతి తలక్రిందులవుతున్నది. ఎగువసభలోని సభ్యులను ప్రజలు ప్రత్యక్షంగా ఎన్నుకోగా దిగువసభలోని సభ్యులను ప్రాంతీయశాసనసభలు ఎన్నుకుంటాయి. సమాఖ్య శాసనసభ అయిదు సంవత్సరాలు ఉంటుంది. అవసరమైతే అంతకుముందే రద్దు చేసుకోవచ్చు. శాసనమండలి మాత్రం రద్దుకు గురికాకుండా శాశ్వతంగా ఉండే సంస్థ. ఈ మండలి మూడోవంతు సభ్యత్వం మూడు సంవత్సరాలకొకసారి రెన్యూవల్ కావడం ద్వారా సజీవంగా వుంటుంది. ఇక ఈ ఉభయసభలు చేసే చట్టాలు, ఆమోదించె జమాఖర్చులు, ఏ అధికార ప్రతిపత్తిలో వుంటాయో చూడవలసి వుంటుంది. చట్టాలను చేసే హక్కు విషయంలో కొన్ని రాజ్యాంగాలు ఆర్థిక బిల్లులకు, మరియు ఇతర బిల్లులకు మధ్య తారతమ్యాన్ని చూపుతున్నాయి. దాని ప్రకారం ఆర్థిక బిల్లుల విషయంలో ఎగువసభకు వాటిని ప్రవేశపెట్టే హక్కుగాని లేదా తిరస్కరించే హక్కుగాని లేదు. అయితే బిల్లులను తాత్కాలికంగా ఆపగలిగే అధికారంమాత్రం ఇచ్చారు. భారతీయ రాజ్యాంగం ఇలాంటి విచక్షణను మాత్రం చేయడం లేదు. ఆర్థిక బిల్లులనూ ఇతర బిల్లులనూ ఒకే స్థాయిలో ఉభయసభలు చర్చించి ఆమోదిస్తాయి. అవి అపుడు చట్టాలుగా ఆమోదం పొందుతాయి. అయితే ఒక తేడామాత్రం ఉంది. సెక్షన్ 30(1) ప్రకారం ఆర్థిక బిల్లుకాని ఏబిల్లు అయినా ఉభయసభల్లో ప్రవేశపెట్టవచ్చును. ఆర్థిక బిల్లులను మాత్రం సెక్షన్, 37 ప్రకారం ఎగువసభలో ప్రవేశపెట్టడానికి వీలులేదు. కాని సెక్షన్ 3(2) ప్రకారం ఆర్థిక బిల్లును కూడా మిగతా బిల్లుల్ని ఆమోదించినట్లే ఎగువసభ ఆమోదించవలసి ఉంది.

వ్యయాన్ని మంజూరు చేసే అధికారాన్ని గురించి శాసనసభారూపం ఉభయసభలుగా ఉన్నపుడు వాటిమధ్య అధికారాన్ని పంపకం చేసే సూత్రం విషయంలో ఇక్కడ మళ్ళీ ఆమోదించబడిన సూత్రాలనుంచి వైదొలగడం జరిగింది.

సెక్షన్ 31(1) ప్రకారం వార్షిక అనుసూచిత ఆదాయ, వ్యయ అంచనాలను సమాఖ్యలోని ఉభయ సభలలో పెట్టవచ్చు. అలాగే వాటిపై అక్కడ బహిరంగ చర్చ కూడా జరుగుతుంది. ఈ ఉభయ సభలలో వాటిపైన బహిరంగ చర్చ జరగడమే కాకుండా ఉభయసభల ఓటింగుకు కట్టుబడి వుండాలి. సెక్షన్ 34(2) ప్రకారం సమాఖ్య శాసనసభకు వ్యయం మంజూరు కోసం డిమాండ్ల రూపంలో ప్రవేశపెట్టాలి. ఆ తర్వాత శాసన మండలికి కూడా నివేదించాలి. వాటిని ఉభయసభలు కూడా ఆమోదించనూవచ్చు లేదా తిరస్కరించనూ వచ్చు; ఆ డిమాండ్లలోని మొత్తాలను తగ్గించనూవచ్చు.

ఆ విధంగా ఈ ఉభయసభలు చట్టాలను చేసే విషయంలో, వ్యయాన్ని మంజూరు చేసే విషయంలో సమాన అధికారాలను కలిగి ఉన్నాయని మనం గమనించవచ్చు. పరస్పరం ఈ ఉభయసభలు రాజీపడని పక్షంలో ఆ ఉభయసభల మధ్య ఘర్షణను నివారించలేము. ఈ ఉభయసభల మధ్య విభేధాలను పరిష్కరించాలంటె ఉమ్మడి సమావేశమే మార్గాంతరం. ఏదైనా బిల్లు విషయంలో తగాదా తలెత్తినపుడు ఆ ఉభయసభల ఉమ్మడి సమావేశాన్ని గురించి సెక్షన్ 31 (1) వివరిస్తున్నది. ఇక వ్యయానికి సంబంధించిన మంజూరు విషయంలో విభేదాలు తలెత్తినపుడు వాటి పరిష్కారం గురించి సెక్షన్ 34(3) ఒక పద్ధతిని నిర్దేశిస్తున్నది.

### (బి) సమాఖ్య కార్యనిర్వహణ వర్గం :

సమాఖ్య కార్యనిర్వహణవర్గ రాజ్యాంగం వివరణ సెక్షన్ 7(1)లో వున్నది. ఈ పరిచ్ఛేదం ప్రకారం సమాఖ్య కార్యనిర్వహణ వర్గం అధికారాన్ని గవర్నర్ జనరల్‌కు అప్పగించడం జరిగింది. అతనే సమాఖ్యకు కార్యనిర్వహణ అధికారి ఈ సమాఖ్య అధికారి ఏకాత్మక అధికారిగానే ఉంటాడుతప్ప సంఘటిత వర్గంగా పనిచేయడని తెలుసుకోవడం అవసరం. భారత దేశంలో బ్రిటిషు ప్రభుత్వం పౌర వ్యవహారాలు, సైనిక వ్యవహారాల పాలనాధికారాన్ని చేబట్టిన కాలం నుంచి కార్యనిర్వహణ అనేది నిర్మాణరీత్యా ఏకాత్మకరూపం ఎప్పుడూ లేదు. ఈ కార్యనిర్వహణవర్గం సంయుక్త కార్యనిర్వాహక వర్గంగానే వుండేది సంస్థానాలలో, ప్రాంతాలలో గవర్నర్ విధానమండలిగా ఉండేది. కేంద్రంలో గవర్నర్ జనరల్ విధానమండలి అనేవారు భారతదేశంతో పాటు ఇతర ప్రాంతాలకు సంబంధించిన పౌర, సైనిక ప్రభుత్వం గవర్నర్ లేదా గవర్నర్ జనరల్ ఆధీనంలో ఉండదు. ఈ ప్రభుత్వాధికారం గవర్నర్ విధానమండలికే ఉంటుంది. ఈ మండలి సభ్యులను రాజు స్వయంగా నియమిస్తాడు కాబట్టి గవర్నర్ జనరల్‌నుంచి అధికారాన్ని పొందే అవకాశం లేదు ఈ సభ్యులందరూ రాజరికంనుంచి అధికారాన్ని పొందడం మూలాన గవర్నర్‌తో గవర్నర్ జనరల్‌తో సమాన అధికారాన్ని కలిగి వుంటారు. అయితే ప్రాంతాల శాంతి భద్రతల విషయంలో తప్ప ఈ గవర్నర్, గవర్నర్ జనరల్ అత్యధిక సంఖ్యాకులైన సభ్యుల నిర్ణయానికి కట్టుబడి వుండాలి అందువల్ల రాజ్యాంగం ఈ విషయంలో ఇంతకు పూర్వమున్న నిర్వహణ వ్యవస్థకు భిన్నమైన

వైఖరి తీసుకున్నది. ఈ భిన్నమైన వైఖరి లేదా పద్ధతి సూత్రరీత్యా అసంబద్ధమైనదని లేదా పూర్వ సాంప్రదాయానికి న్యాయ సమ్మతం కాదని లేదా సమాఖ్య రాజ్యాంగ అవసరాల రీత్యా ఈ కొత్త పరిస్థితి తలెత్తినదని నేను అనడం లేదు. ఇది ఎంతో ముఖ్యమైన మార్పు అని మాత్రం మీరు గ్రహించాలని కోరుతున్నాను.

సమాఖ్య కార్యనిర్వహణ వర్గం గురించి మరో విషయం గ్రహించవలసి వుంది. సమాఖ్య కార్యనిర్వాహణ అధికారం గవర్నర్ జనరల్‌కు ఉన్నప్పటికీ, కార్యనిర్వహణ అధికారాలను వినియోగించడానికి కొన్ని షరతులు వున్నాయి. ఈ కార్యనిర్వహణ అధికారానికి లోబడి వుండే అంశాలను రాజ్యాంగం నాలుగు వర్గాలుగా విభజించింది. ఈ నాలుగు వర్గాల విషయంలో అతను తన అధికారాన్ని ఎలా వుపయోగించాలో పద్ధతిని సూచించింది. గవర్నర్ జనరల్ కొన్ని విషయాల సందర్భంలో 1. తన విచక్షణ అధికారాన్ని ఉపయోగించి కార్యాన్ని నిర్వహించాలి. 2. మరికొన్ని విషయాలలో తన మంత్రుల సలహా మేరకు నడవాలి. 3. కొన్ని విషయాలలో అతను మంత్రులను సంప్రదించిన తర్వాత కార్యాన్ని నిర్వహించాలి. 4. కొన్ని విషయాలలో తన వ్యక్తిగత నిర్ణయం ప్రకారమే నడవాలి. తన మంత్రుల సలహా మేరకు నడుచుకోవాలి అనే అంశాన్ని వివరించాలి అంటే దీనికి సంబంధించిన న్యాయబద్ధమైన అంతరార్థాన్ని వివరించడం మంచిది. దీని అర్థం ఏమిటంటె ఆయా విషయాలలో ప్రభుత్వ నిర్వహణ అనేది మంత్రుల అధికారపరంగానే జరుగుతుంది. అది కూడ గవర్నర్ జనరల్ అధికారాన్ని నామమాత్రంగానే వుపయోగించుకుంటుంది. దీనినే మరో రకంగా చెప్పాలంటే మంత్రుల సలహాకు గవర్నర్ జనరల్ కట్టుబడి వుండాలి. వారి సలహాతో విభేదించె హక్కులేదు. ఇక తన విచక్షణతో గవర్నర్ జనరల్ కార్యనిర్వహణ జరిపించటం అంటే అతను అధికారయుతంగా చేయడమన్నమాట. దీని అర్థం ఎలాంటి స్థాయిలో కూడ మంత్రులు జోక్యం చేసుకోడానికి వీలులేదు. గవర్నర్ జనరల్‌కు మంత్రులు సలహా ఇచ్చే అధికారం లేదు. గవర్నర్ జనరల్ వారి సలహాకు కట్టుబడి వుండక్కరలేదు. ఆ విషయాలకు సంబంధించిన ఫైళ్లు మంత్రుల దగ్గరికి పోనక్కరలేదు. తన "వ్యక్తిగత నిర్ణయం ప్రకారం నడవటం" అంటె ఆ విషయం మంత్రి సలహా పరిధిలో వున్నప్పటికి, నిర్ణయం తీసుకునే విషయంలో మాత్రం ఆ మంత్రికి నిర్ణయం తీసుకునే హక్కులేదు. గవర్నర్ జనరల్ ఆ నిర్ణయం విషయంలో అంతిమ అధికారి. "తన విచక్షణ మరియు వ్యక్తిగత నిర్ణయం ప్రకారం" అనే వాటిమధ్య వున్నతేడా ఏమిటంటె అతని విచక్షణ ప్రకారం అన్నపుడు ఆ విషయాలలో మంత్రులకు సలహా ఇచ్చే హక్కు వుండదు. ఇక అతని వ్యక్తిగత నిర్ణయం ప్రకారం అన్నపుడు గవర్నర్ జనరల్‌కు మంత్రులు సలహా ఇచ్చే అధికారం వుంటుంది. దీనినే మరో విధంగా చెప్పాలి అంటె తన వ్యక్తిగత నిర్ణయం ప్రకారం నడిచినపుడు గవర్నర్ జనరల్ మంత్రుల సలహాను పొందవలసిన అవసరం ఉంటుంది. అయితే వారి సలహాను మాత్రమే పాటించవలసిన అవసరం లేదు. ఆయన వారి సలహాను పరిశీలించవచ్చును. కాని దానికి భిన్నంగా నడవడమే

కాకుండా మరో విధంగా నిర్ణయం కూడాతీసుకో ఇక తన విచక్షణ అనుసరించి నిర్ణయాలు చేసే సందర్భంలో ఆయన మంత్రుల సలహాను కూడా స్వీకరించనక్కరలేదు. "సంప్రదించిన తర్వాత" అనే పదజాలం కేవలం ఒక పద్ధతికి సంబంధించిన విషయమే. అలాంటి విషయాలలో గవర్నర్ జనరల్‌కే అధికారం చెందుతున్నది. అతను చేయవలసినదల్లా మంత్రుల అభిప్రాయాలను పరిగణలోకి తీసుకోవడమే. "సంప్రదింపుల తర్వాత ఆచరించడం" అనే దానిని 'వ్యక్తిగత నిర్ణయానికి' సంబంధించిన విషయాలతో విడిగా చూడవచ్చును. 'వ్యక్తిగత నిర్ణయాని'కి సంబంధించిన విషయాలలో అధికారం మంత్రులకే ఉంటుంది. గవర్నర్ జనరల్‌కు ఈ విషయంలో అవసరమైతే తిరస్కరించే హక్కు ఉంటుంది. సంప్రదింపుల తర్వాత అంతర్గతంగా వచ్చే విషయాలకు సంబంధించి గవర్నర్ జనరల్‌కు అధికారం చెందుతుంది. ఇక్కడ మంత్రులకు తాము ఏమి చేయదలచుకున్నారో చెప్పే స్వేచ్ఛవుంది.

## (సి) సమాఖ్య న్యాయవ్యవస్థ

భారత ప్రభుత్వచట్టం సమాఖ్య రాజ్యాంగంలో అంతర్భాగంగా ఫెడరల్ న్యాయవ్యవస్థను ఏర్పాటు చేసింది. ఈ సమాఖ్య న్యాయస్థానంలో ఒక ప్రధాన న్యాయమూర్తి, బ్రిటిషు రాజు అవసరం అనుకున్న సంఖ్యలో మరి కొందరు న్యాయమూర్తులు ఉంటారు. శాసనసభ కోరనంత వరకు వారి సంఖ్య ఆరుకి మించి వుండకూడదు. ఫెడరల్ న్యాయవ్యవస్థకు ఒరిజినలు అప్పీలు అధికారపరిధి వుంటుంది. సెక్షన్ 204 అనేది ఫెడరల్ న్యాయస్థానం సంబంధించి ఒరిజినల్ న్యాయస్థాన అధికార పరిధిని గురించి చెబుతున్నది. దీని ప్రకారం సమాఖ్యకు, ప్రాంతాలకు, సమాఖ్యలోని రాజ్యాలకు మధ్య న్యాయపరమైన హక్కుల విషయమై ఏదైనా తగాదా వచ్చినపక్షంలో న్యాయస్థానానికి ప్రత్యేకమైన ఒరిజినల్ న్యాయస్థాన అధికార పరిధి వుంటుంది. అయితే ఈ సెక్షన్ లో మరో నిబంధన కూడా వున్నది. రాష్ట్రం గనుక ఒక కక్షిదారు అయిఉంటే, వివాదం, దానిక్రింద ఉన్న కౌన్సిలు చేసిన చట్టం లేదా ఉత్తరువు వ్యాఖ్యానానికి సంబంధించినది గాని, విలీన పత్రంద్వారా సమాఖ్యకు సంక్రమించిన శాసనపరమైన లేదా కార్యనిర్వాహక వర్గపరమైన అధికార పరిమితికి సంబంధించినది గాని, రాష్ట్రాలలో సమాఖ్య శాసన అమలు కోసం చేసిన చట్టంలోని 6వభాగం క్రింద చేసుకున్న ఒప్పందం క్రింద ఉత్పన్నమైనది గాని, సమాఖ్య శాసనమండలి రాష్ట్రాలకోసం శాసనం చేసే హక్కుకు సంబంధించిన ఏ విషయానికి సంబంధించినదైనా గాని, సమాఖ్య ఏర్పడిన తర్వాత రాజు ప్రతినిధి అంగీకారంతో రాష్ట్రాలు సమాఖ్య లేదా పరగణాలు సమాఖ్య మధ్య ఏర్పడిన ఒప్పందానికయినా సంబంధించినది గాని అయి ఉండాలి. ఈ వివాదం అట్టి అధీన పరిధికిలోబడి ఉండినదై ఉండాలి. రాష్ట్రాలపై ఫెడరల్ న్యాయస్థానంకు ఉన్న ఈ పరిమిత ఆధీన పరిధి కూడా అట్టి అధీన పరిధిని మినహాయిస్తూ చేసుకున్న ఒప్పందం క్రింద వివాదం ఏదయినా వచ్చి ఉండేదై అది న్యాయ విచారణకు రాదు కాబట్టి అట్టి ఆధీన పరిధికూడా ఇంకా పరిమితమవుతుంది.

ఫెడరల్ న్యాయస్థానం యొక్క అప్పీలు అధికారం పరిధిని నియంత్రించే సెక్షన్‌లు 205,207. సెక్షన్ 205 ప్రకారం బ్రిటిష్ ఇండియాలోని హైకోర్టు ఇచ్చిన తీర్పు, డిక్రి లేదా ఆఖరు ఉత్తర్వుపై ఫెడరల్ న్యాయస్థానానికే అప్పీలు దాఖలు చేసుకోవచ్చు. అయితే, ఈ చట్టం అన్వయానికి సంబంధించి ఒక ప్రధానమైన సమస్య ఈ కేసులో ఇమిడి ఉందని హైకోర్టు అభిప్రాయ పడినప్పుడు లేదా దాని క్రింద ఒక ఉత్తరువు కౌన్సిలు చేసినప్పుడు మాత్రమే అప్పీలు దాఖలు చేసుకోవాలి. సెక్షన్ 207 సమాఖ్యలోని రాజ్యాల న్యాయస్థానాలు ఇచ్చే తీర్పులపై చేసే అప్పీలుకు సంబంధించినది. ఇది ఏం చెబుతున్నదంటే సమాఖ్యలో లీనమైన రాష్ట్ర న్యాయస్థానం ఇచ్చిన తీర్పుపై ఫెడరల్ కోర్టుకు అప్పీలు ఉంటుంది. అయితే, అది న్యాయపరమైన సమస్య. అది చట్టం లేదా కౌన్సిలు ఉత్తరువు వ్యాఖ్యానానికి సంబంధించినదయి ఉండి ఏదయినా పొరపాటుగా నిర్ణయమయిందని అభిప్రాయ పడినపుడు రాష్ట్రాల విలీన పత్రం మూలంగా సమాఖ్యకు దాఖలయిన శాసన లేదా కార్యనిర్వాహక అధికార పరిమితికి సంబంధించిన విషయమయినా లేదా సమాఖ్య శాసన మండలి చేసిన చట్టాన్ని రాష్ట్రాలలో అమలుకు సంబంధించి చట్టంలోని 6వ భాగం క్రింద చేసుకున్న ఒప్పందం క్రింద ఉత్పన్న మయిన అంశం గాని అయి ఉండాలి. అయితే 207 విభాగంలోని ఉప విభాగం (2) ఏమి చెబుతున్నదంటే, ఈ విషయంపై ఫెడరల్ న్యాయస్థానం అభిప్రాయం వెలిబుచ్చవలసిన అవసరం ఉందని హైకోర్టు అభిప్రాయ పడినపుడు మాత్రమే అట్టి అప్పీలు దాఖలవుతుంది. దీనిని కూడా ఫెడరల్ కోర్టు అంగీకరించాలి. ఫెడరల్ న్యాయ వ్యవస్థకు సంబంధించిన మరో రెండు అంశాలను పేర్కొనవలసి వుంది. ఇందులో మొదటిది ఫెడరల్ న్యాయస్థానానికి తన ఉత్తర్వులను అమలు చేయించుకొనే అధికారం. తన ఉత్తరువులను అమలు చేయించుకొనే సొంత యంత్రాంగం ఫెడరల్ కోర్టుకు లేదు. సెక్షన్ 210ని అనుసరించి బ్రిటిష్ ఇండియా లేక ఫెడరల్ రాజ్యాలలోని న్యాయస్థానాలలో ఇతర అధికారులు ఫెడరల్ న్యాయస్థానం ఉత్తర్వులను ఆయా ప్రాంతాలలో సివిలు క్రిమినల్ న్యాయ పరిధికి సంబంధించి అత్యున్నతమైన న్యాయస్థానం ఉత్తరువులు జారీ చేసినట్టుగానే అమలు చేయించాలి. ఫెడరల్ కోర్టు తన ఉత్తరువులను అమలు చేయించటానికి సమాఖ్య రాష్ట్రాలలోని యంత్రాంగాన్ని ఉపయోగించు కుంటుంది.

ఫెడరల్ కోర్టుకు సంబంధించి గమనించవలసిన రెండో అంశం ఏమంటే, న్యాయమూర్తులను తొలగించటానికి కార్యనిర్వాహక వర్గానికి ఉన్న అధికారాలు, వారి ప్రవర్తను చర్చించటానికి శాసన మండలికి ఉన్న అధికారాల సమస్య. ఈ విషయంలో కూడా ఇతర సమాఖ్యలలో ఉన్న ఫెడరల్ కోర్టులకు, ఈ ఫెడరల్ కోర్టుకు తేడా ఉన్నది. ఫెడరల్ కోర్టు న్యాయ మూర్తిని పదవి నుంచి తాత్కాలికంగా తొలగించే హక్కు గవర్నర్ జనరల్‌కు రాజ్యాంగం ఇవ్వటం లేదు. ఒక న్యాయమూర్తి న్యాయ సంబంధమైన ప్రవర్తనను శాసన మండలి చర్చించటాన్ని రాజ్యాంగం నిరోధిస్తున్నది. దీనివలన, ఫెడరల్ కోర్టు న్యాయ మూర్తికి

ఖచ్చితమైన పదవీ కాలం నిర్ణయం కావటం, తన అధికారాలలో శాసనమండలి గాని కార్యనిర్వాహక వర్గం గాని జోక్యం కలుగ జేసుకోకుండా రక్షణ లభ్యమయ్యే అవకాశం ఉన్న మాట నిజమే. న్యాయ విభాగాన్ని కార్య నిర్వాహక వర్గం అదుపులో నుంచి తప్పించాలంటే ఒక న్యాయమూర్తి పదవీ కాలాన్ని కార్యనిర్వాహక వర్గం అభిమతంపై ఉండకుండా చేయటమే. అందువల్ల అన్ని రాజ్యాంగాలు న్యాయమూర్తి తాను సత్ప్రవర్తనలో ఉన్నంతకాలం పదవిలో కొనసాగుతాడని, అతని ప్రవర్తన సరిగా లేదని ప్రకటిస్తూ శాసనమండలిలో తీర్మానం ప్రవేశపెట్టటం ద్వారానే అతనిని తీసి వేయటం జరుగుతుందని నిబంధన ఏర్పాటు చేసుకున్నాయి. ఒక న్యాయమూర్తి ప్రవర్తన సరిగ్గాలేదని చెప్పటానికి అధికారం ఎవరికో ఒకరికి దత్తమై ఉండాలి. ఫెడరల్ రాజ్యాంగంలో ఈ నిబంధన లేదు. దీనివల్ల ఫెడరల్ కోర్టు న్యాయమూర్తి అతను పదవీ విరమణ చేసినంత వరకు తన పదవీ కాలంలో అతని ప్రవర్తన ఎలా ఉన్నప్పటికీ పదవి నుంచి తొలగించటానికి వీలులేదు. ఇందుకు బదులుగా ఫెడరల్‌కోర్టు న్యాయమూర్తిని తొలగించే హక్కు 200(2)(బి) పరిచ్ఛేదం క్రింద బ్రిటిషు రాజుకు ఇవ్వటం జరిగింది. అయితే, దుష్ప్రవర్తన వల్లగాని, శారీరకంగా లేక మానసికంగా పని చేయలేని స్థితిలో ఉండటం వల్ల న్యాయమూర్తిని తొలగించవచ్చని ప్రివీ కౌన్సిల్ సిఫారసు చేసిన మీదట న్యాయమూర్తిని తొలగించటం జరుగుతుంది. ఫెడరల్ న్యాయస్థానానికి సహాయపడటానికి సమాఖ్య విభాగాలు కట్టుబడి వుంటాయి. ఇది అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఉన్నదానికంటే భిన్నంగా ఉన్నది. అక్కడ సుప్రీంకోర్టుకు తన ఉత్తరువులను అమలు చేయించుకోవటానికి సొంత యంత్రాంగం ఉన్నది.

## IV

## సమాఖ్య అధికారాలు

సమాఖ్య ప్రభుత్వంకు ఉన్న అధికారాలేమిటో నేను వివరించేముందు సమాఖ్య ప్రభుత్వ పద్ధతి సారమేమిటో చెప్పవలసి వుంది. దీనిని వివరించాలంటె ఈ పద్ధతికీ ప్రభుత్వ ఏకాత్మక రూపానికీ మధ్య వున్న తేడాను చెప్పడం కంటే సులవైన పద్ధతి లేదు.

సమాఖ్య ప్రభుత్వ రూపానికీ, ఏకాత్మక రూపానికీ స్పష్టమైన భేదం వున్నప్పటికి ఆ తేడాను చూడటం అంత తేలికైన పనికాదు. పైగా బాహ్య రూపాన్ని మాత్రమే పరిశీలిస్తే ఆ రెండింటి మధ్య ఎంతో సామ్యం వున్నట్టు అర్థం అవుతుంది. దాదాపు అన్ని దేశాలలోని ప్రభుత్వాలు ఈ రోజుల్లో పరిపాలన విభాగాల మధ్య వుండే అంతర్ సంబంధాల ద్వారానే పనిని సాగిస్తున్నాయి. ఈ విభాగాలన్ని ప్రత్యేకరంగాలలో ప్రత్యేక ప్రజాకార్యాలను నిర్వహిస్తున్నాయి. ఇది సమాఖ్య పద్ధతిలో వుండే ప్రభుత్వ విషయంలో ఎంత నిజమో ఏకాత్మక పద్ధతిలో వుండే ప్రభుత్వానికి కూడా అంతే. సమాఖ్య రాజ్యాంగంలో ఒక కేంద్ర ప్రభుత్వం ఉంటుంది. దానితో అంతర్గత సంబంధాలు గల అనేక స్థానిక ప్రభుత్వాలు

ఉంటాయి. అలాగే ఏకాత్మక పద్ధతి రాజ్యాంగంలో కూడ ఇదే నిర్వహణ వుంది.ఒక కేంద్ర ప్రభుత్వం దానితో అంతర్గత సంబంధం ఉండే స్థానిక ప్రభుత్వాలు ఉంటాయి. అందువల్ల ఉపరితలంపై చూస్తే ఈ రెండింటికి మధ్య తేడా ఉన్నట్టు కనబడదు.

అయినప్పటి ఈ రెండు పద్ధతుల మధ్య పైకి కనబడకపోయినా వాస్తవంగా తేడా వున్నది. ఈ తేడా అనేది కేంద్ర, స్థానిక పరిపాలనా విభాగాల మధ్య వుండే అంతర్ సంబంధాల స్వభావంలో వుంది. ఈ ప్రకారం తేడాను క్లుప్తీకరించుకోవచ్చును. ఏకాత్మక పద్ధతిలో నడిచే ప్రభుత్వంలో స్థానిక సంస్థల అధికారాలు కేంద్ర ప్రభుత్వం చేసిన చట్టం నుంచి లభిస్తాయి. అందువల్ల ఈ స్థానిక ప్రభుత్వ అధికారాలను కేంద్ర ప్రభుత్వం ఎప్పుడైనా ఉపసంహరించుకో వచ్చును. అయితే సమాఖ్య పద్ధతిన నడిచే ప్రభుత్వంలో కేంద్ర ప్రభుత్వ అధికారాలతో పాటు స్థానిక ప్రభుత్వాల అధికారాలు కూడా రాజ్యాంగ శాసనం ప్రకారంగా లభిస్తున్నాయి. ఈ అధికారాలను స్థానిక ప్రభుత్వాలు కాని, కేంద్ర ప్రభుత్వం కాని తమ చట్టాల ద్వారా మార్చుకోలేవు. రాజ్యాంగ చట్ట ప్రకారంగా ఆ రెండింటికి అధికారాలు లభించినందువల్ల అది వాటికి ఇవ్వబడిన అధికారాలకే పరిమితమై పోయి వుండాలి. రాజ్యాంగం వాటి అధికారాలను నిర్ణయించడమే కాకుండా, స్థానిక లేదా కేంద్ర ప్రభుత్వం ఈ రాజ్యాంగమిచ్చిన హక్కులను అధిగమించి ఏవైనా చట్టాలు చేసే పక్షంలో న్యాయస్థానం ద్వారా వాటిని కొట్టివేసే ఏర్పాటును రాజ్యాంగం రూపొందించింది. ఈ అంశం గురించి కెనడా రాజ్యాంగం గురించి రాసిన సంపుటిలో 'క్లెమెంట్' ఈ క్రింది విధంగా వివరిస్తున్నాడు. "వివరాలకు అదనంగా, ఆధునిక కాలంలో ఫెడరల్ యూనియన్ అంటే అర్థం ఏమంటే అందరికీ సంబంధించినవి అనుకున్న విషయాలకు సంబంధించి ఒక ఉమ్మడి ప్రభుత్వ అజమాయిషీలోకి రావటానికి ప్రజలను అంగీకరింప జేసిన ఒక ఒప్పందం. ఇందులో స్థానిక ప్రభుత్వాలు ఇతర విషయాలు అన్నింటిలో సార్వభౌమికాధికారాలు కలిగి ఉంటూ స్వతంత్రంగానే ఉంటాయి. దీనికి ఆవశ్యకమైన అంశంగా మొత్తం ఒప్పందం అంతా ఒక ప్రాథమిక శాసనంగా రూపొందుతుంది. దీనిని న్యాయస్థానాల అంగాల ద్వారా అమలు చేయించుకోవచ్చు.

"మొత్తం సమాఖ్యకు సంబంధించిన ఉమ్మడి అంశాలను, ఒక్కొక్క విభాగంలో స్థానిక సంబంధం ఉన్న అంశాలను ఎక్కడ స్పష్టంగా విభజించవచ్చునో అన్నది సమాఖ్య సారాంశం కాదు. సమాఖ్యలో అంతర్భాగం అవుతున్న ప్రజాసముదాయాలు భౌగోళికమైన, వాణిజ్యపరమైన, జాతుల పరమైన, లేదా ఇతరమైన వాస్తవ పరిస్థితులకు సంబంధించి ఏఏ విషయాలు తమకు నిజమైన ఆసక్తి ఉంటుందని భావించి వాటిని ఉమ్మడి ప్రభుత్వానికి అప్పగిస్తాయో వాటిమీద ఈ విభజన ఆధారపడి ఉంటుంది. రాజ్యాంగ శాసనంద్వారా కేంద్ర, స్థానిక ప్రభుత్వాల అధికారాలను విభజించే నిమిత్తం ఒక రేఖను గీయటానికి ఆ రేఖను న్యాయ విభాగం ద్వారా నిలపటం అనేవి సమాఖ్య ప్రభుత్వ రూపానికి రెండు లక్షణాలు. ఈ రెండు లక్షణాలే దీనిని ఏకాత్మక రూప ప్రభుత్వాన్నుంచి వేరు చేస్తాయి. సూక్ష్మంగా చెప్పాలంటే, ప్రతీతి సమాఖ్యలోను

రెండు అంశాలు ఉంటాయి. 1. రాజ్యాంగ శాసనం ద్వారా ఏర్పడిన కేంద్రం స్థానిక ప్రభుత్వాల మధ్య పరిమితులు హద్దులు ఏర్పరచుకొని అధికారాలు విభజించుకోవటం, వీటిని ఓ ఒక్కరు గాని మార్చే అధికారాలు ఉండవు లేదా ఇతరుల అధికారాలను పరిమితం చేసే అధికారమూ ఉండదు.

కాని సమాఖ్యలో అంతర్భాగం అవుతున్న ఒప్పందం నిర్ణయించినట్లుగా ఈ విభజన రేఖను ఉంచుకోవటం ఆధునిక సమాఖ్య సారాంశం.కనీసం ఈనాడు ఆంగ్లో శాక్సన్ ప్రజలకు సంబంధించిన మూడు గొప్ప సమాఖ్యలైన అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఆస్ట్రేలియా కామన్‌వెల్త్, కెనడా డొమినియన్ విషయంలో ఇది ప్రస్ఫుటమయింది. అందువల్ల దేశంలోని ప్రధాన శాసనం ఉన్న ఒప్పందాన్ని రాజ్యాంగ పరంగా వ్యాఖ్యానించే ప్రధానమైన, తీక్షణమైన బాధ్యతను న్యాయస్థానాలకు ఒప్పగించటం జరిగింది.

2. శాసన, కార్యనిర్వాహక, పరిపాలన, ఆర్థికపరమైన విషయాలలో కేంద్రంగాని స్థానిక ప్రభుత్వాలుగాని తమకు దత్తమైన అధికారాలు అతిక్రమించి వ్యవహరించకుండా చూడటానికి ఒక ట్రిబ్యునల్ ఏర్పాటు.

సమాఖ్య ప్రభుత్వమంటె ఏమిటో ఇంతవరకు వివరించాను. ఇపుడు నేను సమాఖ్య ప్రభుత్వానికి రాజ్యాంగం కల్పించిన అధికారాల గురించి మీకు కొంత అవగాహనను కల్పిస్తాను.

## (ఎ) సమాఖ్య శాసనాధికారాలు

శాసన అధికారాలను విభజించే నిమిత్తం శాసన సంబంధిత విషయాలను మూడు శ్రేణులుగా ఏర్పాటు చేశారు. మొదటి శ్రేణిలో సమాఖ్య శాసనసభకు మాత్రమే శాసనం చేసే అధికారం కలిగిన విషయాలు. అందులో ఒకటి. దీనిని సమాఖ్య జాబితా అని పిలుస్తారు రాష్ట్ర శాసన సభలకు మాత్రమే శాసనం చేసేహక్కు ఉన్న విషయాలుకొన్ని రెండో శ్రేణిలో వున్నాయి. దీనిని (రాష్ట్రాల) జాబితాగా పిలుస్తారు. శాసనం చేసుకొనే హక్కును రాజ్యాల శాసన సభలకు, సమాఖ్యకు రెండింటికి శాసనం చేసే అధికారం కల విషయాలు మూడో శ్రేణివి. దీనిని ఉమ్మడి జాబితాగా పిలుస్తారు. భారత ప్రభుత్వ చట్టంలోని ఎనిమిదవ షెడ్యూల్‌లో ఈ జాబితాలకు సంబంధించిన అంశాలు, పరిధిని గురించి ఉన్నది.

సమాఖ్య ప్రాథమిక సూత్రాల ప్రకారం, సమాఖ్య శాసనమండలి రాష్ట్ర జాబితాలో చేర్చిన ఏ విషయంపైగాని శాసనం ఏదైనా చేసి ఉన్నట్టయితే, అది దాని అధికార పరిధిలో లేనందువలన చెల్లదు. అదే విధంగా సమాఖ్య జాబితాలో ఉన్న ఏ అంశంపై గాని రాష్ట్ర శాసన మండలి ఏదైనా శాసనం గనక చేసి ఉంటే అది కూడా దాని అధికార పరిధిలో లేనందువల్ల చెల్లదు. ఇది శాసనం ద్వారా కూడా ఏర్పాటయిందనుకోండి. దీనికి సంబంధించినది 107వ నిబంధన. సమాఖ్య జాబితా రాష్ట్ర జాబితాలకు సంబంధించిన విషయాల మీద విరుద్ధమైన

శాసనాలు తయారు కావటం చాల అరుదుగా జరుగుతుంటుంది. కాని ఉమ్మడి జాబితాలో ఉన్న అంశం మీద పరస్పర విరుద్ధమైన శాసనాలు రావడం జరుగుతుంటుంది. దీనికి సంబంధించిన న్యాయసూత్రం 107వ నిబంధనలో ఉన్నది. 1వ ఉప విభాగం సమాఖ్య చేసిన శాసనం ఎప్పుడు అమలులో ఉండాలో చెబుతుంది. 2వ ఉపవిభాగం, సమాఖ్య శాసనంపై రాష్ట్ర శాసనం ఎపుడు అమలులో ఉంటుందో తెలుపుతుంది. ఈ రెండు ఉప విభాగాలను కలిపి చదివితే శాసన పరిస్థితి ఈ విధంగా ఉంటుంది. రెండూ విరుద్ధంగా ఉన్నప్పుడు సాధారణంగా రాష్ట్ర శాసనంపై సమాఖ్య శాసనం చెల్లుతుంది. కాని రాష్ట్రం చేసిన శాసనం గవర్నర్ జనరల్ ఆమోదానికి పంపిఉండి, లేదా రాజుగారి అభీష్టానికి పంపిఉండి గవర్నర్ జనరల్ లేదా రాజు ఆమోదం పొంది ఉన్నట్లయితే, ఆ విషయానికి సంబంధించి సమాఖ్య శాసనం చేసేటంత వరకు రాష్ట్ర శాసనం చెల్లుబాటులో ఉంటుంది.

శాసన అధికారాలను పంపిణీచేసే ప్రశ్న విషయంలో సమాఖ్యకు శాసనానికి సంబంధించిన వివిధ విషయాల జాబితా పూర్తి అవుతుందనే హామీ లేకపోవటం సాధ్యమైన ప్రతి సమస్యా కలుస్తూ పోతుంటుంది కాబట్టి పై సమస్య ఎదురౌతున్నది. అయితే ఈ అంశాల పట్టిక సంపూర్ణమని ఇక ఏమీ ఉండబోవని అనిపించినా ఏవో కొన్ని విషయాలు లెక్కలోకి రాకుండా పోవు. ఈ అవకాశాన్ని దృష్టిలో పెట్టుకుని ప్రతి సమాఖ్య కూడా ఈ మిగిలిన అంశాలపై శాసనాలు చేసే అధికారం ఎవరికి చెందాలో నిబంధన చేయవలసి వుంటుంది. ఈ అధికారాలను కేంద్ర ప్రభుత్వానికివ్వాలా లేక రాష్ట్రాలకా? ఇంతవరకు వాటి పరిష్కారానికి ఒకే ఒక పద్ధతి ఉండేది. కొన్ని సమాఖ్యలలో ఈ మిగిలిన అధికారాలు కేంద్ర ప్రభుత్వానికి ఇస్తున్నారు. ఉదా॥ కెనడా మరికొన్ని సమాఖ్యలలో వాటిని రాష్ట్రాలకు ఇస్తున్నారు. ఉదా॥ ఆస్ట్రేలియా భారత సమాఖ్య మాత్రం వీటి పరిష్కారం కోసం కొత్త పద్ధతిని అవలంభించింది. భారత సమాఖ్యలో ఆ అధికారాలను కేంద్ర ప్రభుత్వానికి కాని రాష్ట్రాలకు గాని ఇవ్వలేదు. సెక్షన్ 104 ప్రకారంగా వాటిని గవర్నర్ జనరల్‌కు అప్పజెప్పారు. ఆ మూడు జాబితాలలో ఎక్కడా పేర్కొనని వాటి విషయంలో సమాఖ్య శాసనం చెయ్యాలా రాష్ట్రాలు శాసనం చెయ్యాలా అనే విషయాన్ని గవర్నర్ జనరల్ నిర్ధారిస్తారు.

## బి. సమాఖ్య కార్యనిర్వహణ వర్గ అధికారాలు

మొదటి ప్రశ్న ఏమంటే సమాఖ్య కార్యనిర్వాహణ వర్గ అధికారాలు ఏ మేరకు ఉంటాయి? అనేది అవి శాసనాధికారాలతో పాటు సహ విస్తరణ కలిగి వుంటాయా? కొన్ని సమాఖ్యలలో చట్టం ఈ విషయమై ఎలాంటి స్పష్టీకరణ చేయలేదు. దానిని న్యాయవిభాగ నిర్ణయానికి వదిలివేశారు. ఉదా॥ కెనడా- అయితే భారత రాజ్యాంగం మాత్రం ఈ విషయాన్ని న్యాయస్థానాల నిర్ణయానికి వదిలి వేయలేదు చట్టంలోనే దాని గురించి ప్రత్యేక నిర్వచనం ఉన్నది. దానికి సంబంధించిన సెక్షన్ 8(1) ప్రకారం సమాఖ్య కార్యనిర్వహణ వర్గ అధికారం

ఈ క్రింది విషయాలలో ఉంటుంది.

(ఎ.) సమాఖ్య శాసనమండలికి చట్టాలు చేసే అధికారాలకు సంబంధించిన విషయాలలో.

(బి.) బ్రిటిషు ప్రభుత్వ పక్షాన బ్రిటిష్ ఇండియాలోని నౌకాదళ, సైనిక మరియు వైమానిక దళాలను సమకూర్చటం, భారత ప్రభుత్వం క్రింద ఏర్పడిన బ్రిటిషు ప్రభువు సైనిక రక్షణ దళాలు భారత స్థావరాల విషయమై అజమాయిషీ చేయటం.

(సి.) గిరిజన ప్రాంతాలలో, గిరిజన ప్రాంతాలకు సంబంధించి, ఒప్పందం, గ్రాంటు ఆచారం అనవాయితీ ద్వారా గాని, మరేవిధంగానైనా గాని బ్రిటిషు రాజు వినియోగించే హక్కులు, అధికారమూ అధికారపరిధికి సంబంధించి వాటిని వినియోగించుకోవటానికి.

ఈ ఉపవిభాగాలకు సంబంధించిన నిబంధనలను పాటించడంలో ఇబ్బంది ఏమీ లేదు. ఉప విభాగం (ఎ)ను అర్థం చేసుకోవడంలో కొంత ఇబ్బంది ఉండవచ్చు. దాని ప్రకారం కార్య నిర్వహణ వర్గ అధికారాలు శాసనసభా అధికారాలతో సహ విస్తరణ పద్ధతిలో ఉంటాయి. ఇప్పుడు సమాఖ్య శాసన అధికారం సమాఖ్య జాబితకు వ్యాపించి ఉండటమే కాకుండా ఉమ్మడి జాబితాకు కూడా విస్తరిస్తున్నది. అయితే సమాఖ్య కార్యనిర్వహణ వర్గ అధికారం ఉ... జాబితాలోని విషయాలకు కూడా వర్తిస్తుందా? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పుకొనే ముందు రెండు అంశాలను దృష్టిలో ఉంచుకోవాలి. ఒకటి ఈ ఉమ్మడి జాబితా కూడా ప్రాంతీయ శాసనసభా అధికారానికి సంబంధించినదే. రెండవది. సెక్షన్ 49(2) ప్రకారంగా రాష్ట్ర శాసనమండలి శాసనం చేసే విషయాలు అన్నిటి విషయంలోను రాష్ట్ర కార్యనిర్వాహణవర్గ అధికారం విస్తరిస్తుంది. ఇక సమాఖ్య కార్య నిర్వాహణవర్గ అధికారం ఉమ్మడి జాబితాకు కూడా విస్తరించగలదా అనే ప్రశ్నకు సమాధానం ఉమ్మడి జాబితాకు సంబంధించిన కార్యనిర్వాహణ వర్గ అధికారం సమాఖ్య ప్రభుత్వంతో పాటు ప్రాంతీయ ప్రభుత్వాలకు కూడా వుంటుంది. ఇది సెక్షన్ 126(2)లోని నిబంధనల వలన స్పష్టమవుతున్నది. సమాఖ్య శాసనసభ వ్యాపించిన రంగాలకు తప్ప ఇది ప్రాంతీయ ప్రభుత్వాలకు చెందుతుంది.

ఈ ఉమ్మడి జాబితా సమాఖ్య శాసనసభ చేసే శాసన విషయాలకు సంబంధించిన ఒక జాబితా మాత్రమే కాదు. సెక్షన్ 102 అనుసారంగా అత్యవసర సందర్భాలలోను, సెక్షన్ 106 అనుసరించి అంతర్జాతీయ ఒప్పందాల అమలు గురించి ప్రాంతీయ విషయాలపై కూడా సమాఖ్య శాసనసభకు చట్టాలు చేసే హక్కువున్నది. అయితే సమాఖ్య కార్యవర్గ అధికారం అలాంటి విషయాలకు కూడ విస్తరిస్తుందా? దీనికి సమాధానం సమాఖ్య శాసనసభ ఏరంగాలకైతే వ్యాపిస్తున్నదో అవేరంగాలు సమాఖ్య కార్య నిర్వహణ వర్గ అధికారాలకు కూడా వుంటాయి.

## సి. సమాఖ్య పరిపాలనాధికారాలు

సమాఖ్య శాసనాధికారాలు సమాఖ్య కార్యనిర్వాహక వర్గంకు వచ్చినట్టుగానే సమాఖ్య

కార్యనిర్వాహక వర్గం అధికారాలు సమాఖ్య పరిపాలనాధికారాలకు వసాయి.

అయితే దీనికి ఒక మినహాయింపు ఉన్నది. ఈ మినహాయింపు ఉమ్మడి జాబితాలోని పరిపాలనా విషయాలకు సంబంధించినట్టిది. ఉమ్మడి జాబితా 100వ విభాగం మూలంగా సమాఖ్య శాసనాధికారాల కిందికి వస్తుంది. ఇంతకుముందు సూచించినట్టుగా, సమాఖ్య కార్యనిర్వాహక వర్గం సమాఖ్య శాసనాధికారాలు వ్యాపించి ఉన్న విషయాల వరకు ఉంటుంది. కాని ఉమ్మడి జాబితాలో ఉన్న విషయాలపై పరిపాలనాధికారాలు సమాఖ్యకు వర్తించవు. అవి రాష్ట్రాలకు వర్తిస్తాయి.

## డి. సమాఖ్య ఆర్థిక అధికారాలు

సమాఖ్య ప్రభుత్వం ఆదాయ మార్గాలు నాలుగు ఆధారాలను సూచిస్తాయి. 1. వాణిజ్య పరమైన ఆదాయం. 2. సార్వభౌమిక కార్యకాలపాల నుంచి ఆదాయం. 3. ఒప్పందాల నుంచివచ్చే ఆదాయం 4. పన్నుల నుంచి వచ్చే ఆదాయం.

మొదటి పద్దుకింద ఆదాయం తంతితపాలశాఖ ఆదాయం, సమాఖ్య రైల్వేల నుంచి, బ్యాంకు లాభాలు, ఇంకా ఇతర వాణిజ్య పరమైన వ్యవహారాల నుంచి వస్తుంది. రెండవ పద్దుకింద ద్రవ్యం, నాణేలద్వారా వచ్చే ఆదాయం వారసులు లేని సమాఖ్య పాలన క్రింద ఉండే సరిహద్దు ప్రాంతాల నుంచి వచ్చే ఆదాయం. మూడవ దాని ఆధారం ఏమంటే భారత రాష్ట్రాల నుంచి సంస్థానాల నుంచి వచ్చే ఆదాయం, పన్నుల నుంచి వచ్చే ఆదాయం. రాజ్యాంగం సమాఖ్య ప్రభుత్వానికి పన్నులు విధించే హక్కునుంచి వచ్చింది. సమాఖ్య ప్రభుత్వానికి పన్నువిధించే అధికారాలు మూడు ప్రధానమైన మార్గంలో ఉన్నాయి. సమాఖ్య ప్రభుత్వం మొత్తం తన ప్రత్యేక వినియోగం కింద తీసుకొనే హక్కులు మొదటి తరగతిలోకి వస్తాయి. రెండవ తరగతి సమాఖ్య ప్రభుత్వానికి, ప్రాంతీయ ప్రభుత్వాల మధ్య ఆదాయాన్ని పెంచడానికి ఉపయోగపడే పన్ను అధికారాలు రెండవ తరగతికివస్తాయి.

పన్నువిధించే అధికారాల మొదటి తరగతి క్రింద ఆదాయం పద్దులు ప్రత్యేకంగా సమాఖ్య జాబితాలో చూపించటం జరిగింది.

1. ఎగుమతి సుంకాలతో కలుపుకుని కస్టమ్ సుంకాలు.

2. భారతదేశంలో తయారుచేసిన లేదా ఉత్పత్తి చేసిన పొగాకు తదితర సరుకులపై ఎక్సైజ్ సుంకాలు. వీనిలో ఈ క్రిందివి చేరవు :-

(ఎ) మనుషుల వినియోగానికై నిర్దేశించిన సారాయి, మద్యం.

(బి) నల్లమందు, గంజాయి తదితర మత్తుపదార్థాలు, మత్తు పదార్థాలు కానివి.

(సి) మద్యం కలిపి ఉన్న మందులు, సౌందర్య రసాయనికాలు. పై అంశం (బి)తో కలిపి

ఇతర పదార్థం ఏదైనా

3. కార్పొరేషన్ పన్ను

4. ఉప్పు

5. రాష్ట్ర లాటరీలు

6. వ్యవసాయ ఆదాయం కాని ఇతర ఆదాయం పై పన్నులు.

7. వ్యక్తుల లేదా కంపెనీల వ్యవసాయ ఆదాయంపై కాకుండా ఆస్తుల మూల విలువపై పన్నులు; కంపెనీల మూలధనంపై పన్నులు.

8. వ్యవసాయ భూములు కాకుండా ఆస్తి సంక్రమణపై సుంకాలు.

9. వినిమయ పత్రాలు, చెక్కులు, ప్రామిసరీనోట్లు, సరుకుభర్తీబిల్లు, పరపతిపత్రం, పరోక్ష బీమాపథకాలు, వసూళ్లపై స్టాంపు డ్యూటీధరలు.

10. రైళ్ల లేదా విమానాల్లో ప్రయాణించే ప్రయాణీకులు లేదా వస్తువులపై మార్గాంతర పన్నులు; రైలు ఛార్జీలు, రవాణా రుసుములపై పన్నులు.

11. న్యాయస్థానంలో వసూలు చేసే ఫీజు కాకుండా పైన పేర్కొన్న పట్టికలోని వాటిలో దేనిపైనైన సంబంధిత వస్తువుపై వసూలు చేసే రుసుము.

ఈ సందర్భంగా ఉమ్మడి జాబితాలోని ఈ క్రింది వస్తువులను గూడా దృష్టిలో పెట్టుకోవలసి వుంటుంది.

1. వివాహము మరియు విడాకులు.

2. వీలునామాలు, వీలునామా లేని మరణాలు వారసత్వం

3. ఆస్తులు తదితర వ్యవసాయభూముల బదిలీ.

ఉమ్మడి జాబితాలో ఉండటంవల్ల వీటి విషయంలో శాసనాలు చేసే అధికారం సమాఖ్యా శాసన మండలికి ఉంటుంది. అయితే ఈ విషయాలను గురించి సమాఖ్య శాసన మండలి శాసనాలను రూపొందిస్తున్న సమయంలో వాటి నుంచి ఆదాయాలను కూడా సమకూర్చుకోవచ్చునా? ఈ ప్రశ్నకు శాసనం ఎటువంటి సమాధానమూ ఇచ్చినట్టు లేదు. అయితే, మిగులు అధికారాలను వినియోగించుకోవడానికి సంబంధించి 104వ విభాగం క్రింద ఉన్నటువంటి నియమ నిబంధనలు ఇక్కడ కూడా వర్తించగలవని సూచించవచ్చు.

రాజ్యాంగం ప్రకారం విభాజ్యమైన ఆదాయాలుగా వర్గీకృతమైనవిః 1. కార్పొరేషను పన్నుకాక ఇతరమైన ఆదాయపుపన్నుః 2. జనుము ఎగుమతి సుంకం. సమాఖ్యాచట్టం ప్రకారం విభాజ్యమైన ఆదాయాలుగా మారినవి ఇవి 1. ఉప్పు మీద విధించేసుంకం 2. పొగాకు, తదితర వస్తువుల మీద విధించే ఎక్సయిజు సుంకం (3) ఎగుమతులపై విధించే సుంకాలు.

సమాఖ్య ఆర్థిక అధికారాలకు సంబంధించి విశిష్టంగా దృష్టిని ఆకర్షించే అంశం ఒకటి ఉన్నది. సమాఖ్య ప్రభుత్వానికి పన్ను విధించే అధికారాన్నిస్తూ, చట్టం, పన్ను విధించే అధికారానికీ, అలా విధించినపన్నును వసూలు చేయడానికీ ఉండే అధికారాల మధ్య తేడాను పాటిస్తున్నది. ఏయే సందర్భాలలోఆపన్ను విధించే అధికారాన్ని ఇస్తూ ఉన్నదో ఆ సందర్భాలలో పన్నును వసూలు చేసే అధికారాన్ని ఇవ్వడం లేదు. ముఖ్యంగా ఆదాయపు పన్నుమీద సర్చార్జిలోనూ, కార్పొరేషను పన్నులోనూ ఈ విషయం వర్తిస్తుంది. ఆదాయపు పన్ను, సమాఖ్య అవసరాల నిమిత్తం విధించే పన్ను అయినప్పటికీ, ప్రావిన్సులలో మాత్రమే దానిని విధించవచ్చు కాని రాష్ట్రాలలో కాదు. రాష్ట్రాలలోని ప్రజలు, ఆదాయం పన్నుమీద కేవలం సమాఖ్య విధించిన సర్‌ఛార్జి మొత్తాన్ని మాత్రమే చెల్లించవలసి ఉంటుంది. అటువంటి సర్‌ఛార్జీని ప్రావిన్సులలోనూ, రాష్ట్రాలలోనూ కూడా విధించవచ్చు. అయితే 138(3)వ విభాగం క్రింద, రాష్ట్రంలో దీనిని వసూలు చేసే అధికారం సమాఖ్య ప్రభుత్వానికి లేదు. వసూలు చేసే విధిని ఆయా రాష్ట్రాల పాలకులకు వదిలివేశారు. పాలకుడు, సర్‌ఛార్జీని తన ప్రజలనుంచి వసూలు చేయడానికి బదులుగా సమాఖ్యకు ఏకమొత్తంగా చెల్లించడానికి అంగీకరించవచ్చు. సమాఖ్య విధిగా దాన్ని ఆమోదించి తీరాలి. కార్పొరేషను పన్ను విషయం కూడా అంతే. సమాఖ్య, ఈ పన్నును రాష్ట్రాల ప్రజలమీద విధించవచ్చుకాని, నేరుగా తన సిబ్బంది ద్వారా వసూలు చేయడానికి వీలులేదు. 139వ విభాగాన్ని అనుసరించి కార్పొరేషను పన్ను వసూలు చేసే పని పూర్తిగ పాలకుని హక్కులు విధులలో చేరి ఉండే హక్కు.

## V

## సమాఖ్య లక్షణం

### 1. సంఘవిధానం

ఇతర సమాఖ్యలతో భారత సమాఖ్యను ఏవిధంగా పోల్చవచ్చు? ఇది కేవలం సహజమైన పరిశీలనేకాదు; అవసరమైన పరిశీలనకూడా. పోలికలనూ, తేడాలనూ పరిశీలించే పద్ధతి ఒకవస్తువు అవగాహన చేసుకోవడానికి ఉత్తమ పద్ధతి. ఈ పోల్చటం అనేది దృక్పథాలను అనుసరించి ఉంటుంది. ఈ సాదృశ్యాలను విస్తృతంగా, విశాల పరిధిలో పరిశీలించే సమయం లేదు. ఈ సాదృశ్య పరిశీలనను నేను చాలా మామూలు విషయాలకు పరిమితం చేసుకోవలసి ఉంటుంది. అందువల్ల నేను కేవలం నాలుగే ప్రశ్నలు లేవనెత్తదలచుకున్నాను: 1. ఈ సమాఖ్య శాశ్వతమైన కలయికా? 2. విభాగాలకూ–సమాఖ్య ప్రభుత్వానికీ మధ్య ఉండే సంబంధాలేమిటి? 3. విభాగాలకు తమలో తమకుండే పరస్పర సంబంధాలేమిటి? 4. విభాగాల క్రింద ఉండే ప్రజల సంబంధాలేమిటి?

చట్టంద్వారా రూపొందిన సమాఖ్య ఉనికి ఉన్నంతకాలం, భారతదేశంలోని సంస్థానాలు

సమాఖ్యలో చేరిపోవడం అనేది శాశ్వతమైనట్టిదే అనే విషయంలో ఎటువంటి సందేహమూ లేదు. సమాఖ్య ఉనికి కొనసాగినంతవరకూ వీటికి విడిపోయే హక్కు ఉండబోదు. అయితే నిజమైన ప్రశ్న అదికాదు. చట్టం మారినప్పటికీ సమాఖ్య ఉనికి కొనసాగుతుందా? అనేది నిజమైన ప్రశ్న. మరోమాటలో చెప్పాలంటే ఇది శాశ్వతమైన యూనియనా? లేక విడిపోయే అధికారం కలిగి ఉండే విధంగా రూపొందిన కేవలం సర్దుబాటు పద్ధతేనా అనేది నిజమైన ప్రశ్న. భారతీయ సమాఖ్య శాశ్వత సంఘంకాదనీ, సంస్థానాలకు విడిపోయే హక్కు ఉంటుందనీ నా అభిప్రాయం. ఈ విషయంలో అమెరికా రాజ్యాంగానికీ, ఈ భారత సమాఖ్య రాజ్యాంగానికీ మధ్య స్పష్టమైన వైరుధ్యం ఉన్నది. అమెరికా రాజ్యాంగంలో విడిపోయే హక్కు గురించి ఏమీ లేదు. ఈ లోపాన్ని రెండు విధాలుగా వ్యాఖ్యానించారు. ఈ అంశాన్ని గుర్తించినందువల్లనే, రాజ్యాంగ ప్రతిలో దానిని పేర్కొనలేదని కొందరు వ్యాఖ్యానిస్తే, ఆ హక్కును నిరాకరించలేదు కనుక దానిని స్పష్టంగా తృణీకరించలేదని మరికొందరు వ్యాఖ్యానించారు. ఈ సమస్యపైన ఉత్పన్నమైన తగాదాయే- దాన్ని గుర్తించనందువల్లనే ప్రత్యేకం దాన్ని నిరాకరించ లేదన్నవాదమే 1861 అంతర్యుద్ధానికి కారణభూతమైంది. ఈ అంతర్యుద్ధం వల్ల రెండు అంశాలు స్పష్టమైనాయి. 1. సమాఖ్య ప్రభుత్వపు చట్టాన్ని, చెల్లదని ప్రకటించే హక్కు ఏ రాష్ట్రానికీ ఉండబోదు, 2. యూనియన్ నుండి విడిపోయే అధికారం ఏ రాష్ట్రానికీ ఉండదు. కొన్ని ప్రత్యేక సంఘటనలు జరిగినప్పుడు, భారత సమాఖ్య నుంచి విడిపోయే అధికారాన్ని సంస్థానాలకు రాజ్యాంగమే కల్పిస్తున్నది కనుక భారతదేశ సమాఖ్య విషయంలో, విడిపోయే హక్కును సాధించుకోవడానికి యుద్ధాల వరకూ వెళ్ళవలసిన అవసరం లేదు. ఇంగ్లాండు స్కాట్లాండుల మధ్య యూనియన్ స్వభావం గురించి బ్లాక్‌స్టోన్ స్పష్టంగా వ్యాఖ్యానించినట్లు, ఎక్కడా కూడా శాశ్వత యూనియన్ అంటే ఏమిటి, ఒప్పందపు యూనియన్ అంటే ఏమిటి అనే విషయాన్ని స్పష్టంగా నిర్వచించలేదు. ఆయన (బ్లాక్‌స్టోన్) మాటల్లోనే చెప్పాలంటే, భారత సమాఖ్య, చట్టబద్ధమైన యూనియన్‌గా ఏర్పడిన యూనియన్ కానేరదు; యూనియన్‌లో సంఘీకృతమయ్యే విభాగాలు పూర్తిగా రద్దవుతాయి; పునరుజ్జీవించే అధికారాలన్నింటినీ కోల్పోతాయి. ఒప్పందంకుదుర్చుకునే రెండు పక్షాల మధ్య సామ్రాజ్యమూ- భారతీయ రాష్ట్రాల మధ్య సర్దుబాటు మాత్రమే. ఇందులో- ఈ రెండింటిలో ఏదీ రద్దుకాదు. ఒప్పందపు షరతు ఏదన్నా ఉల్లంఘన జరిగినప్పుడు పునరుజ్జీవన పొందే హక్కు ఉభయ పక్షాలకూ రిజర్వు అయివుంటుంది. అమెరికా రాజ్యాంగం సర్దుబాటుగానే ప్రారంభమైనప్పటికీ యూనియన్‌గా పరిణమించింది. భారత సమాఖ్య సర్దుబాటుగానే ప్రారంభమైంది. సర్దుబాటుగానే కొనసాగుతుంది. భారత సమాఖ్యకు యూనియన్ వ్యవస్థకు సంబంధించిన లక్షణాలేవీ లేవు. సర్దుబాటుకు సంబంధించిన లక్షణాలన్నీ ఉన్నాయి. ఈ విషయంలో ఎటువంటి సంశయమూ లేదు. అమెరికా రాజ్యాంగం గురించి ప్రసంగిస్తూ, ఒక ఉపన్యాసంలో డేనియల్ వెబ్‌స్టర్, యూనియన్ వ్యవస్థకు సంబంధించిన విశిష్ట లక్షణాలను ఈ విధంగా వివరించారు-

సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వంగా వ్యవస్థాపితమైనటువంటి రాజకీయ విధానాన్ని గురించి రాజ్యాంగం వివరిస్తున్నది. ఒక సమితిని, లేదా సార్వభౌమాధికారాల సర్దుబాటును– ఒక ప్రభుత్వం అని వ్యవహరించడం భాషను విచిత్రంగా హింసించడం కాదా? ఒక రాజ్యపు ప్రభుత్వం అంటే, రాజకీయాధికారం కలిగి ఉండే సంస్థ అన్నమాట.

"...ఒక ప్రభుత్వానికీ– సమితికీ, లేదా సర్దుబాటుకూ మధ్య స్థూలమైన– స్పష్టమైన తేడా ఏమంటే, ప్రభుత్వం అనేది రాజకీయాధికార యంత్రాంగం; దానికి దానిదైన ఒక సంకల్పం ఉంటుంది; తన లక్ష్యాలను అమలు జరపడానికి అవసరమైన అధికారాలూ, సాధన సంపత్తులూ దానికి ఉంటాయి. అయితే సర్దుబాటు విషయం అలాకాదు. తమ ఉద్దేశాలను అమలు పరచడానికి సర్దుబాటు ఏదో అధికార వ్యవస్థ వైపు చూస్తుంటుంది. సర్వసత్తాక సమూహాల మధ్య సర్దుబాటు విషయంలోకూడా, అంతిమంగా ఏదో ఒక శక్తికి, నివేదించడం ద్వారా, నిర్వహణను సాధించడం అనే అంశం సర్వదా ఉండనే ఉంటుంది. అయితే ఇటువంటి సందర్భాలలో ఈ అధికార శక్తి మరొక పక్షం శక్తికి భిన్నంగా, ఒక పక్షం సాగించే అధికార శక్తిగానే ఉంటూ ఉండవచ్చు. మరో మాటలో యుద్ధం చేయగల శక్తి కావచ్చును.కాని ప్రభుత్వం అనేది తన నిర్ణయాలను స్వీయ మహోన్నతాధికారంతో అమలు పరుస్తుంది. తన స్వీయచట్టాలకు విధేయతను సాధించడానికి ప్రభుత్వం బలప్రయోగాన్ని వినియోగించడం యుద్ధం అనిపించుకోదు. నిరోధించగల హక్కు కలిగి ఉండే వ్యతిరేక పక్షం, ఒకటి ఉంటుందన్న ఊహే ఉండదు. తన స్వీయసంకల్పాన్ని అమలు పరచగలిగే స్వీయ శక్తిపైననే ప్రభుత్వం ఆధారపడి ఉంటుంది. ఈ అధికారం దానికి లేకపోయినట్లయితే అది ప్రభుత్వంగా కొనసాగడానికి అవకాశం లేదు."

ఈ నేపథ్యంలో ఈ దిగువ వాస్తవాలను గుర్తించాలి. చట్టం, బ్రిటిష్ ఇండియా ప్రాంతానికీ, సంస్థానాలకూ ఒక సమాఖ్య ప్రభుత్వాన్ని ఆదేశించడాన్ని గానీ నెలకొల్పడాన్ని గానీ ఉద్దేశించడంలేదు. కేవలం బ్రిటిష్ ఇండియా ప్రాంతానికి మాత్రమే ఈ చట్టం సమాఖ్య ప్రభుత్వాన్ని ఆదేశించి నెలకొల్పుతున్నది. ఈ సమాఖ్య ప్రభుత్వం కూడా సంస్థానాలకు చెందిన ప్రభుత్వం కావాలంటే, ఆయా రాజ్యాలు తాము విలీనమయ్యే ఒప్పందంలో దానిని ఆమోదించవలసి ఉంటుంది. అంతేకాదు; సమాఖ్య ప్రభుత్వానికి రాజ్యాలు లొంగడమనేది సర్వదా కొనసాగేది కాదని కూడా గుర్తించవలసి ఉంటుంది. కొన్ని పరిస్థితులలో మాత్రమే ఆ ఏర్పాటు కొనసాగుతుంది. చట్టంలోని కొన్ని నిబంధనలు ఎటువంటి మార్పులు లేకుండా కొనసాగినంత వరకే అది కొనసాగుతుంది. మూడవ అంశమేమిటంటే, నిబంధనలలో మార్పులు ఆమోదయోగ్యమైనవే అయినప్పటికీ, రాజ్యాలు వాటికి కట్టుబడి ఉండేందుకు అంగీకరిసే తప్ప, ఆ మార్పులకు అవి కట్టుబడి ఉండనవసరంలేదు.

భారత సమాఖ్య కేవలం సర్దుబాటు మాత్రమే కాని, శాశ్వతమైన యూనియన్ వ్యవస్థకాదని చూపించడానికి ఇవన్నీ నిస్సంశయమైన సంకేతాలు. సర్దుబాటు పద్ధతి సారం ఏమిటంటే విడిపోయే హక్కు అందులో సురక్షితమై ఉంటుంది. పూర్వ పరిస్థితిని తిరిగ పొందడానికి అవకాశం ఉంటుంది. అంచేత, ఈ అంశంలో భారతసమాఖ్య, అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా సమాఖ్యలకన్నా భిన్నమైనది. అమెరికా సమాఖ్యకూ దీనికీ తేడా ఏమిటంటే దేశీయ రాష్ట్రాలు విడిపోయే అధికారాన్ని భారతరాజ్యాంగం గుర్తిస్తున్నది. రాజ్యాంగాన్ని సవరించినప్పుడు ఏదైనా ఒక ప్రత్యేక రాష్ట్రంయొక్క ఇష్టానికి భిన్నంగా రాజ్యాంగాన్ని సవరించి నప్పుడు కూడా ఆరాష్ట్రం విడిపోయే అధికార్నాన్ని అమెరికా రాజ్యాంగం గుర్తించదు. ఆస్ట్రేలియా, కెనడా రాజ్యాంగాలకు సంబంధించినంతవరకు అలాంటి సమస్య వాస్తవానికి ఉత్పన్నమేకాదు. ఒకవేళ అలాంటిదేదైనా ఉత్పన్నమైతే విషయం నిర్ణయించుకొనడానికి అంతర్యుద్ధం అవసరం కాదు. ఈ సమాఖ్యల్లో సర్వసత్తాక అధికారం సమాఖ్య ప్రభుత్వం ద్వారా వినియోగించినా, రాష్ట్ర ప్రభుత్వాల ద్వారా అమలు జరిపినా, రాజరిక వ్యవస్థదే. సమాఖ్యను కొనసాగించడమైనా, ముక్కలు చేయడమైనా, రాజరికాధికారమూ పార్లమెంటూ కలిసి నిర్ణయించవలసిందే. సమాఖ్యగానీ, దాని విభాగాలుగానీ, ఈ సమస్యను పార్లమెంటు ఆమోదంతో తప్ప, మరో విధంగా నిర్ధారించడానికి వీలులేదు. విడిపోవడం అంటూ ఏదన్నా సంభవించినట్లయితే రాజరికపు అధికార వ్యవస్థయొక్క, సర్వసత్తాక ఆధిపత్యాన్ని విరమించుకోవడమే అవుతుంది. దాన్ని రాజ్యాధికార వ్యవస్థ తిరిగి పంపిణీ చేసే అధికారాన్ని సర్వదా కలిగి ఉంటుంది. విడిపోవడం చట్టబద్ధమైనది కావచ్చు; చట్ట బద్ధం కాని మార్గాలద్వారా సాధించిన విడిపాటు అయినప్పుడు కూడా, సర్వసత్తాక అధికారం రాజరికపు అధికార వ్యవస్థకు చెంది ఉండేదే కనుక, తిరుగుబాటు చేసిన విభాగాలకు సర్వసత్తాక అధికారాన్ని అది ఎప్పుడైనా తిరిగి ప్రసాదించనూ వచ్చు. భారతీయ సమాఖ్య కేవలం బ్రిటీష్ ఇండియాకు చెందిన రాష్ట్రాల సమాఖ్య మాత్రమే అయినట్లయితే ఇక్కడ కూడా అటువంటి పరిస్థితే ఉండేది. విడివడిపోయే ప్రశ్న అంటూ ఏదీ ఉత్పన్న మయ్యేదే కాదు. రాష్ట్రాలు ఎక్కడ ఉండటం అత్యంత ఉత్తమమైన పద్ధతి అని రాజరిక రాజ్యాధికారం భావిస్తే, ఆ పద్ధతిలో రాష్ట్రాలను అట్టిపెట్టడం సాధ్యమయ్యేది. భారతసమాఖ్యలో భారత దేశంలోని దేశీయ రాజ్యాలు విలీనం అయినందువల్ల, భారత సమాఖ్య విభిన్నమైనదిగా మారిపోయింది. భారతీయ దేశీయ రాజ్యాలు చేరడం అనేది అన్ని సమయాల్లోనూ అన్ని పరిస్థితులలోనూ ఉండేటువంటిది కాదు. అవి కొన్ని షరతులు, నిబంధనల ప్రకారం చేరుతున్నాయి. అందువల్ల, భారత సమాఖ్య శాశ్వత యూనియన్ వ్యవస్థ కానేరదు. సంస్థానాలు భారతీయ రాష్ట్రాలతో కలిసి కాపురం చేయడానికి అంగీకరించే ముందు ఎటువంటి పరిస్థితిలో అవి విడిపోవడానికి వీలుంటుందో ముందుగానే నిర్ణయించుకోవలసి వస్తుంది. అందువల్ల అవి ఉన్నాయి. ఆ కారణంగానే భారతీయ సమాఖ్య కేవలం సర్దుబాటు మాత్రమే కాని యూనియన్ వ్యవస్థకాదు.

## 2. సమాఖ్య ప్రభుత్వంతో విభాగాల సంబంధం.

ప్రతివిడి విభాగానికీ దాదాపుగా సమానమైన రాజకీయ అధికారాలు ఉండాలనేది సమాఖ్యల సాధారణ లక్షణం. విభిన్న విభాగాల మధ్య సమాన ప్రతిష్ట పాటించడం అనేది అవసరమై ఉంటుంది. ప్రతిష్ఠా పరంగా విభాగాలను సమానం చెయ్యడం అంటే, విభాగాలు బలమైన భాగస్వామ్య పక్షాలుగా ఎదగడానికి అవకాశం కల్పించడం అన్నమాట. సమాఖ్య పద్ధతిలో బలమైన భాగస్వామ్య విభాగాల ఉనికి రెండురకాల ప్రమాదాలకు దారితీయగలదని 'డైసీ' అన్నారు. సమాఖ్య విధానంలో ఉండే సమానతా ప్రాతిపదికకు పొసగని విధంగా బలమైన భాగస్వామ్య పక్షం అధికారం చెలాయించే అవకాశం ఉండటం అనేది మొదటిది. సమాఖ్యలోనే బలీయమైన విభాగాలూ, బలహీనమైన విభాగాలూ, విడివిడిగా ముఠాలు కట్టే పరిస్థితి కూడా రావచ్చు అనేది రెండవది. ఇటువంటి అనారోగ్యకరమైన వ్యవహారాలు ఉత్పన్నం కాకుండా ఉండాలంటే సమాఖ్యలన్నీ, సమాన ప్రతిష్ఠా ప్రాతిపధిక సూత్రంపైన కొనసాగాలి. భారత సమాఖ్యలో ఈ సూత్రాన్ని ఏ మేరకు పాటిస్తున్నారనే విషయాన్ని పరిశీలిద్దాం.

### (ఎ) శాసనాలు చేసే విషయం

శాసనాలు చేసే విషయంలో కార్యరంగాన్ని మూడు భాగాలుగా విభజించిన విషయం మీకు తెలిసిందే. ఇందుకు మూడు జాబితాలు రూపొందించారు. ఒక దాన్ని సమాఖ్య జాబితా అని, మరొకదాన్ని ఉమ్మడి జాబితా అనీ మూడవదాన్ని రాష్ట్రాల జాబితా అనీ పేర్లు పెట్టారు.

సమాఖ్య జాబితాలో, శాసనాలు చేయదగిన అంశాలు 59 ఉన్నాయి. ఉమ్మడి జాబితాలో 36 అంశాలున్నాయి.

ఈ రెండు జాబితాలకూ చెందిన విషయాలకు రాష్ట్రాలు కట్టుబడి ఉండాలన్న విషయాన్ని ఇక్కడ ప్రప్రథమంగా గమనించవలసి ఉంటుంది. ఈ రెండు జాబితాలలోని అంశాలలో నుంచి, సమాఖ్య అధికారాలకు ఏయే అంశాలకు సంబంధించి లొంగి ఉండాలో ఎంచుకునే అధికారం ఆరాష్ట్రాలకు ఉండదు. ఈ రెండు జాబితాలను అధిగమించి రాష్ట్రాలు ఒప్పందాలు కుదుర్చుకునే అవకాశమూ లేదు. సమాఖ్యలో చేరే దేశీయరాజ్యం పరిస్థితి మరో విధంగా ఉంటుంది. సమాఖ్యలో చేరే దేశీయ రాజ్యం ఏదైనా, తనను తాను, ఉభయ సామాన్య విషయాల జాబితాకు పూర్తిగా అతీతంగా అట్టిపెట్టుకోవచ్చు. 6(2)వ విభాగం క్రింద దేశీయ రాజ్యపు పాలకుడెవరైనా, ఉమ్మడి విషయాల జాబితాకు సంబంధించి సమాఖ్యలో చేరడానికి అంగీకరించేందుకు ఎటువంటి అభ్యంతరమూలేదు. అయితే విధిగా అంగీకరించాలన్న నియమంమాత్రం లేదు. అలాంటి అంగీకారం, సమాఖ్యలో చేర్చుకొనడానికి, ముందు విధిగా పాటించవలసిన షరతు మాత్రం కాదు.

ఇక సమాఖ్య జాబితా విషయానికి వస్తే, సమాఖ్య జాబితాలో పేర్కొన్న అంశాలకు సంబంధించినంతవరకు శాసనాలు చేసే సమాఖ్య అధికారాలకు, సంస్థానాల పాలకులు విధిగా లొంగి ఉండవలసిందేననేది ఉన్నమాట నిజమేకాని, పాలకుడు తాను సమాఖ్యలో విలీనం అవుతున్నప్పుడు, విలీనీకరణ ఒప్పందంలో పేర్కొనే అంశాల మేరకే సమాఖ్య అధికారాలకు లొంగి ఉండవలసి ఉంటుంది. నేనింతకు ముందే చెప్పినట్లు సమాఖ్య జాబితాలో మొత్తం 59

అంశాలున్నాయి. సమాఖ్యలో చేరుతున్న సంస్థానాల పాలకుడు సమాఖ్య జాబితాలోని అన్ని అంశాలనూ అంగీకరించి తీరాలనేది, అతని చేరికకు ముందు విధిగా పాటించవలసిన షరతుకాదు. ఒక పాలకుడు ఒక అంశాన్నీ, మరో పాలకుడు మరో అంశాన్నీ అంగీకరించవచ్చు. సమాఖ్యలో చేరదలచుకున్న ప్రతిపాలకుడూ ఈ అంశాలను తప్పనిసరిగా అంగీకరించి తీరాలన్న నియమం ఏదీ రాజ్యాంగంలో విధించలేదు. అందువల్ల, శాసనాలను చేసే సమాఖ్య అధికారాలకు సంబంధించినంతవరకు, బ్రిటిష్ ఇండియాకు చెందిన అన్ని రాష్ట్రాలకూ సమానంగానూ, సంపూర్ణంగానూ వర్తిస్తుంది కాని, సంస్థానాల విషయంలో మాత్రం, విభిన్న రాజ్యాలను విభిన్న ప్రాతిపదికలపై స్పృశిస్తున్నది. సమాఖ్య జాబితాలోని ఏదో ఒకే ఒక్క అంశాన్ని మాత్రమే అంగీకరించి సమాఖ్యలో చేరిన పాలకుడూ మొత్తం 52 అంశాలనూ అంగీకరించేపాలకుడూ, ఈ ఉభయులు కూడా సమాఖ్యలో సమాన స్థాయిలో ఉత్తమ సభ్యులుగానే ఉంటారు.

రాష్ట్రాల జాబితా అంటే, కేవలం రాష్ట్రాలు మాత్రమే శాసనాలు చేయడానికి ప్రత్యేకంగా కేటాయించుకున్న అంశాల జాబితా. సమాఖ్యలో చేరే సంస్థానాల కోసం విడిగా రాష్ట్రాల జాబితా అనేది ఏదీ చట్టంలో లేదు. అలాంటిది విడిగా ఒకటి ఇచ్చే అవకాశం కూడా లేదు. అయితే రాష్ట్రాలు సమాఖ్య ప్రభుత్వానికి అప్పగించనటువంటి అధికారాలన్నీ ఇందులో ఉన్నాయని చెప్పవచ్చు. అయితే రాష్ట్రాల శాసన మండళ్లకు వుండగల విశిష్ట అధికారాల విషయానికి వస్తే, ఇప్పటికీ, అత్యవసర పరిస్థితి ఏర్పడినప్పుడు, రాష్ట్రానికి సంబంధించి గానీ లేదా అందులోని ఏదన్నా భాగానికి సంబంధించిగానీ రాష్ట్రాల జాబితాలో పేర్కొన్న అంశాలపై శాసనాలు చేసే అధికారం సమాఖ్య శాసనమండలికి ఉంటుంది. అయితే అంతకు ముందు గవర్నరు జనరల్ 102 వ విభాగం క్రింద తీవ్రమైన అత్యవసర పరిస్థితి అమలులో ఉన్నదని, తద్వారా, యుద్ధం వచ్చిగానీ లేదా అంతర్గత కల్లోలాలు రేగిగానీ భారతదేశపు భద్రతకు తీవ్రమైన విఘాతం కలిగే ప్రమాదం ఉన్నదని తన విచక్షణాభినివేశంతో తాను భావిస్తున్నట్లు ప్రకటించవలసి ఉంటుంది. భారత రాష్ట్రాల విషయంలో ఇలాంటి విధానం లేదు. భారతదేశపు ఉనికికే భంగకరంగా పరిణమించే తీవ్రమైన అత్యవసర పరిస్థితి, ఒక రాష్ట్రంలోనూ ఉత్పన్నం కావచ్చు, ఏదైనా సంస్థానాల భూభాగంలోనూ ఉత్పన్నం కావచ్చు. అత్యవసర పరిస్థితి ఉన్నప్పుడు సమాఖ్య శాసనమండలి సంస్థానాల వ్యవహారాల్లో జోక్యం చేసుకొని, అట్టి విషయాలకు సంబంధించి శాసనాలు చేయవచ్చునని ఇందుమూలంగా స్పష్టమైందిగదా! ఇలాంటి పరిస్థితులేర్పడినప్పుడు సమాఖ్యలో చేరిన దేశీయ రాజ్యాల విషయంలో ఇటువంటి జోక్యమే చేసుకుని శాసనాలు చేసే అవకాశం లేదు.

## (బి) కార్యనిర్వాహక మండలి విషయం :

కార్య నిర్వాహక మండలుల విషయంలో కూడా రాష్ట్రాలూ, సమాఖ్యలో చేరిన సంస్థానాలు ఒకే స్థాయిలో లేవు. సమాఖ్య యొక్క కార్య నిర్వాహకాధికార పరిధిని 8 వ విభాగంలో నిర్వచించారు. ఈ అధికారాన్ని 7 వ విభాగం క్రింద బ్రిటిషు రాజు పక్షాన గవర్నర్ జనరల్ వినియోగిస్తారు. ఉపవిభాగం (ఎ) యొక్క (1)వ ఉపఖండం క్రింద సమాఖ్య కార్యనిర్వాహఖ మండలి అధికారం, ఏ విషయాలకు సంబంధించి సమాఖ్య శాసనమండలికి శాసనాలు చేసే అధికారం ఉంటుందో ఆయా విషయాలన్నింటికీ విస్తరించగలదు. అయితే

ఈ విభాగం రాష్ట్రాలకు సంబంధించి వర్తించినట్లుగా, దేశీయ రాజ్యాలకు సంబంధించి కూడా అదే విధంగా వర్తించదు. రాష్ట్రాల విషయంలో సమాఖ్య శాసనమండలి జాబితాలో చేర్చిన అన్ని విషయాలలోనూ అధికారం కలిగి ఉంటుంది. కొన్ని పరిమితులకు లోబడి ఉమ్మడి జాబితా విషయాల జాబితాలోని వాటిలో కొన్నింటి విషయంలో కూడా దీనికి విడిగా అధికారాలుంటాయి. అయితే దేశీయ రాజ్యాల విషయంలో మాత్రం పరిస్థితి నేరుగా ఉంటుంది. దేశీయ రాజ్యాల విషయానికి వచ్చినప్పుడు ఉమ్మడి జాబితాలోని విషయాలకు సంబంధించి సమాఖ్యకు విడిగా నిర్వహణాధికారులుండవు. అంతేకాదు సమాఖ్య శాసన జాబితాలో ఉన్నటువంటి విషయాలకు సంబంధించి కూడా సమాఖ్యకు విడిగా విశేషాధికారం ఉండదు. 8వ విభాగపు 2వ ఉపవిభాగం చాలా ముఖ్యమైనది. ఇందులో ఇలా ఉన్నది :

"సమాఖ్యలో చేరిన రాష్ట్ర పాలకునికి చెందిన నిర్వహణాధికారం, ఈ విభాగంలో చెప్పినదానితో నిమిత్తం లేకుండా, ఏదన్నా సమాఖ్య చట్టం క్రింద ఆ పాలకుని కార్యనిర్వాహణాధి కారంతో నిమిత్తం లేకుండా, సమాఖ్య కార్యనిర్వహణాధికార వర్గం ద్వారా అమలు పరిచే అవకాశం కలిగితే తప్ప, రాష్ట్రాల విషయంలో చట్టాలు చేసే అధికారం సమాఖ్య శాసనమండలికి ఉన్నటువంటి విషయాలలో అధికారాలను చలాయించే హక్కు ఆ పాలకుని కార్యనిర్వహణాధికార పరిధిలోనే కొనసాగగలదు." స్పష్టమైన అందరికీ అర్థమయ్యే భాషలో చెప్పాలంటే ఈ ఉప విభాగంలో ఉన్నది ఇది! రాష్ట్రాలకు సంబంధించినంతవరకు పరిస్థితి మరో రకంగా ఉంటుంది. ఏదైనా ఒక విషయానికి సంబంధించి శాసనాలు చేసే అధికారం సమాఖ్య శాసనమండలికి ఉన్నంతమాత్రాన, ఆ విషయానికి సంబంధించి ఆ దేశీయ రాజ్యంపైన సమాఖ్య కార్య నిర్వహణాధికార వ్యవస్థ అధికార పరిధి విస్తరించబోదు. అటువంటి కార్యనిర్వహణాధికారాన్ని, సమాఖ్య ఒక శాసనాన్ని ఆమోదించడం ద్వారా ప్రదానం చేసుకొనవలసి ఉంటుంది. సమాఖ్య శాసనమండలిలో సంస్థానాలకు ఉన్నటువంటి విస్తృతమైన ప్రాతినిధ్యం దృష్ట్యా అటువంటి శాసనాన్ని సమాఖ్య శాసనమండలి ద్వారా ఆమోదింప చేసుకోవడం సమస్యాత్మకం అవుతుంది. పరిణామం ఏమైతే నేమిగాక, సూత్రప్రాయంగా సిద్ధాంతరీత్యా పరిశీలించినట్లయితే, సమాఖ్య కార్యనిర్వహణాధికారం సమాఖ్యలో చేరిన సంస్థానాలకు విస్తరించదు. రాష్ట్రాలకు సంబంధించినంత వరకు సమాఖ్య శాసనాలను చేయనూవచ్చు, వాటిని అమలు జరిపించనూవచ్చు నిర్వహించనూ వచ్చు. సమాఖ్యలో చేరిన సంస్థానాల విషయంలో మాత్రం సమాఖ్య శాసనాలను చేయవచ్చును కాని అమలు చేయడానికి వీలులేదు. అమలు చేసే అధికారం ఆయా సంస్థానాధికారులదే.

## (సి) పరిపాలనా నిర్వహణ విషయం

పరిపాలనా నిర్వహణ దృష్ట్యా రాజ్యాంగాన్ని పరిశీలించినప్పుడు, సమాఖ్య ప్రభుత్వానికి, రాష్ట్ర ప్రభుత్వాలకూ, సంస్థానాల ప్రభుత్వాలకూ సంబంధించి కొన్ని మార్గదర్శక సూత్రాలను ప్రతిపాదించే చట్టంలోని విభాగాలు కొన్ని మనకు కనిపిస్తాయి. తమ తమ ప్రభుత్వాలకు సంబంధించిన కార్యనిర్వహణాధికార వ్యవస్థను ఏ విధంగా వినియోగించుకోవాలో సూచించడమే ఈ నిబంధనల ఉద్దేశం. ఈ నిబంధనలు 122, 126 మరియు 128. 122వ నిబంధన సమాఖ్య ప్రభుత్వానికి సంబంధించినది. ఇందులో ఇలా ఉన్నది.

"122 (1). రాష్ట్రాలకూ సంస్థానాల రాష్ట్రాలకూ వర్తించేటువంటి సమాఖ్య శాసన

మండలి చట్టాలకు గౌరవ ప్రతిష్టలను సాధించే విధంగా ప్రతి రాష్ట్రంలోని కార్యనిర్వాహక వర్గమూ, సమాఖ్యలో చేరే దేశ సంస్థాన రాష్ట్రాల కార్యనిర్వాహక వర్గాలూ తమ అధికారాలను వినియోగించుకోవాలి.

(2) ఈ విభాగంలోని 1వ ఉపవిభాగంలో సమాఖ్య శాసనమండలికి సంబంధించిన సందర్భాన్ని ఏ రాష్ట్రానికైనా సంబంధించినంతవరకు, ఆ రాష్ట్రానికి వర్తించే ప్రస్తుతం అమలులో ఉన్నటువంటి ఏ భారతీయ చట్టానికైనా సంబంధించిన సందర్భంగా పరిగణించాలి.

3. ఈ చట్టపు ఈ భాగంలోని ఏ ఇతర నిబంధనలకు గాని భంగం వాటిల్లకుండా, సమాఖ్య రాష్ట్రాల దేశీయ రాష్ట్రాల కార్యనిర్వాహక వర్గాలు తమ రాష్ట్రపు లేదా దేశీయ రాష్ట్రపు ప్రయోజనాలకు ప్రాధాన్యం ఇస్తూ తమ అధికారాలు వినియోగించుకోవాలి.

126వ విభాగం రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించినది. అందులో ఇలా ఉన్నది:

"126(1). ప్రతి రాష్ట్రపు కార్యనిర్వాహక వర్గమూ తమ అధికారాన్ని సమాఖ్య కార్య నిర్వాహణాధికార వినియోగానికి భంగం కలగని విధంగా దానికి అడ్డు రాని విధంగా వినియోగించు కోవాలి. అందు నిమిత్తం సమాఖ్య ప్రభుత్వం అవసరమని భావించినంత మేర, రాష్ట్రాలకు అట్టి ఆదేశాలను జారీ చేసేంతవరకూ సమాఖ్య అధికార పరిధి విస్తరించగలదు."

126వ విభాగం దేశీయ రాష్ట్రాలకు సంబంధించినది; అందులో ఇలా ఉంది.

"128 (1) సమాఖ్యలో చేరే ఏ దేశీయ రాష్ట్రపు కార్యనిర్వహణాధికారమైనప్పటికీ, ఆ రాష్ట్రానికి వర్తించే సమాఖ్య శాసనమండలి చట్టాలను అనుసరించి ఆ రాష్ట్రంలో సమాఖ్య కార్యనిర్వాహకాధికార వర్గం వినియోగించే అధికారానికి భంగం కలుగకుండాను అడ్డుపడకుండాను అమలు జరపవలసి ఉంటుంది.

(2) పైన వివరించిన ఉప-విభాగం క్రిద విద్యుక్తమైన ఏదైనా విధిని నిర్వర్తించడంలో, సమాఖ్యలో విలీనమయ్యే రాష్ట్రానికి చెందిన పాలకుడు విఫలమైనట్లు గవర్నరు జనరల్ భావించినట్లయితే, గవర్నర్ జనరల్ తన విచక్షణాధికారానుసారం వ్యవహరిస్తూ, ఆ పాలకుడు సమర్పించిన ఏదైనా విజ్ఞాపన పత్రాన్ని పరిశీలించినమీద, తాను భావ్యమని తలచిన ఏవైనా ఆదేశాలను అట్టి పాలకునికి జారీ చేయవచ్చు.

అయితే, ఈ నిబంధన క్రింద సమాఖ్య కార్యనిర్వాహణాధికార వర్గం, ఏదైనా అధికారాన్ని ఆ రాష్ట్రంలో అమలు జరపవచ్చునా లేదా అనే విషయంలో ఏదైనా ప్రశ్న ఉత్పన్నమైనప్పుడు అట్టి ప్రశ్నను, సమాఖ్యాగానీ, లేదా ఆరాష్ట్రపు పాలకుడుగానీ చొరవ తీసుకొని సమాఖ్య న్యాయస్థానంద్వార పరిష్కరించుకోవచ్చును. ఈ చట్టం క్రింద ఇలాంటి ప్రశ్నలను పరిశీలించి తీర్పు చెప్పేందుకు సమాఖ్య న్యాయస్థానం ప్రాథమిక విచారణాధికారం కలిగి ఉంటుంది.

తమ కార్యనిర్వాహణాధికారిన్ని అమలు పరచడంలో ఈ సంస్థల మధ్య ఏవన్నా సంఘర్షణలు ఉత్పన్నం కాగల అవకాశాలు ఉండేట్లయితే ఈ నిబంధనలన్నీ చాలా ఉపయోగకరమైన నిబంధనలే. కాని వాస్తవానికి ఈ నిబంధనలన్నీ అవసరం లేనట్టివి. కార్యనిర్వాహణాధికారాన్ని పరిపాలనా నిర్వహణకు సంబంధించిన పనిలోనే వినియోగిస్తారు

కనుక, కార్యనిర్వాహణాధికారాన్ని అమలు పరచడంలోనే సంఘర్షణ ఉత్పన్నమయ్యే అవకాశం ఉంటుంది. కార్యనిర్వహణాధికార వర్గం నుంచి, పరిపాలనా కార్యక్రమాన్ని వేరుచేసినప్పుడు సంఘర్షణ ఉత్పన్నమయ్యే అవకాశమే లేదు కదా! అందువల్ల ఈ విభాగాలలో పేర్కొన్న జాగ్రత్తలూ– హెచ్చరికలూ అన్నీ అవసరం లేనట్టివే.

సమాఖ్య రాజ్యాంగంలో, సమాఖ్య ప్రభుత్వానికి, పరిపాలనా సంబంధమైన అధికారాలనేవి ఏవీ లేకుండా ఏర్పాటు చేయడానికి అవకాశం ఉంటుంది. కేవలం ఒక చట్టంగా, కార్యాచరణను ప్రోద్బలపరిచే చర్య అనేది ఏదీ లేకుండానే దీనిని ఏర్పాటు చేయవచ్చు. సమాఖ్య శాసనమండలి గవర్నర్ జనరల్, అది ఆమోదించిన ఏదైనా చట్టాన్ని అమలు జరిపించడానికి, సమాఖ్య కార్యనిర్వహణాధికార యంత్రాంగానికి బదులు, సమాఖ్యలోని ఆయా విభాగాలు, అనగా రాష్ట్రాలు లేదా సంస్థానాల ప్రభుత్వాలు అమలు జరిపేలా విధించవచ్చునని రాజ్యాంగం పేర్కొంటున్నది. 124వ విభాగం నిబంధనల ద్వారా ఇది స్పష్టం.

"124(1) ఈ చట్టంలో ఏమీ ఉన్నప్పటికీ దానితో నిమిత్తం లేకుండా ఆయా రాష్ట్ర ప్రభుత్వపు లేదా సమాఖ్యలో విలీనమయ్యే సంస్థానాల పాలకుని ఆమోదంతో, ప్రభుత్వానికి గానీ, సమాఖ్యలో విలీనమయ్యే సంస్థానా ఆపాలకుడనికిగానీ, లేదా వారి అధికారులకు గానీ, సమాఖ్య కార్యనిర్వహణాధికార వర్గానికి విస్తరించే ఏదైనా విధిని నిర్వర్తించాలని, షరతులతో కూడిన ఆదేశంగా, గవర్నర్ జనరల్ విధించవచ్చును.

(2) సమాఖ్య శాసనమండలి రూపొందించిన ఏదైనా ఒక చట్టాన్ని, రాష్ట్ర శాసనమండలికి ఆ విషయంలో చట్టాలు చేసే అధికారం లేకపోయినప్పటికీ, రాష్ట్ర ప్రభుత్వాలకు లేదా దాని అధికారులకు లేదా అధికార వర్గానికి అందుకు సంబంధించిన అధికారాలనూ, విధులనూ దత్తం చేయవచ్చును.

(3) సమాఖ్యలో విలీనమయ్యే ఏదైనా దేశీయ రాష్ట్రానికి విస్తరించగల ఏదైనా సమాఖ్య శాసన మండలికి సంబంధించిన చట్టం, ఆ రాష్ట్రంపైన ఆ రాష్ట్రపాలకునికి గాని అందు నిమిత్తం వినియోగించే అధికారులకు గాని అధికార యంత్రాంగానికి గాని విధులను నిర్దేశించ వచ్చును.

(4) ఈ విభాగం నిబంధనలను అనుసరించి, ఏదైనా రాష్ట్రానికిగాని, సమాఖ్యలో విలీమయ్యే దేశీయ రాష్ట్రాలకు గాని, లేదా వాటి అధికారాలకు, లేదా కార్యనిర్వహణ యంత్రాంగానికి గాని ఏదైనా అధికారాలూ విధులూ అప్పగించిన సందర్భాలలో, ఆయా రాష్ట్రానికి , లేదా దేశీయ రాష్ట్రానికి సమాఖ్య ప్రభుత్వం, అంగీకారం కుదిరిన మొత్తాన్ని చెల్లించవలసి ఉంటుంది. ఒప్పందం ప్రకారం చెల్లింపు జరగకపోతే, భారత ప్రధాన న్యాయమూర్తి నియమించే మధ్యవర్తి, అట్టి అధికారాలనూ, విధులనూ అమలు జరపడంలో ఆయా రాష్ట్ర ప్రభుత్వాలకు లేదా దేశీయ రాష్ట్ర ప్రభుత్వాలకు అయ్యే ఖర్చులను నిర్ధారించి, చెల్లింపు జరిగేలా చేయించ వచ్చును."

రాష్ట్రాలూ, స్వదేశీ సంస్థాన రాష్ట్రాలు సమాఖ్యనుండి పరిపాలనా సంబంధమైన అధికారాలనన్నింటినీ స్వీకరించి, సమాఖ్యను కేవలం చట్టాలు చేసే యంత్రాంగంగా మాత్రమే మిగల్చవచ్చు.

125వ విభాగం మరింత ఆందోళనకరమైన పరిస్థితిని సృష్టిస్తున్నది. అందులో ఇలా ఉన్నది.

"125(1) ఈచట్టంలో ఏమి ఉన్నప్పటికీ దానితో నిమిత్తం లేకుండా, ఏదైనా దేశీయ సంస్థాన రాష్ట్రం విలీనపు ఒప్పందంలో అందుకు సంబంధించి ఏదన్నా ఏర్పాటు ఉన్నట్లయితే, గవర్నర్ జనరల్‌కూ, సమాఖ్యలో విలీనమయ్యే దేశీయరాష్ట్రపు పాలకునికీ మధ్య, ఏదైనా సమాఖ్యచట్టాన్ని ఆ రాష్ట్రంలో అమలు చేయడానికి, ఆ రాష్ట్రపాలకుడు గాని, దాని అధికారులుగానీ, పరిపాలనా సంబంధమైన అధికారాల వినియోగానికి సంబంధించి, ఏదైనా ఒప్పందాన్ని కుదుర్చుకోవచ్చును; దాని ప్రకారం అమలు జరిపించవచ్చును.

(2)ఈ విభాగం క్రింద కుదర్చుకున్న ఒప్పందంలో, గవర్నర్ జనరల్ తన విచక్షణాధికారాలను వినియోగించి, తనిఖీ ద్వారాగానీ, ఇతర విధంగా గానీ, ఒప్పందం అనువర్తించే చట్టాన్ని అమలు పరచడంలో పరిపాలనా సంబంధమైన అధికారాలను సమాఖ్యా ప్రభుత్వ విధానానికి అనుగుణంగా వ్యవహరించినట్లు సంతృప్తి చెందడానికీ, ఒక వేళ అలా సంతృప్తి చెందక పోయినట్లయితే, తన విచక్షణాధికారం మేరకు గవర్నర్ జనరల్ తనకు భావ్యమని తోచిన ఆదేశాలను ఆ రాష్ట్రపాలకునికి జారీ చేయడానికీ ఏర్పాట్లు ఉండాలి.

(3) ఈ విభాగం క్రింద కుదిర్చిన ఏ ఒప్పందాన్నైనా అన్ని న్యాయస్థానాలూ న్యాయసంబంధమైన పరిగణనలోనికి తీసుకోవాలి.

ఈ విభాగం క్రింద, ఏదైనా స్వదేశీ సంస్థాన రాష్ట్రం, తన రాష్ట్రంలో సమాఖ్య చట్టాల అమలు, తన రాష్ట్ర యంత్రాంగం ద్వారానే జరగాలని, సమాఖ్య పాలనా యంత్రాంగం ద్వారా జరగరాదని విలీనపు ఒప్పందంలో ఏర్పాటు చేసుకోవచ్చును. ఒకవేళ అటువంటి ఏర్పాటు చేసుకుని ఉన్నట్లయితే, సమాఖ్య ప్రభుత్వానికి ఆ రాష్ట్రంలో పరిపాలనా సంబంధమైన అధికారం ఏదీ ఉండదన్నమాట. ఏదన్నా చట్టం యొక్క ప్రయోజనం దాన్ని నిర్వహించే పద్ధతిమీద ఆధారపడి ఉంటుంది. ఏదైనా చట్టాన్ని అమలుపరచడం అసమర్ధంగా జరిగినా, లేక, అవినీతిమయంగా జరిగినా, ఆ చట్టం నిష్ప్రయోజన మవుతుంది. సమాఖ్య ప్రభుత్వానికి పరిపాలనాధికారాలను లేకుండా చేయడమంటే సమాఖ్య ప్రభుత్వాన్ని నిర్వీర్యం చేయడమే అవుతుంది. ఒక సమాఖ్యగా ఏర్పడిన తర్వాత సమాఖ్యలోని కొన్ని విభాగాలు, తమ ప్రాంత పరిధిలో సమాఖ్య ప్రభుత్వపు పాలనాధికారాలను నిరాకరించటానికి అనుమతించవు. భారతీయ సమాఖ్య ఇందుకు అపవాదంగా ఉంది.ఈ విషయంలో రాష్ట్రాలకూ, స్వదేశీ సంస్థాన రాష్ట్రాలకూ మధ్య తేడాలుండటమే కాక, సమాఖ్య ప్రభుత్వం ద్వారా పర్యవేక్షణాధికారం, నిర్దేశాధికారం విషయాలలోకూడా కార్యనిర్వాహణాధికారాల వినియోగంలో వీటిమధ్య తేడాలున్నాయి. 126వ విభాగాన్ని, 128వ విభాగాన్ని పోల్చి చూచినట్లయితే ఈ తేడాలు స్పష్టమవుతాయి.

ప్రతి రాష్ట్రం కార్యనిర్వహణాధికార వినియోగం, సమాఖ్య యొక్క కార్యనిర్వాహణాధికార వినియోగానికి అడ్డుపడకుండా, ఆటంకం లేకుండా ఉండాలని 126వ విభాగంలో నిబంధన

చేశారు. అందు నిమిత్తం సమాఖ్య ప్రభుత్వం అవసరమని భావించే ఆదేశాలను రాష్ట్ర కార్యనిర్వహణాధికార వర్గాలకు జారీ చేసేంతమేరకు సమాఖ్య కార్యనిర్వహణాధికార పరిధి విస్తరించగలదని నిబంధించారు. 128వ విభాగం కూడా, సమాఖ్యలో విలీనమయ్యే స్వదేశీ సంస్థాన రాష్ట్రాలకు సంబంధించి నంతరవకు అటువంటి నిబంధనే. అయితే ఈ రెండు విభాగాల మధ్య గణనీయమైన తేడా ఉన్నది. సమాఖ్య కార్యనిర్వహణాధికారం, సమాఖ్య ప్రభుత్వానికి అవసరమని తోచినటువంటి ఆదేశాలను రాష్ట్రాలకు జారీచేయడం వరకు విస్తరించగలదని 126వ విభాగం వివరిస్తూ వుంటే, 128వ విభాగం అటువంటి అధికారాలను ఇవ్వడం లేదు. అంటే, సమాఖ్యలో విలీనమయ్యే స్వదేశీ రాష్ట్రాల పాలకులను, ఆయా రాష్ట్రాలలో తమ కార్యనిర్వహణాధికారాలను వినియోగించేప్పుడు, సమాఖ్య కార్యనిర్వహణాధికార వినియోగానికి అడ్డుపడకుండా, భంగం కలిగించకుండా ఉండాలని ఆదేశించే, స్వతస్సిద్ధ అధికారం సమాఖ్య ప్రభుత్వానికి లేదన్నమాట. చాలా గణనీయమైన తేడాలలో ఇది ఒకటి. అలాంటి అధికారాన్ని సమాఖ్య ప్రభుత్వానికి ఇవ్వడానికి బదులు గవర్నర్ జనరల్‌కు ఇచ్చారు. చట్టం ప్రకారం గవర్నర్ జనరల్, సమాఖ్య ప్రభుత్వానికి విభిన్నమైన విశిష్ట వ్యక్తి. స్వదేశీ సంస్థాన రాష్ట్ర పాలకునికి, తాను భావ్యమని భావించిన ఆదేశాలను జారీ చేసే అధికారాన్ని గవర్నర్ జనరల్‌కు ఇచ్చారు. ఇక్కడ ఇంకో తేడా కూడా కనిపిస్తుంది. 126వ విభాగం క్రింద ఏదైనా రాష్ట్ర గవర్నరుకు ఆదేశాలు జారీ చేసినట్లయితే అతడు వాటిని పాటించితీరాలి. అలాంటి ఆదేశాలు ఇవ్వవలసిన అవసరాన్ని గురించిగానీ, అలాంటి ఆదేశాలు జారీ చేసే గవర్నర్ జనరల్ అధికారాలను గురించిగానీ ప్రశ్నించే అధికారం రాష్ట్ర గవర్నర్‌కు ఉండదు. స్వదేశసంస్థాన రాష్ట్ర పాలకుని విషయంలో పరిస్థితి ఇందుకు పూర్తిగా భిన్నంగా ఉంటుంది. అలాంటి ఆదేశాన్ని ఆతడు ప్రశ్నించవచ్చు. ఈ విషయమై తీర్పు చెప్పవలసిందిగా సమాఖ్య న్యాయస్థానాన్ని అర్థించవచ్చు. 128వ విభాగం (2)వ ఉప విభాగపు షరతులో ఈ విభాగం క్రింద సమాఖ్య కార్యనిర్వహణాధికార పరిధి, ఆ రాష్ట్రానికి విస్తరించే అంశం గురించి, సమాఖ్య అధికార వినియోగం విషయంలో ఏదన్నా ప్రశ్న ఉత్పన్నమైనప్పుడు ఆ రాష్ట్ర పాలకుని చొరవపైన గానీ లేదా సమాఖ్య చొరవ పైన గానీ ఆ అంశాన్ని నిర్ణయించవలసిందిగా సమాఖ్య న్యాయస్థానానికి నివేదించవచ్చునని ఉన్నది.

## (డి) విత్తపరమైన అంశాలకు సంబంధించి

విత్తపరమైన అంశాల విషయానికి వస్తే, రాష్ట్రాలకూ, స్వదేశీ సంస్థాన రాష్ట్రాలకూ మధ్య తేడా అత్యంత స్పష్టంగా ఉంది. రాష్ట్రాలపైన, స్వదేశీ సంస్థాన రాష్ట్రాలపైన పన్నులు విధించే సమాఖ్య అధికారాన్ని పరిశీలిద్దాం. సమాఖ్య ఆదాయవనరులు, రెండు ప్రధాన శీర్షికల క్రింద విభజించడానికి వీలైన ఆదాయమార్గాల ద్వారా సమకూరగలవన్న అంశాన్ని గుర్తించారు. పన్నులద్వారా వచ్చేవి; పన్నుల ద్వారా కాకుండా ఇతరంగా సమకూరేవి. పన్నుల ద్వారా

కాకుండా సమకూరే ఆదాయాలను ఆరు శీర్షికల క్రింద విభజించవచ్చు.

1. సమాఖ్య జాబితాలో చేరిన అంశాలకు సంబంధించిన రుసుములు.
2. తపాలా సేవల నిర్వహణలో (తపాలా పొదుపు బ్యాంకులతో సహా) ఏవైనా లాభాలు సమకూరేట్లయితే ఆ లాభాలు.
3. సమాఖ్య రైలుమార్గాల నిర్వహణద్వారా ఏవైనా లాభాలు సమకూరితే ఆ లాభాలు.
4. నాణేలముద్రణ, కరెన్సీనోట్ల ముద్రణ ద్వారా ఏవైనా లాభాలు సమకూరేటట్లయితే ఆ లాభాలు.
5. రిజర్వు బ్యాంకు వంటి తదితర సమాఖ్య సంస్థలద్వారా, ఏవైనా లాభాలు సమకూరేటట్లయితే ఆ లాభాలు; ఇంకా,
6. సమాఖ్యలో విలీనమయ్యే, లేదా విలీనం కాని స్వదేశీ సంస్థాన రాష్ట్రాల నుంచి బ్రిటీషు రాజుకు నేరుగా సమర్పించే విరాళాలు.

భారత ప్రభుత్వ చట్టం క్రింద పన్నులు విధించడం ద్వారా సమకూరే ఆదాయ మార్గాలను రెండు శీర్షికల క్రింద విభజించవచ్చును. సాధారణ పన్నుల విధింపు; అసాధారణ పన్నుల విధింపు. సాధారణ పన్నుల విధింపులో ఈ దిగువ ఆదాయ వనరులను చేర్చవచ్చు.

1. కస్టమ్స్ సుంకాలు
2. ఎగుమతి సుంకాలు
3. ఎక్సయిజు సుంకాలు
4. ఉప్పు
5. కార్పొరేషనుపన్ను
6. వ్యవసాయేతర ఆదాయాలపై పన్ను.
7. ఆస్తిపన్నులు అనగా, వ్యక్తిగత ఆస్తుల పెట్టుబడి విలువపై పన్నులు, లేదా ఆస్తులపై పన్నులు.

అసాధారణ ఆదాయ మార్గాలను ఈ దిగువ శీర్షికల క్రింద విభజించవచ్చును.

1. ఆదాయపు పన్నుపై సర్చార్జి
2. వారసత్వపు సుంకాలపై సర్చార్జి
3. రైలుమార్గానగానీ, విమాన మార్గానగానీ సరుకులను, ప్రయాణీకులను చేరవేసినప్పుడు

టర్మినల్ పన్నులపై విధించే సర్చార్జీలు. రైల్వే సరుకు రవాణాపై విధించే అన్ని రకాల పన్నులు.

4. స్టాంపు డ్యూటీలు, మొదలైన వాటిపై విధించే సర్ ఛార్జి.

ఈ పై శీర్షికలలో వివరించిన ఎటువంటి పన్ను విధింపునైనా ఆ పన్ను విధింపు సాధారణమైనదైనా, అసాధారణమైనదైనా, రాష్ట్రాలు భరించి తీరవలసిందే. కాని దేశీయ సంస్థాన రాష్ట్రాల విషయంలో ఈ విషయం ఇలా లేదు. ఉదాహరణకు సాధారణ సమయాల్లో 6వ 7వ శీర్షికల క్రిందికి వచ్చే సాధారణ పన్నుల చెల్లింపు నిమిత్తం దేశీయ సంస్థాన రాష్ట్ర ప్రభుత్వాలు కట్టుబడి ఉండవు. కాని ఇతర రాష్ట్రాల ప్రభుత్వాలన్నీ కట్టుబడి ఉంటాయి.

ఇక అసాధారణ పన్నుల విధింపు విషయంలో, ఆర్థికంగా సంకటపరిస్థితుల్లో ఉన్న సమయాల్లో కూడా 2,3,4 అంశాలలో పేర్కొన్న పన్నులను దేశీయ సంస్థాన రాష్ట్రాలు విధిగా చెల్లించవలసిన అవసరం లేదు. ఒకటవ అంశం క్రింద ఆయా రాష్ట్రాలు అసాధారణ పరిస్థితులలో చెల్లింపులు చేయవలసి వచ్చినప్పుడు కూడా మిగతా అన్ని రంగాలలోనూ పొదుపు చర్యలు తీసుకున్నట్లు ధ్రువ పత్రాలు సమర్పించవలసి ఉంటుంది.

ఆర్థిక దృష్టితో పరిశీలించినప్పుడు, రాష్ట్రాలకూ దేశీయ సంస్థాన రాష్ట్రాలకూ మధ్య మరో తేడా కూడా ఉన్నది. రాష్ట్ర ప్రభుత్వాలకు పన్ను విధించే అధికారం ఉన్న రంగాలను చట్టంలో నిర్వచించారు. దేశీయ సంస్థాన రాష్ట్రాల విషయంలో అలాంటిదేదీ లేదు. భారత ప్రభుత్వ చట్టంలో, సమాఖ్యలో విలీనమయ్యే దేశీయ సంస్థాన రాష్ట్రపు పన్ను విధింపు అధికారాలను విపులీకరించే అంశమేదీ లేదు. అంతర్గత పరిపాలనా నిర్వహణకు అవసరమైన వనరులను సేకరించడానికి, ఆదాయాన్ని సమీకరించుకోవడానికి అవి ఎటువంటి పన్ను విధింపు విధానాన్నయినా ఎంచుకోవచ్చు. ప్రక్క రాష్ట్రంనుంచి తమ రాష్ట్రంలోనికి వచ్చే సరుకుల మీద చివరికి కస్టమ్స్ సుంకాలనుకూడా విధించవచ్చు. ప్రక్కరాష్ట్రం సమాఖ్యలోని ఒక భాగమైనా సరే, ఏ సమాఖ్యలోనైతే, ఇలాంటి కస్టమ్స్ సుంకం విధించే దేశీయ రాష్ట్రం విలీనమవుతున్నదో అదే సమాఖ్యలో విభాగంగా ఉన్నటువంటి పొరుగు రాష్ట్రంలో తయారైన సరుకుల మీద కూడా కస్టమ్స్ సుకం విధించవచ్చునన్నమాట. భారతీయ సమాఖ్య విధానంలో ఇదొక అసాధారణమైన, అధ్వాన్నమైన లక్షణం. సమాఖ్యగా రూపొందినందువల్ల ఒనగూరే ప్రయోజనాలలో సమాఖ్య లోని భూభాగమంతటా, వర్తక వాణిజ్యాలు నిర్వహించుకునే స్వేచ్ఛ ఒకటి. ఇదే ప్రాథమిక లక్ష్యం కాకపోవచ్చును. సమాఖ్యలోని ఒక విభాగానికి మరో విభాగంపైన కస్టమ్స్ సుంకాన్ని విధించే స్వేచ్ఛను మరో విధంగా చెప్పాలంటే అంతర్ రాష్ట్ర వాణిజ్య వ్యాపారాలకు అడ్డుకట్టలు వేసే స్వేచ్ఛను ప్రదానం చేసే పద్ధతి, చరిత్రకు అందినంతవరకు ఏ సమాఖ్యలో కూడా ఉండదు. ఆ నియమానికి భారతీయ సమాఖ్య ఒకరకమైన మినహాయింపు. ఈ నాడు ప్రజలందరికీ తెలిసినటువంటి సమాఖ్యల పద్ధతికి ఇది

పూర్తిగా భిన్నమైన పద్ధతి. భారతీయ సమాఖ్యకు ఇది విశిష్టతనూ, ప్రత్యేకతనూ సమకూరుస్తున్నది.

సమాఖ్య రాజ్యాంగపు విశిష్టతలో ప్రధానమైన అంశం, సమాఖ్యకు సంబంధించిన భూభాగం విభిన్న విభాగాల మధ్య పంపిణీ అయివున్నప్పటికీ, మొత్తం భూభాగం ఒకే విభాగంగా అలరారుతూ ఉండటం కస్టమ్స్‌కు సంబంధించినంతవరకైతే యావత్తు భూభాగాన్నీ ఒకే విభాగంగా పరిగణించడం పరిపాటి. ఒక విభాగం మరో విభాగానికి వ్యతిరేకంగా కస్టమ్స్, వర్తక రంగాలలో అడ్డంకులు కల్పించకుండా చూడటానికి, ప్రతి సమాఖ్యా రాజ్యాంగంలో అధికారాలనూ, నిషేధాలనూ నిర్వచించుకోవడం జరుగుతుంటుంది.

ఏదైనా సరుకుల ఎగుమతులనుకాని, దిగుమతులను గాని ఏ రాష్ట్రమూ నిరోధించకుండాను, ఆయా రాష్ట్రాల సరిహద్దుల నుండి రవాణా అయ్యే సరుకుల మీద ఎగుమతి, దిగుమతి సుంకాలను ఆయా రాష్ట్రాలు విధించకుండాను, అమెరికా రాజ్యాంగంలో Iవ పరిచ్ఛేదపు 9వ విభాగం నిషేధిస్తున్నది. సమాఖ్యలోని రాష్ట్రాల మధ్య వర్తక వాణిజ్యాలను క్రమబద్ధం చేసే అధికారాన్ని Iవ పరిచ్ఛేదపు 8(3)వ విభాగం సమాఖ్య ప్రభుత్వానికి కల్పిస్తున్నది.

ఆస్ట్రేలియాలో రాజ్యాంగపు 92విభాగం క్రింద, రాష్ట్ర సమాఖ్య ప్రభుత్వాలు [illegible], క్రమబద్ధం చేసే తమ అధికారలను వినియోగించేటప్పుడు, రాజ్యాంగపు 92విభాగం హామీ ఇచ్చిన"రాష్ట్రాలమధ్య వర్తక వాణిజ్యాలు అంతరంగిక ఉపరితలరవాణా మార్గాల ద్వారాకానీ, లేదా నౌకల ద్వారా సముద్ర రవాణాల ద్వారాగానీ పూర్తిస్వేచ్ఛను కలిగి ఉండాలి". అన్న హామీకి భంగకరంగాకుండా వినియోగించాలని విధిస్తున్నది.

కెనడాలో రాజ్యాంగపు 121వ విభాగం ద్వారా చేసిన నిబంధనను అనుసరించి, "ఏదైనా ఒక రాష్ట్రానికి చెందిన పెరుగుదలకు సంబంధించిన అన్ని రకాలైన సరుకులూ, ఉత్పత్తి అయిన సరుకులూ, తయారైన సరుకులన్నీ సంఘవ్యవస్థ రూపొందిన తర్వాత, అన్ని ఇతర రాష్ట్రాలకూ స్వేచ్ఛగా అనుమతింప బడతాయి" అని స్పష్టంచేశారు.

భారత రాజ్యాంగంలో సమాఖ్య పరిధిలో వర్తక వాణిజ్యాల స్వేచ్ఛను గురించిన నిబంధనలను 297వ విభాగంలో పొందుపరిచారు. అందులో ఇలా ఉన్నది.

"279-(1)(ఏ) రాష్ట్రంలోపల వర్తక వాణిజ్యాలకు సంబంధించిన పద్దు, రాష్ట్ర విధాన మండలికి సంబంధించిన జాబితాలో చేరి ఉన్నందువల్ల, వస్తువుల ఉత్పత్తి, సరఫరా, పంపిణీలకు సంబంధించిన అంశాన్ని ఆ జాబితాలో చేర్చినందుకు ఫలితంగా, ఏ తరగతి లేదా నిర్వచనం క్రిందికి వచ్చే, ఆ రాష్ట్రానికి చెందిన వస్తువులను, ఆ రాష్ట్రంనుంచి ఎగుమతి చేయడాన్ని లేదా అటువంటి సరుకులు తమ రాష్ట్రంలో ప్రవేశించకుండా నిషేధిస్తూ లేదా అట్టి ప్రవేశాన్ని నియంత్రిస్తూ ఏవైనా చట్టాలను చేసే లేదా కార్యనిర్వహణస్థాయి చర్యలు చేపట్టే అధికారం ఆ రాష్ట్రానికి ఉంటుంది కనుక వాటిని చెయ్యడానికీ;

(బి) ఈ చట్టంలో ఉన్నటువంటి ఏ నిబంధన క్రిందనైనా, ఆ రాష్ట్రంలో తయారయ్యే, లేదా ఉత్పత్తి అయ్యే సరుకులకూ – అలా తయారుకాని లేదా ఉత్పత్తికాని ఇతర సరుకులకూ, మొదట పేర్కొన్న వాటి పట్ల పక్షపాతం వహించే విధంగాను, లేదా రాష్ట్రం బయట తయారయ్యే లేదా ఉత్పత్తి అయ్యే అలాంటి సరుకుల విషయంలో వివక్షత చూపించే విధంగాను ఒక స్థానిక ప్రాంతంలో తయారయ్యే లేదా ఉత్పత్తి అయ్యే సరుకులకూ, మరో ప్రాంతంలో తయారయ్యే లేదా ఉత్పత్తి అయ్యే సరుకులకూ మధ్య వివక్షత చూపించే విధంగా ఏదన్నా పన్ను లేదా సెస్సు, లేదా టోల్ పన్ను, లేదా ఇతర బకాయీలను విధిస్తూ ఉత్తరువులు చెయ్యడానికీ–

1. ఏ రాష్ట్రానికి చెందిన శాసన మండలికి కూడా అధికారం ఉండబోదు.

2. దీనికి భిన్నంగా ఏదన్నా చట్టం చేసినట్లయితే, ఆ చట్టం దీనికి భిన్నంగా ఉన్నంతమేరకు చెల్లబోదు."

ఈ విభాగపు షరతులను పరిశీలించినట్లయితే వర్తక వాణిజ్య రంగాల స్వేచ్ఛ కేవలం రాష్ట్రం వరకే పరిమితంగా ఉన్నట్లు కానవస్తుంది. మరో మాటలో చెప్పాలంటే, భారత దేశంలోని దేశీయ సంస్థాన రాష్ట్రాలు, ఇతర రాష్ట్రాలనుండి వచ్చే సరుకులను రాకుండా పూర్తిగా నిషేధించవచ్చును. ఆ సరుకుల మీద సుంకాలను కూడా విధించవచ్చు. ఈ పద్ధతి సమాఖ్య సంఘీయవ్యవస్థ మౌలిక సిద్ధాంతానికి పూర్తిగా భిన్నమైనటువంటిది. సమాఖ్యలోని ఒక విభాగం, మరో విభాగం మీద వాణిజ్య సమరానికి ఆయత్తం కావడాన్ని ప్రోత్సహించడం సమాఖ్య ఆశయాన్ని కాదనడమే నన్నమాట.

4. సమాఖ్యలోపల ప్రజల సంబంధాలు.

ఈ సమస్యపై విస్తృతమైన చర్చకు పూనుకునేముందు కొన్ని రకాల విశిష్టతలను పేర్కొనడం ద్వారా భూమికను స్పష్టం చేసుకుంటాను. "రాజ్యం" "సమాజం" అనే ఈ రెండు పదాలను తరుచుగా, ఈ రెండింటి మధ్య వైరుధ్యం ఉన్నట్టుగా వ్యక్తీకరిస్తూ ఉండటం పరిపాటి. రాజ్యానికీ, సమాజానికీ మధ్య మౌలిక దృక్పధంతో పరిశీలించినప్పుడు ఎటువంటి తేడా లేదు. రాజ్యపు దండనాధికార హక్కులు, చట్టం ఆమోదంతోనే అమలు జరుగుతాయన్న మాటనిజమే సమాజం మాత్రం తన దండనాధికార హక్కును వినియోగించుకోవడానికి మతపరమైన లేదా సాంఘికపరమైన సర్వామోద వ్యవస్థపై ఆధారపడుతుంది. అయితే లొంగదీయడానికి లేదా అణచడానికి ఈ రెండు సంస్థలకూ దండనాధికారాలుంటాయన్న మాట మాత్రం యదార్థం. ఈ విధంగా రాజ్యానికీ, "సమాజానికీ" మధ్య తేడా లేదు. ఇక రెండో విషయం. "రాజ్యం" ఏ వ్యక్తుల సమామ్నాయం ద్వారా రూపొందిందో, "సమాజం" కూడా అదే వ్యక్తుల సమామ్నాయం ద్వారా ఆరూపొందింది. ఇక్కడ కూడా మళ్లీ రాజ్యానికీ సమాజానికీ మధ్య తేడా లేదు

అయితే ఒక తేడా ఉన్నమాట నిజమే. అది విభిన్న స్వభావం కలిగినటువంటితేడా. సమాజంలో సభ్యుడై అందులో ఉంటున్న ప్రతివ్యక్తీ విధిగా "రాజ్యం"లో కూడా సభ్యుడై ఉండవలసిన అవసరంలేదు. రాజ్య సరిహద్దులలోపల ఉంటూ వుండే వారంతా తప్పనిసరిగా రాజ్యానికి ఆ రాష్ట్రానికి చెందినవారు అయి ఉండనక్కరలేదు. రాజ్యానికి సంబంధించినవారు, రాజ్యానికి సంబంధించనివారు అన్న ఈ తేడా చాలా కీలకమైనది. దీని పరిణామాలు అత్యంత ప్రముఖంగా ఉంటాయి కనుక దీనిని విస్మరించకూడదు. రాజ్యానికి చెందిన వారు మాత్రమే రాజ్యంలో సభ్యులు. ఇలాంటి సభ్యత్వం నుండి ఒనగూరే ప్రయోజనాలను వారే పొందుతారు. రాజ్యానికి సంబంధించి హక్కులనూ, విధులనూ కలిగి ఉండటానికి వారికే అవకాశం ఉంటుంది. విధుల విషయకంగా పరిశీలించినప్పుడు ఈ సభ్యత్వాన్ని పాలితులు అన్న శబ్దం చక్కగా వివరిస్తుంది. హక్కుల విషయకంగా పరిశీలించినప్పుడు "పౌరుడు" అన్న శబ్దం సముచితమైన శబ్ద వ్యక్తీకరణగా ఉంటుంది. ఈ తేడా వల్ల కలిగే ఫలితం ఇలా ఉంటుంది. రాజ్యంలో ఉంటూ, రాజ్యానికి చెందనవారికి రాజ్యంలో సభ్యత్వం వల్ల ఒనగూరే ప్రయోజనాలు ఒనగూరవు. మరో మాటలో చెప్పాలంటే వారిని పరిగణిస్తారు గాని పౌరులుగా పరిగణించబోరు.

పౌరులనూ, విదేశీయులనూ వేరుపరచి చూడటం, సిద్ధాంతపరంగా పరిశీలించినప్పుడు చాలా సులభకార్యంగా, నిజానికి దాదాపు యాంత్రికమైన కార్యంగా కనిపిస్తుంది. యూనిటరీ పద్ధతి ప్రభుత్వ వ్యవస్థ అమలులో ఉన్న రాష్ట్రంలో ఇది మరింత యదార్థం. ఇక్కడ ఎదురయ్యేది అతి సులభమైన ప్రశ్న. ఈ రాజ్యానికి ఏదైనా ఇతర రాజ్యంతో లేదా అన్ని ఇతర రాజ్యాలతో ఎటువంటి సంబంధాలుంటాయనేది ఆ ప్రశ్న. సమాఖ్య పద్ధతి రాజ్యంలో ప్రతివ్యక్తికీ ద్వంద సబంధాలు ఉండటం అనివార్యం అవుతుంది కనుక ఈ విషయం సంక్లిష్టంగా రూపొందుతున్నది. ఒక పక్క సమాఖ్య రాజ్యంతో వ్యక్తి సంపూర్ణ సంబంధాలను కలిగి ఉంటాడు. మరోపక్క తాను నివసిస్తున్న ప్రాంతం ఏ రాజ్యానికి చెందిందో ఆ రాజ్యంతోనూ సంబంధాలు కలిగి ఉంటాడు. సమాఖ్య పద్ధతి రాజ్యంలో ఒక వ్యక్తి 'ఉనికి'ని నిర్వచించడానికి ప్రయత్నం చేసినట్లయితే, ఒక్కటికాదు; అనేకమైన ప్రశ్నలకు సమాధానాలు అన్వేషించవలసి ఉంటుంది. ఏదైనా ఒకటి లేదా అన్ని ఇతర రాజ్యాలకు భిన్నంగా, సమాఖ్య రాజ్యంతో ఆ వ్యక్తికి ఉండే సంబంధం ఏమిటి? తాను నివాసం ఉంటున్న రాజ్యంతో ఆ వ్యక్తికి ఉండే సంబంధం ఏమిటి? ఒక రాజ్యపౌరునిగా ఉంటూ, సమాఖ్య రాజ్యపౌరునిగా ఉండకుండా ఉండటానికి వీలుంటుందా?

కెనడా, ఆస్ట్రేలియాలు సమాఖ్యలుగా రూపొందినప్పుడు ఇటువంటి ప్రశ్నలు ఉత్పన్నం కాలేదు. ఆయా సమాఖ్యలలోని ఆయా విభాగాలలో నివసిస్తూ ఉండిన వారందరూ సహజంగా జన్మతః బ్రిటిష్ పౌరులే కనుక సమాఖ్య అవతరించిన తర్వాత సైతం వారి ఈ స్థాయి కొనసాగింది. సమాఖ్య అవతరించిన తర్వాత దేశీయాకరణ అధికారం సమాఖ్యకు సమకూరింది; ఫలితంగా సమాఖ్య దేశీయాకరించిన ప్రతివారూ సమాఖ్య పౌరులై తద్వారా దాని ప్రతి

విభాగానికీ చెందిన పౌరులుగా కూడా పరిణమించారు.

అయితే, అమెరికా, స్విట్జర్‌లాండ్ జర్మనీ దేశాలలో ఇలాంటి ప్రశ్న ఎదురయింది. సమాఖ్యగా మారకముందు వాటి విభాగాలన్ని విదేశీ రాజ్యాలుగాను, పౌరులందరూ ఆయా విదేశీ పౌరులుగానూ ఉండేవారు. అయితే ఈ అన్ని సందర్భాలలోనూ సమాఖ్యలో భాగంగా ఒక సమాన్యపౌర సత్వాన్ని నెలకొల్పడం జరిగిందన్న విషయాన్ని గుర్తించవలసి ఉంటుంది. ఒక విభాగపు పౌరసత్వంతోబాటే సమాఖ్య పౌరసత్వం కూడా సిద్ధించటాన్ని అనుమతిస్తూ వారు ఒక నియమాన్ని నెలకొల్పారు.

భారతీయ సమాఖ్య వ్యవహారం కూడా అమెరికా, జర్మనీ, స్విట్జర్లాండు వ్యవహారంతో పోల్చదగినదే. భారతీయ స్వదేశీ రాష్ట్రానికి చెందిన పౌరుడు బ్రిటిష్ ఇండియా వారికి, భారత దేశంలోని ఇతర రాష్ట్రాల వారికీ విదేశీ పౌరుడే. బ్రిటిష్ ఇండియా రాష్ట్రానికి చెందినపౌరుడు భారతదేశపు ఇతర రాష్ట్రాల వారికి విదేశీయుడే.

ఈ వ్యవహారం గురించి భారతీయ సమాఖ్య చేసిన దేమిటి? సమాఖ్యలో సభ్యత్వం స్వీకరించిన విభాగాలన్నింటి మధ్య సామాన్యపౌరసత్వాన్ని నెలకొల్పిందా? అని ప్రశ్నిస్తే లేదు అని సమాధానం వస్తుంది. సమాఖ్య రూపొందిన తర్వాత కూడా, సమాఖ్య రూపొందడానికి ముందున్నట్లుగానే, ప్రతీ భారతీయ స్వదేశీ రాష్ట్రానికి సంబంధించినంతవరకు, అది భారత సమాఖ్యలో భాగమైనప్పటికీ, బ్రిటిష్ ఇండియా ప్రాంతానికి చెందిన ప్రతి పౌరుడూ విదేశీయుడు గానే కొనసాగాడు. అదే విధంగానే సమాఖ్య రూపొందిన తర్వాత కూడా, సమాఖ్య రూపొందడానికి ముందున్నట్లుగానే సమాఖ్యలో విలీనమైనటువంటి భారతీయ స్వదేశీ రాష్ట్రానికి సంబంధించిన ప్రతీ పౌరుడు, బ్రిటిష్ ఇండియా వారికి విదేశీ పౌరునిగానే కొనసాగాడు. సామాన్య జాతీయత అనేదే లేదు. సమాఖ్య సంబంధించిన మొత్తం మౌలికసూత్రం-సమాఖ్యలో విలీనమైన స్వదేశీ రాష్ట్ర పాలకుడు, తన రాష్ట్రానికి పాలకుడుగానే కొనసాగుతాడని, అతని ప్రజలు అతని ఆధీనంలో ఉన్న ప్రజలుగానే కొనసాగుతారని, సమాఖ్యలో చేరిన మిగతా రాష్ట్రాలకు పాలకులుగా బ్రిటిష్ రాజరికం కొనసాగుతుందని, అతని అధీనస్థ ప్రజలు అతని ప్రజలుగానే కొనసాగుతారనేదిగా ఉంది.

పౌరసత్వానికి సంబంధించిన ఈ తేడా రెండు స్పష్టమైన వ్యవహారాలలో ప్రదర్శితమవుతున్నది.

మొదటిది-సేవ చేసే అధికారం విషయంలో ఇది ప్రదర్శితమవుతున్నది. బ్రిటిష్ రాజరికం అధీనంలో సమాఖ్య ఏర్పాటైంది కనుక, బ్రిటిష్ రాజరికాధీనపు పౌరులు మాత్రమే దాని క్రింద పనిచేయడానికి అర్హత సంపాదిస్తారు. దీన్ని 262వ విభాగం గుర్తిస్తున్నది. నిజానికిది స్వదేశీ రాష్ట్రాల ప్రజలపట్ల అన్యాయమే. పౌరసత్వంలో తేడా కల్పించడంవల్ల తర్కబద్ధంగా ఈ పరిణామం సంభవించి తీరవలసిందే. ఈ అన్యాయాన్ని నిరోధించడానికిగాను, భారతదేశపు

స్వదేశీ రాష్ట్రాలకు చెందిన పౌరులుకూడా, సమాఖ్య క్రింద సేవలు చేయడానికి అర్హులేనని ప్రకటించే అధికారాన్ని సెక్రటరీ ఆఫ్ స్టేట్స్‌కు అప్పగించారు. ఈ వ్యవహారం అంతా అత్యంత వైరుధ్యాలతో కూడుకుని ఉంది. దీని ఫలితంగా భారతీయ స్వదేశీ రాష్ట్రాల ప్రజలకు కలుగుతున్న అన్యాయాన్ని నిరోధించగలిగినప్పటికీ, భారత స్వదేశీ రాష్ట్రాలలో ఉద్యోగాలు చేసే అధికారాన్ని బ్రిటిష్ ఇండియా పౌరులకు నిరాకరించే పద్ధతి మాత్రం కొనసాగింది. బ్రిటిష్ ఇండియా పౌరులు, తమ క్రింద ఉద్యోగాలు చేయడానికి అర్హులు అని ప్రకటించవలసిన కర్తవ్యం భారత స్వదేశీ రాష్ట్రాలకు లేదు. సమాఖ్యగా రూపొందినప్పటికీ, ఇటువంటి వైరుధ్యం కొనసాగడమంటే, ఈ సమాఖ్య బూటకపు సమాఖ్యేనన్నమాట.

రెండవ అంశం 4వ షెడ్యూలు క్రింద శాసన మండలి సభ్యులు చేయవలసిన ప్రమాణాలకు సూచించిన షరతుల విషయంలో ఈ పౌరసత్వ తేడా స్పష్టమౌతున్నది.

బ్రిటిష్ ఇండియాలో పౌరుడైన వ్యక్తి విషయంలో చేయవలసిన ప్రమాణం నమూనా ఈ విధంగా ఉంటుంది:

"ఏ.బి... శాసన పరిషత్తు (లేదా శాసనసభ) సభ్యునిగా ఎన్నికైన (నామినేటు చేయబడిన/ నియమింపబడిన) అనే నేను రాజుగారున్నూ, భారతదేశానికి చక్రవర్తిగారున్నూ అయిన హిజ్ మేజిస్టీ పట్ల ఆయన వారసుల పట్ల, ఆయన ఉత్తరాధికారులపట్ల విశ్వాసాన్నీ వాస్తవికమైన విధేయతనూ ప్రకటిస్తూ నేను చేపట్టబోయే కర్తవ్యాన్ని విధేయుడనై నిర్వహించగలననీ పవిత్రంగా సత్యనిష్ఠతో ప్రమాణం చేసి చెపుతున్నాను."

భారతదేశపు స్వదేశీ రాష్ట్ర పాలకుని అధీనస్థ పౌరుల విషయంలో ప్రమాణం నమూనా ఈ విధంగా ఉంటుంది.

"ఏ,బి శాసన పరిషత్తు (శాసనసభ) సభ్యునిగా ఎన్నికైన (నామినేటు చేయబడిన/ నియమింపబడిన) నేను ఇందుమూలంగా పవిత్రంగా సత్యనిష్ఠతో ప్రకటన చేసే దేమంటే నాకు సి.డి.పట్ల వారి వారసులపట్లగల విశ్వాసము, విధేయతలతోబాటు, రాజుగారున్నూ, భారత దేశానికి చక్రవర్తిగారున్నూ అయిన హిజ్ మేజిస్టీకి కూడా విధేయునిగా ఉంటూ ఆయనపట్ల విశ్వాసాన్నీ విధేయతనూ వహించగలనన్నీ, నేను చేపట్టబోయే కర్తవ్యాన్ని విధేయుడనై నిర్వహించగలనన్నీ ప్రమాణం చేసి చెపుతున్నాను."

అంటే భారతీయ స్వదేశీ రాష్ట్రపౌరుడు, ఈపైన వివరించిన ప్రమాణం షరతులో స్పష్టంగా పేర్కొన్నట్లు, ద్వంద విధేయతను కలిగి ఉంటాడనేది స్పష్టమవుతున్నది. అతడు ఆ రాష్ట్రపాలకునిపట్లనే గాక, బ్రిటీష్ రాజుపట్లకూడా విధేయతను కలిగి ఉంటాడు. పైపైన పరిశీలిస్తే ఈ పరిస్థితి అమెరికాలో ఉండిన పరిస్థితిగానే కానవస్తుంది. అమెరికాలో ఉండే వ్యక్తి యూనియన్ ప్రభుత్వానికీ, రాష్ట్ర ప్రభుత్వానికి కూడా విధేయుడై ఉంటాడు. ఉభయశక్తులూ,

అతని విధేయతను పొందడానికై అతనికి ఆదేశాలు జారీ చేయవచ్చును. అయితే సంఘర్షణ ఉత్పన్నమైనప్పుడు ఈ విధేయత ఏ శక్తికి అనుకూలంగా పని చేస్తుందన్న ప్రశ్న వేసుకోండి. అప్పుడు రెండింటి మధ్యగల తేడా మీ ముందు ప్రత్యక్ష్యం అవుతుంది. ఈ సమస్య మీద బ్రైస్ అనే ఆయన వ్యాఖ్యానం ఈ విధంగా ఉన్నది:

"రాష్ట్రం పరిధిలో ఉండే వ్యవహారాలకు సంబంధించినంతవరకు విధేయతను పొందే రాష్ట్ర ప్రభుత్వాధికారం అత్యంత విస్తృతమైనది. రాష్ట్రానికి సంబంధించిన ప్రతి చట్టం, రాష్ట్ర ప్రభుత్వంలోని అధీకృతుడైన అధికారి జారీచేసే ప్రతి ఉత్తరువుకూ రాష్ట్రపౌరుడు ప్రాథమికంగా విధేయుడై ఉండాలి. జాతీయ ప్రభుత్వానికి, పరిమితమైన అధికారం మాత్రమే ఉంటుంది. కొన్ని నిర్దిష్ట ఉద్దేశాల నిమిత్తం లేదా కొన్ని నిర్దిష్ట విషయాలకు సంబంధించి మాత్రమే జాతీయ ప్రభుత్వం చట్టాలు చేయవచ్చు, లేదా ఉత్తరువులు జారీ చేయవచ్చు. అయితే తన అధికార పరిధిలో దాని అధికారాలు రాష్ట్ర అధికారాలకన్నా బలీయమైనవి, ఉన్నతమైనవి. రాష్ట్రాల పట్ల అవిధేయతను ప్రదర్శించవలసి వచ్చినాసరే, వాటిపట్ల పౌరుడు విధేయుడుగా ఉండి తీరవలసి ఉంటుంది."

"రాష్ట్ర శాసన మండలి చేసిన ఏదైనా చట్టం లేదా, రాష్ట్ర కార్యనిర్వహణాధికారులు చేపట్టిన ఏదైనా చర్య, రాజ్యాంగానికి భిన్నంగా ఉన్నట్లయితే, లేదా జాతీయ ప్రభుత్వం రాజ్యాంగాన్ని అనుసరించి చేసిన ఏదైనా చర్యకు భిన్నంగా ఉన్నట్లయితే, అది వాస్తవానికి రాష్ట్ర ప్రభుత్వపు చర్య కానేరదు; ఎందుకంటే అది రాజ్యాంగానికి భిన్నమైన చర్య చేపట్టడానికి అవకాశమే లేదు. ప్రభుత్వ పక్షాన ఆ చర్యను చేపడుతున్నామని పొరపాటుగా భావించే వ్యక్తుల చర్యలు వాటికవి, చట్టరీత్యా చెల్లనేరవు. రాష్ట్ర ప్రభుత్వ ఉత్తరువులను అనుసరించి వ్యవహరిస్తున్నామన్న భావనతో ఎవరన్నా సమాఖ్య అధికారాలను ఉల్లంఘించినట్లయితే, వారు సమాఖ్య ప్రభుత్వం మీద తిరుగుబాటు చేసినవారుగా పరిగణించబడి, దాని అధికారం ద్వారా లొంగదీయబడటానికి యోగ్యులవుతారు. అలాంటి తిరుగుబాటు దార్లను లొంగదీసే కార్యక్రమం రాష్ట్ర ప్రభుత్వానికి వ్యతిరేకంగా కాక, ఆపని చేసిన వ్యక్తులకు వ్యతిరేకంగా, వ్యక్తిపరంగానే కొనసాగుతుంది. వారు ఆ నేరాలను రాష్ట్రంతో కుమ్మక్కయి చేసినాసరే. రాష్ట్రం ఏదీ విడిపోవడానికి గానీ, తిరుగుబాటు చేయడానికి గానీ వీలులేదు. అలాగే దాన్ని లొంగదీయడానికీ అవకాశం లేదు."

విధేయత విషయంలో వైరుధ్యం ఏర్పడినప్పుడు, సమాఖ్య ప్రభుత్వం తీసుకోవడానికి అవకాశం ఉన్నటువంటి చర్యలను భారత సమాఖ్య ప్రభుత్వం తీసుకోగలుగుతుందా? తీసుకోజాలదు. అని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఎందుకంటే రాజుపట్ల విధేయత, ఆ రాష్ట్రపాలకునిపట్ల విధేయతను పాటిస్తూనే కొనసాగాలని ఉన్నది కనుక ఇది ప్రమాదకరమైన పరిస్థితి కాకపోయినా చాలా బాధాకరమైన పరిస్థితి.

5. సమాఖ్య చట్ట బలం

"ఏ దేశంలోనైనా సరే, మొత్తం జాతిపక్షాన, మొత్తం జాతిసమైక్య సంకల్పాన్ని ప్రతిబింబిస్తూ మాట్లాడగల ఒక ప్రభుత్వం ఉండటం అంటే సాధ్యమైనటువంటి స్థాయితో అత్యంత బలీయమైన ప్రభుత్వాన్ని కలిగి ఉండటమన్నమాట. అత్యవసర పరిస్థితి వచ్చినప్పుడు దేశాన్ని కాపాడగలిగేది బలీయమైన ప్రభుత్వమే. అట్టిదానిపైనే పౌరులు ఆధారపడి ఉండవచ్చు. ఒకే దేశంలో అనేక ప్రభుత్వాలు ఉనికిలో ఉన్నట్లయితే, అవి విభిన్న శక్తి కేంద్రాలుగా విలసిల్లేటట్లయితే, అవి విడివిడిగా రాజకీయ సంస్థలను రూపొందించుకొని, జాతి శక్తి విభిన్న విభాగాలు ఆయా రాజకీయ సంస్థలలో సమీకృతమవుతూవుంటే, కేంద్ర ప్రభుత్వ సంకల్పాన్ని నిరోధించగల వీటిశక్తి, వ్యక్తుల నిరోధ శక్తికన్నా అత్యంత బలీయంగా పరిణమించేటట్లయితే, ఈ రాజకీయ సంస్థలన్నింటికీ ప్రతిదానికీ ఒక ప్రభుత్వం, దాని ఆదాయ వనరులు, దాని సైన్యం స్థానిక ప్రాంతీయ భక్తితోడై సమైక్యపరిచేటట్లయితే అట్టి ప్రభుత్వ విధానం అత్యంత బలహీనమైన ప్రభుత్వ విధానంగా ఉండగలదనేది మొదట పేర్కొన్న వ్యవహారం. యూనిటరీ ప్రభుత్వాలుంటే సులభసాధ్యం అవుతుంది. సమాఖ్య పద్ధతి ప్రభుత్వాలున్నచోట రెండవసారి పేర్కొన్న పద్ధతి కొనసాగుతుంది.

భారతీయ సమాఖ్య, సమాఖ్య ప్రభుత్వం అయినందువల్ల సమాఖ్య ప్రభుత్వానికి ఉండే బలహీనతలన్నింటినీ పుణికి పుచ్చుకున్నది. అయితే ఇతర సమాఖ్యలకు లేనటువంటి, దీన్ని సంపూర్ణంగా నిర్వీర్యం చేయగలిగేటువంటి ఇతర లక్షణాలను కూడా కొన్నింటిని భారతీయ సమాఖ్య అదనంగా కొని తెచ్చుకున్నది. భారతీయ సమాఖ్యనూ, అమెరికా సమాఖ్యనూ పోల్చి చూద్దాం. 'బ్రైస్' అన్నట్లు "ప్రతి రాష్ట్రంలోని ప్రజలపైనా జాతీయ ప్రభుత్వ అధికారం ప్రత్యక్షమైనదీ, సత్వరమైనదీను. ఇది రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగం ద్వారా అమలయ్యేదికాదు. రాష్ట్ర ప్రభుత్వాల సహకారాన్ని వాంచించేదికూడా కాదు. చాలా విషయాల్లో జాతీయ ప్రభుత్వం రాష్ట్రాలను లెక్కలోనికి తీసుకోదు. పౌరులు తన చట్టాలపట్ల సమాన విధేయులేనని పరిగణిస్తుంది. సమాఖ్య న్యాయస్థానాలు రెవిన్యూ అధికారులు తపాలా కార్యాలయాలు, రాష్ట్ర ప్రభుత్వ అధికారుల నుండి ఎటువంటి సహాయం అర్థించరు. నేరుగా వాషింగ్టన్ పైనే ఆధారపడతారు.. సమాఖ్య వ్యవహారాలలో స్థానిక స్వపరిపాలన అనేది ఏమీలేదు.. అది కార్యనిర్వాహక పరమైనది గానీ, లేదా, న్యాయపరమైనది గానీ సమాఖ్య అధికారం, రాష్ట్రంలోని ప్రజలమీద, తమ స్వంత అధికార యంత్రాంగం ద్వారానే సాగుతుంది. వీరు రాష్ట్ర ప్రభుత్వ అధికారాలకు భిన్నంగా సంపూర్ణ స్వతంత్రులుగా ఉంటారు. ఉదాహరణకు సమాఖ్య విధించే పరోక్ష పన్నులు మొత్తం సముద్ర తీర ప్రాంతంలోనూ, దేశంమీదా, సమాఖ్య కస్టమ్స్ హౌసు కలెక్టర్ల ద్వారాను, వాషింగ్టన్ లోని ట్రెజరీశాఖ ఉత్తరువుల ప్రకారం నడుచుకునే ఎక్సయిజ్ మెన్ ల ద్వారాను వసూలు అవుతాయి. సమాఖ్య న్యాయస్థానాల ఉత్తరువులను యు.ఎస్. మార్షల్స్ ద్వారా అమలు పరుస్తారు. అదే విధంగా దేశమంతటా ఆ ఉత్తరువులను ప్రచారం చేయడం,

పంచి పెట్టడం అనే పనిని అసిస్టెంట్ల సిబ్బంది నిర్వహిస్తుంది. ఇది అత్యంత ప్రధానమైన ఏర్పాటు. దీని ద్వారా కేంద్ర ప్రభుత్వమైన జాతీయ ప్రభుత్వం దేశంలో పౌరులపై ప్రతిచోటా తన వేలు పెట్టుడానికి అవకాశం లభిస్తుంది. తన చట్టాలను, సక్రమంగా రూపొందిన తన అధికార వర్గాల ఉత్తరువులనూ ప్రజలందరూ పాటించేట్టు చూడటానికి వీలు ఏర్పడుతుంది. ఈ చట్టాలను లేదా ఉత్తరువులను ఎక్కడ అమలు జరుపుతున్నారో, ఆ ప్రాంతం పరిధికి వచ్చే రాష్ట్ర ప్రభుత్వం హృదయపూర్వకమైన విధేయత కలిగి ఉన్నా లేకపోయినా సరే, లేదా ఏ చట్టాన్నయితే అమలు చేయబోతున్నారో అది ప్రజాభిమానాన్ని చూరగొన్నదైనా సరే లేదా ప్రజా వ్యతిరేకమైనదైనా సరే, ఈ జాతీయ ప్రభుత్వ యంత్రాంగం నాడీ వ్యవస్థ మనిషి యావత్ శరీరంలోనూ వ్యాపించి ఉన్నట్టుగా దేశమంతటా వ్యాపించి ఉంటుంది. ప్రతి బిందువునుంచీ కేంద్ర కార్యనిర్వాహక వర్గానికి నేరుగా సంబంధం ఉంటుంది."

భారతీయ సమాఖ్య విషయంలో ఇందులో ఏ ఒక్కదాన్ని కూడా ముందుగా ఊహించి చెప్పడానికి వీలులేదు. అది ఆధారపడిన ప్రభుత్వం,/ప్రజలతో దాని సంబంధాలు ప్రత్యక్షమైనవి కావు.

అమెరికాలోని రాష్ట్రాలు, రాష్ట్రాలుగా కేంద్ర ప్రభుత్వంలో ఎటువంటి స్థానమూ కలిగి ఉండవు. సమాఖ్య శాసన మండలికి రాష్ట్రాలు తమ ప్రతినిధులను ఎన్నుకున్నప్పటికీ, కేంద్రంలో చేపట్టే రాజకీయ చర్య రాష్ట్రాల ద్వారా సాగదు. రాష్ట్రాల మధ్య కలయిక ద్వారా, రాష్ట్రాల గ్రూపులు ఏర్పడవు. తమ రాష్ట్రాల సంస్థల ద్వారా అధికార స్థాయిలో కలయికలు, గ్రూపులు రూపొందించుకునే ఆచారం రాష్ట్రాలకు లేదు. కాని భారతీయ సమాఖ్యను పరిశీలిస్తే మనకు పరిస్థితి ఎంతో భిన్నంగా కానవస్తుంది. రాష్ట్రాలకు రాష్ట్రాలుగా చట్టబద్ధమైన గుర్తింపు ప్రధాన ంచేశారు. చట్టాలనుంచి వాటికి కొన్ని మినహాయింపులను, అతీత వ్యవహారాన్ని చట్టబద్ధంగా కల్పించారు. భారతీయ సమాఖ్యకున్న శక్తి అతిస్వల్పమైనదన్న అభిప్రాయం కలగడానికి ఇది మరొక కారణం.

VI

## సమాఖ్య పథకం ప్రయోజనాలు

సమాఖ్య పథకాన్ని సమర్థిస్తున్నవారు, ఈ పథకాన్ని అంగీకరించడానికి మూడు ప్రధానమైన కారణాలను వివరించారు. మొదటిది, భారత దేశాన్ని సమైక్య పరచడానికి ఇది సహకరించగలదని. బ్రిటిష్ ఇండియా ప్రజలు, స్వదేశీ ఇండియా ప్రజలను ప్రభావితం చెయ్యడానికి, స్వదేశీ ఇండియాలో అమలులో ఉన్నటువంటి రాజరిక వ్యవస్థను క్రమంగా తుడిచిపెట్టి, ప్రజా స్వామ్య వ్యవస్థను స్వదేశీ ఇండియాలో నెలకొల్పడానికి వీలు కలుగుతుందనే తర్కం రెండవది. బాధ్యతాయుత ప్రభుత్వం అనే పద్ధతిని సమాఖ్య పథకం కలిగి ఉన్నదనేది

మూడవకారణం.

సమాఖ్య పథకానికి అనుకూలంగా అమూడు కారణాలను, చాలా చిత్తశుద్ధితో తర్కించడమేకాక. , తమతమ వాదనలకు అనుకూలంగా వారు చూపించిన ఆధారాలూ మహోన్నతమైనవే కనుక, ఈ వాదాలకు మూలమైన అంశాలను ఇక్కడ సంక్షిప్తంగా వివరించడం ఎంతైనా అవసరమని భావిస్తున్నాను.

## (1) సమాఖ్య–భారతదేశ సమైక్యత

ఉమ్మడి ప్రభుత్వ విధానం వల్ల కలిగే ప్రయోజనాలు నిజానికి చాలా వాస్తవికమైనవి. చట్టాలకు సంబంధించి ఉమ్మడి విధానం, పరిపాలనకు సంబంధించి ఉమ్మడి విధానం అందరమూ ఒక్కటేనన్న భావన ఉత్తమ జీవన విధానానికి అత్యావశ్యకమైనవి. ఉమ్మడి ప్రభుత్వ విధానం క్రింద వికసించిన సమాన జీవన పద్ధతి నుంచే అవన్నీ ఉత్పన్నమవుతాయి. మిగతా విషయాలు సమానంగా ఉన్నప్పుడు యావత్ భారతదేశానికి, సమాఖ్య పద్ధతి అనే ఉమ్మడి ప్రభుత్వ పద్ధతి హర్షించదగిన పద్ధతే. అయితే 1935 భారత ప్రభుత్వ చట్టం క్రింద భారత దేశం అని పిలువబడుతున్న మొత్తం భూభాగాన్ని ఒకే ఒక ప్రభుత్వ పద్ధతిక్రింద ఈ సమాఖ్య సమైక్య పరుస్తున్నదా? ఇది అఖిల భారత సమాఖ్యేనా?

ఈ సమాఖ్యలో బ్రిటిష్ ఇండియా ప్రాంతమంతా ఉన్నదనే విషయం యదార్థమే. రాష్ట్రాలన్నీ సమాఖ్య విభాగాలని ప్రకటించారంటే సమాఖ్యలో బ్రిటిష్ ఇండియా కలిసిందని అర్థం. సమాఖ్య విభాగాలుగా ప్రకటితమైన రాష్ట్రాలన్నీ స్వదేశీ భారతరాజ్యం (ఇండియన్ ఇండియా)తో ఒప్పందానికి రావలసి ఉన్నది. ఇండియన్ ఇండియా అనేది ఏదో ఒక చిన్న పాటి భూభాగంకాదు. ప్రదేశ విస్తీర్ణాన్నీ, జనాభా సంఖ్యనూ వివరించే ఈ దిగువ అంకెలను పరిశీలించినట్లయితే బ్రిటిష్ ఇండియా ప్రాంతాన్నీ- ఇండియన్ ఇండియా ప్రాంతాన్ని పోల్చి చూసుకోవచ్చు.

| | చ.మైళ్లలో విస్తీర్ణం (1931) | జనాభా (1931) |
|---|---|---|
| బర్మా, ఏడెనులను మినహాయించి బ్రిటిష్ ఇండియా | 8,62,630 | 2,56,859,787 |
| భారతదేశ స్వదేశీ సంస్థానాలు | 7,12,508 | 81,310,845 |

ఇండియన్ ఇండియా, మొత్తం భారతదేశంలో 39 శాతం జనాభా, 31 శాతం విస్తీర్ణం కలిగి ఉన్నదని దీని నుంచి గ్రహించవచ్చు.

ఈ స్వదేశీ భారతరాజ్యాన్ని (ఇండియన్ ఇండియాను) సమాఖ్య క్రిందికి ఏ మేరకు తేబోతున్నారు?

దీన్ని అఖిలభారత సమాఖ్య అని పేర్కొంటున్నాము కనుక, ఈ విస్తీర్ణంలోని అంగుళాన్ని సమాఖ్యలో చేర్చడం జరుగుతుందనీ, సమాఖ్య ప్రభుత్వాధీనంలో అది ఉండగలదనీ, ఎవరన్నా వాదించడానికి ముందుకుస సెక్షన్ సమాఖ్యలో విలీనానికి సంబంధించిన విభాగమైన 6(1) విభాగంలో ఉపయోగించిన పదాల ద్వారా అలాంటి అభిప్రాయం కలిగించవచ్చు. అదే కనుక నిజమైతే, సమాఖ్య, సమయం గడిచిన కొద్దీ అఖిలభారత సమాఖ్యగా రూపొంద గలదనడంలో సందేహం లేదు. అయితే ఈ అభిప్రాయం పొరపాటు అభిప్రాయం. 6(1)వ విభాగాన్ని ఆ చట్టపు Iవ షెడ్యూలుతో కలిపి చదివినట్లయితే అలాంటి అభిప్రాయం కలగడానికి వీలులేదు. పాలకులకు సీట్ల సంఖ్యను నిర్ధారించడానికి గాను ఈ షెడ్యూలును రూపొందించారు. ఇందులో ఆయా స్వదేశీ పాలకుల సీట్ల సంఖ్యను వివరించే ఒక పట్టిక ఉన్నది ఆ షెడ్యూలును చదివి ఆ మేరకు మాత్రమే అర్థం చేసుకుంటే, అది అసమగ్రమే అవుతుంది. ఆ షెడ్యూలు అంతకన్నా చాలా ఎక్కువ అర్థవంతమైనది. అందులో సీట్ల సంఖ్యను చూపించే జాబితాతోబాటు, సమాఖ్యలో చేరడానికి అర్హమైన రాష్ట్రాల పేర్లను కూడ పేర్కొన్నారు. సమాఖ్యలో విలీనంకాదలచుకున్నట్లయితే, విలీనం కాదగిన రాష్ట్రాల గరిష్ఠ సంఖ్యను ఇందులో పొందు పరిచారు. మరో మాటలో చెప్పాలంటే ప్రతి రాష్ట్రమూ సమాఖ్యలో విలీనం కావడానికి వీలు లేదన్నమాట. అందులో పేర్కొన్న రాష్ట్రాలు మాత్రమే విలీనం కావచ్చును. Iవ షెడ్యూలులో ఇచ్చిన సీట్ల పట్టికలోని విశిష్టత ఇదే.

సమాఖ్యలో విలీనం కావడానికి అర్హమైన మొత్తం రాష్ట్రాల సంఖ్య ఎంత? Iవ షెడ్యూలు ఈ సంఖ్యను 147కు పరిమితం చేస్తున్నది. షెడ్యూలు ద్వారా పరిమితిని నిర్ధారించడమైంది కనుక ఇక్కడ అనేకమైన ప్రశ్నలు ఉత్పన్నమవుతున్నాయి. అధికారిక అంకెల ప్రకారం భారత దేశంలోని స్వదేశీ సంస్థానాల సంఖ్య 627. అంటే 480 రాష్ట్రాలను సమాఖ్యకు బయటే అట్టిపెట్టాలనీ, సమాఖ్యలో ఇవి ఏనాడూ విలీనం కాజాలవని విధించారన్నమాట. దీన్ని అఖిలభారత సమాఖ్యలని పిలువవచ్చునా? అఖిల భారత సమాఖ్య కావాలనుకుంటే ఈ రాష్ట్రాలను ఎందుకని మినహాయించినట్లు? ఇలా మినహాయించిన రాష్ట్రాల పరిస్థితి ఏమిటి? అవి సర్వసత్తాక ప్రభుత్వాధికారం ఉన్న రాష్ట్రాలు కాకపోయినట్లయితే, సమాఖ్యలో విలీనం కావటానికి వాటిని ఎందుకు అనుమతించినట్లు? వాటికి సర్వసత్తాక ప్రభుత్వాధికారం లేక పోయినట్లయితే, బ్రిటిష్ రాజ్యాధికార వ్యవస్థకే ఆ సర్వసత్తాక ప్రభుత్వాధికారం ఉన్నట్లయితే, ఈ ప్రాంతాలకు సంబంధించినంతవరకు బ్రిటిష్ రాజ్యాధికార వ్యవస్థ, తన సర్వసత్తాక రాజ్యాధికారాన్నిసమాఖ్యకు అనుకూలంగా ఎందుకు వదులు కోలేదు? ఇలా మినహాయించిన రాష్ట్రాల అంతిమ భవితవ్యం ఏమిటి? ఇవి మరేవైనా భారతీయ స్వదేశీ రాష్ట్రాలలోగాని, లేదా ఇతర రాష్ట్రాలలోగాని విలీనం అవుతాయా? ఇవన్నీ నేనెందుకు ప్రస్తావిస్తున్నానంటే, ఈ సమాఖ్య అఖిల భారత సమాఖ్య కాదని చెప్పడం నా మొదటి కారణం. ఈ విధంగా మినహాయింపు పొందిన రాష్ట్రాలను కొన్ని దేశీయ సంస్థాన రాష్ట్రాలు తమలో విలీనం

చేసుకోవడానికి ప్రయత్నాలు మొదలుపెట్టిన విషయం మీ దృష్టికి తేవడం రెండవ కారణం.

రెండవప్రశ్నకూడా ఒకటి రావచ్చు. ఈ సమాఖ్య బ్రిటీష్ ఇండియా ప్రజలనూ, స్వదేశీ సంస్థానాల ప్రజలనూ సమైక్య పరిచి ఒకే జాతిగా రూపొందించగలుగుతుందా? అని.

సమాఖ్య అనేది విధిగా ఒక సమీకృత సంస్థ అయి తీరాలి. అందులో ఉండే విభాగాలు చిన్న చిన్నరాజకీయ సముదాయాలై ఉంటాయి. ఈ విభాగాలన్నింటిపైన ఉండే విశాలమైన, విస్తృతమైన రాజకీయ గణం వేరే సమాఖ్య. ఈ విభిన్నమైన రాజకీయ సముదాయం కేవలం రాజకీయ సంఘాలుగానే ఉంటాయా, లేక సామాన్యమైన సాంఘిక చట్రాన్ని అభివృద్ధి పరచుకొని చివరికి ఒక జాతిగా రూపొందుతాయా అనేది అవి ఏరకమైన సంఘాన్ని రూపొందించు కుంటాయన్న దాని మీద ఆధారపడి ఉంటుంది. బ్రైస్ అన్నట్లు :

"విస్తృతమైన రాజకీయ సముదాయాలలో అంతర్గతంగా చిన్న చిన్న సముదాయాలు ఉండేట్లయితే, విస్తృతమైనదానికీ, చిన్నపాటి దానికీ మధ్య సంబంధం ఈ దిగువ పేర్కొన్న రెండు రూపాల్లో ఏదో ఒక రూపంలో ఉంటుంది. ఒక రూపాన్ని 'లీగ్' పద్ధతి అంటారు. ఆ పద్ధతిలో విభిన్న రాజకీయ గణాలు అవి రాజరిక వ్యవస్థకు చెందినట్టివిగానీ, లేదా, రిపబ్లిక్ లేదా ప్రజాస్వామిక వ్యవస్థకు చెందినట్టివిగానీ, కొన్ని స్పష్టమైన ఆశయాల సాధన నిమిత్తం కట్టుబడి ఉంటాయి. ఈ ఆశయాలలో ప్రధానమైనది ఉమ్మడి రక్షణ. ఇలా కట్టుబడిన దేశాలన్నీ, ఒకే సంస్థగా ఒకే విధమైన సామాన్య రక్షణ యంత్రాంగాన్ని కలిగి ఉంటాయి. అటువంటి సమీకృత సంస్థ లేదా లీగ్‌లో సభ్యత్వం స్వీకరించేవి స్వతంత్ర వ్యక్తులుకాదు. సవముదాయాలు లేదా జాతులు. జాతులు సమామ్నాయంగా ఇది కొనసాగుతుంది. అందులో భాగస్వాములైన జాతులు పరస్పరం విడిపోయిన మరుక్షణం అది రద్దయిపోతుంది. వ్యక్తిగత స్థాయిలో పౌరులతో దానికి ఎటువంటి సంబంధమూ ఉండదు. పౌరుని మీద పన్ను విధించే అధికారంగానీ, అతనిని గురించి న్యాయస్థానం స్థాయి తీర్పు చెప్పే అధికారంగానీ, అతని కోసం చట్టాలు చేసే అధికారంగానీ ఈ సమామ్నాయానికి ఉండదు. ఈ అన్ని విషయాలలోనూ, పౌరుని విధేయత జాతికే ఉంటుంది.

"రెండవరూపంలో చిన్నచిన్న సముదాయాలనీ మనం దేశం అని వ్యవహరించే విస్తృతమైన పెద్ద దానిలోని ఉపవిభాగాలుగా మాత్రమే ఉంటాయి. సముదాయాన్ని 'జాతి' అని వ్యవహరిస్తారు. కేవలం పరిపాలనావసరాల నిమిత్తం వాటిని రూపొందించడం లేదా అవి తమ ఉనికి కొనసాగించుకోవడం జరుగుతుంది. దేశం దత్తం చేసినటువంటి అధికారాలను మాత్రమే అవి కలిగి ఉంటాయి. దేశం సంకల్పిస్తే ఆ అధికారాలను అధిగమించనూవచ్చు. దేశం తన కార్య కలాపాలను నేరుగా తన అధికార యంత్రాంగం ద్వారా అమలు జరుపుతుంది. ఈ కార్యకలాపాల అమలు కేవలం సముదాయాలపైన మాత్రమే కాక, ప్రతి వ్యక్తిపైన, ప్రతి పౌరుని పైనకూడా కొనసాగుతుంది. ఎందుకంటే జాతి అనేది ఆయా సముదాయాలకు భిన్నమైనదీ, స్వతంత్రమైనదీ

అయినందువల్ల. అందులోని సముదాయాలన్నీ అంతరించిపోయినప్పటికీ కూడా ఇది కొనసాగుతూనే ఉంటుంది కనుక..."

మొదట ప్రస్తావించిన పద్ధతిలో ప్రభుత్వ విధానం సంధి సంబద్ధ రాజ్యకూటమిగా ఉంటుంది. తదుపరి ప్రస్తావించిన విధానం యూనిటరీ ప్రభుత్వ విధానం. సమాఖ్య ప్రభుత్వం పద్ధతి ఈ రెండింటికీ మధ్యేమార్గం. అయితే కేవలం యూనిటరీ పద్ధతి ప్రభుత్వ విధానంలోనే జాతీయత అనేది పొసగుతుందనీ, సమాఖ్య ప్రభుత్వ విధానానికీ, జాతీయతకూ పొసగదనీ భావించకూడదు. ఒకజాతిని దానకది అస్తిత్వంలో ఉండగా గుర్తించనూవచ్చు. ఒక జాతిని రూపొందించి అభివృద్ధి పరచనూ వచ్చునన్నది కూడా మనం గుర్తుంచుకోవాలి. సమాఖ్య పద్ధతి ప్రభుత్వం మొదట 'జాతి' అంటూ ఏదీ లేకుండానే ప్రారంభంకావచ్చు. విభిన్న వైరుధ్యాలతో ఉండే సముదాయాల సమామ్నాయంగానే సమాఖ్య రూపొందవచ్చు. అయితే సమాఖ్య పద్ధతి ప్రభుత్వ విధానంలో కూడా చివరికి ఒక జాతిని రూపొందించుకొనవచ్చు. అమెరికా విషయం, ఈ సందర్భంగా అత్యంత మహోన్నతమైన ఉదాహరణగా నిలుస్తుంది. బ్రైస్ ఒక కథ చెప్పారు ఆ కథ చాలా ఆసక్తి కరంగా ఉండటమేకాక అనేక విషయాలను బోధిస్తూ ఉన్నది కూడాను ఆ కథ ఇది ఆయన పదాల్లోనే దాన్ని ఇక్కడ వివరిస్తాను "కొన్ని సంవత్సరాల క్రితం అమెరికాలోని ప్రాట్‌స్టెంట్ ఎప్పిస్కోపల్ చర్చివారు త్రైవార్షిక సమావేశం జరుపుకుంటున్నారు. తమ బజన గీతాల గ్రంథాన్ని సవరించే కార్యక్రమంలో తలమునకలౌతున్నారు. ఏవత్ ప్రజానీకానికి సంబందించి ఒక ప్రార్థనా వ్యాక్యాన్ని చిన్న చిన్న వాక్యాలలో చేర్చా లని సంకల్పించారు. ఇంగ్లాడుకి చెందిన ఒక ప్రముఖ నూతన దైవ భక్తుడు ఈ పదాలను ప్రతిపాదించాడు. "ఓ లార్డ్! బ్లెస్ అవర్‌నేషన్" (ఓ భగవంతుడా మా జాతిని దీవించు) అని ఒక మధ్యాహ్నం పూట, సద్యః స్ఫూర్తితో ఆమోదించినటువంటి వాక్యం మరునాడు పునర్విచారణలో మళ్లీ చర్చకు వచ్చింది. "జాతి" అన్నపదం పట్ల అనేక మంది సభ్యులు అనేక రకాల అభ్యంతరాలు చెప్పారు. విస్పష్టంగా జాతీయసమైక్యత ఉన్నట్లుగా ఆ వాక్యం అర్థం వస్తున్నది ఆ పదాలకు బదులు 'ఓలార్డ్! బ్లెస్ ది యునైటెడ్ స్టేట్స్" ( ఓ భగవంత అమెరికా సంయుక్త రాష్ట్రాలను దీవించు) అని ప్రార్థనను మార్చారు. ఈ భగవత్ ప్రార్థన ఎలా ఉన్నప్పటికీ, రాష్ట్రాలు అన్న భావనను అధిగమించి, ఆ భావనకు వ్యతిరేకంగా 'జాతి' అనే భావనను పరివ్యాప్తం చెయ్యాలన్న సంకల్పం పట్ల అరమరికలు ఉన్నప్పటికీ, సమాఖ్య పద్ధతి ప్రభుత్వ విధానం కొనసాగుతున్నప్పటికీ అమెరికా ఒక జాతి. ఈ పదం యొక్క సామాజిక అర్థంలో కూడా అది ఒక జాతి అనేది నిస్సందేహమైన అంశం.

అమెరికాలో ఇది ఎలా సంభవించింది? సమాఖ్య పథకం క్రింద భారత దేశంలో కూడా ఇలాంటిది సంభవించడాన్ని చూడగలమని మనం ఆశించవచ్చునా? అమెరికాలో ఇది ఎలా సంభవించిందో బ్రైస్ ఇలా వివరించారు. "అమెరికాలో కేంద్ర, లేదా జాతీయ ప్రభుత్వం

కేవలం లీగ్ పద్ధతిలో రూపొందినట్టిది కాదు" అని బ్రైస్ పేర్కొన్నారు. రాష్ట్రాలు అని వేటినైతే మనం అంటున్నామో, అట్టి విలీనమైన విభాగాల మీద అది ఆధారపడి ఉండదు. అది దానికదిగా ఒక 'కామన్ వెల్తు' వంటిదీ; కొన్ని కామన్ వెల్తుల సంఘీభూత వ్యవస్థ వంటిదీను. ప్రతిపౌరుని విధేయతనూ అది నేరుగా వాంఛిస్తున్నది. తన స్వీయన్యాయస్థానాల ద్వారాను, కార్యనిర్వాహక అధికారుల ద్వారాను పౌరులపై నేరుగా పెత్తనం చెలాయిస్తుంది. అతని మీద పన్ను విధించే అధికారం, అతనికోసమని చట్టాలు చేసే అధికారం, అతని పనులమీద న్యాయస్థానాల ద్వారా తీర్పులు చెప్పే అధికారం దానికున్నది. అమెరికా ప్రజలను ఒక జాతిగా తీర్చిదిద్దే బాధ్యతను పూర్తిగా కాకపోయినా చాలావరకు వహించే ప్రభుత్వ ప్రక్రియ అది. అమెరికాలో సమాఖ్య పద్ధతి ప్రభుత్వ విధానంలో జాతీయ ప్రభుత్వానికీ వ్యక్తులకూ నేరుగా సంబంధాలున్నందువల్ల ఇది సాధ్యమైంది.

భారత సమాఖ్య పథకం క్రింద ఇది సాధ్య పడుతుందా? సాధ్యపడదనేనా సమాధానం. భారత స్వదేశీ రాష్ట్రాలప్రజలు తమ తమ రాష్ట్రాల ప్రజలుగానే కొనసాగుతారు. సమాఖ్య ప్రభుత్వం వారితో నేరుగా వ్యవహరించడం సాధ్యపడదు. ప్రతిదీ రాష్ట్రం ద్వారా జరిపించవలసిందే. ఉభయులమధ్య(అంటే పౌరునికీ- జాతీయ ప్రభుత్వానికీ మధ్య నేరుగా సంబంధాలు లేవు. కనీసం పన్ను విధింపు విషయంలో కూడా జాతీయ ప్రభుత్వానికి పౌరుని పైన ప్రత్యక్షాధికారం లేదు. జాతీయ ప్రభుత్వానికి సంబంధించిన అన్నిరకాల ప్రభావాలనుంచీ, ప్రతీ పరిణామం నుంచీ, భారత దేశంలోని స్వదేశీ రాష్ట్రాల ప్రజలను దూరంగా ఉంచినప్పుడు, జాతీయ ప్రభుత్వం అనేది ఒకటి ఉన్నదన్న భావనసైతం వారికి కలగడానికి అవకాశం లేనప్పుడు ఆ ప్రజలకు, తాము జాతీయ ప్రభుత్వానికి చెందిన వారమన్న భావనను కల్గించడం ఎలా సాధ్యం? భారతదేశపు ఈ సంయుక్త రాష్ట్రాల వ్యవస్థ అమెరికాలోని సంయుక్త రాష్ట్రాల వ్యవస్థకన్నా అధిగమించినట్టిది కాబోదని నేను భావిస్తున్నాను. ఈ రాష్ట్రాల సమీకరణలోనుంచి ఒక జాతిని రూపొందించగల సామర్థ్యం దీనికి లేదని నా సందేహం. ఈ పథకాన్ని రూపొందించిన వారికి కూడా బహుశా అలాంటి సంకల్పం కూడా లేదేమో?

## 2. రాజరిక వ్యవస్థలను ప్రజాస్వామికం చేయడం.

ఈ సమాఖ్య పథకానికి అనుకూలంగా వాదించేవారు, దీనివల్ల ఒనగూరే ప్రయోజనం అంటూ చూపిస్తున్న మరో అంశం – బ్రిటిష్ ఇండియా ప్రాంతంలోని నూతన ప్రజాస్వామిక వ్యవస్థనూ భారతీయ స్వదేశీ రాష్ట్రాలలో అమలులో ఉన్నటువంటి అతి పురాతనమైన రాజరిక వ్యవస్థలనూ ఈ ఉభయ పద్ధతులనూ ఏకీకృత రాజకీయ సౌధం పునాదుల్లో ఒకే నీడక్రిందికి తీసుకొని రావడం. దీనివల్ల ప్రజాస్వామ్య వ్యవస్థకూ పురాతన రాజరిక వ్యవస్థకూ మధ్య సత్సంబంధాలు పెంపొందుతాయనీ, తద్వారా, భారతీయ స్వదేశీ రాష్ట్రాలలోని రాజరిక వ్యవస్థలను ప్రభావితం చేసి, వాటిని ప్రజాస్వామికం చేయగల సామర్థ్యాన్ని బ్రిటిష్ ఇండియాలోని

నూతన ప్రజాస్వామ్య వ్యవస్థలకు కలుగజేయవచ్చుననీ వారంటారు. ఈ తర్కాన్ని పరిశీలించేముందు, ఈ తర్కానికి గల బలమెంతో అంచనా వేయడానికి ముందు, భారతదేశపు స్వదేశీ రాష్ట్రాలూ, బ్రిటిష్ ఇండియా రాష్ట్రాలూ భౌగోళికంగా ప్రక్క ప్రక్కనే పొరుగు రాష్ట్రాలుగా ఉంటున్నాయనే అంశాన్ని గుర్తించాలి. ఉభయ ప్రజల మధ్య తరచుగా రాకపోకలూ సంబంధ బాంధవ్యాలూ ఉంటాయి. బ్రిటిష్ ఇండియా ప్రాంత ప్రజలు, భారత స్వదేశీ రాష్ట్రాల ప్రజలు జాతిపరంగా, భాషా పరంగా సంస్కృతి పరంగా ఒకే సంపూర్ణ సమామ్నాయంలోని అంతర్గత విభాగాలు. అయితే ఈ సంబంధ బాంధవ్యాలుగాని, జాతిపరమైన ఈ సమైక్యతగాని, మతం, భాష, సంస్కృతులకు సంబంధించిన సమైక్యతగానీ, భారతీయ స్వదేశీ రాష్ట్రాలలోని ప్రభుత్వాధికార పద్ధతులనుగానీ, రాజరిక సంప్రదాయాలను గానీ ప్రభావితం చేయగలిగే విధంగా బ్రిటిష్ ఇండియా ప్రజలకు శక్తి సామర్థ్యాలను ప్రధానం చేయగలిగిందా? మరోవైపు బిటిష ఇండియా ప్రజలు, రాజరిక వ్యవస్థనుండి ప్రజాస్వామ్య వ్యవస్థవైపునకు పురోగమించగా, స్వదేశీ రాష్ట్రాలు ఎక్కడవేసిన గొంగళి అక్కడే అన్నట్లు, తమ రాజరిక వ్యవస్థా పద్ధతి నుండి ఒక అడుగుకూడా ముందుకు సాగలేదు. అందువల్ల, స్వదేశీ రాష్ట్రాలను బ్రిటిష్ ఇండియా ప్రజలు ప్రభావితం చేయగలవిధంగా, చట్టంలోనే ఏవైనా ప్రత్యేకమైన నిబంధనలుండాలి. ఈ నిబంధనలు, శాసన మండలుల ద్వారా, లేదా కార్యనిర్వాహణాధికార వర్గం ద్వారా స్వదేశీ రాష్ట్రాలను ప్రభావితం చేయడానికి అవకాశం కల్గించనంతవరకు ఈ తర్కంలో ఎటువంటి బలమూ ఉండబోదు. స్వదేశీ రాష్ట్రాలను ప్రభావితం చేయగల అధికారాన్ని బ్రిటిష్ ఇండియా ప్రజలకు కలిగించే నిబంధనలేవైనా చట్టంలో ఉన్నాయా? ఈ సందర్భంగా 34(1)వ విభాగాన్ని పరిశీలించవచ్చు. శాసన మండలిలో బడ్జెటు అంచనాలపై చర్చించే పద్ధతినీ, బడ్జెటు అంచనాలను ఆమోదించే పద్ధతినీ ఈ విభాగం వివరిస్తున్నది.

ఈ విభాగాన్ని పరిశీలించినప్పుడు స్పష్టంగా తేలే అంశం ఏమిటంటే- 33వ విభాగం (3)వ ఉప-విభాగంలోని పేరా (ఎ), పేరా(ఎఫ్)లో పేర్కొన్న అంశాలకు సంబంధించిన అంచనాలను సమాఖ్య శాసనమండలిలో సైతం చర్చించడానికి అవకాశం లేదు. ఉప-విభాగం (3)లోని (ఎ) పేరా గవర్నర్ జనరల్ వేతనం అలవెన్సులు ఆయన కార్యాలయానికి సంబంధించి జరిగే ఇతర ఖర్చులకు సంబంధించినది. ఈ అంచనాలను కౌన్సిల్ లో ఉత్తరువుల ద్వారా ఆమోదించవలసి ఉంటుంది. పేరా(ఎఫ్), చట్టం క్రింద హిజ్ మెజెస్టీకి చెల్లించవలసిన దానికి సంబంధించినది. భారత స్వదేశీ రాష్ట్రాలకు సంబంధించి రాజరిక (క్రౌన్) విధులను నిర్వహించినందుకు గాను సమాఖ్య ఆదాయాల నుంచి ఈ మొత్తాన్ని చెల్లించవలసి ఉంటుంది. ఈ అంశం గురించిన మరొక విభాగం 38వ విభాగం 38వ విభాగం.ఈ సమాఖ్య శానమండలి తన వ్యవహారాల నిర్వహణ నిమిత్తం,పద్ధతులనూ నియమాలను రూపొందించుకోడానికి సంబంధించినది తమ వ్యవహారాలకు సంబంధించిన నియమ నిబంధనలనురూపొందించుకునే అధికారాన్ని ఈ విభాగం సమాఖ్య శాసన మండలికి అప్పగిస్తూనే ఈ దిగువ విషయాలపై

నియమ నిబంధనలు చేయటానికి గవర్నర్ జనరల్‌ను అనుమతిస్తున్నది.

(సి) ఏదైనా భారత స్వదేశీ రాష్ట్రానికి సంబంధించిన ఏదన్నా విషయానికి సంబంధించిన చర్చను లేదా ప్రశ్న అడగడాన్ని నిషేధించటం. అయితే ఆ విషయం, ఆ రాష్ట్రానికి సంబంధించి సమాఖ్య శాసనమండలి చట్టం చేసే అధికార పరిధిలో ఉన్నట్లయితే ఆ విషయం సమాఖ్య ప్రయోజనాలకు లేదా బ్రిటిష్ ప్రజల ప్రయోజనాలకు భంగకరంకాదని గవర్నర్ జనరల్ సంతృప్తి చెందినట్లయితే, ఆ విషయాన్ని చర్చించడానికి లేదా ఆ విషయాన్ని గురించి ప్రశ్నవేయడానికి గాని ముందుగానే అనుమతిస్తే పైన పేర్కొన్న నిషేధం వర్తించదు.

(డి) ఈ దిగువ అంశాలను నిషేధించేందుకు–

1. ఏదైనా విదేశీ రాష్ట్రానికి లేదా విదేశీ రాజుకూ, హిజ్‌మేజిస్ట్రేట్ లేదా గవర్నర్ జనరల్‌కూ గల సంబంధాలకు అంశాన్ని గురించి చర్చించడాన్నీ లేదా ప్రశ్న అడగడాన్నీ; లేదా

2. వ్యయం అంచనాలకు సంబంధించి కాకుండా ఏదైనా గిరిజన ప్రాంతం లేదా మినహాయించిన ప్రాంతపు పరిపాలనా వ్యవహారాలకు సంబంధించి చర్చించడాన్ని లేదా ప్రశ్న అడగడాన్నీ; లేదా

3. భారతదేశంలో స్వదేశీ రాష్ట్రాల పాలకుల లేదా ఆ పాలకుల కుటుంబ సభ్యుల వ్యక్తిగత ప్రవర్తనను గురించిఏదైనా చర్చచేయడానీ, లేదా ప్రశ్నలడగడానీ.

అంతేకాదు, ఈ విభాగంలో ఇంకా ఇలా ఉన్నది. గవర్నర్ జనరల్ రూపొందించిన ఇటువంటి నియమావళిలోని ఏదైనా నియమానికి ఛేంబరు రూపొందించిన ఏదైనా నియమం లేదా నియమాలకు పొంతన కుదరక పోయినట్లయితే గవర్నర్ జనరల్ చేసిన నియమాలే చెల్లుబాటవుతాయి.

ఈ అంశం గురించిన మరొక విభాగం 40వ విభాగం, అందులో ఇలా ఉన్నది.

"ఏదైనా ఫెడరల్ న్యాయస్థానం, లేదా ఉన్నతన్యాయ స్థానానికి చెందిన న్యాయమూర్తి తమ విధులను నిర్వహించడంలో పాటించిన ప్రవర్తనను గురించి ఫెడరల్ శాసనమండలిలో ఎలాంటి చర్చ జరగడానికీ వీలులేదు." ఈ విభాగంలో మరో ఏర్పాటు కూడా ఉన్నది. "ఈ ఉప-విభాగంలో 'హైకోర్టు' గురించి వచ్చిన ప్రస్తావనలో, సమాఖ్యలో విలీ... న స్వదేశీ రాష్ట్రం విషయంలో, ఈ చట్టంలోని 9వ భాగపు ప్రయోజనాల నిమిత్తం హైకోర్టుగా వ్యవహరిస్తున్న న్యాయస్థానం ఏదైనా చేరుతుంది." చట్టంలోని రాష్ట్రాల శాసన మండళ్ల నిర్మాణం గురించి నిబంధనలు ఉన్న భాగంలో ఇలాంటి నిబంధనలు మరికొన్ని కూడా ఉన్నాయి. 38 విభాగానికి 84వ విభాగం అనుసరణ, స్వదేశీ రాష్ట్రానికి సంబంధించిన పాలకుని

వ్యక్తిగత ప్రవర్తన గురించిగానీ, ఆ స్వదేశీ రాష్ట్ర వ్యవహారాలను గురించి ఏ రాష్ట్ర శాసన మండలి సభ్యుడు కూడా ప్రశ్న వేయరాదని నిషేధిస్తున్నది. సెక్షన్ 86, సెక్షన్ 40కి ప్రతిరూపు.

పరిపాలనా పద్ధతులను ప్రభావితం చెయ్యడానికి శాసనమండలికి ఉన్నటువంటి రెండు అత్యంత ప్రధానమైన మార్గాలలో ఒకటి బడ్జెటును గురించిన చర్చ అనీ, రెండవది ప్రశ్న అడగడం అనీ స్పష్టమౌతున్నది. ప్రజల ఇబ్బందులను పరిష్కరిస్తే తప్ప కార్యనిర్వాహక వర్గానికి ఎలాంటి సరఫరాలూ చెయ్యరాదనే మౌలిక సూత్రాన్ననుసరించి, బడ్జెటుపైన చర్చలు జరుగుతాయి. మొదట ప్రజల ఇబ్బందులను పరిష్కరించండి, ఆ తర్వాతే మీకు డబ్బు సరఫరా అన్నది ప్రజాస్వామ్య నినాదం. ప్రజల ఇబ్బందులను కార్యనిర్వాహక వర్గం దృష్టికి తెచ్చే ఒక అవకాశం బడ్జెటు అంచనాలపై చర్చ. అందువల్ల ఈ హక్కు చాలావరకు న్యాయమైన, చెల్లుబాటైన హక్కు. 34వ విభాగంద్వారా సభలో, ఆయా స్వదేశీ సంస్థానాల ప్రజల ఇబ్బందులను కార్యనిర్వాహక వర్గం దృష్టికి తీసుకు వచ్చే ఈ అవకాశాన్ని తొలగించడమైనదని స్పష్టం అవుతున్నది. అదే విధంగా ప్రశ్నించేహక్కు, ప్రశ్నలు వేయడం ద్వారా నిలదీసే హక్కు కూడా అత్యంత న్యాయోచితమైన హక్కులే. దాన్ని కూడా నిరాకరించారు. సరైన తీర్మాన ప్రతిపాదన ద్వారా న్యాయస్థానాల ప్రవర్తనను విమర్శించే హక్కు శాసనమండలులకు సర్వదా ఉండేహక్కు. దాన్ని కూడా మినహాయించారు. ఈ పరిస్థితులలో భారతదేశపు దేశీయ రాష్ట్రాల అంతర్గత పరిపాలనా పద్ధతులను సమాఖ్య శాసనమండలి ఏ విధంగా ప్రభావితం చేయగలుగుతుందో స్పష్టంగా ఊహించడం కష్టసాధ్యమైన విషయం. స్వదేశీ రాష్ట్రాల అంతర్గత పరిపాలనా వ్యవహారాలను గురించి ప్రశ్నలడగడాన్ని లేదా ఏదన్నా తీర్మానం ప్రతిపాదించడం ద్వారా ఏదైనా అంశాన్ని చర్చకు పెట్టడానికి, బ్రిటిష్ ఇండియాకు చెందిన ప్రజా ప్రతినిధులను నిరోధించడం మాత్రమే కాదు. ఈ అక్రమ పరిపాలన వల్ల ఇబ్బంధులను ఎదుర్కొనే ఆయా రాష్ట్రాల ప్రజా ప్రతినిధులను సైతం నిరోధించారు.

సమాఖ్యలో విలీనమయ్యే స్వదేశీ రాష్ట్రాలు బ్రిటిష్ ఇండియా ప్రజలను ప్రభావితం చేయగల అవకాశాలతో దీన్ని పోల్చిచూద్దాం.

సమాఖ్య శాసన మండలిలో ఏదైనా అంశాన్ని ప్రస్తావించే విషయంలోగాని, ఏదైనా విషయం గురించి ప్రశ్న అడిగే విషయంలోగాని, సమాఖ్యలో విలీనమైన స్వదేశీ రాష్ట్రాల ప్రజా ప్రతినిధులకు ఎటువంటి విధి నిషేధాలు లేవనేది మొదటి అంశం. అట్టి ప్రశ్న లేదా అట్టి విషయం బ్రిటిష్ ఇండియాకు సంబంధించి ఉన్నప్పటికీ, లేదా బ్రిటిష్ ఇండియా రాష్ట్రాల ఆంతరంగిక పరిపాలనకు సంబంధించి ఉన్నప్పటికీ, ఇలాంటి విషయాన్ని ప్రస్తావించే విషయంలో సమాఖ్యలో విలీనమైన స్వదేశీ రాష్ట్రాల ప్రజా ప్రతినిధులపైన ఎటువంటి నిర్బంధాలూ లేవు. ఇది మొదటి అంశం.

ఇక రెండవ అంశం. సమాఖ్య ప్రభుత్వపు ఆర్థిక ప్రతిపాదనల గురించి చర్చించే విషయంలోగాని, ఓటు చేసే విషయంలో గాని, సమాఖ్యలో విలీనమైన స్వదేశీ రాష్ట్రాల ప్రతినిధులకు ఎటువంటి నిర్బంధాలూ నిషేధాలూ లేవు. అటువంటి ప్రతిపాదనల ప్రభావం కేవలం బ్రిటిష్ ఇండియా వరకే పరిమితం. స్వదేశీ రాష్ట్రాలమీద వాటి ప్రభావం ఉండబోదన్న విషయం కూడా వారి దారికి చట్టరీత్యా ఏ విధంగానూ అడ్డుపడదు.

ఇక మూడవ అంశం. చట్టాలను రూపొందించే విషయానికి వచ్చినప్పుడు, సమాఖ్య శాసనమండలి ముందుకు వచ్చిన ఏ చర్య విషయంలోనైనా సరే, సమాఖ్యలో విలీనమైన స్వదేశీ రాష్ట్రాల ప్రతినిధులు స్వేచ్ఛగా ఓటు చేయవచ్చును. సమాఖ్య యొక్క శాసన నిర్మాణాధికారం విస్తరించేవి రెండు జాబితాలున్నాయి. ఒకటి సమాఖ్య జాబితా. మరొకటి ఉమ్మడి జాబితా. సమాఖ్య జాబితాకు రాష్ట్రాలన్నీ విధిగా కట్టుబడి ఉండాలి. అయితే సమాఖ్యలో విలీనమైన స్వదేశీ రాష్ట్రం మాత్రం ఇలా కట్టుబడి ఉండవలసిన పనిలేదు. అలాగే ఉమ్మడిజాబితా విషయంలో కూడా అన్ని రాష్ట్రాలూ విధిగా కట్టుబడి ఉండాలి. కాని సమాఖ్యలో విలీనమైన స్వదేశీ రాష్ట్రాలు అలా కట్టువడి ఉండనవసరంలేదు. అయినప్పటికీ స్వదేశీ రాష్ట్రాల ప్రతినిధులు ఈ ఉభయ జాబితాలకు సంబంధించినటువంటి ఏ చర్చ విషయంలోనైనా సరే స్వేచ్ఛగా ఓటు చేయవచ్చు. మరో మాటలో చెప్పాలంటే బ్రిటిష్ ఇండియా ప్రజలమీద ప్రభావం కలుగజేసే ఏ చట్టాన్నయినా చేసే అధికారం స్వదేశీ రాష్ట్రాల ప్రతినిధులకు ఉంటుంది కాని, స్వదేశీ రాష్ట్రాలకు సంబంధించి, ఈ ఉభయ జాబితాలలో ఉన్న విషయాలకు సంబంధించినంతవరకు, చట్టాన్ని చేసే అధికారం, స్వదేశీ రాష్ట్రాలు తమకైతాము ఆ అధికారాన్ని సమాఖ్య శాసనమండలికి దత్తం చేస్తే తప్ప, బ్రిటిష్ ఇండియా ప్రజా ప్రతినిధులకు ఉండదన్నమాట. ఇదీ మన సమాఖ్య రూపకల్పన విధానం.

చట్టాలు రూపొందించడం ద్వారా బ్రిటిష్ ఇండియాను స్వదేశీ రాష్ట్రాలు ప్రభావితం చేయడమనేది స్వల్పమైన విషయంగానీ, అంతగా పట్టించుకోనవసరం లేని విషయంగానీ కాదు. కేవలం ఉమ్మడి జాబితా వరకే పరిమితమై పరిశీలించినప్పటికీ అందులో 36 అంశాలున్నాయి. ఈ 36 విషయాల్లో, క్రిమినల్ చట్టాలు, క్రిమినల్, సివిల్ ప్రొసీజర్లు, వృత్తులు, వార్తాపత్రికలు, పుస్తకాలు, ముద్రణాయంత్రాల వంటి అనేక ప్రధానమైన విషయాలున్నాయి. ఈ విషయాలన్నీ కీలకమైనవనడంలో సందేహం లేదు. రాష్ట్రాలలో ప్రజల ప్రాథమిక హక్కుల మీద వీటి ప్రభావం ఉంటుంది. ఉమ్మడి జాబితాలో ఉన్నట్టు అన్ని విషయాలలో కూడా స్వదేశీ రాష్ట్రాల ప్రతినిధులు చర్చలలో పాల్గొనడానికీ, ఓటింగ్‌లో పాల్గొనడానికీ అవకాశం ఉన్నందువల్ల, బ్రిటిష్ ఇండియా రాష్ట్రాలలోని ప్రజల హక్కులను, స్వేచ్ఛలనూ, ప్రయోజనాలనూ ప్రభావితం చేయగల చట్టాలను రూపొందించడానికి స్వదేశీ రాష్ట్రాల ప్రతినిధులకు సంపూర్ణమైన హక్కులూ, అధికారాలూ ఉన్నాయి.

అంతేకాదు, శాసన నిర్మాణ రంగంలో, ఉమ్మడి జాబితాలోని విషయాలకు సంబంధించినంతవరకు స్వదేశీ రాష్ట్రాలు, ఎటువంటి బాధ్యతలూ లేకుండానే అధికారాలను సంపాదించు కున్నాయి. శాసనాలను రూపొందించే స్వేచ్ఛ వారికున్నది. అలా చేస్తున్నప్పుడు తమ స్వీయ వ్యవహారాన్ని గురించి వారు పరిశీలించుకో నవసరంలేదు. తాము చేసిన చట్టాలకు తాము కట్టుబడి ఉండవలసిన అవసరమే వారికి లేదాయె. వారు తమకు కావలసినంత బాధ్యతా రహితంగా ప్రవర్తించవచ్చు.

స్వదేశీ రాష్ట్రాలు బ్రిటిష్ ఇండియాలో, పరిపాలనా రంగాన్నీ, శాసన నిర్మాణాన్నీ ప్రభావితంచేయగలిగే హక్కును మాత్రమే కలిగి ఉన్నాయని ప్రకటించడం వాటిని గురించి చాలా తక్కువగా చెప్పడమే అవుతుంది. బ్రిటిష్ ఇండియా మీద స్వదేశీ రాష్ట్రాలు పెత్తనం చెలాయించవచ్చుననేది యదార్థం. అచ్చంగా భారతదేశానికి సంబంధించిన సమస్య విషయంలో బ్రిటిష్ ఇండియాకు చెందిన ప్రతినిధులు ఓడించినటువంటి ఒక ఫెడరల్ ప్రభుత్వాన్ని స్వదేశీ రాష్ట్రాల ప్రతినిధులు కాపాడి, కొనసాగేట్లు కూడా చూడవచ్చు. విశ్వాస రాహిత్య తీర్మానంతో సహా అన్ని విషయాలకు సంబంధించిన అన్ని తీర్మానాల మీద, ఆ తీర్మానంలో ప్రస్తావించిన విషయం తమకు సంబంధించినదా కాదా అన్న దానితో నిమిత్తం లేకుండా ఓటు చేసే అధికారం స్వదేశీ రాష్ట్రాల ప్రతినిధులకు ఉంటుంది కనుక ఈ పరిస్థితి ఉత్పన్నమవుతున్నది. ఇది బ్రిటిష్ ఇండియా ప్రజలమీద, స్వదేశీ రాష్ట్రాల ప్రజలు పెత్తనం సాగించడం కాకపోతే మరింకేది అవుతుందో నాకు అంతుబట్టడం లేదు.

బ్రిటిష్ ఇండియాకు సంబంధించిన ఆంతరంగిక వ్యవహారాల చర్చల్లో స్వదేశీ రాష్ట్రాలు పాల్గొనడానికి అవకాశం ఉండి, ఆయా స్వదేశీ రాష్ట్రాల వ్యవహారాల విషయంలో అటువంటి అవకాశం బ్రిటిష్ ఇండియా ప్రతినిధులకు లేకపోవడం వల్ల ఉత్పన్నమయ్యే ఈ అసమాన, అన్యాయపు పరిస్థితిని చక్కదిద్దడానికి, బ్రిటష్ ఇండియా ప్రజల ఆంతరంగిక వ్యవహారాలతో నిమిత్తం లేని అంశాల విషయంలో మాత్రమే, స్వదేశీ రాష్ట్రాల ప్రతినిధులు చర్చల్లో పాల్గొనడానికి, ఓటు చేయడానికీ అవకాశం కల్పించాలని చేసిన ప్రయత్నాన్ని సంస్థానాధీశుల్ని వారి ప్రతినిధులు అడ్డుకున్నారు. మంత్రివర్గపు ఉనికి ఆధారపడే ఏ విషయం పరించైనా సరే, ప్రభుత్వ భవితవ్యాన్ని నిర్ణయించే అధికారం తమకు ఉండి తీరాలని వారు పట్టుపట్టారు. సంస్థానాధీశుల అభిప్రాయాన్ని రాజ్యాంగరచయితలు మన్నించి బ్రిటిష్ ఇండియా ప్రజల అభిప్రాయాన్ని త్రోసి పుచ్చారు.

ఈ పోలికవల్ల తెలుస్తున్నదేమిటి? చట్ట ప్రకారం స్వదేశీ రాష్ట్రాలస్థాయి, బ్రిటిష్ ఇండియా రాష్ట్రాలను నియంత్రించేదిగా ఉన్నదనీ, అదే విధంగా బ్రిటిష్ ఇండియా వారికి స్వదేశీ రాష్ట్రాలను ప్రభావితం చేయగల ఎటువంటి అవకాశమూ చట్ట ప్రకారం లేదనీను. ఈ వాస్తవిక వివరణను అందరూ అంగీకరించవలసి ఉంటుంది. మరోమాటలో చెప్పాలంటే

సమాఖ్యపథకం. భారతదేశపు స్వదేశీ రాష్ట్రాలను ప్రభావితం చేసి, వాటిలో ప్రజాస్వామ్య ప్రక్రియకు నాంది పలికించగల సామర్థ్యాన్ని బ్రిటిష్ ఇండియాకు కలిగించలేదు సరికదా, అందుకు భిన్నంగా ప్రజాస్వామిక ప్రక్రియకు అడ్డుతగిలే అవకాశాలను కలిగిస్తున్నది. మరొక వైపు బ్రిటిష్ ఇండియాలో ప్రజాస్వామ్య ప్రక్రియను ఛిన్నాభిన్నం చేసే అవకాశాన్ని స్వదేశీ రాష్ట్రాలకు సమకూరుస్తున్నది.

## 3. సమాఖ్య – బాధ్యత

బాధ్యతకు సంబంధించిన తర్కాన్ని పరిశీలిద్దాం. బ్రిటిష్ ఇండియా ప్రజల దృక్పథం ప్రకారం మిగతా రెండు తర్కాలకన్నా ఇదే అత్యంత నిర్ణయాత్మకమైనది. అందువల్ల దీన్ని చాలా శ్రద్ధగా పరిశీలించవలసి ఉంటుంది.

సమాఖ్య కొంతమేరకు బాధ్యతాయుతంగా ఉంటుందనడంలో ఎలాంటి సందేహమూ లేదు. అయితే ఎంతమేరకు ఈ బాధ్యతాయుతత్వం ఉంటుంది? ఆంతరంగికంగా పరిశీలించినప్పుడు దానిలో అది బాధ్యతాయుతమైనదేనా? దాన్ని వాస్తవిక బాధ్యతగా పరిగణించవచ్చునా అనేది ప్రశ్న.

సమాఖ్యలో ఉండే బాధ్యతాయుతత్వం ఏమేరకు ఉంటుందనే ప్రశ్నను పరిశీలిద్దాం. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి 9వ, 11వ విభాగాలను కలిపి చదువ వలసి ఉంటుంది. ఆ రెండింటినీ కలిపి చదివినట్లయితే బాధ్యతాయుతత్వపు విస్తృతికి సంబంధించి ఒక అభిప్రాయానికి రావచ్చు. ఈ రెండు విభాగాలను అనుసరించి ప్రభుత్వాధికార పరిధిని రెండు వర్గాలుగా విభజించవచ్చు. ఒక వర్గంలో నాలుగు విషయాలను చేర్చాలి. 1. రక్షణ 2. మత సంబంధమైన విషయాలు 3. విదేశీ వ్యవహారాలు, 4. గిరిజన ప్రాంతాల పరిపాలన. సమాఖ్య కార్యనిర్వహణాధికార పరిధిలోని ఇతర విషయాలన్నీ మరో ప్రత్యేక వర్గంలోకి వస్తాయి. ఈ రెండు వర్గాలకూ సంబంధించి కార్యనిర్వహణాధికారం గవర్నర్-జనరల్ గుప్పిట్లో ఉంచారు. అయితే ప్రభుత్వాధికార క్షేత్రం విషయంలో ఈ రెండింటి మధ్య తేడా పాటించారు. మొదటి వర్గంలో చేర్చిన నాలుగు విషయాలకు సంబంధించి, ప్రభుత్వాధికార పరిధిలో గవర్నర్ జనరల్ విచక్షణాధికారాన్ని వినియోగించడానికి చట్టప్రకారం వీలున్నది. రెండవ వర్గంలో చేర్చిన విషయాలకు సంబంధించి నంతవరకు ప్రభుత్వాధికార పరిధి, చట్టప్రకారం మంత్రి సలహాపై గవర్నర్ జనరల్ తీసుకునే చర్యల క్రిందికి వస్తుంది మొదటి వర్గంలోని నాలుగు విషయాలకు సంబంధించినంతవరకు ప్రభుత్వం శాసన మండలికి జవాబుదారీ వహించదు. ఈ నాలుగు విషయాలకు సంబంధించి, ప్రభుత్వాధికార పరిధిని వినియోగించే గవర్నర్ జనరల్‌ను శాసనమండలి తొలగించడానికి వీలులేదు మిగతా విషయాలన్నింటికీ సంబంధించినంతవరకు ప్రభుత్వం శాసన మండలికి జవాబుదారీ వహిస్తుంది. ఎవరి సలహామేరకైతే,

ఈ విషయాలకు సంబంధించిన ప్రభుత్వాధికార పరిధిని వినియోగించడానికి వీలున్నదో ఆ మంత్రులను శాసన మండలి తొలగించవచ్చు. అందువల్ల సమాఖ్య పథకంలో ఉన్నటువంటి బాధ్యతాయుతత్వం పరిమితమైన బాధ్యతాయుతత్వానికి సంబంధించిన విషయమే. సాంఘిక, రాజకీయ, ఆర్థికపరంగా అత్యంత ప్రధానమైనటువంటి, రక్షణ-విదేశీ వ్యవహారాల పరిధివరకు ఈ బాధ్యతాయుతత్వం విస్తరించదు. 1919 భారత ప్రభుత్వ చట్టంలో పొందుపరచిన మాంటేగ్-ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణలకు పునాదిగా ఉండి ద్వంద్వ ప్రభుత్వ పద్ధతికి కొన్ని అంశాలను రిజర్వుడు అంశాలుగానూ, మరికొన్నింటిని బదలాయించిన అంశాలుగానూ వర్గీకరించే పద్ధతిని ఈ పథకం పోలి ఉన్నది. 1935 చట్టం క్రింద సమాఖ్య రాజ్యాంగంలో ప్రతిపాదించిన బాధ్యతాయుతత్వానికి సంబంధించిన పథకం, 1919 ప్రావిన్షియల్ రాజ్యాంగం ఉన్నటువంటి బాధ్యతాయుతత్వ పథకానికి నకలు మాత్రమే.

ఈ బాధ్యతాయుతత్వం వాస్తవమైనదా? కాదనే నా సమాధానం. నా కారణాలేమిటో నేను వివరిస్తాను. బాధ్యతాయుత రంగం పరిమితమైన రంగమే కాక, మంత్రుల స్వేచ్ఛాచరణకు సంపూర్ణ అవకాశం కల్పించేది కూడా కాకపోవడం మొదటి కారణం. ఈ పరిమితమైన బాధ్యతాయుతత్వ రంగం కూడా ఎంత బలహీనమైనదో గ్రహించడానికి మనం, బాధ్యతాయుతత్వరంగంలో పని చేస్తున్న మంత్రుల అధికారాలమీద విధించిన కొన్ని నిర్బంధాలను పరిశీలించవలసి ఉంటుంది.

బాధ్యతాయుతత్వ రంగంలో పనిచేసే మంత్రుల అధికారాలమీద విధించిన నిర్బంధాలలో మొదటి వర్గానికి చెందినవి- గవర్నర్ జనరల్ ప్రత్యే బాధ్యతలనుంచి ఉత్పన్నమవుతాయి.

బదలాయించిన విషయాలకు సంబంధించి ప్రభుత్వ అధికారాన్ని, వినియోగించుకోవడంలో మంత్రుల అధికారాలను పరిమితం చేసేవి, మరొక వర్గానికి చెందిన నిర్బంధాలు కూడా ఉన్నాయి. దీన్ని అర్థం చేసుకోవాలంటే ఈ సమాఖ్య రాజ్యాంగపు ఒక ప్రత్యేక లక్షణాన్ని అర్థం చేసుకోవలసి ఉంటుంది. ఈ రాజ్యాంగం ప్రభుత్వ అధికారాల దృష్ట్యా విషయాలను వర్గీకరిస్తున్నది. ఈ పద్ధతి వర్గీకరణ వల్ల విషయాలు ఆ విధంగా విభజితమైనాయి. సంక్షిప్తతకోసం వాటిని బదలాయించిన విషయాలు అనీ, రిజర్వు చేసుకున్న విషయాలనీ అంటున్నాము. రాజ్యాంగం ఇంతటితో ఆగడం లేదు. ఇంకా ముందుకు వెళ్లి, బదలాయించిన విషయాలను మళ్లీ రెండు రకాలుగా విభజిస్తున్నది. 1. మంత్రుల ప్రభుత్వాధికారం పరిపాలనా నియంత్రణను కూడా కలుపుకొని ఉండే విషయాలు, 2. మంత్రుల ప్రభుత్వాధికారంతో బాటు పరిపాలనా నియంత్రణాధికారం ఉండని విషయాలు. ఈ రకమైన వర్గీకరణకు ఉదాహరణగా రైల్వే శాఖను పేర్కొనవచ్చు. రైల్వేలు బదలాయించిన విషయం క్రిందికి వస్తాయి. మంత్రుల ప్రభుత్వాధికార పరిధి రైల్వేలకు విస్తరిస్తే. అయితే రైల్వేలపైన ఎటువంటి పాలనా నియంత్రణాధికారమూ మంత్రులకు ఉండదు. రైల్వేల పైన పరిపాలనా

నియంత్రణాధికారం, రైల్వే అథారిటీ అని పిలువబడే మరొక వ్యవస్థకు చెందుతుంది. పరిపాలనా నియంత్రణాధికారం కలిగి ఉన్న ప్రభుత్వాధికారం, పరిపాలనా నియంత్రణాధికారం లేని ప్రభుత్వాధికారం ఇది తేడా లేని విభజన అని భావించరాదు. ఈ రెండు స్థితుల మధ్య తేడా చాలా వాస్తవికమైనటువంటిది. రైల్వేల విషయంలో ఈ తేడా 181వ విభాగపు 2.వ ఉపనియమంలో స్పష్టంగా ఉంది. విధానాలను రూపొందించే అధికారం ఒకటి, వాటిని అమలు పరిచే అధికారం మరొకటి. అమలుపరిచే అధికారానికీ, విధానాలను రూపొందించే అధికారానికీ మధ్య ఇంతటి తేడా ఉండే విధానాన్ని వాస్తవికంగా బాధ్యతాయుతమైన ప్రభుత్వ విధానమని ఎలా భావించాలో వివరించాల్సిన బాధ్యత ఈ రకమైన సమాఖ్య పద్ధతిని సమర్థించే వారిదే.

సమాఖ్య పథకంలోని ఈ రకమైన బాధ్యతాయుత తత్వానికి సంబంధించి రెండు విషయాలు స్పష్టంగా ఉన్నాయి. మొదటిది ఈ బాధ్యత పరిధి పరిమితమైనదనేది. గవర్నర్ జనరల్ ప్రత్యేక బాధ్యతలు అనే దాని వల్లనైతే నేమి, అవి బదలాయించిన విషయాలే అయినప్పటికీ రైల్వేల వంటి వ్యవహారాలలో విధానాలను రూపొందించే విషయంలో మంత్రులకున్న ప్రభుత్వాధికారాన్ని, వాటిని ఆచరించే విషయంలో లేకుండా చేయడం వల్లనైతేనేమి, ఈ బాధ్యత వాస్తవికమైనది కాదనేది రెండవ విషయం.

1919వ సంవత్సరం చట్టం క్రింద రాష్ట్రాలలో అమలు పరిచిన ద్వంద పాలనా విధానాన్ని పోలినదే ఈ సమాఖ్య పథకం క్రింద ప్రసాదించిన బాధ్యతాయుతత్వం అని నేను చెప్పి ఉన్నాను. అయితే, రాష్ట్రాలలో అమలు పరచినటువంటి బాధ్యతాయుతత్వ విధానంతో సమాఖ్య పథకాన్ని పోల్చేట్లయితేమొదటి దాని లక్ష్యం, రెండవదాని కన్నా తక్కువ ఫలితాలను ఇవ్వడమే నన్న విషయం విదితమవుతుంది. రాష్ట్రాలలో అమలు పరిచిన ద్వంద పాలనా పద్ధతిలో లేనటువంటి రెండు అంశాలు సమాఖ్య పథకంలో ప్రవేశపెట్టారు. అదే విధంగా ఈ ద్వంద పాలనా పద్ధతిలో ఉండిన ఒక అంశం, సమాఖ్య పథకంలో లేదు. రెండు విషయాలు అదనంగా ఉండటం, ఒక విషయం లేకపోవడం వల్ల సమాఖ్య ద్వందపాలనా పద్ధతి, రాష్ట్రాలలో అమలు పరిచిన ద్వందపాలనా పద్ధతి కన్నా అధ్వాన్నంగా తయారైంది.

సమాఖ్య పథకంలో ఉన్నటువంటి ఈ రెండు విషయాలు బదలాయించిన రంగంలో గవర్నర్ జనరల్‌కు ప్రత్యేక బాధతలుంటాయన్న విధానం ఒకటి, బదాయించినలకు సంబంధించి విధానాలను రూపొందించే ప్రభుత్వాధికారానికీ, వాటిని అమలు జరిపే ప్రభుత్వాధికారానికీ మధ్య తేడాను పాటించడం అనే రెండవదీ కొత్త విషయాలు. రాష్ట్రాలకు సంబంధించి అమలు జరిపిన ద్వంద పాలనా విధానంలో ఇదివరకు లేనటువంటి విషయాలు ఇవి.

గవర్నర్ జనరల్ ప్రత్యేకబాధతలు అనేది, వీటో అధికారానికి మరోపేరే అని కూడా

అనవచ్చు. అంటే మంత్రుల అధికారాలను అతిక్రమించడమన్నమాట. ఇటు వంటి వీటో అధికారం బ్రిటిషు రాజ్యాంగంలో కూడా రాజుగారికి దత్తమై ఉన్నట్టిదే. పైన చూస్తే గవర్నర్ జనరల్‌కు ఇలా ప్రత్యేక బాధ్యతలను కల్పించడం సరైనదిగానే కనిపిస్తుంది. అయితే రాజుగారు వీటో అధికారాన్ని వినియోగించడానికి గల షరతులనూ, ప్రత్యేక పరిస్థితులనూ జాగ్రత్తగా పరిశీలించినపుడు ఇది వాస్తవానికి దురవగాహనతో కూడిన అంచనా అని స్పష్టమవుతుంది.

నాకు తెలిసినంత వరకు బాధ్యతాయుత ప్రభుత్వ విధానంలో రాజుకూ, ఆయన మంత్రులకూ మధ్య ఉండే సంబంధాన్ని గురించి మెకాలేకన్నా గొప్పగా ఎవరూ వివరించలేదు. ఆయన మాటలలోనే చెప్పాలంటే-

"రాజు చేపట్టే చర్యకు ఎవరో ఒక మంత్రి బాధ్యత వహించడానికి సిద్ధంగా ఉంటే తప్ప, ఇంగ్లాండులో రాజు తన అధికారాన్ని వినియోగించ జాలడు. రాజుపక్షాన బాధ్యతను స్వీకరించడానికి ఏ మంత్రీ ముందుకు రానప్పుడు రాజు లొంగి పోనన్నా లొంగి పోవాలి, లేదా సంఘర్షణకన్నా సమాయత్తం కావాలి. లేదా తన అధికారాన్ని వదులుకోనైనా వదులుకోవాలి." ఇక్కడ గవర్నర్ జనరల్ పరిస్థితి విభిన్న స్థాయిలో ఉన్నది. ఆయన ఇలా లొంగిపోవలసిన అవసరంలేదు. తన చర్యకు బాధ్యత వహించడానికి ఏ మంత్రీ ముందుకు రాకపోయినప్పటికీ ఆయన చర్య తీసుకోవచ్చు. రాజుగారి వీటో అధికారానికీ, గవర్నర్ జనరల్ వీటో అధికారానికీ తేడా ఇది. ఇందులో మరింత ప్రధానమైన అంశేమిటంటే, బదలాయించిన విషయాలకు సంబంధించి కూడా గవర్నర్ జనరల్ తన వీటో అధికారాన్ని ప్రయోగించవచ్చు. రాష్ట్రాలకు అమలు పరచిన ద్వంద్వ పాలనా పద్ధతి రాజ్యాంగంలో బదలాయించిన విషయాలకు సంబంధించినంతవరకు ఇటువంటి వీటో అధికారం గవర్నర్లకు ఉండేది కాదు. మరో మాటలో చెప్పాలంటే గవర్నర్లకు ప్రత్యేకమైన బాధ్యతలనేవి ఏవీ ఉండేవికాదు. బదలాయించి విషయాలకుసంబంధించికూడా మంత్రుల అధికారాలను గవర్నర్ జనరల్ అధిగమించేటట్టయితే ఇక మంత్రివర్గం బాధ్యత వహించటానికి మిగిలేదేమిటి అనేది ప్రశ్న. మిగిలేది చాలా తక్కువగానే నాకు కనిపిస్తున్నది.

కొత్తగా చేరిన రెండవ విషయం ఏమిటంటే ప్రభుత్వాధికారాన్నీ పరిపాలనా నియంత్రణాధికారాన్నీ వేరు చేయడం. రాష్ట్రాలకు అమలు పరచిన ద్వంద్వపాలనా పద్ధతిలో అటువంటిదేదీ ఉండేదికాదు. రాష్ట్రాలలో అమలు జరిపిన ద్వంద్వపాలనా రాజ్యాంగం ప్రకారం, ఏదన్నా ఒక విషయాన్ని బదలాయించినపుడు, ఆ విషయానికి సంబంధించినంతవరకు ప్రభుత్వాధికారమూ, పరిపాలనా నియంత్రణాధికారమూ ఈ రెండూకూడా మంత్రులకు ఉండేవి. మంత్రికేవలం ఆదేశాలిచ్చి, వాటిని అనుసరించి తీసుకునే చర్యలను నియంత్రించ జాలనప్పుడు మంత్రివర్గ బాధ్యతాయుతత్వంలో మిగిలే సారమేమిటో మీరే ఆలోచించండి. మిగిలేది చాలా స్వల్పంగానే నాకు కనిపిస్తున్నది.

రాష్ట్రాలకు అమలు జరిపిన ద్వంద్వ పాలనా రాజ్యాంగంలో ఉండి సమాఖ్య రాజ్యాంగంలో వదిలి పెట్టబడిన నిబంధన రిజర్వు అయిన విషయాల ఆర్థిక వనరులకు సంబంధించినది. ఈ సందర్భంగా 1919 పాతచట్టంలోని 72డి నిబంధనను, ప్రస్తుత చట్టంలోని 33, 34 నిబంధనలతో పోల్చి చూసినప్పుడు ఈ విషయం మరింత స్పష్టం అవుతుంది. 72–డి విభాగపు 2.వ ఉపవిభాగం ఇలా ఉన్నది.

"రాష్ట్రానికి సంబంధించిన వార్షిక వ్యయం అంచనాలను, ఆదాయం అంచనాలనూ ప్రతి సంవత్సరం ఒక ప్రకటన రూపంలో కౌన్సిలు ముందుంచాలి. రాష్ట్రపు ఆదాయాన్ని, ఇతర విధులనూ వినియోగించుకునే స్థానిక ప్రభుత్వ ప్రతిపాదనలను గ్రాంట్ల నిమిత్తం డిమాండ్ల రూపంలో కౌన్సిలు ముందు ఓటుకు పెట్టాలి. ఏదైనా ఒక డిమాండును కౌన్సిలు ఆమోదించనూవచ్చు, నిరాకరించనూవచ్చు, అందులో ప్రతిపాదించిన మొత్తాన్ని ,గ్రాంటు వర్తించే ఏదైనాఖర్చుపద్దును తగ్గిచడం ద్వారా తగ్గించనూవచ్చు. దీన్ని ప్రస్తుత 1935 చట్టంలోని 34 విభాగంతో పోల్చి చూద్దాం. 34వ విభాగపు 1న ఉప–విభాగం ఇలా ఉన్నది.

"సమాఖ్య ఆదాయాలను ఖర్చు చేయడానికి సంబంధించిన అంచనాల వరకు శాసన మండలి ఓటుకు పెట్టనవసరం లేదు. అయితే ఈ ఉప–విభాగంలో ఉన్నటువంటిదేదీకూడా, 33వ విభాగపు (3)వ ఉప–విభాగంలోని పేరాలను (ఏ) లేదా పేరాల (ఎఫ్) కు సంబంధించిన అంచనాలను మినహాయించి, తదితర అంచనాల విషయంలో శాసన మండలి ఉభయ సభల్లో చర్చ జరగడాన్ని నిరోధిస్తున్నట్లు భావించరాదు."

33వ విభాగం ప్రకారం సమాఖ్య ఆదాయం నుంచి ఖర్చుచేసే పద్దులలో రిజర్వు అయిన విషయాలకు సంబంధించిన ఖర్చులు కూడా ఉంటాయి. రెండు చట్టాల నిబంధనలనూ పోల్చి చూచినట్లయితే, పాత చట్టంలో, 72డి. విభాగం క్రింద బదలాయించిన విషయాలకూ, రిజర్వు విషయాలకూ మధ్య, సరఫరాను ఆమోదించే విషయానికి సంబంధించి, శాసన మండలి అధికారాల వరకు ఎటువంటి తేడాను పాటించలేదని స్పష్టమవుతున్నది. రిజర్వు అయిన విషయాలకు సంబంధించిన ఖర్చులు చర్చలకే కాక, శాసన మండలి ఓటింగుకు కూడా లోబడి ఉండేవి. నూతన చట్టపు 34వ నిబంధనక్రింద, సమాఖ్య శాసన మండలి, రిజర్వు అయిన విషయాలకు సంబంధించిన వ్యయం పద్దులను చర్చించవచ్చు, కాని, ఓటింగుకు పెట్టడానికి వీలులేదు. అత్యంత ప్రధానమైన తేడా ఇది. పాతచట్టం ప్రకారం రిజర్వు విషయాలు కూడా, శాసన మండలి ఆర్థిక అధికారాలకు లోబడి ఉండేవి. అయితే, రిజర్వ్డు విషయాలకు సంబంధించినంతవరకు, రాష్ట్రాల రాజ్యాంగంలో, శాసన మండలుల ఓటింగు కడపటి నిర్ణయం కాదన్న నిబంధన ఉండేదన్నమాట నిజమే. 72–డి విభాగానికి చేర్చిన ఒక షరతులో, "ఒకవేళ డిమాండు రిజర్వు అయిన విషయానికి సంబంధించినదైనప్పుడు, (శాసనమండలిద్వారా) అందుకు ఆమోదం లభించకపోయినప్పటికీ, లేదా మొత్తాలు

తగ్గించినప్పటికీ – ఎటువంటి నిమిత్తమూ లేకుండా, ఆ డిమాండు ఆమోదం పొందినట్లే భావించి గవర్నరు ముందుకు సాగవచ్చును. అయితే ఆ విషయానికి సంబంధించి తన బాధ్యతలను నిర్వహించడానికి డిమాండులో పేర్కొన్న ఖర్చు అత్యవసరమని గవర్నరు ఒక ధృవపత్రం ఇవ్వవలసి ఉంటుంది" అని గవర్నరుకు అధికారం కల్పించిన మాట నిజమే. 1935 భారత ప్రభుత్వ చట్టంలో రిజర్వు అయిన విషయాల నిమిత్తం ఖర్చును 42 కోట్ల రూపాయలకు పరిమితం చేసిన మాట కూడా నిజమే. అయినప్పటికీ ఆ తేడా మాత్రం ఉండనే ఉన్నది. పాత రాజ్యాంగం ప్రకారం రిజర్వు అయిన విషయాలు కూడా శాసన మండలి ఆర్థిక అధికారాల పరిధికి లోబడి ఉండేవి, కొత్త రాజ్యాంగంలో అలా లేదు. ఇది ఏదో స్వల్పమమైన తేడా కాదు. కార్య నిర్వాహకవర్గం బాధ్యతాయుతత్వాన్ని చాటిచెప్పడానికి సరఫరాలను మంజూరు చేసే అధికారం చాలా బలమైన సాధనం. ధృవపత్రం జారీ చేసే అధికారం కారణంగా రిజర్వు అయిన విషయాలకు సంబంధించి శాసన మండలి అధికారాలను కుంచించడం జరిగి ఉంటే జరిగి ఉండవచ్చు. కాని, అధికారాన్ని అది పూర్తిగా తుడిచిపెట్టటంలేదు. ప్రస్తుత రాజ్యాంగం ప్రకారం రిజర్వు అయిన విషయాలకు సంబంధించినంతవరకు శాసన మండలికి నియంత్రణ లేదు సరికదా, వాటిని ప్రభావితం చేయగల ఎలాంటి మార్గమూ కూడా దానికిలేదు. అందువల్ల రాష్ట్రాలలో ద్వంద్వపాలనను ప్రవేశపెట్టిన రాజ్యాంగం ప్రకారం బాధ్యతాయుతత్వం, ప్రస్తుత సమాఖ్యలో ఉన్న దానికంటే చాలా ఎక్కువగా ఉండేదనడంలో ఎలాంటి సందేహమూ లేదు.

కార్యనిర్వహణాధికార వర్గం శాసనమండలికి బాధ్యత వహించబోదు అనడం, కార్యనిర్వాహణాధికార వర్గం అత్యున్నతమైనదని మరో విధంగా చెప్పడమే. కార్య నిర్వాహక వర్గపు ఈ ఔన్నత్యాన్ని అనేక రకాలుగా చాటి చెప్పవచ్చు. శాసన మండలి అధికారాలను కుంచించడం ద్వారా చాటుకోవచ్చు. లేదా శాసనమండలి సర్వదా కార్యనిర్వాహకవర్గం అదుపాజ్ఞలలో ఉండే విధంగా దాన్ని నిర్మాణాన్నే రూపొందించుకోవడం ద్వారా కూడా చాటుకోవచ్చు.

సమాఖ్య పథకం ఈ రెండు మార్గాలనూ అనుసరిస్తున్నది. మొదటగా ఇది సమాఖ్య శాసనమండలి అధికారాలను పరిమితం చేస్తున్నది. సమాఖ్య శాసనమండలి యొక్క ఆర్థిక అధికారాలను సమాఖ్య పథకం ఎంత విస్తృతంగా కుంచిస్తూ ఉన్నదో నేను ఇదివరకే వివరించాను. ఆదాయాన్ని బట్టి చేస్తున్న ఖర్చేనని ప్రకటించిన ఏ ఖర్చు విషయంలోనూ కూడా సరఫరాలను నిరాకరించే అధికారం సమాఖ్య శాసన మండలికి లేదు.

సమాఖ్య పథకంలో, సమాఖ్య శాసన నిర్మాణాధికారాలను కూడా కుంచించే నిబంధనలున్నాయి. 108 విభాగంలో ఈ నిబంధనలను పొందుపరిచారు. అవి ఇలా ఉన్నాయి.

"108 (1) ముందుగానే అందుకు అనుమతించడం భావ్యంగా ఉండగలదని గవర్నర్

జనరల్ భావిస్తే తప్ప ఈ దిగువ విషయాలకు సంబంధించిన ఏదైనా బిల్లుగానీ లేదా సవరణగానీ, సమాఖ్య శాసనమండలికి చెందిన ఏసభలో కూడా ప్రవేశ పెట్టడానికి వీలులేదు.

(ఏ) బ్రిటిష్ ఇండియాకు వర్తించే ఏదైనా పార్లమెంటు చట్టాన్ని రద్దుచేసే, లేదా సవరించే లేదా అందులోని ఏదన్నా నిబంధనకు వ్యతిరేకంగా ఉండే ; లేదా

(బి) గవర్నర్ జనరల్ లేదా గవర్నరు చేసిన ఏదైనా చట్టాన్ని గవర్నర్ జనరల్‌గానీ గవర్నరుగానీ తమ విచక్షణాధికారాన్ని వినియోగించి జారీ చేసిన ఏదైనా ఆర్డినెన్సునుగానీ, రద్దుచేసే, లేదా సవరించే లేదా అందులోని ఏదన్నా నిబంధనకు వ్యతిరేకంగా ఉండే; లేదా

(సి) ఈ చట్టం ద్వారా లేదా ఈ చట్టం క్రింద గవర్నరు జనరలు తన విచక్షణాధికారాన్ని వినియోగించి చర్యలు తీసుకొనే ఏదైనా విషయానికి సంబంధించి ప్రభావితం చేయగలట్టి, లేదా (డి) ఏదైనా పోలీసు సిబ్బందికి ఇసంబంధించిన ఏదన్నా చట్టాన్ని రద్దుచేసే లేదా సవరించే లేదా ప్రభావితం చేయగలట్టి; లేదా

(ఇ) యూరోపియన్ బ్రిటిష్ ప్రజలతో నిమిత్తం ఉన్నటువంటి ఏవైనా క్రిమినల్ వ్యవహారాలలో పద్ధతులను ప్రభావితం చేయగలట్టి, లేదా

(ఎఫ్) బ్రిటిష్ ఇండియాలో నివసించనటువంటి వ్యక్తులపైన బ్రిటిష్ ఇండియాలో నివసించే వ్యక్తులపైన విధించిన దానికన్నా ఎక్కువ పన్నులను విధించేటువంటి, లేదా బ్రిటిష్ ఇండియాలో పూర్తిగా ఉండని, బ్రిటిష్ ఇండియా ప్రజల అధీనంలోనే సంపూర్ణంగా ఉండనటువంటి కంపెనీల మీద బ్రిటిష్ ఇండియాలో పూర్తిగా ఉండే కంపెనీల మీద విధించినదానికన్నా ఎక్కువ పన్నులు విధించేటువంటి, లేదా

(జి) యునైటెడ్ కింగ్ డమ్‌లో విధించిన, లేదా విధించడానికి వీలున్న ఆదాయం మీద, విధించే సమాఖ్య పన్నునుంచి ఇచ్చే మినహాయింపు మొత్తాన్ని ప్రభావితం చేసేటువంటి–

(2) ముందుగానే అందుకు అనుమతించడం భావ్యంగా ఉండగలదని గవర్నర్ జనరల్ భావిస్తే తప్ప, ఈ దిగువ విషయాలకు సంబంధించిన ఏదైనా బిల్లును గానీ, లేదా సవరణనుగానీ, సమాఖ్య శాసనమండలికి చెందిన ఏ సభలోనూ ప్రవేశపెట్టడానికి వీలులేదు.

(ఏ) బ్రిటిష్ ఇండియాకు వర్తించే ఏదైనా పార్లమెంటు చట్టాన్ని రద్దుచేసే, లేదా సవరించే లేదా అందులోని ఏదన్నా నిబంధనకు వ్యతిరేకంగా ఉండేటటువంటి; లేదా

(బి) గవర్నర్ జనరల్ చేసిన ఏదైనా చట్టాన్నిగాని తన విచక్షణాధికారాన్ని వినియోగించి జారీ చేసిన ఏదైనా ఆర్డినెన్సును గానీ రద్దుచేసే, లేదా సవరించే, లేదా అందులోని ఏదన్నా నిబంధనకు వ్యతిరేకంగా ఉండేటటువంటి, లేదా

(సి) ఈ చట్టం క్రింద గవర్నరు జనరల్ తన విచక్షణాధికారాన్ని వినియోగించి

తీసుకొనే ఏదైనా చర్యను ప్రభావితం చేయగలటువంటి; లేక

(డి) యూరోపియన్ బ్రిటిష్ ప్రజలతో నిమిత్తం ఉన్నటువంటి ఏదైనా క్రిమినల్ వ్యవహారంలో పద్ధతులను ప్రభావితం చేసేటువంటి-

ఏదైనా రాష్ట్రానికి చెందిన గవర్నరు, ముందుగానే అందుకు అనుమతించడం భావ్యంగా ఉండగలదని భావిస్తే తప్ప, ఈ దిగువ విషయాలకు సంబంధించిన ఏ బిల్లునునా గాని ప్రతిపాదించడానికి వీలులేదు.

(i) గవర్నరు చట్టాన్ని గానీ లేదా గవర్నరు తన విచక్షణాధికారాన్ని వినియోగించి జారీ చేసిన ఆర్డినెన్సును గానీ రద్దుచేసే, లేదా సవరించే లేదా అందుకు భిన్నమైనటువంటి-

(ii) ఏదైనా పోలీసు సిబ్బందికి చెందిన ఏదన్నా చట్టాన్ని రద్దుచేసే, లేదా సవరించేలేదా ప్రభావితం చేసేటువంటి-

(3) ఈ విభాగంలో ఉన్నటువంటిదేదీ కూడా, ఏదైనా బిల్లును ప్రతిపాదించడానికీ, లేదా సవరణను ప్రతిపాదించడానికీ, గవర్నర్ జనరల్, లేదా గవర్నరునుంచి ముందుగానే అనుమతి తీసుకోవాలిన విధించే ఈ చట్టపు ఇతర నిబంధనల అమలుకు అవరోధం కాకూడదు."

కార్య నిర్వాహక మండలి ఆధిపత్యాన్ని కొనసాగించుకునే సాధనంగా సమాఖ్య శాసనమండలి శాసన నిర్మాణాధికారాలను, ఈ సమాఖ్య పథకం కుంచించడమే కాక, సమాఖ్య శాసనమండలి రూపకల్పనలోనే, అది సర్వదా కార్యనిర్వాహక మండలి చెప్పు చేతల్లో ఉండేవిధంగా ఏర్పాటు చేశారు. సమాఖ్య శాసనమండలి నిర్మాణం, వాస్తవంగా ఏ రూపంలో ఉన్నదో ఈ సందర్భంగా గమనించడం అవసరం. ఇదివరకే వివరించినట్లు శాసనసభలో 375మంది సభ్యులుంటారు. వీరిలో భారతదేశపు స్వదేశీ రాష్ట్రాలకు 125 సీట్లు, బ్రిటిష్ ఇండియా వారికి 250 సీట్లు కేటాయించారు. రాష్ట్రాల మండలిలో 260 మంది సభ్యులుంటారు. వారిలో స్వదేశీ రాష్ట్రాలకు 104 స్థానాలనూ, బ్రిటిష ఇండియాకు 156 స్థానాలనూ కేటాయించారు. స్వదేశీ రాష్ట్రాలకు కేటాయించిన సీట్లను ఆయా సంస్థానాల రాజులు నామినేషన్ల ద్వారా భర్తీ చేస్తారు. బ్రిటిష్ ఇండియాకు కేటాయించిన సీట్లను ఎన్నికల ద్వారా భర్తీ చేయవలసి ఉంటుంది. అందువల్ల సమాఖ్య శాసనమండలి, నానావిధ శక్తుల శాసనమండలి. ఎన్నికైన కొందరితోనూ నామినేట్ అయిన మరికొందరితోనూ కూడుకొని ఉండే బహుళ రూపమైన శాసన మండలి అవుతుంది.

సమాఖ్య శాసన మండలిలో, రాజులు నామినేట్ చేసిన సభ్యులు ఏ విధంగా ప్రవర్తిస్తారన్న అంశాన్ని మనం ప్రప్రథమంగా పరిశీలించవలసి ఉంటుంది. సమాఖ్య కార్యనిర్వాహక మండలితో నిమిత్తం లేకుండా వారు స్వతంత్రంగా వ్యవహరించగలరా లేక దాని అడుగులకు

మడుగులొత్తడమేనా? ఊహాగానం చేయడం కష్టం. అయితే ఈ రకరగా నామినేషన్లు చేసేటప్పుడు తప్పనిసరిగా పనిచేసే కొన్ని ప్రభావాల పాత్రను గమనించక తప్పదు. స్వదేశీ రాష్ట్రాలపైన ఒక రకమైన సార్వభౌమ్య హక్కులను బ్రిటిష్‌ప్రభుత్వ చెలాయిస్తున్నదనడంలో ఎలాంటి సందేహమూ లేదు. సార్వభౌమత్వం అనేది అతి విస్తృతమైన పదం. భారత ప్రభుత్వపు రాజకీయ వ్యవహారాల విభాగం ద్వారా రాజరికం రాష్ట్రాలపైన చెలాయించే పెత్తనానికి ఇది ప్రతీక. ఈ హక్కులతో, భారతీయ రాజులకు కొన్ని నియామకాల విషయంలో సలహాచెప్పే అధికారం తమకున్నదని రాజకీయ వ్యవహారాల విభాగం చాటుతున్నది. 'సలహా' అన్నమాటకు, దౌత్య భాషలో 'ఆదేశం' అనే అర్థం ప్రబలంగా ఉన్న విషయం సర్వవిదితమే. ఈ స్థానాల భర్తీ విషయంలో కూడా రాజకీయ వ్యవహారాల విభాగం, రాజులకు 'సలహా' చెప్పేతన అధికారాన్ని చాటుకోవచ్చుననడంలో ఎలాంటి సందేహమూ లేదు. ఇలాంటిది జరిగినట్లయితే ఫలితం ఎలా ఉంటుంది. ఫలితం ఇలా ఉంటుంది. రాజుల ప్రతినిధులనే అధికారముఠాకు మరోపేరుగా స్థిరపడిపోతారు. ప్రజలకు గానీ, తమను నామినేటు చేసిన రాజులకు గానీ విధేయులుగా ఉండటానికి బదులు వారు భారతప్రభుత్వ రాజకీయ వ్యవహారాల విభాగానికి విధేయులుగా తయారవుతారు. ఇక్కడ మరో రెండు అంశాలను కూడా గమనించవలసి ఉంటుంది. సమాఖ్య ప్రభుత్వ వ్యవస్థలో సార్వభౌమత్వం పొసగదనేది మొదట అంశం. అంటే రాజుల ప్రతినిధులను నామినేట్ చేసే విషయంలో ఎలాంటి సలహా చెప్పే అధికారమూ మంత్రులకు ఉండదన్నమాట. అటువంటి నామినేషన్లను విమర్శించే హక్కు శాసన సభలకు ఉండదన్న మాట. వారు గవర్నర్ జనరల్‌కు విభిన్నమైన -వైస్రాయిగారి నియంత్రణలో ఉంటారు. రాజుల ప్రతినిధులుగా ఉండే ఈ అధికార ముఠా చిన్న ముఠా ఏమీ కాదనేది రెండో అంశం దిగువ సభలో 187 మంది సభ్యులున్నటువంటి పార్టీ, మెజారిటీ పార్టీ అవుతుంది. ఎగువసభలో 130 స్థానాలు సంపాదించుకున్న పార్టీ మెజారిటీ పార్టీగా ఉంటుంది. దిగువ సభలో రాజులకు 125 సీట్లున్నాయి. మరో 62మంది తమ పక్షాన వుంటే వారే మెజారిటీ అవుతారు. అలాగే ఎగువసభలో వారికి 104 స్థానాలున్నాయి. మరో 26 మందిని తమవైపు తిప్పుకో గలిగితే వారే మెజారిటీ అవుతారు. కార్యనిర్వాహకవర్గం తమ నియంత్రణలో ఇంత విస్తృతమైన సంఖ్యలో సభ్యులను అట్టిపెట్టుకున్నది. అటువంటి శాసన మండలి స్వతంత్ర శాసన మండలి ఎలా కాగలదు? రిజర్వుగా ఉన్నటువంటి సగభాగం బదలాయించిన సగభాగాన్ని, తన అధీనంలో ఉన్న సంఖ్యాబలంతో నియంత్రించవచ్చు నన్నమాట.

బ్రిటిష్ ఇండియా ప్రతినిధులు ఎలా ప్రవర్తిస్తారు? ఈ విషయంలో నేను ఖచ్చితమైన ప్రకటన ఏదీ చేయజాలను కాని మీరు మనస్సులో ఉంచుకోవడం కోసం ఒక విషయాన్ని మాత్రం చెప్పదలచుకున్నాను. కొన్ని రాష్ట్రాలలో క్రమమైన బడ్జెటు అనేది ఏమీ లేదు. స్వతంత్రమైన ఆడిట్ అకౌంట్స్ వ్యవస్థకూడా లేదు. బ్రిటిష్ ఇండియా ప్రతినిధులను

కొనుగోలు చేసుకోవడం రాజుల ప్రతినిధులకు ఏమంత ఇబ్బంది కాదు. రాజకీయాలు క్షుద్రమైనవి. బ్రిటిష్ ఇండియాకు చెందిన రాజకీయ నాయకులందరూ అవినీతికి అతీతులని చెప్పడానికి వీలులేదు. బయట పడకుండా కొనుగోళ్లు చేయడం సులభసాధ్యం అయినప్పుడు ఈ ప్రమాదభయం నిజమవుతుంది.

సమాఖ్య పథకాన్ని మీకు ఇష్టమైన విధంగా చూసి పరిశీలించండి. మీకు సాధ్యమైన విధంగానే దాన్ని విశ్లేషించండి. నిజమైన బాధ్యతాయుతత్వం అందులో ఎక్కడా లేదని మీరే గమనిస్తారు.

## VII

## సమాఖ్య పథకంలోని విషం

అఖిల భారత సమాఖ్య రూపకల్పనకు ఉద్దేశించిన ఈ పథకం లోపాలతో నిండి ఉన్నద గుర్తించని వారెవరూ లేరు. దీనిని మనం ఏం చేసుకుందాం? అన్న ప్రశ్న వచ్చినప్పుడు మాత్రం భిన్నాభిప్రాయాలు వ్యక్తమౌతున్నాయి. ప్రముఖులైన భారతీయులు ఈ ప్రశ్నకు అప్పుడప్పుడూ చెప్పిన సమాధానాలన్నింటినీ పరిశీలించినట్లయితే, సమాఖ్య విషయంలో స్థూలంగా రెండు పూర్తి విభిన్న వైరుధ్యాలున్నట్లు స్పష్టమవుతున్నది. ఇందులో చెడు ఉన్నమాట నిజమే కాని, మనం ఈ సమాఖ్యను అంగీకరించి, అందులో నుంచి సాధించడానికి వీలున్న మంచిని సాధిస్తూ సాగిపోదామని భావించే వారి వైఖరి ఒకటి. అంగీకరించి, అమలు పరిచే ముందు సమాఖ్య రాజ్యాంగంలో కొన్ని సవరణలచేయవలసి ఉంటుందని భావించే వారి వైఖరి మరొకటి. కాంగ్రెసు పార్టి, ఉదారసమాఖ్య వాదులు - ఈ ఉభయ వర్గాలకూ ఈ సమస్య మీద ఏకాభిప్రాయం ఉన్నట్లు అంగీకరించవచ్చు. ఈ ఉభయ పక్షాలూ, దీన్ని అంగీకరించి, అమలు పరిచేముందు కొన్ని మార్పులు చేయవలసి ఉంటుందని ప్రకటించాయి.

ఈ సమాఖ్య భారత ప్రజానీకంలో అధిక సంఖ్యాకులకు అంగీకారం కాబోదన్న ప్రశ్నేరాదు. ఈ రాజ్యాంగాన్ని ఏయే అంశాల విషయంలో సవరించవలసి ఉంటుందనేదే ప్రశ్న. మనం కోరవలసిన మార్పులు ఏమిటి? ఈ విషయంలో కాంగ్రెసు పార్టీ వారూ, లిబరల్ ఫెడరేషను వారూ ఆమోదించిన తీర్మానాలను మనం మొదట పరిశీలిద్దాం.

1938లో హరిపురాలో జరిగిన కాంగ్రెసు మహాసభలో ఈ దిగువ తీర్మానాన్ని ఆమోదించారు.

"కొత్త రాజ్యాంగాన్ని కాంగ్రెస్ తిరస్కరించింది. భారత దేశానికి ఒక రాజ్యాంగాన్ని ప్రజలు ఆమోదించాలంటే అది స్వతంత్రం మీద ఆధారపడి ఉండాలనీ, ఏ విదేశీ అధికార ప్రమేయమూ లేకుండా ప్రజలు తమంత తాము ఒక రాజ్యాంగ రచనా సభద్వారా మాత్రమే

దానిని రూపొందించుకోవలసి ఉంటుందనికూడా ప్రకటించింది. ఈ తిరస్కార విధానానికి అనుగుణంగానే స్వతంత్ర సమరంలో జాతిని బలిష్ఠం చేసే ఉద్దేశంతో రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రి వర్గాలను ఏర్పాటు చేయటానికి అనుమతించింది. ప్రతిపాదిత సమాఖ్య విషయంలో అలాంటి విచక్షణ లేవీ ప్రాథమికంగా గాని లేదా ఒకటింత నిర్దిష్ట కాలంపాటయినా గాని వర్తించవు, కాగా సమాఖ్యను పైనుంచి విధించటం వల్ల భారతదేశానికి ఎంతో నష్టం కలుగుతుంది. సామ్రాజ్యవాద ప్రాబల్యంతో భారతదేశాన్ని లొంగదీసుకున్న బంధాలు ఇంకా బిగుసుకుంటాయి. ఈ సమాఖ్య పథకం ప్రభుత్వానికి ఆవశ్యకమైన విధుల బాధ్యతలనుంచి ప్రభుత్వాన్ని మినహాయిస్తున్నది.

సమాఖ్య భావనకు కాంగ్రెస్ వ్యతిరేకమేమీ కాదు; బాధ్యత సమస్యను పక్కకు నిజమైన సమాఖ్య ఉంచితే ఇంచుమించు ఒకే విధమైన స్వేచ్ఛ, పౌరహక్కులు, ప్రజాస్వామ్య పద్ధతిలో జరిగే ఎన్నికలద్వారా సంక్రమించిన ప్రాతినిధ్యమూ కలిగి ఉన్న స్వతంత్ర భాగాలతో ఏర్పడినదై ఉండాలి. సమాఖ్యలో పాల్గొనే ప్రాతినిధ్యం వహిస్తున్న దేశీయ రాష్ట్రాలు, ప్రాతినిధ్యపు సంస్థల స్థాపనలోను, బాధ్యతాయుత ప్రభుత్వపు ఏర్పాటులోను, పౌరహక్కులలోను, సమాఖ్య శాసనసభల ఎన్నిక విధాలలోను సంస్థాన రాష్ట్రాలకు దాదాపుగా సమానంగా ఉండాలి. లేకపోయినట్లయితే, సమాఖ్య ఇపుడు భావిస్తున్నట్టుగా భారతదేశపు ఐక్యతను నిర్మించటానికి బదులు వేర్పాటు ధోరణులను ప్రోత్సహించి రాష్ట్రాలు అంతర్గత బాహ్య సంఘర్షణలలో మునిగిపోయేటట్టు చేస్తుంది.

అందువల్ల కాంగ్రెసు ప్రతిపాదిత సమాఖ్య పద్ధతిని ఖండించటాన్ని పునరుద్ఘాటిస్తున్నది. ప్రజలకూ, రాష్ట్ర కమిటీలకూ స్థానిక కమిటీలకూ రాష్ట్ర ప్రభుత్వాలకూ మంత్రివర్గాలకూ అందరికీ దానిని ప్రారంభించకుండా నిరోధించవలసిందిగా కాంగ్రెస్ పిలుపు ఇచ్చింది. దానిని రుద్దటానికి ప్రయత్నం ఏదైనా జరిగిన సందర్భంలో, ప్రజల అభిప్రాయం ఎలా ఉన్నప్పటికి అట్టి ప్రయత్నాన్ని అన్ని విధాలా ఎదుర్కోవాలి. రాష్ట్రప్రభుత్వాలూ మంత్రివర్గాలూ దానితో సహకరించటానికి నిరాకరించాలి. అటువంటిది ఏదైనా జరిగినట్లయితే ఈ విషయంలో ఎటువంట చర్య తీసుకోవాలలో నిర్ణయించే బాధ్యతను అఖిల భారత కాంగ్రెస్ కమిటీకి అప్పగించారు."

బొంబాయిలో నేషనల్ లిబరల్ ఫెడరేషన్ తన కడపటి సమావేశంలో ఆమోదించిన తీర్మానం ఇది ఉన్నది. "రాజ్యాంగం, ప్రత్యేకించి కేంద్రానికి సంబంధించి 1935నాటి భారత ప్రభుత్వ చట్టంలో పొందుపరిచిన రాజ్యాంగం పూర్తిగా అసంతృప్తికరంగానూ, అనేక విధాల వెనుకకు నడిపించేదిగానూ ఉన్నదన్న తన అభిప్రాయాన్ని నేషనల్ లిబరల్ ఫెడరేషన్ పునరుద్ఘాటిస్తున్నది. సమాఖ్య రూప ప్రభుత్వం భారతదేశానికి సహజంగా ఆదర్శవంతమవుతుందని అంగీకరిస్తున్నది. చట్టంలో పొందు పరిచినట్టుగా సమాఖ్యకు రూపొందించటంలో ప్రధానమైన

మార్పులు చేయవలసి ఉన్నదనీ, ముఖ్యంగా (ఎ) యువరాజుల స్థితిని స్పష్టపరుస్తూ ఆ రాష్ట్రాలలో ప్రజలకు తమ రాష్ట్రప్రతినిధులను ఎన్నుకొనేహక్కు కలుగ చేయటం (బి) ధన సంబంధమైన విధానంలోనూ వాణిజ్య సంబంధ వివక్షలలోనూ రక్షణలను తొలగించటం (సి) రాష్ట్రాల నుంచి సమాఖ్య శాసనసభకు ప్రత్యక్ష పద్ధతిలో సభ్యులను ఎన్నుకొనడాన్ని ప్రవేశపెట్టటం. (డి) సమంజసమైన గడువులోపల భారతదేశం డొమినియన్ ప్రతిపత్తి సంపాదించు కోవటానికి వీలుగా రాజ్యాంగాన్ని మార్పు చేర్పులకు అనుగుణమైన రీతిలో తయారుచేయటం వంటివి అవసరమని భావిస్తున్నది.

రాష్ట్రాలలో బాధ్యతాయుతమైన ప్రభుత్వాలు ఉండి, కేంద్రంలో బాధ్యతా రహితమైన ప్రభుత్వం ఉండటం అనే ప్రస్తుత పరిస్థితి ఏదైతే ఉన్నదో అది పూర్తిగా ఆమోదయోగ్యం కాదనీ, సర్వజనామోదంగా ఉండేటట్టు రాజ్యాంగంలోని సమాఖ్య భాగానికి సత్వరమే మార్పులు చేయాలనీ పార్లమెంటును మనస్పూర్తిగా కోరుతున్నది.

సమాఖ్య రాజ్యాంగం విజయవంతంగా పనిచేయడానికి ఈ మార్పులు, సవరింపులు తప్పనిసరిగా జరగాలని కూడా సమాఖ్య భావిస్తున్నది. కాంగ్రెస్ గాని లిబరల్ ఫెడరేషన్ వారుగాని కోరుతున్నది ఈ మార్పులు మాత్రమే వారికి ఫెడరేషన్ పట్లగల ప్రస్తుత తిరస్కారవైఖరిని ఆమోదంగా మార్చటానికి సరిపోతాయా? నా వరకు చెప్పాలంటే, ఈ తీర్మానాలలో కోరుతున్న విధంగా మార్పులు జరిగినా కూడా అవి నన్నేమీ మార్చలేవని చెప్పటానికి నేనేమీ వెనుకాడను. బ్రిటిషు పార్లమెంటు సమాఖ్య విధానానికి సంబంధించిన ఈ మార్పులు గాని లేదా వేరే ఇతరమైన ఏ మార్పులనైనా గాని వెంటనే తీసుకు రావటానికి సిద్ధంగా ఉన్నదా లేదా అనేది అంత ముఖ్యమైనది కాదని నాకనిపిస్తున్నది. ఈ విషయంలో నాకున్న అభిప్రాయాన్ని బట్టి చూస్తే ఈ తీర్మానంలో ఉన్న ప్రతి విషయాన్నీ అంగీకరించటానికి బ్రిటిషు పార్లమెంటు సిద్ధంగా ఉన్నప్పటికీ సమాఖ్య విధానంపట్ల ఉన్న అభ్యంతరాలు తొలగిపోవు. నా ఉద్దేశంలో ప్రధానమైన విషయం ఏమంటే సమాఖ్య విధానం, భారతదేశం అంతిమంగా తన ఆదర్శాన్ని అందుకొనే విధంగా రూపొందగల సామర్థ్యం కలిగి ఉన్నదా అనేదే ఆసక్తికరమైన ఈ దృష్టితో సమాఖ్యవిధానాన్ని పరిశీలించ వలసిందిగా మిమ్మల్నీ కోరుతున్నాను.

భారత రాజకీయ వికాసానికి గమ్యం ఏమిటి? దీనికి స్థిరత, నిర్దిష్టత అనేది ఏది లేదు. భారత ప్రజల రాజకీయ ఆకాంక్షలను అభివ్యక్తం చేస్తున్నామని చెప్పుకుంటున్న కాంగ్రెస్ "మంచి ప్రభుత్వమే" ఆదర్శమని చెప్పటం మొదలు పెట్టింది. మంచి ప్రభుత్వం నుంచి స్వపరిపాలన లేదా బాధ్యతాయుత ప్రభుత్వానికి జరిగింది. బాధ్యతాయుత ప్రభుత్వం నుంచి డొమినియన్ ప్రతిపత్తికి వెళ్లింది; డొమినయన్ ప్రతిపత్తినుంచి స్వతంత్రానికి ఎదిగింది. అక్కడ ఆత్మ- పరిశీలనలో కాంగ్రెస్ కొంతసేపు ఆగింది. ఆ తర్వాత ఊగిసలాట మొదలయింది. ఇపుడు మళ్లీ డొమినియన్ ప్రతిపత్తికి తిరిగి వచ్చినట్టు అనిపిస్తున్నది.

కాంగ్రెస్ వారి ప్రకారం అదే భారతదేశ గమ్యం అని మనం అనుకుంటే మరీ పొరపాటు కాదనుకుంటాను. ఇపుడు సమస్య ఏమంటే, సమాఖ్య పథకం ముందు ముందు డొమినియన్ ప్రతిపత్తిలోకి వికసిస్తుందా? అనేదే.

డొమినియన్ ప్రతిపత్తి సమస్య అనేది బ్రిటిషు పార్లమెంటు చేతులనుంచి రావలసిన కానుక అని చాలమంది భారతీయులు అనుకుంటున్నట్టున్నారు. దీనిని మంజూరు చేయాలని బ్రిటిషు పార్లమెంటు గనుక, అనుకుంటే, దానిని ఏదీ ఆపలేదు. బ్రిటిషు పార్లమెంటు మంజూరు చెయ్యటానికి నిరాకరిస్తున్నది. గనుక భారతదేశానికి డొమినియన్ ప్రతిపత్తి ఆశ లేదని వారు తృప్తి పడుతున్నారు. డొమినియన్ ప్రతిపత్తి భారతదేశానికి గమ్యం అని ప్రకటించే ప్రస్తావనను 1935 నాటి చట్టానికి చేర్చటానికి బ్రిటిషు పార్లమెంటు నిరాకరించటాన్ని తమ అభిప్రాయానికి సమర్ధనగా వారు ఉదహరిస్తున్నారు.

అటువంటి ప్రవేశిక ఒకటి ఉండాలని కోరటం చాలా సమంజసమేనని అనుకోక తప్పదు. భారత రాజకీయ వికాసానికి 'డొమినియన్' ప్రతిపత్తియే గమ్యమని 1929లో లార్డ్ ఇర్విన్, బ్రిటిష్ పార్లమెంటులోని అన్ని రాజకీయ పార్టీల అనుమతితో ప్రకటించాడు. అందుకని భారతీయులు ఆశించింది కొత్తదేమీ కాదు. దానిని ఇదివరకే గవర్నర్ జనరల్, వైస్రాయి, అధికార పూర్వకంగా చెప్పారు. కాని బ్రిటిష్ ప్రభుత్వం అటువంటి ప్రవేశికను పెట్టడానికి నిరాకరించింది. ఇలా నిరాకరించటం మూలంగా బ్రిటిష్ ప్రభుత్వం చాలా వింతగా ప్రవర్తించింది. అలా నిరాకరించటానికి చూపిన కారణాలు మరీ వింతగా కనిపిస్తున్నాయి. ఆ షరతులపైన ప్రవేశికను తీసుకు రాకపోవడానికి అనేక ఆధారాలు చూపి తమ ప్రవర్తనను సమర్థించుకోవటానికి బ్రిటిష్ ప్రభుత్వం ప్రయత్నించింది.

మొదటి కారణం ఏమంటే ప్రవేశిక నిరూపయోగమనీ దానికి అమలు చేసే అధికారం లేదనీ కాని, ఈ వాదనను సులువుగానే త్రిప్పికొట్టారు. పార్లమెంటు చేసిన చట్టాలన్నింటికి పార్లమెంటు ఉద్దేశ్యాలను, ప్రయోజనాలను వ్యక్తం చేస్తూ ప్రవేశికలు వుంటాయి. వాటికి చట్టపరమైన అధికారం లేని మాట నిజమే. కాని, ప్రవేశిక నిష్ప్రయోజనమైనది మాత్రం కాదని అన్ని న్యాయస్థానాలూ తీర్పు ఇచ్చాయి. అంతే కాకుండా ఏదేని నిబంధనలోని వాక్యాల విషయమై సందేహం వచ్చినపుడు కూడా చట్ట ప్రయోజనాన్ని అర్థం చేసుకోడానికి కీలక మార్గంగా ప్రవేశికను న్యాయ స్థానాలు కూడా ఆశ్రయించాయి. వ్యాఖ్యానంలోనూ నిర్మితిలోనూ ఏదైనా సందేహం వచ్చినపుడు ప్రవేశికను పరిశీలించాయి. దీనినుంచి తప్పించుకోడానికి బ్రిటిష్ ప్రభుత్వం మరొకపని చేసింది. అదేమంటే 1919 సంవత్సరంలో జారీ అయిన చట్టాన్ని రద్దుచేసింది. కాని ఆ చట్టానికున్న ప్రవేశికను అలానే ఉంచింది. ఇది మళ్లీ విచిత్రమైన విషయమే. మొదటగా ప్రవేశిక నిష్ప్రయోజనమైతే 1919 చట్టంలో భాగంగా చేసిన ప్రవేశికను రక్షించవలసిన అవసరం లేదు. రెండోది 1919 చట్టానికి ఉన్న ప్రవేశిక అవసరం

అయితే 1935 చట్టంలో భాగంగా మళ్లీ శాసనబద్ధం చేసి వుండేది. కాని బ్రిటిష్ ప్రభుత్వం ఆ పని చేయలేదు. పోగా తలను మొండెంనుంచి వేరు చేసి వింత దృశ్యాన్ని చూపటానికే ప్రాధాన్యం ఇచ్చింది. ఇందులో తల 1919 నాటి రద్దు అయిన చట్టంలోనూ మొండెం భాగం 1935నాటి ప్రస్తుత శాసనంలోనూ కనబడతాయి. మూడోది భారతప్రజలు కోరిందేమంటే డొమినియన్ ప్రతిపత్తిని వాగ్దానం చేసే ప్రవేశిక. లార్డ్ ఇర్విన్ చేసిన ప్రకటనలో ఉన్నది అదే 1919 చట్టంలోని ప్రవేశిక బాధ్యతాయుతమైన ప్రభుత్వం గురించే చెబుతున్నది. డొమినియన్ ప్రతిపత్తిని గురించి చెప్పటం లేదు. 1919 చట్టానికి ఉన్న ప్రవేశికను తీసి వెయ్యకుండా వుంచారంటే ఇంతకంటె తెలివితక్కువ పని మరొకటి ఉండబోదు.

డొమినియన్ ప్రతిపత్తిని గమ్యంగా నిర్వచిస్తూ ప్రవేశికను చట్టబద్ధం చేయడానికి బ్రిటిష్ పార్లమెంటు ఎందుకు నిరాకరించింది? ఈ అభ్యర్థనను మంజూరు చేయకుండా బ్రిటిష్ పార్లమెంటు ఎందుకు గిరగిర తిరుగుతున్నది? దానికి వారిచ్చిన సంజాయిషీ ఏమిటంటే నమ్మకద్రోహం. కాని నా దృక్కోణం వేరేగా ఉంది. బ్రిటిష్ పార్లమెంటు ఒక ప్రవేశికను చట్టపరంచేస్తూ డొమినియన్ ప్రతిపత్తిని వాగ్దానం ఎందుకు చేయలేదంటే ఆ వాగ్దానాన్ని నెరవేర్చుకోవటం తన అధికారానికి మించిన పని అని తెలుసుకొన్నది గనుక సమాఖ్య పథకం ద్వారా భారతీయులకు డొమినియన్ ప్రతిపత్తిని కల్గించడం సాధ్యం కాదని చెప్పే ధైర్యమే బ్రిటిష్ పార్లమెంటుకు లేకపోయింది. నిజాయితీ లేకపోవటం కాదు. అటువంటి ప్రవేశికను తయారు చేయడాన్ని నిరాకరించటంలోనే ఎంతో నిజాయితీ ఉన్నది. ఎందుకంటే అటువంటి ప్రవేశికను అమలు చేయలేనని అది తెలుసుకొన్నది.

సమాఖ్య పథకం క్రింద డొమినియన్ ప్రతిపత్తి ఎందుకు అసాధ్యమయ్యింది? అది ఎందుకు అసాధ్యమయ్యిందంటే బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని ఏర్పరచటం సాధ్యం కాదు గనుక. భారతదేశం డొమినియన్ ప్రతిపత్తిని చేరుకోవాలంటే అది మొదట బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సాధించాలి. బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని సాధించాలంటే మినహాయించే అంశాలన్నీ బదిలీ చేసుకోవాలి. డొమినియన్ ప్రతిపత్తి వికాస దశలో ఇది తొలిమెట్టు.

మినహాయింపు అయిన విషయాలు బదలాయింపు కావని నేనెందుకంటున్నానో ఆ కారణాలు మీలో చాలా మందికి తెలియవు. సమాఖ్య పథకం క్రింద ఉన్నట్లే రాష్ట్ర పథకంలోనూ మినహాయింపు విషయాలు ఉన్నాయని గుర్తుకు తెచ్చుకుని ఇరవై సంవత్సరాల కాలంలో మినహాయింపు విషయాలను బదిలీ చేసుకున్నపుడు సమాఖ్యలో అటువంటి విషయం జరగడంలో కష్టమేమిటని వారు ప్రశ్నిస్తారు. ఈ ప్రశ్న ముఖ్యమైనది కాబట్టి నా కారణాలను చూపుతాను. మొదటగా రాష్ట్రాల సాదృశ్యం తీసుకురావటం తప్పు. సాదృశ్యం ఎందుకు తప్పొ తెలుసుకోవడం చాలా ముఖ్యం. ఇది ఎందుకు తప్పంటే రాష్ట్ర పథకంలో మినహాయింపు బదలాయింపు విషయాల మధ్య తేడా పరిపాలనా సామర్థ్యాల అవసరాల మీద

ఆధారపడి వుంది. సమాఖ్య పథకం క్రింద మినహాయింపు, బదలాయింపుల మధ్య తేడా శాసన పరమైన అవసరాలమీద ఆధారపడిందనీ పరిపాలనా సామర్థ్య అవసరాల మీద ఆధారపడినది కాదనీ అనటానికి రుజువేమీ అవసరం లేదు. కేంద్రంలో ద్వంద్వ ప్రభుత్వాన్ని సైమన్ కమీషన్ సూచించకపోవటంలో ఒక కారణమేమిటంటే విషయాలను మినహాయింపులు అనీ బదలాయింపులు అనీ ఒకదానిలోనుంచి ఒక దానిని విడదీయటానికి వీలులేదని కమీషన్ గ్రహించింది కనుక. అలా విడదీయటంలో అందరి సామర్థ్యం దెబ్బ తింటుందని గ్రహించింది గనుక. సైమన్ కమిషన్ వెలిబుచ్చిన అభిప్రాయాలు భారత ప్రభుత్వం అంగీకరించింది. ఈ విభజన పరిపాలనా పరంగా జరిగినట్టిది కాదు. ఇది శాసన పరమైన అవసర ఫలితమే. ఇది చాలా ప్రధానమైన తేడా. దీనిని ఎవరూ విస్మరించడానికి వీలులేదు.

శాసనపరమైన ఈ అవసరం ఎలా ఉత్పన్నమయింది? కొన్ని విషయాలను మినహాయింపు విషయాలుగా భావించడానికి శాసన పరమైన అవసరం ఎందుకొచ్చిందీ అంటే, భారతీయ రాష్ట్రాలను గురించి అని నేనంటాను. ఇంకా ముందుకువెళ్లి ఏమి చెబుతానంటే సమాఖ్య అనేది బ్రిటిష్‌అధికారంలో వున్న భారత రాష్ట్రాలకు మాత్రమే పరిమితమైనపుడు కొన్ని విషయాలను మినహాయింపు విషయాలుగా భావించవలసిన అవసరం ఉంటుందని. కొన్ని విషయా . మినహాయింపు అనేది సమాఖ్యలోకి భారతీయ రాష్ట్రాల ప్రవేశ ప్రత్యక్ష ఫలితమే. భారతీయ రాష్ట్రాల ఆ పరిస్థితులు కొన్నింటిని మినహాయింపు విషయాలుగా భావించడానికి ఒత్తిడి తీసుకువచ్చే ఏమిటి? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి నేను భారత ప్రభుత్వ చట్టంలోని 180వ విభాగాన్ని మీ దృష్టికి తీసుకురావాలి. 180వ విభాగం ఏమి చెబుతున్నదంటే-

"ఈ చట్టంలోని మూడవ భాగం ప్రారంభానికి ముందు శాసనమండలిలోని సెక్రటరి ఆఫ్ స్టేట్‌గాని ఆయన తరపునుంచి గాని భారతీయ రాష్ట్రాలకు సబంధించి బ్రిటిష చక్రవర్తి విధుల నిర్వహణ పరంగా జరిగిన ఏ ఒప్పందమైనా, ఈ చట్టంలోని మూడవ భాగం ప్రారంభమైన నాటినుంచి చక్రవర్తి తరపున జరిగినట్టుగానే అమలులోకి వస్తుంది. అట్టి ఒప్పందంలో సెక్రటరి ఆఫ్ స్టేట్‌ను గురించి వచ్చిన ప్రస్తావనలన్నీ ఆ ప్రకారం జరిగినట్లుగానే భావించవలసి వుంటుంది."

భారతీయ రాష్ట్రాల ఒడంబడికలు ఇంగ్లండు చక్రవర్తితో మాత్రమే జరిగినవనీ భారత ప్రభుత్వంతో జరిగినవి కావనీ యువరాజులు బట్లర్ కమిటి ముందు చేసిన కమిషన్ అంగీకరించిన, వాదనకు ఈ నిబంధన శాసన రూపాన్ని ఇస్తున్నది.

ఈ సిద్ధాంతం దేనికి దారి తీస్తున్నదో గుర్తించటం తర్వాతి మెట్టు. ఇపుడు ఈ సిద్ధాంతం నుంచి వచ్చినది చాలా ముఖ్యమైనది, కాని దురదృష్ట వశాత్తు దానిని ఎవరూ పట్టించుకోకుండా వదిలివేశారు. భారతీయ రాష్ట్రాలు చేసుకున్న ఒప్పందం ఇంగ్లాండు

చక్రవర్తితో చేసుకున్నదే కాబట్టి ఆ ఒప్పందాల క్రింద ఉత్పన్నమైన అంశాలనూ, విధులనూ నెరవేర్చే బాధ్యత బ్రిటిష్ చక్రవర్తిదేననీ, అన్ని సందర్భాలలోనూ బ్రిటిష్ చక్రవర్తి ఆ విధులను నిర్వర్తించే స్థితిలో ఉండాలనీ నెరవేర్చే బాధ్యత బ్రిటిష్ చక్రవర్తిదేనని అన్ని సందర్భాలలోను ఆతడు ఆ విధులను నిర్వర్తించే స్థితిలో ఉడాలని యువరాజులతో చేసుకున్న ఒప్పందాలు ఇంగ్లండు చక్రవర్తిపై మోపుతున్న బాధ్యతలు ఏమిటి? ఒప్పందాల ద్వారా ఇంగ్లండు చక్రవర్తి అంగీకరించిన, బాధ్యలూ సూత్రం ఏమిటి అంతర్గత కల్లోలాల నుంచీ విదేశీ దురాక్రమణ నుంచీ యువరాజులను కాపాడటం.

ఈ బాధ్యతను చక్రవర్తి ఎలా నిర్వర్తిస్తాడు? చక్రవర్తి ఈ బాధ్యతలను నిర్వర్తించడానికి ఉన్నదని చెబుతున్న ఒకే ఒక మార్గం ఏమిటంటే విదేశీ వ్యవహారాలనూ సైన్యాన్నీ తన ఆధీనంలోకి మినహాయించుకోవటమే.

మినహాయింపు విషయాల అవసరం. శాసన పరమైన అవసరాల మూలంగా వచ్చిందని నేనెందుకు చెప్పానో ఇపుడు మీకు అర్థమై వుంటుంది. శాసన పరమైన ఆ అవసరం చక్రవర్తి చేసుకున్న ఒడంబడిక బాధ్యతనుంచి వచ్చినదే. 180వ విభాగం చెబుతున్నట్టు ఒడంబడిక సంబంధాలు ఉన్నంతవరకు మినహాయింపు విషయాలు, బదలాయింపు విషయాలు కాలేవు. మినహాయింపు విషయాలు బదలాయింపు కావు కాబట్టి డొమినియన్ ప్రతిపత్తి మాట అటుంచి అసలు బాధ్యతాయుతమైన ప్రభుత్వానికే అవకాశం లేదు.

రాజ్యాంగ విషయంలో నేను చేసిన విశ్లేషణ అంతిమ లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని చూస్తే ఈ రాజ్యాంగం స్థిరమైనదనీ, మార్పుకు వీలుకానిదనీ అనటానికి ఎవరూ సందేహించరని నేను అనుకుంటున్నాను. అది మారదు. అందువల్ల అది పురోగమించదు. ఇది మూలం దగ్గరే దెబ్బతిన్న రాజ్యాంగం. భారత దేశ ప్రజలు దీనిని అంగీకరిస్తారో లేదో వారే తేల్చుకోవాలి.

మన గమ్యాన్ని దృష్టిలో పెట్టుకుని నేను ఈ రాజ్యాంగాన్ని చాలా సుదీర్ఘంగా పరిశీలన చేశాను. ఇంత ఇచ్చిందుకు నన్ను క్షమించాలి. ఈ సమస్యపట్ల కొందరు ప్రజలకున్న ధోరణి ఈ విషయాన్ని నేనింత చర్చించేటట్లు చేసింది. ఏ రాజ్యాంగమూ పరిపూర్ణమైనది కాదని నాకు తెలుసు. దోషాలు తప్పకుండా ఉంటాయి. దోషాలకూ స్వభావసిద్ధమైన, సహజమైన లోపాలకూ మధ్య ఉన్న తేడాలను మనం తప్పకుండా చూడాలి. దోషాలను తొలగించుకోగలం. కాని సహజలోపాలను పూరించుకోలేము. కాంగ్రెసు లేదా లిబరల్ ఫెడరేషన్ వారు చేసిన తీర్మానాలలోని అభ్యర్థనలు మంజూరు అయినా కూడా అవి దోషాలను తొలగిస్తాయి. కాని లోపాలను తొలగించగలవా? లోపాలు లేవని నాకు గనుక హామీ ఇస్తే దోషాలున్నా నేను అంత పట్టించుకోను. రాజ్యాంగంలోని పెద్ద లోపమేమిటంటే డొమినియన్ ప్రతిపత్తికి అది దారి తీయదు. ఈ లోపం ఉన్నట్లు అటు కాంగ్రెస్‌కు కాని ఇటు లిబరల్ ఫెడరేషన్‌కు గాని తెలిసినట్లే లేదు. వారి డిమాండ్లకు భారత రాజకీయ వికాస గమ్యంతో ఏమీ సంబంధం లేదు.

వారు దానిని ప్రస్తావించను కూడా లేదు. రాజకీయ అధికారం వస్తుందన్న సంబరంలో పడిపోయి, బ్రిటిష్ ప్రభుత్వానికి తాము చేస్తున్న ప్రతిపాదనలలో, పై విషయమై బ్రిటిష్ ప్రభుత్వం ఒక ప్రకటన చేయాలన్న డిమాండ్ ఉన్నదా లేదా అనిగాని అది చేరిందా లేదా అనిగాని కాంగ్రెస్‌వారు చూసుకోకపోవటం చాలా ఆశ్చర్య పరుస్తున్నది. ఈ విషయం కాంగ్రెస్ మరిచిపోతే మరిచిపోయింది గాని భారతదేశ ప్రజలు మాత్రం మరిచిపోరు, మరిచిపోకూడదు. అలా మరిచిపోవటం చాల ప్రమాదకరం. ఒక వ్యక్తి గాని ప్రజగాని ఒక దారిలో నడిచివెడుతూ మధ్యలో వచ్చిన మజిలీ తన గమ్యం కాదన్న విషయం మరిచిపోవటం ఎంత ప్రమాదకరమో, లేదా ఆ దారి ఇంటికి తీసుకు వెడుతుందో లేదో తెలుసుకోకుండా (అప) మార్గంలో సాగిపోతూ గుడ్డిగా గోతిలో పడటం ఎంత ప్రమాదకరమో ఇదీ అంత ప్రమాదకరమూ అవుతుంది.

మీరు నన్ను అపార్థం చేసుకోకూడదు. నేను ఓర్పు లేని ఆదర్శ వాదిని కాను. క్రమంగా అన్నీ వస్తాయిలే అని ఎదురుచూస్తూ వాయిదాల పద్ధతిలో తీసుకునే నిదాన క్రమవాదులను నేను నిందించటం లేదు. ఎందుకంటే అలాంటి వ్యక్తి తనకు ఒక రూపాయి రావలసి ఉన్నచోట అణాకోసం అడుగుతాడు, ఒక పైసా వస్తే గొప్ప విజయం చేకూరిందని ప్రకటిస్తాడు. అటువంటి వారిని చూసి జాలిపడాల్సిందే. నేను కోరేదేమంటే పరిస్థితులు మనలను ఆ విధంగా నిదానక్రమ వాదులుగా చేస్తున్నప్పటికీ మనం వాస్తవ వాదులుగానే ఉండాలి. ఒక వాయిదాను తీసుకొనే ముందు దానిని జాగ్రత్తగా పరిశీలించి రావలసిన పూర్తి మొత్తాన్ని అది గుర్తిస్తున్నదని సంతృప్తి చెందితేనే స్వీకరించాలి. లేకపోతే. సాధారణంగా జరుగుతున్నట్టుగా అది ఆ క్షణానికి సబబుగా అనిపించి ఆ తర్వాత మన బాగుకి ప్రతికూలం కావచ్చును.

భారతదేశం డొమినియన్ ప్రతిపత్తిని ఎలా సాధిస్తుంది అని మీలో కొందరు నన్ను అడగవచ్చు. దానికి నా సమాధానం ఏమిటంటే, సమాఖ్యలో చేరిన రాజకుమారులు అది మంజూరు కావటానికి అంగీకరిస్తే భారతదేశం డొమినియన్ ప్రతిపత్తిని తెచ్చుకుంటుంది అని. భారతదేశానికి డొమినియన్ ప్రతిపత్తి రావటం రాజకుమారులకు అంగీకారం కాకపోతే భారతదేశం డొమినియన్ ప్రతిపత్తిని సంపాదించలేదు. భారతదేశపు రాజకీయ వికాస తంతులను సమాఖ్య, రాజకుమారుల చేతుల్లో పెట్టింది. భారతదేశపు అదృష్టం రాజకుమారుల అధీనంలో ఉన్నది.

భవిష్యత్తు పై ఉన్న ఈ దృక్పథం మీలో చాలమందికి చాలా వింతగా తోచవచ్చు. పార్లమెంటు సార్వభౌమత్వానికి సంబంధించి డైసీ చేసిన అధికారపూర్వక వచనాలతో మనమంతా తన్మయులమై ఉన్నాం. పార్లమెంటు సర్వోత్కృష్టమైనదనీ, మగవారిని ఆడవారిగాను ఆడవారిని మగవారిగాను చెయ్యటం తప్ప ఏపనైనా చేయగలిగేటంత సర్వోత్కృష్టమైనదని నేర్చుకున్నాం. బ్రిటిషు పార్లమెంటు అంతసర్వోత్కృష్టమైనదనీ అనుకుంటే రాజకుమారులు

ఎలా అడ్డు తగులుతున్నారని మీరు అడగటంలో అసహజత్వం ఏమీ లేదు. భారత సమాఖ్యపై బ్రిటిషు పార్లమెంటుకు ఆధిపత్యం లేదని అంగీకరించటానికి మీరు కొంత కష్టపడాల్సి ఉంటుంది. ప్రస్తుతం భారత ప్రభుత్వ చట్టంలో పొందు పరచి ఉన్న సమాఖ్య రాజ్యాంగాన్ని మార్చటానికి దానికి ఉన్న అధికారం చాలా తక్కువగా ఉన్నది.

భారత శాసన సభలకు రాజ్యాంగాన్ని రూపొందించుకొనే హక్కు చట్టం కలిగించలేదనే వాస్తవంపై, భారత రాజకీయ వేత్తలు చాలా బాధపడ్డారు. నిరసన వ్యక్తం చేశారు.

భారత ప్రభుత్వం చట్టం ప్రకారం సమాఖ్య శాసన సభకు గాని రాష్ట్ర శాసనసభలకు గాని రాజ్యాంగాన్ని మార్చటానికి సవరించటానికి అధికారాలు ఏమీ లేవు. చట్టం 308 విభాగం ద్వారా చేసిన ఒక్కపనీ ఏమిటంటే రాజ్యాంగంలో ఏదైనా మార్పును సిఫారసు చేస్తూ తీర్మానం చేసి పార్లమెంటు ఉభయసభల ముందు ఉంచటంకోసం సెక్రటరీ ఆఫ్ స్టేట్స్‌కు పంపటానికి సమాఖ్య శాసనసభను, రాష్ట్రాల శాసనసభను అనుమతించటం. ఇది అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఆస్ట్రేలియా, జర్మన్ సమాఖ్య, స్విట్జర్లాండ్ రాజ్యాంగాలలో ఉన్న నిబంధనలకు భిన్నంగా ఉన్నది. భారత దేశంలోని శాసన సభలు అన్ని వర్గాలకు, అన్ని ప్రయోజనాలకు పూర్తి ప్రాతినిధ్యం వహిస్తూ ఉన్నపుడు వాటికి కొన్ని నిర్దిష్టమైన పరిమితులకు లోబడి రాజ్యాంగ రచనాధికారం ఇవ్వకపోవటానికి కారణాలు కనిపించటం లేదు దాన్ని అలా ఉండనివ్వండి, రాజ్యాంగంలో ఏమార్పులూ చేయలేని, మినహాయింపు అంశాల బదలాయింపు చేయటం అటుంచి ఓటు హక్కును కూడా మార్చలేదు. రాజ్యాంగాన్ని మార్చే బ్రిటిష్ పార్లమెంట్‌కే ఉంది. సమాఖ్య రాజ్యాంగాన్ని మార్చటానికి పార్లమెంటుకు కూడా హక్కులు లేవని చాలా మందికి తెలిసినట్టులేదు. ఏమయినప్పటికి వాస్తవం ఇది. మనం ఎంత త్వరగా తెలుసుకుంటే అంతమంచిది.

ఈ దృక్కోణం నుంచి చూస్తే IIవ షెడ్యూలు కున్న ప్రాధాన్యతను ఎక్కువ అంచనా వేయలేము. దానిపై చూపవలసిన శ్రద్ధకూడా చూపలేదని చెప్పటానికి విచారిస్తున్నాను. IIవ షెడ్యూలు అధికార పత్రమే కాదు, రాజ్యాంగం ప్రయాణం చేసే ఒక మార్గం కూడా. షెడ్యూలు మొత్తం శ్రద్ధగా చదవదగినది. షెడ్యూలు ఏమి చెబుతున్నది? II షెడ్యూలు H ఏమి చెబుతున్నదంటే భారత ప్రభుత్వ చట్టంలోని కొన్ని నిబంధనల పార్లమెంటు సవరించవచ్చునని, కొన్ని నిబంధనలను పార్లమెంటు సవరించరాదనీ, ఇది పార్లమెంటు సర్వోత్కృష్టమైనది కాదనీ, రాజ్యాంగాన్ని సవరించటానికి దానికి ఉన్న హక్కు పరిమితమైనదని మరో విధంగా తేలికచేసి చెప్పటమే.

పార్లమెంటు సవరణ చేయజాలదని షెడ్యూలు II చెబుతున్న నిబంధనలను పార్లమెంటు సవరించటం జరిగితే ఏమవుతుంది? షెడ్యూలు II చెప్పే సమాధానం ఏమిటంటే, సమాఖ్యకు రాష్ట్రాల విలీనానికి అది దెబ్బకలిగిస్తుంది. దీని అర్థం ఏమంటే విలీపత్రానికి ఉన్న బద్ధత

స్వరూపాన్ని పోగొట్టినట్టు అవుతుంది. మరోమాటలో చెప్పాలంటే, షెడ్యూలు II పార్లమెంటు సవరించటానికి వీలులేదని చెబుతున్న నిబంధనలను పార్లమెంటు సవరించటం గనక జరిగితే, రాజకుమారులకు సమాఖ్య నుంచి వైదొలగటానికి హక్కు దొరుకుతుంది. కొందరు ప్రసిద్ధ న్యాయవాదులు వేరే అభిప్రాయంలో ఉన్నారని నేను ఎరుగుదును. వారు ఏమంటారంటే, రాజకుమారులు ఒకసారి సమాఖ్యలోకి ప్రవేశించిన తర్వాత దాని నుంచి బయటకు వెళ్ళటానికి వీల్లేదని ఎటువంటి విలువ ఉన్నప్పటికీ నా ఉద్దేశాన్ని నేను తెలియ జేశాను; నా ఉద్దేశం ఆధారరహితం కాదని మాత్రం నేను అంటున్నా.

హౌస్ఆఫ్ కామన్స్‌లో భారత ప్రభుత్వ బిల్లుపై చర్చ జరుగుతున్నపుడు, సోలిసిటర్-జనరల్ సెక్రటరీ ఆఫ్‌స్టేట్స్, ఇరువురూ నేను చెప్పిన వ్యాఖ్యానాన్నే వారు చేశారు.

"నిర్దిష్టమూ కచ్చితమూ అయిన ఒక నిర్మాణంతో సమాఖ్య కావటానికి రాష్ట్రాలు అంగీకరించవు. ఎందుకంటే ఆ నిర్మాణాన్ని మనం తర్వాత మార్చలేము. ఈ అంశం ఉద్దేశం ఏమిటంటే ప్రాథమికమైనవనే భావనలేనట్టి, విలీనీకరణ పత్రానికి హాని కలుగజేయకుండా మార్చదగినట్టి విషయాలను చూపటమే"

"పాథమిక సందర్భాలలో నిర్మాణాన్ని మార్చవలసిన అవసరం వచ్చినపుడు రాష్ట్రాలకు "మేము విలీనమైనది ఈ సమాఖ్యకు కాదు" అని చెప్పే హక్కు ఉంటుంది. నిజమే, సెక్రటరీ ఆఫ్‌స్టేట్ ఏమన్నాడంటే:

"రాష్ట్రాలకు మార్పు కలిగించే బిల్లులోని భాగాలను సవరిస్తే, వారు విలీనీకరణ అయిన షరతులను సరవిస్తున్నట్టు, అపుడు ఎటువంటి పరిస్థితి వస్తుందంటే రాజకుమారులు విలీనీకరణ పత్రాన్ని మార్పు చేశారని చెపుతారు. వాస్తవంగా రాజకుమారుల అధీనంలో ఉన్న ఒడంబడికల నష్టం కలిగించేలా బిల్లును సవరించలేమని ఇది ఖచ్చితంగా చెబుతున్నది. విలీనీకరణకు పత్రం పునాదలకు దెబ్బతగిలేలా బిల్లులో ఏదైనా మార్పు తీసుకువస్తే రాజకుమారులు పార్లమెంటు మధ్య జరిగిన ఒప్పందాలు చెడిపోతాయి, రాజకుమారులకు స్వతంత్రులవుతారు."

"బిల్లు సాధారణ పథకం క్రింద సమాఖ్యలో చేరవలసిందిగా వారిని కోరినప్పుడు, కొన్ని విషయాలను, ముఖ్యంగా వారు విలీనమైన సమాఖ్య ప్రధాన విషయాల గురించి వారు తెలుసుకొనే హక్కు ఉంటుంది. "మీరు సమాఖ్యలో చేరతారా" అని ఒక రాష్ట్రాన్ని మీరు ఈ నెల అడిగి, వచ్చే నెలలో ఆ రా[illegible] విలీనమైన సమాఖ్యకు ఉన్న ప్రధాన అంశాలను మార్పు చేయటం అనేది అసంబద్ధం[illegible]ంది. అందువలన ఒక విధానం అంటూ ఉండాలి. వారు విలీనమైన రాజ్యాంగ [illegible]ంగాన్ని రాష్ట్రాల దృష్టిలో మార్పు అనేది జరగకుండా సవరణలు తీసుకురావటానికి వీలున్నట్టుగా మాత్రమే ఈ బిల్లులోని నిబంధనలు తయారు

చేసుకోవాలి. ఒక రాష్ట్రం విలీనపత్రం చెల్లుబడికి నష్టం ఏమీ కలుగకుండా సవరణలు చేయదగిన నిబంధనలను కూర్చటమే ఈ పథకం ఉద్దేశం

"రాష్ట్రాల విలీనీకరణ పత్రం చెల్లుబడిని ఏమాత్రం మార్పు చెయ్యని, సవరణలు వున్న బిల్లు భాగాలు ఒక పక్కన మరొకపక్క విలీనీకరణ చెల్లుబాటును మార్పు చేసే విషయాలు మరొకపక్కన వున్నాయి. ఇటువంటి పరిస్థితిని పరిశీలించేటపుడు రాష్ట్ర పాలకులు తమ అనుమతి లేనిదే సవరణ తేవటానికి వీలులేని న్యాయపరమైన విషయాలేవో నిర్ణయించుకోటానికి ఎంతో శ్రద్ధతో వ్యవహరించవలసి వుంటుంది. కొన్ని అటు ఇటు వుండే విషయాలు ఉండటం నిజమే. ఉన్న పరిస్థితికి పెద్దంత మార్పు ఏమీ కలుగజేయని కొన్ని చిన్న సవరణలు ఉండవచ్చు. అటువంటి వాటికి కూడ రాష్ట్రాలు "విలీనీకరణపత్రం చెల్లుబాటును ఇది నష్టపరుస్తుంది కాబట్టి మా హక్కులను మేము కాపాడుకుంటాం" అని అభ్యంతర పెట్టడం అసమంజసంగా వుంటుంది. నిజంగానే అటువంటి నష్టం కలుగజేసే విషయాలలో, అంటే అధికార సంతులనానికి భంగకరమైన విషయాలు కార్యనిర్వాహక వర్గం అజమాయిషిలో వున్న విషయం మినహాయింపు, గవర్నర్ జనరల్ తన వివేచనకు తోచినట్టు వ్యవహరించే విషయాలు, రాష్ట్రాలు విలీనీకరణకు సిద్ధం కావాలనుకున్న సమాఖ్య నిర్మాణ స్వరూపాన్ని ప్రధానమైన విషయాలు, రాష్ట్రాలు విలీనీకరణకు వారి అనుమతి లేకుండా సవరించకూడదనేది నిజమే."

గవర్నర్ జనరల్ ఆధిపత్యంలో వున్న ప్రత్యేక ఒదికారాలను మొత్తం విస్తారం సమాఖ్య ముఖ్యాంశాలల ఒకరికి, అందులోని ఒక విషయంలోనే రాష్ట్రాలు 'అది ఒక మార్పు' లేదా 'దానిని మార్చు చేశారు' అని చెప్పటానికి వీలుంది. కాని ఇది ఎల్లప్పటికి భారతదేశ అభివృద్ధి సరిగ్గా జరుగుతందో లేదో చూసుకోవటానికి సరిపోదు. షెడ్యూలు II ప్రకారం ఏమార్పులు చేస్తే విలీనీకరణ పత్రానికి దెబ్బతగుతుందో ఆ మార్పులను పార్లమెంటు గనుక చేస్తే ఏమి జరుగుతుంది అనే ప్రశ్నకు సమాధానం ఏమంటే సమాఖ్యనుంచి బయటికి వెళ్లిపోవటానికి రాజకుమారులకు హక్కు వుంటుంది. మరో మాటలో చెప్పాలంటే అటువంటి మార్పు ఫలితం సమాఖ్యను భగ్న చేయటమే విలీనీకరణ పత్రాన్ని మార్పు కలుగజేయకుండా తీసుకురాలేని మార్పులేమి వుంటాయి. విలీనీకరణ మార్పు కలుగుజేయకుండా పార్లమెంటు సవరణలు ఏమి తీసుకురాలేదని షెడ్యూలు III చెబుతున్న నిబంధనల్లో II ప్రకారం రాజ్యాంగంలో ఈ క్రింది వాటికి సంబంధించి రాజ్యాంగంలో ఎటువంటి మార్పు తీసుకురాలేము (1) సమాఖ్య కార్యనిర్వాహణ అధికారాలను గవర్నర్ జనరల్ వుపయోగించటం; (2) గవర్నర్ జనరల్ విధుల నిర్వచనం, (3) సమాఖ్య కార్యనిర్వాహణ అధికారం (4) మంత్రి మండలి విధులు మంత్రులను ఎన్నుకోవడం ఆహ్వానించటం వారికి బాధ్యత అప్పగించటం వారి పదవీ కాల పరిమితి; (6)గర్నర్ జనరల్ తనకు వివేచనకులోబడి వ్యవహారించటం లేక తానుగా

సొంత నిర్ణయాలకు రావటమూ నిర్ణయించుకోవటం (6) విదేశీ వ్యవహారాలు, రక్షణకు సంబంధించి గవర్నర్ జనరల్ విధులు; (7) భారతదేశం అందులోని ఏ భాగమైన శాంతి బధ్రతలకు సంబంధించి గవర్నర్ జనరల్ కున్న ప్రత్యేక బాధ్యతల ; (8) సమాఖ్య ప్రభుత్వం ఆర్థిక నిలకడ, అప్పు పరిస్థితి; (9) భారతీయ రాష్ట్రాల హక్కులు వాటి రాజకుమారుల హక్కులు, హెూదా; (10) చక్రవర్తి ఆదేశాల పత్రం గవర్నర్ జనరల్ ఇవ్వటం; (11) సమాఖ్య ప్రభుత్వ వ్యవహారాలకు సంబంధించిన సమాచారాలు సేకరించి తనకు పంపడానికి తన వివేచానుసారంగా గవర్నర్ జనరల్ వ్యవహరించటానికి నియమావాళిను తయారుచేయడంలో సెక్రటరీ ఆఫ్ స్టేట్ పర్యవేక్షణ

రాజ్యాంగ పరంగా చేయకూడని వాటిని షెడ్యూల్ II చాలా విపులంగా చెబుతుంది. నేను వాటిలో కొన్నింటిని మాత్రమే ఇచ్చాను. రాజ్యాంగంలో మార్పులు తీసుకురావటానికి పార్లమెంటుకు ఎంత పరిమితమైన అధికారం ఉన్నదో చూపటానికి ఇవి సరిపోతాయి.

పార్లమెంటు అధికారం ఎందుకు పరిమితమైనది? దీనిని అర్థం చేసుకోవాలంటె పార్లమెంటే అధికారానికున్న అసలు పరిస్థితులను గమనించవలసి వుంటుంది. చట్టప్రకారం పార్లమెంటు శాసనం చేసే · అధికారంలో అవి అధీనంలో వున్న దేశాలకు మాత్రమే పరిమితమైంది. రాజు అధీనంలోనికి రాని రాష్ట్రాల అవి ఎంత శ్రేష్టమైన అక్కడ కూడా శాసనం చేసే అధికారం పార్లమెంటుకు లేదు. భారత ప్రభుత్వచట్టం రాష్ట్రాలకు వున్న హెూదాలో మార్పు ఏమీ చేయలేదు. సమాఖ్యకు ముందు వున్నట్లుగానే అవి సమాఖ్య ఆవిర్భవించిన తర్వాత కూడ రాష్ట్రంలో విదేశ ప్రాంతాలుగానే ఉండిపోయాయి. భారతసమాఖ్యకు ఇది చాలా అసాధారణమైన పరిస్థితి. అంటే వివిధ భూభాగాలు పరస్పరం విదేశీ ప్రాంతాలుగా వుంటాయి. చట్టం రాష్ట్రాలను రాజు అధీనంలో వున్న ప్రాంతాలుగా రూపొందించలేదు కాబట్టి వాటి విషయంలో శాసనం చేసేందుకు పార్లమెంటుకు అధికారం రాదు. విలీనీకరణ పత్రం నుంచి పార్లమెంటు రాష్ట్రాలపై ఆధిపత్యం సంపాదించుకుంటుంది. అలా జరగటం వల్ల రాష్ట్రాలు తమ పత్రాలద్వారా బదలాయించిన విషయాలపైన మాత్రమే పరిమితమైన అధికారం మాత్రమే పార్లమెంటుకు లభిస్తుంది. పార్లమెంటు అధికారం పరిమితం కాక మరోలా వుండదు ప్రివీకౌన్సిల్ మాటల్లో చెప్పాలంటే ప్రవాహం తన పుట్టుకకంటె ఏ ఎత్తుకు ఎదగలేదని అన్నట్టుగానే పార్లమెంటు విలీనీకరణ పత్రం ఇచ్చిన వాటికంటె ఎక్కువ అధికారాలను రాష్ట్రాలపై ఉపయోగించలేదు. రాజ్యాంగాన్ని సవరించడంలో పార్లమెంటుకున్న అధికారం ఎందుకు పరిమితమై వున్నదో ఇది వివరిస్తున్నది.

ఇంతవరకు జరిగిన విశ్లేషణ మార్పు తీసుకు రావటానికి పార్లమెంటుకున్న అధికారం విలీనీకరణ పత్రం ద్వారా పరిమితమై వున్నదనీ ఎక్కువ అధికారం పొందవలసి వుంటే రాజకుమారుల పూర్వ అనుమతి పొందవలసి వుంటుందని చెబుతున్నది. చట్టం నిబంధన

శాసనపరమైన ఫలితం దిగ్భ్రాంతి ఏమి కలిగించకపోవచ్చు కాని పార్లమెంటుకు మార్పు చేయడానికి అధికారం లేని నిబంధనల్లో రక్షణ, విదేశీ వ్యవహారాల వంటి విషయాలను మినహాయింపు వర్గం నుంచి, బదలాయింపు వర్గానికి బదిలి చేయటానికి సంబంధించిన విషయాలు కూడ చేరివున్నాయని పార్లమెంటుపై అటువంటి అధికారాన్ని రాజకుమారులకు ప్రత్యేకంగా కలుగజేసి అందుకు అనుమతించిన నాడు మాత్రమే పార్లమెంటుకు అధికారం వుంటుందనే విషయాన్ని చూడండి. సమాఖ్య ఫలితాలు ఎంత తీవ్రతరంగా వుంటాయో మీరు ఈ పాటికి గమనించివుంటారు. సమాఖ్య ఏర్పాటు అంటె యాజమాన్యం పార్లమెంటు చేతుల్లోంచి రాజకుమారుల చేతుల్లోకి మారి పోవటమె. రాజకుమారులను విధి నిర్ణేతలుగా సమాఖ్య తయారు చేసింది. వారి అనుమతి లేకుండా భారతదేశం రాజకీయంగా పురోగమించలేదు.

సమాఖ్య ఇతర ఫలితాలను కూడా మనం గమనించాలి. ఒకటి మాత్రం నేను ప్రస్తావిస్తాను. అదేమంటే, ఈ సమాఖ్య అంగీకారం గనక అయితే, మార్పుకోసం పోరాటంలో బ్రిటిష/ భారతీయుల పరిస్థితిని బలహీన పరుస్తుంది. ఇంతవరకు, భారత ప్రజలు బ్రిటిషు పార్లమెంటు మధ్య జరుగుతున్న పోరాటంలో బ్రిటిషు పార్లమెంటు ఇప్పుడూ బలహీనంగానే ఉన్నది. మార్పుకు తమ ఇష్టం తప్ప ప్రజలకున్న హక్కును వ్యతిరేకించటానికి పార్లమెంటు దగ్గర ఏదీ లేదు. సమాఖ్య ఆవిర్భావం తరువాత ఈ పరిస్థితి తారు మారవుతుంది. భారతప్రజల పరిస్థితి బలహీన పడుతుంది. బ్రిటిష్ పార్లమెంటు బలపడుతుంది. సమాఖ్య తర్వాత, పార్లమెంటు, మార్పు కావాలని చేస్తున్న కోరికను అంగీకరించటానికి తనకు ఇష్టమేకాని మార్పు తేవటంలో తనకున్న అధికారం పరిమితమైనదని మార్పును కోరేముందు, భారతీయుల రాజకుమారుల అనుమతి తీసుకోవలసి ఉంటుందని చెప్పే పరిస్థితిలోకి వెళ్లిపోతుంది.

ఒకసారి సమాఖ్యను ఒప్పుకొని, దానిక్రింద వచ్చే పరిణామాలను అంగీకరించిన తర్వాత భారతీయులకు ఇక ఏ సమాధానం చెప్పటానికి ఉంటుంది?

## VIII

## సమాఖ్యవలన ఆపద

భారత రాష్ట్రాలను మనం ఏమి చేస్తాం? ఆ ప్రశ్న చాలాసార్లు అడుగుతుంటారు. ప్రజా ప్రభుత్వంలో విశ్వాసం ఉన్నవారు కొందరు వాటిని పూర్తిగా రద్దు చేయాలని కోరుకుంటారు. ప్రభుత్వ రూపాల గురించి లక్ష్య పెట్టని వారు ఈ వాదాన్ని త్రోసిపుచ్చుతారు. కాని వారు కూడా, ఏది ఉత్తమంగా పనిచేస్తుందో అదే ఉత్తమమైనదనే భావనకు కట్టుబడి ఉండాలి. భారతరాష్ట్రాలు లాగా పని చేస్తాయని చెప్పగలమా? దీనికి అవునని సమాధానం చెప్పటానికి కనీసం అన్ని రాష్ట్రాలకూ వర్తించే సమాధానం చెప్పటానికి సిద్ధమైన వారు ఎవరైనా ఉన్నారేమో నాకు తెలియదు. రాష్ట్రాల అంతర్గత పరిపాలన అక్రమ పరిపాలనకు దుష్ట

పరిపాలనకు మారు పేరయింది.

రాష్ట్రాలలో ఈ అక్రమ పరిపాలన దుష్ట పరిపాలన ఎందుకు జరిగిందనే ప్రశ్న ప్రజలు ఎప్పుడూ అడుగుతుంటారు. మామూలు సమాధానం ఏమంటే ఇది వ్యక్తిగత పరిపాలన ఫలితమని ప్రతిచోటా చేస్తున్న అభ్యర్థన ఏమంటే వ్యక్తిగత పరిపాలన మార్చి ప్రజాప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలని. ఈ అభ్యర్థన సామర్థ్యం పట్ల నాకు చాలా అనుమానాలున్నాయి. చాల సందర్భాలలో ప్రజా ప్రభుత్వాన్ని బదులుగా పెట్టటం రాష్ట్రప్రజల బాధలకు నివారణ అవుతుందని నేను అనుకోవటం లేదు. చెరుపులుపాలకుల దుష్పరిపాలన నుంచి ఎంత వస్తాయో, వనరులు లేకపోవటం మూలంగా కూడా అంతే వస్తాయని ఖచ్చితంగా చెప్పగలను. భారత రాష్ట్రాలకు వనరులు చాలా తక్కువగా ఉన్నాయని చాలమందికి తెలియదు.

కొన్ని వాస్తవాలను మీకు తెలియజేస్తాను. మొత్తం 627 రాష్ట్రాలలో సాలీనా ఆదాయం ఒక కోటి మించిన రాష్ట్రాలు పది మాత్రమే ఉన్నాయి. ఈ పదిలో అయిదింటికి ఒక కోటికి కొంచెంపైన ఉంటే మూడింటికి 2,21/4 కోట్ల మధ్య ఆదాయం ఉన్నది. ఒక దానికి 31/4 కోట్లకు కొంచెంపైన ఉంటే మరొకరాష్ట్రానికి సుమారు 8 కోట్ల ఆదాయం ఉన్నది. 1 కోటి 50 లక్షలమధ్య ఆదాయం ఉన్న రాష్ట్రాలు తొమ్మిది ఉన్నాయి. 50 నుంచి 25 లక్షల ఆదాయం ఉన్నవి సుమారు 12 ఉన్నాయి. 25 నుంచి 10 లక్షల ఆదాయం ఉన్న వి ముప్పై ఉన్నాయి. మిగిలిన 566 రాష్ట్రాలకు సాలీనా ఆదాయం 10 లక్షలకు తక్కువ ఉన్నది. ఇది, పదిలక్షలకు తక్కువ ఆదాయం ఉన్న రాష్ట్రాలు ఎంత చిన్నగా ఉంటాయో అనే అభిప్రాయం మనకేమి కలుగ జేయదు. మరికొన్ని ఉదాహరణలు ఇవ్వాలి. ఈ 566 రాష్ట్రాలలో రూ500 ఆదాయం ఉండి జనాభా 206 మంది మాత్రమే ఉన్న రాష్ట్రం ఒకటి ఉన్నది. మరొకటి రూ.165ల ఆదాయంతో 125 మందిజనం. మరొక దానికి ఆదాయం రూ 136 ఉంది జనాభా 239 మంది. మరొకటి ఆదాయం 128 ఉండి జనాభా 147 ఉంది. మరొకటి ఆదాయం 80 ఉండి జనాభా 27 ఇందులో ప్రతి ఒక్క రాష్ట్రమూ స్వయంపాలనాధికారం గల రాష్ట్రాలే, ఆఖరికి రూ.80 ఆదాయం ఉండి 27మంది జనం ఉన్న రాష్ట్రం కూడా.

ఈ రాష్ట్రాలు స్వయం నిర్ణయాధికారం కలిగినవైనవి అనటంలో ఉద్దేశం ఏమంటే రెవిన్యూ, కార్యనిర్వాహకమైన, న్యాయ సంబంధమైనటువంటి శాంతి భద్రతల కింద వచ్చే విషయాలకు సంబంధించిన సౌకర్యాలు, విద్య పరిశుభ్రత, రోడ్ల వంటి ప్రజాసంక్షేమానికి సంబంధించిన సదుపాయాలన్నింటిని తన ప్రజలకు అందచేసే బాధ్యతలను తీసుకోవటం. బొంబాయిలో 12కోట్ల ఆదాయం ఉన్న మనమే పరిపాలనను ఒక నాగరికమైన ప్రమాణంలో ఉంచుకోవటం కష్ట మవుతున్నది. అంతే ఆదాయం ఉన్న ఇతర రాష్ట్రాలు కూడా అదే ఇబ్బందికి గురవుతున్నాయి. అటువంటప్పుడు జనాభా కొన్ని వేలు ఉండి, ఆదాయం కొన్ని

వందలు ఉన్న రాష్ట్రం, ఒక నాగరికుడు తన అవసరాలను పూర్తిగా తీర్చగలగాలని ప్రభుత్వాన్ని కోరుకుంటాడో, అట్టి అవసరాలను ఎలా తీర్చగలుగుతుంది? ఒక ఆదర్శ వంతుడైన రాజకుమారుడు ఉండి, అతనికి సదుద్దేశాలు ఉన్నప్పటికీ ఈ పని సాధ్యంకాదు.

దీనికి ఉన్న ఒకే ఒకమార్గం ఏమంటే, భారత రాష్ట్రాల ఆక్రమణలో ఉన్న ప్రాంతాన్ని పునర్వ్యవస్థీకరించటమే. దీనికి సమంజసంగా కనిపించే మార్గం ఏమంటే ఒక నిర్దిష్టమైన పరిమాణం, నిర్దిష్టమైన ఆదాయం పెట్టుకొని అపుడు ఒక కొత్త రాష్ట్రంగా ఆ భూభాగాలను కలపటం, ఆ ప్రాంతంలో ఏదైనా ఒక భాగాన్ని పాలిస్తున్న పరిపాలకులకు భరణం ఇచ్చి పంపించివేయటం. ఒక ప్రాంతం కొలతలు, ఆదాయాన్ని బట్టి తనకు ఉన్న వనరులతో తన ప్రజలకు తగుపాటి పరిపాలనా సౌకర్యం కలుగచేయగలవు అని చెప్పుకోగల రాష్ట్రాలను మాత్రమే ఉంచుకోవాలి. ఈ పరీక్షలో నిలబడ లేని రాష్ట్రాలు రద్దుకావాలి. మరోమార్గం లేదు. ఇది ఏదో జరగాల్సిన విషయం కాదు, నేనంటాను, ఈ పని చేయటం మన విధి, పవిత్ర కర్తవ్యమూ అని.

తన భూభాగాన్ని పాలించే పౌరసత్వం హక్కు రాజకుమారులకు ఉన్నదని కొందరు అనుకుంటారని నాకు తెలుసు. కాని నేను అడుగుతాను, ఏది ఎక్కువ ముఖ్యమని, రాజకుమారుల హక్కులా? ప్రజాక్షేమమా? రాష్ట్రాలకు ఉన్న గొప్ప స్నేహితులు కూడా ప్రజాక్షేమం కంటే రాజకుమారుల హక్కులే ముఖ్యమని అనరని నాకు ఖచ్చితంగా తెలుసు. ఈ రెండూ ఒకదానితో మరొకటి పొసగనపుడు, ఏది తప్పుకోవాలి? ఇక్కడ కూడా రాష్ట్రాల గొప్ప స్నేహితులు కూడా రాజకుమారుల హక్కులు కొనసాగించటం కోసం ప్రజాక్షేమాన్ని త్యాగం చెయ్యవలసి ఉంటుందని అనరని ఖచ్చితంగా నాకు తెలుసు.

భారత రాష్ట్రాల పున్నిర్మాణ సమస్య రాజకీయ సమస్యకాదు. ఇది ఒక పరిపాలనా సమస్యగానే నాకు కనిపిస్తుంది. ఇది అనివార్యమైన సమస్య కూడా. ఎందుకంటే దీనిని పరిష్కరించ లేక పోయామంటే రాష్ట్రాలలోని ప్రజలను – వారు లక్షలాది మంది ఉంటారు – బాధలలోను, భద్రతలేకుండా చేసిన వాళ్లమే అవుతాం. నేను సూచించిన మార్గం విప్లవాత్మకరమైన మార్గం కాదు. భరణం ఇచ్చి రాజకుమారులను తొలగించి వారి భూభాగాన్ని కలుపుకోవటం అనేది చట్టపరంగా సమ్మతమైన మార్గమే. ప్రజా అవసరాలకోసం ప్రైవేటు వ్యక్తుల హక్కులు ఆస్తులను సేకరించటానికి అనుమతించే భూసేకరణ చట్టంక్రింద మనందరికీ బాగా తెలిసిన సూత్రాలకిందికి ఇది వస్తుంది.

దురదృష్టవశాత్తు, ఇంతవరకూ ఈ దృష్టితో భారత రాష్ట్రాల సమస్యను పరిష్కరించలేదు. మీ ముందు నేను ఉంచుతున్న సమస్య ఏమంటే, ఇది చాలా ముఖ్యమైన సమస్య, "సమాఖ్య ఏర్పడిన తర్వాత ఈ సమస్యను పరిష్కరించటం మీకు సాధ్యం అవుతుందా?". కాదని

నేనంటాను. ఎందువల్ల అని మీరు అడగవచ్చు ఈ అభిప్రాయం ఎలా వచ్చింది?

సమాఖ్యలో ప్రవేశం సంబంధించి రాష్ట్రాలకు, రాజుల పాలనలో ఉన్న ప్రాంతాలకు తేడా ఉందని నేను ముందే సూచించాను. రాష్ట్రాలకు ఇష్టాయిష్టాల నిమిత్తం లేదు.. సమాఖ్యలో భాగాలుగా అవి అంగీకరించ వలసిందే. రాజ పాలిత ప్రాంతాలకు ఇష్టాయిష్టాలు ఉన్నాయి. సమాఖ్యలో వారు చేరవచ్చు. చేరటానికి నిరాకరించవచ్చు. రాష్ట్రాలు, రాజపాలిత ప్రాంతాలు సంబంధించి పరిస్థితి ఇది. మరి సమాఖ్య దృక్కోణం నుంచి చూస్తే పరిస్థితి ఏమిటి? రాష్ట్రాలను విలీనీకరణం చేసుకోవటంలో సమాఖ్యకు ఇష్టాయిష్టాలు ఏమైనా ఉన్నాయా? సమాఖ్య ఏ రాష్ట్రాన్నయినా తనలో చేర్చుకోవటానికి నిరాకరించగలదా? జవాబు లేదని. నిరాకరించేహక్కు సమాఖ్యకు లేదు. సమాఖ్యలో ప్రవేశించే హక్కు రాష్ట్రానికి ఉన్నది. కాని అట్టి ప్రవేశాన్ని రాష్ట్రానికి కనీసం మొదటి 20 సంవత్సరా లవరకూ అయినా నిరాకరించే హక్కు సమాఖ్యకు లేదు. ఇదీ పరిస్థితి. రాష్ట్రం సమాఖ్యలో ప్రవేశం అవటం అంటే అర్థం ఏమిటి? రాష్ట్రం సమాఖ్యలో ప్రవేశించటం అంటే అర్థం నా ఉద్దేశంలో రాష్ట్రానికి ఉన్న సర్వసత్తాక ప్రతిపత్తిని గుర్తించటం అన్నమాట. దాని సర్వసత్తాక ప్రతిపత్తిని గుర్తించటం అంటే అర్థం దాని అవిచ్ఛిన్నతను అంటే దాని భూభాగం స్థిరత్వాన్ని దాని అంతర్గత పాలన అధికారాలను గుర్తించటమే. ఇది 27 మంది జనాభా 80 రూపాయిల ఆదాయం ఉన్న రాష్ట్రానికి కూడా వర్తిస్తుంది. సమాఖ్యలోకి రాష్ట్రాలు విలీనం అవటం వల్ల వచ్చే పరిణామాలు ఇలా ఉంటాయి కాబట్టి, సమాఖ్య ఏర్పాటు అయిన తర్వాత భారత రాష్ట్రాల భూభాగ పునర్నిర్మాణం సాధ్యం కాదని నేను చెప్పటంలో సమంజసత్వం కనబడుతుంది. భారత రాష్ట్రాలలోని ప్రజలు ఎప్పటికీ దుష్పాలనకు లోపభూయిష్టమైన పరిపాలనకు గురి అవుతారు.

బ్రిటిషు ఇండియా ఈ విషయంలో ఇపుడు ఏమైనా చెయ్యగలదా? బ్రిటిషు ఇండియా ఈ విషయంలో ఏమీ చేయలేదని నేననుకుంటాను. బ్రిటిషు ఇండియా బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని తెచ్చుకొని ఉంటే, ఏ రాష్ట్రాన్ని ఏ షరతులపై విలీనం చేసుకోవాలో నిర్ణయించ గలిగేది. రాష్ట్రాల భూభాగం పునర్నిర్మాణాన్ని అంగీకరించటానికి వీలయినంత పెద్ద భాగంగా చేసుకోవటానికి వీలయ్యేది. ఇంత పెద్ద భూభాగం ఉండటం అనేది రాష్ట్రాలు సమాఖ్యలో చేరటానికి ఉన్నా ముందు షరతు దురదృష్ట వశాత్తు బ్రిటిషు ఇండియాకు బాధ్యతాయుతమైన ప్రభుత్వంలేదు. కేంద్రంలో తనకు బాధ్యతాయుతమైన ప్రభుత్వం ఉండే హక్కును నిరాకరించారు. దానిని రాష్ట్రాల ప్రవేశం మీద ఆధారపడేట్టు చేశారు. "రాష్ట్రాలు లేవు, బాధ్యతాయుతమైన ప్రభుత్వం లేదు" అనేది బ్రిటిషు ఇండియా పరిస్థితి అయినప్పుడు తనకు బాధ్యతాయుతమైన ప్రభుత్వం ఉంటే రాష్ట్రాలతో ఎలా వ్యవహరించేదో, ఆ విధంగా వ్యవహరించే అవకాశం లేదు. అందుకనే నేను, బ్రిటిషు ఇండియన్లు మొదట సమాఖ్యను అడిగి బాధ్యతను బ్రిటిషు ఇండియాకు వర్తింప జేయవలసిందిగా

అడగాలని, నేను చెప్పటమూ, ఎప్పుడూ అదే అభిప్రాయాన్ని కలిగి ఉండటమూ జరుగుతున్నది. ఒకసారి దానిని సాధించిన మీదట, స్వేచ్ఛ, సర్వసత్తాక సుపరిపాలన ప్రాతిపదికపై అఖిల భారత సమాఖ్య ఏర్పడటానికి మార్గం సుగమం అయ్యేది. అది సమాఖ్య ఏర్పాటుతో సాధ్యపడదు.

సమాఖ్య పథకానికి ఉన్న కొన్ని అవలక్షణాలను ఇదివరకే మీ దృష్టికి తీసుకువచ్చాను. ఇపుడు మీ దృష్టికి తీసుకు వచ్చింది అవలక్షణం కంటే పెద్దది. ఇది సమాఖ్యకే దెబ్బ. రాష్ట్రాల ప్రజలకు సంబంధించి ఇది విధి వ్రాతవంటిది. ఒక సారి అమలు జరిగిందంటే ఇక దానిని తప్పించుకోవటానికి వీలు లేనటువంటిది.

నేను సూచించిన మార్గాల ద్వారా లేదా ప్రజా సంక్షేమానికి అనువుగా ఉండే ఏ ఇతర మార్గం ద్వారా అయినా అవి అనుకుంటే, సర్వోత్కృష్టమైన అధికారం రాష్ట్రాల సమస్యను పరిష్కరించగలదని నేను విశ్వసిస్తాను. సర్వోత్కృష్టత అంటే త్రిమూర్తులవంటిది. రాష్ట్రాలను సృష్టించింది కాబట్టి అది బ్రహ్మ, వాటిని కాపాడుతుంది కాబట్టి విష్ణువు, వాటిని నాశనం చేయగలదు గాబట్టి శివుడు రాష్ట్రాలకు సంబంధించి సర్వోత్కృష్టత ఈ మూడు పాత్రలను వివిధ సమయాలలో నిర్వహించింది. ఒకప్పుడు ఇది శివుని పాత్రను ధరించింది. ఇపుడు అది విష్ణువుపాత్రను ధరిస్తున్నది. రాష్ట్రాలకు సంబంధించి విష్ణువు పాత్రను ధరించటం అనేది, ప్రజా సంక్షేమం దృష్టితో చూస్తేమాత్రం, చాల క్రూరమైన చర్య. బ్రిటిషు ఇండియా దీనిలో భాగం అవుతుందా? ఇదిమీరు పరిశీలించుకోవాలి.

## IX

## రాష్ట్రాలు లేని సమాఖ్య

సమాఖ్యను సమర్థిస్తూ వాదన చేసే దృక్కోణం మరొకటి ఉన్నది. ఆవాదనను పరిశీలించటానికి ఉపక్రమిస్తాను.

సర్వాధికారాలు గల రాష్ట్రాలను రాజ్యాంగం ఏర్పరిచిందని వాదిస్తుంటారు. రాష్ట్రాలకు ఈ సర్వాధికారాలు ఉన్నాయంటే వాటికి స్వతంత్రం ఉన్నట్టు, ఉంటే బ్రిటిషు ఇండియా ఐక్యతకు భంగం కలుగుతుంది. దీనిని ఎదుర్కోవాలి. రాష్ట్రాలు ఐక్యంగ ఉండేటట్టు, బ్రిటిషు పరిపాలన ఫలితంగా గతవంద ఏళ్ల నుంచి నిర్మించుకున్న ఐక్యత ఏకరూపతను వివరాలలో కాకపోయినా ప్రాథమిక విషయాలలోనైనా కాపాడుకోవటానికి వీలు ఉండేలా ఒక కట్టడి చేసే అధికారాన్ని ఏర్పాటు చేసుకోవాలి.

సర్వాధికారాలు గల రాష్ట్రాల ఏర్పాటు అంటే ఒక కేంద్ర ప్రభుత్వ ఏర్పాటును ఒక అవసరంగా చేస్తుందనే అర్థమే. అయితే ఈ వాదన చాలా గట్టిదిగానే ఉంటుంది. అందరూ ఈ ఉద్దేశాన్ని అంగీకరిస్తారనుకుంటాను. అన్ని రౌండ్ టేబుల్ సమావేశాల్లోనూ ఒక్క మహమ్మద్

ఇక్బాలే కేంద్ర ప్రభుత్వ ఏర్పాటును వ్యతిరేకిస్తూ వచ్చాడు. కులం తెగల నిమిత్తం లేకుండా ప్రతి ప్రతినిధీ ఆయనతో విభేదించారు. సర్వాధికారాలు గల రాష్ట్రాలను ఏర్పాటు చేసుకోవటంతో, రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు తప్పనిసరి అవుతుందని, అరాచకత్వానికి దారి తీస్తాయని దృఢపరుస్తూ వచ్చారు.

ఈ వాగ్దానం సమంజసమైన పరిమితులు దాటి పోయింది. భారత దేశానికంతా ఒక కేంద్ర ప్రభుత్వం అవసరమనే వాదనను సమర్థిస్తుంది. బ్రిటిషు ఇండియాకు కేంద్ర ప్రభుత్వ ఏర్పాటును సమర్థించే వాదనను మొత్తం ఇండియాకు ఒక కేంద్ర ప్రభుత్వం ఉండాలని ఉపయోగిస్తున్నారు. బ్రిటిషు ఇండియాలో సర్వాధికారాలుగల రాష్ట్రాలను ఏర్పాటు చేయటం భారత రాష్ట్రాలతో సహా మొత్తంభారతదేశానికి ఒక కేంద్ర ప్రభుత్వం అవసరాన్ని సమర్థిస్తుందా లేదా అని మీరు పరిశీలించాలి. నా అభిప్రాయం ఏమంటే సర్వాధికారాలు గల రాష్ట్రాల ఏర్పాటు అంటే మొత్తం భారతదేశానికి ఒక కేంద్ర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయవలసిన అవసరం లేదని.

బ్రిటిషు ఇండియాలో సర్వాధికారాలు గల రాష్ట్రాల ఏర్పాటుకు రెండు విషయాలు అవసరమవుతాయి. 1. బ్రిటిషు ఇండియాకు ఒక కేంద్ర ప్రభుత్వం 2. అట్టి కేంద్ర ప్రభుత్వ ఏర్పాటు సమాఖ్యగా ఉండాలి గాని ఐక్య ప్రభుత్వంగా ఉండకూడదు. కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య శాసన సంబంధమైన కార్య నిర్వాహక పరమైన అధికారాలను చట్టపరంగా విభజించటం లేదా పంపకంపైనే సమాఖ్య సారం ఇమిడి ఉన్నది. కేంద్ర, రాష్ట్రాల అధికారాలను నిర్వచించి వాటికి హద్దులను ఏర్పాటు చేసి ఉంచారు. ఒకదాని అధికార ప్రాంతాన్ని మరొకటి ఆక్రమించుకోవటానికి వీల్లేదు. రాష్ట్రాలకు సర్వాధికారాలు ఉంటాయి అంటే వాటి అధికారాలు నిర్వచింపబడి వాటికి దత్తమై ఉంటాయని. రాష్ట్రాల సర్వాధికారాన్ని వాస్తవం చెయ్యాలంటే కేంద్ర ప్రభుత్వ అధికారాలను పరిమితం చెయ్యాలి. లేకుంటే అది రాష్ట్రాల అధికారాలను ఆక్రమించుకుంటుంది. సులభంగా చెప్పాలంటే, సర్వాధికారాలు ఉండటం అంటే శాసనపరంగా అధికారాల నిర్వచనం పరిమితం చేయడం. ఎక్కడైతే అధికారాల నిర్వచనం, పరిమితం జరుగుతుందో అక్కడ సమాఖ్య ఉండాలి. బ్రిటిషు ఇండియాకు ఉండే కేంద్రప్రభుత్వం సమాఖ్య రూపంలో ఉండాలని రాష్ట్రాల సార్వాధికారం కోరుకుంటున్నదని నేను ఎందుకు అన్నానో మీకు ఇపుడు అర్థమై ఉంటుంది. అఖిల భారత సమాఖ్యను ఇది సమర్థించదు. రాష్ట్రాలను ఎందుకు తీసుకు రావలసిన అవసరం ఉన్నదో, సమాధానం ఇంకా చెప్పవలసి ఉన్నది. బ్రిటిషు ఇండియా సమాఖ్యకాక అఖిల భారత సమాఖ్య ఆవశ్యకతను కోరుతున్న వారు ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాలి.

నేను చెప్పినట్టుగా, కావలసిన విషయం ఏమంటే, బ్రిటిషు ఇండియాకు కేంద్ర ప్రభుత్వం సమాఖ్య రూపంలో ఉండాలని, దానిని రాజ్యాంగం గుర్తించిందనీ.

1935 నాటి భారత ప్రభుత్వ చట్టం రెండు విభిన్న సమాఖ్యలను ఏర్పాటు చేసిందనే విషయాన్ని చాలమంది గుర్తించలేక పోయారు. ఒకటి ఏమంటే బ్రిటిషు ఇండియా రాష్ట్రాల సమాఖ్య, రెండోది ఏమంటే బ్రిటిషు ఇండియా రాష్ట్రాల, భారతీయ రాష్ట్రాల సమాఖ్య .ఇంత ముఖ్యమైన విషయాన్ని చాలమంది గుర్తించ లేకపోవటం చాల ఆశ్చర్య కరమైన విషయం. భారత ప్రభుత్వ చట్టం రెండు సమాఖ్యలను ఏర్పాటు చేసిందన్న విషయం నిర్వివాదాంశం. ఎవరికైనా ఏదైనా సందేహం ఉంటే 213, 13 భాగాలను రెండు మూడు భాగాలను కలిపి చదవాలి. అఖిల భారత సమాఖ్య ఒకటి ఉన్నదని ఆ సమాఖ్యకు ఒక రాజ్యాంగం రూపొందించి వున్నదని, రెండు మూడు భాగాలు తెలుపుతున్నాయి. రాష్ట్రాలకు భిన్నంగా బ్రిటిష్ ఇండియా రాష్ట్రాలకు ఒక సమాఖ్య వున్నదనీ, దానికి ఒక రాజ్యాంగం వున్నదనీ మూడూ, పదమూడూ భాగాలు చెబుతున్నాయి. పదమూడవ భాగం తాత్కాలికమైన నిబంధనలకు సంబంధించి ఉన్నంత మాత్రాన బ్రిటిషు ఇండియా పథకాన్ని సమాఖ్యకు ఏమంత తక్కువ కానిదిగా చేయదు, ఎందుకంటే శాసనం అంటే శాసనమే. దానికి కాలపరిమితి తాత్కాలికమైనా, శాశ్వతమైనా.

భారత ప్రభుత్వ చట్టం బ్రిటిష్ ఇండియా రాష్ట్రాలకు, ఒక సమాఖ్యను మరొక అఖిల భారత సమాఖ్యను ఏర్పరుస్తున్నదనేది కాదనటానికి వీల్లేదు. ఈ రెండు సమాఖ్యలకు మధ్య వున్న తేడా ఏమిటి? సమాఖ్య శాసనాధికారాలలో ఏమైనా తేడా వున్నదా? దీనికి సమాధానం లేదనే. అమలులో వున్న సమాఖ్య బ్రిటిష్ ఇండియా సమాఖ్య అయినా, అఖిల భారత సమాఖ్య అయినా సమాఖ్యశాసనాంశాల జాబితా ఒకటిగానే ఉంటుంది. అములులో వున్న సమాఖ్య ఒకటైనా, మరొకటైనా ఉమ్మడి జాబితా కూడా ఒకటిగానే ఉంటుంది.

ఆర్థిక అధికారాలలో ఏమైనా తేడా ఉన్నదా? దీనికి సమాధానం మళ్ళీ లేదనే. అఖిల భారత సమాఖ్య అయినా, బ్రిటిష్ ఇండియా సమాఖ్య అయినా పన్ను విధించే అధికారం ఒకటిగానే ఉంటుంది.

సమాఖ్య న్యాయ సంబంధమైన నిర్మాణంలో ఏమైనా తేడా ఉన్నదా? ఏమీ లేదు. ఫెడరల్ కోర్టు, అఖిల భారత సమాఖ్యకు ఎంత అవసరమో, బ్రిటిష్ ఇండియా సమాఖ్యకు అంతే అవసరం.

ఈ రెండు సమాఖ్యలలో తేడా ఏమిటి అని? ఒక విషయంలో ఈ రెండింటికీ తేడా వున్నది? ఈ తేడాని తెలుసుకోవాలంటే సెక్షన్ 313ను సెక్షన్ 8తో పోల్చి చూడాలి. ఈ పోలిక ఏమి చెబుతున్నదంటే ఈ సమాఖ్య బ్రిటిష్ ఇండియా సమాఖ్య అయితే కార్య నిర్వాహక అధికారం కౌన్సిల్‌లోని గవర్నర్ జనరల్‌కు ఉంటుంది. సమాఖ్య అఖిల భారత సమాఖ్య అయితే బదలాయింపు విషయాలలో కార్యనిర్వాహక అధికారం శాసన మండలికి బాధ్యులైన మంత్రుల సలహాపై వ్యవహరించే గవర్నర్ జనరల్‌కు ఉంటుంది. మరొక మాటలో

చెప్పాలంటే బ్రిటిష్ ఇండియా సమాఖ్య మాత్రమే ఉంటే అఖిల భారత సమాఖ్య లేసంత వరకూ కేంద్రంలో బాధ్యతాయుతమైన ప్రభుత్వం ఉండదు.

దీని అర్థం ఏమంటే బ్రిటిష్ ఇండియాకు బాధ్యత మంజూరు చెయ్యాలంటే రాష్ట్రాల ప్రవేశం అనేది ముందు పెట్టిన షరతు అని. రాష్ట్రాల ప్రవేశం అంత ప్రధానమైనది ఎందుకయిందని నన్ను మీరు అడుగుతారు. భాగాల భద్రత, ఐక్యతకు భంగం కలిగేలా బయటనుంచి వచ్చిన ప్రమాణాల ఫలితం మూలంగానే అన్ని సమాఖ్యలూ ఆవిర్భవించాయి. బ్రిటిష్ సామ్రాజ్యవాదం రాష్ట్రాలను లొంగదీసుకుంటుందనే భయంతోనే ఉత్తర అమెరికా రాష్ట్రాలు సమాఖ్యగా రూపొందాయి. సంయుక్త రాష్ట్రాలు దండెత్తుతాయని లేదా కలుపుకుంటాయనే భయంతోనే కెనడా రాష్ట్రాలు సమాఖ్యగా రూపొందాయి. జపాను ముట్టడి భయంతోనే ఆస్ట్రేలియా కాలనీలు సమాఖ్యగా రూపొందాయి. భారత సమాఖ్య అటువంటి పరిస్థితుల ప్రభావం కాదనేది విదితమే బ్రిటిష్ ఇండియా భారతీయ రాష్ట్రాలు రెండింటిపైనా దాడి చేయడానికి భారతదేశ సరిహద్దు వద్ద ఏ కొత్త ఆక్రమణ దారుడూ పొంచి ఉండలేదు. లేదా బ్రిటిష్ ఇండియా, భారతీయ రాష్ట్రాల మధ్య శాంతి ఏర్పరచడానికి ఈ సమాఖ్య అవసరం పడలేదు. బ్రిటిషు చక్రవర్తి ఏలుబడి కింద బ్రిటిషు ఇండియా ఉన్నదా, భారతీయ రాష్ట్రాలు చక్రవర్తి ఆధీనంలో ఉన్నాయా అనేది అప్రస్తుతం. విదేశ వ్యవహారాలకు సంబంధించి ఇందులో శాంతి, యుద్ధం, రెండూ ఉంటాయి. ఈ రెండుకూడా ఒకే ఒక అధికారం అంటే చక్రవర్తికి విధేయంగా ఉంటాయి. ఈ కారణం మూలంగానే రెండూ శాంతియుతంగా ఉన్నాయి. ఈ కారణం మూలంగా రెండూ ఎప్పుడూ ఒకదానితో ఒకటి యుద్ధానికి తలపడవు. విదేశీ దురాక్రమణ నిరోధంగాని, అంతర్గత శాంతి నెలకొల్పటంగాని అఖిల భారత సమాఖ్య ఉద్దేశంకాదు. మరి ఈ సమాఖ్య ఉద్దేశం ఏమిటి? ఈ సమాఖ్యలో భాగస్వాములు కావలసిందిగ ఆరాష్ట్రాలను ఎందుకు ఆహ్వానిస్తున్నారు? కేంద్రం వద్ద బాధ్యత ఉంచటం వాటి ప్రవేశాన్ని పూర్వషరతుగా ఎందుకు ఉంచుతున్నారు. మోటుగా చెప్పాలంటే సామ్రాజ్యవాద ప్రయోజనాలను రాజకుమారులు బలపరుస్తారని బ్రిటిషు ఇండియాలో పెల్లుబుకుతున్న ప్రజాస్వామ్య కెరటాలను అదిమిపెట్టటమే దీని ఉద్దేశం. మరొక వివరణ, ఏదైనా ఉంటే, తెలుసుకోవాలని ఉంది నాకు. కాని ఏదీ లేదు. బ్రిటిషు సామ్రాజ్య వాద ప్రయోజనాలను కాపాడటానికి రాజకుమారులను సమాఖ్యలోకి ఆహ్వానిస్తున్నారనేది నిర్వివాదాంశం. భారత ప్రభుత్వ బిల్లుపై పార్లమెంటులో జరిగిన చర్చ సందర్భంగా భారత దేశంలో పని చేస్తున్న సెక్రటరీ ఆఫ్ స్టేట్ మాట్లాడుతూ "ఒక గొప్ప స్థిరత్వ శక్తిగా, సామ్రాజ్యవాద భావకులుగా భారతకేంద్ర ప్రభుత్వంలోకి రాజకుమారుల రాకను మనందరం ఆహ్వానించాలి" అని ఒప్పుకున్నాడు. బ్రిటిషు ఇండియాలో ప్రజాస్వామ్యాన్ని అణచి వేయటం అనేది ఉద్దేశం కాకపోయినా, సమాఖ్యలోకి రాజ కుమారులు ప్రవేశించిన తర్వాత వచ్చే ఫలితం అదే అని నేను ఖచ్చితంగా చెప్పగలను.

సమాఖ్యలోకి ప్రవేశం కోసం ఎటువంటి మూల్యం చెల్లించవలసి వచ్చింది? నేను చెప్పిన దానిని మళ్లీ చెప్పాలని అనుకోవటం లేదు. ప్రాతినిధ్యం, పన్ను విధింపు, పరిపాలన, శాసనాలు చేయటం మొదలైన విషయాలలో రాజకుమారులకు అనుకూలంగా ఎటువంటి వివక్ష చూపించారనే దానికి సంబంధించి నేను చెప్పిన దానిని మీరు గుర్తు చేసుకుంటే, సమాఖ్యలోకి ప్రవేశించటానికి రాజ కూరులకు బ్రిటిషు ఇండియా ఏ హక్కులను ధారాదత్తం చేసిందో, ఏ ప్రయోజనాలను అంటకట్టిందో మీరు తెలుసుకుంటారు. దానికి బదులుగా బ్రిటిషు ఇండియాకు వచ్చింది ఏమిటి?

సమాఖ్య రాజ్యాంగం సంపూర్ణ బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి ఉంటే, సమాఖ్యలో రాజకుమారుల ప్రవేశంకోసం బ్రిటిషు ఇండియా చెల్లించిన మూల్యానికి కొంత నష్టపరిహారం లభించి ఉండేది. కాని బ్రిటిషు ఇండియాకు చెప్పుకోదగిన బాధ్యత ఏదీ లేదు. బ్రిటిషు ఇండయాకు లభించింది. ఏమంటే బాధ్యతలుసగమై, షరతులు, నిషేధాలద్వారా సత్తా ఛిన్నాభిన్నమై పోయిన వ్యవస్థ. రాజ కుమారులకు సమాఖ్యను సులభతరం చేయటంలో బ్రిటిషు ఇండియాతాను చేసిన త్యాగాలకు తగిన రీతిలో కేంద్రం వద్ద బాధ్యతను పొందలేకపోగా, రాజకుమారుల ప్రమేయం లేకుండా స్వతంత్రంగా తన స్వంత హక్కులాగా డొమినియన్ ప్రతిపత్తిని సంపాదించుకొనే హక్కును కూడా కోల్పోయింది. అఖిల భారత సమాఖ్యపేరు మీద బ్రిటిషు ఇండియా కోల్పోయింది ఏమిటో ఇంకా ఎంత కోల్పోవలసి ఉన్నదో చాలమందికి తెలియదు. బ్రిటిషు ఇండియా ప్రజల పోరాట ఫలితమే ఈ కొత్త రాజ్యాంగం. బ్రిటిషు ఇండియాలోని ప్రజల ఆరాటాలు పోరాటాలే రాజ్యాంగాన్ని తీసుకువచ్చిన శక్తి. బ్రిటిషు ఇండియా ప్రజలు తమకు తాము ప్రకటించుకుంటున్న హక్కులు ఏమిటి? నేను చెప్పినట్టుగా మొదటి హక్కు ఏమంటే బ్రిటిషు ఇండియాలో మంచి పరిపాలన. తర్వాత వారు కోరేదేమంటే స్వపరిపాలన, అదే బ్రిటిషు ఇండియాకు బాధ్యతాయితమైన ప్రభుత్వం. చివరగా వారు బ్రిటిషు ఇండియాకు డొమినియన్ ప్రతిపత్తిని కోరుతున్నారు. ఈ కోర్కెలు ప్రతిదానిని బ్రిటిష్ పార్లమెంటు అంగీకరించింది. 1917లో బాధ్యతాయుతమైన లక్ష్యాన్ని బ్రిటిషు పార్లమెంటు అంగీకరించింది. 1929లో ఆంగ్లేయ జాతి డొమినియన్ ప్రతిపత్తి లక్ష్యాన్ని ఆమోదించింది. కోర్కెను వెల్లడించిన ప్రతిసారీ అది బ్రిటిషు ఇండియా ప్రజల పేరు మీదనే జరిగిందనే విషయాన్ని ఇక్కడ వక్కాణించాలి. ప్రతిసారి కూడా బ్రిటిషు ఇండియాలోని ప్రజలకు సంబంధించే దానిని అంగీకరించటం కూడా జరిగింది. సమాఖ్య ఫలితంగా బ్రిటిష్ ఇండియా స్థితి ఏమి కానున్నది? బ్రిటిషు ఇండియా స్థితి ఏమంటే ఈ పథకం క్రిందికి రాజకుమారులు రానంతవరకూ కేంద్రంలో దానికి బాధ్యత ఏదీ లభించదు. దీని అర్థం ఏమంటే, బ్రిటిషు ఇండియా తనకు, తనపేరు మీద, రాజకుమారుల ప్రమేయం లేకుండా బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని కోరేహక్కు కోల్పోయింది. దీనిని అడగటం, అంగీకరించటం జరిగింది. కాబట్టి ఇది దత్తమైన హక్కు. తన అదృష్టాన్ని అందుకోవటానికి

బ్రిటిషు ఇండియా రాష్ట్రాల అభీష్టంపై ఆధారపడింది కాబట్టి ఆ హక్కును అది కోల్పోయింది. సమాఖ్యలోని రెండు భాగాలలో బ్రిటిషు ఇండియా ఏమో పురోగమన భాగమూ. ఈ పురోగమన భాగాన్ని పురోగమనం కాని రథానికి కట్టివేసి, దాని మార్గమూ అదృష్టమూ పురోగమనం కాని భాగంతో ముడిపెట్టి ఉంచటం అనేది సమాఖ్య విషయంలో జరిగిన విషాదకరమైన వ్యవహారం.

ఈ విషాద గాథకు మీరు మీ జాతీయ నాయకులను నిందించవలసి ఉన్నది. నా అదృష్టం కొద్దీ నేను మీ జాతీయ నాయకులలో ఒకడిని కాదు. నేను ఎదగగలిగింది ఒక అంటరాని వారి నాయకుడి స్థాయికి మాత్రమే. ఆ స్థాయి కూడా నాకు లేకుండా చేశారని నేను తెలుసుకున్నాను. గాంధీ ఎడమచేయి మనిషి అయిన ఠక్కర్ బాపా, ఎడమ చేయి మనిషి అని ఎందుకు అన్నానంటే కుడి చేయి మనిషి వల్లభాయిపటేల్ ఉన్నాడు గనుక- ఈమధ్యనే ఏమన్నాడంటే నేను మహర్లకు మాత్రమే నాయకుణ్ణి అని. బొంబాయి రాష్ట్రంలో ఉన్న అంటరాని వారి నాయకుడిగా కూడా ఆయన నన్ను అనుమతించలేదు. ఠక్కర్ బాపా ఆమాట ద్వేషభావం వల్ల అన్నాడో లేక సత్యంపట్ల ప్రేమ ఉండి అన్నాడో గాని నన్నేమీ అది వ్యాకుల పరచదు. ఎందుకంటే రాజకీయాలు నా మొదటి ఇష్టమూ కాదు, జాతీయ నాయకుణ్ని కావటం నా లక్ష్యమూ కాదు. అంతే కాకుండా, మీ జాతీయ నాయకులు ఈ దేశానికి ఎటువంటి ప్రమాదాలను తెచ్చి పెట్టారో చూసిన దాని మీదట, ఆ మహానుభావుల గుంపులో నేను లేనందుకు నాకు చాల సంతోషంగా ఉంది. రాజ్యాంగ రచనకు మీ జాతీయ నాయకులు అసలు సిద్ధంగా లేరని నేను అన్నానంటే మీరు నన్ను నమ్మాలి. రాజ్యాంగాల పరిశీలనాత్మకమైన అధ్యయనం లేకుండా వారు రౌండ్ టేబుల్ సభలకు వెళ్లారు. వారికి తలపడిన సమస్యలకు ఎటువంటి పరిష్కారాలనూ వారు ఇవ్వలేకపోయారు. సమస్యను పరిష్కరించటానికి నిస్సందేహంగా సమర్థులైన వారు సమాఖ్య ఆదర్శాన్ని రూపొందించటంలో చిన్న పిల్ల మాదిరిగా వ్యవహరించి తాము నిజమైన సమాఖ్యను రూపొందిస్తున్నారా లేక సమాఖ్య పేరిట ఒక మోసాన్ని రూపొందిస్తున్నారా అన్న విషయాన్నే చూడటానికి శ్రద్ధ వహించలేదు. ఈ విషాదానికి కారణం చెడ్డ నాయకత్వం మూలంగానే వేసిన అడుగులు వెనక్కి తీసుకోవటం, కోల్పోయిన భాగాన్ని తిరిగి సంపాదించుకోవటం సాధ్యమా అన్న విషయం నాకు తెలియదు. కాని బ్రిటిషు ఇండియా ప్రజలు తాము నిజంగా కోల్పోయిందేమిటో తెలుసుకోవడం మాత్రం సరైనదని నేను అనుకుంటున్నాను. వారికి తమదైన ఒక సమాఖ్య ఉన్నది. ఆ సమాఖ్యకు బాధ్యత ఒప్పగించవలసిందిగా కోరే హక్కు వారికి ఉన్నది.

బ్రిటిషు ఇండియాకు మాత్రమే సమాఖ్య వాంఛనీయం అనటానికి మరొక కారణం ఉన్నది. బ్రిటిషు ఇండియా భారతీయ రాష్ట్రాల సమాఖ్య సామరస్యంగా పనిచేయలేదు. బ్రిటిషు ఇండియా, భారతీయ రాష్ట్రాల మధ్య వివాదం రేపే అంశాలు రెండు ఉన్నాయని

ఖచ్చితంగా చెప్పగలను. బ్రిటిషు ఇండియా, భారతీయ రాష్ట్రాల ప్రతినిధులు ఎంతమంది ఉండాలన్న దానిమీద మొదట వివాదం వస్తుంది. బ్రిటిషు ఇండియా ప్రతినిధులు స్వతంత్రులు భారత రాష్ట్రాల ప్రతినిధులు రాజకీయ శాఖకు కట్టుబడిన వారుగా ఉంటారు. సమాఖ్య శాసన సభలో ఈ రెండు వర్గాల ప్రతినిధులకు లభించిన అధికార ఆధారాలు తేడాగా ఉన్నాయి. మంత్రుల అధికారాలను విస్తరింప చేయాలని బ్రిటిషు ఇండియా ప్రతినిధులు ప్రయత్నం చేస్తుంటారు. రాష్ట్రాల ప్రతినిధులేమో మంత్రుల అధికారాలకు వ్యతిరేకంగా గవర్నరు జనరలు అధికారాన్ని బలపరుస్తూ వ్యవహరిస్తారు. లేదా వ్యవహరించేటట్లు వారు చేయించుకుంటారు. ఈ పోటీ అనివార్యం అవుతుంది. దానివల్ల బ్రిటిషు ఇండియా వారు భారత రాష్ట్రాల వారి మధ్య తీవ్రమైన అభిప్రాయాలు తలెత్తుతాయి. రాష్ట్రాలలో గత ప్రభుత్వ కాలంలో సరిగ్గా ఇదే జరిగింది. పాత రాష్ట్రాల శాసన సభలనుంచి ఎంపిక అయిన సభ్యులపట్ల ఎన్నియైన సభ్యుల అభిప్రాయాలు ఖచ్చితంగా స్నేహపూర్వకంగా ఉండవు. సమాఖ్య శాసన సభలో ఈ అనుభవం పునరావృత మవుతుంది. శాసన సభలోని ఒకవర్గం తమ ప్రయోజనాలను దెబ్బ కొట్టటానికి మరొక వర్గాన్ని తీసుకు వచ్చారని, శాసనసభ ఆధీనానికి వెలుపల ఉన్న ఏదో అధికారం చేతిలో పనిముట్టులా వ్యవహరిస్తున్నదనే భావం వచ్చినపుడు ఇది ఇలా ఉండటం సహజమే. ఇది ఒక అనైక్యతకు సంబంధించిన అంకం. అనైక్యతలో మరో అంశం ఏమంటే సమాఖ్య క్రింద బ్రిటిషు ఇండియా రాష్ట్రాల స్థితి. శాసనంముందు సమానత అనేది విలువైన విషయం. అందరూ దానికి ఒకే కారణంతో విలువ ఇవ్వరు. చాలమంది దానిని ఒక ఆదర్శంగా భావిస్తారు. అది ఎంత ప్రధానమైనదో చాలమంది గ్రహించరు. శాసనం ముందు సమానం అనేది తన మాదిరి దెబ్బతింటున్న వారితో జట్టుకట్టవలసిందిగా బలవంత పరుస్తుంది. అలా కాకుండా, సమానత లేనపుడు కొంతమందకి ఇప్రయోజనాలు ఉండి, కొంత మంది మీద భారం పడుతుంది అలా ప్రత్యేక ప్రయోజనాలు పొందినవారు, భారం మోస్తున్న వారితో సమానత కోసం జరిగే పోరాటంలో కలిసి రావటానికి నిరాకరించవే కాకుండా వారికి వ్యతిరేకంగా పోరాటం చేస్తారు కూడా. పూర్వ కాలంలో రాజులు చేసినట్టుగా, నియంత ఏం చేస్తాడంటే, ఇతరుల నుంచి వ్యతిరేకత తెచ్చుకొనే అవసరం లేకుండా కొంతమంది పళ్లు ఒకటీ ఒకటీ పీకివేస్తాడు. దీనికి భిన్నంగా ఇతరులు కూడా ఆ దాడిలో కలుస్తారు. కాని, నియంత తానుకోరినంత డబ్బును అందరూ చెల్లించాలి. లేకుంటే అందరిపళ్లూ పీకివేస్తాము అని ఒక శాసనం చేశాడనుకోండి, అపుడు అందరూ దానిని వ్యతిరేకిస్తారు. సమాఖ్యక్రింద బ్రిటిషు ఇండియా రాష్ట్రాలు భారతీయ రాష్ట్రాల మధ్య సమానతలేదు భారతీయ రాష్ట్రాలు చాలా ప్రయోజనాలు అనుభవిస్తున్నారు, మినహాయింపులు పొందుతున్నారు. ఇవి బ్రిటిషు ఇండియాకు లేవు. పన్ను విధించటం విషయంలో ఇది మరీను. బ్రిటిషు ఇండియా రాష్ట్రాలు, భారతీయ రాష్ట్రాలమధ్య ఎవరు పన్నుభారం ముందు వహించాలి అనే విషయం మీద పెద్ద పోట్లాట వచ్చే అవకాశం ఉంది. డబ్బు సంగతి వచ్చేసరికి మనిషిలో దేశభక్తి అదృశ్యమై పోతుంది శాసన సభకు

కార్యనిర్వాహక వర్గాన్ని బాధ్యులుగా చెయ్యాలనటంలో రాష్ట్రాల ప్రతినిధులు ఉమ్మడి కుంపటికంటే తన స్వంత ప్రయోజనాలనే చూసుకుంటారని నేను ఖచ్చితంగా చెప్పగలను.

ఒకరితో ఒకరు కొట్టుకొనే పరిస్థితి వచ్చినపుడు బ్రిటిష్ ఇండియాను భారతీయ రాష్ట్రాలను ఒకే గూటి కిందకి తీసుకురావడం వల్ల ప్రయోజనం ఏమిటి?

బ్రిటిష్ ఇండియాలోను, భారతీయ రాష్ట్రాలలోను అమలులో ఉన్న ప్రభుత్వ విధానాలలోను వర్తింపులో ఉన్న సూత్రాలలోను పూర్తి వ్యత్యాసం ఉన్నది. బ్రిటిష్ ఇండియా భారతీయ రాష్ట్రాలు వాటి వాటి ప్రత్యేక పరిధిలో పెరుగుతున్నపుడు వాటి మధ్య ఉన్న వ్యత్యాసం వల్ల శత్రుత్వం పెరిగే అవకాశం ఉండదు. భారతీయ రాష్ట్రాలలోని ప్రభుత్వ విధానం, బ్రిటిష్ ఇండియాకు వర్తించే వ్యవహారాలునిర్ణయించటంలో భాజకం కానపుడు, బ్రిటిష్ ఇండియా ఆ ప్రభుత్వ విధానాలను అవి ఎంత పురాతనమైన వైనప్పటికీ సహిస్తుంది. కాని సమాఖ్య వాటిని ఒక భాజకం బలవత్తరమైన భాజకం చేసినపుడు బ్రిటిష్ ఇండియా వాటిని పట్టించుకోకుండా ఉండలేదు. నిజానికి సమాఖ్య ఏర్పాటు మూలంగా, తన స్వప్రయోజనాల దృష్టిలో, భారతీయ రాష్ట్రాలలో అమలులో ఉన్న ప్రభుత్వ విధానాలలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకురావటానికి ఉద్యమం చేపట్టవలసి ఉంటుంది.

ఈ సమాఖ్య మూలంగా వచ్చే అనివార్యమైన ఫలితం ఇది. రాష్ట్రాలు మనఃపూర్తిగా కోరుకుంటున్న కలయికా ఇది? ఈ ప్రశ్నను వారు పరిశీలించుకోవాలి.

ఈ విషయాన్ని బ్రిటిష్ ఇండియా ఆహ్వానిస్తుందా? నా మట్టుకు నేను ఆహ్వానించను. అంత విశాలమైన మైదానంలో యుద్ధం చేయటం కష్టం. కేంద్రీకృతమైన దాడిని జరగనివ్వటానికి రాష్ట్రాలు విస్తారంగా ఉన్నాయి. నిర్మాణంలో రాష్ట్రాలు ఒక భాగం కాబట్టి, మీరు వాటిమీద దాడిని చెయ్యలేరు, చేసి అది రాజ్యాంగ చర్య అని సమర్థించుకోలేరు. రెండోది, అసలు మీరు ఇంతకష్టం ఎందుకు తెచ్చిపెట్టుకుంటారు? ఇది ఎలా పరిణమిస్తుందంటే, ఒకోసారి మనిషి ఆస్తిని కొనుక్కుంటున్నా ననుకుంటాడు, కాని అతను కొనుక్కునేది వ్యాజ్యం. ఈ సమాఖ్యను అంగీకరించటం అంటే బ్రిటిష్ ఇండియా చిక్కులు కొని తెచ్చి పెట్టుకున్నట్టే. మూడోది, డోమినియన్ ప్రతిపత్తిని ప్రస్తుతానికే కకుండా భవిష్యత్తులో కూడా కట్టుదిట్టంగా మినహాయించే ఏర్పాటే ఈ రాజ్యాంగం

ఏ దృక్కోణం నుంచి చూసినా, తెలివైన పని ఏమిటంటే భారతీయ రాష్ట్రాలను ఎక్కడున్నాయో అక్కడ వాటిని వదిలివేసి, బ్రిటిష్ ఇండియా తన పురోగతిని చూసుకుంటూ, తన సమాఖ్యకోసం ముందుకు సాగిపోవాలి.

# X

# వివిధ దృక్కోణాల నుంచి సమాఖ్య

వివిధ దృక్కోణాల నుంచి వివిధ ప్రజలు ఈ సమాఖ్యను చూస్తున్నారు. హిందువులు, ముస్లిములు, కాంగ్రెస్ వారిది ఒక దృక్కోణం ఉంది. వ్యాపారస్థులు వర్తకుల దృక్కోణం ఒకటి ఉంది. వారి వారి ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని వారి దృక్కోణాలు ఉంటాయి.

ఈ సమాఖ్యలో రాజ కుమారుల ప్రయోజనం ఏమిటి? రాజకుమారుల ఉద్దేశం కనుక్కోవాలంటే బట్లర్ కమిటీ దగ్గరకు వెళ్లవలసి ఉంటుంది. సార్వభౌమాధిపత్య సిద్ధాంతం క్రింద ఏర్పాటు చేసుకున్న వారి ఒడంబడిక హక్కుల్ని భారత ప్రభుత్వ రాజకీయశాఖ అతిక్రమిస్తున్నదని రాజకుమారులు ఫిర్యాదు చేస్తున్నారు. రాజకుమారుల, బ్రిటిషు ప్రభుత్వం మధ్య అమలులో ఉన్న ఒడంబడికలు ఇచ్చిన వాటికంటే ఎక్కువ హక్కులు రాజకీయ శాఖకు తమపై లేవని రాజకుమారులు పట్టుపడుతున్నారు. మరొకపక్క రాజకీయ శాఖ ఏమంటుందంటే, ఒడంబడిక సంబంధించిన ఉన్న హక్కులతో పాటు, చక్రవర్తికి రాజకీయ ఆచార వ్యవహారాలనుండి కూడా కొన్ని హక్కులు ఉంటాయని వాదిస్తుంది. ఈ వివాదాన్ని తేల్చటానికి సెక్రటరీఆఫ్‌స్టేట్ బట్లర్ కమిటీని నియమించాడు. బట్లర్ కమిటీ తమ వాదనలను అంగీకరిస్తుందని, ఒడంబడికలో పేర్కొన్న హక్కుల వరకు మాత్రమే సార్వభౌధికారాలను పరిమితం చేస్తుందని రాజకుమారులు ఆశించారు. దురదృష్ట వశాత్తు, పాపం, రాజకుమారులు నిరాశ చెందారు. ఎందుకంటే బట్లర్ కమిటీ, సార్వభౌమాధికారం అంటే సర్వాధికారాలు ఉంటాయని, వాటికి నిర్వచనం కాని, పరిమితం చేయటం కాని ఉండదని నివేదిక సమర్పించింది. బట్లర్ కమిటీ నిర్ణయం భారత ప్రభుత్వ రాజకీయ శాఖకు రాజకుమారులు పూర్తి విధేయులై ఉండటం అని అర్థం. తమను దించిన ఈ దురదృష్టకర పరిస్థితినుంచి తప్పించుకోవటానికి మార్గం ఏదైనా ఉందేమో అని రాజకుమారులు ఆలోచించారు. అయితే వారికి సరిగ్గానే, ఆ దారి దొరికింది, రాజకీయ శాఖ నిరంకుశ విధానాన్ని వారు తప్పించుకోవాలంటే సమాఖ్య ఒకటే పరిష్కారం, ఎందుకంటే, సమాఖ్య అధికారులు అమలులో ఉన్నంతమేర, రాజకీయశాఖ అధికారం అదృశ్యమయి పోతుంది. సమాఖ్య శాసనసభ ద్వారా, సమాఖ్య కార్యనిర్వాహక వర్గం ద్వారా మాత్రమే సమాఖ్య అధికారం వినియోగించగలం కాబట్టి, సమాఖ్య శాసన సభల్లోను కార్య నిర్వాహక విషయంలోను తమకు కొంత ప్రాధాన్యత ఉంటుంది కాబట్టి, వారు సమాఖ్య గురించి ఆలోచించారు. వారిసమస్యలకు సమాఖ్య ఇచ్చిన పరిష్కారం రెండు ప్రయోజనాలను వారికి అందజేసింది. మొదటిది ఏమంటే, వారు చాలా ఆందోళన చెందుతున్నటువంటి అంతర్గత ఆధిపత్యం వారు తెచ్చుకుంటారు. ఎందంటే వారు ఇష్టానుసారంగా ఒక ఉమ్మడి కేంద్రానికి ధారా దత్తంచేసి వాటిపై ఒక హక్కును కలిగి ఉండటం తప్ప మిగిలిన అధికారాలన్నింటిని తమ దగ్గర ఉంచుకోవాలనేది సమాఖ్యలో చేరే రాజకుమారులపై ఉండాలి. సమాఖ్యలో ఉన్న రెండవ సదుపాయం ఏమంటే సమాఖ్య అధికారం మేరకు సార్వభౌమాధికారం కనబడకుండా

పోతుంది. అందువల్ల రాజకుమారుల ఉద్దేశం ఏమిటంటే చాల స్వార్థపూరితమైనదీను, భారత ప్రభుత్వం రాజకీయ శాఖ అధికారాన్ని సాధ్యమైనంత వరకూ తగ్గించుకోవటమూను ఇది రాజకుమారుల ప్రధాన ప్రయోజనాలలో ఒకటి. రాజకుమారులు రక్షించుకోవలసిన మరొక ప్రయోజనం ఉన్నది. అది సాధ్యమైనంత వరకు సివిలు, మిలటరీ ప్రభుత్వ అధికారాలను భద్రపరుచుకోవటం. సమాఖ్య తమను ఎక్కువ గట్టిగా నొక్కకుండా ఉండేలా సాధ్యమైనంతగా బలహీనమైనదిగా చేయటం రాజకుమారుల ప్రయోజనాలు రెండు. సార్వభౌమాధిపత్యం నుంచి తప్పించుకోవటం, రెండోది సమాఖ్య అధికారాలు అంత ఎక్కువగా లేకుండా చేసుకోవటం. సమాఖ్యను దృష్టిలో పెట్టుకొని, రాజకుమారులు రెండు ప్రశ్నలు వేసుకుంటారు. సార్వభౌమాధిపత్యాన్ని నిరంకుశత్వాన్ని తప్పించుకోవటానికి సమాఖ్య తమకు ఎంతగా దోహదం చేస్తుంది? రెండోది ఈ సమాఖ్య పథకం తమ ఏలుబడిని, తమ అంతర్గత ప్రభుత్వ అధికారాలను ఎంతవరకు హరించి వేస్తుంది? వారికి మొదటి దాని నుంచి ఎక్కువ గ్రహించటం రెండో దానికి తక్కువ వదులుకోవటం కావాలి.

ముస్లింలకు ఒక ప్రయోజనం ఉంది. దానివల్ల దేనినైనా రంగుటద్దాలలో చూడటమే కాకుండా ఇక దేనినీ చూడకుండా సంకుచితమైన దృష్టిని పెంచుకున్నారు. అల్పసంఖ్యాకులుగా తమకంటే ప్రయోజనం అది హిందూ అధికసంఖ్యాబలం నుంచి తమను తాము రక్షించుకొనే మార్గం ఒకటే వారికి తెలుసు. అందేమంటే ప్రత్యేక నియోజక వార్గలతో సీట్ల రిజర్వేషన్ ప్రాతినిధ్యంలో ప్రత్యేకంగా కొంత ఎక్కువ రిజర్వేషన్ కోరటం. 1930లో, ముస్లిం అల్పసంఖ్యాకుల రక్షణకోసం మరింత పటిష్ఠమైన మార్గం మరొక దానిని వారు కొనుగొన్నారు. అదేమంటే హిందువులు అధిక సంఖ్యలో ఉండి, ముస్లిములు అల్పసంఖ్యాకులుగా ఉండే రాష్ట్రాల ఏర్పాటుకు ఎదురు దెబ్బగా ముస్లిములు అధిక సంఖ్యలో ఉండి హిందువులు అల్ప సంక్యాకులుగా ఉండే రాష్ట్రాలను ఏర్పాటు చేయటం. ఈ పద్ధతి కావాలని వారు పట్టుపట్టారు. ఎందుకంటే, ఈ విధంగా రాష్ట్రాలు సమతూకంగా ఉంటే, ముస్లింలు అధిక సంఖ్యలో ఉన్న రాష్ట్రాలలోని ముస్లిములు తమ రాష్ట్రంలో ఉన్న హిందువులను, హిందువులు అధికసంఖ్యలో ఉండి ముస్లిములు అల్పసంఖ్యాకులుగా ఉన్న రాష్ట్రాలలో ఉన్న ముస్లిములకు రక్షణగా వారిని వాడుకోవటానికి వీలుంటుంది. ముస్లిములు అధికసంఖ్యాకులుగా ఉండే రాష్ట్రాలను ఏర్పచటం, వాటిని పటిష్ఠమైనవిగా శక్తి వంతమైనవిగా చేయటం వారి ప్రధాన ప్రయోజనం. దీనిని సాధించుకోవటానికి సింద్ విభజనను, వాయవ్య సరిహద్దు రాష్ట్రాలకు బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలనీ వారు కోరారు. దీనివల్ల వారికి నాలుగు రాష్ట్రాలపై పట్టుదొరుకుతుంది. రాష్ట్రాలను పటిష్ఠంగా చేయటంకోసం కేంద్రాన్ని బలహీన పరచాలని పంతం పట్టారు. ఈ లక్ష్యాన్ని సాధించటంకోసం, మిగులు అధికారాలు రాష్ట్రాలకు ఉండాలని, బ్రిటిషు ఇండియాకు కేటాయించిన మొత్తం సీట్లలో 1/3వంతు ముస్లింలకు రావాలనే రాకుండా మొత్తం రాష్ట్రాలకు కేటాయించిన వాటిలో 1/3 వంతు సీట్లు తమకు ఇవ్వటం

ద్వారా హిందూ భారాన్ని తగ్గించవచ్చని షా ముస్లిములు అనుకున్నారు.

హిందూ మహాసభ ప్రాతినిధ్యం వహిస్తున్న హిందువులు ఒకే ఒక విషయం గురించి పట్టించుకున్నారు. ముస్లిముల బెడదనుంచి తప్పించుకోవటం ఎలా? రాజకుమారులు విలీనం అయితే హిందువులకు బలం పెరుగుతుందని హిందూ మహాసభ అభిప్రాయ పడింది. ఇతరమైనది ఏదీ కూడా వారికి ఏమీ అంటలేదు. ఎట్టి పరిస్థితులలోనైనా సమాఖ్య ఏర్పడటం వారి ఉద్దేశం.

పరిశీలించదగిన అభిప్రాయం ఉన్న మరొక వర్గం ఏమంటే భారతీయ వ్యాపారవర్గం భారతదేశం లాంటి విశాలమైన దేశంలో ఈ వ్యాపరవర్గం నిస్సందేహంగా చాలా చిన్నదే, కాని ఈ వర్గం వారి అభిప్రాయం, ఏ ఇతర వర్గం వారి అభిప్రాయంకంటే చిన్నదేమీ కాదనేదాంట్లో మాత్రం సందేహం లేదు. ఈ వర్గం కాంగ్రెస్ వెనక ఉన్నది. కాంగ్రెస్‌కు ఈ వర్గమే పోరాట శక్తిని అందిస్తున్నది. తాను ధనసహాయం చేస్తున్నది కాబట్టి కాంగ్రెసు తాను ఆడమంటే అలా ఆడుతుందని దానికి తెలుసు. వ్యాపారవర్గానికి ప్రధానంగా వ్యాపార వివక్షలోను, ద్రవ్యమారకం విలువ తగ్గింపులోను ఆసక్తి ఉంటుంది. ఇది చాల సంకుచితమైన, పరిమితమైన దృక్పథం. భారతీయ వ్యాపారవర్గం, వర్తక వ్యాపార రంగంనుంచి ఐరోపియన్లను తొలగించి ఆస్థానంలోకి వీరు వెళ్లాలని నిశ్చయించుకున్నారు. దీనిని వారు జాతీయవాదుల పేరుమీద చెయ్యాలనుకుంటున్నారు. విదేశీ ద్రవ్యం మారకం రేటును తగ్గించి విదేశీ వ్యాపారంలో లాభాలు గడించాలనుకుంటున్నారు. దీననిని కూడా వారు జాతీయ వాదంపేరుమీదనే చేస్తున్నారు. తమకు లాభాలు గడించుకోవటం తప్ప ఈ వ్యాపారస్థులకు, వర్తకులకు మరో ఉద్దేశమే లేదు.

కాంగ్రెస్ గురించి నేను ఏం చెప్పను? దాని దృక్పథం ఏమిటి? రౌండ్ టేబుల్ సమావేశాల్లో కాంగ్రెస్ లయలు పరచిన అభిప్రాయం. భారతదేశంలో ఉన్నది కాంగ్రెస్ పార్టీ ఒకటే అని, రెండోది ఏదీ లెక్కలోనికి రాదని, కాంగ్రెస్‌వారు ఒక్కరితో మాత్రమే బ్రిటిష్‌వారు పరిష్కారానికి రావాలని నేను అన్నదాంట్లో అతిశయోక్తి లేదు. నేను తప్పుగా వ్యాఖ్యానించటమూలేదు. రౌండ్‌టేబుల్ సమావేశంలో గాంధీపాడిన పాట ఇదే. బ్రిటిషువారు తనను భారతదేశ నియంతగా గుర్తించాలని ఆయన పడిన ఆరాటంలో ఆయన, పరిష్కారం ఎవరితో చేసుకోవాలని అనిగాక ఏ షరతుల మీద పరిష్కారం చేసుకోవాలనే విషయాన్నే పూర్తిగా మరిచిపోయాడు. ఈ పనికి గాంధీ ఏ మాత్రమూ సరిపోడు. ఆయన లండన్ వెళ్లినపుడు, తనముందు ఉన్న వ్యక్తులు తన సలహాకోసం వచ్చి తన ఆశీర్వాదాలను తీసుకుపోయే వ్యక్తులు కాదని, తనను బోనులో సాక్షిగా నిలబెట్టి ప్రశ్నలు వేసే న్యాయవాదిగా చూస్తారనే విషయమే ఆయన మరిచిపోయాడు. ఒక రాజకీయ సమావేశానికి వెళ్తున్నాననే

సంగతే గాంధి మరిచిపోయాడు. నర్సీమెహతా కీర్తనలు పాడుకుంటూ వైష్ణవ దేవాలయానికి వెళ్తున్నట్టు ఆయన లండన్ వెళ్లాడు. మొత్తం వ్యవహారాన్ని ఆలోచించినపుడు, ఒక జాతి పరిష్కార షరతులు చర్చించటానికి గాంధీకంటే పనికి మాలిన వ్యక్తిని ఎవరినైనా ఏ జాతి అయినా పంపి ఉన్నదా అని నేను ఆశ్చర్యపోతుంటాను. ఒక పరిష్కారం గురించి చర్చించటానికి గాంధీ ఎంత పనికి మాలిన వాడో స్వాతంత్ర్యం ప్రాతిపదిక మీద వాస్తవానికి చర్చించమని గాంధీని పంపిస్తే ఆయన ఈ భారత దేశ రాయబారి డొమినియన్ ప్రతిపత్తి తీసుకుని వచ్చేయటానికి సిద్ధపడ్డాడనే విషయాన్ని చూస్తే తెలిసిపోతుంది. రౌండ్ టేబుల్ సమావేశాల్లో భారత దేశ ప్రయోజనాలకు గాంధీ తెచ్చిన ఘోర విపత్తుకంటే పెద్ద విపత్తు ఎవరూ తెచ్చి ఉండరు. ఆయన గురించి ఎంత తక్కువ మాట్లాడుకుంటే అంతమంచిది.

సమాఖ్య పథకం రావటంతో ఈ ప్రయోజనాలు ఒక్కొక్కటీ ఎలా తీరతాయో చెప్పటం నావంతు కాదు. ఏదయినప్పటికీ మనం వేసుకోవలసిన ప్రశ్న ఏమంటే, ఈ సమాఖ్యతో మనం ఏమి చెయ్యాలో నిర్ణయించు కొనటంలో పరిశీలనకు తీసుకొనే అంశాలు ఇవేనా అని? ఇవి మాత్రమేనా అని? పైన ఉదహరించినవే కాకుండా మనం గమనించవలసిన విషయాలు వేరేవి నేను చెబుతాను. ఒక స్వతంత్ర వ్యక్తి దృక్పధానికి సంబంధించినది ఒకటి ఉంది. పేదవాని దృక్పధానికి సంబంధించినది కూడా మరోటి ఉంది. సమాఖ్య గురించి అవి ఏం చెబుతాయి? సమాఖ్య వారి గురించి ఏమీ పట్టించు కున్నట్టు లేదు. అయినప్పటికీ వారికి దేనితో ఎంతో గాఢమైన సంబంధం ఉన్నది. ఒక స్వతంత్ర వ్యక్తి. సమాఖ్య రాజ్యాంగం తన స్వతంత్రానికి ప్రమాదం కాదని భావించగలడా? పాత విలువలకు తిరిగి విలువ కట్టటానికి కొందరు సంపాదించుకున్న స్థిరమైన హక్కులను అస్థిరం చేయటానికి ఈ రాజ్యాంగం తనకు వీలు కల్పిస్తుందని ఒక పేదవాడు భావించగలడా? ఈ సమాఖ్య ఏర్పాటు అంటూ గనుక జరిగినట్లయితే, స్వతంత్ర వ్యక్తికి ఎప్పటికీ ప్రమాదకారిగానే ఉంటుందని, పేదవాని మార్గంలో అడ్డంకిగా ఉంటుందనటంలో నాకేమీ సందేహం లేదు. రాజకుమారుల నిరంకుశ విధానానికి లోబడి ఉండేలా మిమ్మల్ని చేసినపుడు మీకు ఏమి స్వాతంత్రం ఉంటుంది? సంపాదించుకున్న హక్కులు బాగా పాతపోయి ఉన్నటువంటి రెండవ శాసనసభ ఉన్నపుడు, ఆస్తికి సంబంధించిన శాసనం ఏదైనా చెయ్యవలసినపడు దానిని ప్రవేశపెట్టే ముందు, ఆమోదమైన తర్వాత కూడా ప్రభుత్వ మంజూరును పొందవలసి వచ్చినపడు ఏమి ఆర్థికాభివృద్ధి ఉంటుంది?

## XI

## ముగింపు

అనుకున్న దానికంటే ఎక్కువ సేపే మిమ్మల్ని నిలిపి ఉంచాను. ఇది నా పొరపాటు కాదని మీరు ఒప్పుకుంటారు. విషయం ఎంతో విస్తారమైనది కావటం ఈ దీర్ఘోపన్యాసానికి ఒక

కారణం.

పొత్తిగా చిన్న ఉపన్యాసంగా చేయకుండా ఉండటానికి, మరొక కారణం ఉందని నేను ఒప్పుకోవాలి. పాతయుగం పోయి, కొత్తయుగం ప్రారంభమవుతున్న సమయంలో మనం ఈనాడు నిలిచి ఉన్నాం. పాతయుగం రెనడే, ఆగార్కర్, తిలక్, గోఖలే, వాచ్చా, సర్ ఫిరోజ్‌షా మెహతా, సురేంద్రనాధ్ బెనర్జీకి చెందినది. కొత్తయుగం గాంధీకి చెందిన యుగం. ఈ తరాన్ని గాంధీతరం అంటున్నారు. పాతయుగం గురించి కొంత, కొత్తయుగం గురించి కొంత తెలుసుకున్న నాకు ఈ రెండింటిలో కొన్ని స్పష్టమైన వ్యత్యాసాలు కనిపిస్తున్నాయి. నాయకత్వంలో చాల గాఢమైన మార్పులువచ్చాయి. రెనడే యుగంలో భారతదేశాన్ని ఆధునీకరించటానికి నాయకులు శ్రమపడ్డారు. గాంధీయుగంలో దీనిని పురాతన యుగానికి సజీవ ప్రతీకగా నాయకులు చేస్తున్నారు. రెనడే యుగంలో, వారి ఆలోచనలు ఆచరణలను సవరించుకోవటానికి అనుభవం మీద ఆధారపడేవారు. వర్తమానయుగంలో నాయకులు మార్గ దర్శకత్వానికి తమ అంతరాత్మ మీద ఆధారపడుతున్నారు. మానసికావస్థలో వారిద్దరి మధ్య వ్యత్యాసం ఉండటమే కాకుండా వేషధారణకు సంబంధించిన అభిప్రాయాలలో కూడా తేడా ఉన్నది. పాత యుగం నాయకులు శుభ్రంగా దుస్తులు వేసుకొనే జాగ్రత్తలు తీసుకుంటే, వర్తమాన యుగం నాయకులు శరీరాన్ని సగం కప్పే బట్టలు వేసుకోవటంలో ఎంతో గర్వపడుతున్నారు. గాంధీయుగం నాయకులు ఈ వ్యత్యాసం ఎరుగుదురు. వారి అభిప్రాయాలకు వేషధారణకు సిగ్గు పడటంపోయి రెనడేయుగం నాటి భారతదేశంకంటే గాంధీయుగం నాటి భారతదేశం గొప్పదని అంటున్నారు. గాంధీయుగం ఆందోళన యుగమని ఆశాజనకమైన యుగమని, రెనడేయుగం అదేమీకాదని వారు అంటుంటారు.

రెనడేయుగం గాంధీయుగం రెండింటిలోను జీవించిన వారికి ఈ వ్యత్యాసం కనిపిస్తుంది. అదే సమయంలో రెనడేయుగం తక్కువ ఆందోళన కరంగా ఉందంటే అది ఎక్కువ నీతిమంతమై నడవటం వల్ల మూలంగాను తక్కువ ఆశాజనకంగా ఉందంటే ఎక్కువ వివేకం గలది అయి ఉండటం మూలంగా అని వారు గట్టిగా చెప్పుతారు. రెనడే యుగం ఎటువంటిదంటే, ఆ యుగంలో స్త్రీలు పురుషులు వారి జీవిత వాస్తవాలను ఆలోచించి పరిశీలించటంలో నిమగ్నమై ఉండేవారు, మరో ముఖ్యమైన విషయం ఏమంటే ఛాందసవాదులు వ్యతిరేకిస్తున్న సందర్భంలో తమ పరిశోధన ఫలితంగా తాము కనుగొన్న వెలుగు బాటలో తమ జీవితాలను, నడతను మలుచుకోవటానికి ప్రయత్నించేవారు. గాంధీయుగంలో రాజకీయ వ్యక్తులకు, విద్యార్థులకు మధ్య ఉన్నంత వైమనస్యం రెనడేయుగంలో కనబడదు. రెనడేయుగంలో విద్యార్థికాని రాజకీయ వ్యక్తి అంతే ప్రమాదం కాకపోయినా భరించలేనంత లోతుగా భావించేవారు. గాంధీ యుగంలో నేర్చుకోవటం అనేది అసహ్యించుకోకపోయినా రాజకీయ వ్యక్తికి అవసరమైన అర్హతగా భావించేవారు కాదు.

గాంధీయుగం భారతదేశంలో అంధయుగమని అనటంలో నాకు ఏ మాత్రమూ సందేహం లేదు. భవిష్యత్తులో తమ ఆదర్శాలను చూసుకోవటం పోయిపాతకాలంలోకి ప్రజలు మళ్లిపోతున్నయుగం అది. తమకు తాము ఆలోచించటం మానివేసిన యుగం అది, ఆలోచించటం మానివేశారు కాబట్టి వారి జీవిత వాస్తవాలను గ్రహించి పరిశీలించటం మానివేశారు. జ్ఞానం అనుభవం చూపిన మార్గంలో నడవటానికి నిరాకరించి గూఢమతవాదులు పిచ్చివాళ్ల మార్గంలో కొట్టుమిట్టాడుతున్న అజ్ఞాన ప్రజాస్వామ్యం గురించి ఆలోచించటం అంటే బాధాకరంగా ఉంటుంది. అటువంటి యుగానికి, సమాఖ్య పథకం వంటి వర్ణనాత్మకమైన ఆకారం కంటే ఎక్కువ ఏదో ఒకటి అవసరమవుతుంది. దీనికి, సమాఖ్య పథకం ఆవిష్కరణ వలన ఉత్పన్నమయ్యే ప్రమాదాలను గ్రహించటానికి వీలు కలిగేలా పూర్తినయం చేసేది కాకపోయినా కొంత చికిత్స పిడివాదంలోకి పోకుండా నచ్చచెప్పి ఒప్పించగల నేర్పు అవసరం. ఈ ఉపన్యాసం తయారు చేసేటపుడు నేను దృష్టిలో ఉంచుకున్న విషయం ఇది. నేను సఫలీకృతడనయ్యానో, విఫలమయ్యానో తేల్చ వలసింది మీరు. ఈ ఉపన్యాసం లోతు లేకుండా పోయి ఉత్త తీరంగా ఉందంటే, నేను చెప్పేదల్లా ఏమంటే, నాకు కనిపించే వెలుగు ప్రకారం నా విధిని నిర్వర్తించుకు పోయాను.

సమాఖ్య రూపంలో ఉన్న ప్రభుత్వాన్ని నేను వ్యతిరేకించటంలేదు. ఏక రూపమైన ప్రభుత్వం పట్ల నాకు పక్షపాతం ఉందని అంగీకరించక తప్పదు. భారత దేశానికి అది అవసరమని నేను భావిస్తాను. కాని, రాష్ట్రాలు సర్వాధికారాలు కలిగి ఉండటం జరిగినట్లయితే, సమాఖ్య రూప ప్రభుత్వం అనివార్య మవుతుందని గ్రహించాను. కాని భారత ప్రభుత్వ చట్టంలోని సమాఖ్య పథకం చూస్తే చచ్చేంత భయం వేస్తున్నది. తగిన ఆధారాలు చూపినావ్యతిరేకతను సమర్థించుకున్నానని అనుకుంటున్నాను. వీటిని అందరూ పరిశీలించి తమ తమ అభిప్రాయాలకు రావాలని కోరుకుంటున్నాను. రాష్ట్రాలు సర్వాధికారాలు కలిగి ఉండటానికి సమాఖ్య పథకానికి చాలా తేడా ఉందని మాత్రం మనం గుర్తించాలి. గవర్నర్లు ఇచ్చిన హామీ లాగానే గవర్నరు జనరలు కూడా తన ప్రత్యేక బాధ్యతల క్రింద తన అధికారాలను వినియోగించను అని హామీ ఇస్తే సమాఖ్యను అంగీకరించ వచ్చును అని భావించే వారికి, నేను రెండు విషయాలు చెప్పాలనుకుంటున్నాను. మొదటిది, గవర్నరు జనరలు అటువంటి హామీ ఏదీ ఇవ్వలేదని, ఎందుకంటే, ఈ అధికారాలను ఆయన చక్రవర్తి ప్రయోజనాలకోసమే కాదు రాష్ట్రాల ప్రయోజనాలకు కూడా వినియోగిస్తున్నాడు. రెండోది, ఆయన-అటువంటి హామీఇచ్చినా కూడా సమాఖ్య పథకం స్వభావం దాని మూలంగా ఏమీ మారదు. రాష్ట్ర ప్రాతినిధ్యాన్ని నియామకం నుంచి ఎన్నిక పద్ధతికి మార్చితే, సమాఖ్య అంత అభ్యంతరకరం కాకపోవచ్చు అనే వారికి, వివరాలకు సంబంధించిన విషయాన్ని వారు ప్రధానమైన విషయంగా భావిస్తున్నారని చెప్పాలనుకుంటున్నాను. ఏది ప్రధానమో ఏది కాదో ముందు మనం గమనిద్దాం. ఇందులో పొరపాటు పడకూడదు. తెలివి తక్కువ తనం చూపకూడదు. ఈ రెండూ మనం చాలా

ఎక్కువే అనుభవించాం. నిజమైన సమస్య ఏమంటే బాధ్యతను విస్తరించటం, పెంచటం. ఇది సాధ్యమా? అసలు ఇదే క్లిష్టాంశం కేంద్రంలో బాధ్యత గాలిలో వేలాడుతూ ఉండగా రాష్ట్రాల సర్వాధికారాలకు అంటపెట్టుకొని ఉండటంలో ప్రయోజనం ఏదీ లేదని కూడా మనం గుర్తించాలి. కేంద్రం వద్ద నిజమైన బాధ్యత అనేది లేకపోతే రాష్ట్రాలు సర్వాధికారాలు కలిగి ఉండటం అనేది ఉట్టిడొల్ల అని నాకు గట్టినమ్మకం ఉన్నది.

మన దృక్పథాన్ని బలంగా ముందు పెట్టడానికి ఏమి చెయ్యాలనేది ఇక్కడ చర్చించే స్థలం కాదు. ఈ సమాఖ్య పథకం వలన వచ్చే ప్రమాదాల విషయంలో తగిన అభిప్రాయాన్ని మీకు అందజేయగలిగానంటే అంతేచాలు.

అనువాదం :

బొజ్జా తారకం , జి. సురమౌళి, కె. రాహుల్

# 9

# కుల మత సమస్య ప్రతిష్ఠంభన పరిష్కార మార్గం

*1945 మే,* 6వ తేదీన బొంబాయిలో జరిగిన

అఖిల భారత షెడ్యూల్డు కులాల సమాఖ్య

సదస్సులో ప్రసంగించిన పాఠం .

# కుల మత సమస్య ప్రతిష్టంభన పరిష్కార మార్గం

అధ్యక్ష మహాశయా !

అఖిల భారత షెడ్యూల్డు కులాల సమాఖ్య వార్షిక సదస్సులో ప్రసంగించవలసిందిగా నన్ను ఆహ్వానించినందుకు ఎంతో కృతజ్ఞుణ్ణి. షెడ్యూల్డు కులాల వారు ఇక్కడ ఇంతమంది సమావేశ మవటం సంతోషదాయకం. సమాఖ్యను ప్రారంభించిన కొద్దికాలంలోనే దాని అభివృద్ధి చెప్పుకోదగినంతగా ఉందని తెలుస్తున్నది. భారతదేశమంతటా ఉన్న షెడ్యూల్డు కులాలవారు ఈ సమాఖ్యకు దగ్గరయ్యారు. సమాఖ్యను తమ ఏకైక ప్రాతినిధ్య సంస్థగా మలచుకోవాలని వారు నిశ్చయించుకొన్నా రనటంలో సందేహమేమీ లేదు. ఈ వ్యవస్థాపనలో మనం పడిన అనేకానేక ఇబ్బందులను తెలుసుకొంటే తప్ప కొద్ది కాలంలోనే ఈ సమాఖ్య సాధించిన ప్రగతి పూర్తిగా అర్థం కాదు. తప్పుడు ప్రచారాలతో, దొంగ వాగ్దానాలతో, బుజ్జగింపులతో కొన్ని రాజకీయ పార్టీల ఏజెంట్లు మన వాళ్ళను ప్రలోభ పెడుతున్నారు.

మనం ఎలాంటి సంక్లిష్టపరిస్థితుల్లో జీవిస్తున్నామో రాజకీయ లక్ష్యాలను సాధించుకోవటానికి మన కొక సంస్థ ఎంత అవసరమో మన ప్రజలకు తెలియదు అందుకు మన దగ్గర తగిన వనరులు లేకపోవటం విచారించదగ్గ విషయం. మనవద్ద డబ్బు లేదు ప్రచార సాధనాలు లేవు. దేశవ్యాప్తంగా అహర్నిశలూ మనపై జరుగుతున్న క్రూరమైన దాడులను, అణచివేతలను పత్రికారంగం ప్రస్తావించటమే లేదు. అంతేకాదు, సాంఘిక, రాజకీయ పరిస్థితులపై మన అభిప్రాయాలను పత్రికారంగం తనంతగా కుట్ర పూరితంగా ఒక పద్ధతి ప్రకారం అణగదొక్కుతున్నది. మన వాళ్లకు సహాయపడుతూ, వాళ్లను విద్యావంతుల్ని చేసుకొనేందుకూ, వాళ్లని సంఘటిత పరచి కార్యోన్ముఖుల్ని చేసేందుకు మన వద్ద నిధులు లేవు. మనం ఎదుర్కోవలసిన ఇబ్బందులు ఇంత వున్నా ఇన్ని అవాంతరాలను అధిగమించి సమాఖ్య నేడీ రూపం

సంతరించుకొన్నదంటే మనవాళ్ల అకుంఠిత దీక్ష, నిరంతర శ్రమ, నిస్వార్థ త్యాగమే అందుకు కారణమనాలి! ఈ సందర్భంగా బొంబాయి నగర షెడ్యూల్డు కులాల సమాఖ్య అధ్యక్షులు శ్రీ గణపత్ మహాదేవ్ జాదవ్‌గారి అవిశ్రాంత కృషికి సభాముఖంగా మీరూ నాతో పాటు నివాళులర్పిస్తున్నారు. ఆయన కార్య నిర్వహణ సామర్థ్యం గురించి అందరికీ తెలిసిందే. ఆయనా, ఆయన సహచరులూ తీవ్రంగా శ్రమించటం వల్లనే ఈ సదస్సు విజయవంతం అయిందని భావిస్తున్నాను.

సాధారణంగా ఇలాంటి సభల్లో మనవాళ్లు కోరే విధంగానే నేనెప్పుడూ షెడ్యూల్డు కులాలకు సంబంధించిన సాంఘిక, రాజకీయ సమస్యలపైనే మాట్లాడేవాణ్ణి. కానీ, అలాంటి పాక్షికమైన అంశంపై చర్చించాలని నేనిప్పుడు అనుకోవటం లేదు. దానికి బదులుగా ఇప్పుడు విశాల ప్రజానీకానికి సంబంధించిన సాధారణ విషయంపై ప్రసంగించాలనుకుంటున్నాను.

"భారత భవిష్యత్ రాజ్యాంగం - దాని రూపు రేఖలు" అనే అంశంపై నేనిప్పుడు మాట్లాడుతాను. నేనిలా నిర్ణయించుకోవటానికి కారణాలేమిటో వివరిస్తాను. షెడ్యూల్డు కులాల ఉద్యమానికి నాయకత్వం వహించటం, దానికి సంబంధించిన రోజువారీ సమస్యలను ఎదుర్కోవటం అనే బాధ్యత ప్రస్తుతం నా మీద లేదు. నాకున్న పదవీ బాధ్యతల కారణంగా ఆ సమస్యలకు దూరంగా ఉన్నాను. ఆ సమస్యల కార్యక్రమాలు చేపట్టాలని కూడా నాకు లేదు. షెడ్యూల్డు కులాలకు మాత్రమే సంబంధించిన పాక్షికమైన అంశంపై ప్రసంగించకపోవటానికి అది ఒక కారణం.

షెడ్యూల్డు కులాలవారు చాలా స్వార్థపూరితంగా వుంటారనీ, తమ హితం గురించి మాత్రమే వారు శ్రద్ధ చూపుతారనీ, దేశ రాజకీయ సమస్యల పరిష్కారానికి వారు ఎలాంటి నిర్మాణాత్మకమైన సూచనలు చేయరనీ తరచూ ఆరోపణలు వింటుంటాం. ఈ ఆరోపణ పూర్తిగా అబద్ధం. ఒకవేళ అది నిజమే అయితే అందులోని దోషానికి అంటరానివారు మాత్రమే కారకులు కాదు. ఆ మాటకొస్తే భారతదేశంలో చాలామంది నిర్మాణాత్మక సూచనలు చేయటం లేదు. అంటే నిర్మాణాత్మక ఆలోచనగలవారు లేరని కాదు. కాంగ్రెస్ సంస్థ నుంచి బయలు వెడలని ఏ అభిప్రాయాన్ని ఆమోదించరాదనీ, గౌరవించరాదనీ చాలాకాలం నుంచి నిరంతరంగా ప్రచారం చేస్తున్నారు. దానిని సాధారణ ప్రజల మస్తిష్కాల్లోకి చొప్పించటం వల్ల నిర్మాణాత్మకమైన ఆలోచన యావత్తూ బహిర్గతం కాకుండా ఉండిపోయింది. ఈ ధోరణే ఈ దేశంలో నిర్మాణాత్మక ఆలోచన సంతతినీ అంతం చేసింది. అదేవిధంగా షెడ్యూల్డు కులాలవారు దేశ సాధారణ రాజకీయ పురోగమనం కోసం నిర్దుష్టమైన ప్రతిపాదనలు చేయగల సామర్థ్యాన్ని నిరూపించుకుంటూ తమపై వచ్చిన, ఆరోపణలను సానుకూలంగానే తిప్పికొట్టగలుగుతారని నా విశ్వాసం. ఇప్పటి నా ప్రసంగానికి సార్వజనీనమైన అంశాన్ని ఎంచుకోవటానికి రెండవ కారణం ఇదే.

II

## రాజ్యాంగాన్ని రూపొందించే బాధ్యత

నా మనసులో వున్న రాజ్యాంగ ప్రతిపాదనలను నిర్దిష్ట రూపాల్లో ప్రకటించే ముందు నేను రెండు ప్రాధమికాంశాలను మీ ముందు ఉంచదలచాను. మొదటిది – భారతదేశం కోసం రాజ్యాంగాన్ని ఎవరు రూపొందించాలనేది. అడగకుండానే బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశం కోసం ఒక రాజ్యాంగాన్ని రూపొందించాలనీ, ఈ ప్రతిష్టంభనను పరిష్కరించాలనీ ఆశిస్తున్న భారతీయులు కూడా చాలామంది ఉన్నందున ఈ ప్రశ్న లేవనెత్తాల్సిన అవసరం ఉంది. అలాంటి అభిప్రాయాలలో పూర్తిగా అబద్ధం మాత్రమే ఉందనీ, దాన్ని బహిర్గతం చేయాల్సిన అవసరం ఉందనీ నా భావన. గతంలో బ్రిటిష్ ప్రభుత్వం ఒక రాజ్యాంగం రూపొందించి భారతీయులపై రుద్దిన ఆ అనుభవం మనకు చాలు. ఇక భారతీయులు మాకు కావాలో అంటున్న భవిష్యత్ రాజ్యాంగ స్వభావం అలాగే రూపొందితే ఆ బలవంతపు రాజ్యాంగంతో మనుగడ సాగించలేమని స్పష్టంగానే తెలుస్తున్నది.

భారత దేశానికి చెందిన పాత రాజ్యాంగాలకూ, భవిష్యత్ రాజ్యాంగానికీ మధ్యగల అంతరం మౌలికమైనది. అయితే భారతదేశానికి ఒక రాజ్యాంగాన్ని రూపొందించుకోవటానికి ఇంకా బ్రిటిష్ వాళ్లనే నమ్ముకున్నవాళ్లు ఈ తేడాను గమనించినట్లు లేదు. పూర్వ రాజ్యాంగాల్లో ప్రతిష్టంభన క్లాజు ఒకటి ఉంది. కానీ, భావిభారత రాజ్యాంగంలో అలాంటి క్లాజు ఉండజాలదు, అదే తేడా. భారతదేశ ప్రజలు ఆ ప్రతిష్టంభన క్లాజును నిందిస్తారు. 1935 భారత ప్రభుత్వ చట్టంలో అపఖ్యాతిపాలైన 93వ సెక్షన్ అదే. ఈ చట్టంలో ఆ సెక్షన్ ఎలా వుండాలి? ఎందుకుండాలి? అనే విషయం తెలియలేదు. ఒక జాతి రాజకీయ జీవితాన్ని రెండు ముఖ్యమైన అంశాలు నడిపిస్తాయన్న విషయాన్ని గమనిస్తే దీని ప్రాముఖ్యం స్పష్టమవుతుంది. రాజకీయ అంగానికి సుస్తీ చేస్తే శాంతి భద్రతల ఔషధాన్ని పట్టించాలనేది మొదటి అంశం. ఎంతో ప్రాముఖ్యతగల ఈ అంశాన్ని నిర్వహించడంలో విఫలమైతే సమాజానికీ, పౌర జీవనానికీ నష్టం చేసినట్లే భావించాలి. ఇక రెండవ అంశం ఏంటంటే – పరిపాలించటానికి ఎవరికీ ప్రత్యేకమైన హక్కు ఉండదనే విషయం వాస్తవమే. అయినప్పటికీ పరిపాలన నిర్వహణ కోసం – అంటే శాంతి భద్రతలను కాపాడటం కోసం ఎప్పుడూ ఒక ప్రభుత్వం తప్పనిసరిగా ఉండాలనేది కూడా అంతే వాస్తవం ఒక మంచి ప్రభుత్వం ఏర్పడేంతవరకు ఏదో ఒక ప్రభుత్వం ఉండాలి ఆ ప్రతిష్టంభన క్లాజు వల్ల ఈ ప్రయోజనాలు ఉన్నాయి. అదేవిధంగా ఆ క్లాజు ప్రజల్లో శాంతి సామరస్యాల స్థాపన కోసం బాగా ఉపకరిస్తుంది. అరాచకం నుంచి దేశాన్ని కాపాడగల ఏకైక తరుణోపాయం ఆ క్లాజు. రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వం విఫలమైనప్పుడు ప్రభుత్వాన్ని నడిపించగల సామర్థ్యం ఆ ప్రతిష్టంభన క్లాజుకు ఉంది.

రాజ్యాంగ బద్ధమైన ప్రభుత్వం విఫలమైనప్పుడు దాని స్థానే తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటు చేయటం గతంలో సాధ్యమైంది. అది ఎందుకు సాధ్యమైందంటే - బ్రిటిష్ ప్రభుత్వం భారతీయులకు రాజ్యాంగ పరిపాలన హక్కు ఇచ్చేటప్పుడే 'ఆ రాజ్యాంగబద్ధ ప్రభుత్వం విఫలమైతే పరిపాలించే హక్కు తన చేతిలోనే ఉంచుకొన్నది. భావి భారత రాజ్యాంగంలో ఈ తేడాను పెట్టుకోవటానికి వీలులేదు. భారతీయులకు రాజ్యాంగ పరిపాలన హక్కు ఇచ్చి అది విఫలమైతే అధికారాన్ని తమ చేతిలోకే తీసుకొనే అవకాశం బ్రిటిష్ ప్రభుత్వానికి ఇక ఉండదు. కారణం బోధపడుతూనే ఉంది. గత భారత రాజ్యాంగాలు భారతదేశాన్ని ఒక డొమినియన్‌గా చూడలేదు. భవిష్యత్ రాజ్యాంగం భారతదేశాన్ని ఒక డొమినియన్‌గా భావిస్తుంది. డొమినియన్ ప్రతిపత్తిలేని దేశంలో ఈ ప్రతిష్ఠంభన క్లాజు పెట్టుకోవటానికిగాని రాజ్యాంగబద్ధ ప్రభుత్వం విఫలమైనప్పుడు తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోవటానికి గాని వీలుంటుంది. కానీ అదే డొమినియన్ ప్రతిపత్తి గల దానిలోనైతే అవి రెండూ పొసగవు. ఒక డొమినియన్ ప్రతిపత్తిగల దేశంలో గానీ లేదా ఒక స్వతంత్ర్య దేశంలోగానీ ఒక రాజ్యాంగబద్ధ ప్రభుత్వమయినా ఉంటుంది లేదా తిరుగుబాటు రావటమో జరుగుతుంది.

దీని అర్థం ఏమిటి ? ఇండియన్ డొమినియన్‌కు ఒక ప్రతిష్ఠంభన క్లాజు గల రాజ్యాంగాన్ని రూపొందించటానికి వీల్లేదు. ఇదే విషయాన్ని మరోవిధంగా చెప్పాలంటే అందరూ రాజ్యాంగబద్ధులుగా ఉండే విధంగానే కాకుండా అందరూ దాన్ని గౌరవించే విధంగా కూడా రాజ్యాంగాన్ని పటిష్ఠం చేయాలి. మొత్తంపై భారతీయ జీవన రంగంలో అన్ని ప్రధాన శక్తులూ రాజ్యాంగాన్ని గౌరవించేటట్టు తయారు చేయాలి. దానికి మద్దతు ఇచ్చేవిధంగా వాటిని మలచాలి. భారతదేశం కోసం భారతీయులే స్వయంగా రాజ్యాంగాన్ని రూపొందించుకొని ఆమోదించుకున్నప్పుడే అది సాధ్యమవుతుంది. బ్రిటిష్ ప్రభుత్వం ఒక రాజ్యాంగాన్ని మనమీద రుద్దితే దాన్ని ఒక వర్గం ఆమోదించకపోవటం, మరో వర్గం వ్యతిరేకించటం జరిగితే దేశంలో ప్రతికూల శక్తి ఉద్భవించి రాజ్యాంగం అమలు జరగటానికి కాకుండా దాన్ని విచ్ఛిన్నం చేయడానికే ఆ శక్తి నడుం కడుతుంది. ఈ రాజ్యాంగ ప్రతికూల పార్టీ రాజ్యాంగాన్ని నాశనం చేయట మొకటే కర్తవ్యంగా పెట్టుకోవచ్చు. లాటిన్ అమెరికాలో జరుగుతున్నట్టుగా రాజ్యాంగం కోసం పనిచేస్తున్న పార్టీకి వ్యతిరేకంగా అది పనిచేస్తుంది. బ్రిటిష్ వాళ్ళు ఇక్కడ ఉండి రాజ్యాంగాన్ని అమలు చేసే పరిస్థితి లేదు కాబట్టి భారతదేశం కోసం ఒక రాజ్యాంగాన్ని రూపొందించటం నిరుపయోగం. ఒక శక్తివంతమైన వర్గంగానీ, అలాంటి కొన్ని వర్గాల కూటమిగానీ ఒక రాజ్యాంగాన్ని ఇతర వర్గాలపై రుద్దినా అదే ఫలితం ఉంటుంది. అందుకే నేనిలా అభిప్రాయపడుతున్నాను. భారతీయులు అధినివేశ ప్రతిపత్తిని కోరుతున్నట్లయితే తమ స్వంత రాజ్యాంగాన్ని నిర్మించుకొనే బాధ్యత నుండి వారు తప్పించుకోలేరు. తప్పించుకోలేని పరిస్థితి కూడా ఇప్పుడుంది.

## III

## రాజ్యాంగ రచనా సభ

రెండవ ప్రశ్న ఏమిటంటే ఒక రాజ్యాంగాన్ని తయారు చేసే పనిని చేపట్టేందుకు ఒక రాజ్యాంగ సభ అవసరమా? రాజ్యాంగ సభ అవసరమనేది అందరూ అంటున్నదే కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామా చేయకముందు కాంగ్రెస్ పార్టీలు 'భారతీయులతో ఏర్పాటు చేసిన ఒక రాజ్యాంగ సభ మాత్రమే భారతదేశం కోసం ఒక రాజ్యాంగం తయారు చేయాలి" అని డిమాండు చేస్తూ ఆ విధంగా తీర్మానించాయి. "క్రిప్స్" ప్రతిపాదనలలో కూడా రాజ్యాంగ సభ ప్రసక్తి ఉంది సప్రూ కమిటీ కూడా దాన్నే అనుసరించింది

రాజ్యాంగ సభను ఏర్పాటు చేసే ప్రతిపాదనలను నేను పూర్తిగా వ్యతిరేకిస్తున్నాను దాని వల్ల ప్రయోజనమేమీ లేదు దేశాన్ని అంతర్యుద్ధంలో పడదోసే పెద్ద ప్రమాదం ఆ ప్రతిపాదనలో ఉందని నా అభిప్రాయం. అసలు రాజ్యాంగ సభ ఎందుకు తప్పనిసరిగా అవసరమో తెలియటం లేదు. అమెరికా రాజ్యాంగాన్ని రూపొందించినప్పుడు ఆ రాజ్యాంగ కర్తలున్న పరిస్థితులలో నేటి మన భారతీయులు లేరు. స్వతంత్ర ప్రజల కోసం ఒక రాజ్యాంగానికి తగిన భావాలను వారు కల్పించుకోవలసిన అవసరం ఉన్నది. రాజ్యాంగాన్ని నిర్మించుకునేందుకు వారి వద్ద రాజ్యాంగ నమూనా లేవీ లేవు భారతీయుల విషయంలో ఈ పరిస్థితి లేదు రాజ్యాంగ సిద్ధాంతాలు, రాజ్యాంగ నమూనాలు భారతీయుల దగ్గర సిద్ధంగా వున్నాయి ఇతర నమూనాలు చూసే అవకాశమూ తక్కువే ఉన్నది ఎంపిక చేసుకొనేందుకు రెండో, మూడో రాజ్యాంగ నమూనాలే అంతకు మించి లేవు. మూడవ అంశం ఏమిటంటే భారతీయుల మధ్య ఎక్కువ వివాదాస్పదాలవుతాయని చెప్పగల రాజ్యాంగ సమస్యలేవీ పెద్దగా లేవు. భావి భారత రాజ్యాంగం సమాఖ్య రూపంలో ఉండాలని అంగీకరించడమైంది ఏఏ అంశాలు కేంద్రానికి చెందాలి, ఏ అంశాలు రాష్ట్రాలకు చెందుతాయి అనే విషయం కూడా దాదాపు నిర్ణయమై పోయింది. కేంద్ర-రాష్ట్రాల మధ్య రెవిన్యూల విభజనపై ఏ తగాదా లేదు ఓటు హక్కు గురించి గొడవ లేదు శాసన విభాగం, కార్య నిర్వాహక విభాగాలతో న్యాయ విభాగానికి ఉండే సంబంధం విషయం గురించి కూడా ఏ గొడవా లేదు. అయితే అవశిష్టాధికారాలు కేంద్రానికి ఉంటాయా? రాష్ట్రాలకు ఉంటాయా ? అనే అంశం మాత్రమే వివాదాంశంగా మిగిలి వుంది అయినా దాన్ని గురించి అంత పట్టించుకోవలసిన అవసరం లేదు వాస్తవానికి ఇప్పుడు భారత ప్రభుత్వ చట్టంలోని నిబంధననే ఆ వివాదానికి రాజీ మార్గంగా ఎంచుకోవచ్చు.

దీనిని దృష్టిలో పెట్టుకుంటే రాజ్యాంగాన్ని రూపొందించటానికి ఒక రాజ్యాంగ-రచనా సభ ఎందుకు అవసరమో నేను చెప్పలేను. భారతదేశానికి ఒక రాజ్యాంగాన్ని చాలావరకు 1935 భారత ప్రభుత్వ చట్టంలోరాసే ఉంచారు ఇదివరకే మళ్లీ దానిని తిరిగి రాయటం కోసం ఒక రాజ్యాంగ రచనా సభ ఏర్పాటు చేయటం అంటే వృధా శ్రమే అవుతుంది చేయవలసింది

ఏమిటంటే 1935 భారత ప్రభుత్వ చట్టంలో డొమినియన్ ప్రతిపత్తికి సరిపడని అంశాలేవయితే ఉన్నాయో వాటిని తొలగించటమే.

రాజ్యాంగ రచనా సభకు మిగిల్చిన పని ఒకే ఒకటి ఉన్నది. అదేమంటే కులమత సమస్యకు పరిష్కారం కనుక్కోవటం. రాజ్యాంగ రచనా సభకు ప్రతిపాదించిన అంశాలు ఏమైనప్పటికీ కులమత సమస్య అనేది వాటిలో భాగం కాకూడదని మాత్రం నేను చాలా స్పష్టంగా చెపుతున్నాను. సప్రూ కమిటీ సూచించినట్టుగా రాజ్యాంగ రచనా సభ నిర్మాణం చూడండి. గరిష్ఠ సభ్యుల సంఖ్య 160కి పెట్టారు. దామాషా ప్రాతినిధ్యం క్రింద రాష్ట్రాల శాసనసభల సభ్యులు ఉమ్మడి నియోజకవర్గాల ద్వారా ఎన్నిక జరుగుతుంది. హాజరైన సభ్యులలో నాలుగింట మూడువంతుల సభ్యుల అభిప్రాయాల మీద నిర్ణయాలు ఉంటాయి. అల్ప సంఖ్యాక వర్గాలు అట్టి రాజ్యాంగ రచనా సభ తమకు రక్షణ కల్పిస్తుందని భావిస్తారా? అతి నిష్పక్షపాతంగా వ్యవహరిస్తుందని సంపూర్ణమైన విశ్వాసాన్ని పెట్టుకోగలవా? ఈ ప్రశ్నకు సమాధానం వేరే రెండు ప్రశ్నలకు ఇచ్చే సమాధానం మీద ఆధారపడి ఉంది. శాసన సభకు ఎన్నికయ్యే అల్పసంఖ్యాక వర్గాల ప్రతినిధులు వారి నిజమైన ప్రతినిధులు అవుతారనే హామీ ఇవ్వగలరా? రెండోది, ఏ నిర్దిష్టమైన అల్పసంఖ్యాక వర్గాలకు సంబంధించిన విషయంల శాసనసభ తీసుకొనే నిర్ణయం వాస్తవానికి అది అల్పసంఖ్యాక వర్గంమీద రుద్దిన నిర్ణయం కాదనే హామీ ఇస్తారా? ఈ రెండు ప్రశ్నల దేని మీద కూడా భయపడవలసిన అవసరం అల్పసంఖ్యాక వర్గాలకు ఉండదని నేను ఖచ్చితంగా చెప్పలేను.

ఈ ప్రశ్నలు తీసుకొనే ముందు, క్రిప్స్ రాజ్యాంగ రచనా సభకు, సప్రూ రాజ్యాంగరచనా సభకు మధ్య ఉన్న తేడా లేమిటో నన్ను ముందు చూపనివ్వండి. వాటిని ఈ క్రింది విధంగా చెప్పుకోవచ్చు.

(I) రాజ్యాంగ రచనా సభలో మొత్తం 160 మంది సభ్యులు ఉండాలని సప్రూ కమిటీ చెబుతుంది. సర్ స్టాఫర్డ్ క్రిప్స్ సభ్యుల సంఖ్య గురించి ఏమీ చెప్పలేదు కాని రాష్ట్రాల శాసన సభ్యుల మొత్తం సంఖ్యలో పదవ శాతం రాజ్యాంగ రచనా సభలో సభ్యులు ఉండాలని తన ప్రతిపాదనలో సూచించిన నిబంధన మాత్రం ఇంచుమించు మొత్తం సభ్యుల సంఖ్యను 158కి నిర్ణయించింది. తేడా వారిద్దరికి రెండు మాత్రమే.

(II) రాజ్యాంగ రచనా సభకు ఉమ్మడి నియోజక వర్గాల ద్వారా దామాషా ప్రాతినిధ్యంపై ఎన్నిక జరగాలని సప్రూ కమిటీ సూచించింది. రాజ్యాంగ రచనా సభ నిర్మాణంపై సప్రూ పథకానికి క్రిప్స్ పథకానికి తేడా ఏమీలేదు.

(III) క్రిప్స్ పథకం క్రింద కులమత పరమైన ప్రాతినిధ్యం లేదు ఈ విషయంలో సప్రూ కమిటీకి క్రిప్స్ కమిటీకి విభేదం ఉన్నది అదేమంటే సప్రూ కమిటీ కొన్ని కులాలకు నిర్ణయించిన దామాషాలో సీట్లను కేటాయించాలని చెబుతుంది ఈ వ్యత్యాసం

మామూలుదే. క్రిప్స్ పథకం సభ్యుల సంఖ్యను నిర్ణయించకపోయినా, దామాషా ప్రాతినిధ్యం అంటే సీట్ల కేటాయింపు చేసినట్టే లెక్కకు వస్తుంది. ఈ రెండు పథకాల క్రింద ప్రాతినిధ్యం కోటాలో ఉన్న వ్యత్యాసాన్ని చూపటం జరిగింది.

| కుల సముదాయాలు ప్రయోజనాలు | రాజ్యాంగ రచనా సభలో సీట్ల కోటా | |
|---|---|---|
| | క్రిప్స్ క్రింద | సప్రూ క్రింద |
| హిందువులు | 77 | 51 |
| ముస్లిములు | 50 | 51 |
| షెడ్యూల్డు కులాలు | 15 | 20 |
| సిక్కులు | 3 | 8 |
| భారత క్రైస్తవులు | 2 | 7 |
| ఆంగ్లో ఇండియన్లు | 1 | 2 |
| ఐరోపా దేశస్థులు | 6 | 1 |
| ఆదివాసులు | 2 | 3 |
| ప్రత్యేక ప్రయోజనాలు | . | 16 |
| ఇతరులు | 2 | 1 |
| మొత్తం | 158 | 160 |

రాజ్యాంగ రచనా సభ నిర్మాణంలో ప్రతి కులానికి సభ్యుల సంఖ్య నిర్ణయించటమే కాకుండా హిందువులతో సమానంగా ముస్లిములకూ సీ[illegible] మార్గంలో వెళ్లటానికి కమిటీ ఇచ్చిన సంజాయిషీ ఏమంటే, ఈ సూచన ఇవ్వటం మూలంగా రాజ్యాంగ రచనా సభకు ఉమ్మడి నియోజక వర్గాలు ఉండాలని కోరటం జరిగింది అని. ఇందులో కమిటీ క్రిప్స్ ప్రతిపాదనలను పూర్తిగా అపార్థం చేసుకున్నదని చెప్పవచ్చు. క్రిప్స్ ప్రతిపాదనలో ఉమ్మడి నియోజక వర్గాలు అదివరకే ప్రతిపాదన అయి ఉన్నాయి. అందులో ఒక నిబంధన ఏమి చెబుతున్నదంటే– "రాష్ట్ర శాసన సభ దిగువ సభ సభ్యుల ఎన్నిక ఏక సభ్య నియోజక వర్గం నుంచి జరగాలి." దీని అర్థం ఏమంటే ఎన్నికలు ఉమ్మడి నియోజక వర్గాల ద్వారా జరగాలనే. ఇవి ఒక వర్గానికి ఉత్త పుణ్యానికి ఏదో ఇచ్చి ఇతర కులాలను ప్రమాదంలో పడవేసినట్టు అయింది.

(IV) క్రిప్స్ ప్రతిపాదన క్రింద శాసన సభ నిర్ణయం హాజరై ఓటు చేసిన సభ్యులలో మెజారిటీ చెప్పినట్టు జరగాలని. సప్రూ కమిటీ ఏమి ప్రతిపాదిస్తున్నదంటే హాజరై ఓటు చేసిన సభ్యులలో నాలుగింట మూడు వంతుల సభ్యుల ఉద్దేశం ప్రకారం నిర్ణయం జరగాలని.

మొదటి రెండు ప్రశ్నలకు తిరిగి వెళ్దాం. మొదటి ప్రశ్నకు సంబంధించి పరిస్థితి ఎలా

ఉన్నది? దీనిమీద ఎవరి అభిప్రాయం అన్నా చెప్పాలంటే, రాష్ట్ర శాసనసభలోని సభ్యులు ఏఏ కులాలకు చెందిన వారో మొదట తెలుసుకొని ఉండాల్సిన అవసరం ఉన్నది.

## రాష్ట్ర శాసనసభల్లో కుల సముదాయాల వారీగా సీట్ల విభజన

| కుల సముదాయాలు | సాధారణ | స్త్రీలు | విశ్వ విద్యాలయాలు | కార్మిక సంఘాలు | వాణిజ్యం | భూ స్వాములు | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1. హిందువులు | 651 | 26 | 7 | 33 | 31 | 22 | 770 |
| 2. ముస్లిములు | 482 | 10 | 1 | 5 | 6 | 13 | 517 |
| 3. షెడ్యూల్డు కులాలు | 151 | .. | . | .. | .. | .. | 151 |
| 4. భారతీయ క్రైస్తవులు | 20 | 1 | .. | .. | .. | .. | 21 |
| 5. ఆంగ్లో ఇండియన్లు | 11 | 1 | .. | .. | .. | .. | 12 |
| 6. సిక్కులు | 34 | 1 | . | ... | .. | 1 | 36 |
| 7. ఐరోపా దేశస్థులు | 26 | .. | . | . | 19 | 1 | 46 |
| 8. ఆదివాసులు | 24 | .. | .. | .. | .. | .. | 24 |
| మొత్తం | 1399 | 39 | 8 | 38 | 56 | 37 | 1577 |

క్రిప్స్ ప్రతిపాదనలో లేనిది సప్రూ ప్రతిపాదించిన కులాలవారీ రిజర్వేషన్‌కు ఏమైనా విలువ ఉన్నదా? ఇది ఒక కులం ఇతర కులాల సభ్యులను ఎన్నుకొనటంలో ఎంత మేరకు ప్రభావితం చేస్తుంది. అనే విషయం మీద ఆధారపడి ఉంటుంది. ఈ విషయంలో ప్రయోజనాలు ఏమిటి? మరొక పట్టిక ఇస్తాను.

కుల సముదాయాలలో 1 విశ్వ విద్యాలయాలు 2 కార్మిక సంఘాలు 3 వాణిజ్యాలు 4 భూస్వాములకు సీట్ల కేటాయింపు ఖచ్చితమైన అంకెలో చెప్పలేము. ఒకొకరికి ఉన్న బలాన్ని బట్టి ఆయా కుల సముదాయాలలో వారు ఎలా పంచుకుంటారనేదాని మీద ఆధారపడి ఉంటుంది.

## సీట్లకు సంబంధించి ఓటింగు బలం.

| కులసముదాయాలు | రాజ్యాంగ సభకు ఓటర్లు | రాజ్యాంగ సభలో సీట్ల కోటా | కోటా రావలసిన ఓట్ల సంఖ్య | (+)ఎక్కువైన ఓటర్లు (-) కావలసిన దానికి తక్కువైన ఓట్లు |
|---|---|---|---|---|
| 1. హిందువులు | 778 | 51 | 561 | +217 |
| 2. ముస్లిములు | 561 | 51 | 517 | +44 |
| 3. షెడ్యూల్డు కులాలు | 151 | 20 | 220 | -69 |
| 4. భారతీయ క్రైస్తవులు | 21 | 7 | 77 | -56 |
| 5. సిక్కులు | 36 | 8 | 88 | -52 |
| 6. ఐరోపా దేశస్థులు | 46 | 1 | 11 | +35 |

ఈ పట్టిక నుంచి ఈ క్రింది విషయాలు గ్రహించవచ్చు (i) మొత్తం ఓట్లసంఖ్య 1577 అయి ఉండి, ఎన్నుకోవలసిన సంఖ్య 160 ఉంటే, దామాషా ప్రాతినిధ్యం క్రింద వచ్చే కోటా 10+1=11 క్రిందికి వస్తుంది. (ii) కోటా 11 అయి ఉంటే, హిందువులకు 217, ముస్లిములకు 44, ఐరోపా దేశస్థులకు 35 ఓట్లు మిగిలిపోతాయి, షెడ్యూల్డు కులాలకు 69, భారతీయ క్రైస్తవులకు 56, సిక్కులకు 52 సీట్లు తగ్గుతాయి.

ఇదే విషయాన్ని మరొక విధంగా చెప్పాలంటే

(i) హిందువులు తమ వద్ద ఎక్కువగా ఉన్న 217 ఓట్లతో తమపై ఆధారపడి ఉండే 20 మంది హిందువేతరులను ఎన్నుకోవచ్చు. ముస్లిములు తమ వద్ద ఉన్న 44 ఓట్లతో తమపై ఆధారపడి ఉన్న నలుగురు ముస్లిమేతరులను ఎన్నుకోవచ్చు. ఐరోపా దేశస్థులు తమ వద్ద ఎక్కువగా ఉన్న 35 ఓట్లతో తమపై ఆధారపడి ఉన్న ఐరోపా దేశస్థులు కాని వారిని ముగ్గురిని ఎన్నుకోవచ్చు.

(ii) షెడ్యూల్డు కులాలకు 69 ఓట్లు తక్కువ పడటంతో, తమ స్వంత బలం మీద 13 గురిని మాత్రమే ఎన్నుకోగలరు, మిగిలిన 7 గురిని ఎన్నుకోవటం కోసం హిందువులు, ముస్లిములు లేదా ఐరోపా దేశస్థుల మీద ఆధారపడవలసి ఉంటుంది. భారతీయ క్రైస్తవులకు 56 ఓట్లు తక్కువ పడటంతో తమ స్వంత బలంమీద ఇద్దరిని మాత్రమే ఎన్నుకోగలుగుతారు. మిగిలిన 5 సీట్ల కోసం హిందువులు ముస్లిములు లేదా ఐరోపా దేశస్థుల మీద ఆధారపడవలసి ఉంటుంది. అదేవిధంగా సిక్కులను 52 ఓట్లు తక్కువ పడటంతో తమ స్వంత బలంమీద ముగ్గురిని మాత్రమే ఎన్నుకో గలుగుతారు. మిగిలిన 5 సీట్ల కోసం హిందువులు, ముస్లిములు

లేదా ఐరోపా దేశస్థుల మీద ఆధారపడవలసి ఉంటుంది

పరిస్థితి అలా ఉన్నది చిన్న అల్ప సంఖ్యాకులకు ఎక్కువ ప్రాతినిధ్యాన్ని కల్పించటం అనేది కంటితడుపు మాత్రమే. వారి ప్రాతినిధ్యాన్ని ఎంతగా పరాధీనం చేశారంటే, దానిని నిజమైన ప్రాతినిధ్యంగా చెప్పుకోలేము. రెండో ప్రశ్నను తీసుకుందాం రాజ్యాంగ రచనా సభకు సప్రూ కమిటీ అనుసరించిన నిబంధన క్షేమమైన నిబంధన అవుతుందా? ఉత్తమ మెజారిటీ నిబంధనను క్రిప్స్ ప్రతిపాదన ఆమోదించింది. ఇది అసంగతమైన ప్రతిపాదన, వివేకవంతుడెవడూ దీనిని ప్రతిపాదించడు. రాజ్యాంగానికి సంబంధించిన ప్రశ్నల విషయంలో వాటిని కేవలం మెజారిటీకి విడిచి పెట్టిన సందర్భాలేవీ నాకు తెలియవు.

మైనారిటీల ప్రయోజనాలు పరిరక్షించటానికి మరొక నిబంధన ఉండాలనే ఆధారం మీద క్రిప్స్ ప్రతిపాదన మెజారిటీ నిర్ణయం ఆమోదాన్ని సమర్థించుకో చూస్తున్నది పార్లమెంటు తన సార్వభౌమత్వాన్ని వదులుకొని భారతదేశాన్ని స్వతంత్ర దేశంగా చేసేముందు బ్రిటిషు రాజత్వానికి భారతదేశ రాజ్యాంగ రచనా సభకు మధ్య ఒక ఒడంబడిక రూపాన్ని ఈ నిబంధన తీసుకోవలసి ఉంది. రాజ్యాంగాన్ని ఈ ఒడంబడిక అతిక్రమించేటట్టు అయితే దానికి - ఒక అర్థం ఉంటుంది. కాని ఈ ప్రతిపాదన అసాధ్యమైనట్టిది. ఎందుకంటే క్రిప్స్ ప్రతిపాదన క్రింద భారతదేశం తనకు ఇష్టమయితే డొమినియన్ ప్రతిపత్తిగా అయినా ఉండవచ్చు స్వతంత్ర దేశంగా అయినా మారవచ్చు. భారతదేశం ఒకసారి డొమినియన్ ప్రతిపత్తిని పొంది ఉన్నట్లయితే, పైన చెప్పిన ఒడంబడిక రాజ్యాంగాన్ని అతిక్రమించలేదని ప్రకటిస్తూ ఒక చట్టం చేయటానికి అవసరమైన న్యాయ పరమైన అధికారాన్ని దానంతట అదే సంతరించుకుంటుంది అట్టి సందర్భంలో ఆ ఒడంబడిక అల్ప సంఖ్యాక వర్గాల సభ్యులు ఇష్టముంటే గోడమీద తగిలించుకొనే క్యాలండర్ కంటే ఎక్కువ ఏమీ ఉపయోగపడదు. ఐరిష్ ఒడంబడికలో కూడ ఇదే జరిగింది. ఐర్లండు డొమినియన్ ప్రతిపత్తి పొందనంతకాలం ఆ ఒడంబడిక ఐరిష్ రాజ్యాంగాన్ని అతిక్రమిస్తూనే ఉన్నది. కాని ఐర్లండ్ డొమినియన్ ప్రతిపత్తి పొందిన మరుక్షణం స్వతంత్ర ఐర్లండ్ దేశం ఒక చిన్న శాసనం రూపొందించటం ద్వారా ఆ అతిక్రమణ అధికారాన్ని తొలగించి వేసింది. బ్రిటిష్ పార్లమెంటు ఏమీ చేయలేక పోయింది. ఎందుకంటే ఐర్లండ్ డొమినియన్ ప్రతిపత్తి పొందిందనీ, దానిని తాను ఏమీ చేయలేదని? బ్రిటిష్ పార్లమెంటుకు తెలుసు. అల్ప సంఖ్యాక వర్గాలకు హామీ కలిగించటంకోసం అంత ప్రసిద్ధి చెందిన వ్యక్తి అంత అసంగతమైన ప్రతిపాదన ఎలా చేశాడో నాకు అర్థం కావటం లేదు.

సప్రూ ప్రతిపాదనలోని నిబంధనలలో కొంత మెరుగు కనబడుతుంది. కాని దానిని నిజంగా మెరుగు అని అనగలమా? కాదని నాకు ఖచ్చితంగా తెలుసు. 160లో నాలుగింట మూడు వంతుల మెజారిటీ అంటే, ఒక అభిప్రాయం చెల్లుబాటు కావాలంటే దానికి 120 మంది మెజారిటీ కావాలి. దీనిని మెరుగుదలగా అంగీకరించే ముందు, ఈ 120 మంది గుంపు ఎలా ఏర్పడతారనే విషయం తెలుసుకోవలసి ఉంటుంది. హిందువులు, ముస్లిములు కలిస్తే

102 మంది అవుతారు. అది 120 కావటానికి 18 ఉంటే సరిపోతుంది. ప్రత్యేక సీట్లలో చాలమంది, ఇతరులలో నుంచి కొంతమంది, సులువుగా ఈ గుంపులోకి చేరతారు. ఇది గనక జరిగినట్లయితే, శాసన సభ నిర్ణయం షెడ్యూల్డు కులాలు, సిక్కులు, భారతీయ క్రైస్తవుల మొదలైన వారిమీద రుద్ది నట్టే లెక్క. అదే విధంగా ముస్లిములు విడిగా ఉన్నట్లయితె, నిర్ణయం ఉమ్మడి నిర్ణయం అవదు. అది ముస్లిమేతరులు ముస్లిముల మీద రుద్దినట్టు అవుతుంది. కొన్ని కుల సముదాయాలు మరికొన్ని కుల సముదాయాల ఆట కట్టించటానికో, అధిగమించటానికో ఈ కూడికలు తీసి వేతలు వేయటాన్ని సప్రూ కమిటీవారు పరిగణనలోకి తీసుకోలేదని చెప్పటానికి నేను చాల విచారిస్తున్నాను. నాలుగింట మూడొంతుల మెజారిటీలో ఒక్కొక్క భాగంలో 50 శాతం ఉండాలనే నియమం సప్రూ కమిటీ పెట్టి ఉంటే బాగుండేది.

అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగం రచనా కాలంలో అనుసరించిన పద్ధతినే తీసుకొని శాసన సభ తీసుకొనే నిర్ణయాలలో కుల సమస్యకు సంబంధించిన అంశం వచ్చినపుడయినా శాసన సభ వెలుపల ఉన్న అల్పసంఖ్యాక సభ్యులు దానిని ఆమోదించాలనే నియమాన్ని సప్రూకమిటీ పెట్టి ఉండవలసింది. సప్రూ కమిటీ రూపొందించిన రాజ్యాంగ రచనా సభ నమూనాలో ఈ ప్రతిపాదనలకు ఎక్కడా తావు లేదు. దీని ఫలితంగా రాజ్యాంగ రచనా సభ ఒక వల అయింది

రాజ్యాంగ రచనా సభను వ్యతిరేకిస్తూ చాలా. వాదనలు వచ్చాయి. నన్ను బాగా ప్రభావితం చేసిన దానిని ఒకటి ప్రస్తావిస్తాను. స్కాట్లండు, ఇంగ్లాండుల ఐక్యత చరిత్రను చదువుతున్నపుడు స్కాట్లండు పార్లమెంటు సమ్మతిని పొందటం కోసం ఎంత దుర్నీతిని, లంచగొండితనాన్ని ఉపయోగించారనే విషయం చూసినపుడు నాకు దిగ్భ్రాంతి కలిగింది. మొత్తం స్కాట్లండు పార్లమెంటు అమ్ముడు పోయింది. కొందరు తమ స్వార్థ ప్రయోజనాల కోసం కొన్ని నిర్ణయాల ఆమోదం కోసం రాజ్యాంగ రచనా సభలోని సభ్యులకు దుర్నీతి అలవర్చటం ద్వారానో లంచం ఇవ్వటం ద్వారానో వారిని కొనే అవకాశాలు భారతదేశంలో నిజంగా చాలా ఉన్నాయి. వాటి ఫలితాలను చూడకుండా వదల కూడదు. ఇదే గనుక జరిగితే, రాజ్యాంగ రచనా సభనే హాస్యాస్పదం చేయటం మాత్రమే కాకుండా దాని నిర్ణయాలను అమలు చేయటానికి ఏ ప్రయత్నమైనా జరిగితే మాత్రం అంతర్యుద్ధానికి దారి తీస్తుందని నాకు గట్టిగా అనిపిస్తున్నది. రాజ్యాంగ రచనా సభ ప్రతిపాదన లాభదాయకం కాక చాల ప్రమాద భరితమైనదని, దానిగురించి ఆలోచించ కూడదని నా గట్టి నమ్మకం.

## IV

## కొత్త దృక్పథం ఆవశ్యకత

రాజ్యాంగ రచనా సభ సరియైన మార్గం కాదనుకొంటే, మరి దానికి ప్రత్యామ్నాయం ఏమిటి? అని నేను ప్రశ్న వేసుకోవాలి అటువంటి ప్రశ్న నన్ను అడుగు తారని నాకు తెలుసు.

కుల మత పరమైన సమస్యకు పరిష్కారం కనుక్కోవటం కష్టమయిందంటే దానికి కారణం అది పరిష్కారానికి అందనంత కష్టమైన సమస్య కాదని లేదా రాజ్యాంగ రచనా సభ యంత్రాంగాన్ని మనం అందుకు వినియోగించుకోలేక పోవటం కూడా కాదని నాకు దృఢ విశ్వాసం ఉన్నది. దానికి పరిష్కారం ఎందుకు దొరకటం లేదంటే అందుకు మనం ఎన్నుకున్న పద్ధతి ప్రాథమికంగా తప్పు. ప్రస్తుత దృక్పథంలో ఉన్న లోపం ఏమిటంటే, సూత్రాల ప్రకారం పోకుండా పద్ధతుల ప్రకారం పోవటం జరుగుతున్నది. సూత్రాలు లేవనేదే ఇక్కడ సూత్రంగా ఉన్నది. వరసగా కొన్ని పద్ధతులు మాత్రమే ఉన్నాయి. ఒక పద్ధతి పనికి రాలేదంటే మరొక పద్ధతిని వాడటం జరుగుతున్నది. ఒక పద్ధతి నుంచి మరొక పద్ధతికి దూకటం వల్ల కులమత సమస్య ఒక దాగుడు మూతలా తయారయింది. ఒక సూత్రం అంటూ లేకపోవటం వల్ల ఒక పద్ధతి ఎందుకు పనికి రాలేకపోయిందో తెలుసుకోవటం కష్టం అవుతున్నది. సూత్రం అంటూ లేకపోవటం వల్ల కొత్త పద్ధతి అయినా విజయవంతం అవుతుందని చెప్పటం కూడా కష్టం అవుతుంది.

కుల మత సమస్య పరిష్కారానికి ప్రయత్నాలు పిరికివాళ్లు బలవంతులకు భయపడి వారి మార్గంలో పోవటం లాగానో లేదా బలవంతులు బలహీనులను భయపెట్టి తమ మార్గంలో నడిపించుకోవటం లాగానో ఉన్నాయి. ఎప్పుడైనా ఒక కుల సముదాయం శక్తి వంతమయి కొన్ని రాజకీయ ప్రయోజనాలు కావాలని అడుగు తున్నదంటే దాని మెప్పు పొందటం కోసం అది అడిగినది ఇచ్చి వేయటం జరుగుతున్నది. వారు అడిగింది. న్యాయ బద్ధంగా ఉన్నదా లేదా అని చూడటం గాని దాని మంచి చెడ్డలు బేరీజు వేసి చూడటం గాని జరగటం లేదు. ఫలితం ఏమంటే అడగటానికి హద్దులు లేకుండా పోయాయి. ఇవ్వటానికీ హద్దులు లేకుండా పోయాయి. అల్పసంఖ్యాకులకు ప్రత్యేక నియోజకవర్గం అడగటంతో మొదలయింది. దానిని మంజూరు చేశారు. జనాభా ప్రాతిపదికపైన ప్రత్యేక ప్రాతినిధ్యం కావాలని అడిగారు. దానిని అంగీకరించారు. తరవాత ప్రాతినిధ్యంలో కొంత ఎక్కువ ఉండాలని అడిగారు. దానిని అంగీకరించారు. దీని వెనక ప్రత్యేక నియోజక వర్గాలు అధిక సంఖ్యాకులు నిలుపుకొనే హక్కుతో సహా, అల్ప సంఖ్యాకులపైన అధిక సంఖ్యాకులకు చట్టపరమైన మెజారిటీ ఉండాలని అడిగారు. దానిని అంగీకరించారు. దీని తర్వాత, ఒక కుల సముదాయం మెజారిటీ పరిపాలన దుర్భరమయిందని, అల్ప సంఖ్యాకులపై అధిక సంఖ్యాకులు మెజారిటీని నిలుపుకొనే హక్కుకు భంగం లేకుండా, హాని కలిగిస్తున్న కుల సముదాయం మెజారిటీని సరి సమం అయ్యేట్టు తగ్గించాలని అడుగుతున్నారు. అడిగిందల్లా ఇచ్చుకుంటూ పోవటం అనే ఈ పద్ధతి ఏదయితే ఉందో దానికంటే అసంగతమైనది మరొకటి ఉండదు. ఇది హద్దులు లేని కోర్కెలు, అంతంలేని తీర్పుబాలు అనే సూత్రం అవుతుంది.

ఈ ఎత్తుగడ అవలంబిస్తున్న కుల సముదాయాన్ని నేనేమీ నిందించటం లేదు. ఫలితాల్ని ఇస్తుంది కాబట్టి ఆ పని అది చేస్తున్నది. పరిమితులు ఏవీ నిర్ణయించి లేవు కాబట్టి

ఆ పని అది చేస్తూ పోతుంది. న్యాయ సమ్మతంగానే ఇంకా చాలా అడగవచ్చు. సులువుగానే వాటిని ఇవ్వటం కూడా జరుగుతుందనే నమ్మకం దానికి ఉంటుంది. అలా కాకుండా, ఆర్థికంగా పేద అయి, సామాజికంగా కిందికి నెట్టివేయబడిన, విద్యాపరంగా వెనుకబడి ఉండి దోపిడీకి గురి అవుతున్న సమాజం తిరస్కారానికి గురై, ప్రభుత్వ ఆదరణ లేకుండా రక్షణ, భద్రత లేకుండా న్యాయం, ధర్మం, న్యాయపద్ధతి దొరుకుతుందనే హామీ లేకుండా సమాన అవకాశాలు లేకుండా ఒక కుల సముదాయం ఉంటుంది. అటువంటి కుల సముదాయానికి మీకేమీ రక్షణలు లేవని చెబుతారు. వాటికి రక్షణలు ఉండవలసిన అవసరం లేదని కాదు, ఆ కుల సముదాయం రాజకీయంగా నిర్మాణం అయి లేకపోవటం వలన అది దేనినీ కావాలని అడిగి తెచ్చుకొనే పరిస్థితి లేకపోవటంతో వారిని భయపెట్టవచ్చని హక్కుల బిల్లును ప్రవేశ పెడుతున్నవారు అనుకుంటున్నందువల్ల.

కుల మత సమస్యకు కక్షిదారులయిన వారిని కట్టివేసి అధికారం ద్వారా అంగీకరింప చేసే సూత్రాలు ఏవీ లేకపోవటం వల్ల ఇటువంటి వివక్షను చూపటం జరుగుతున్నది. సూత్రాలు లేకపోవటం వల్ల మరొక హానికరమైన పరిణామం ఉన్నది. ప్రజాభిప్రాయం తన పాత్రను నిర్వహించే అవకాశం లేకుండా చేసింది. పద్ధతులు మాత్రమే ప్రజలకు తెలిశాయి. దానితో ఒక పద్ధతి పనికి రాలేదు కాబట్టి మరొక పద్ధతిని అవలంబిస్తున్నారని వారు అనుకుంటున్నారు. ఒక పద్ధతి ఎందుకు పనికి రాకుండాపోయింది, మరొక పద్ధతి ఎలా పనికి వస్తుందో అనేది వారికి తెలియదు. ఫలితం ఏమంటే, మొండివారు, తిరుగుబాటు చేసేవారికి నచ్చచెప్పి వారికి హేతువు చూపటానికి వీలుగా ప్రజలు సమీకృతం కాకుండా, కుల మత సమస్యలు చర్చలకు వచ్చినపుడల్లా బొమ్మలాట చూస్తూ ఉన్నట్టు ఉండిపోతున్నారు.

కుల మత సమస్య పరిష్కారం ఎలా కనుక్కోవాలనే విషయం మీద రెండు ప్రతిపాదనలు ఉంచుతున్నాను.

(1). కుల మత సమస్యను పరిష్కరించేటపుడు, అంతిమ పరిష్కారం నిర్ణయించటం కోసం ఉపయోగించటానికి కొన్ని ఆదేశిక సూత్రాలను నిర్వచించుకోవాలి.

(2). ఆదేశిక సూత్రాలు ఏవయినప్పటికీ వాటిని భయంగాని, అభిమానంగాని లేకుండా అందరి విషయంలోనూ సమానంగా అమలు చేయాలి.

## V

## కుల సమస్య పరిష్కారానికి ప్రతిపాదనలు

కొన్ని ప్రాథమిక అంశాలపై నా వైఖరి స్పష్టం చేశాను. ఇప్పుడు అసలు విషయానికొస్తాను. కుల సమస్య మూడు ప్రశ్నలను లేవనెత్తుతున్నది:–

(ఎ). శాసన సభలో ప్రాతినిధ్యం?

(బి). కార్యనిర్వాహక వర్గంలో ప్రాతినిధ్యం?

(సి). ప్రభుత్వ ఉద్యోగాల్లో ప్రాతినిధ్యం?

## (ఎ). ప్రభుత్వ ఉద్యోగాలలో ప్రాతినిధ్యం

పైన చెప్పిన వాటిలో చివరి అంశాన్ని ముందు తీసుకుందాం. ఇదేమీ వివాదాంశమైన అంశం కాదు. ప్రభుత్వ ఉద్యోగాల్లో అన్ని కులాలకూ ఒక దామాషా పద్ధతి ప్రకారం ప్రాతినిధ్యం కల్పించాలి. ఏ ఒక్క కులానికీ గుత్తాధిపత్యం ఉండరాదనే సూత్రాన్ని భారత ప్రభుత్వం ఆమోదించింది. 1934, 1943 నాటి భారత ప్రభుత్వ తీర్మానాల్లో ఆ సూత్రాన్ని చేర్చారు. ఆ సూత్రాన్ని అమలు జరిపేందుకు అవసరమైన నియమాలు కూడా రూపొందించారు. వాటికి విరుద్ధంగా ఏ రకమైన నియామకం జరిగినా అది చెల్లదని కూడా నిర్ణయించారు. ఇ అవసరమైందల్లా పరిపాలనలో ఇప్పుడు అమలు జరుగుతున్న దాన్ని చట్టబద్ధం చేయటం భారత ప్రభుత్వ చట్టంలో ఒక షెడ్యూలును చేర్చి పరిపాలన నిర్వహణను చట్టబద్ధ చేయవచ్చు. అందుకు సంబంధించిన తీర్మానాలతో వుండే నిబంధనలు ఆ షెడ్యూలులో చోటు చేసుకోవాలి. విభిన్న ప్రాంతాలకు వర్తించే విధంగా ఆ నిబంధనలు ఉండాలి. ఈ షెడ్యూలు రాజ్యాంగ చట్టంలో ఒక భాగం కావాలి

## బి. కార్య నిర్వాహక వర్గంలో ప్రాతినిధ్యం

ఈ ప్రశ్న మూడు అంశాలను లేవనెత్తుతున్నది:-

(I) కార్యనిర్వాహక వర్గంలో ప్రాతినిధ్య పరిమాణం.

(II) కార్యనిర్వాహక వర్గ స్వభావం

(III) కార్యనిర్వాహక వర్గంలో స్థానాలను భర్తీ చేసేపద్ధతి.

## (i) ప్రాతినిధ్య పరిమాణం

ఈ సమస్యను పరిష్కరించాలంటే హిందువులకు, ముస్లింలకు, షెడ్యూల్డు కులాలకు శాసన సభలో ఎంత ప్రాతినిధ్యం కేటాయించారో అదే పరిమాణంలో వారికి నిర్వాహక వర్గంలో ప్రాతినిధ్యం కల్పించే విధంగా ఒక సూత్రాన్ని రూపొందించాలి.

సిక్కులు, భారతీయ క్రైస్తవులు, ఆంగ్లో ఇండియన్‌ల వంటి అల్ప సంఖ్యాకుల విషయానికొస్తే వారికి శాసన సభలో ఉన్న ప్రాతినిధ్య నిష్పత్తిలోనే కార్య నిర్వాహక వర్గంలో కూడా ఖచ్చితంగా ప్రాతినిధ్యం కల్పించటం చాలా కష్టం. సంఖ్య రీత్యా వారు చాలా తక్కువ

ఉండటంతో ఈ సమస్య ఉత్పన్నమవుతుంది. వారి సంఖ్యకు తగిన నిష్పత్తిలో వారికి కార్య నిర్వాహక వర్గంలో ప్రాతనిధ్యం కల్పించాలంటే కార్యనిర్వాహక వర్గ పరిధిని ఊహాతీత పరిమాణంలో పెంచాల్సి వుంటుంది. అందువల్ల మనం చేయగలిగే దేమిటంటే నూతన రాజ్యాంగం అమలులోకి వచ్చే సరికి ఆ అల్ప సంఖ్యాకుల ప్రాతినిధ్యం కోసం మంత్రివర్గంలో ఒకటి లేదా రెండు స్థానాలను కేటాయించవచ్చు. పార్లమెంటరీ మంత్రివర్గంలో కార్యదర్శి పదవుల్లో వారికి తగిన ప్రాతినిధ్యం ఉండేలా ఒక రివాజు ఏర్పరచవచ్చు.

## (ii) కార్య నిర్వాహక వర్గ స్వభావం

కార్యనిర్వాహక వర్గ నిర్మాణంలో ఈ క్రింది సూత్రాలను పొందుపరచాలని ప్రతిపాదిస్తాను.

(1). అధిక సంఖ్యాకుల అల్ప సంఖ్యాకుల మధ్య నిరంతర సంఘర్షణ జరిగే ఇండియా లాంటి దేశంలో అల్ప సంఖ్యాకులకు వ్యతిరేకంగా అధిక సంఖ్యాకులు అనుసరించే కుల వివక్షతల ధోరణివల్ల అల్పసంఖ్యాకులకు నిరంతర ప్రమాదం కలిగే దేశంలో శాసన నిర్మాణ అధికారం కంటె కార్యనిర్వాహక వర్గ అధికారానికి మరింత ప్రాధాన్యత ఉంటుందనే విషయాన్ని తప్పక గుర్తించాలి.

(2). పై (1)వ ప్రస్తావన దృష్ట్యా పరిశీలిస్తే ఎన్నికల్లో మెజారిటీ సాధించిన ఒక పార్టీ అది మెజారిటీ ఆమోదాన్ని పొందింది గనుక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయవచ్చుననే మాట భారతదేశ పరిస్థితులకు సరిపోదు. భారతదేశంలో కులమత సంబంధమైన మెజారిటీయేగాని రాజకీయ మెజారిటీ కాదు. ఈ తేడా ఉన్నందువల్లనే ఇంగ్లండులో అంగీకారమైన పరిస్థితి భారతదేశ పరిస్థితులకు వర్తించదు.

(3). కార్యనిర్వాహక వర్గం శాసన సభలో మెజారిటీ పార్టీకే చెందిన కమిటీగా ఉండరాదు. అధిక సంఖ్యాకుల నుండే కాకుండా శాసన సభలోని అల్ప సంఖ్యాక అభిప్రాయాన్ని కూడా పరిగణించేటట్లు కార్య నిర్వాహక వర్గాన్ని మరింత పటిష్ఠంగా నిర్మించాలి.

(4). కార్యనిర్వాహక వర్గం పార్లమెంటుకు చెందనిదిగా ఉండాలని అంటే శాసనసభ కాలపరిమితికి ముందుగా దాన్ని తొలగించాలని కాదు

(5). కార్యనిర్వాహక వర్గం పార్లమెంటు బద్ధంగా వుండాలని అంటే ఈ వర్గం సభ్యులను శాసన సభ్యులనుండి ఎంపిక చేయాలనీ, పార్లమెంటులో పాల్గొనడానికీ, మాట్లాడటానికీ, ప్రశ్నలకు సమాధానం ఇవ్వటానికీ వోటు చేయడానికీ హక్కు వుండాలని అర్థం.

## (iii) స్థానాలను భర్తీచేసే పద్ధతి

ఈ సందర్భంలో ఈ క్రింది సూత్రాలను పొందు పరచాలని ప్రతిపాదిస్తాను.

(ఎ). కార్యనిర్వాహక వర్గ ముఖ్యుడుగా వుండే ప్రధాన మంత్రి మొత్తం శాసనసభ విశ్వాసాన్ని పొందాలి.

(బి). మంత్రివర్గంలో అల్పసంఖ్యాక వర్గానికి ప్రాతినిధ్యం వహించే వ్యక్తి శాసనసభలోని ఆ వర్గ సభ్యుల ఆమోదాన్ని పొందాలి.

(సి). అవినీతి, ప్రజాద్రోహం వంటి నేరాల క్రింద అభిశంసిస్తే తప్ప మంత్రివర్గంలోని సభ్యుడిని పార్లమెంటు తొలగించరాదు.

ఈ సూత్రాల ననుసరించి, ప్రధానమంత్రితో పాటు మెజారిటీ కుల మతాలకు చెందిన మంత్రులను మొత్తం శాసన సభ్యుల ఒకే ఒక్క బదలాయింపు ఓటుతో ఎన్నుకోవాలి. మంత్రివర్గంలో వివిధ అల్ప సంఖ్యాకులకు చెందిన సభ్యులు శాసన సభలోని ఆయా అల్ప సంఖ్యాక కుల–మతాలకు చెందిన సభ్యుల ఒకే ఒక్క బదలాయింపు ఓటు ద్వారా ఎన్నుకోబడాలి.

## సి). శాసనసభలో ప్రాతినిధ్యం

ఇది మరీ జటిలమైన విషయం. ఇతర సమస్యలన్నీ ఈ సమస్య పరిష్కారంపై ఆధారపడి వున్నాయి. ఇది రెండు అంశాలను లేవనెత్తుతున్నది.

(i) ప్రాతినిధ్య పరిమాణం.

(ii) నియోజకవర్గ స్వభావం

## (i) ప్రాతినిధ్య పరిమాణం

నేను ముందుగా నా ప్రతిపాదనలు వెల్లడించి, వాటికి ఆధారమైన సూత్రాలను తర్వాత వివరిస్తాను. నా ప్రతిపాదనలన్నీ ఈ క్రింద ఇచ్చిన పట్టికల్లో ఉన్నాయి. బ్రిటిష్ ఇండియాలోని కేంద్ర శాసనసభలోనూ, అదేవిధంగా రాష్ట్ర శాసనసభలోనూ వివిధ కులాలకు ఉన్న ప్రతినిధుల సంఖ్యా బలాలు ఈ పట్టికలో కనిపిస్తాయి.

## శాసనసభలో ప్రతినిధుల సంఖ్యాబలం గురించి ప్రతిపాదించిన నిష్పత్తి

గమనిక :

జనాభా లెక్కల్లోంచి ఆదివాసీల జనాభాను మినహాయించి చూపటం వల్ల క్రింద ఇచ్చిన పట్టికల్లోని జనసంఖ్య శాతాలు జనాభా లెక్కలకు భిన్నంగా వుంటాయి.

## 1. కేంద్ర శాసనసభ

| కులమత వర్గాలు | మొత్తంలో జనాభా శాతం | ప్రాతినిధ్య శాతం |
|---|---|---|
| 1 | 2 | 3 |
| హిందువులు | 54.68 | 40 |
| ముస్లిములు | 28.50 | 32 |
| షెడ్యూల్డు కులాలు | 14.30 | 20 |
| భారతీయ క్రైస్తవులు | 1.16 | 3 |
| సిక్కులు | 1 49 | 4 |
| ఆంగ్లో ఇండియన్లు | 0.05 | 1 |

## 2. బొంబాయి

| | | |
|---|---|---|
| హిందువులు | 76.42 | 40 |
| ముస్లిములు | 9.98 | 28 |
| షెడ్యూల్డు కులాలు | 9.64 | 28 |
| భారతీయ క్రైస్తవులు | 1.75 | 2 |
| ఆంగ్లో ఇండియన్లు | 0.07 | 1 |
| పార్శీలు | 0.44 | 1 |

## 3. మద్రాసు

| | | |
|---|---|---|
| హిందువులు | 71.20 | 40 |
| షెడ్యూల్డు కులాలు | 16.53 | 30 |
| ముస్లిములు | 7.98 | 24 |
| భారతీయ క్రైస్తవులు | 4.10 | 5 |
| ఆంగ్లో ఇండియన్లు | 0.06 | 1 |

## 4. బెంగాల్

| | | |
|---|---|---|
| ముస్లిములు | 56.50 | 40 |
| హిందువులు | 30.03 | 33 |
| షెడ్యూల్డు కులాలు | 12.63 | 25 |
| భారతీయ క్రైస్తవులు | 0.19 | 1 |
| ఆంగ్లో ఇండియన్లు | 0.05 | 1 |

## 5. సంయుక్త రాష్ట్రాలు

| | | |
|---|---|---|
| హిందువులు | 62.29 | 40 |
| షెడ్యూల్డు కులాలు | 21.40 | 29 |
| ముస్లిములు | 15.30 | 29 |
| భారతీయ క్రైస్తవులు | 0.24 | 1 |
| ఆంగ్లో ఇండియన్లు | 0.03 | 1 |

## 6. పంజాబ్

| | | |
|---|---|---|
| ముస్లిములు | 57.06 | 40 |
| హిందువులు | 22 17 | 28 |
| సిక్కులు | 13.22 | 21 |
| షెడ్యూల్డు కులాలు | 4 39 | 9 |
| భారతీయ క్రైస్తవులు | 1.71 | 2 |

## 7. సెంట్రల్ ప్రావిన్సెస్ (నేటి మధ్యప్రదేశ్) బిరార్

| | | |
|---|---|---|
| హిందువులు | 72.20 | 40 |
| షెడ్యూల్డు కులాలు | 20.23 | 34 |
| ముస్లిములు | 5.70 | 25 |
| భారతీయ క్రైస్తవులు | 0.36 | 1 |

## 8. బీహార్

| | | |
|---|---|---|
| హిందువులు | 70.76 | 40 |
| ముస్లిములు | 15.05 | 30 |
| షెడ్యూల్డు కులాలు | 13 80 | 28 |
| భారతీయ క్రైస్తవులు | 1.71 | 2 |

## 9. అస్సాం

| | | |
|---|---|---|
| హిందువులు | 45.60 | 40 |
| ముస్లిములు | 44.59 | 39 |
| షెడ్యూల్డు కులాలు | 8.76 | 19 |
| భారతీయ క్రైస్తవులు | 0.48 | 2 |

## 10. ఒరిస్సా

| | | |
|---|---|---|
| హిందువులు | 70.80 | 40 |

| | | |
|---|---|---|
| షెడ్యూల్డు కులాలు | 17.66 | 36 |
| ముస్లిములు | 2.07 | 22 |
| భారతీయ క్రైస్తవులు | 0.37 | 2 |

**11. సింధు**

| | | |
|---|---|---|
| హిందువులు | 23.08 | 40 |
| ముస్లిములు | 71.30 | 40 |
| షెడ్యూల్డు కులాలు | 4.26 | 19 |
| భారతీయ క్రైస్తవులు | 0 29 | 1 |

## అల్ప సంఖ్యాకులపై ప్రభావం

వివిధ అల్ప సంఖ్యాకుల ప్రాతినిధ్యంలోని మార్పులను ఒక పట్టిక రూపంలో ప్రదర్శించటం మంచిది. ఈ మార్పులు 1935 భారత ప్రభుత్వ చట్టంలో నిర్దేశించారు. అలాగే ప్రతిపాదనల్లోనూ చూపించారు

### ముస్లిములపై ప్రభావం

| శాసనసభ | జనాభా నిష్పత్తి | ప్రాతినిధ్య నిష్పత్తి | |
|---|---|---|---|
| | | 1935 భారత ప్రభుత్వ చట్టం ప్రకారం | ప్రతిపాదించిన పథకం క్రింద |
| కేంద్ర | 28.50 | 32.00 | 32 |
| మద్రాసు | 8 00 | 13.49 | 24 |
| బొంబాయి | 10 00 | 17.40 | 28 |
| ఉత్తరప్రదేశ్ (సం రా) | 15 30 | 28 95 | 29 |
| సి పి(నేటి మ ప్ర) | 5.70 | 12.50 | 25 |
| బీహార్ | 15 00 | 26.32 | 28 |
| అస్సాం | 44 60 | 31.48 | 38 |
| ఒరిస్సా | 2.00 | 6 66 | 22 |

### షెడ్యూల్డు కులాలపై ప్రభావం

| | | | |
|---|---|---|---|
| కేంద్ర | 14 30 | 7 60 | 20 |
| మద్రాసు | 16.50 | 13 90 | 30 |
| బొంబాయి | 9 60 | 8 50 | 28 |

| | | | |
|---|---|---|---|
| బెంగాల్ | 12.60 | 12.00 | 25 |
| యు.పి.(సం.రా) | 21.40 | 8.70 | 29 |
| పంజాబ్ | 4.40 | 4.50 | 9 |
| సి.పి.(నేటిమ.ప్ర) | 20.20 | 17.80 | 34 |
| బీహార్ | 13.80 | 9.80 | 28 |
| అస్సాం | 8.70 | 6.50 | 20 |
| ఒరిస్సా | 17.60 | 10.00 | 36 |
| సింధు | 4.20 | లేదు | 19 |

భారతీయ క్రైస్తవులపై ప్రభావం

| | | | |
|---|---|---|---|
| కేంద్ర | 1.16 | 3.00 | 3 |
| మద్రాసు | 4.10 | 4.20 | 5 |
| బొంబాయి | 1.70 | 1.70 | 2 |
| బెంగాల్ | 0.19 | 0.80 | 1 |
| యు.పి (సం.రా) | 0.24 | 0.90 | 1 |
| పంజాబ్ | 1.70 | 1.14 | 2 |
| (సి.పి) | 0.35 | లేదు | 1 |
| బీహార్ | 1.70 | 0.66 | 2 |
| అస్సాం | 0.48 | 0.90 | 2 |
| ఒరిస్సా | 0.37 | 0.16 | 2 |
| సింధు | 0.29 | లేదు | 1 |

సిక్కులపై ప్రభావం

| | | | |
|---|---|---|---|
| కేంద్ర | 1.50 | 2.40 | 4 |
| పంజాబ్ | 13.20 | 18.29 | 21 |

హిందువులపై ప్రభావం

| | | | |
|---|---|---|---|
| బెంగాల్ | 30.00 | 20.00 | 33 |
| పంజాబ్ | 22.10 | 20.00 | 28 |
| సింధు | 23.80 | 31.60 | 40 |

## VII

## ప్రతిపాదనలకు ఆధారమైన సూత్రాలు.

ఈ విభజనకు తోడ్పడిన సూత్రాల గురించి నేను ఇప్పుడు చెప్పవచ్చు. అదేమిటంటే-

(1). మెజారిటీ కులమత వర్గాల పాలన సిద్ధాంతపరంగా సమ్మతం కాదు. అమలు పరంగా సమర్ధనీయం కాదు. ఒక కుల మతవర్గం తన సంఖ్యాబలాన్ని బట్టి ప్రాతినిధ్యంలో మెజారిటీగా కనబరచినా దానినే పూర్తి మెజారిటీగా చెప్పరాదు.*

(2) మెజారిటీ కుల మత వర్గాలు, అతి చిన్న మైనారిటీ వర్గాల తోడ్పాటుతో తమ వర్గపాలనే కొనసాగించే ప్రమాద మున్నందున మెజారిటీ కులమత వర్గానికి శాసనసభలో అదే నిష్పత్తిలో సంఖ్యా బలం ఇవ్వకుండా చూడాలి.

(3). స్థానాల (సీట్ల) కేటాయింపులో మెజారిటీవారు ఒక ప్రధాన మైనారిటీని కలుపుకొని మెజారిటీగా ఏర్పడితే అలాంటి మెజారిటీ పాలన ఇతర మైనారిటీల ప్రయోజనాలను పట్టించుకోదు కాబట్టి ఆ ప్రమాదం రాకుండా చూడాలి.

(4). మెజారిటీ మీద ఆధారపడకుండా మైనారిటీలన్నీ కలిసి తమ స్వంత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగలిగే విధంగా స్థానాల కేటాయింపూ, పంపకమూ ఉండాలి.

(5). మెజారిటీ వర్గం వారి ప్రాతినిధ్యంలోంచి తీసుకున్న అదనపు స్థానాల సంఖ్యను మైనారిటీ వర్గాలకు పంచాలి. ఈ పంపిణీ ఆయా మైనారిటీ వర్గాల సాంఘిక హోదా, ఆర్థిక స్థితిగతులు, విద్యా స్థాయి మొదలైన వాటిని విలోమ నిష్పత్తిలో గమనించి చేయాలి. దీన్ని బట్టి విద్యాపరంగాను, ఆర్థిక పరంగాను, సాంఘిక పరంగాను మంచి స్థితిలో ఉండి సంఖ్యారీత్యా పెద్దదైన మైనారిటీకంటె సాంఘిక-ఆర్థిక- విద్యారంగాల్లో ఇతరులకంటె బాగా వెనుకబడి సంఖ్యరీత్యా చిన్నదైన మైనారిటీకి ఎక్కువ స్థానాలు పంచవలసి వుంటుంది. ఆవిధంగా ప్రాతినిధ్యం సమతూకంగా ఉంటే ఏ కులానికీ సంఖ్యరీత్యా అది పెద్ద దైనందున ఇతరులపై ఆధిపత్యం చెలాయించే అవకాశం ఉండదు. అప్పుడు కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ హిందూ మైనారిటీపై ముస్లిముల అభ్యంతరం, ముస్లిముల మెజారిటీపై హిందూ-సిక్కుల అభ్యంతరాలు తుడిచిపెట్టుకు పోతాయి.

## VIII

## నియోజక వర్గ స్వభావం

నియోజక వర్గాల విషయమై ఈ క్రింది ప్రతిపాదనలు ఆమోదించాలి:-

---

వాయువ్య సరిహద్దు ప్రాంతాలకు ప్రాతినిధ్యం గురించి నేను ఏ పథకాన్ని రూపొందించలేదు అక్కడి మైనారిటీ అతి స్వల్పమైంది సాపేక్ష మెజారిటీ సూత్రం కూడా అందుకు దోహదపడలేదు

(1) ఉద్దేశించిన ఒక ప్రయోజనాన్ని సాధించటానికి. ఉమ్మడి నియోజక వర్గం గానీ, ప్రత్యేక నియోజక వర్గం గానీ ఒక యంత్రాంగ విధానంగా ఉంచాలి. ఇది ఒక సూత్ర బద్ధ అంశం కాదు.

(2). నామ మాత్ర ప్రతినిధులు కాకుండా సిసలైన ప్రతినిధులను శాసన సభకు ఎన్నుకునే సామర్థ్యాన్ని మైనారిటీకి కల్పించటమే ఇందులోని ఉద్దేశం.

(3). ఈ ప్రత్యేక నియోజక వర్గాలు తమ విశ్వాసాన్ని చూరగొన్న ప్రతినిధులను మాత్రమే ఎన్నుకోవడానికి పూర్తిగా ఉపకరిస్తాయనే మాట నిజమైనప్పటికీ మైనారిటీలకు తత్సమానమైన రక్షణ కల్పించ గలిగిన ఉమ్మడి నియోజక వర్గాల పద్ధతి కూడా విస్మరింప రానిది .

(4) మైనారిటీలకు రెండవ ఓటు వేసుకొనే హక్కు ఉండి, కనీస శాతం మైనారిటీ ఓట్లు కావలసివున్న నలుగురు సభ్యులుగల నియోజక వర్గాన్ని ఒక ప్రత్యామ్నాయంగా గుర్తించచ్చు.

## IX

## ప్రస్తావనకు రాని విషయాలు
## ప్రత్యేక రక్షణల గురించి ప్రశ్నలు

**(i) ప్రత్యేక రక్షణల గురించి కొన్ని కొన్ని ప్రత్యేక మైనారిటీలు ఆశించే మరికొన్ని డిమాండ్లు ఉన్నాయి. అవి :–**

(1). మైనారిటీల పరిస్థితిని నివేదించేందుకు ఒక చట్టబద్ధమైన అధికారి అవసరం.

(2). ప్రభుత్వ సహాయం గురించిన శాసనం ఉండాలి.

(3). భూమి బందోబస్తుకు ఒక శాసనం ఏర్పాటు ఉండాలి. కానీ ఇవి కుల స్వభావాన్ని బట్టి కాదు. వాటి గురించి నేనిక్కడ సవివరంగా చెప్పబోవటం లేదు.

**(ii) ఆదివాసులు**

సిక్కులు, ఆంగ్లో ఇండియన్లు, భారతీయ క్రైస్తవులు, పార్శీల కంటె ఆదివాసులు సంఖ్యారీత్యా ఎక్కువగా ఉన్నప్పటికీ నా ప్రతిపాదనల్లో వారిని చేర్చలేదన్న విషయం స్పష్టమే. నా పథకంలో వారిని ఎందుకు మినహాయించానో కారణాలు చెప్పాలి. ఇంతవరకూ ఆదివాసులకు రాజకీయ పరిజ్ఞానం ఏర్పడనందువల్ల తమ రాజకీయ అవకాశాలను సరిగ్గా వినియోగించుకో లేనందున వారు సులభంగానే ఒక మెజారిటీ లేదా ఒక మైనారిటీ చేతుల్లో కీలు బొమ్మలుగా మారవచ్చు. అందువల్ల వారికి ఎటువంటి మేలు జరుగక పోగా ఫలితంలో సమతూకం

దెబ్బతింటుంది. ప్రస్తుత పరిస్థితుల్లో ఈ వెనుకబడిన జాతుల అభివృద్ధి కోసం దక్షిణాఫ్రికా రాజ్యాంగంలో వలె "మినహాయించిన ప్రాంతాల" పరిపాలన నిర్వహణ కోసం ఒక చట్టబద్ధమైన సంఘాన్ని స్థాపించాల్సి వుంటుందని భావిస్తున్నాను. ఈ మినహాయించబడిన ప్రాంతాలున్న ప్రతి రాష్ట్రం ఆ ప్రాంతాల నిర్వహణకోసం ప్రతి సంవత్సరం తప్పని సరిగా నిర్ణీత ద్రవ్యాన్ని కేటాయించాలి.

## (iii) భారత సంస్థానాలు

నా ప్రతిపాదనల్లో భారత సంస్థానాలను చేర్చలేదన్న విషయం కూడా గమనించే ఉంటారు. నియమ నిబంధనలు ఇలానే ఉంటే భారత సంస్థానాల విలీనం పట్ల నా కెలాంటి అభ్యంతరం ఉండదు.

(1). బ్రిటిష్ ఇండియా భారత సంస్థానాల మధ్య సార్వభౌమత్వానికి సంబంధించిన ద్వైవిధ్యం పూర్తిగా తొలగిపోవాలి

(2). భారత సంస్థానాల నుంచి బ్రిటిష్ ఇండియాను వేరుపరచే న్యాయపరమైన, రాజకీయ పరమైన పరిధులు సమసిపోవాలి. బ్రిటిష్ ఇండియా, భారత సంస్థానాలు అనేటువంటి ప్రత్యేక నామకరణాలు ఉండకూడదు. వాటి స్థానంలో 'భారత'అనే ఏకైక నామధేయం ఉండాలి.

(3). భారతదేశం ఒక అధినివేశ రాజ్య సర్వ సంపూర్ణ అధికారాలు గల ఒక డొమినియన్ ప్రతిపత్తిగల రాజ్యంగా నిలవడానికి విలీనానికి సంబంధించిన నిబంధనలూ, షరతులూ అడ్డు రాకూడదు ఈ లక్ష్య సాధనను దృష్టిలో ఉంచుకొని బ్రిటిష్ ఇండియా భారత సంస్థానాల విలీనం గురించి నేనొక పథకం తయారు చేశాను. ఆ పథకం గురించిన వివరాలతో ఈ ప్రసంగాన్ని మరింత పొడిగించదలచుకోలేదు. సంస్థానాల విలీన సమస్య వల్ల తన ప్రగతిని ఆపకుండా ప్రస్తుతానికి బ్రిటిష్ ఇండియా తన లక్ష్యం వైపు పురోగమించటం మంచిది.

## X

## నా ప్రతిపాదనల సహాయంతో పాకిస్తాన్ గురించి

నా ప్రతిపాదనలన్నీ సమైక్య భారతదేశం కొరకే. ముస్లిములకు పాకిస్తాన్ ఇవ్వగలిగిన భద్రత కంటె నా ప్రతిపాదనలే వారికి ఎక్కువ భద్రత కల్పించగలవి కాబట్టి ఇవే వారికి అంగీకార మవుతాయనే ఆశతో వీటిని ప్రతిపాదిస్తున్నాను. నేను పాకిస్తాన్‌కు వ్యతిరేకిని కాదు. స్వయం నిర్ణాయక సూత్రం మీద అది ఏర్పడిందని నేను అనుకుంటున్నాను. ఇంతకాలం చెల్లిన తర్వాత తిరగదోడే ప్రసక్తి లేదు. అయితే ఈ స్వయం నిర్ణాయక సూత్రంవల్ల ఒనగూడే ప్రయోజనాలను ముస్లిం ప్రాంతాల్లో నివసించే ముస్లిమేతరులకు ఆ సూత్ర ఫలాన్ని

ముస్లిములకు ఇచ్చేందుకు నేను సిద్ధంగా ఉన్నాను. అయితే భద్రత గురించిన మరొక ఉత్తమ పథకం గురించి ముస్లింలకు తెలియ చేయాలనుకుంటున్నాను పాకిస్తాన్ పథకం కంటె నా పథకమే ఉత్తమ మైనదని చెప్పగలను ఆ అంశాలు కొన్ని:

(I) పాకిస్తాన్‌కు ఆధారమైన మత పరమైన మెజారిటీ ప్రమాదాన్ని నా ప్రతిపాదనల్లో తొలగించడమైనది

(II) నా ప్రతిపాదనల్లో ముస్లిములు ప్రస్తుతం పొందుతున్న అదనపు లబ్ధికి విఘాతం లేదు

(III) పాకిస్తానేతర రాష్ట్రాలలో ముస్లిముల స్థితి తమ ప్రాతినిధ్య దామాషా ద్వారా మరింత బలపడుతుంది. అలా కాకుండా పాకిస్తాన్ ఏర్పడితే పాకిస్తానేతర రాష్ట్రాలలో ముస్లిములు ఇప్పటికన్న మరింత నిస్సహాయ స్థితికి గురికావచ్చు.

## XI

## హిందువుల కొక మాట

మెజారిటీ అనే నియమం ఉల్లంఘించరానిదనీ, అన్ని సందర్భాల్లోనూ దాని పవిత్రతను పాటించాలనీ హిందువులు పట్టు పట్టటం వల్లనే మతపరమైన ప్రధాన సమస్య ఉత్పన్న మవుతున్నది. వ్యక్తుల నడుమా, దేశాల మధ్యా ఏవైనా ప్రధానమైన వివాదాలు ఏర్పడినపుడు, వాటిని పరిష్కరించడానికి ఏకాభిప్రాయ సాధన అనే మరొక న్యాయం కూడా వుందనే వాస్తవాన్ని హిందువులు గమనించినట్లు లేదు పరిస్థితులను గనక సాకల్యంగా పరిశీలించినట్లయితే అలాంటి న్యాయం ఒకటి ఉన్నదని, అది కల్పితం కాదని హిందువు గ్రహిస్తాడు. జ్యూరీ విధానం చూడండి జ్యూరీ విచారణలో ప్రధాన సూత్రం ఏకాభిప్రాయమే. జ్యూరీలో తుది నిర్ణయం ఏకాభిప్రాయ న్యాయ సమ్మతంగా ఉన్నప్పుడే జడ్జి ఆ నిర్ణయానికి కట్టుబడి ఉంటాడు. నానా జాతి సమితిని మరో దృష్టాంతంగా తీసుకోండి. నానా జాతి సమితిలోని నిర్ణయాలకు ఏ న్యాయ సూత్రం పాటించారు? ఏకాభిప్రాయ న్యాయ సూత్రమే. శాసన సభలోను, కార్యనిర్వాహక వర్గంలోను ఏకాభిప్రాయ న్యాయసూత్రాన్ని హిందువులు పాటించినట్లయితే భారతదేశంలో ఈ విధమైన మత సమస్యే ఉద్భవించదనేది స్పష్ట మవుతున్నది.

మైనారిటీలకు రాజ్యాంగపరమైన రక్షణలనే అంగీకరించటానికి సిద్ధపడని హిందువు ఏకాభిప్రాయ సూత్రాన్ని అంగీకరించటానికైనా సిద్ధమవుతాడా అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. దురదృష్టవశాత్తు అతడేదీ అంగీకరించటానికి సిద్ధంగా లేడు

మెజారిటీ పాలన విషయంలో ఏ రకమైన పరిమితులనూ ఒప్పుకోవడానికీ హిందువు సిద్ధపడడు. అతడు కోరేది సంపూర్ణ మెజారిటీయే. సాపేక్ష మెజారిటీతో అతడు సంతృప్తి

చెందదు. సంపూర్ణ మెజారిటీ గురించిన తన పట్టుదల సరియైన ప్రతిపాదనేనా? రాజకీయ తత్వవేత్తలు దాన్ని ఆమోదిస్తారా? అనే విషయాన్ని అతడు పరిశీలించుకోవాలి. ఇప్పుడు హిందువు పట్టుదలగా చూపే సంపూర్ణ మెజారిటీ పాలన సూత్రాన్ని అమెరికా రాజ్యాంగం సైతం బలపరచలేదన్న సంగతి అతనికి తెలియదు.

అమెరికా రాజ్యాంగం నుంచి ఒక అంశాన్ని ఉదహరిస్తాను ప్రాథమిక హక్కులను రూపొందించిన క్లాజు తీసుకుందాం ఆ క్లాజు ఉద్దేశం ఏమిటి? ప్రాథమిక హక్కుల్లో చేర్చబడిన అంశాలు అత్యంత ప్రాధాన్యత గలవి కేవలం మెజారిటీ పాలన ఆ విషయాల్లో జోక్యం చేసుకోజాలదు గనుకనే ఆ క్లాజు అవసరమైంది అమెరికా రాజ్యాంగం నుంచి మరో ఉదాహరణ తీసుకుందాం. నాలుగింట మూడు వంతుల మెజారిటీ ప్రతిపాదించకుండా రాష్ట్రాలు నిశ్చయించకుండా రాజ్యాంగంలోని ఏ భాగాన్నీ మార్చకూడదని ఆ రాజ్యాంగం చెప్తున్నది. దీనివల్ల తెలుస్తున్న దేమిటి? కేవలం మెజారిటీ పాలనకు కొన్ని ప్రయోజనాలు సాధించే సమర్థత ఉండదని అమెరికా రాజ్యాంగం గుర్తించినట్లు తెలుస్తున్నది

ఈ సంగతులన్నీ హిందువుల్లో చాలా మందికి తెలుసు. అయినా వాటి నుంచి అతను తెలుసుకోవలసింది తెలుసుకోకపోవటం విచారకరం. అలా తెలుసుకుంటే మెజారిటీ పాలన సూత్రం తాను భావించేటంత పవిత్రమైనది కాదని గ్రహిస్తాడు మెజారిటీ పాలన ఒక సూత్రంగా ఆమోదాన్ని పొందలేదు. కానీ అదొక పాటింపుగా చెల్లుబాటయింది ఎందుకు చెల్లుబాటయిందో కూడా చెప్తాను. రెండు కారణాలవల్ల దీనిని సహించారు. (1). ఎందుకంటే మెజారిటీ అంటే ఎప్పటికీ రాజకీయ మెజారిటీ అనుకున్నారు కాబట్టి, (2) ఒక రాజకీయ మెజారిటీ నిర్ణయం, 'మైనారిటీ' అభిప్రాయాన్ని అంగీకరించి విలీనం చేసుకున్నది కాబట్టి ఆ నిర్ణయాన్ని వ్యతిరేకించాలని మైనారిటీ ఎప్పుడూ అనుకోలేదు

భారతదేశంలో మెజారిటీ అనేది రాజకీయ మెజారిటీ కాదు. భారతదేశంలో మెజారిటీ పుట్టుకతో వచ్చినట్టిది, రూపొందించినట్టిది కాదు కులమత పరమైన మెజారిటీకి, రాజకీయ మెజారిటీకి మధ్య ఉన్న వ్యత్యాసం ఇదే రాజకీయ మెజారిటీ స్థిరమైన లేదా శాశ్వతమైన మెజారిటీ కాదు. ఈ మెజారిటీ ఎప్పుడు కూడా తయారు చేయబడుతుంది, పోతుంది తిరిగి తయారు చేయబడతుంది కులమత పరమైన మెజారిటీ తన ప్రవర్తనలో స్థిరంగా ఉండి శాశ్వతమైనదిగా ఉంటుంది దీనిని ఎవరైనా నాశనం చేయగలరు కాని మార్చలేరు. రాజకీయ మెజారిటీకే ఇంత వ్యతిరేకత ఉన్నపుడు కుల మత పరమైన మెజారిటీకి ఉండే వ్యతిరేకత ఇంకా ఎంత తీవ్రంగా ఉండాలి?

1930లో జిన్నా 14 సూత్రాలను ప్రతిపాదించినపుడు, ఆ పధ్నాలుగు సూత్రాలలో ఒక సూత్రం ఎంతవరకు పోయిందంటే ఎక్కువ సీట్లు కేటాయించవలసి వచ్చినపుడు

మెజారిటీ అనేది మైనారిటీ కాకుండాను, సమానమయ్యేటట్టుగా ఉండకుండాను చూసుకోవాలనేంతవరకూ ఆయన ఎందుకు ప్రతిపాదించాడో హిందువులు అడగటానికి వీలున్నది. ముస్లిములు ఎక్కువగా ఉన్న రాష్ట్రాలలో ముస్లిము మెజారిటీ ఉండాలని జిన్నా వాంఛిస్తున్నపుడు, కేంద్రంలో హిందువుల మెజారిటీని ఆయన ఎందుకు వ్యతిరేకిస్తున్నాడో హిందువులు అతనిని అడగాలి. ఈ ప్రశ్నలవల్ల జిన్నా ఊగిసలాడుతున్నాడనే సంగతిని హిందువులు గ్రహిస్తారు. మెజారిటీ పాలన సూత్రాన్ని అంగీకరిస్తున్నాడనేది మాత్రం స్పష్టం కావటం లేదు.

రాజకీయాలలో మెజారిటీ పాలన సూత్రాన్ని వదిలి వేయటం వల్ల హిందువులకు ఇతర జీవన రంగాల్లో దెబ్బ ఏమీ ఉండదు. సాంఘిక జీవితంలో అంశంగా వారు ఎప్పుడూ మెజారిటీలోనే ఉంటారు. వారు అనుభవిస్తున్న వ్యాపార వాణిజ్య రంగాలలో ఎప్పటికీ వారికి గుత్తాధిపత్యం ఉంటుంది. వారి కుండే ఆస్తులపై గుత్తాధిపత్యం వారికి ఎప్పుడూ ఉంటుంది. ఏకాభిప్రాయ సూత్రాన్ని హిందువులు అంగీకరించాలనేది నా ప్రతిపాదన కాదు. సాపేక్ష మెజారిటీతో సంతృప్తి పడటమనే వారిని నేను అడుగుతున్నాను దీనిని అంగీకరించటం వారికి చాలా ఎక్కువ అవుతుందా?

అటువంటి త్యాగం ఏమీ చెయ్యకుండా, భారతదేశ స్వాతంత్ర్యాన్ని అల్ప సంఖ్యాక వర్గాలు అడ్డుకుంటున్నారని హిందువులు బయటి ప్రపంచానికి చెప్పుకోవటం న్యాయ సమ్మతం కాదు. ఈ అబద్ధపు ప్రచారం లాభించదు. ఎందుకంటే అల్ప సంఖ్యాకులు అటువంటి పని ఏమీ చేయటంలేదు. సంతృప్తి కరమైన రక్షణలు గనక కల్పించినట్లయితే, స్వాతంత్ర్యాన్ని, దాని వల్ల వచ్చే ప్రమాదాలను కూడా అంగీకరించటానికి వారు సిద్ధంగా ఉన్నారు. అల్ప సంఖ్యాక వర్గాలు చూపే ఈ చేష్టకు హిందువులు కృతజ్ఞత చూపవలసిన అవసరం లేదు. ఐర్లండులో ఏమి జరిగిందో దీనితో పోల్చి చెప్పవచ్చు. ఐరిష్ నేషనాలిటీల నాయకుడైన రెడ్మండ్ ఒకసారి ఉల్స్టర్‌తో ఇలా అన్నాడు : "సంయుక్త ఐర్లండ్‌కు అంగీకరించండి. ఏ రక్షణ అయినా అడగండి. దానిని మీకు ఇవ్వటం జరుగుతుంది" అని. దానికి - ఆయన ఏమన్నాడంటే "నీ రక్షణలు కాలబెట్టుకో, మీ పరిపాలన కింద మేము ఉండదలుచుకోలేదు." భారత దేశంలో అల్ప సంఖ్యాకులు ఈ మాట అనలేదు. రక్షణలతో తృప్తి పడటానికి వారు సిద్ధపడ్డారు. చేతులెత్తి దణ్ణం పెట్టవలసిన విషయం కాదా ఇది? అవునని నేను ఖచ్చితంగా అంటాను.

## XII

## ముగింపు

మత పరమైన సమస్య పరిష్కారం కోసం నా మనసులో ఉన్న ప్రతిపాదనలలో

ఇవి కొన్ని. అఖిల భారత షెడ్యూల్డు కులాల సమాఖ్య వీటికి కట్టుబడి ఉండాలని లేదు. నన్ను కూడా అవి కట్టి ఉంచవు. వాటిని ముందు ఉంచటంలో, ఒక కొత్త మార్గాన్ని అన్వేషించటానికి చేస్తున్న ప్రయత్నమే తప్ప మరేమీ కాదు. నేను వివరించిన సూత్రం మీదనే నేను వక్కాణిస్తున్నాను గాని వాస్తవమైన ప్రతిపాదనల మీద కాదు. సూత్రాలను అంగీకరించిన మీదట, కుల మత సమస్యకు పరిష్కారం అంతకుముందు భయపెట్టినంతగా ఉండదని నాకు ఖచ్చితంగా తెలుసు.

భారతీయ ప్రతిష్ఠంభన తొలగించటం సులువైన విషయం ఏమీ కాదు. 1867 సమాఖ్యకు ముందు జర్మనీ పరిస్థితిని వర్ణిస్తూ "దైవ సంకల్పం వలన ఏర్పడిన గందరగోళం" అని ఒక చరిత్ర కారుడు చెప్పిన మాటలు నాకు గుర్తుకు వస్తున్నాయి. జర్మనీ విషయంలో అది నిజమో కాదోగాని, ప్రస్తుత భారత దేశ పరిస్థితికి మాత్రం చాల సరైన వర్ణన అని మాత్రం నాకు అనిపిస్తున్నది. ఈ గందరగోళం నుంచి జర్మనీ బయటపడింది. ఒక్క దెబ్బతో కాకపోయిన దశలవారీగా అంటే యుద్ధానికి సరిగ్గా ముందు, ఒకే భావ ఐక్యతతో, సమైక్య దృక్పథంతో, ఒక ఐక్యవిధిలో నమ్మకంతో ఏకజాతిగా అయింది. ఈ గందరగోళం నుంచి బయటపడి ఒక పద్ధతిలోకి ఇంకా భారతదేశం రాలేకపోయింది. అలా రావటానికి దానికి అవకాశాలు లేక కాదు. నిజానికి ఎన్నో అవకాశాలు వచ్చాయి. భారతదేశానికి ఒక రాజ్యాంగాన్ని రూపొందించుకోమని 1927లో లార్డ్ బిర్కెన్‌హెడ్ ఒక సవాలు విసిరినపుడు మొదటి అవకాశం వచ్చింది ఆ సవాలును స్వీకరించటం జరిగింది. రాజ్యాంగాన్ని రూపొందించటానికి ఒక సంఘాన్ని నియమించారు: ఒక రాజ్యాంగాన్ని రూపొందించటం జరిగింది. దానిని నెహ్రూ రాజ్యాంగం అన్నారు. అయితే దానిని భారతీయులు ఎవరూ అంగీకరించలేదు. ఏ మాత్రమూ బాధ లేకుండా దానిని సమాధి చేశారు రెండో అవకాశం 1930లో భారతీయులు రౌండ్ టేబుల్ సమావేశంలో హాజరైనపుడు దొరికింది. అక్కడ కూడా భారతీయులు తమ పాత్రను నిర్వర్తించలేక పోయారు. తమకొక రాజ్యాంగాన్ని రూపొందించుకోలేక పోయారు. ఇటీవల సప్రూ కమిటీ సూచించినది. మూడో ప్రయత్నం. ఈ కమిటీ ప్రతిపాదన కూడా కుప్ప కూలిపోయింది.

మరో ప్రయత్నం చేయాలనే ఉత్సాహంగాని, ఆశ గాని లేకుండా పోయింది. ఏదో విధివ్రాత అని ప్రతి ప్రయత్నమూ విఫలమవుతుందని, దేనినీ చేపట్టవలసిన అవసరం లేదనే భావనలో పడిపోయారు ఇదే సమయంలో, భారతీయుడెవరూ అంత కుంగిపోవలసిన అవసరం లేదని. ఏదో కుక్క చచ్చిపోయినట్టుగా ఈ ప్రతిష్ఠంభన కుళ్ళిపోతూ ఉంటే చూస్తూ ఉన్నట్టుగా ఈ దేశంలో జరుగుతున్న రాజకీయ కీచులాటను చూస్తూ ఉండిపోవటం తప్ప నేనేమీ చేయలేనంటూ బండబారి పోవలసిన అవసరం లేదని నాకు అనిపిస్తుంది. భూతకాలంనాటి అపజయాలు ఎవర్నీ భయ పెట్టవు. అవి నన్ను భయపెట్టవు నాకు ఏమనిపిస్తుందంటే, కుల

మత సమస్య విషయంలో ఒక అంగీకారానికి రావటంలో ప్రయత్నాలన్నీ విఫలమయినా యనేది నిజమే అయినప్పటికీ, ఆ అపజయం అసలు భారతీయులలోనే స్వాభావికమైన లోపం ఏదో ఉండి ఉండటం వల్ల కాదు. వారు అనుసరిస్తున్న తప్పు మార్గం వల్లనే అని. నా ప్రతిపాదనలను నిష్పక్షపాతంగా పరిగణించి ఉంటే, అవి తప్పక ఆమోదయోగ్య మవుతాయని నాకు నమ్మకం ఉన్నది. అవి ఒక కొత్త మార్గాన్ని అమరుస్తాయి. వాటిని నా దేశ వాసులకు అందిస్తున్నాను.

ముగించే ముందు, నా విమర్శకులకు ఒక హెచ్చరిక ఇస్తున్నాను. కొన్ని అంశాలలో నా ప్రతిపాదనలకు వారు సవరణలు ఏమైనా చేయవచ్చునేమో కాని వాటిని తిరస్కరించటం మాత్రం వారికి సులువు ఏమీ కాదు. వాటిని వారు తిరస్కరించాలనుకుంటే మాత్రం, అవి ఆధారపడిన సూత్రాలను ముందు వారు ఖండించవలసి ఉంటుంది.

అనువాదం :

బొజ్జా తారకం

మొక్కపాటి సుమతి

# 10

# రాష్ట్రాలు – అల్పసంఖ్యాక వర్గాలు

## వారి హక్కులు ఏమిటి?

## స్వతంత్ర భారతదేశంలో వాటిని

## సాధించుకొనేదెలా?

అఖిల భారత షెడ్యూల్డు కులాల సమాఖ్య తరపున
షెడ్యూల్డు కులాల రక్షణలపై రాజ్యాంగ రచనా సభకు
సమర్పించిన నివేదిక

# రాష్ట్రాలు – అల్ప సంఖ్యాక వర్గాలు

## ముందుమాట

భారతదేశానికి భవిష్యత్తు రాజ్యాంగాన్ని రూపొందించే పనిని త్వరలో ఒక రాజ్యాంగ రచనా సభకు సమర్పించనున్నారని నిర్ధారణ అయిన తర్వాత, అఖిల భారత షెడ్యూల్డు కులాల సమాఖ్య కార్యనిర్వాహక వర్గం, సమాఖ్యతరఫున షెడ్యూల్డు కులాల రక్షణలపై ఒక నివేదికను రాజ్యాంగ రచనా సభకు సమర్పించటానికి తయారు చేయమని నన్ను కోరింది. ఈ పనిని ఎంతో సంతోషంతో చేపట్టాను. నా శ్రమ ఫలితాలు ఈ సంపుటిలో కనిపిస్తాయి.

ఈ నివేదిక ప్రాథమిక హక్కుల్ని, అల్ప సంఖ్యాకుల హక్కుల్ని, షెడ్యూల్డు కులాల వారికి రక్షణలను నిర్వచిస్తుంది. షెడ్యూల్డు కులాల వారు అల్ప సంఖ్యాకవర్గం కాదని అభిప్రాయపడేవారు, నేను నిర్ణీత హద్దులను దాటి పోయానని అనవచ్చు. షెడ్యూల్డు కులాలవారు అల్ప సంఖ్యాకులు కాదనే అభిప్రాయం గొప్ప శక్తివంతమైన హిందూ అధిక సంఖ్యాకులు షెడ్యూల్డు కులాలవారిని తమకు విధేయులుగా ఉండమని ఆదేశించిన ఒక ఏర్పాటు. అధిక సంఖ్యాకుల వ్యక్తి దాని పరిధి ఏమిటో అర్థం ఏమిటో నిర్వచించే జాగ్రత్త పడలేదు. స్వచ్ఛమైన, స్వతంత్రమైన మనస్సు ఉన్నవారు దీనిని ఒక సాధారణ ప్రతిపాదనగా పరిశీలిస్తే ద్వంద్వ వాఖ్యానాలు చెయ్యటానికి ఇది సమర్థవంతమైనదని అనిపిస్తుంది. షెడ్యూల్డు కులాలు, అల్ప సంఖ్యాకుల కంటే ఎక్కువవారని పౌరులకు అల్ప సంఖ్యాకులకు ఇచ్చే ఏ రక్షణ అయినా షెడ్యూల్డు కులాలకు సరిపోదనే దీని అర్థమని నేను వ్యాఖ్యానిస్తాను. మరో మాటల్లో చెప్పాలంటే, వారి సాంఘిక, ఆర్థిక విద్యా విషయక పరిస్థితి పౌరుల స్థితి కన్న అల్ప సంఖ్యాకుల స్థితికన్నా అధ్వాన్నంగా ఉందని, రక్షణకు అదనంగా పౌరులు అధిక సంఖ్యాకుల నియంతృత్వానికి వివక్షతనుంచి రక్షణలు కావాలని దీని అర్థం. మరో వ్యాఖ్యానం ఏమంటే

షెడ్యూల్డు కులాలకు అల్ప సంఖ్యాకులకు భేదం ఉన్నదని అందువల్ల అల్ప సంఖ్యాకులు కోర్తే రక్షణ వీరికి లభ్యం కాదనేది. ఎంత మరీ అర్థ రహితంగా ఈ వ్యాఖ్యానం ఉన్నదంటే, వివేకవంతుడెవడూ దీనిని ఏ మాత్రమూ లక్ష్య పెట్టనవసరం లేదు. షెడ్యూల్డు కులాలవారు దీనిని పట్టించుకో లేదంటే తప్పుపట్టనవసరం లేదు. షెడ్యూల్డు కులాల వారు అల్ప సంఖ్యాకులు కాదనే అర్థంలో నేను చేసిన వ్యాఖ్యానంతో అంగీకరించేవారు, పౌరులకుండే ప్రాథమిక హక్కులన్నీ అల్ప సంఖ్యాకుల రక్షణలకోసం ఉన్న సదుపాయాలు, వీటికి అదనంగా ప్రత్యేక రక్షణలు, షెడ్యూల్డు కులాలవారికి కావాలని నేను కోరటంలో ఎంతో సమంజసత్వం ఉందని నాతో అంగీకరిస్తారు.

రాజ్యాంగ రచనా సభకు ఈ నివేదికను సమర్పించాలని ఉద్దేశించాం. దీనిని ప్రజలకు తెలియజేయాలనే ఉద్దేశం నాకు లేదు. టైపు చేసిన ప్రతిని చూడటానికి అవకాశం దొరికిన నా సవర్ణ హిందూ మిత్రులు దీనికి ఎక్కువ ప్రచారం కావాలని నన్ను బలవంతం చేశారు. రాజ్యాంగ రచనా సభ్యులకు ఉద్దేశించినదే అయినా సాధారణ ప్రజలకు దీనిని అందించటంలో అమర్యాదకరమైన విషయం ఏదీ లేదు. అందువలన వారి కోరికతో ఏకీభవించాను.

సాధారణ పదాలలో నా అభిప్రాయాలను కూర్చే బదులు, రాజ్యాంగంలోని నిబంధనల మాదిరిగా ఈ నివేదికను రూపొందించాను. ఉద్దేశం తెలియాలన్నా, స్పష్టత కావాలన్నా ఈ పద్ధతే ప్రయోజనకరంగా ఉంటుందని కచ్చితంగా అనుకుంటున్నాను. షెడ్యూల్డు కులాల సమాఖ్య కార్యనిర్వాహక వర్గం వారి ప్రయోజనంకోసం, కొంత విపులీకరణను, గణాంక వివరాలను అంద జేశాను. ఈ విపులీకరణ గణాంక వివరాలు సాధారణ పాఠకుడికి కూడా ఉపయోగకరంగా ఉంటాయి. కాబట్టి, వాటిని విడిచిపెట్టి వేయకుండా ఈ నివేదికతోపాటు ముద్రిస్తే మంచిదని భావించాను.

రాజ్యాంగ రచనా సభ ఎదుర్కొనే అనేక సమస్యలలో అత్యంత జటిలమైనవి రెండు మాత్రం ఉన్నాయి. అందులో ఒకటి అల్ప సంఖ్యాకులకు సంబంధించినది, మరొకటి భారతదేశ రాష్ట్రాలకు సంబంధించినది. భారతదేశ రాష్ట్రాల గురించి నేను అధ్యయనం చేశాను. ఆ విషయం పైన నాకు చాల స్పష్టమైన, నిర్దిష్టమైన అభిప్రాయాలు ఉన్నాయి. రాజ్యాంగ రచనా సభ నన్ను రాష్ట్రాలకు సంబంధించిన సంఘానికి ఎంపిక చేస్తుందనే ఆశ నాకున్నది. ఈ పనికి చాల ఎక్కువ సామర్థ్యంగల వ్యక్తులనే సంపాదించగలిగిందనేది స్పష్టమవుతున్నది. ఆ గుడారం వెలుపల ఉన్న వ్యక్తి నవటం వల్ల నన్ను వారు అంగీకరించ లేరు. నన్ను బయట పెట్టివేసినందుకు నాకు ఏమీ బాధలేదు. నేను బాధపడిందల్లా ఏమంటే ఉపసంఘం వారి పరిశీలనార్థం నా అభిప్రాయాలను ముందుంచటానికి ఎదురుచూస్తూ ఉన్న అవకాశం లేకుండా

పోయిందనే. అందువల్ల ఇంకో మంచి పని ఏది చేయ్యవచ్చా అని చూశాను. పౌరుల, అల్ప సంఖ్యాకుల, షెడ్యూల్డు కులాల వారి హక్కులతో పాటు వీటిని కూడా ఎక్కువ మంది తెలుసుకుంటారని వాటికి ఉన్న విలువ బేరీజు వేసుకుంటారని తగిన విధంగా వాటిని ఉపయోగించుకుంటారని ఈ చిన్న పుస్తకంలో పొందుపరిచాను.

బి.ఆర్. అంబేడ్కర్

రాజగృహ

దాదర్, బొంబాయి

15-3-1947

# భారత సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగం

## ప్రతిపాదించిన ప్రవేశిక

రాష్ట్రాలుగా కేంద్ర పాలిత ప్రాంతాలుగా పిలవబడుతున్న పరిపాలనా భాగాలలో పంపకమై ఉన్న బ్రిటిషు భారత దేశానికి (వివరణకు 405వ పేజీ చూడండి) చెందిన మనం ఈ ప్రాంతాలను ఒక సమగ్రమైన కేంద్రంగా రూపొందించటానికే –

రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాలు (ఇప్పటి నుంచి రాష్ట్రాలుగా వ్యవహారంలోకి వస్తాయి) భారత రాష్ట్రాలు కలిసి శాసన, కార్యనిర్వాహక, పరిపాలనా వసరాలకోసం భారత సంయుక్త రాష్ట్రాలు అనే పేరు మీద ఒక రాజకీయ రూపాన్ని తీసుకోవటానికి ఆదేశించు కుంటున్నాము. ఆవిధంగా ఏర్పాటయిన కేంద్రం విడి పోవటానికి వీలు లేనట్టిది

ఈ దిగువ ఉద్దేశాలతో ఇది ఏర్పడుతున్నది

(i) భారత సంయుక్త రాష్ట్రాలు అంతటా మనకు మన భావితరాల వారికి స్వపరిపాలన, సుపరిపాలనా సౌలభ్యాలను అందించటం;

(ii) జీవించటానికి, స్వేచ్ఛకు, ఆనందాన్ని అందుకోవటానికి, భావస్వాతంత్ర్యానికి, స్వేచ్ఛగా మతాన్ని అవలంభించుకొనే హక్కును ప్రతిపౌరునికీ కలుగ చేయటం;

(iii) నిరుపేద వర్గాలకు చక్కటి అవకాశాలు కల్పించటం ద్వారా సాంఘిక రాజకీయ ఆర్థిక అసమానతలు తొలగించటం;

(iv) ఆకలి లేకుండా, భయం లేకుండా ప్రతిపౌరునికీ స్వేచ్ఛను అనుభవించటం సాధ్యం చేయటం;

(v) అంతర్గత విభేదాలకు, విదేశీ దండయాత్రలకు రక్షణ కల్పించటం.

అనే ఉద్దేశాలతో భారత సంయుక్త రాష్ట్రాలకు ఈ రాజ్యాంగాన్ని సమకూర్చు కుంటున్నాము.

## సూచించిన నిబంధన – 1

నిబంధన – I భాగం – I – భారత రాష్ట్రాలు కేంద్రంలోకి చేర్పు

అంశం. 1. అర్హతగల భారత రాష్ట్రాలు, కేంద్రంలోకి వాటి చేర్పు

అంశం 2. కేంద్రంలోకి చేరని భారత రాష్ట్రాలకు, అర్హతలేని భారత రాష్ట్రాలకు భారత సంయుక్త రాష్ట్రాలతో సంబంధం.

అంశం 3. అర్హత లేని భారత రాష్ట్రాలలోని భూభాగాన్ని భారత సంయుక్త రాష్ట్రాలలోకి ప్రవేశానికి అర్హత కలుగచేసే ఉద్దేశంతో తగిన పరిపాలనా భాగంగా చేయటానికి భారత సంయుక్త రాష్ట్రాలకు అధికారం.

అంశం 4. యూనియన్ లో కొత్త రాష్ట్రాల స్థాపన.

నిబంధన – I భాగం – II - భారత సంయుక్త రాష్ట్రాలు కొత్త భూభాగం.

అంశం 1. విదేశీ రాష్ట్రాలను కేంద్రంలోకి చేర్చుకోవటం.

అంశం 2. భారత సంయుక్త రాష్ట్రాలు కొత్త భూభాగాన్ని సంపాదించటం, కేంద్రంలో చేర్చని భాగంగా దానిని ఉంచుకోవటం.

## నిబంధన – I భాగం – I

## కేంద్రంలోకి సంస్థానాల చేర్పు

వివరణకు 405వ పుట చూడండి

**1వ అంశం :** భారత సంయుక్త రాష్ట్రాలు దరఖాస్తుపైన, సంవిధాన రూపాన్ని చూపిస్తున్న కేంద్ర శాసనసభ చేసిన అధికారిక చట్టంలో విధించిన షరతులను కలిగి ఉన్నపుడు సంస్థానాలను కేంద్రంలోకి చేర్చుకుంటాయి. అయితే ప్రవేశాన్ని కోరుతున్న సంస్థానాల అర్హత గల రాష్ట్రమై ఉండాలి.

ఈ అంశంలోని అవసరాలకోసం అర్హతగల సంస్థానాల జాబితాను తయారు చేయాలి. ఒక రాష్ట్రం కేంద్ర శాసనసభ విధించిన నిర్ణీత పరిమాణంలో ఉండి తన ప్రజలు గౌరవ ప్రదమైన స్థాయిలో జీవించటానికి సరిపోయేటటువంటి సహజ వనరులు కలిగి ఉండి, జనాభా ఆర్థిక వనరులు కలిగి ఉండటం వల్ల విదేశీ దురాక్రమణను తట్టుకొన గలిగి, అంతర్గత విభేదాలను ఆపి శాంతి భద్రతలను నెలకొల్ప గలిగే ఒక ఆధునిక రాష్ట్రం నుంచి ఆశించే కనీస స్థాయిలో ఆ ప్రజలకు పరిపాలనా సంక్షేమాన్ని అందించగలిగేది ఉంటేనే తప్ప అది అర్హతగలిగిన రాష్ట్రంగా భావించటానికి వీల్లేదు.

**2 వ అంశం :** అర్హతగలిగి కేంద్రంలోకి ప్రవేశం పొందని సంస్థానాల భూభాగం, అర్హత లేని సంస్థానాల భూభాగాన్ని భారత సంయుక్త రాష్ట్రాలలో ప్రవేశం పొందిన భూభాగంగా వ్యవహరింప బడుతుంది. అన్ని సమయాలలోను దానితో కలిగిన భాగంగానే ఉంటుంది. కేంద్ర శాసనసభ విధించినట్టుగా భారత సంయుక్త రాష్ట్రాలు రాజ్యాంగంలోని భాగాలకు లోనయి ఉంటుంది.

**3 వ అంశం :** భారత సంయుక్త రాష్ట్రాలకు, అర్హతలేని సంస్థానాల భూభాగాలను సవరించి తిరిగి క్రమబద్ధం చేసి పునః పంపకం చేసి పరిపాలనా భాగంగా కేంద్రంలోకి కేంద్ర రాష్ట్రాలుగా విలీనం చేసే హక్కు ఉంటుంది.

**4 వ అంశం :** ఒక రాష్ట్రం కేంద్రంలోకి రాష్ట్రంగా ప్రవేశం పొందినపుడు ఆయా రాష్ట్రాల కేంద్ర శాసన సభల అనుమతి లేకుండా తన అధికార పరిధిలో మరో కొత్త రాష్ట్రాన్ని రూపొందనియ్య కూడదు. సృష్టించకూడదు లేదా రెండు లేక ఎక్కువ రాష్ట్రాలతో గాని వాటి భాగాలతో గాని మరో కొత్త రాష్ట్రాన్ని ఏర్పరచకూడదు.

## నిబంధన – I భాగం – II :

భారత సంయుక్త రాష్ట్రాలు భారత దేశ భూభాగంతో సహజంగా కలిగి ఉన్న ఏ ప్రాంతాన్నయినా లేదా దాని సరిహద్దులో ఉన్న ఏ ప్రాంతాన్నయినా పరస్పరం అంగీకార

వివరణకు 406వ పేజీ చూడండి

మయిన షరతులకు లోబడి కేంద్రంలోకి చేర్చుకోవచ్చు. వివరణకు 406 పేజీ చూడండి అయితే ఈ షరతులు భారత సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగానికి విరుద్ధంగా ఉండకూడదు. ప్రవేశంకూడా భారత సంయుక్త రాష్ట్రాలుగా ఏర్పడిన రాష్ట్రాలలో సగం ఒక తీర్మానం ద్వారా సిఫారసు చేసిన మీదటనే జరుగుతుంది.

**2 వ అంశం :** భారత సంయుక్త రాష్ట్రాలు కొత్త భూభాగాన్ని సంపాదించవచ్చు. దానిని చేరని భాగంగా వ్యవహరించవచ్చు. భారత సంయుక్త రాష్ట్రాల శాసనసభ దానికి భిన్నమైన నిబంధన ఏదైనా చేస్తేనేతప్ప, చేరని ప్రాంతాలకు భారత సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగంలోని నిబంధనలు వర్తించవు.

# సూచించిన నిబంధన – II

## వివరమైన విశ్లేషణ

**నిబంధన II – భాగం I** పౌరుల ప్రాథమిక హక్కులు

**నిబంధన II భాగం II :** ప్రాథమిక హక్కులపై దాడిలో నివారణోపాయాలు

అంశం 1 న్యాయపరమైన రక్షణ

అంశం 2 అసమాన ఆదరణ నుంచి రక్షణ

అంశం 3 వివక్ష నుంచి రక్షణ

అంశం 4 ఆర్థిక దోపిడి నుంచి రక్షణ

**నిబంధన II భాగం III :** అల్ప సంఖ్యాకుల రక్షణపై నిబంధనలు

అంశం 1 కులాభిమానం కలిగిన కార్యనిర్వాహక వర్గం నుంచి రక్షణ

అంశం 2 సాంఘిక, అధికారక నియంతృత్వం నుంచి రక్షణ

అంశం 3 సాంఘిక బహిష్కరణ నుంచి రక్షణ

అంశం 4 అల్ప సంఖ్యాకుల ప్రయోజనాలతో సహా ప్రజా ప్రయోజనాలకోసం డబ్బు ఖర్చు పెట్టటానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఉన్న అధికారం, బాధ్యత.

**నిబంధన II భాగం IV :** షెడ్యూల్డు కులాలకు రక్షణలు

**ఉపభాగం I : హామీలు**

అంశం 1. శాసన సభలలోను స్థానిక సంస్థల్లోను ప్రాతినిధ్యం హక్కు.

అంశం 2. కార్యనిర్వాహక వర్గంలో ప్రాతినిధ్యం హక్కు.

అంశం 3. ఉద్యోగాలలో ప్రాతినిధ్యం హక్కు.

**ఉపభాగం II :** ప్రత్యేక బాధ్యతలు

అంశం 1. ఉన్నత విద్యకోసం

అంశం 2. ప్రత్యేక విద్యకోసం

**ఉపభాగం III :** రక్షణల మంజూరు, రక్షణల సవరణ

అంశం 1. రక్షణలు రాజ్యాంగంలో పొందుపరచటం

అంశం 2. రక్షణల సవరణ

ఉపభాగం IV : భారత రాష్ట్రాలలో షెడ్యూల్డు కులాల రక్షణ.

ఉపభాగం V : వ్యాఖ్యానం

## నిబంధన II భాగం I

## పౌరుల ప్రాథమిక హక్కులు

భారత సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగం, ఈ క్రింది వాటిని పౌరుల ప్రాథమిక హక్కులుగా గుర్తించాలి.

ప్రాథమిక హక్కులు వివరణకు 406వ పేజీ చూడండి.

1. భారత సంయుక్త రాష్ట్రాల భూభాగంలో జన్మించిన వ్యక్తులు, లేదా పౌరసత్వం పొందిన వ్యక్తులు అందరూ భారత సంయుక్త రాష్ట్రాల లేదా ఆ వ్యక్తులు నివసించే రాష్ట్రాల పౌరులే ప్రాథమిక హక్కులు- నివారణకు 406 పేజీ చూడండి.హోదా, పుట్టుక, వ్యక్తి, కుటుంబం, మతం లేదా మతకట్టు బాట్లు ఆచారాల నుంచి వచ్చే ఏ హక్కు అయినా అయోగ్యత అయినా రద్దయింది.

2. పౌరుల హక్కులను అభయాలను కుదించివేసే టటువంటి ఏ చట్టాన్ని గాని, ఆచారాన్ని గాని ఏ రాష్ట్రమూ చేయకూడదు. అమలు చేయకూడదు; న్యాయ కార్యపద్ధతి ప్రకారం తప్ప ఏ రాష్ట్రం కూడా ఏ వ్యక్తి ఆ ప్రాణాన్ని, స్వేచ్ఛను, ఆస్తిని హరించి వేయకూడదు.

3. చట్టం ముందు పౌరులందరూ సమానము. సమాన పౌరహక్కులు కలిగి ఉంటారు. అమలులో ఉన్న ఏ చట్టం, నియమం ,ఉత్తరువు, ఆచారం లేదా ఏ శాసన అన్వయం ద్వారా అయినా ఏ పౌరుని పైన అయినా ఏ రకమైన జరిమానా, అసౌకర్యత లేదా అయోగ్యతకు అమలులో ఉన్నా వివక్షతకి గురి అవుతున్నా ఈ రాజ్యాంగం అమలులోకి వచ్చిన రోజునుంచి వాటి అమలు ఉండదు.

4. అన్ని వర్గాల వ్యక్తులకు వర్తింపులో ఉన్న చట్టం చూపిన కారణాలవలన తప్ప, ఏ వ్యక్తికి కూడా అతని సామాజిక హోదాకు సంబంధం లేకుండా, ఏ వసతి సదుపాయాన్ని గాని అనుభవించనీయకుండా, సత్రాలు, విద్యాసంస్థలు, రోడ్లు, రహదారి మార్గాలు, వీధులు, చెరువులు, బావులు, ఇతర జలాశయ స్థలాలు, భూమి, గాలి నీటిపైన ప్రజా వాహనాల ఉపయోగాన్ని, రంగస్థలాలు ఇతర ప్రజా మనోరంజక స్థలాలు, ప్రదేశాలు వసతులు వాటిని ప్రజోపయోగానికి సమర్పించినా, నిర్వహిస్తున్నా, అనుమతి ఇస్తున్నా పూర్తిగా అనుభవించ నీయకుండా ఎవ్వరైనాచేసినా వారు నేరం చేసిన వారవుతారు.

5. ప్రజలు లేదా ప్రజ కోసం నిర్వహిస్తున్న ఏ సంస్థలు, వసతులు, సౌకర్యాలు అందరి సమానంగా అందుబాటులో ఉండాలి.

6. ఏ వ్యక్తిని గాని అతను లేదా ఆమె మతం, కులం, శాఖ, లింగభేదం లేదా సామాజిక హోదాను బట్టి ఏ ప్రజాపదవినైనాగాని ఏ వ్యాపారం లేదా వృత్తులుగాని చేపట్టకుండా అనర్హుణ్ణి చేయకూడదు.

7. (I) భారతదేశంలో ఏ ప్రాంతంలో అయినా నిసించే హక్కు ప్రతి పౌరునికీ ఉన్నది. శాంతి భద్రతలు, నైతిక అవసరాలలో తప్ప, నివసించే హక్కును కుదించి వేస్తూ ఎటువంటి చట్టాన్నిగాని రూపొందించకూడదు.

(II) భారతదేశంలో ఏ ప్రాంతంలో అయినా స్థిరపడే హక్కు ప్రతి పౌరునికి- అతను పుట్టిన రాష్ట్రంనుంచి పౌరసత్వ పత్రాన్ని సమర్పించిన దానికి లోబడి ఉంటుంది. ఈ అంశంలోని- IVవ ఉపఅంశం నిర్దేశితమైన కారణాలమూలంగా తప్ప స్థిరపడటానికి అనుమతి, నిరాకరించకూడదు, ఉపసంహరించకూడదు

III పౌరుడు స్థిరపడాలని కోరుకుంటున్న రాష్ట్రం ఏదీ అట్టి స్థిరపడటం విషయంలో తన రాష్ట్రంలో నివసించేవారికి విధించే రుసుం తప్ప ప్రత్యేకమైన రుసుం ఏదీ విధించటానికి వీల్లేదు . స్థిరపడటానికి అనుమతి కోసం విధించే గరిష్ఠ రుసుము ఎంత ఉండాలన్నది కేంద్ర శాసన సభ చేసిన శాసనాల ప్రకారం నిర్ణయించవలసి ఉంటుంది.

(IV) రాష్ట్రం ఈ క్రింది వ్యక్తులు స్థిరపడటానికి అనుమతి నిరాకరించవచ్చు, ఉపసంహరించవచ్చు-

(అ) అలవాటుపడిన నేరస్థులైనవారు;

(ఆ) రాష్ట్రంలోని కుల సమతుల్యాన్ని మార్చటమే వారు స్థిరపడటంలో ఉద్దేశంగా గలవారు;

(ఇ) తాము స్థిరపడాలని అనుకుంటున్న రాష్ట్రాన్ని తమకు తగిన జీవనాధారాలు ఉన్నాయని ప్రజాధర్మంపైన ఆధారపడతామనిగాని ప్రజలకు బరువుగా తయారుకామని ఒప్పించలేనివారు;

(ఈ) అవసరమైతే తగిన సహాయాన్ని తాము పుట్టిన రాష్ట్రం అందచేయటానికి నిరాకరించినవారు;

(V) దరఖాస్తుదారుడు పనిచేసి బ్రతకగలడనే షరతుపైన, తాను పుట్టిన ప్రదేశంలో ప్రజలధర్మంమీద బ్రతికేవాడు కాదనే షరతు పైన, నిరుద్యోగ పరిస్థితులపై ఇచ్చే పూచీపైన స్థిరపడటానికి అనుమతి ఇవ్వవచ్చు.

(VI) ప్రతి బహిష్కరణనూ కేంద్ర ప్రభుత్వం ఖాయపరచాలి.

(VII) కొత్త ప్రాంతానికి పోయి నివసించటం, మామూలుగా నివసించటం మధ్య ఉన్న తేడాను కేంద్ర ప్రభుత్వం నిర్వచించాలి. అదే సమయంలో తాము నివసిస్తున్న సమయంలో వ్యక్తుల రాజకీయపౌరహక్కులను పాలించే నిబంధనలను విధించాలి.

8. ఒక కులం పెట్టే పీడన నుంచి, భారత దేశంలో ఏ ప్రాంతంలో నుంచి అయినా ఉద్భవించే అశాంతి, అంతర్గత హింస నుంచి కేంద్ర ప్రభుత్వం రక్షణ కల్పించాలి.

9. ఏ వ్యక్తినిగాని బలవంతపు చాకిరికి లేదా అయిష్టపూర్వకమైన బానిసత్వానికి గురిచేయకూడదు.

10. వ్యక్తిగతమైన ఇళ్లు, పత్రాల భద్రతల విషయంలోను నిర్హేతుకమైన సోదా, జప్తు జరగకుండా ప్రజలకుండే హక్కులను ఉల్లంఘించకూడదు. సమ్మదగిన కారణాలుండి ప్రమాణంపైన లేదా రూఢియైన ప్రకటనపైన తప్ప వారెంటు జారీ చేయకూడదు ముఖ్యంగా సోదాచేయవలసిన స్థలాన్ని, జప్తు చేసే వస్తువులు, బలాత్కారంగా పట్టుకొనే వ్యక్తుల పేర్లను వివరిస్తూ వారెంటు జారీ కావాలి.

11. అపరిపక్వత, ఖైదుకువెళ్లడం, పిచ్చితనం కారణాలపై కాకుండా మరే కారణాల మీద కూడా పౌరునికి ఓటు వేసే హక్కును నిరాకరించకూడదు, కుదించి వేయకూడదు.

12 శాంతి భద్రత, నైతిక ప్రయోజనాలకుతప్ప భావ ప్రకటనా స్వేచ్ఛను, పత్రికాస్వాతంత్ర్యాన్ని కుదించి వేస్తూ ఏ చట్టమూ చేయకూడదు.

13. దేశ బహిష్కారానికి సంబంధించిన చట్టాలు చేసినప్పుడు నేరంకాని పనులకు తర్వాత శిక్షలు విధించే చట్టాలను చేయకూడదు

14. ప్రతిపౌరునికి అంతరాత్మ స్వేచ్ఛను, తన ఇష్టం వచ్చిన మతాన్ని అలంబించటానికి, బోధించటానికి, శాంతి భద్రతలు నైతిక పరిమితులకు లోబడి ఇతరులను మతాంతరీకరణ చేయటంతో పాటుస్వేచ్ఛగా మతాన్ని ఉపయోగించుకొనే హక్కులు రాష్ట్రం కలుగ చేయాలి

15 ఏ మతపరమైన సంఘంలో సభ్యుడు అవ్వాలనిగాని, మతపరమైన ఆదేశాలకు లోబడి ఉండాలనిగాని, మతపరమైన కార్యం ఏదైనా నిర్వహించాలనిగాని ఎవరినీ బలవంతపరచ కూడదు పై చెప్పిన నిబంధనకు లోబడి, తల్లిదండ్రులు, సంరక్షకులు 16 సంవత్సరాలలోపు పిల్లలకు మతపరమైన శిక్షణ కలిగించే హక్కు ఉంటుంది.

16. తన కులం, శాఖ, లేదా మతం కారణంగా ఏ వ్యక్తీ ఏరకమైన దండనలకూ గురి చేయకూడదు లేదా తన కులం శాఖ మతం కారణంగా పౌరుని విద్యుక్త ధర్మాలను నెరవేర్చకుండా

ఏవ్యక్తికి కూడా అనుమతి ఇవ్వకూడదు.

17. రాష్ట్రం ఏ మతాన్ని కూడా రాష్ట్రమతంగా గుర్తించకూడదు

18. ఒక మతాన్ని అవలంబించే వ్యక్తులు ఒక సంఘంగా ఏర్పడే స్వేచ్ఛకు హామీ ఉండాలి. వారు ఆవిధంగా భావించినట్టయితే తమను ఒక ఉమ్మడి వ్యవస్థగా రూపొందిస్తూ శాసనం తయారు చేయమని రాష్ట్రాన్ని కోరవచ్చు.

19 తన వ్యవహారాలను అందరికీ వర్తించే శాసనాలకులోబడి క్రమబద్ధంచేసుకొని పాలించుకొనే స్వేచ్ఛ ప్రతి మతపరమైన సంఘానికి ఉంటుంది.

20. మత పరమైన సంఘాలు తమ సంఘ ఏర్పాటుకు సంబంధించిన శాసనం అనుమతిస్తే, ఇష్టపడుతున్న సభ్యుల నుంచి చందాలు వసూలు చేయవచ్చు. తాను సభ్యుడుకాని ఏ మతపరమైన వ్యక్తుల సముదాయ ఉపయోగార్థం ప్రత్యేకంగా ఏ మొత్తమైనా వినియోగిస్తుంటే దానికి పన్ను కట్టవలసిందిగా ఏవ్యక్తినిగాని బలవంతపరచకూడదు.

21. ఈ విభాగం క్రింద నేరాలు అన్నీ వారెంటు లేకుండా అరెస్టు చేయదగిన నేరాలే ఆ అవసరానికి శాసనం చేయవలసిన నిబంధనలు అమలుపరుస్తూ, నేరాలుగా ప్రకటితమైన పనులకు శిక్ష విధిస్తూ కేంద్ర ప్రభుత్వం శాసనాలు చెయ్యాలి.

## నిబంధన II – భాగం II

## ప్రాథమిక హక్కుల అతిక్రమణ – నివారణోపాయాలు

భారత సంయుక్త రాష్ట్రాలు ఈ దిగువ వాటిని పొందుపరచాలి

**అంశం 1 :**

కార్యనిర్వాహక వర్గంవారి నియంతృత్వ ధోరణి విషయంలో న్యాయపరమైన రక్షణ (వివరణకు 406 పేజి చూడండి)

(1) భారతదేశ న్యాయసంబంధమైన అధికారం సుప్రీంకోర్టు ఆధీనంలో ఉండాలి.

(2) అన్ని ఇతర కోర్టులపైన, కోర్టు అధికారాలు వినియోగించే అధికార్లపై అజమాయిషీ చేసేహక్కు – అటువంటి కోర్టులు లేదా అధికార్లు తనకు అపీలు చేసుకొనే లేదా పునర్విచారణ కోరేందుకు తనకు లోబడి ఉన్న వారైనా కాకపోయినా – సుప్రీంకోర్టుకు ఉంటుంది.

(3) కష్టం కలిగిన వ్యక్తి ఎవరైనా దరఖాస్తు పెట్టుకంటే హెబియస్ కార్పస్, కోవారెంటో, ప్రొహిబిషన్, సెర్షియొరరై, మాండమస్ వంటి అధికారిక రిట్ లను వ్యవహారంలో ఉన్నవాటిని జారీచేసే హక్కు సుప్రీంకోర్టుకు ఉన్నది. అటువంటి రిట్ ల అవసరాలకోసం, సుప్రీంకోర్టుకు భారతదేశ వ్యాప్తంగా అధికారపరిమితులు ఉంటాయి.

(4) తిరుగుబాటులు దాడులు జరిగే సందర్భంలో ప్రజల భద్రత అవసరమైన సందర్భాలలో తప్ప రిట్ ను కోరే హక్కును కుదించకూడదు. తాత్కాలికంగా నిలిపివేయకూడదు

**అంశం 2**

అనమాన ఆదరణ విషయంలో రక్షణ (వివరాలకు 406–8 పేజీలు చూడండి)

కేంద్ర లేదా భారత దేశంలోని రాష్ట్రాల శాసనసభ, కార్యనిర్వాహకవర్గం అధికారం ఈ క్రింది పరిమితులకు లోబడి ఉంటుంది. రాష్ట్ర ప్రజలకు చెందిన ఈ దిగువ పేర్కొన్న హక్కుకు భంగం కలిగించే శాసనాన్ని చేసే, ఉత్తరువు జారీ చేసే, నియమ నిబంధనలు చేసే హక్కు భారతదేశంలో ఏ శాసన సభకుగాని కార్యనిర్వాహక వర్గానికిగాని లేదు.

(1) ఒప్పందాలు చేసుకొని అమలు చేయించుకోవటం, వ్యాజ్యం వేయటం, కక్షిదారులు కావటం, సాక్ష్యం ఇవ్వటం, ఆస్తి సంక్రమించుకోవటం, కొనటం, కౌలుకు ఇవ్వటం, అనుభవించటం, స్థిర, స్వపర ఆస్తులను అన్యాక్రాంతం చేయటం.

(2) సివిల్, మిలిటరీ, తదితర విద్యాసంస్థలు అన్నింటిలోకి రాష్ట్రంలోని అన్ని వర్గాల ప్రజలకు సరియైన తగిన ప్రాతినిధ్యం కల్పించటానికి అవసరమైన షరతులు పరిమితులకు లోబడి ప్రవేశార్హత కలిగి ఉండటం.

(3) వసతులు, సదుపాయాలు, సౌకర్యాలు, విద్యాసంస్థలు, సత్రాల సౌకర్యాలు, నదులు, వాగులు, బావులు, చెరువులు, రోడ్లు, మార్గాలు, వీధులు, నేల, గాలి, నీటిపైన, ప్రజా వాహనాల సౌకర్యం, రంగస్థలం ఇతర ప్రజామనోరంజక స్థలాలను పూర్తిగాను సమంగాను వినియోగించుకొనే హక్కు ఉండటం, అయితే ప్రతి జాతి, వర్గం,కులం, రంగు, శాఖలవారికి అనువర్తమవుతున్న షరతులు పరిమితులు అందరూ ఒకే విధంగా లోబడి మాత్రమే ఈ హక్కు వినియోగం ఉంటుంది.

(4) సాధారణ ప్రజలకు లేదా ఒకే విశ్వాసానికి మతానికి చెందిన వ్యక్తుల కోసం సమర్పితమైన, ఏర్పడిన, నిర్వహణలో ఉన్న అనుమతిలో ఉన్న ఏ మతపరమైన లేదా ధర్మాదాయసంస్థలు అందించే ప్రయోజనాలను వ్యత్యాసం లేకుండా అనుభవించటానికి అర్హుడు, యోగ్యుడు అనిపించుకోవటం.

(5) ఏ ఆచారమూ కట్టుబాటుతో సంబంధం లేకుండా లేదా మతంపై ఆధారపడిన ఆచారం కట్టుబాట్లతో సంబంధంలేకుండా ఇతర వ్యక్తులు అనుభవిస్తున్నట్లుగానే వ్యక్తుల ఆస్తుల రక్షణ కోసం ఉన్న అన్ని శాసనాల, వ్యవహారాల ప్రయోజనాలను సమంగా సంపూర్ణంగా అనుభవించటం, ఇతరులు పొందే శిక్ష, బాధ, జరిమానాలు తప్ప ఇతరమైనవి వేటికీ గురికాక పోవటం.

అంశం 3

వివక్షపై రక్షణ (వివరణకు 408 పేజి చూడండి)

(1) ప్రజా పరిపాలనలో ప్రభుత్వ అధికారులు కర్మాగారాలలో వాణిజ్య సంస్థలలో ప్రైవేటు యజమానులు పౌరుల మధ్య జాతి, శాఖ లేదా సాంఘిక హోదా పేరు మీద వివక్ష చూపటం నేరంగా పరిగణించాలి. ఈ అవసరం కోసం ఏర్పాటయిన ట్రిబ్యునల్‌కు ఈ నేరాలను విచారించే అధికారపరిధి ఉంటుంది.

(2) తగిన శాసనం చేయటం ద్వారా ఈ నిబంధన అమలు చేయించే హక్కు, బాధ్యత కేంద్ర శాసన సభకు ఉంటుంది.

అంశం 4

భారత సంయుక్త రాష్ట్రాలు తమ రాజ్యాంగం ఒక భాగంగా ఇలా ప్రకటన చెయ్యాలి.

ఆర్థిక దాడికి విషయంలో రక్షణ (వివరణకు 408–412 పేజీలు చూడండి)

(1) ప్రధానమైన పరిశ్రమలను లేదా ప్రధానమైనవని ప్రకటింపబడిన పరిశ్రమలను ప్రభుత్వం తన ఆధీనంలో ఉంచుకొని నడిపించాలి.

(2) ప్రధానం కాకుండా మూల పరిశ్రమలుగా ఉండే పరిశ్రమలను రాజ్యం తన అధీనంలో ఉంచుకొని తానుగాని తాను ఏర్పరిచిన కార్పొరేషన్ చేతగాని నడిపించాలి.

(3) భీమాపై రాజ్య గుత్తాధిపత్యం ఉండాలి. శాసనసభ విధించేటట్టుగా తన జీతాలకు సరిపోయేటంత జీవితభీమా ప్రతి వయోజన పౌరుడూ తీసుకొనేలా రాజ్యం ఒత్తిడిచెయ్యాలి.

(4) వ్యవసాయం రాజ్య పరిశ్రమగా ఉండాలి.

(5) ప్రైవేటు వ్యక్తులు యజమానులుగా గాని కౌలుదార్లుగాగాని తనఖా దార్లుగా గాని అనుభవిస్తున్న వ్యవసాయ భూములలో, పరిశ్రమలలో, భీమాలో ఉన్న హక్కులను రాజ్యం సేకరించాలి. ఆ భూమిలో అతనికి లేదా ఆమెకు ఉన్న హక్కుకు సరిపడిన విలువ డిబెంచర్ల రూపంలో నష్ట పరిహారంగా చెల్లించాలి అయితే భూమి యంత్రం, సెక్యూరిటీ విలువ పరిగణించే సందర్భంలో, అత్యవసర పరిస్థితుల వల్ల పెరిగిన ధరనుగాని దానికుండే విలువనుగాని అది సంపాదించని విలువను గాని నిర్బంధసేకరణ కోసం పరిగణనలోనికి తీసుకోకూడదు.

(6) డిబెంచరు కలిగిఉన్నవాడు ఎప్పుడు ఎలా నగదు చెల్లింపు తీసుకుంటాడో రాజ్యమే నిర్ణయిస్తుంది.

(7) డిబెంచరును బదలాయించవచ్చు, వంశ పారంపర్యంగా అనభవించవచ్చు, అయితే డిబెంచరు కలిగి ఉన్నవారుగాని అతని నుంచి బదలాయింపు పొందినవారు గాని అతని వారసుడుగాని భూమిని తిరిగి తీసుకోటానికిగాని రాజ్యం సేకరించిన పరిశ్రమలో ఏదైనా యాజమాన్యం కోరే హక్కుగాని ఉండదు. అలాగే వాటితో ఏ రకమైన సంబంధమూ పెట్టుకొనటానికి వీల్లేదు.

(8) చట్టం నిర్ణయించిన రేటు ప్రకారం డిబెంచరు పొంది ఉన్నవారు ఆ డిబెంచరుపై వడ్డీ పొందుతారు, ఈ వడ్డీని రాజ్యం తాను ఉచితమని భావించిన రీతిలో ధన రూపంలోగాని వస్తురూపంలోగాని చెల్లిస్తుంది

(9) వ్యవసాయపరిశ్రమను ఈ క్రింది విధంగా నిర్మాణం చెయ్యాలి

(i) సేకరించిన భూమిని రాజ్యం ప్రామాణీకృత పరిమితి గలిగిన కమతాలుగా విభజించి ఈ దిగువ తెలిపిన షరతులలో కౌలుదార్లుగా (కుటుంబాల సముదాయాలతో కలిపిన) సాగు చెయ్యటం కోసం గ్రామవాసులకు ఈ కమతాలను కౌలుకు ఇవ్వాలి.

(అ) ఉమ్మడి వ్యవసాయక్షేత్రంగా ఈ కమతాన్ని సాగుచెయ్యాలి

(ఆ) ప్రభుత్వం జారీచేసిన నియమాలు, ఆదేశాలకు అనుగుణంగా కమతాలను సాగుచెయ్యాలి

(ఇ) కమతంపై సరిగ్గా విధించదగిన ఖర్చు చెల్లింపు మిగిలిన దిగుబడిని నిర్ణయమైన విధానంలో కౌలుదార్లు అందరూ పంచుకోవాలి

(ii) కులం, శాఖ తేడా లేకుండా, యజమాని కౌలుదారు భూమిలేని కూలీ అనేవారు

ఎవరూ ఉండనట్టి విధంగా గ్రామస్థులందరికీ భూమిని కౌలుకు ఇవ్వాలి.

(iii) నీరు, దుక్కిటెద్దులు, పనిముట్లు, ఎరువులు, విత్తనాలు మొదలైన వాటిని సరఫరా చేయటం ద్వారా ఉమ్మడి వ్యవసాయక్షేత్రాలకు పెట్టుబడి పెట్టటం రాజ్య విద్యుక్తధర్మం.

(iv) రాజ్యానికి ఈ కింది హక్కులుంటాయి :-

(అ) కమతం దిగుబడిపై ఈ క్రింది పన్నులు విధించవచ్చు.

(i) భూమిపన్ను కోసం కొంతభాగం

(ii) డిబెంచరు పొందిన వారికి చెల్లింపు కోసం కొంత భాగం

(iii) సరఫరా చేసిన పెట్టుబడి సరుకులు ఉపయోగించుకున్నందుకు చెల్లింపుకోసం కొంతభాగం.

(ఆ) కౌలు షరతులను ఉల్లంఘించిన లేదా రాజ్యం సరఫరా చేసిన వ్యవసాయ పనిముట్లను పరికరాలను ఎక్కువ మోతాదులో ఉపయోగించుకోకుండా ఉద్దేశపూర్వకంగా అశ్రద్ధ చేసిన, లేదా ఉమ్మడ వ్యవసాయక్షేత్ర పథానానికి భంగకరంగా వ్యవహరించిన కౌలుదార్లకు జరిమానాలు విధించటం;

(10) వీలయినంత త్వరగా ఈ పథకాన్ని అమలు చెయ్యాలి, కాని ఎట్టి పరిస్థితిలోను రాజ్యాంగం అమలులోకి వచ్చిన నాటి నుంచి పదిసంవత్సరాలు దాటనీయకుండా అమలు జరగాలి.

## నిబంధన II – భాగం III

## అల్పసంఖ్యాకుల రక్షణకై నిబంధనలు

భారత సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగం ఈ విధంగా పొందు పరచాలి.

**అంశం 1 :**

**కులపరమైన కార్య నిర్వాహక వర్గానికి ఎదురుగా రక్షణ (వివరణకు 412–415 పేజీలు చూడండి**

(1) కార్య నిర్వాహకవర్గం - కేంద్రందిగాని రాష్ట్రందిగాని - పార్లమెంటు పద్ధతిలో కానిదిగా ఉండాలి. అంటే శాసనసభ పరిమితి ముగిసేలోగా దానిని తొలగించటానికి వీలులేదు.

(2) శాసన సభలో సభ్యులుకాని కార్యనిర్వాహక సభ్యులకు శాసన సభలో కూర్చుని, ప్రసంగించి, ఓటుచేసి, ప్రశ్నలకు సమాధానాలు చెప్పే హక్కు ఉంటుంది.

(3) బదలాయింపు చేసే ఏక ఓటు ద్వారా మొత్తం సభవారు ప్రధానమంత్రిని ఎన్ను కుంటారు.

(4) మంత్రి మండలిలోని వివిధ అల్పసంఖ్యాక వర్గాల ప్రతినిధులను శాసనసభలో ఉన్న ప్రతి అల్పసంఖ్యాక వర్గాలవారు బదలాయింపు చేసే ఏక ఓటు ద్వారా ఎన్నుకుంటారు.

(5) కార్యనిర్వాహక వర్గం లోని అధిక సంఖ్యాకుల ప్రతినిధులను మొత్తం సభవారు బదలాయింపు చేసే ఓటు ద్వారా ఎన్నుకుంటారు

(6) మంత్రి మండలిలోని సభ్యుడు అభిశంసన తీర్మానం వల్లగాని మరేవిధంగానైనాగాని తన స్థానానికి రాజీనామా చేయవచ్చు. లంచగొండితనం దేశద్రోహం కారణాల మీద శాసనసభ! దోషారోపణ చేసి తొలగించటం ద్వారా తప్ప అతనిని తొలగించటానికి వీలులేదు.

**అంశం 2 :**

**సాంఘిక, అధికారిక నియంత్రత్వంకై రక్షణ (వివరణకు 416 పేజి చూడండి)**

(1) అల్పసంఖ్యాక వర్గాల సూపరింటెండెంట్‌గా పిలిచే ఒక అధికారిని నియమించాలి.

(2) 1935 భారత దేశచట్టంలోని 166 విభాగం క్రింద నియామకం అయ్యే ఆడిటర్ జనరల్‌కి ఉన్న హోదా ఇతనికీ ఉండాలి. సుప్రీంకోర్టు జడ్జీని తొలగించే విధంగానే, ఆ కారణాలపైననే ఇతనినీ తొలగించవచ్చు.

(3) ప్రజలు, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అన్నీ అల్పసంఖ్యాకవర్గాల పట్ల అనుసరిస్తున్న వైఖరిపైన, ప్రభుత్వంగాని దాని అధికార్లుగాని కుల పక్షపాతం వలన రక్షణలు వేటిపైనా అతిక్రమించటం లేదా సరిగ్గా అందజేయలేక పోవటంపై ఒక వార్షికనివేదికను తయారుచేయటం

(4) సూపరింటెండెంట్ తయారు చేసిన నివేదికను కేంద్ర, రాష్ట్ర శాసన సభల

ముందు సమర్పించాలి. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు రిపోర్టుపై చర్చకు సమయం కేటాయించాలి.

అంశం 3 :

ఈ క్రింద నిర్వహించిన రీతిగా సాంఘిక బహిష్కరణ, సాంఘిక బహిష్కరణను ప్రోత్సహించటం, ప్రేరేపించటం, లేదా సాంఘిక బహిష్కరణతో భయపెట్టటం నేరాలుగా ప్రకటితమయ్యాయి :

(I) బహిష్కరణ నిర్వచనం – ఒకవ్యక్తి మరొకవ్యక్తిని బహిష్కరించటం అంటే–

(అ) ఏదైనా ఇల్లునుగాని భూమినిగాని అద్దెకు ఇవ్వకుండా ఉండటం చేసినా, ఆక్రమించుకోనీకుండా చేసినా, లేదా అతనితో సంబంధాలు పెట్టుకోకపోవటం, కూలిపనికి పెట్టుకోకపోవటం, మరొక వ్యక్తితో వ్యాపారం చేయకపోవటం, అతని నుంచి ఏరకమైన పనీ చెయ్యించుకోకపోవటం, అతనికి ఏ పనీ చెయ్యక పోవటం, మామూలు సందర్భాలలో మమూలుగా పనిజరగటానికి పైన చెప్పిన షరతులపై పని చేయటానికి నిరాకరించటం.

(ఆ) రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులకు ఇతర పౌరహక్కులకూ అసంగతంకాని ప్రజలమధ్య ఆచరణలో ఉన్న ఆచారాలను దృష్టిలో ఉంచుకొని ఇతర వ్యక్తులతో తాను ఎలా వ్యవహరిస్తాడో అలాకాకుండా సాంఘిక, వృత్తిపరమైన, వ్యాపారపరమైన సంబంధాలకు దూరంగా ఉండటం, లేదా

(ఇ) చట్టపరమైన హక్కు అనుభవంలో ఏవ్యక్తికైనా ఏ రూపంలో అయినా గాయపరిచినా, చీకాకుపరిచినా లేదా ఇతరులతో జోక్యం కలుగ జేసుకోవటం.

(II) బహిష్కరణా నేరం – ఎవరైనా చట్టసమ్మతంగా చేయవలసిన పని చేసినప్పుడు, లేదా చట్టసమ్మతంగా విడిచి పెట్టవేయవలసిన పనిని విడిచి పెట్టివేసినపుడు, లేదా చట్టపరంగా చేయనవసరం లేని పనిని ఎవరి చేతనైనా చేయించాలనే ఉద్దేశం ఉన్నప్పుడు, లేదా అతను విడిచి పెట్టవేయవలసిన పనిని చేయించినప్పుడు, లేదా అట్టివ్యక్తిని శారీరకంగా, మనసికంగా లేదా ఆస్తి లేదా వ్యాపారానికి జీవనోపాధికి సంబంధించి హానిచేస్తే, అట్టివ్యక్తిని లేదా అట్టివ్యక్తి ఆసక్తి కలిగిన వ్యక్తిని మరెవరైనా బహిష్కరిస్తే అది బహిష్కరణ నేరం చేసినవాడవుతాడు.

అయితే, ముద్దాయి ఎవరి ప్రోత్సాహంతోనో, ఎవరితో చేతులు కలిపో లేదా బహిష్కరించాలనే కుట్ర, ఒప్పందం లేదా కలయికలో భాగంగా వ్యవహరించలేదని న్యాయస్థానం సంతృప్తిపడినపుడు ఈ భాగం క్రింద నేరం చేసినట్టు కాదు.

(iii) బహిష్కరణను ప్రేరేపించే లేదా ప్రోత్సహించే నేరం. ఎవరైనా, ఏ వ్యక్తిని లేదా వ్యక్తుల వర్గాన్ని బహిష్కరించటానికి

(అ) ప్రతిపాదన ఏదైనా బహిరంగంగా చెప్పినపుడు, ప్రకటించినపుడు, నలుగురికీ

తెలియజేసినపుడు లేదా

(ఆ) బహిష్కరించాలనే ఉద్దేశంతో లేదా ఇలా చేస్తే బహిష్కరణ జరుగుతుందనే నమ్మకంతో ఏదైనా ప్రకటన చేసినా, వదంతు వ్యాపింపచేసినా;

(ఇ) మరే విధంగానైనా బహిష్కరణను ప్రోత్సహించినా ప్రేరేపించినా ఆవ్యక్తి బహిష్కరణను ప్రేరేపించిన లేదా ప్రోత్సహించిన నేరం చేసినట్టు అవుతాడు.

**వివరణ :–** ఇక్కడ తెలిపిన రీతిలో చేసిన ఏ పని ద్వారా అయినా దెబ్బతగిలిన వ్యక్తి లేదా దెబ్బతగల బోయే వ్యక్తి పేరుపెట్టి లేదా పనివాని వర్గమని చెప్పి ఉండకపోయినా ఒక నిర్దిష్టమైన విధానంలో పనిచేసి ఉన్న లేక పని చేయకుండా ఉండిపోయినా ఈ అంశం క్రింద నేరం చేసిన క్రిందనే వస్తుంది.

(IV) బహిష్కరణను భయపెట్టటం ద్వారా నేరం.

ఎవ్వరైనా చట్టసమ్మతంగా చేయవలసిన ఏపని అయినా చేసినపుడు, లేదా చట్ట సమ్మతంగా విడిచి పెట్టవలసిన పనిని విడిచి పెట్టినపుడు, లేదా తాను చట్టపరంగా చేయనవసరంలేని పనిని బలవంతంగా చేయించినపుడు, లేదా చట్టపరంగా చేయవలసిన పనిని బలవంతంగా వదలి వేయించినపుడు ఆవ్యక్తినిగాని ఆవ్యక్తికి ఆపేక్షఉన్న మరే వ్యక్తినైనాగాని బహిష్కరిస్తామని ఎవ్వరైనా భయపెట్టినపుడు బహిష్కరణను భయపెట్టటం ద్వారా నేరం చేసిన వాడవుతాడు.

**మినహాయింపు :**

(I) యధార్థమని నమ్మిన కార్మిక వివాదానికి ప్రోద్బలంగా ఏ పనినైనా చేసినా;

(ii) మామూలు వ్యాపారపోటీలో ఏపనైనా చేసినా అది బహిష్కరణ క్రిందికి రాదు.

(2) ఈ నేరాలన్నీ వారెంటు లేకుండా అరెస్టు చేయదగినవే. ఈ నేరాలకు శిక్ష విధిస్తూ కేంద్ర శాసనసభ చట్టాలను రూపొందించాలి.

**అంశం 4**

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఏ అవసరం కోసమైనా గ్రాంట్లు మంజూరు చేసే అధికారం అవసరం నిమిత్తం కేంద్ర శాసనసభ లేదా రాష్ట్ర శాసన సభకు చట్టంచేసేది కాకపోయినా కుదించి వేయటానికి లేదా తొలగించి వేయటానికి వీల్లేదు.

**అల్ప సంఖ్యాక వర్గాల ప్రయోజనాలతో సహా భారత ప్రభుత్వ అవసరాల దేనికోసమైనా డబ్బు ఖర్చు పెట్టటానికి ప్రభుత్వాలకు అధికారం (వివరణకు పేజి 418 చూడండి)**

# నిబంధన – II –భాగం – IV

## షెడ్యూల్డు కులాలకు రక్షణలు

### భాగం I - హామీలు

శాసనసభలో ప్రాతినిధ్యంకు రక్షణ (వివరణకు 419–24 పేజీలు చూడండి)

భారత సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగం షెడ్యూల్డు కులాలకు ఈ క్రింది రక్షణలు హామీ ఇస్తుంది.

**అంశం 1 :**

**శాసనసభలో ప్రాతినిధ్యానికి హక్కు :**

**(1)** **ప్రాతినిధ్య పరిమాణం :** (అ) (I) షెడ్యూల్డు కులాలకు – కేంద్ర – రాష్ట్ర శాసన సభల్లో కనీస ప్రాతినిధ్యం ఉండాలి. సముదాయ రాజ్యాంగం ఉన్నపుడు ఆ సముదాయ శాసనసభలో మొత్తం జనాభాకు వారి జనాభా ఉన్న శాతంకు సరిపోయేటంత ప్రాతినిధ్యం ఉండాలి. అయితే జనాభా ప్రాతిపదికపై వారికి రావలసిన దానికంటే ఎక్కువ ప్రాతినిధ్యాన్ని ఏ అల్ప సంఖ్యాకవర్గాలూ కోరకూడదు.

(II) సింద్, ఎన్.డబ్ల్యు. ఎఫ్ రాష్ట్రాల షెడ్యూల్డు కులాలకు తగిన ప్రాతినిధ్యాన్ని కల్పించాలి

(III) ఒక కులం ఎక్కువ సంఖ్యలో ఉన్నపుడు దానిని హేతుబద్ధమైన పరిమాణానికి తగ్గించటం అవసరమైనపుడు అదనపు ప్రాతినిధ్యం అధిక సంఖ్యాకుల వాటాలోనుంచి తీయవలసి ఉంటుంది. ఎట్టి పరిస్థితులలోను అది ఇతర అల్ప సంఖ్యాకవర్గాల వారికి నష్టం కలిగించేదిగా ఉండకూడదు.

(IV) అధిక సంఖ్యాకులలోనుంచి తీసుకున్న అదనపు ప్రాతినిధ్యం ఒక కులానికి మాత్రమే కేటాయించకూడదు. కాని అన్ని అల్పసంఖ్యాక వర్గాల వారిలోనూ సరి సమానంగా లేదా వారి

(1) ఆర్థిక పరిస్థితి

(2) సాంఘిక హోదా

(3) విద్యా పురోగతిని బట్టి విలోమనిష్పత్తిలో పంపకం చెయ్యాలి.

(ఆ) ప్రత్యేక ప్రయోజనాలకు ప్రాతినిధ్యంలేదు. ఒక వేళ దానిని కలుగ చెయ్యాలంటే ఆ ప్రత్యేక ప్రయోజనాలు ఏ కులానికి కలిగి ఉంటాయో ఆ కులం ప్రాతినిధ్యం నుంచి తీసి ఇవ్వాలి.

**(2) ఎన్నిక విధానం :**

(అ) శాసనసభలకు

(అ) పూనా ఒడంబడిక ద్వారా ప్రవేశ పెట్టిన ఎన్నిక విధానాన్ని ఎత్తివెయ్యాలి.

(ఆ) దానిస్థానంలో, ప్రత్యేక నియోజకవర్గాలను ఉంచాలి.

(ఇ) ఓటుహక్కు వయోజన ఓటు హక్కు అయిఉండాలి.

(ఈ) ఓటింగు విధానం ఉండాలి.

మునిసిపాలిటీలకు, స్థానిక సంస్థలకు ప్రాతినిధ్య పరిమాణాన్ని నిర్ధారించే సూత్రాల, ఎన్నిక విధానమూ కేంద్ర రాష్ట్ర శాసనసభలకు అనుసరించినదే అయిఉండాలి.

**అంశం 2 :**

**కార్య నిర్వాహక వర్గంలో ప్రాతినిధ్యం హక్కు (వివరణకు 424–25 పేజీలు చూడండి)**

(1) షెడ్యూల్డు కులాలకు కేంద్ర రాష్ట్ర కార్యనిర్వాహక వర్గంలో కనీస ప్రాతినిధ్యం ఉండాలి. సముదాయ రాజ్యాంగం ఉన్నట్లయితే సముదాయ కార్యనిర్వాహక వర్గంలో మొత్తం జనాభాకు వారి జనాభాకు ఉన్న శాతంకు సరిపోయేలా ప్రాతినిధ్యం ఉండాలి అయితే జనాభా ప్రాతిపదికపై వారికి గావలసిన దానికంటే ఎక్కువ ప్రాతినిధ్యాన్ని ఏ ఇతర అల్పసంఖ్యాక వర్గాలూ కోరకూడదు.

(2) ఒక కులం ఎక్కువ సంఖ్యలో ఉన్నపుడు దానిని హేతుబద్ధమైన పరిమాణానికి తగ్గించవలసి వచ్చినపుడు అదనపు ప్రాతినిధ్యానికి అధికసంఖ్యాకుల వాటాలోనుంచి తీసివేయవలసి ఉంటుంది. ఎట్టిపరిస్థితులలోనూ అది ఇతర అల్పసంఖ్యాక వర్గాలవారికి నష్టం కలిగించేదిగా ఉండకూడదు.

(3) అధిక సంఖ్యాకులలోనుంచి తీసుకున్న అదనపు ప్రాతినిధ్యం ఒక కులానికి మాత్రమే కేటాయించకూడదు. కాని అన్ని అల్పసంఖ్యాకులలోను సరిసమానంగా లేదా వారి

(i) ఆర్థిక పరిస్థితి

(ii) సాంఘిక హోదా

(iii) విద్యాస్థాయి పురోగతిని బట్టి విలోమ నిష్పత్తిలో పంపకం చెయ్యాలి.

**అంశం 3 :**

**ఉద్యోగాలలో ప్రాతినిధ్యం హక్కు (వివరణకు 424 పేజీ చూడండి)**

ఉద్యోగాలలో ప్రాతినిధ్యానికి హక్కు

(అ) షెడ్యూల్డు కులాల ఉద్యోగాలలో ప్రాతినిధ్య పరిమాణం ఈ క్రింది విధంగా ఉండాలి.

(i) కేంద్ర ఉద్యోగాలలో :-

భారతదేశంలో లేదా బ్రిటిషు ఇండియాలో మొత్తం జనాభాకు వారి జనాభా నిష్పత్తి ప్రకారంగా

(ii) రాష్ట్ర గ్రూపు ఉద్యోగాలలో :- కేంద్రం లేదా రాష్ట్రంలో వార జనాభాకు అనుగుణంగా

(iii) మునిసిపల్ స్థానిక సంస్థల ఉద్యోగాల్లో మునిసిపల్ లేదా స్థానిక సంస్థల ప్రాంతాలలో వారి జనాభా ప్రాతిపదికను బట్టి. అయితే ఉద్యోగాలలో ఏ అల్పసంఖ్యాక వర్గం కూడా దాని జనాభాకు మించిన ప్రాతినిధ్యాన్ని కోరకూడదు.

(ఆ) ఉద్యోగాల ప్రాతినిధ్యంకోసం వారికి ఉన్న హక్కును కనీస అర్హతలు, విద్య, వయస్సు మొదలైన వాటికి సంబంధించిన షరతుల ద్వారా తప్ప ఇతర విధంగా తగ్గించి వేయకూడదు.

(ఇ) ఉద్యోగాలలోకి ప్రవేశానికి విధించిన అర్హతలు భారత ప్రభుత్వం 1942, 1945 సంవత్సరాలలో జారీ చేసిన నిబంధనలో షెడ్యూల్డు కులాల వారికి ఇచ్చిన మినహాయింపులు వేటినీ రద్దుపరచకూడదు.

(ఈ) ఖాళీలను భర్తీచేసే పద్ధతి 1942, 1946 సంవత్సరాలలో భారత ప్రభుత్వం జారీచేసిన నిబంధనలలో విధించిన నియమావళికి అనుగుణంగా ఉండాలి.

(ఉ) ప్రతి పబ్లిక్ సర్వీస్ కమీషన్‌లోనూ లేదా ఖాళీలను భర్తీ చేయటానికి ఏర్పాటు చేసిన సంఘంలోనూ షెడ్యూల్డు కులాల వారికి కనీసం ఒక ప్రతినిధి అయినా ఉండాలి.

## భాగం – II ప్రత్యేక బాధ్యతలు

భారత సంయుక్త రాష్ట్రాలు షెడ్యూల్డు కులాలవారి అభివృద్ధికోసం ఈ క్రింది ప్రత్యేక బాధ్యతలు తీసుకుంటాయి.

**అంశం 1 :**

**ఉన్నతవిద్య కోసం నిబంధనలు (వివరణకు 425వ పేజీ చూడండి)**

(1) కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు షెడ్యూల్డు కులాలవారి ఉన్నత విద్యకోసం ఆర్థిక పరమైన బాధ్యత వహించాలి. వారి బడ్జెట్టుల్లో తగిన నిబంధనలు చేసుకోవాలి. అట్టి నిబంధనలు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల విద్యాపద్దు మీద మొదటి విధింపు అయి ఉండాలి.

(2) భారతదేశంలో ఉన్న షెడ్యూల్డు కులాలవారికి సెకండరీ, కళాశాల విద్యకోసం డబ్బు ఏర్పాటు చేసుకొనే బాధ్యత రాష్ట్ర ప్రభుత్వాల మీద ఉంటుంది. ఆయా రాష్ట్ర

ప్రభుత్వాలు అవసరాలకోసం తమ వార్షిక బడ్జెట్టులో రాష్ట్రాల బడ్జెటులో షెడ్యూల్డు కులాలవారి జనాభా నిష్పత్తిని బట్టి నిబంధన చేసుకోవాలి.

(3) షెడ్యూల్డు కులాల వారికి విదేశీ విద్యకోసం డబ్బును ఏర్పాటు చేసుకొనే బాధ్యత కేంద్ర ప్రభుత్వం తన వార్షిక బడ్జెటులో సంవత్సరానికి 10 లక్షల రూపాయలను కేటాయించాలి.

(4) ఈ ప్రత్యేక గ్రాంట్లు రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్రంలోని ప్రజల ప్రాథమిక విద్యకోసం వినియోగించే ఖర్చులో షెడ్యూల్డు కులాలవారికి ఉండే హక్కుకు నష్ట దాయకం కానట్టిదిగా ఉండాలి.

అంశం 2 :

కొత్త నివాస ప్రాంతాల కోసం నిబంధన (వివరణకు 425–26 పేజీలు చూడండి)

1. భారత ప్రభుత్వ రాజ్యాంగంలో ఈ క్రింది నిబంధన ఉండాలి.

(i) రాష్ట్రానికి చెందిన సాగుచెయ్యని భూములను ప్రత్యేక గ్రామాలలో షెడ్యూల్డు కులాలకు కొత్త నివాసప్రాంతాలు ఏర్పాటుచేయటం కోసం తనధర్మకర్తృత్వం క్రింద ఉంచుకొనటానికి ఒక సెటిల్మెంట్ కమీషన్ ఉండాలి.

(ii) ఈ కొత్త నివాస స్థలాల ఏర్పాటు పథకాల అవసరాలకోసం కేంద్ర ప్రభుత్వం ప్రతి ఏటా 5 కోట్ల రూపాయిలు కేటాయించాలి.

(iii) అమ్మకానికి వచ్చే ఏ భూమినయినా కొనుగోలు చేసి ఈ అవసరాల కోసం దానిని ఉపయోగించే హక్కు ఈ కమీషన్‌కు ఉంటుంది.

## భాగం – III – రక్షణలకు , రక్షణల సవరణకు అనుమతి

**అంశం –1**

రక్షణలకు అనుమతి (వివరణకు 426–28 పేజీలు చూడండి)

భారతసంయుక్తరాష్ట్రాల రాజ్యాంగం ఈ విధంగా పొందుపరచాలి.

భారత సంయుక్త రాష్ట్రాలు నిబంధన II భాగం IV లో పేర్కొన్న రక్షణలకు రాజ్యాంగంలో ఒక స్థానం కల్పించి వాటిని భారత రాజ్యాంగ చట్టంలో ఒక భాగంగా రూపొందించాలి.

అంశం 2 :

రక్షణల సవరణ పద్ధతి (వివరణకు 428 పేజి చూడండి)

షెడ్యూల్డు కులాల వారికోసం ఉన్న నిబంధనలు ఈ క్రింది విధంగా తప్ప మార్చకూడదు, సవరించకూడదు లేదా రద్దు పరచకూడదు.

నిబంధన IV లోని భాగం IV కు లేదా దానిలో ఏ భాగానికయినా సవరణ చెయ్యాలన్నా రద్దు పరచాలన్నా కేంద్ర శాసన మండలిలో ప్రజలు ఎన్నుకున్న సభ ద్వారా ఈ క్రింద నిర్ణయించిన విధానంలో

తీర్మానం ద్వారా మాత్రమే చెయ్యాలి.

(I) సవరణకు లేదా రద్దు చేయటానికి ప్రతిపాదన ఏదైనా కేంద్రశాసనమండలిలో ప్రజలు ఎన్నుకున్న సభలో ఒక తీర్మాన రూపంలో ప్రవేశపెట్టాలి.

(II) అటువంటి తీర్మానం –

(అ) రాజ్యాంగం అమలులోకి వచ్చి పని చేయటం ప్రారంభించి 25 సంవత్సరాలు పూర్తి అయిన తర్వాతనేతప్ప,

(ఆ) అటువంటి తీర్మానం ప్రవేశపెట్టాలని అనుకుంటున్న వ్యక్తి తన ఉద్దేశాన్ని 6 నెలల గడువుకు ముందు సభకు నోటీసు ఇస్తేనే తప్ప ; ఏదీ ప్రవేశపెట్టకూడదు.

(III) అట్టి తీర్మానం ఆమోదం పొందిన మీదట, శాసనసభను రద్దుచేసి కొత్త ఎన్నికలు జరిపించాలి.

(IV) అసలు తీర్మానాన్ని పూర్వ శాసనసభ ఏ రూపంలో ఆమోదించిందో, అదే రూపంలో కొత్తగా ఎన్నికైన కేంద్ర శాసనమండలిలో ప్రవేశ పెట్టాలి.

(V) సభలోని సభ్యులలో మూడింట రెండువంతుల సభ్యులలో అధిక సంఖ్యాకులు ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా ఎన్నికైన షెడ్యూల్డు కులాలలో మూడింట రెండు వంతుల వారిలో మెజారిటీ అంగీకరిస్తే తప్ప ఆ తీర్మానం అంగీకరించినట్టు కాదు.

## భాగం IV – భారత రాష్ట్రాలలో షెడ్యూల్డు కులాల రక్షణ

భారత రాష్ట్రాలలో షెడ్యూల్డు కులాల వారికి రక్షణ (వివరణకు 428 పేజి చూడండి)

భారత సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగం కేంద్రంలోకి భారతరాష్ట్రాల ప్రవేశం ఈ క్రింది షరతులకు లోబడి ఉంటుందని విధించాలి"

"భారత సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగంలోని నిబంధన (II) లోని భాగం (IV) లో షెడ్యూల్డు కులాల వారికి సంబంధించి ఉన్న నిబంధనలు అన్నింటిని భారత రాష్ట్రాలలోని షెడ్యూల్డు కులాల వారికి విస్తరింప చెయ్యాలి భారత రాష్ట్రం రాజ్యంగంలో అటువంటి నిబంధన పెట్టుకున్నమీదటనే కేంద్రంలోనికి ప్రవేశించటానికి వీలవుతుంది.

## భాగం V – వ్యాఖ్యానం

అల్ప సంఖ్యాకులుగా షెడ్యూల్డు కులాలు (వివరణకు 428 పేజి చూడండి)

I నిబంధన II అవసరాల కోసం, షెడ్యూల్డు కులాలు 1935 భారత ప్రభుత్వ చట్టం జారీచేసిన 1936 భారత ప్రభుత్వ షెడ్యూల్డు కులాల ఉత్తరువు నిర్వచించినట్టుగా అల్పసంఖ్యా

కులుగా పరిగణించాలి..

షెడ్యూలు కులాలు నివాస మార్పు (వివరణకు 428 పేజి చూడండి) || నిబంధన || అవసరాలకోసం ఒక రాష్ట్రంలో షెడ్యూల్డు కులాలలో ఉన్న కులం, కేంద్రంలోని అన్ని రాష్ట్రాలలోను అది షెడ్యూల్డు కులంగా వ్యవహరింపబడాలి.

# అనుబంధం - I

# వివరణలతో కూడిన నోట్సు

## పీఠిక

1947 జనవరి 22 వ తేదీ బుధవారంనాడు రాజ్యాంగ సభ ఆమోదించిన లక్ష్యాల తీర్మానానికి ఈ పీఠిక రాజ్యాంగ స్వరూపాన్ని ఆకృతిని ఇస్తుంది.

## అనుచ్ఛేదం I - సెక్షన్ I

### క్లాజులు *1* నుండి *4*

ఇండియన్ యూనియన్‌లోకి ఆరువందలకు పైచిలుకుగా ఉన్న సంస్థానాలన్నీ చేరడం అనేది ఎన్నో చిక్కు ప్రశ్నలు లేవనెత్తుతున్నది. యూనియన్‌లో సంస్థానాల ప్రవేశానికి సంబంధించిన విషయం అన్నిటిలోకి అత్యంత క్లిష్టమైనది. ప్రతి సంస్థానంలో తానొక సార్వభౌమత్వ రాష్ట్రం కావాలని కోరుకుంటోంది. యూనియన్‌లోకి ప్రవేశించడానికి సంబంధించిన షరతుల కోరే హక్కు తనకే ఉండాలని కోరుకొంటున్నది. యూనియన్‌లోకి ప్రవేశించడానికి సంబంధించిన షరతులు కోరేహక్కు తనకే ఉండాలని కోరుకుంటున్నది. వనరులూ, ఆదాయము జనాభా, విస్తీర్ణమూ వీటి దృష్ట్యా భారత సంస్థానాలు వివిధతరగతులకు చెందినవిగా ఉన్నాయి. యూనియన్‌లోకి ఒక రాష్ట్రంగా అనుమతించబడే ఏ సంస్థానమైన తన సరిహద్దులలోపల శాంతి భద్రతలను కాపాడగలిగే ఆధునిక పాలనా యంత్రాంగ భారాన్ని మోయగలిగే సామర్థ్యాన్ని కలిగి ఉండి తీరాలి. ప్రజల ఆర్థిక పురోభివృద్ధికి అవసరమైన వనరులను అది కలిగి ఉండి తీరాలి లేకపోతే పెక్కు బలహీన రాష్ట్రాలతో బలహీన భారత సంయుక్త రాష్ట్రాలు పడే అవకాశం ఉంది. బలహీన రాష్ట్రాలు కేంద్ర ప్రభుత్వానికి అండగా ఉండాల్సింది పోయి, దానికీ భారమవుతాయి. అటువంటి చిన్న, బలహీన రాష్ట్రాలతో కూడిన కేంద్ర ప్రభుత్వం అత్యవసర పరిస్థితి ఏర్పడిన సమయాలలో తన పూర్తి శక్తిని కూడగట్టుకోలేదు. అందువల్ల, అంతర్గత శాంతి భద్రతలను నిర్వహించుకోగల శక్తీ, ఆధునిక పాలనా యంత్రాంగాన్ని భరించగల సామర్థ్యమూ ఉందా లేదా అనే అంశాన్ని పరిశీలించకుండా ప్రతి భారత సంస్థానాన్ని ఒక రాష్ట్రంగా యూనియన్‌లోకి అనుమతించినట్లయితే, అది భవిష్యత్తులో భారత దేశ భద్రతకు అత్యంత ప్రమాదకరంగా పరిణమిస్తుంది. ఈ ప్రమాదాన్ని నివారించడానికి ఈ అనుచ్ఛదం, సంస్థానాలను రెండు తరగతులుగా విభజించింది. (1) అర్హత గల సంస్థానాలు (2) అర్హత లేని సంస్థానాలు. యూనియన్‌లోకి సంస్థానాలను అనుమతించేందుకు అనుసరించే పద్ధతిలో మొదటి చర్యగా అర్హతగల భారత సంస్థానాల జాబితాను రూపొందించాలని ఈ అధికరణ ప్రతిపాదిస్తున్నది. యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ ఇండియా యొక్క రాజ్యాంగ సూత్రాలకు అనుగుణంగా, రాష్ట్రంలో, అంతర్గత

ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసేందుకై, కేంద్ర శాసనసభ ఆమోదించే చట్ట నిబంధనలకు అనుగుణంగా, యూనియన్‌లో ప్రవేశానికి దరఖాస్తు చేసిన పిమ్మట అర్హత పొందిన సంస్థానాన్ని యూనియన్‌లోకి అనుమతించాలని ఈ అధికరణ ప్రతిపాదిస్తున్నది. అర్హత లేని సంస్థానాల ఆధీనంలో ఉన్న భూభాగాన్ని స్టేట్స్ భారత సంయుక్త రాష్ట్రాలకు చెందిన భూభాగంగా పరిగణిస్తారు ఆ భూభాగాలను కలిపి, తగిన పరిమాణాలుగల రాష్ట్రాలుగా యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ ఇండియా, పునర్‌వ్యవస్థీకరిస్తుంది. ఈ పునర్ వ్యవస్థీకరణ జరిగేంత వరకు ఆ భూభాగాల సంస్థానాధీశులు భారత సంయుక్త రాష్ట్రాల అజమాయిషీలోనే పాలన సాగిస్తారు. భారతదేశ భూభాగాలన్నిటినీ, అవి – బ్రిటిష్ ఇండియా ప్రావిన్సుల ఆధీనంలో ఉన్నా సరే –లేక సంస్థానాల ఆధీనంలో ఉన్నాసరే లేక యూనియన్‌లో ప్రవేశించని, ఏ సంస్థాన భాగమైనా సరే – భారత భూభాగంగానే ఈ చట్టం నిర్దేశిస్తున్నది.

ఏదైనా ఒక రాష్ట్రం యూనియన్‌లోకి ప్రవేశించిన తరువాత, దాని సమగ్రతను పరిరక్షించేందుకు నాలుగో క్లాజు వీలు కల్పిస్తున్నది. ఈ క్లాజులు పేర్కొన్న నిబంధనల మేరకు తప్ప, మరేవిధంగానూ ఆ రాష్ట్రం విభజించ బడదు.

## అనుచ్ఛేదం I – సెక్షన్ II

### క్లాజులు *1,2*

స్వతంత్రప్రతిపత్తి గలిగీ, సరిహద్దులలో ఉండే, యూనియన్‌లోకి చేరేందుకు ఇష్టపడుతున్న సంస్థానాలను, విలీనం చేసుకునేందుకు భారత సంయుక్త రాష్ట్రాలు ఒకటవ క్లాజు అనుమతినిస్తుంది

అదనపు భూభాగాన్ని సంపాదించడానికీ, దానిని విలీనం చేసుకోవడానికి లేదా దానిని ప్రత్యేక ప్రాంతంగా పరిగణించడానికి, భారత సంయుక్త రాష్ట్రాలకు రెండో క్లాజు వీలు కల్పిస్తోంది.

## అనుచ్ఛేదం II – సెక్షన్ I

### క్లాజు *1*

ప్రాథమిక హక్కుల యొక్క అవసరాన్ని పాతాకొత్తా రాజ్యాంగాలన్నీ గుర్తించాయి. మన రాజ్యాంగంలో రూపొందించిన ప్రాథమిక హక్కులను విదేశాల రాజ్యాంగాలనుంచి గ్రహించడం జరిగింది. మనదేశంలో వున్న పరిస్థితులు ఏయే దేశాల్లో వున్నాయో, ముఖ్యంగా ఆదేశాల రాజ్యాంగాల్లోని ప్రాథమిక హక్కులను గ్రహించడం జరిగింది.

# అనుచ్ఛేదం II - సెక్షన్ II

## క్లాజు 1

రక్షణ వున్నపుడే, హక్కులకు వాస్తవికత వస్తుంది. హక్కులపై దాడి జరిగినపుడూ - ఆదాడిని, చట్టపరమైన పద్ధతుల ద్వారా నివారించుకోగలిగే వీలులేనపుడూ - హక్కులు ఇచ్చిగూడా ఎలాంటి ఉపయోగం వుండదు. హక్కులకు రాజ్యాంగం పూచీ యిస్తున్నపుడు, శాసనసభా కార్యనిర్వాహక వర్గాలు వాటిని, హరించకుండా నిరోధించడానికి కావలసిన నిబంధనలను కూడా రూపొందించడం అవసరమవుతుంది. సర్వసాధారణంగా ఈ బాధ్యతను న్యాయవ్యవస్థకు అప్పగిస్తున్నారు. రాజ్యాంగం పూచీ ఇచ్చిన హక్కులకు న్యాయస్థానాలను ప్రత్యేక రక్షకులుగా చేశారు.

ఈ క్లాజుకూడా అంతకు మించి మరేమీ చేయలేదు. కార్యనిర్వాహక వర్గ అధికార దుర్వినియోగంపై విచారణ జరిపే, కొన్ని అధికారాలను, న్యాయ వ్యవస్థకు దఖలు పరుస్తూ, కార్యనిర్వాహక వర్గ నిరంకుశ పాలన నుంచి, పౌరునికి రక్షణ కల్పించాలని, ఈ క్లాజు ప్రతిపాదిస్తూంది. రిట్‌లను జారీచేసే రూపంలో ఈ అధికారాన్ని న్యాయస్థానాలకు ఇచ్చారు: భారతదేశంలో వున్న హైకోర్టులకు ఈ అధికారాలు 1935 గవర్నమెంట్ ఆఫ్ ఇండియా చట్టం ద్వారానూ, దాని లెటర్స్ పేటెంట్ ద్వారానూ సంక్రమించాయి. అయితే ఈ అధికారాలు రెండు పరిమితులకు లోబడి ఉన్నాయి. లెటర్స్‌పేటెట్ ద్వారా సంక్రమించే ఈ అధికాలు ప్రెసిడెన్సీలోని పట్టణాల్లో ఉండే హైకోర్టులకు మాత్రమే వున్నాయి తప్ప అన్నింటికీ కాదు ఇది మొదటి పరిమితి. ఇక రెండవ పరిమితి ఏమిటంటే, భారత శాసనసభచేసే చట్టాలకు లోబడే ఈ అధికారాలు ఉంటాయి. మూడవది, 1935 నాటి భారత ప్రభుత్వ చట్టం ఇచ్చిన అధికారాలు పరిమితం చేయబడినాయి, బాధిత వ్యక్తులు రక్షణకు అవి సరిపోకపోవచ్చు. ఈ క్లాజు రెండు లక్ష్యాలను సాధిస్తుంది (1) ఇంగీష్ చట్టంలో ప్రిరాగటివ్ రిట్‌లుగా పేర్కొనబడుతున్న రిట్‌లను జారీచేసే అధికారాన్ని న్యాయ వ్యవస్థకు పూర్తిగా ఇస్తుంది. (2) ఏ రకంగాను, శాసనసభ ఈ అధికారాలను తగ్గించకుండా ఏ పద్ధతిలోను నిరోధిస్తుంది.

## రెండో క్లాజు

కులతత్వ భావనలు బలంగా ఉన్న వ్యక్తులు, అధికంగా ఉన్న భారతదేశం లాంటి దేశంలో, అధికారంలో ఉన్న వ్యక్తులు తమ కులానికి చెందని వారితో సమాన న్యాయంతో వ్యవహరిస్తారని ఆశించడం కష్టం. భారతదేశంలోని అంటరాని వారియెడ వివక్షత అనేది తప్పించుకోజాలని విధిరాత. 1892 నవంబరు 5 వ తేదీ నాటి మద్రాసు ప్రభుత్వ రెవెన్యూ బోర్డు యొక్క 723 వ ఉత్తరువులోని ఈ క్రింది భాగాన్ని చూ

అధికారాల చేతుల్లో షెడ్యూల్డు కులాల వారు ఎటువంటి వివక్షతకు గురిచేయబడ్డారో అవగతమవుతుంది.

134 రిపోర్టు ఇలావుంది : ఇంతకు మునుపు సూచన ప్రాయంగా తెలియచేసిన అణచివేత పద్ధతుల గురించి కొంతమేరకయినా తెలియచేయాల్సిన అవసరం ఉంది. అవిధేయులైన పరియాలను శిక్షించడానికై వారి యజమానులు ఈ కింది విధమైన పనులకు ఒడిగట్టేవారు.

(ఎ) క్రిమినల్ కోర్టులలోను, గ్రామకోర్టులలోను తప్పుడు కేసులు బనాయించడం;

(బి) పరియాలను తమ దేవాలయానికి వెళ్ళకుండా నిరోధించడానికీ, లేదా వారి పశువులను బందెల దొడ్డిలో బంధించడానికీ, పరియాలు నివసించే ప్రాంతానికి నలువైపులా ఉన్న బంజరు భూములను ప్రభుత్వం నుంచి దరఖాస్తు ద్వారా పట్టాలు సంపాదించడం;

(సి) పరియాలు ఉండే ప్రాంతాలకు సంబంధించిన ప్రభుత్వ దస్తావేజుల్లో మోసపూరితంగా మిరాసీదార్ల పేర్లను చేర్చడం;

(డి) గుడిసెలను కూల్చడం, వారి ఇళ్ళ పెరడులలోనూ, ఆవరణలోనూ వున్న చెట్టు చేమలను నాశనం చేయడం;

(ఇ) ఎంతోకాలంగా ఉపకౌలుదారులుగా ఉన్న వారికి అధీన హక్కులు ఇవ్వకుండా తిరస్కరించడం;

(ఎఫ్) పరియాల పంటలను బలవంతంగా కోసుకు పోవడమూ నిరోధించిన వారిపై దొంగతనమూ, దొమ్మి కేసులూ బనాయించడమూ;

(జి) మోసంతో తప్పుడు పత్రాలు సృష్టించి, వారిని సర్వనాశనం చేయడం

(హెచ్) వారి పొలాలకు నీరు అందకుండా చేయడం

(ఐ) భూస్వాముల బకాయిల క్రింద ఎటువంటి నోటీసు లేకుండా ఉపకౌలుదార్ల ఆస్తిని జప్తు చేయడం.

"135,. ఈ అన్యాయాలను ఎదుర్కోవడానికి సివిల్, క్రిమినల్ కోర్టులు ఉన్నాయి కదా అని అనవచ్చు. కోర్టులు ఉన్నమాట నిజమే; కాని కోర్టులకు వెళ్ళాలంటే ధైర్యం ఉండాలి; న్యాయవాదులను నియమించుకోవడానికి కోర్టు ఖర్చులు భరించడానికి తగినంత సొమ్ము ఉండాలి, కోర్టులో కేసు నడుస్తున్న సమయంలోనూ, అపీళ్ళ సమయంలోనూ, జీవనం గడవడానికి తగినన్ని వనరులు కలిగిఉండాలి. ఇటువంటి పరిస్థితులు భారత దేశపు గ్రామాల్లో లేవు. పై పెచ్చు పెక్కుకేసులు, ఎక్కువగా, మొదటి కోర్టు ఇచ్చే తీర్పు పైనే

ఆధారపడి ఉంటాయి; ఈ మొదటి కోర్టులలో ఉండే న్యాయాధికారులు కొంతవరకూ లంచగొండ్లుగానూ, భూస్వామ్య, సంపన్న వర్గాలకు చెందినవారుగానూ ఉంటారు. కేసుల విచారణలో వారు తమ వర్గానికి చెందిన భూస్వామ్య ధనికవర్గాల పట్ల సానుభూతితో వ్యవహరిస్తుంటారు.

"136. అధికారయంత్రాగం పై ఈ ధనిక, భూస్వామ్య వర్గాలకున్న పలుకుబడిని, ఎక్కువచేసి చెప్పాల్సిన అవసరమేలేదు. దేశస్థులపై వీరి ప్రభావం అత్యధికం. యూరోపియన్ల పై కూడా ఎక్కువ. క్రింది నుండి పై స్థాయి వరకూ ప్రతి ఆఫీసులోను వారి ప్రతినిధులు కుప్పతెప్పలుగా ఉన్నారు.వారి ప్రయోజనాలను దెబ్బతీసే ప్రతిపాదన రానేరాదు. ఒకవేళ అలాంటి ఏ ప్రతిపాదన వచ్చినా ప్రారంభంనుంచి దానిని అమలు చేసే వరకు ప్రతి దశలోను అధికార యంత్రాంగం పై పెద్ద ఎత్తున వత్తిడి తీసుకు వస్తారు."

శాసనసభ ద్వారా అంటరానివారు ఎదుర్కొంటున్న వివక్షతకు పంజాబ్ భూ అన్యాక్రాంత చట్టం మరొక ప్రతీక.

అంటరానివారి మాదిరిగానే, పెక్కు ఇతర మైనారిటీ కులాలు కూడా, మెజారిటీ కులం చేతుల్లో ఇటువంటి వివక్షతకు గురి అవుతుండవచ్చు. అందువల్ల, చట్టాల నియమ, నిబంధనల యొక్క ప్రయోజనాలను పౌరులందరూ పొందేందుకు వీలుగా క్లాజు 2 వంటి నిబంధనను కలిగి ఉండడం ఎంతైనా అవసరం.

1866 నాటి పౌర హక్కుల రక్షణ చట్టంలోని అంశాలను క్లాజు 2 వర్ణ వివక్షత నుండి నీగ్రోలకు రక్షణ కల్పించడానికి యునైటడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా కాంగ్రెస్ 1866 పౌరుల హక్కుల చట్టంలోని అంశాలను, తదుపరి 1875 మార్చి ఒకటవ తేదీన ఆమోదించిన చట్టంలోని అంశాలనూ పరిగణనలోకి తీసుకొని ఈ క్లాజు 2, నిబంధనలను రూపొందించడం జరిగింది.

## మూడో క్లాజు

ప్రాథమిక హక్కులనేవి నిజమైన హక్కుగా వుండాలంటే వివక్షత ప్రమాదం నుండి కూడా రక్షణ కల్పించాల్సి ఉంటుంది. నిరాఘాటంగా, విస్తృత అవకాశాలున్న భారతదేశం వంటి దేశాలలో వివక్షతకు వ్యతిరేకంగా రక్షణలు కల్పించకపోతే ప్రాథమిక హక్కులు అర్థం లేనివి అవుతాయి. నీగ్రోలపట్ల పాటిస్తున్న వివక్షత నుండి రక్షణ కల్పించే ఉద్దేశంతో యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా కాంగ్రెస్‌లో, ఇటీవల ప్రవేశపెట్టిన బిల్లు అనుసరించిన పద్ధతులను అనుసరించడమే భారతదేశంలో కూడా వివక్షతను నిరోధించడానికి మార్గం.

## నాలుగో క్లాజు

సంపదను న్యాయంగా పంచడానికి అవకాశం కల్పిస్తూ, ప్రైవేట్ వాణిజ్యానికి ఉన్న

మార్గాలను మూయకుండా, ఉత్పాదకత అత్యున్నతస్థాయికి చేరుకునేటట్లు, ప్రజలు ఆర్థిక జీవనానికి ప్రణాళిక రూపొందించే బాధ్యతను ప్రభుత్వంపై ఉంచడమే ఈ క్లాజు ప్రధాన ఉద్దేశం. సామూహిక సాగు పద్ధతిని వ్యవసాయ రంగంలో ప్రభుత్వ యాజమాన్యాన్ని నెలకొల్పాలని ఈ క్లాజు లోని ప్రణాళిక ప్రతిపాదిస్తుంది. పారిశ్రామిక రంగమందు కొద్ది మార్పులతో స్టేట్ సోషలిజాన్ని గూడా ఈ క్లాజు ప్రతిపాదిస్తున్నది. పారిశ్రామిక రంగానికి, వ్యవసాయరంగానికి అవసరమైన పెట్టుబడిని అందించే బాధ్యతను ఈ క్లాజు పూర్తిగా ప్రభుత్వంపైనే ఉంచుతోంది. ప్రభుత్వం పెట్టుబడిని అందించకపోయినట్లయితే పారిశ్రామిక రంగం కానీ, వ్యవసాయరంగం కానీ, మంచి ఫలితాలను అందించలేవు. ఒకేసారి క్రింది లక్ష్యాలను సాధించాలన్న ఉద్దేశంతో, భీమా రంగాన్ని కూడా జాతీయం చేయాలని ఈ క్లాజు ప్రతిపాధిస్తోంది. ప్రైవేటు భీమా సంస్థ కంటే జాతీయం చేయబడిన భీమా సంస్త వ్యక్తికి అత్యధిక భద్రతనిస్తుంది. ఎందుకంటే భీమా సొమ్ము చెల్లింపునకు జాతీయంచేయబడిన భీమా సంస్థ ప్రభుత్వ వనరులను హామీగా ఇస్తుంది. ఆర్థిక పథకాలకు అవసరమైన వనరులను కూడా జాతీయం చేయబడిన భీమారంగం ప్రభుత్వానికి అందిస్తుంది. అలా వనరులు అందకపోయినట్లయితే ప్రభుత్వం అత్యధిక వడ్డీకి మనీ మార్కెట్ నుండి అప్పు తీసుకోవాల్సి వస్తుంది. త్వరితగతిని భారతదేశం పారిశ్రామికీకరణ చెందాలంటే స్టేట్ సోషలిజం అనేది అత్యవసరం. ప్రైవేట్ సంస్థలు ఆ పని చేయలేవు. ఒకవేళ అవి ఆ పని చేయగలిగినా, యూరప్‌లో ప్రైవేట్ పెట్టుబడిదారీ విధానం సృష్టించిన మాదిరిగానే, భారతదేశంలో కూడా, అవి సంపద అసమానతలను సృష్టిస్తాయి. అది భారతీయులకు ఒక హెచ్చరిక కావాలి. కౌలుదారీ చట్టాలూ, కమతాల స్థిరీకరణా అనేవి నిరుపయోగమైనవే. కాకుండా శుద్ధ దండగ కూడా. వ్యవసాయరంగంలో అవి సమృద్ధిని సాధించలేవు. సొంత భూమిలేకుండా వ్యవసాయ కార్మికులుగా మాత్రమే – ఉన్న ఆరుకోట్ల అంటరాని, వారికి అవి ఏ రకంగానూ సహాయపడవు. కమతాల స్థిరీకరణ కాని కౌలుదార్ల చట్టం కాని వారి సమస్యలను పరిష్కరించ లేవు. ఈ క్లాజు ప్రతిపాదనలు సూచించిన తరహాలో ఉండే సామూహిక క్షేత్రాలు మాత్రమే వారికి సహాయపడగలవు. ఈ పద్ధతిలో హక్కుల గుత్తాధిపత్యానికి ఎవరి ప్రయోజనాలకూ తావుండదు. అందువల్ల ప్రయోజనాల దృష్ట్యా ఈ ప్రతిపాదనకు ఎటువంటి అభ్యంతరమూ ఉండాల్సిన పనిలేదు.

ఈ పథకానికి రెండు ప్రత్యేక లక్షణాలున్నాయి. ఆర్థిక జీవనంలోని కీలక రంగాలలో ఇది స్టేట్ సోషలిజాన్ని ప్రతిపాదిస్తుంది. ఇక రెండో ప్రత్యేక లక్షణమేమంటే స్టేట్ సోషలిజాన్ని ఏర్పాటు చేసే అంశాన్ని శాసన సభ ఇష్టాయిష్టాలకు ఇది వదలివేయదు. రాజ్యాంగ చట్టం ద్వారా, స్టేట్ సోషలిజాన్ని ఇది ఏర్పాటు చేస్తుంది. తర్వాత, స్టేట్ సోషలిజాన్ని, కార్యనిర్వాహక వర్గంకాని, శాసనసభకానీ తమ చర్యల ద్వారా మార్పు చేయడం వీలుపడకుండా ఇది చేస్తుంది.

రాజ్యాంగ శాస్త్రాన్ని అధ్యయనం చేసిన వారు ఈ ప్రతిపాదనకు వెంటనే తమ అభ్యంతరాన్ని తెలియ చేస్తారు. సాధారణ తరహా ప్రాథమిక హక్కుల పరిధిని ఈ ప్రతిపాదన అతిక్రమించడం లేదా? అని వారు కచ్చితంగా అడుగుతారు. కాదు అని నా సమాధానం. ఈ ప్రతిపాదన అలా ప్రాథమికహక్కుల పరిధిని అతిక్రమించినట్లు కనిపించనట్లయితే, దానికి కారణం ప్రాథమిక హక్కులకు సంబంధించి సంకుచిత అభిప్రాయాన్ని కలిగి ఉండటమే. రాజ్యాంగ శాస్త్రమంటే, ప్రాథమిక హక్కులను మాత్రమే కలిగి ఉంటుందనే సంకుచిత అభిప్రాయం దృష్ట్యా చూసినా, ఈ ప్రతిపాదన అత్యంత సమర్థనీయమైనదేనని చెప్పవచ్చు. ఎందుకంటే సమాజ ఆర్థిక నిర్మాణ స్వరూప స్వభావాలను చట్టం ద్వారా నిర్దేశించడంలో గల ఉద్దేశమేమిటి? ఇతరుల దురాక్రమణ నుంచి వ్యక్తి స్వేచ్ఛను, పరిరక్షించడమే, దాని ఉద్దేశం. ప్రాథమిక హక్కులను రూపొందించడంలో గల లక్ష్యం అదే, వ్యక్తి స్వేచ్ఛకూ, సమాజ ఆర్థిక నిర్మాణ స్వరూప, స్వభావాలకూగల సంబంధం, ప్రతి ఒక్కరికీ స్పష్టంగా గోచరించకపోవచ్చు. అయినప్పటికీ, ఆ రెండింటి మధ్యనున్న సంబంధం వాస్తవమైనది. ఈ క్రింది అంశాలను పరిగణనలోకి తీసుకున్నప్పుడు ఆ రెండిటిమధ్యనున్న సంబంధం స్పష్టంగా కనిపిస్తుంది.

రాజకీయ ప్రజాస్వామ్యమనేది నాలుగు అంశాలపై ఆధారపడి ఉంటుంది.

ఆ నాలుగు ఆధారాలు ఇవి -

1) వ్యక్తీ, ఆదీ అంతమూ కూడా

2) వ్యక్తికి కొన్ని అవిభాజ్య హక్కులు ఉంటాయి. వాటికి రాజ్యాంగం ద్వారా హామీ ఇవ్వాలి.

3) ఒక ప్రత్యేక సదుపాయం కోసం ఏవ్యక్తీ రాజ్యాంగం ద్వారా తనకు సంక్రమించిన హక్కులను వదులు కోవాల్సిన అవసరం ఉండకూడదు.

4) ఇతరులపై పెత్తనం చేసే అధికారాలను ప్రభుత్వం ప్రైవేటు వ్యక్తులకు బదలాయించ కూడదు.

వ్యక్తిగత లాభం పైనా, ప్రైవేటు వ్యాపారం పైనా, ఆధారపడ్డ సమాజ ఆర్థిక వ్యవస్థ పనితీరును అధ్యయనంచేసి ఎవరైనా సరే, పైన పేర్కొన్న ప్రజాస్వామ్య ఆధారాంశాలలో చివరి రెండింటినీ – వాస్తవానికి ఉల్లంఘించకపోయినా, ఎంతగా బలహీన పరుస్తుందో గ్రహించగలుగుతారు. జీవన భృతిని సంపాదించుకోవడం కోసం ఎంతమంది తమ రాజ్యాంగ హక్కులను వదులుకోవడం లేదు? ప్రైవేటు యజమానుల పెత్తనం క్రిందవుండడానికి ఎంతమంది తమకు తాము సిద్ధం కావడం లేదు?

ప్రాథమిక హక్కులు అనబడే వాటివల్ల ఏమైనా ఉపయోగం ఉందా, లేదా అని

నిరుద్యోగులను అడిగి చూడండి. మతస్వేచ్ఛా, సంఘంగా ఏర్పడే హక్కు, మాట్లాడే స్వేచ్ఛా, తదితర హక్కులను ఉపయోగించుకోవడం కావాలా – లేక – యూనియన్‌లో చేరే అవకాశం లేకుండా, స్థిరమైన పని గంటలు లేకుండా, ఏదో కొంత వేతనమూ, ఏదో ఒక రకమైన పనీ, కావాలా అని, నిరుద్యోగిని అడగండి. ఈ రెండింటిలో ఒక దానిని ఎంచుకోమనండి. దేనిని అతను ఎంచుకుంటాడు అనే దానిపై సందేహమెందుకు? రెండవదే అతని ఎంపిక అవుతుంది. అలాకాకుండా మరో విధంగా అతని ఎంపిక ఎలావుంటుంది? ఆకలితో మాడవలసి వస్తుందేమోనన్న భయం ఇల్లు కోల్పోతామేమోనన్న భయం, పొదుపు చేసి దాచుకున్న సొమ్ములేవైనా అంటే అవి కోల్పోవల్సి వస్తుందేమోనన్న భయం – మరొకరి దయపై ఆధారపడి బ్రతకాల్సి వస్తుందేమోనన్న భయం, – దిక్కు మొక్కులేని చావు చావాల్సి వస్తుందేమోనన్న, భయం – మొదలైన వన్నీ, వ్యక్తి, తన ప్రాథమిక హక్కుల కోసం నిలబడలేదు. ఇందువల్లనే మనుగడకు పనిచేసే సదుపాయం పొందేందుకు, నిరుద్యోగులు తమ ప్రాథమిక హక్కులను వదులుకోవలసి వస్తుంది.

మరి ఉద్యోగంలో ఉన్న వారి సంగతేమిటి? వారి స్వేచ్ఛను పరిరక్షించడానికి ప్రాథమిక హక్కులను చట్టపరంగా రూపొందించడం మినహా మరింకేమీ చేయాల్సిన పని లేదని రాజ్యాంగ శాస్త్రం తెలిసిన న్యాయవాదులు అనుకుంటారు. వ్యక్తిగత – ఆర్థిక సామాజిక వ్యవహారాలలో ప్రభుత్వం జోక్యం చేసుకోకుండా ఉన్నప్పుడు మిగిలిందంతా స్వేచ్ఛేకదా అని వారు వాదిస్తారు. ప్రభుత్వ జోక్యాన్ని వీలైనంత విస్తృత పరచడమే కర్తవ్యమని వారంటారు. ప్రభుత్వం జోక్యం చేసుకొనని చోట స్వేచ్ఛఉండేమాట నిజమే. అయితే అక్కడితో ఈ సమస్య సమిసి పోదు, సమాధానం చెప్పాల్సిన మరో ప్రశ్న మిగిలే ఉంటుంది. ఈ స్వేచ్ఛ ఎవరి కొరకు? ఎవరికోసం? భూస్వాములు తమ కౌలును పెంచుకోవడానికి, పెట్టుబడిదారులు వేతనాలను తగ్గించడానికి, పని గంటలను పెంచడానికే ఈ స్వేచ్ఛ అన్న విషయం సుస్పష్టం. ఈ స్వేచ్ఛ వారికే ఉపయోగపడుతుంది. మరొకవిధంగా కాదు.

హెచ్చు సంఖ్యలో శ్రామికులను ఉపయోగిస్తూ క్రమం తప్పకుండా నిర్ణీత సమయాల్లో పెద్ద సంఖ్యలో మూకుమ్మడిగా వస్తువులను ఉత్పత్తి చేసే ఆర్థిక వ్యవస్థలో నియమాలను రూపొందించడం అవసరం. అప్పుడే శ్రామికులు పనిచేస్తారు, పరిశ్రమలు నడుస్తాయి. ప్రభుత్వం కనుక ఆ నియమాలను రూపొందించనట్లయితే, ప్రైవేటు యజమాని ఆ పని చేస్తాడు. లేక పోతే మనుగడ అసాధ్యమవుతుంది. మరో మాటలో చెప్పాలంటే ప్రభుత్వ అధీనం నుంచి స్వేచ్ఛ లభించటం అంటే ప్రైవేటు యజమాని నియంతృత్వంలోకి పోతున్నట్లే అనుకోవాలి.

అటువంటిది సంభవించకుండా నిరోధించడ మెలా? జీవన హక్కూ, జీవించే హక్కు

స్వేచ్ఛగా, వుండే హక్కు, ఆనందాన్ని పొందే హక్కు మొదలైన ప్రాథమిక హక్కుల విషయంలో వంచనకు గురికాకుండా ఉద్యోగులను, నిరుద్యోగులనూ రక్షించడ మెలా. ప్రజాస్వామ్య దేశాలు అనుసరిస్తున్న ప్రయోజనకర పద్ధతి యేమిటంటే – రాజకీరంగంలో, హేతుబద్ధం కాని, ఆంక్షలను విధించకుంటే ప్రభుత్వాధికారాలను కుదించడం – శాసనాధికారం ద్వారా, ఆర్థికరంగంలో, బలవంతులు బలహీనులపై, హేతుబద్ధంగాని ఆంక్షలను విధించకుండా నిరోధించడం అనేవి.

ఈ పథకపు లోపాలూ, వైఫల్యాలూ బాగా స్పష్టంగా నిరూపించబడినది. శాసనమిచ్చిన అధికారాలను, బలహీనులు, విజయవంతంగా ఉపయోగించుకోగలరనేది సందేహాస్పదమైన అంశం. పయోజన ఓటింగ్ వ్యవస్థలో కూడా, ప్రభుత్వాలనూ శాసనసభలనూ అన్నిటినీ – బలవంతులే నియంత్రిస్తుంటారు వాస్తవం దృష్ట్యా – స్వేచ్ఛను హరిస్తున్నవారినుంచి రక్షణకోరే బలహీనులు శాసనసభను అర్థించడం నిరర్థకం. అందువల్లనే ఈ క్లాజులోని పథకం సరికొత్త మార్గాన్ని ఎంచుకుంది. హేతుబద్ధంగాని ఆంక్షలను విధించకుండా ప్రభుత్వాన్ని అదుపుచేయడం మాత్రమేకాదు, ప్రజల ఆర్థిక జీవనంపై బలవంతులకు గల పట్టును తొలగించడం ద్వారా బలహీనులపై బలవంతులు హేతుబద్ధం గాని ఆంక్షలు విధించే అవకాశాలను పూర్తిగా తుడిచిపెట్టాలని కూడా ఈ క్లాజులోని పథకం ప్రయత్నిస్తున్నది. బలహీనుల స్వేచ్ఛలపైనా, హక్కులపైనా బలవంతులు దాడి చేయకుండా నిరోధించడానికి ఈ ప్రతిపాదనలోని, పథకమే సమర్థవంతంగా పనిచేస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఈ అంశాల దృష్ట్యా చూసినప్పుడు ఈ ప్రతిపాదన పూర్తిగా వ్యక్తి స్వేచ్ఛను పరిరక్షించే ప్రతిపాదనే అని అర్థమవుతుంది. అందువల్ల ఇది రాజ్యాంగ శాస్త్ర సాధారణ పరిధిని, శాస్త్ర పరిధిని అతిక్రమిస్తున్నదని రాజ్యాంగ నిపుణుడైన ఏ న్యాయవాదీ దీనికి అభ్యంతరం చెప్పలేరు.

ఇంతవరకూ ఈ పథకాన్ని కేవలం స్వేచ్ఛను పరిరక్షించే మార్గంగానే పరిగణించాం. అయితే ఈ పథకంలో గమనించదగిన ముఖ్యమైన అంశం మరొకటి ఉంది. అదేమంటే, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని తోసి పుచ్చకుండానే ఈ పథకం స్టేట్ సోషలిజాన్ని ఏర్పరచేందుకు ప్రయత్నిస్తుంది. అంతేకాదు. స్టేట్ సోషలిజాన్ని ఏర్పాటుచేసే బాధ్యతను, పూర్తిగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఇష్టానిష్టాలకు వదలివేయడు. స్టేట్ సోషలిజం విమర్శకులూ, దాని అభిమానులూ కూడా స్టేట్ సోషలిజాన్ని దేశ రాజ్యాంగ చట్టంలో భాగంగానే ఎందుకు చేయాలి అని అడిగి తీరుతారు. స్టేట్ సోషలిజాన్ని ఏర్పాటుచేసే బాధ్యతను సాధారణ శాసనపరిధికి వదిలి వేయకపోవడానికి గల కారణమేమిటో అర్థం చేసుకోవడమేమంత కష్టంకాదు. ప్రణాళికా బద్ధమైన ఆర్థిక వ్యవస్థ విజయవంతమవడానికి కావల్సిన ఒక అవసర నియమమేమంటే, అది మధ్యలో నిలిపివేయటానికి కానీ, రద్దు చేయటానికికానీ అవకాశముండకూడదు అన్నది. శాశ్వతమైనదై ఉండాలి. ఈ శాశ్వతత్వం ఎలా సాధించడమన్నదే ప్రశ్న. పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రభుత్వంలో దానిని సాధించలేము.

పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలో అప్పుడున్న మెజారిటీ నిర్ణయించిన విధానమే శాసనసభా విధానమూ, కార్యనిర్వాహకవర్గ విధానమూ, అవుతాయి. పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలో ఒక ఎన్నికల్లో వచ్చిన మెజారిటీ – పారిశ్రామిక, వ్యవసాయరంగాల్లో స్టేట్ సోషలిజానికి అనుకూలంగా ఉండవచ్చు. ఆ తరువాత ఎన్నికల్లో వచ్చిన మెజారిటీ దానికి వ్యతిరేకంగా ఉండవచ్చు. స్టేట్ సోషలిజానికి వ్యతిరేకంగా వున్న ప్రభుత్వం అధికారంలోకి వచ్చినపుడు – అంతకు ముందూ స్టేట్ ప్రభుత్వం ఇది వరకు చేసిన చట్టాన్ని రద్దుచేయవచ్చు. మరలా స్టేట్ సోషలిజం అనుకూలురు అధికారంలోకి వచ్చినప్పుడు వారుకూడా తమకు గల చట్టాలను చేసే అధికారాన్ని ఉపయోగించి వ్యతిరేకులు రద్దు చేసిన పనిని పునరుద్ధరించ వచ్చు. సమాజ ఆర్థిక నిర్మాణాన్ని స్టేట్ సోషలిజం నమూనాపై నిర్మించాలనుకునేవారు, అటువంటి అత్యంత ప్రాథమిక లక్ష్యాన్ని సాధించే అంశాన్ని సాధారణ చట్టానికి వదలివేయ కూడదని గ్రహించాలి. స్వల్ప మెజారిటీతో సాధారణ చట్టాలను రూపొందించవచ్చు. లేదా రద్దుచేయవచ్చు. ఈ స్వల్ప మెజారిటీతో నిర్ణయించే రాజకీయ భవిష్యత్తు ఎప్పుడూ సహేతుక కారణాలపై ఆధారపడి ఉంటుందని చెప్పలేము. ఈ కారణాల దృష్ట్యా స్టేట్ సోషలిజం లక్ష్యాన్ని సాధించేందుకు రాజకీయ ప్రజాస్వామ్యం తగినదిగా కనిపించదు.

మరి ప్రత్యామ్నాయమేమిటి? నియంతృత్వమే దీనికి ప్రత్యామ్నాయం. స్టేట్ సోషలిజం విజయవంతమవడానికి అత్యవసరమైన శాశ్వతత్వం అనే పరిస్థితిని నియంతృత్వం కలిగిస్తుందనడంలో ఎటువంటి సందేహం లేదు. అయితే నియంతృత్వం విషయంలో ఎదుర్కోవాల్సిన వాస్తవ మొకటి ఉంది. వ్యక్తి స్వేచ్ఛపై విశ్వాసమున్నవారంతా స్వేచ్ఛాయుత సమాజానికి పార్లమెంటరీ ప్రజాస్వామ్య స్వరూపం కలిగిన ప్రభుత్వమే సరైనదని, అదే అమలులో ఉండాలని గట్టిగా కోరుకుంటారు. నియంతృత్వాన్ని బలంగా వ్యతిరేకిస్తారు. ఎందుకంటే, నియంతృత్వంలో కాకుండా పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోనే వ్యక్తి స్వాతంత్ర్యం సాధ్యమవుతుందని వారు భావిస్తారు గనక. అందువల్లనే స్వేచ్ఛ ఉండాలని కోరుకునేవారు ఒక ప్రభుత్వ స్వరూపంగా, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని, వదులుకోవడానికి సిద్ధపడరు. స్టేట్ సోషలిజం కావాలని వారికి ఎంత ఆత్రం ఉన్నప్పటికీ పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి బదులుగా నియంతృత్వాన్ని కోరుకోవడానికి వారు సిద్ధం కారు. అటువంటి మార్పువల్ల పొందే లాభం స్టేట్ సోషలిజమే అయినప్పటికీ వారు దానికి సిద్ధపడరు. అంచేత నియం తృత్వం లేకుండా పార్లమెంటరీ ప్రజాస్వామ్యంతో స్టేట్ సోషలిజాన్ని కలిగి ఉండటమెలా అనేదే సమస్య. పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని అట్టేపెట్టుకుని, రాజ్యాంగ చట్టం ద్వారా స్టేట్ సోషలిజాన్ని నిర్దేశించుకోవడమే ఈ సమస్యకు పరిష్కార మార్గంగా కనిపిస్తోంది. అప్పుడు స్టేట్ సోషలిజాన్ని రద్దుచేయడానికి, సవరించడానికీ, తాత్కాలికంగా నిలిపివేయడానికీ పార్లమెంటరీ మెజారిటీకి అవకాశం ఉండదు. ఈ పద్ధతి ద్వారా మాత్రమే సోషలిజాన్ని ఏర్పాటు చేయడమూ, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని కలిగి ఉండటమూ, నియంతృత్వాన్ని

నిరోధించడమూ అనే మూడు లక్ష్యాలను సాధించగలుగుతాము. సమాజ ఆర్థిక నిర్మాణాల జోలికి పోకుండా రాజకీయ వ్యవస్థ స్వరూపాన్ని నిర్దేశించడాన్ని మాత్రమే లక్ష్యంగా కలిగిన ప్రస్తుత రాజ్యాంగాలకు ఈ ప్రతిపాదన భిన్నంగా ఉంటుంది. ఆర్థిక వ్యవస్థలోంచి పుట్టుకు వచ్చే శక్తులు రాజకీయ వ్యవస్థను పూర్తిగా మార్చ గలవు. నియంతృత్వం లేకుండా పార్లమెంటరీ ప్రజాస్వామ్యంతో సోషలిజం కావాలని కోరుకునే వారంతా ఈ ప్రతిపాదనను ఆహ్వానించవలసిందే.

ఒక వ్యక్తి, ఒక విలువ అనే సిద్ధాంతం ప్రజాస్వామ్యానికి కీలకమైంది. కాని దుర దృష్టవశాత్తు రాజకీయ వ్యవస్థకు సంబంధించినంతవరకు మాత్రమే ప్రజాస్వామ్యం ఈ సిద్ధాంతాన్ని అమలుపరచింది. ఒక వ్యక్తి, ఒక ఓటు అనే సూత్రాన్ని అమలుచేసి అదే ఒక వ్యక్తి, ఒక విలువ అనే అంశంగా మారుతుందని భావించింది. ఆర్థిక వ్యవస్థకు ఒక స్వరూపం ఇచ్చే బాధ్యతను దీనిని తమకనుకూలంగా మార్చుకో గలిగే స్థితిలో ఉన్న వారికే వదలివేసింది. ప్రజల పట్ల ప్రభుత్వ నిరంకుశత నిరోధించి, ఆ ప్రభుత్వం ప్రజలకు జవాబుదారీగా ఉండే రాజ్యాంగ చట్టాన్ని రూపొందించడమే ప్రజాస్వామ్యానికి అవసరమైన, సరైన రాజ్యాంగం అన్న పాతకాలపు అభిప్రాయం రాజ్యాంగ నిపుణులైన న్యాయవాదులలో ఎక్కువగా ఉండటం వల్లనే ఇలా జరిగింది. అందువల్లనే ప్రజాస్వామ్య దేశాలుగా చలామణి అవుతున్న దేశాలకు సంబంధించిన రాజ్యాంగ చట్టాలన్నీ వయోజన ఓటింగు, ప్రాథమిక హక్కుల దగ్గరే ఆగిపోతాయి ప్రజాస్వామ్య రాజ్యాంగ చట్టం అనేది వయోజన ఓటింగూ, ప్రాథమిక హక్కుల పరిధిని, దాటి విస్తరించాలన్న భావన దిశగా అవి ఎప్పుడూ పురోగమించలేదు. మరో మాటలో చెప్పాలంటే, సమాజ రాజకీయ వ్యవస్థ స్వరూప స్వభావాలను నిర్దేశించడం మాత్రమే రాజ్యాంగ చట్ట విధీ, పరిధీ అని పాతకాలపు రాజ్యాంగ నిపుణులైన న్యాయవాదులు విశ్వసించేవారు. ఒక వ్యక్తి, ఒక విలువ అన్న సూత్రానికి అనుగుణంగా ప్రజాస్వామ్యం మనగలగాలి అంటే – రాజకీయ వ్యవస్థతో పాటుగా ఆర్థిక వ్యవస్థ స్వరూప, స్వభావాలను నిర్దేశించడం కూడా అంతే అవసరమన్న విషయాన్ని వారెన్నడూ గ్రహించలేదు. రాజ్యాంగ చట్టం ద్వారా సమాజ రాజకీయ వ్యవస్థ, అదే విధంగా ఆర్థిక వ్యవస్థ స్వరూప, స్వభావాలను నిర్వచించే సాహసమైన చర్య తీసుకోవాల్సిన సమయం ఆసన్నమైంది. రాజ్యాంగాన్ని రూపొందించే రంగంలోకి ఆలస్యంగా అడుగుపెట్టిన భారతదేశంలాంటి దేశాలన్నీ, ఇతర దేశాల తప్పిదాలను, అనుకరించకూడదు. తమ ముందటి వారి అనుభవాలనుంచి వారు ప్రయోజనం పొందాలి.

## అనుచ్ఛేదం II – సెక్షన్ II

### ఒకటో క్లాజు

కేంద్రంలోను, రాష్ట్రాలలోను ఉండే కార్య నిర్వాహక వ్యవస్థను, రూపొందించడంలో

1919, 1935 నాటి భారత ప్రభుత్వ చట్టాలు అనుసరించిన నమూనా, బ్రిటిష్ తరహా నమూనా. దీనినే రాజ్యాంగ నిపుణులైన న్యాయవాదులు పార్లమెంటరీ తరహా కార్యనిర్వాహక వర్గమని పేర్కొంటారు. ఈ బ్రిటిష్ తరహాకు విరుద్ధంగా ఉండే అమెరికా కార్యనిర్వాహక వర్గాన్ని పార్లమెంటేతర కార్యనిర్వాహకవర్గమని అంటారు. 1919, 1935 చట్టాలు అనుసరించిన కార్యనిర్వాహక వర్గ నమూనాను కొనసాగించాలా లేక దానిని రద్దు చేయాలా? దానిని రద్దు చేసినట్లయితే ఆ స్థానంలో ఏ నమూనా అనుసరించాలి అనేదే ప్రశ్న. ఈ సమస్య పై అంతిమ అభిప్రాయం తెలియచేసే ముందు, బ్రిటిష్ తరహా కార్యనిర్వాహక వర్గానికున్న ప్రత్యేక లక్షణాలనూ, దానిని భారతదేశంలో అమలు చేస్తే కలిగే ఫలితాలనూ, తెలుసుకోవడం శ్రేయస్కరం. ఈ క్రింద పేర్కొన్న వాటిని, పార్లమెంటరీ లేదా బ్రిటిష్ తరహా కార్యనిర్వాహక వర్గానికున్న ప్రత్యేక లక్షణాలుగా చెప్పుకోవచ్చు.

(1) ఇది, శాసన సభలో మెజారిటీ సంపాదించిన పార్టీకి ప్రభుత్వాన్ని ఏర్పరచే హక్కును ఇస్తుంది.

(2) ఇది, తమ పార్టీకి చెందని వ్యక్తులను ప్రభుత్వంలో చేర్చుకోకుండా ఉండే హక్కును మెజారిటీ పార్టీకి ఇస్తుంది.

(3) అలా ఏర్పడిన ప్రభుత్వం శాసనసభలో మెజారిటీని కలిగి ఉన్నంతవరకూ అధికారంలో ఉంటుంది. అది మెజారిటీని కోల్పోయినట్లయితే, అప్పుడున్న శాసనసభ నుండి ఏర్పడే మరో ప్రభుత్వానికి అనుకూలంగా కాని, లేదా కొత్తగా ఎన్నికయ్యే శాసనసభ నుంచి ఏర్పడే ప్రభుత్వానికి అనుకూలంగా కాని రాజీనామా చేయవలసి ఉంటుంది.

ఈ బ్రిటిష్ తరహా కార్యనిర్వాహక వ్యవస్థనే భారతదేశంలో అమలు చేసినట్లయితే అప్పుడు కలిగే ఫలితాలు ఈ క్రింది విధంగా ఉంటాయని చెప్పుకోవచ్చు.

(1) మెజారిటీ అంటే, రాజకీయ మెజారిటీయే అన్న అంశంపై బ్రిటిష్ తరహా, మెజారిటీ పార్టీ క్యాబినెట్, ప్రభుత్వం, ఆధారపడి ఉంది కాని భారతదేశంలో మెజారిటీ అంటే కులపరమైన మెజారిటీయే. పార్టీ రాజకీయ, సామాజిక కార్యక్రమం ఏదైనప్పటికీ అది తన కులపరమైన మెజారిటీ లక్షణాన్నే కలిగి ఉంటుంది. ఈ వాస్తవాన్ని ఏదీ మార్చజాలదు. ఈ వాస్తవం దృష్ట్యా భారతదేశంలో బ్రిటిష్ తరహా వ్యవస్థను అనుసరించినట్లయితే, కార్యనిర్వాహకవర్గ అధికారాన్ని శాశ్వతంగా మెజారిటీ కులం చేతిలో పెట్టినట్లవుతుంది.

(2) మైనారిటీ పార్టీ ప్రతినిధులను కాబినెట్‌లో తప్పనిసరిగా చేర్చుకోవాలన్న నిబంధనను మెజారిటీ పార్టీపై బ్రిటిష్ ప్రభుత్వ వ్యవస్థ విధించదు. ఈ సూత్రాన్ని భారతదేశానికి వర్తింపచేసినట్లయితే దాని ఫలితాలెలా ఉంటాయన్నది స్పష్టమే. అది మెజారిటీ కులాన్ని పాలక వర్గంగాను, మైనారిటీ కులాన్ని పాలిత జాతిగాను మారుస్తుంది. అంటే, మైనారిటీలకు

ఏదీ మంచిదని - మెజారిటీలకు లాభాలిస్తుందో, ఆ ఆలోచనలకు/అనుగుణంగా అది యదేచ్ఛగా పాలన సాగిస్తుంది. అటువంటి పరిస్థితి ఉన్న వ్యవస్థను ప్రజాస్వామ్యమని పిలవలేము. దానిని సామ్రాజ్యవాదమనే పిలవాలి.

ఈ ఫలితాల దృష్ట్యా చూసినప్పుడు, బ్రిటిష్ తరహా కార్యనిర్వాహక వ్యవస్థను, భారతదేశంలో ప్రవేశపెట్టినట్లయితే, అది మైనారిటీలకూ - ప్రత్యేకించి అంటరానివారికీ - ప్రమాదకరంగా, పరిణమిస్తుంది. వారి స్వాతంత్ర్యానికీ, జీవన విధానానికీ, సుఖసంతోషాలకూ, కంటక ప్రాయమవుతుందన్నది కూడా స్పష్టం.

అంటరానివారు ఎదుర్కోవలసిన సమస్య అతి ఉగ్రమైనది. అది అంటరానివారి పట్ల ద్వేషభావం కలిగిన విస్తృత హిందూజన సమూహం అంటరానివారి చుట్టూ ఉంది. అది వారిపై అత్యాచారాలు చేయటానికి, వారిపట్ల అసమానత పాటించడానికి ఏ మాత్రమూ సిగ్గుపడదు. నిత్యకృత్యాలుగా ఉండే ఈ అత్యాచారాలనుంచి రక్షణ పొందడానికి, ఈ అన్యాయాలనుంచి న్యాయం పొందడానికీ అంటరానివారు పాలనా యంత్రాంగ సహాయాన్ని పొందవలసి వస్తూవుంటుంది. ఈ పాలనా యంత్రాంగం మార్పు, స్వభావమూ ఏమిటి? క్లుప్తంగా చెప్పాలంటే, భారతదేశంలో పాలనా యంత్రాంగం పూర్తిగా హిందువుల చేతిలో ఉంది. అది వారి గుత్తస్వామ్యం. పై నుండి కింది వరకూ అది వారి నియంత్రణలో ఉంటుంది. వారి ఆధిపత్యం లేని ప్రభుత్వశాఖ ఒకటికూడా లేదు. పోలీసు శాఖ వారి ఆధిపత్యంలోనే ఉంటుంది. న్యాయశాఖ, రెవిన్యూశాఖ, ఒకటేమిటి, పాలనా యంత్రాంగంలోని ప్రతిశాఖలోను వారిదే ఆధిక్యత. గుర్తుంచుకోవాల్సిన మరో అంశమేమంటే, పాలనా యంత్రాంగం వెలుపల ఉన్న హిందువులకు, అంటరాని వారిపట్ల ఏ రకమైన ద్వేషభావమూ, సాంఘిక అసమానతా భావమూ, ఉన్నాయో పాలనా యంత్రాంగంలో ఉన్న హిందువులకు కూడా అదే దృక్పధం ఉంది. అంటరానివారికి వ్యతిరేకంగా వివక్షత పాటిస్తూ, చట్టం ఇచ్చే ప్రయోజనాలనూ, లాభాలనూ నిరోధించడమే కాకుండా, అణచివేత నుంచి, నిరంకుశత్వం నుంచి చట్టం కల్పించే రక్షణలు కూడా అంటరానివారికి దక్కకుండా చేయడమే వారి లక్ష్యం. తత్ఫలితంగా హిందూ జనాభాకూ హిందూజనసామాన్యం, అంటరానివారికి అన్యాయాలు చేసేవారయితే - ఆ విధంగా అన్యాయాలకు గురి అయినవారికి హిందూ పాలనా యంత్రాంగం, ఆ బాధితులకు సహాయాన్ని అందించే బదులు, నేరస్థులకు రక్షణ కల్పిస్తుంది.

ఈ నేపధ్యంలో, స్వరాజ్యం అంటే అంటరానివారికి ఒరిగే దేమిటి? అంటే వారికి అర్థమయ్యేది ఒకటే. ప్రస్తుతం పాలనా యంత్రాంగం మాత్రమే హిందువులచేతుల్లో ఉంది అని స్వరాజ్యంలో శాసన సభా, కార్య నిర్వాహక వర్గమూ కూడా హిందువుల చేతుల్లో ఉంటాయి అని, అటువంటి స్వరాజ్యం అంటరానివారి బాధలను మరింతగా పెంచుతుందని వేరే చెప్పాల్సిన పనిలేదు. ఎందుకంటే ప్రతికూల భావాలతో వున్న పాలనా యంత్రాంగానికి

ఏ మాత్రమూ, పట్టించుకోని శాసనసభా, మొద్దుబారిన కార్యనిర్వాహక -వర్గమూ కూడా తోడవుతాయి. దాని ఫలితమేమవుతుందంటే, శాసనసభా, కార్యనిర్వాహక వర్గాలనియంత్రణ లేక పోవటంవల్ల పాలనా యంత్రాంగం, తన విషపూరితమైనటువంటి, కాఠిన్యంతో కూడినటువంటి, వివక్షతాధోరణి, అంటరానివారియెడ నిరాటంకంగా కొనసాగించవచ్చు.

మరో విధంగా చెప్పాలంటే, స్వరాజ్యంలో హిందూమతం చేత, హిందువుల చేతా, విధింపబడిన హీనత్వం నుండి, అంటరానివారు బయటపడేమార్గం వుండదు.

బ్రిటిష్ తరహా కార్యనిర్వాహక వర్గ వ్యవస్థను ప్రవేశపెట్టడానికి వ్యతిరేకంగా ఉన్న ప్రత్యేక కారణాలు ఏమిటంటే అవి మైనారిటీల, షెడ్యూలు కులాల ప్రయోజనాల దృష్టితోనే అయితే బ్రిటిష్ తరహా క్యాబినెట్ వ్యవస్థను ప్రవేశపెట్ట గూడదనడానికి మరొక సాధారణ పరిశీలనాంశం కూడా ఉంది. బ్రిటిష్ క్యాబినెట్ వ్యవస్థ, బ్రిటిష్ ప్రజలకు, చాలాస్థిరమైన ప్రభుత్వాన్ని అందించిందని నిస్సందేహంగా చెప్పవచ్చు. అయితే భారతదేశంలో కూడా అది స్థిరమైన ప్రభుత్వాన్ని అందించగలదా? అన్నదే ప్రశ్న. అందుకుగల అవకాశాలు బహుస్వల్పం. భారతదేశంలో ఉన్న కుల, మత ఘర్షణల దృష్ట్యా శాసనసభలో పార్టీలూ, గ్రూపులూ ఇబ్బడి ముబ్బడిగా ఉండే అవకాశాలే ఎక్కువగా వుంటాయి. అదే క్రమంక జరిగితే, ఇంగ్లాండ్ లో మాదిరిగానే శాసనసభలో వ్యతిరేక ఓటు వచ్చినప్పుడుల్లా తప్పనిసరిగా రాజీనామాచేసే కార్యనిర్వాహక వర్గం లాంటిదే భారతదేశంలో కూడా ఉంటే అప్పుడు భారతదేశం కార్యనిర్వాహక వర్గ అస్థిరత్వంతో ఇబ్బంది పడే అవకాశం ఉంది. ఎందుకంటే, తరచుగా, ఏకీకరణ, పునరేకీకరణ చెందడమన్నది పార్టీలకూ, గ్రూపులకూ చాలా సులభమైన విషయం. అల్పమైన విషయాలపై కలిసిపోతూ, మళ్ళీ విడిపోతూ ప్రభుత్వాన్ని పతనం చేస్తారు ప్రధాన పార్టీలు అని అనబడుతున్నవాటి మధ్య ప్రస్తుతమున్న సంఘీభావం ముందు ముందూ కొనసాగుతుందని ఊహించడానికి వీలు లేదు. భారతదేశంలో బ్రిటీష్‌వారి సమస్య ఒక సారి పరిష్కారమయిందీ అంటే ఇక ఈ ప్రధాన పార్టీల మధ్యనున్న సంఘీభావం మటుమాయమవుతుంది. నిరంతరంగా ప్రభుత్వాలను పతనం చేస్తూ పోవడమంటే అది అరాచకం కంటే తక్కువైనదేమీ కాదు. ఈ పరిస్థితికి ప్రస్తుత రాజ్యాంగంలోని 93వ సెక్షన్ విరుగుడును కల్పిస్తోంది. అయితే స్వతంత్ర భారత రాజ్యాంగంలో 93వ సెక్షనుకు ఇమడదు. కాబట్టి 93వ సెక్షను ఏదో ఒక ప్రత్యామ్నాయాన్ని రూపొందించుకోవాలి.

ఈ అంశాలన్నిటినీ పరిగణనలోకి తీసుకుని పరిశీలిస్తే బ్రిటిష్ తరహా కార్యనిర్వాహక వర్గ వ్యవస్థ భారతదేశానికి ఏ మాత్రమూ సరిపోయేది కాదని నిస్సందేహంగా చెప్పవచ్చు.

క్లాజు-1 లో ప్రతిపాదించిన కార్యనిర్వాహకవర్గం ఈ క్రింది ప్రయోజనాలను సాధించడానికి ఉద్దేశించబడింది.

(1) ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసే విషయంలో తమ అభిప్రాయాలను తెలియచేసే అవకాశం

మైనారిటీలకు ఇవ్వకుండా మెజారిటీయే ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడాన్ని నిరోధించడం.

(2) పాలనాయంత్రాంగంపై మెజారిటీకి సంపూర్ణ ఆధిపత్యం లేకుండా నిరోధించి తద్వారా మెజారిటీ నిరంకుశత్వానికి మైనారిటీలు గురిఅయ్యే అవకాశాలు లేకుండా చేయడం.

(3) మైనారిటీల విశ్వాసం పొందని మైనారిటీ ప్రతినిధులను, ప్రభుత్వంలో చేర్చుకోకుండా మెజారిటీని అడ్డుకోవడం.

(4) సమర్థవంతమైన, చక్కని పాలనను అందించేందుకు అవసరమైన సుస్థిర కార్యనిర్వాహక వర్గాన్ని అందించడం

ఒక నమూనాగా, ఈ క్లాజు అమెరికా తరహా కార్యనిర్వాహక వర్గాన్ని భారతదేశ పరిస్థితులకు అనుగుణంగా, ప్రత్యేకించి మైనారిటీల అవసరాలకు అనుగుణంగా, వర్తింప చేస్తుంది బాధ్యతాయుత ప్రభుత్వం, అన్న సూత్రానికి, వ్యతిరేకంగా, ఉందన్న కారణంగా, - ఈ ప్రతిపాదన సూచించిన కార్యనిర్వాహక వర్గ స్వరూపానికి అభ్యంతర పెట్టే అవకాశం లేదు. బ్రిటిషు తరహా కార్యనిర్వాహక పద్ధతికి అలవాటు పడ్డ భారతీయులు – ఆ పద్ధతి ఒక్కటే, బాధ్యతాయుత ప్రజాస్వామ్య పద్ధతి కాదన్న విషయాన్ని మరచిపోతున్నారు. బ్రిటిష్ తరహా కార్యనిర్వాహక వర్గం ఎంత బాధ్యతాయుతమైనదో ఎంత ప్రజాస్వామ్య యుతమైనదో, అమెరికా తరహా కార్యనిర్వాహక వర్గం కూడా అలాంటిదే. ఒక వ్యక్తి శాసనసభకు ఎన్నికయినంతమాత్రాన అతడు మంత్రి పదవికి అర్హుడు కాదనే వాదన సరిగానే వుంది. ఎన్నికయిన శాసన సభ్యుడు మాత్రం కావాలంటే అతడు తన నియోజకవర్గ ప్రజలచేత ఆ పదవికి గూడా ఎన్నికవ్వాలనే సూత్రం బ్రిటిష్ రాజ్యాంగం చేత వంద సంవత్సరాలకు పూర్వమే గుర్తించబడి అమలులో ఉంది. పార్లమెంటు సభ్యుడు మంత్రిగా నియమితుడైనట్టయితే ఆ పదవిని చేపట్టే ముందు అతడు ఎన్నిక కావాలనే నియమం ఉండేది ఆ నియమాన్ని ఇటీవలే వదిలి వేశారు. అందువల్ల ఈ క్లాజులోని ప్రతిపాదనలు "బాధ్యతాయుత ప్రభుత్వం" అన్న సూత్రానికి అనుగుణంగా లేవని అభ్యంతరం పెట్టడానికి వీలులేదు. నిజానికి ఈ ప్రతిపాదన అమెరికా తరహా కార్యనిర్వాహక వర్గానికి మెరుగైన రూపం ఈ ప్రతిపాదన ప్రకారం కార్యనిర్వాహకవర్గ సభ్యులందరూ, శాసనసభలో కూర్చో వచ్చు. శాసనసభలో మాట్లాడే హక్కూ ప్రశ్నలకు సమాధానాలు చెప్పే హక్కు వారికి ఉంటాయి.

## రెండో క్లాజు

దీనిలోని ప్రతిపాదన వివాదాస్పదం కాదు. మైనారిటీలకు వ్యతిరేకంగా మెజారిటీలు సాగించే నిరంకుశత్వానికీ, అణచివేతకూ సరైన విరుగుళ్లు విచారణ, ప్రచారమూ, చర్చలే.

ఈ క్లాజులో ఏర్పరచిన రక్షణలు కూడా అవే. ఇటువంటి ప్రతిపాదననే సప్రూ కమిటీ కూడా చేసింది

## మూడో క్లాజు

సవర్ణ హిందువులు అంటరానివారిపై ప్రయోగించే సంఘ బహిష్కరణ అనే ఆయుధం అంటరానివారి నెత్తిన ఎప్పుడు కత్తిలా వేలాడుతుంటుంది. అది హిందువుల చేతిలో ఉన్న ఎంత భయంకరమైన ఆయుధమో అంటరానివారికి మాత్రమే తెలుస్తుంది. ఈ వర్గాల సమస్యలను పరిశీలించడానికి 1928 లో బొంబాయి ప్రభుత్వం నియమించిన కమిటీ తన నివేదికలో సంఘ బహిష్కరణ స్వరూపాల్ని, దాని ప్రభావాల్ని చక్కగా వివరించింది. ఆ నివేదిక నుంచే ఈ కింది భాగాలను ఉటంకిస్తున్నాను. అంటరానివారిపై హిందువులు ఎంత దారుణంగా నిరంకుశత్వాన్ని అమలు చేయగలుగుతున్నారో ఆ నివేదికలోని ఈ భాగాలు అందరికీ బాగా సులభంగా అర్థమయ్యేలా వివరిస్తున్నాయి.

ఆ కమిటీ ఇలా అంటున్నది. అన్ని సార్వజనిక ప్రయోజనాల కోసమైన వాటన్నిటి లోనూ, దళిత వర్గాలవారికున్న హక్కులను, వారు వినియోగించుకోడానికై మేము ఎన్నో ప్రత్యుపాయాలను సూచించి వున్నాము. అయినప్పటికీ, వారా హక్కులను, అనుభవంలోకి తెచ్చుకోడానికి చాలా ఇబ్బందులను చాలాకాలం వరకూ ఎదుర్కోవలసి వస్తుందని మా భయం.

ఛాందస వర్గాల నుండి బహిరంగ దౌర్జన్యం ఎదుర్కోవలసి వస్తుందన్న భయమె మొదటి ఇబ్బంది. ప్రతి గ్రామంలోనూ దళిత వర్గాలు చిన్న మైనారిటీ వర్గంగా ఉంటారన్న విషయాన్ని మనం తప్పని సరిగా గుర్తుంచుకోవాలి. వీరికి వ్యతిరేకంగా పెద్ద మెజారిటీలో ఉన్న ఛాందసవర్గాలు గ్రామాల్లో ఉన్నాయి. దళిత వర్గాల నుండి దాడి జరుగుతుందేమో అని అనుకొనే భ్రమతో ఛాందసవర్గాలు ఎంతటి మూల్యం చెల్లించైనా సరే తమ ఔన్నత్యాన్నీ, ప్రయోజనాలనూ కాపాడుకోవటానికే విశ్వప్రయత్నాలు చేస్తాయి. పోలీసు కేసుల భయం, ఈ ఛాందస వర్గాల దౌర్జన్యాలకు పరిమితులు విధిస్తోంది. అందువల్లే అటువంటి ఘటనలు అరుదుగా ఉంటున్నాయి.

దళిత వర్గాల ఈనాటి ఆర్థికస్థితి రెండో ఇబ్బంది. ప్రెసిడెన్సీలోని చాలా ప్రాంతాలలో దళిత వర్గాలకు ఆర్థిక స్వాతంత్ర్యం లేదు.

కొందరు దళితులు ఛాందస వర్గాల దయపై ఆధారపడ్డ కౌలుదార్లుగా వారి భూములను సాగు చేస్తున్నారు. మరికొందరు, ఛాందస వర్గాల భూముల్లో వ్యవసాయ కార్మికులుగా పనిచేస్తూ ఆ వేతనాలపై బతుకుతున్నారు. మిగిలినవారు గ్రామసేవకులుగా పనిచేస్తూ ఆ సేవకులుగాను ఛాందస వర్గాలు ఇచ్చే ఆహారం, ధాన్యం పై ఆధారపడి

జీవిస్తున్నారు. గ్రామాల్లోని దళితులపై ఛాందస వర్గాలు తమ ఆర్థిక శక్తిని ఒక ఆయుధంగా ఉపయోగించిన అనేక ఘటనల గురించి మేము విన్నాం. దళితులు తమ హక్కులను వినియోగించుకొనే తెగువ చూపినప్పుడు ఛాందస వర్గాలు వారిని తమ భూములనుండి వెళ్ళగొట్టడం వారి నౌకరీ ఊడగొట్టి ఉపాధిలేకుండా చేయడం, గ్రామసేవకులుగా వారికి అందాల్సిన భృతిని ఆపుచేయించడం వంటి అనేక ఘటనల గురించి కూడా మేము విన్నాం. తరుచుగా ఈ బహిష్కరణ అనేది ఒక పథకం ప్రకారం విస్తృతస్థాయిలో జరుగుతోంది. నలుగురూ నడిచే బాటలను ఉపయోగించకుండా ఆపుచేయించడం వంటి చర్యలతో ఈ విస్తృత బహిష్కరణ సాగుతోంది. మాకు లభించిన సాక్ష్యాధారాలను బట్టి కొన్నిసార్లు దళితులపై సంఘ బహిష్కరణ విధించడానికి చిన్న చిన్న కారణాలేచాలునని అర్థమవుతోంది ఉమ్మడి బావిని వినియోగించుకోవడంలో దళితులు తమ హక్కులను ఉపయోగించుకోవాలని చూడడం తరుచుగా ఈ బహిష్కరణకు దారి తీస్తున్నది దళితవర్గాలకు చెందిన వ్యక్తి జంధ్యం వేసుకున్నాడనో, చిన్న మడి చెక్కను ఖరీదు చేశాడనో, మంచి దుస్తులుగాని ఆభరణాలు గాని ధరించాడనో, పెళ్ళికొడుకు గుర్రమెక్కి గ్రామవీధులగుండా ఊరేగింపుగా వెళ్లాడనో ఏదో ఒక చిన్న కారణంపై తీవ్రమైన సంఘ బహిష్కరణ విధించిన ఘటనలు కూడా తక్కువేమీ కాదు.''

ఇది 1928 నాటి మాట. ఆ దశ ఇప్పుడు అంతమైపోయిందనే భ్రమ, కూడదని చెప్పడానికి ఒక ఉదాహరణ ఇస్తున్నాను. 1947 ఫిబ్రవరిలో పంజాబ్‌లోని భేరీ జస్సోరీ గ్రామానికి చెందిన అంటరానివారు రోధక్ జిల్లా ఆర్జీనీ డిప్యూటీ కమీషనర్‌కు పెట్టుకున్న ఒక మీ ముందుంచుతున్నాను. ఆ అర్జీ నకలును వారు నాకు కూడా పంపారు. ఆ అర్జీ ఇలా ఉంది.

"రోధక్ జిలా డిప్యూటీ కమీషనర్ గార్కి,

ఫ్రమ్ రోధక్ జిల్లా, రోధక్ తాలూకా, భేరీ జస్సోరీ గ్రామ షెడ్యూల్డు కులాల ప్రజలు (చమార్లు) విన్నవించు కొనుమనవి.

అయ్యా,

భేరీ జస్సోరి గ్రామానికి చెందిన షెడ్యూల్డు కులాల ప్రజల (చమర్లు) మైన మేము ఈ గ్రామ సవర్ణ హిందూ కులాలవారి అన్యాయం పైన ఒత్తిడి, ఉపారహిత, ప్రవర్తన కారణంగా పడుతున్న కఠోర కష్టాలను, మీ దృష్టికి తెస్తున్నాం.

సుమారు నాలుగు నెలల క్రితం గ్రామ జాట్లు అందరూ గ్రామచావడిలో సమావేశమై ఇక పైనుంచీ ఒక శేరు ధాన్యం కలిగిన ఒకపంట మోపును, రోజు వేతనంగా అంగీకరిస్తూ పని చేయాల్సివుంటుందని మాకు ఒక రోజు పనికిగాను రెండు పూటలా ఆహారం, ఒక

మోపు కంకులు, ఎనిమిది అణాలు ముడుతూ వుండేవి. దీనికి బదులుగా వారు కొత్తగా నిర్ణయించిన దిన వేతనం మాకు రెండు పూటలా తిండికి కూడా చాలదు. అందుచేత మేము ఆ వేతనంపై పనిచేయడానికి తిరస్కరించాం. దాంతో వారు ఆగ్రహించి మాపై సంఘ బహిష్కరణ విధించారు. మా పశువులు అడవిలో మేయాలంటే, మేము 'పూచ్చీ' అనే సుంకాన్ని చెల్లించాలని నియమం పెట్టారు. ఇది ప్రభుత్వ నియమాల ప్రకారం విధించినది కాదు. ఆ సుంకాన్ని చెల్లించటానికి అంగీకరిస్తే తప్ప మా పశువులను అడవిలో మేపుకోకూడదన్నారు. మా పశువులు గ్రామ చెరువులో నీళ్ళు తాగేందుకు కూడా వారు అనుమతించడం లేదు. గ్రామ సేవకులు మా వీధులను ఊడవకుండా అడ్డుకున్నారు. దాంతో మేము నివసించే ప్రాంతాలలోని వీధులలో చెత్తా, చెదారం కుప్పలుగా పేరుకు పోయింది. దానిని అలాగే వదలివేసినట్లయితే మాకు రోగాలు వచ్చే అవకాశం ఉంది. మేము అత్యంత హీనమైన, లజ్జాకరమైన బతుకు గడపవల్సివస్తున్నది. మమ్మల్ని చావబాదడానికి – మా భార్యల, తోబుట్టువుల, కూతుళ్ళ పట్ల అవమానకరంగా ప్రవర్తిస్తూ మా మానమర్యాదలను మంటగలపటానికి వారెప్పుడూ సన్నద్ధులై ఉంటున్నారు మేము జుగుప్సాకరమైన బోధలు అనుభవిస్తున్నాం. పాఠశాలలకు పోయే మా పిల్లలను వారు అమానుషంగా, తీవ్రాతి తీవ్రంగా చావబాదుతున్నారు.

ఈ వాస్తవాలన్నిటినీ విన్నవించుకొంటూ గతంలో మేము తమరికొక దరఖాస్తును పంపాము కాని ఇంతవరకూ దానిపై తమరు ఎటువంటి చర్యా తీసుకోలేదని తెలియ చేయటానికి చింతిస్తున్నాం

మేమీ విషయాన్ని రోధక్ తహసీల్దారుకూ, పోలీసు ఇన్‌స్పెక్టర్‌కూ కూడా విన్నవించుకున్నాం. వారొక నిర్లక్ష్య పూరితమైన దర్యాప్తు జరిపి ఊరుకున్నారు పేదలు, అమాయకులు అయిన ప్రజల కష్టాలు తీర్చడానికి వారెటువంటి శ్రద్ధనూ చూపలేదు.

అందువల్ల తమరు దయతో ఈ విషయాన్ని పరిశీలించి వివిధ పద్ధతులలో జాట్లు చేస్తున్న బెదిరింపులను, అమానుష ప్రవర్తనను ఆపుచేయించడానికి లేదు ఒక చర్య తీసుకోవాలని అర్థిస్తున్నాం. తమరిని అర్థించడం మీరు మాకు మరో మార్గంలేదు. మానవుని జన్మహక్కు అయిన, శాంతియుతమైన, గౌరవ ప్రదమైన, జీవనం మేము గడిపేందుకు వీలుగా గౌరవనీయులైన తమరు వెంటనే చర్యలు తీసుకోగలరని ఆశిస్తున్నాం

సదా మీ విధేయ సేవకులు
రోధక్ జిల్లా, రోధక్ తాలూకా
భేరీ జస్సోరీ గ్రామ షెడ్యూలు
కులాల (చమార్లు) ప్రజలు.
(వేలి ముద్రలు)

గౌరవనీయులైన డా॥ బి.ఆర్. అంబేడ్కర్, వెస్టన్ కోర్టు, న్యూఢిల్లీ గారికి కూడా ఈ అర్జీ నకలు దాఖలు చేయడమైనది. 1947 ఫిబ్రవరి 1వ తేదీన ఆ నఖలు డా॥ అంబేడ్కర్‌కు అందింది.

1928 నాటి వాస్తవమేదైతే ఉందో అదే నేటికి కూడ, వాస్తవమని ఈ ఆర్జీ రుజువు చేస్తుంది. ఈ విషయంలో బొంబాయికి సంబంధించిన ఈ వాస్తవమే యావద్భారత దేశానికీ కూడా వాస్తవం అవుతుంది. అంటరానివారిపై హిందువులు ప్రయోగించే సంఘ బహిష్కరణకు సాక్ష్యాధారాలకోసం, గత రాష్ట్ర శాసనసభల ఎన్నికల సందర్భంగా యావద్భారత దేశంలోనూ జరిగిన ఘటనలను పరిశీలిస్తే సరిపోతుంది. సంఘ బహిష్కరణ అన్నదానిని నేరంగా చేసినప్పుడు మాత్రమే, హిందూ బానిసత్వం నుండి అంటరానివారు స్వేచ్ఛ పొందుతారు.

ఈ రోజుల్లో ఈ బహిష్కరణ ఆయుధాన్ని షెడ్యూల్డు కులాల వారితో పాటుగా ఇతర కులాలవారిపై కూడా ప్రయోగిస్తున్నారు. అందువల్ల పైనారిటీలందరి ప్రయోజనాల దృష్ట్యా ఈ రక్షణ ఉండడం అవసరం.

ఈ బహిష్కరణ నిరోధానికి సంబంధించిన నిబంధనలో 1922, బర్మా బహిష్కరణ వ్యతిరేక చట్టం నుండి యధాతధంగా గ్రహించబడినాయి.

### నాలుగో క్లాజు

ఇటు వంటి నిబంధన 1935 భారత ప్రభుత్వ చట్టం 150 సెక్షన్‌లో ఇంతకు మునుపే ఉంది.

## అనుచ్ఛేదం IV – సెక్షన్ IV

### ఒకటో క్లాజు

ఈ క్లాజులో కొత్త అంశమేలేదు. శాసన సభల్లో ప్రాతినిధ్య హక్కు పూనా ఒప్పందం అంగీకరించిందే. అయితే (1) ప్రాతినిధ్య పరిమాణం (2) ప్రాధాన్యత (3) నియోజకవర్గాల వ్యవస్థకు సంబంధించిన అంశాలను మాత్రమే పునఃపరిశీలించాల్సి ఉంది.

**1. పరిమాణం**

షెడ్యూల్డు కులాలకు పూనా ఒప్పందం అనుమతించిన ప్రాతినిధ్య పరిమాణాన్ని ఆ ఒప్పందంలోని క్లాజులో వివరించారు. (I) ఇతర కులాల మతాలవారి వాటా (II) ప్రాధాన్యతల ప్రకారం ఇతర కులాలు మతాల వారికి కేటాయించిన సీట్లూ (III) ప్రత్యేక ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకుని కేటాయించిన సీట్లూ, పోగా, మిగిలిన సీట్ల నుండి షెడ్యూల్డు కులాల వారిని పూనా ఒప్పందం సీట్లు నిర్ణయించింది. ఈవిధమైన సీట్ల

కేటాయింపు వల్ల షెడ్యూల్డు కులాల వారికి ఘోరమైన అన్యాయం జరిగింది. ప్రాధాన్యతల ప్రత్యేక ప్రయోజనాల దృష్ట్యా కేటాయించడం వల్ల కలిగిన నష్టాన్ని షెడ్యూల్డు కులాల వారి నెత్తిన కూడాను రుద్ది వుండకూడదు. పూనా ఒప్పందానికి ముందు చాలా కాలం క్రితమే కమ్యూనల్ అవార్డ్ (ఒప్పందం) ఈ కేటాయింపులు చేయడం జరిగింది. అందుచేత అప్పట్లో, ఈ అన్యాయాన్ని సరిదిద్దడం సాధ్య పడలేదు.

## 2. ప్రాధాన్యత

షెడ్యూల్డు కులాలవారు మరొక అన్యాయానికి కూడా గురవుతున్నారు. ప్రాధాన్యతల్లో తమ వాటాను పొందే హక్కుకు సంబంధించినదే ఆ అన్యాయం.

ప్రాధాన్యతల్లో హక్కు, అన్న అంశం రెండు రకాలుగా వివాదస్పదమైనది. ఒకటి, మెజారిటీ, మైనారిటీల మధ్య ప్రాధాన్యతకు సంబంధించిన వివాదం. రెండోది వివిధ మైనారిటీల మధ్య ప్రాధాన్యతలకు సంబంధించిన వివాదం.

మొదటి వివాదం ప్రాధాన్యతా సూత్రానికి సంబంధించినది. మొత్తం జనాభాలో తమ జనాభా నిష్పత్తికి మించి ప్రాతినిధ్యం పొందే హక్కు మైనారిటీలకు లేదని మెజారిటీలు పట్టుబడుతున్నారు. మెజారిటీ, ఈ నిబంధనకు ఎందుకు అంత పట్టుబడుతోందో, అర్థం చేసుకోవడం కష్టం. జనాభాలో తన నిష్పత్తి ప్రకారం ప్రాతినిధ్యాన్ని పొంది, తానెల్లప్పుడు మెజారిటీగానే ఉంటూ, మెజారిటీగా వ్యవహరించాలనేనా అది ఈ నిబంధనకు పట్టుబడు తోంది? లేక, మైనారిటీకి ఎంత ప్రాధాన్యత ఇచ్చినప్పటికీ అది మైనారిటీగానే ఉంటూ, దానిపై మెజారిటీ తన అభిప్రాయాన్ని రుద్దగలిగే పరిస్థితి ఉండాలన్న కారణంగానా! ఇందులో మొదటి కారణం, మెజారిటీ పాలన యొక్క మౌలిక, సూత్రానికి పూర్తి వ్యతిరేకతకు దారితీస్తుంది. సరిగ్గా అర్థంచేసుకుంటే మెజారిటీ నిర్ణయంతో మైనారిటీ, తనంతటతానుగా రాజీ పడాలనే దీని అర్థం. ఇది మెజారిటీ ఉద్దేశం అయ్యేందుకు వీలులేదు మరింత ఉదారంగా ఆలోచిస్తే, వీటిలో రెండో కారణాన్నే మెజారిటీ తన వాదనకు అండగా చేసుకుందని ఊహించవచ్చు. కుల పరమైన మెజారిటీ, తాను మెజారిటీగానే కొనసాగుతూ, రాజకీయ మెజారిటీ కాకపోయినా రాజకీయ మెజారిటీ పొందే సదుపాయాలన్నీ పొందాలని చూస్తున్న దృష్ట్యా, మైనారిటీకి ఎంత ప్రాధాన్యత ఇచ్చినప్పటికీ, అది మైనారిటీగానే కొనసాగుతుందని, అంగీకరించాలి. అయితే పూర్తి రాజకీయానికి – విజయం రాకపోయినా, విజయంలాంటి పరాజయానికీ – మధ్య స్పష్టమైన తేడా తప్పక ఉంటుంది. కొద్ది పరుగుల తేడాతో ఓడిపోవడానికి, కొద్ది వికెట్ల తేడాతో ఓడిపోవడానికి, ఇన్నింగ్సు తేడాతో ఓడిపోవడానికీ గలతేడా, క్రికెటర్లకు తెలుస్తుంది. ఇన్నింగ్సు తేడాతో ఓడిపోవడం పూర్తి ఆశాభంగానికి దారితీస్తుంది. కాని కొద్ది పరుగు తేడాతో ఓడిపోతే అటువంటిది ఉండదు. రాజకీయ జీవితానికి సంబంధించి, మైనారిటీలకు అటువంటి నిరాశ సంభవిస్తే, అది వారి పతనానికీ,

ఆత్మ స్థయిర్యం దెబ్బతినడానికి, దారి తీస్తుంది. అందువల్ల ఎంత మూల్యం చెల్లించైనా సరే అటువంటిది సంభవించకుండా చూడాలి. ఈ దృష్టితో చూసినప్పుడు మెజారిటీ పట్టుబడుతున్న, జనాభా నిష్పత్తి ప్రకారమే ప్రాతినిధ్యం అన్న నియమం, తప్పుడు నియమమని నిస్సందేహంగా చెప్పవచ్చు మైనారిటీలకు కావల్సింది కేవలం ఒట్టి ప్రాతినిధ్యం కాదు, వారికి కావల్సింది ఉపయుక్తమైన ప్రాతినిధ్యం.

మరి, పనికివచ్చే ప్రాతినిధ్యం అంటే ఏమిటి? తమను మింగివేసే మెజారిటీ ఉంది అన్న భావం మైనారిటీకి కలిగకుండా ఉండేందుకు తగినంత ఎక్కువ ప్రాతినిధ్యం మైనారిటీకి, ఇచ్చినపుడే అది ఉపయుక్తమైన ప్రాతినిధ్యం అవుతుంది. జనాభాలో ఒకే మైనారిటీ ఉన్నప్పుడు, దాని జనసంఖ్యా లేదు. చాలా మైనారటీలు ఉన్నప్పుడు వారందరి జనసంఖ్య, బలంగా వున్నపుడు ఉపయుక్తమైన ప్రాతినిధ్యం పొందడానికి వీలవుతుంది. జనాభాలో మైనారిటీల నిష్పత్తినే, నిర్ణీత పరిమాణంగా తీసుకుని ప్రాతినిధ్య పరిమాణాన్ని నిర్ణయించి నట్లయితే, కొన్ని చోట్ల, మైనారిటీ లేదా, మైనారిటీలన్నిటి జనాభానూ కలుపుకున్నప్పటికీ, అది ఉపయుక్తమైన ప్రాతినిధ్యాన్ని సాధించడానికి వీలుపడదు.

అటువంటి ప్రయాణం కోసం పట్టుబడడము, అంటే, మైనారిటీల రక్షణ కొరకు, మైనారిటీలకు చెందవలసిన హక్కుగా అంగీకరించిన ప్రాతినిధ్య హక్కును, అపహాస్యంపాలు చేయడమే. మైనారిటీ జనాభా తక్కువగా ఉన్న సందర్భాల్లో, మెజారిటీ ప్రాతినిధ్య పరిమాణం నుండి, ప్రాధాన్యతల దృష్ట్యా, కొంత తగ్గించి, మైనారిటీలకు కేటాయించాలి. మెజారిటీ నిజాయితీ కలిగినదైతే – నిష్పక్షపాతమైనదీ అయితే ఈ అంశాన్ని అంగీకరించి తీరాలి. అప్పుడు ప్రాధాన్యతా సూత్రం పై ఎటువంటి తగాదా ఉండదు. దాంతో ప్రాధాన్యతకు సంబంధించిన సమస్య, ఏ మేరకు ప్రాధాన్యత ఇవ్వాలి? అన్న దానికే పరిమితమవుతుంది. ఇక అప్పుడు అది సర్దుబాటుకు సంబంధించిన విషయమే అవుతుంది. కాని సూత్రానికి సంబంధించినది కాదు.

అందువల్ల ప్రాధాన్యతా సూత్రానికి సంబంధించి ఏరకంగానూ అభ్యంతరం చెప్పేందుకు అవకాశం ఉండదు. ప్రాధాన్యత ప్రకారం, సీట్లు కేటాయించాలనే డిమాండు మైనారిటీలందరి డిమాండుగా ఉంది. మెజారిటీ మరీ పెద్దగా ఉన్నచోట్ల షెడ్యూల్డు కులాలవారు ఆ మైనారిటీలతో చేరాలి. అయితే ప్రస్తుతం అమలులో ఉన్న ప్రాధాన్యతలోని లోపమేమిటంటే, వివిధ మైనారిటీల మధ్య అది సీట్లను అసమానంగా పంపిణీ చేస్తున్న. ప్రస్తుతం కొన్ని మైనారిటీలకు అతి పెద్ద వాటాకాగా, అంటరాని వారి వంటి మైనారిటీలకు వాటా దక్కకుండా పోయింది. కొన్ని సుస్పష్టమైన సూత్రాలను ఆధారంగా చేసుకుని ప్రాధాన్యత పంపిణీలో ఉన్న ఈ లోపాన్ని సరిదిద్దాలి.

3. నియోజక వర్గాలు

1. పూనా ఒప్పందంలోని 2 నుండి 4 ల వరకు గల క్లాజులలో, షెడ్యూల్డు కులాల వారికి కేటాయించిన సీట్ల ఎన్నికకు సంబంధించిన పద్ధతిని పొందుపరచారు. అది రెండు రకాల ఎన్నికలకు వీలు కల్పిస్తోంది. (1) ప్రాథమిక ఎన్నిక, (2) అంతిమ ఎన్నిక. షెడ్యూల్డు కులాలకు చెందిన ప్రత్యేక ఓటర్లు ప్రాథమిక ఎన్నికలో పాల్గొంటారు. ఇది అర్హతను నిర్ణయించే ఎన్నిక మాత్రమే. షెడ్యూల్డు కులాల వారికి రిజర్వు చేసిన స్థానాలకు షెడ్యూల్డు కులాలవారి తరపున అంతిమ ఎన్నికలో పోటీ చేసేది ఎవరన్నది ఈ ప్రాథమిక ఎన్నిక నిర్ణయిస్తుంది. అంతిమ ఎన్నికలో ఉమ్మడి ఓటర్లు ఉంటారు. ఈ అంతిమ ఎన్నికలో సవర్ణ హిందూ ఓటర్లు, షెడ్యూల్డు కులాల ఓటర్లు కూడా పాల్గొనవచ్చు. వీరి, అందరి ఓటుపైనే అంతిమ ఫలితం ఆధారపడి ఉంటుంది.

2. పూనా ఒప్పందంలోని 5 వ క్లాజు ఈ ప్రాథమిక ఎన్నికకు 10 సంవత్సరాల పరిమితి విధించింది. అంటే 1947 తరువాత రిజర్వుడు స్థానాలనూ, సాధారణ స్థానాలలోనూ కూడా ఉమ్మడి ఓటర్ల వ్యవస్థే ఉంటుంది.

3. ఈ ద్వంద ఎన్నికల విధానాన్ని మరికొంతకాలం పొడిగించడానికి హిందువులు అంగీకరించనప్పటికీ, అది షెడ్యూల్డు కులాలవారిని సంతృప్తి పరచదు. ప్రాథమిక ఎన్నిక పద్ధతిని కొనసాగించడానికి రెండురకాల అభ్యంతరాలు ఉన్నాయి. షెడ్యూల్డు కులాలవారు తాము కోరుకున్న ఉత్తమ అభ్యర్థిని ఎన్నుకోవడానికి వీలుకలిగించదు. అనుబంధం (III) ను చూస్తే ఈ విషయం అర్థమవుతుంది. ప్రాథమిక ఎన్నికలో అభ్యర్థి అంతిమ ఎన్నికలో విఫలమవడమూ, ప్రాథమిక ఎన్నికలో అపజయం పొందిన షెడ్యూల్డు కులాల అభ్యర్థి అంతిమ ఎన్నికలో అగ్రస్థానంలో నిలవడం జరుగుతుంది. రెండో అభ్యంతరమేమంటే ఈ ప్రాథమిక ఎన్నిక అనేది చాలామట్టుకు అభూత కల్పనే కాని వాస్తవం కాదు. గత ఎన్నికల్లో షెడ్యూల్డు కులాల వారికి రిజర్వు చేసిన 151 స్థానాల్లో కేవలం 43 స్థానాల్లో మాత్రమే ఈ ప్రాథమిక ఎన్నిక జరిగింది. దీనికి గల కారణమేమంటే ప్రాథమిక, అంతిమ ఎన్నికలకు అంటే- రెండు ఎన్నికలకూ అయ్యే ఖర్చును భరించడం షెడ్యూల్డుకులాలవారికి అసాధ్యమైపోయింది. ఇటువంటి వ్యవస్థను కొనసాగించడం వట్టి నిరుపయోగమేగాదు. శుద్ధదండగ.

4. పూనా ఒప్పందం ప్రకారం ఇక నుంచి అమలులోకి రాబోయే ఉమ్మడి నియోజక వర్గాల స్థానాల పద్ధతి – ఇంతకన్నా దారుణంగా ఉంటాయి.

ఇది కేవలం ఊహ, కల్పన కాదు. ఉమ్మడి, ఓటర్ల వ్యవస్థలు షెడ్యూల్డు కులాల వారు తమ ఓటు హక్కును పూర్తిగా కోల్పోతారని గత ఎన్నికలు రుజువు చేశాయి. షెడ్యూల్డు కులాల అభ్యర్థులు షెడ్యూల్డు కులాల ఓటర్ల ద్వారా మాత్రమే ఎన్నుకోబడాలన్నదే, ఉద్దేశమైనప్పటికీ, వారు హిందూ ఓటర్ల చేత కూడా ఎన్నుకోబడ్డారు. అంతే

కాదు, ప్రాథమిక ఎన్నికలు విఫలమైన షెడ్యూల్డు కులాల అభ్యర్థులను హిందూ ఓటర్లు గెలిపించారు. ఈ అంశాన్ని అనుబంధం III లోని సంఖ్యల్లో చూడవచ్చు. ఇది షెడ్యూల్డ్ కులాల ఓటు హక్కును పూర్తిగా హరించడమే. పెక్కు నియోజక వర్గాల్లో షెడ్యూల్డు కులాల, సవర్ణ హిందువుల ఓటింగ్ బలానికి మధ్య, విపరీతమైన వ్యత్యాసం ఉండటమే దీనికి ప్రధానకారణం. అనుబంధం IIలో ఇచ్చిన సంఖ్యలను బట్టి ఈ విషయాన్ని కూడా తెలుసుకోవచ్చు. సైమన్ కమీషన్ చెప్పినట్లుగా, ఏ నియోజకవర్గంలోనైనా రక్షణ కల్పించిన కులాలవారు మరీ తక్కువ సంఖ్యలో ఉన్నప్పుడు రిజర్వు సీట్ల విధానం పనిచేయకుండా పోతుంది. షెడ్యూల్డు కులాల వారి విషయంలో కచ్చితంగా ఇదే జరుగుతుంది. ఓటింగ్ బలంలో సవర్ణ హిందువులకు షెడ్యూల్డు కులాల వారికి మధ్యనున్న ఈ తేడా విస్మరించడానికి వీలు లేనిది. వయోజన ఓటింగ్ పద్ధతిలో కూడా ఇది కొనసాగుతుంది. ఇక అటువంటప్పుడు, షెడ్యూల్డు కులాల వారికి నిజమైన ప్రాతినిధ్యం ఉండేందుకు వీలుగా, మూర్ఖతకూ వంచనకూ తావులేని పూర్తి రక్షణతో కూడిన విధానాన్ని కనుక్కోవాలి. అటువంటి విధానం (I) అవసరమైనట్టే ఆర్థికంగా భారమైనట్టే, ప్రాథమిక ఎన్నిక పద్ధతిని రద్దు చెయ్యం. (II) ప్రత్యేక నియోజకవర్గాల ప్రత్యామ్నాయాన్ని -తప్పని సరిగా రద్దుచేయాలి.

షెడ్యూల్డు కులాల వారికి మధ్యనున్న ఈ తేడా విస్మరించడానికి వీలులేనిది. వయోజన ఓటింగ్ పద్ధతిలో కూడా ఇది కొనసాగుతుంది. ఇక అటువంటప్పుడు, షెడ్యూల్డు కులాల వారికి నిజమైన ప్రాతినిధ్యం ఉండేందుకు వీలుగా మూర్ఖతకూ వంచనకూ తావులేని పూర్తి రక్షణతో కూడిన విధానాన్ని కనుక్కోవాలి. అటువంటి విధానం. (1) అనవసరమైనట్టీ ఆర్థికంగా భారమైనట్టీ, ప్రాథమిక ఎన్నిక పద్ధతినీ రద్దు చెయ్యాలి. (2) ప్రత్యేక నియోజక వర్గాల ప్రత్యామ్నాయాన్నీ తప్పని సరిగా రద్దు చేయాలి.

5. రాజకీయ రంగంలో షెడ్యూల్డు కులాలకూ, హిందువులకూ మధ్య సంబంధాలను చెడగొట్టిన సమస్యలలో నియోజకవర్గాలకు సంబంధించిన సమస్య ఒకటి. ప్రత్యేక నియోజక వర్గాలు ఉండాలని షెడ్యూల్డు కులాలవారు ఎంత పట్టుబడుతున్నారో వారి యొక్క ఆ కోరికను, వ్యతిరేకించటంలో హిందువులు కూడా అంతే పట్టు బడుతున్నారు. ఈ విషయంపై ఒక అంగీకారానికి రాకపోయినట్లయితే, షెడ్యూల్డు కులాలకూ, హిందువులకూ మధ్య శాంతి, సామరస్యాలు ఉండవు. అయితే ఈ సమస్యపై ఒక అంగీకారానికి రావాలీ అంటే ఎవరిది సరైన వాదన, ఎవరిది తప్పుడు వాదన, అనేది తేల్చాలి. షెడ్యూల్డు కులాల డిమాండుకు గల వ్యతిరేకత సహేతుకమైనదేనా లేక కేవలం ద్వేషభావంతో కూడుకున్నదేనా, అనే అంశాన్ని నిర్ణయించాల్సిన అవసరం ఉంది.

6. ప్రత్యేక నియోజకవర్గాలు ఉండాలన్న షెడ్యూల్డు కులాల డిమాండుకు వ్యతిరేకంగా చెపుతున్న సాధారణ కారణాలు ఇవి.

1. షెడ్యూల్డు కులాలవారు మైనారిటీ కాదు.

2. షెడ్యూల్డు కులాలవారు హిందువులే. అందువల్ల వారికి ప్రత్యేక నియోజక వర్గాలు ఉండాల్సిన అవసరం లేదు.

3. ప్రత్యేక నియోజక వర్గాలు అంటరానితనాన్ని మరింతగా పెంచుతాయి.

4. ప్రత్యేక నియోజక వర్గాలు జాతీయతకు విరుద్ధమైనవి.

5. ప్రత్యేక నియోజకవర్గాలు ఉండటం వల్ల బ్రిటిషు సామ్రాజ్యవాదులు అటువంటి కులాల వారిని ప్రభావితం చేసి దేశ ప్రయోజనాలకు వ్యతిరేకంగా వ్యవహరించేటట్లు చేసే అవకాశం ఉంది.

7. ఈ వాదనలకు ఏమైనా విలువ ఉందా?

(I) షెడ్యూల్డు కులాలవారు మైనారిటీ కాదు అని చెప్పడం మైనారిటీ అన్న పదాన్ని తప్పుగా అర్థం చేసుకోవడమే మత పరంగా వేరవడమే, మైనారిటీకి ప్రమాణం కాదు అది సరైన, సమర్థవంతమైన ప్రమాణం కూడా కాదు. ఒక సామాజికవర్గం మైనారిటీయా, కాదా అని నిర్ధారించేందుకు సరైన పరీక్ష, సామాజిక వివక్షతే. మతపరమైన ప్రత్యేకతకన్నా ఇదే సహేతుకమైనట్టీ, ఆచరణయోగ్యమైనట్టీ పరీక్ష అని గాంధీజీ కూడా భావించారు. ఈ ప్రమాణాన్ని బట్టే 1939 అక్టోబర్ 21 నాటి హరిజన్ పత్రికలు, "ది ఫిక్షన్ ఆఫ్ మెజారిటీ" అన్న శీర్షిక కింద రాసిన సంపాదకీయంలో "భారతదేశంలో, షెడ్యూల్డు కులాలవారు మాత్రమే నిజమైన మైనారిటీలు" అని ఆయన తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

(II) షెడ్యూల్డు కులాల వారు హిందువులనీ, అందువల్ల వారికి ప్రత్యేక నియోజక వర్గాల అండ కూడదనీ వాదించడం పైవాదనను మరోరూపంలో పెట్టడమే. రాజ్యాంగ రక్షణలు కల్పించడానికి మతపరమైన అనుబంధాన్ని నిర్ధారణాంశంగా చేయడమంటే, మతపరమైన అనుబంధంతో పాటుగా, ఆ మతంలో తీవ్ర సామాజిక వ్యత్యాసాలూ, వివక్షత జతపడి ఉండి ఉండవచ్చునన్న వాస్తవాన్ని విస్మరించడమే అవుతుంది. ప్రత్యేక నియోజక వర్గాలను కలిగి వున్న మైనారిటీలంతా మతపరంగా మైనారిటీలు కావడమే "ప్రత్యేక నియోజక వర్గాలూ అంటే మతపరంగా వేరై ఉండడమే" అన్న విశ్వాసం కలగడానికి కారణం. అయితే ఇది సరైంది కాదు. ముస్లింలకు ప్రత్యేక నియోజక వర్గాలను రూపొందించడం మతపరంగా వారు హిందువులనుండి వేరయినందువల్ల కాదు. హిందువులకూ ముస్లిములకూ మధ్యగల సామాజిక సంబంధాల దృష్ట్యానూ, దేశంలో ముస్లిములు సామాజిక వివక్షతకు గురవుతున్న కారణంగానూ వారికి ముస్లింలకు ప్రత్యేక నియోజక వర్గాలను ఇచ్చారు. ముస్లిములకు ప్రత్యేక నియోజక వర్గాలను ఇవ్వడంలో గల మౌలిక వాస్తవం ఇదే. ఈ

అంశాన్నే మరో పద్ధతిలో చెప్పాలంటే, నియోజకవర్గాల స్వభావం వారి మతాన్ని బట్టికాక, వారి సామాజిక స్థితిని బట్టి నిర్ధారిస్తారు. నియోజక వర్గాల స్వభావం నిర్ణయించడంలో సామాజిక స్థితిగతులే తప్ప, మతంతో సంబంధం లేదు. మతానుబంధం లేకపోవడం, అనేది ప్రాతిపదికగా అంగీకరించరు అనే విషయాన్ని, 1935 భారతప్రభుత్వ చట్టం కింద భారతదేశంలోని క్రైస్తవ మతస్థులకు చేసిన ఏర్పాట్లు చక్కగా వివరిస్తున్నాయి. క్రైస్తవ మతస్థులు యూరోపియన్ క్రిస్టియన్లుగానూ, ఆంగ్లో ఇండియన్ క్రిస్టియన్లుగానూ, ఇండియన్ క్రిస్టియన్లుగానూ మూడు తరగతులుగా ఉన్నారు. వారంతా ఒకే మతానికి చెందిన వారైనప్పటికీ వారి వారికి వేరుగా ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పాటు చేశారు. ఇది సామాజికంగా వేరుపడి ఉండటమే! అంతేగాని మతపరంగా ఉన్న అనుబంధం, ప్రత్యేక నియోజకవర్గాలను నిర్ణయించటానికి కీలకం కాదన్న విషయాన్ని ఇది స్పష్టం చేస్తోంది.

(III) ప్రత్యేక నియోజక వర్గాలు, అంటరానివారికీ సవర్ణ హిందువులకూ మధ్య సంఘీ భావాన్ని చెడగొడతాయన్న వాదన గందరగోళపు ఆలోచన ఫలితంగా వచ్చినదే. ఎన్నికలు ఐదేళ్ళకు ఒకసారి జరుగుతాయి. ఉమ్మడి నియోజక వర్గాలు ఉన్నాయనుకుందాం. ఐదేళ్ళ పాటు వేరు వేరు జీవితాలు గడుపుతున్న అంటరాని వారు హిందువులూ, ఒక్క రోజు కలిసికట్టుగా ఓటింగులో పాల్గొన్నంత మాత్రాన అది వారి మధ్య సంఘీభావాన్ని ఏ విధంగా పెంపొందించడానికి దోహద పడుతుందో అర్థం కావడం లేదు. అదే విధంగా, ప్రత్యేక నియోజక వర్గాలు ఉన్నాయనుకుందాం. ఐదేళ్ళలో ఒక్క రోజు ప్రత్యేక నియోజక వర్గంలో వోటు వేసినందువల్ల అప్పటికే హిందువులకూ, అంటరానివారికీ మధ్యనున్న వేర్పాటును అది మరింతగా ఎలా పెంచుతుంది? తిప్పి చెప్పాలంటే ఐదేళ్ళ కాలంలో ఒక్క రోజు ప్రత్యేక వోటింగ్‌లో పాల్గొన్నంతమాత్రాన అది ఏ విధంగా ఐక్యత కొరకు పని చేయాలనుకుంటున్న వారిని నిరోధిస్తుంది? మరింత నిర్దిష్టంగా చెప్పాలంటే, హిందువుకూ, అంటరానివారికీ మధ్య సహపంక్తి భోజనాలనూ, కులాంతర వివాహాలనూ ప్రవేశపెట్టడానికి, అంటరానివారికి కేటాయించే ప్రత్యేక నియోజకవర్గాలు ఏ విధంగా అడ్డు తగులుతాయి? అందువల్ల అంటరానివారికి ప్రత్యేక నియోజకవర్గాలను కేటాయించడం వల్ల, అవి హిందువులకూ అంటరానివారికీ మధ్యనున్న వేర్పాటును శాశ్వతీకరింపదని వాదించడం నిష్ప్రయోజనం.

(IV) ప్రత్యేక నియోజక వర్గాలు జాతి వ్యతిరేక భావాల్ని సృష్టిస్తాయనడం అనుభవ విరుద్ధంగా ఉంది. సిక్కులకు ప్రత్యేక నియోజక వర్గాలు ఉన్నాయి కాని సిక్కులను జాతీయతకు వ్యతిరేకులని ఎవరూ అనలేదు. 1909 నాటి నుండి ముస్లింలకు ప్రత్యేక నియోజక వర్గాలు ఉన్నాయి. జిన్నా ప్రత్యేక నియోజక వర్గం నుండే ఎన్నికయ్యాడు. అయినప్పటికీ 1935 వరకూ ఆయన భారత జాతీయతకు ప్రవక్తగానే ఉన్నాడు ఇండియన్ క్రైస్తవులకు ప్రత్యేక నియోజకవర్గాలున్నాయి. వారిలో చాలామంది కాంగ్రెస్ టికెట్‌పై గెలిచినప్పటికీ కాంగ్రెస్ పట్ల అభిమానాన్ని చూపుతూనే ఉన్నా జాతీయతా, జాతి వ్యతిరేకతా

అన్న భావాలకూ, ఎన్నికల వ్యవస్థకూ, ఎటువంటి సంబంధమూ లేదు. అవి ఎన్నికల శక్తులకు సంబంధం లేనివి. ఇతర అంశాల ఫలితాలు అవి.

(V) ఈ వాదనలో పసలేదు. ఇది పలాయనవాదం తప్ప మరింకేమీ కాదు. అదలా వుంచండి. భారతదేశం స్వతంత్ర దేశం అయిన తరువాత ఆ ప్రాతిపదికపై ప్రత్యేక నియోజక వర్గాలకు ఉన్న ఏ అభ్యంతరమైనా అంతరించి పోవల్సిందే.

8. ప్రత్యేక నియోజకవర్గాల వ్యతిరేకులు చేసే వాదనలు, హేతుబద్ధ, అనుభవ పూర్వక పరీక్షలకు నిలబడలేక పోవడానికి గల కారణమేమంటే, వారు అనుసరించిన ధోరణి మౌలికంగా తప్పు కావటమే. రెండు కారణాలరీత్యా ఈ ధోరణి తప్పు అని చెప్పవచ్చు.

(I) కులపరమైన అనుబంధంతో కానీ, మత పరమైన అనుబంధంతో కానీ నియోజక వర్గాల వ్యవస్థకు ఎటువంటి సంబంధమూ లేదనే విషయాన్ని గ్రహించడంలో, వారు విఫలమయ్యారు. ప్రత్యేక నియోజక వర్గాల వ్యవస్థ అంటే, శాసనసభకు మైనారిటీ తన నిజమైన ప్రతినిధిని పంపుకునే యంత్రాంగమే తప్ప మరింకేమీ కాదు. మైనారిటీని పరిరక్షించే యంత్రాంగంగా అది నియోజకవర్గం ఉమ్మడిగా ఉండాలా, లేక ప్రత్యేకంగా ఉండాలా అని నిర్ధారించే విషయాన్ని మైనారిటీలకే వదలివేయాలి.

(II) ప్రత్యేక నియోజకవర్గాలకోసం మెజారిటీచేసే డిమాండుకూ దానికోసమే మైనారిటీ చేసే డిమాండుకూ గల తేడాను, వారు గుర్తించ లేకపోయారు. ప్రత్యేక నియోజక వర్గాలను డిమాండు చేసే హక్కు మెజారిటీ వర్గానికి లేదు. కారణం స్పష్టమే ప్రత్యేకం నియోజక వర్గాలు కావాలని మెజారిటీ వర్గం చేసే డిమాండు ఎలాంటిదంటే, మైనారిటీ, సమ్మతి లేకుండానే, మైనారిటీ వర్గంపై మెజారిటీ వర్గ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసే హక్కుకు సమానమవుతుంది[4]. పాలితుల అంగీకారంతోనే ప్రభుత్వం ఏర్పడాలన్న "స్థిరీకరించబడిన ప్రజాస్వామ్య సిద్ధాంతానికిది విరుద్ధం. తన ప్రయోజనాలకు అనుగుణంగా, నియోజక వర్గాల స్వభావం నిర్ధారించబడాలన్న హక్కును మైనారిటీలకు ఇవ్వడం వల్ల ఏ కీడూ సంభవించదు. ఎందుకంటే, మెజారిటీని పాలించే స్థానంలోకి మైనారిటీ వచ్చే అవకాశాలు లేవు కాబట్టి.

9. ప్రత్యేక నియోజక వర్గాలకు సంబంధించిన మొత్తం సమస్యపట్ల అనుసరించాల్సిన సరైన ధోరణి ఈ క్రింది సూత్రాలపై ఆధారపడి ఉంటుంది.

(I) నియోజకవర్గాల వ్యవస్థ అనేది మైనారిటీల పరిరక్షణకు సాధనమైనది కాబట్టి, నియోజక వర్గాల వ్యవస్థ ఉమ్మడిగా ఉండాలా లేక ప్రత్యేక నియోజక వర్గాలుగా ఉండాలా అనే అంశాన్ని మైనారిటీ ఇష్టానికి వదలి వేయాలి. మెజారిటీని ప్రభావితం చేయగలిగినంత

పెద్ద సంఖ్యలో తానున్నానని మైనారిటీ అనుకున్నట్లయితే అది ఉమ్మడి నియోజకవర్గాలను ఎంచుకుంటుంది. మరీ తక్కువ సంఖ్యలో ఉంటే, లొంగి ఉండాల్సి వస్తుందేమోనన్న భయంతో అది ప్రత్యేక నియోజకవర్గాలను ఎంచుకుంటుంది.

(II) పాలించగల స్థానంలో మెజారిటీ ఉన్నందువల్ల నియోజక వర్గాల వ్యవస్థను నిర్ణయించడంలో దానికి పాత్ర ఉండరాదు. ఉమ్మడి నియోజక వర్గాలే కావాలని మైనారిటీ కోరుకున్నట్లయితే, మెజారిటీ దానికి అంగీకరించాల్సిందే. తమకు ప్రత్యేక నియోజక వర్గాలు కావాలని మైనారిటీ నిర్ణయించుకున్నట్లయితే, వాటిని మంజూరు చేయడానికి మెజారిటీ తిరస్కరించకూడదు. మరోమాటలో చెప్పాలంటే, మైనారిటీ నిర్ణయంకోసం మెజారిటీ వేచిచూసి, దానికి అంగీకరించి తీరాల్సిందే.

## భాగం 1 – అంశం 2

ఈ డిమాండుకు పూనా ఒప్పందం ఎటువంటి నిబంధన రూపొందించక పోవడం వల్ల ఇది ఒప్పందానికి వెలుపలి అంశంలా కనిపిస్తుంది. కాని అది వాస్తవం కాదు. ఎటువంటి నిబంధననూ రూపొందించలేదన్న విషయం వాస్తవమే. అయితే అటువంటి అవసరం లేనందువల్ల ఏ నిబంధననూ రూపొందించలేదు. అది రెండు కారణాల వల్ల జరిగింది. మొదటి కారణమేమంటే పూనా ఒప్పందం జరిగిన సమయంలో, కార్య నిర్వాహక వర్గంలో ఏ వర్గానికీ నిర్ణీత పరిమాణంలో ప్రాతినిధ్యం ఉండాలని చట్టం ద్వారా హామీ కల్పించలేదు. రెండో కారణమేమంటే, వర్గాలకు ప్రాతినిధ్యం కల్పించే అంశాన్ని, గవర్నరే పరిశీలించి, అందరికీ ప్రాతినిధ్యం ఉండేలా తన ఉత్తర్వుల ద్వారా అమలు చేయాలన్న సంప్రదాయానికి వదలి వేసారు. కార్యనిర్వాహకవర్గంలో షెడ్యూలు కులాలకు నిర్ణీత పరిమాణంలో ప్రాతినిధ్యాన్ని నిర్ణయించాలని మన అనుభవం చెపుతోంది.

## భాగం 1 – అంశం 3

ఇది కొత్త డిమాండేమీ కాదు. ప్రభుత్వ ఉద్యోగాలలో షెడ్యూల్డు కులాలకు తగిన ప్రాతినిధ్యానికి పూనా ఒప్పందంలోని 8వ క్లాజు హామీ ఇచ్చింది. అయితే ఆ ప్రాతినిధ్య పరిమాణం ఎంత? అన్న విషయాన్ని అది నిర్ధారించలేదు. ఆ డిమాండు న్యాయ బద్ధమైనదే నని, భారత ప్రభుత్వం అంగీకరించింది. ప్రాతినిధ్య పరిమాణాన్ని కూడా నిర్ధారించింది. ఇక దానికి చట్ట రూపాన్ని కల్పించడమే మిగిలి ఉంది.

## భాగం 2 – అంశం 1

ఇది కొత్త డిమాండేమీ కాదు. షెడ్యూల్డు కులాల వారి విద్యకు తగినంత నిధులను కేటాయించడానికి, పూనా ఒప్పందంలోని 9వ క్లాజు హామీ ఇస్తోంది. అయితే ఆ మొత్తం

ఎంత అనే దానిని అది నిర్ధారించలేదు. ఏ మాత్రం నిధులను కేటాయించడాన్ని ప్రభుత్వం తన బాధ్యతగా స్వీకరిస్తుందో, దాన్ని నిర్ధారించాలని ఈ క్లాజు డిమాండు. ఈ అంశానికి సంబంధించి 1935 భారత ప్రభుత్వచట్టంలోని 83 సెక్షన్‌ను చూడవచ్చు. ఆంగ్లో ఇండియన్ల యొక్క యూరోపియన్ యొక్క విద్యకూ, ఆలీఘర్ బెనారస్ హిందూ విశ్వ విద్యాలయానికీ కేంద్ర ప్రభుత్వం నిధులు కేటాయించే విషయానికి సంబంధించిందే ఈ నిబంధన.

## భాగం 2 - అంశం 2

ఇది కొత్త డిమాండే. పరిస్థితులు ఈ డిమాండును సమర్థిస్తున్నాయి. ప్రస్తుతం హిందువులు గ్రామంలో నివసిస్తుంటే, అంటరానివారు ఊరు చివర పొలిమేరల కవతల గుడిసెలలో నివసిస్తున్నారు. హిందువుల దాస్యం నుండి అంటరానివారిని విముక్తి చేయడమే ఈ క్లాజు యొక్క లక్ష్యం. ప్రస్తుత ఏర్పాటు కొనసాగుతున్నంత కాలం హిందువుల దాస్యం నుండి అంటరానివారు స్వేచ్ఛ పొందడం కానీ, అంటరానితనాన్ని వదిలించుకోవడం కానీ సాధ్యం కాదు. ఒకే గ్రామంలో హిందువులతో పాటు వేరుగా నివసిస్తూ ఉండటమే. ఆ సమీప సంబంధమే- అంటరానివారిని అంటరానివారిగా వేరు చేస్తోంది; వారిని హిందువులు అంటరానివారిగా పరిగణించేటట్లు చేస్తోంది. భారతదేశం గ్రామాలమయం అన్నది స్పష్టం. అంటరానివారిని అంటరానివారిగా వేరు పరచే పద్ధతులు అవలంబిస్తూ వారిని విడిగా గుర్తించేందుకు గ్రామీణ వ్యవస్థ అవకాశం కల్పిస్తునంత కాలం అంటరానివారికి అంటరానితనం నుండి విముక్తి లభించదు. ఈ గ్రామ వ్యవస్థ (మాల మాదిగ) గూడేలతో అంటరానితనాన్ని మరింతగా పెంపొందిస్తున్నందువల్ల, అంటరానితనానికీ, ఈ పద్ధతికీ ఉన్న బంధాన్ని విడగొట్టాలనేదే ఈ క్లాజు డిమాండు. వాస్తవంలో సామాజికంగా వేరుపడిన అంటరానివారిని, భౌగోళికంగా కూడా వేరుచేసి, వారికి ప్రత్యేకంగా గ్రామాలను ఏర్పాటు చేసి, ఎక్కువ వారు, తక్కువ వారు, అంటరానివారు, అంటగలవారు అనే తేడాలకు తావు లేని, ప్రదేశాలను ఏర్పాటు చేయాలనేదే ఈ క్లాజు డిమాండు.

అంటరాని వారికి ప్రత్యేక గ్రామాలను ఏర్పాటు చేయాలనడానికి గల రెండో కారణం, గ్రామాల్లోని అంటరానివారి ఆర్థిక పరిస్థితే. అంటరానివారి ఆర్థిక పరిస్థితి కడు దయనీయంగా ఉందన్న విషయాన్ని ఎవరూ కాదనలేరు. వారంతా భూమిలేని వ్యవసాయ కార్మికులే. హిందువులు వారికివ్వడానికి ఇష్టపడిన ఉపాధులపై పూర్తిగా ఆధారపడి బతుకుతున్న వారే. హిందువులు సొంతలాభ దృష్టితో నిర్ణయించే వేతనంపైనే అంటరానివారు ఆధారపడి జీవిస్తుంటారు. వారు తాము నివసించే గ్రామంలో ఏ వ్యాపారాన్నీ ఏ వృత్తినీ చేయలేరు. వారు అంటరానివారవ్వడం వల్ల ఏ హిందువూ వారితో లావాదేవీలు నిర్వహించడు. అందువల్ల హిందూ గ్రామంపై ఆధారపడ్డ భాగంగా గూడెంలో వారు నివసిస్తున్నంత కాలం హిందువులు ఇచ్చే పని చేసుకుని బతకడం తప్ప జీవించడానికి వారికి మరో దారి ఉండదు.

పేదరికం, తద్వారా కలిగే న్యూనతా జీవితమూ, ఈ రెండింటికీ కాకుండా ఈ ఆర్థిక పరాధీనత మరికొన్ని ఇతర పరిణామాలకు కూడా దారి తీస్తున్నది. మతంలో భాగంగా హిందువుకి ఒక జీవన నియమావళి ఉంది. హిందువుకి అనేక సదుపాయాలనూ గౌరవాలనూ ఇస్తున్నది. మానవ జీవన పవిత్రతా గౌరవాలకు విరుద్ధమైన అనేక అవమానాలనూ, అన్యాయాలనూ అంటరానివారిపై అది కుమ్మరిస్తున్నది. మతం పేరుతో హిందువులు తమపై కుమ్మరిస్తున్న ఈ అవమానాలకూ, అన్యాయాలకూ వ్యతిరేకంగా అంటరానివారు యావద్భారత దేశమంతటా పోరాడుతున్నారు. ప్రతి గ్రామంలోనూ, ప్రతి రోజూ అంటరాని వారికీ హిందువులకూ మధ్య నిరంతర పోరాటం సాగుతున్నది. అయితే అది వెలుగులోకి రావడం లేదు. ప్రపంచం దృష్టిలో అది తమ స్వాతంత్ర్యానికి మచ్చ తెస్తుందేమోనన్న భయంతో హిందూ పత్రికలు ఆ పోరాటానికి ప్రచారం ఇచ్చేందుకు సిద్ధపడడం లేదు. అయితేనేమి, అంటరాని వారికీ, హిందువులకు మధ్య తీవ్ర పోరాటం జరుగుతోందన్నది వాస్తవం. ఈ గ్రామ వ్యవస్థలో గౌరవ ప్రదమైన స్వేచ్ఛాయుత జీవనం కోసం జరుపుతున్న పోరాటంలో వారు అనేక విధాలుగా తీవ్ర ప్రతిబంధకాలను ఎదుర్కొంటున్నారు. ఆర్థికంగా, సామాజికంగానూ శక్తిమంతులయిన హిందువులకూ, ఆర్థికంగా పేదవారూ, తక్కువ సంఖ్యలో ఉన్నవారూ అయిన అంటరానివారికీ, మధ్య ఈ పోరాటం జరుగుతోంది. ఈ పోరాటంలో అనేక కారణాలవల్ల అంటరానివారిని, అణచివేయడంలో హిందువులు పెక్కుసార్లు విజయం సాధిస్తున్నారు. పోలీసు, న్యాయవ్యవస్థలు హిందువుల పక్షాన ఉంటున్నాయి. అంటరానివారికీ హిందువులకు మధ్య జరిగే పోరాటంలో పోలీసుల నుండి రక్షణనూ, న్యాయవ్యవస్థ నుండి న్యాయాన్నీ, అంటరానివారు ఎన్నటికీ పొందలేరు. పోలీసులూ, న్యాయమూర్తులూ తమ విధికన్నా తమ వర్గాన్నే సహజంగా ఎక్కువగా ప్రేమిస్తారు. వీటన్నిటికన్నా మిన్నగా హిందువుల ఆయుధాగారంలో ఆర్థికశక్తి అనే ఒక ప్రధాన ఆయుధం ఉంది. దానిని వారు గ్రామంలో నివసించే అంటరానివారిపై ప్రయోగిస్తున్నారు. దీనికి విరుగుడుగా ఈ క్లాజు చేసిన ప్రతిపాదనను పలాయానవాదంగా కొట్టి పారేయ వచ్చు. అయితే దీనికి ప్రత్యామ్నాయం నిరంతర బానిసత్వం మాత్రమే

## భాగం 3 – అంశం 1

మెజారిటీ, మైనారిటీ సమస్యలను కలిగి ఉన్న ఏ దేశమూ కూడా వారి మధ్య అధికార పంపిణీకి సంబంధించిన ఏదో ఒక ఏర్పాటు లేకుండా లేదు. దక్షిణాఫ్రికాలో మెజారిటీ, మైనారిటీల మధ్య అటువంటి అవగాహన ఉంది. అదే విధంగా కెనడాలో కూడా ఉంది. కెనడాలోని ఫ్రెంచి వారికి, ఇంగ్లీషు వారికీ మధ్య రాజకీయాధికారాన్ని పంచుకునే ఏర్పాటు అట్టడుగు స్థాయివరకూ ఉంది. 'ఎవల్యూషన్ ఆఫ్ ది డొమీనియన్ ఆఫ్ కెనడా' అనే పుస్తకంలో ఈ వాస్తవాన్ని గురించి పేర్కొంటూ పోరిట్ ఇలా అన్నారు.

"జాతి, భాషల కారణంగా కొంతా, ప్రభుత్వ పదవుల పంపిణీకి సంబంధించి చిరకాలంగా ఉన్న ఆలోచనల కారణంగా మరికొంతా అట్టవాలోని పరిస్థితులు సాధారణ ఎన్నికలల్లో రాజకీయ పార్టీల భవిష్యత్తేదైనప్పటికీ రెండు, మూడు పార్లమెంటులలో సభాధ్యక్ష పదవిలో ఒకే వ్యక్తిని కొనసాగించే బ్రిటిష్ తరహా ఆనవాయితీకి, వ్యతిరేకంగా తయారయ్యాయి. అట్టవాలో ప్రతికొత్త దిగువ సభకి (హౌస్ ఆఫ్ కామన్స్) ఒక కొత్త స్పీకర్ ఉంటారు. ఒకే పార్టీ రెండూ లేక మూడు సార్లు వరుసగా అధికారంలోకి వచ్చినప్పుడు, ఒకసారి బ్రిటిష్ సంతతికి చెందిన వారిని స్పీకర్‌గా పెట్టుకుంటే, మరోసారి ఫ్రెంచ్ సంతతికి చెందిన వారిని స్పీకరుగా పెట్టుకోవడమన్నది అక్కడ ఎంతో కాలంగా ఉన్న సంప్రదాయం".

"ఒకే జాతికి చెందిన వారు స్పీకర్, డిప్యూటీ స్పీకర్ పదవులలో ఒకే సమయంలో ఉండకూడదనేది కూడా ఒక నియమం. స్పీకర్ ఫ్రెంచ్ కెనెడియన్ అయితే, కమిటీలకు కూడా ఛైర్మన్‌గా ఉండే డిప్యూటీ స్పీకర్, ఇంగ్లీషు మాట్లాడే కెనడియన్ అయి ఉండాలి. ఎందుకంటే, ఆ సమయంలో స్పీకరుగా ఉన్న వ్యక్తికి తెలియని భాష డిప్యూటీ స్పీకరుకైనా క్షుణ్ణంగా తెలిసి ఉండాలనేది సభా నియమం

అదే విధంగా సభయొక్క క్లర్క్‌షిప్, అసిస్టెంట్ క్లర్క్‌షిప్ పదవులూ, సార్జంట్, డిప్యూటీ సార్జెంట్ పదవులూ కూడా ఇరు జాతులు పంచుకుంటూ ఉంటారు. వీటిని స్పీకర్, డిప్యూటీ స్పీకర్ పదవులకు మల్లే ఎన్నిక ద్వారా కాకుండా నియామకం ద్వారా భర్తీ చేస్తుంటారు.

పార్లమెంటులోని ఎగువసభా, దిగువసభలకు సంబంధించి, దాదాపుగా అన్ని పదవులూ, ప్రధానమైనవీ, ప్రధానం కానివీనూ. ఇదే విధంగా నియమాల ప్రకారమో, లేదా ఆనవాయితీ ప్రకారమో విభజితమై ఉంటాయి. ఉభయ సభల హాజరుపట్టీని పరిశీలిస్తే, అవీ, ఇవీ అందించే "బోయ్"లతో సహా, సిబ్బంది అంతటిలోనూ, ఫ్రెంచ్ కెనడియన్ పేర్లు కలిగిన వారెంతమంది ఉంటారో, బ్రిటిష్ వారసత్వమున్న కెనెడీయన్లు అంతేమంది ఉంటారు.

ఏ నియమాలు, ఆనవాయితీలా ప్రకారం ఈ పదవుల విభజన జరిగిందో, ఆ నియమాలూ, ఆనవాయితీలూ కాన్ఫెడరేషన్ కన్నా ప్రాచీనమైనవి. యునైటెడ్ ప్రావిన్సెస్ తొలిరోజుల నాటి నుండి ఇవి ఉన్నాయి. యూనియన్‌లో క్యూబెక్, అంటారియోలు మాత్రమే ప్రావిన్సులుగా ఉన్నప్పుడు, అవి శాసనసభకు సమాన సంఖ్యలో ప్రతినిధులను ఎన్నుకునే రోజుల నాటికి సంబంధించినవే ఈ నియమాలు, ఆనవాయితీలూనూ.

దిగువ సభలో ఉన్న 234 మంది సభ్యులలో, నేడు క్యూబెక్, 65 మందిని మాత్రమే ఎన్నుకుంటుంది. దాని జనాభా డొమీనియన్ జనాభాలో నాలుగవ వంతుకూడా ఉండదు. దాని ఆదాయం డొమీనియన్ ఆదాయంలో ఆరవ వంతుకు మించదు. కాని తన హక్కుల సదుపాయాల, పరిరక్షణకు దిగువ సభలోని పదవులు, సరి సమానంగా

పంపిణీ కావడం అవసరమని క్యూబెక్ పరిగణించింది; అధికారంలో ఉన్నప్పుడు ప్రతి పార్టీ ఫ్రెంచ్ కెనడా మద్దతుపై ఆధారపడి ఉన్నంతవరకూ ఈ పార్లమెంటరీ పదవులకూ, హోదాలకూ, క్యూబెక్‌కు గల హక్కులను విస్మరించడం కష్టమవుతుంది. అది ఎంత కష్టమంటే బ్రిటిష్ నార్త్ అమెరికా చట్టంలో 'సపరేట్ స్కూల్ సిస్టం'కు రక్షణ క్లాజును రద్దు చేయడమంత కష్టము.

దురదృష్టవశాత్తు భారతదేశంలోని మైనారిటీలకు, భారత జాతీయవాదం ఒక కొత్త సిద్ధాంతాన్ని రూపొందించింది. తమ ఇష్టాయిష్టాల మేరకు, మైనారిటీలను పాలించేందుకు మెజారిటీలకు దైవదత్తమయినదనేదే ఆ సిద్ధాంతం. అధికారంలో వాటాకోసం మైనారిటీలు హక్కుగా కోరడాన్ని కులతత్వం క్రింద లెక్కగడుతున్నారు. మొత్తం అధికారంపై మెజారిటీ గుత్తస్వామ్యం చెలాయించడాన్ని జాతీయ వాదంగా లెక్కగడతాయి. ఇటువంటి రాజకీయ తత్వ చింతనను మార్గదర్శకంగా కలిగిన మెజారిటీ వారు రాజకీయ అధికారాన్ని తమతో పాటు పంచుకోవడానికి, మైనారిటీలను అనుమతించేందుకు సిద్ధంగా లేరు. అందుకు అనుగుణంగా రూపొందించిన సంప్రదాయాన్ని, గౌరవించేందుకు కూడా, వారు సుముఖంగా లేరు. 1935 భారత ప్రభుత్వ చట్టంలో, గవర్నర్లకు పొందుపరచిన సూచన పత్రంలో గల, బాధ్యతను, మంత్రివర్గంలో మైనారిటీ ప్రతినిధులను చేర్చుకోవాలనే సూచన తిరస్కరించడం ద్వారా ఇది విదితమవుతోంది. ఇటువంటి పరిస్థితులలో షెడ్యూలు కులాల వారి హక్కులను రాజ్యాంగంలో పొందుపరచడం మినహా, మరో దారి లేదు.

## భాగం 3 - అంశం 2

ఇది కొత్త డిమాండేం కాదు. పూనా ఒప్పందంలోని 6వ క్లాజు బదులుగా దాని స్థానంలోకి ఇది వస్తుంది. ఒప్పందంతో సంబంధం ఉన్న వర్గాల మధ్య, పరస్పర అంగీకారం కుదిరి, ఒక నిర్ణయానికి వచ్చే వరకూ, రిజర్వుడు స్థానాల ద్వారా షెడ్యూల్డు కులాల వారికి కల్పించిన ప్రాతినిధ్య పద్ధతి కొనసాగేందుకు పూనా ఒప్పందంలోని 6వ క్లాజు వీలు కల్పిస్తున్నది. దానినే ఈ రెండో క్లాజు కొనసాగిస్తున్నది. షెడ్యూల్డు కులాలవారికి కల్పించిన రక్షణలను సవరించడానికీ, మార్పు చేయడానికీ వారి ఇచ్ఛను తెలుసుకొనేందుకు పొందేందుకు, భద్రతతో కూడిన పద్ధతి ఏదీ లేనందున, ఒప్పందంలోని 6వ క్లాజుకు ప్రత్యామ్నాయ పథకాన్ని రూపొందించడం అవసరం. ఈ ప్రతిపాదనలోని లక్ష్యాలను కలిగిన ఇటువంటి నిబంధనలు ఆస్ట్రేలియా, అమెరికా, దక్షిణ ఆఫ్రికా రాజ్యాంగాలలో ఉన్నాయి.

ఇటువంటి విషయానికి సంబంధించి ఒక నిర్ణయం తీసుకునేటప్పుడు రెండు అంశాలను దృష్టిలో ఉంచుకోవాలి. భవిష్యత్తులో కల్పించబోయే రక్షణల్లో, మార్పు చేసే అవకాశం పార్టీలకు లేదని తోసి పుచ్చడమూ అభిలషణీయం కాదు - అలాగని వాటిని మార్చడం కోసం నిరంతర ఆందోళన చేయడమూ అభిలషణీయం కాదు. రాజ్యాంగ

పీఠికలో పొందుపరిచిన బాధ్యతలను రాష్ట్ర శాసన సభలూ, కేంద్ర శాసన సభా విజయవంతంగా నెరవేర్చాలీ అంటే, రక్షణల మార్పు విషయంలో, వివిధ మతాల మధ్య, వివిధ వర్గాలమధ్య తల ఎత్తే తీవ్ర వాదోపవాదాలు పక్కదారి పట్టించ కూడదు. అటువంటి వాదోపవాదాలు భవిష్యత్తులో కచ్చితంగా తల ఎత్తుతాయి. అందువల్లనే, ఇరవై ఐదు సంవత్సరాల తరువాతనే, ఏ మార్పు గురించైనా, ఆలోచించాలని, ఈ క్లాజు నిర్దేశించింది.

## భాగం 4

బ్రిటిష్ ఇండియాలోని షెడ్యూల్డు కులాలవారికి ఏ రక్షణలను కల్పించారో, అదే రక్షణలను భారత సంస్థానాల్లోని షెడ్యూల్డు కులాల వారికి కూడా కల్పించేటట్లు చూడటమే ఈ నిబంధన లక్ష్యం. యూనియన్‌లో చేరగోరే భారత సంస్థానం, తన రాజ్యాంగంలో కూడా షెడ్యూల్డు కులాల వారికి ఈ రక్షణలున్నాయి అన్న సంతృప్తిని కలిగించాలని ఈ నిబంధన నిర్దేశిస్తోంది.

## భాగం 5
## అర్థాన్వయం

షెడ్యూల్డు కులాల వారు మైనారిటీయా కాదా అన్న అంశం వివాదాస్పదమైనది. ఈ వివాదాన్ని తలెత్తకుండా చెయ్యడమే ఇందులోని మొదటి నిబంధన ఉద్దేశం. భారతదేశంలోని ఏ ఇతరమైనారటీతో పోల్చి చూసినా షెడ్యూల్డు కులాలవారి పరిస్థితి అత్యంత దయనీయంగా ఉంది. అందువల్ల ఇతర మైనారిటీలకు అవసరమైన దానికన్నా ఎక్కువగా షెడ్యూల్డు కులాల వారికి రక్షణలు కల్పించడం అవసరం. అందుకు వారు అర్హులు కూడా అందుకు ఎవరైనా కనీసంగా చేయగలిగేది వారిని మైనారిటీగా పరిగణించడమే.

రాష్ట్రాల పరంగా ఉన్న అడ్డంకులను తొలగించడమే రెండో నిబంధన ఉద్దేశం. షెడ్యూల్డు కులాలకు చెందిన ఒక వ్యక్తి రాజ్యాంగం కల్పించిన రాజకీయ ప్రయోజనాల సదుపాయాల్ని ఒక రాష్ట్రంలో పొంది, కేవలం తన నివాస స్థలాన్ని మార్చి మరొక రాష్ట్రానికి వెళ్ళిన కారణంగా, వాటిని ఎందుకు కోల్పోవాలి. కేవలం నివాస స్థలాన్ని మార్చిన కారణంగా వాటిని కోల్పోవాలనడంలో అర్థం లేదు.

## అనుబంధం – II
## పూనా ఒప్పంద పాఠం

(1) రాష్ట్ర శాసనసభల్లో సాధారణ నియోజక వర్గాల్లో దళిత వర్గాల వారికి ఈ క్రింది విధంగా సీట్లను రిజర్వు చేయాలి.

| | | |
|---|---|---|
| మద్రాసు | .. | 30 |
| సింధ్‌తో కూడిన బొంబాయి | .. | 15 |
| పంజాబ్ | .. | 8 |
| బీహార్, ఒరిస్సా | .. | 18 |

| | | |
|---|---|---|
| కేంద్ర ప్రావిన్సులు | .. | 20 |
| అస్సాం | .. | 7 |
| బెంగాల్ | .. | 30 |
| యునైటెడ్ ప్రావిన్సులు | .. | 20 |
| మొత్తం | .. | 148 |

ప్రధానమంత్రి నిర్ణయ ప్రకటనలోని ప్రావిన్షియల్ కౌన్సిళ్ళ మొత్తం బలాన్ని ప్రాతిపదికగా తీసుకుని ఈ సంఖ్యలను నిర్ణయించడం జరిగింది.

(2) ఉమ్మడి నియోజక వర్గాల ద్వారా ఈ స్థానాలకు ఎన్నికలు జరుగుతాయి. అయితే ఆ ఎన్నిక ఈ క్రింది పద్ధతికి లోబడి జరుగుతుంది.

నియోజక వర్గంలోని సాధారణ ఓటర్ల జాబితాలో ఓటర్లుగా నమోదైన దళిత వర్గాల సభ్యులంతా, ఒక నియోజక గణంగా ఏర్పడతారు. ఆ నియోజక గణం, రిజర్వు చేసిన స్థానానికి, దళిత వర్గాలకు చెందిన నలుగురు అభ్యర్థుల పానెల్‌ను ఒకే ఓటు ప్రాతిపదికపై ఎన్నుకుంటుంది. ఈ ప్రాథమిక ఎన్నికలు అత్యధిక ఓట్లు వచ్చి ఎన్నికైన ఈ నలుగురు అభ్యర్థులే సాధారణ నియోజక వర్గాల ద్వారా జరిగే ఎన్నికలో అభ్యర్థులవుతారు.

(3) కేంద్ర శాసన సభలో దళిత వర్గాల ప్రాతినిధ్యం అనేది, రాష్ట్ర శాసనసభలకు పైన పేర్కొన్న అంశం (2)లో వివరించిన ప్రాథమిక ఎన్నిక పద్ధతి మాదిరే వుంటుంది.

(4) కేంద్ర శాసన సభలో బ్రిటిష్ ఇండియా సాధారణ నియోజక వర్గాలకు రిజర్వు చేసిన వాటిలో 18శాతం స్థానాలు దళిత వర్గాలకు రిజర్వు చేయాలి.

(5) కేంద్ర, రాష్ట్ర శాసన సభలకు జరిగే ఎన్నికల్లో పైన పేర్కొన్న ప్రాథమిక ఎన్నిక వ్యవస్థద్వారా ప్యానల్ అభ్యర్థులను ఎన్నుకునే పద్ధతి పది సంవత్సరాల తరువాత అంతమవ్వాలి. అంతకంటే ముందే దానిని రద్దు చేయాలంటే క్రింద పేర్కొన్న అంశం 6 లో చెప్పినట్లుగా అది పరస్పర అంగీకారం ద్వారా జరగాలి.

(6) ఒప్పందంలోని భాగస్వాములు పరస్పరం అంగీకరించి నిర్ణయించేవరకూ ఒకటి 1, 4 అంశాల్లో పేర్కొన్నట్టుగా, కేంద్ర, రాష్ట్ర శాసనసభలకు రిజర్వు స్థానాల ద్వారా దళిత వర్గాలు తమ అభ్యర్థులను ఎన్నుకునే పద్ధతి కొనసాగాలి.

(7) కేంద్ర, రాష్ట్ర శాసనసభలకు జరిగే ఎన్నికల్లో లోథియన్ కమిటీ నివేదికలో పేర్కొన్న పద్ధతిలో, దళిత వర్గాలకు వోటింగు హక్కు వుండాలి.

(8) స్థానిక సంస్థల ఎన్నికలకు సంబంధించి గానీ ప్రభుత్వ ఉద్యోగాల్లో నియామకానికి సంబంధించిగానీ దళిత వర్గాలకు చెందిన వాడన్న కారణంగా అనర్హుణ్ణి చేయగూడదు. ప్రభుత్వ ఉద్యోగాలలోను, స్థానిక సంస్థలలోనూ దళిత వర్గాలకు తగినంత ప్రాతినిధ్యం

ఉండేటట్లుగా చేయదగ్గ ప్రయత్నాలన్ని చేయాలి. ప్రభుత్వ ఉద్యోగాలకు ఉండాల్సిన విద్యార్హతలను కలిగి ఉండాలన్న నియమానికి లోబడే ఈ ప్రయత్నాలు జరగాలి.

(9) ప్రతి రాష్ట్రంలోనూ దళిత వర్గాలకు చెందిన వారికి విద్యా నిధుల నుండి తగినంత మొత్తం కేటాయించాలి.

## అనుబంధం – III
## పూనా ఒప్పందం వలన నష్టాలు

షెడ్యూల్డు కులాల వారు తమకు నచ్చిన వారిని ఎంపిక చేసుకుని శాసన సభలకు ప్రతినిధులుగా పంపుకునేందుకు ఒక పద్ధతిని రూపొందించడమే పూనా ఒప్పందం ఉద్దేశం. కాని, ఆచరణలో ఇది పూర్తిగా నీరు గారి పోయింది. వరుస క్రమంలో ఈ క్రింద ఇచ్చిన గణాంక వివరాల నుండి ఆ విషయాన్ని గ్రహించవచ్చు. 1946 ఫిబ్రవరిలో జరిగిన ఎన్నికల నుండి ఈ గణాంక వివరాల వరుస క్రమాలను రూపొందించడం జరిగింది.

2. గణాంక వివరాలను నాలుగు వరుసల పట్టికలలో పొందుపరచడం జరిగింది.

**మొదటి వరుస :** అంతిమ ఎన్నికలో గెలుపొందిన హిందూ అభ్యర్థులు, షెడ్యూల్డు కులాల అభ్యర్థులు ఎన్ని ఓట్లు పొందగలిగారు అన్న విషయాన్ని ఈ వరుసలోని పట్టికలు తెలియ చేస్తాయి.

**రెండవ వరుస :** అంతిమ ఎన్నికలో గెలుపొందడానికి షెడ్యూల్డు కులాల అభ్యర్థులకు ఎన్ని చోట్ల రిజర్వేషన్‌పై ఆధారపడాల్సిన అవసరం వచ్చిందో ఎన్నిచోట్ల రిజర్వేషన్ అవసరం లేకుండానే గెలుపొందగలిగారో అనే విషయాన్ని ఈ వరుసలోని పట్టికలు తెలియ చేస్తాయి

**మూడవ వరుస :** షెడ్యూల్డు కులాల వారికి సీట్లను రిజర్వు చేసిన నియోజక వర్గాల్లో సవర్ణ హిందువులకూ, షెడ్యూల్డు కులాలకు గల సాపేక్ష ఓటింగు బలాన్ని ఈ వరుసలోని పట్టికలు తెలియ చేస్తాయి.

**నాలుగవ వరుస :** అంతిమ ఎన్నికలో గెలుపొందిన షెడ్యూల్డు కులాల అభ్యర్థులకు, ప్రాథమిక ఎన్నికలో వారికి గల స్థితిని ఇవి తెలియ చేస్తాయి.

3. ఈ పట్టికలలోని అంకెలు ఈ క్రింది అంశాలను రుజువు చేస్తున్నాయి. ఈ పట్టికలను పరిశీలించిన వారెవరైనా అవి రుజువు చేసిన ఈ క్రింది ప్రతిపాదనలను కాదనలేరు.

(1) అంతిమ ఎన్నికల్లో గెలుపొందిన ప్రతి షెడ్యూల్డు కులాల అభ్యర్థి, షెడ్యూల్డు కులాల ఓట్లపై కాక, హిందువుల ఓట్లపైనే ఆధారపడి విజయం సాధించాడు. వారిలో చాలా మంది హిందూ అభ్యర్థులతో సమానంగాను, కొన్ని చోట్ల వారికన్నా ఎక్కువగాను, ఓట్లు సంపాదించారు. (మొదటి వరుసలోని పట్టికలను చూడండి). చాలా కొద్ది నియోజక వర్గాల్లో మాత్రమే షెడ్యూల్డు కులాల అభ్యర్థులు, రిజర్వేషన్‌పై తమ గెలుపుకు ఆధార

పడవల్సి వచ్చింది. (రెండవ వరుసలోని పట్టికలను చూడండి). ఇది అనూహ్యమైన పరిణామం. వివిధ నియోజక వర్గాల్లో సవర్ణ హిందువుల ఓటింగ్ బలాన్ని, షెడ్యూల్డు కులాల వారి ఓటింగ్ బలంతో పోల్చి చూసిన వారెవరికైనా, (మూడవ వరుసలోని పట్టికలను చూడండి). షెడ్యూలు కులాల అభ్యర్థులకు షెడ్యూల్డు కులాల ఓటర్లు మాత్రమే ఓటు వేస్తే అటువంటి పరిణామం తల ఎత్తదని షెడ్యూలు కులాలవారి ఓటింగ్ బలం బాగా తక్కువ అనీ, అర్థమవుతుంది. అంతిమ ఎన్నికలో షెడ్యూల్డు కులాల అభ్యర్థుల విజయం అనేది హిందువుల ఓట్లపైనే ఆధారపడి ఉండడం వల్లే ఈ పరిణామం తల ఎత్తిందని అర్థమవుతుంది.

(II) ప్రాథమిక ఎన్నిక ఫలితాలను, అంతిమ ఎన్నిక ఫలితాలతో పోల్చి చూసినప్పుడు (నాలుగవ వరసలోని పట్టికలను చూడండి) అంతిమ ఎన్నికలో గెలుపొందిన షెడ్యూల్డు కులాల అభ్యర్థి ప్రాథమిక ఎన్నికలో పరాజయం పొందినట్లు తెలుస్తుంది. (నియోజక వర్గాన్ని ఏక సభ్య నియోజక వర్గంగా పరిగణించి, ప్రాథమిక ఎన్నికనే అంతిమ ఎన్నికగా పరిగణిస్తే).

(III) ఓటింగ్ బలంలో షెడ్యూల్డు కులాలవారికీ హిందువులకూ మధ్య ఉన్న ఈ విపరీతమైన వ్యత్యాసం వల్ల, ఉమ్మడి నియోజక వర్గాల వ్యవస్థ అనేది నిజమైన ప్రతినిధులను ఎన్నుకునేందుకు షెడ్యూల్డు కులాల వారికి సహకరించేది కాదు. వయోజన ఓటింగ్ పద్ధతిలో కూడా వీరి మధ్య ఉన్న ఈ వ్యత్యాసం మాయమవదు.

(IV) షెడ్యూల్డు కులాలవారు ప్రాథమిక ఎన్నికలో షెడ్యూల్డుకులాల వారి అభిప్రాయానికి నిజమైన సూచిక ఇదే-తిరస్కరించిన అభ్యర్థులు అంతిమ ఎన్నికలో సవర్ణ హిందువుల ఓట్ల ద్వారా ఎన్నికయ్యేటట్లు చేసిన పూనా ఒప్పందం షెడ్యూల్డు కులాల వారి ఓటు హక్కును కాలరాచినట్లే.

ఈ విధంగా పూనా ఒప్పందం పూర్తిగా మోసపూరితమైంది. గాంధీ నిరాహార దీక్ష వత్తిడివల్లనూ, షెడ్యూల్డు కులాల అభ్యర్థుల ఎన్నికలో సవర్ణ హిందువులు జోక్యం చేసుకోరని ఆ సమయంలో హామీ ఇవ్వడం వల్లనూ, ఈ ఒప్పందానికి అంగీకరించడం జరిగింది.

## మొదటి వరుస పట్టికలు

గెలుపొందిన హిందూ అభ్యర్థులతో పోల్చినప్పుడు గెలుపొందిన షెడ్యూల్డు కులాల అభ్యర్థులకు వచ్చిన ఓట్లు.

## మొదటి వరుస పట్టికలు

### I. మద్రాసు

| సంఖ్య | నియోజకవర్గం పేరు | స్థానాలు | గెలిచిన హిందూ అభ్యర్థులకు వచ్చిన ఓట్లు | గెలిచిన షెడ్యూల్డు కులాల అభ్యర్థులకు వచ్చిన ఓట్లు |
|---|---|---|---|---|
| 1. | కాకినాడ | 2 | 32,607 | 28,544 |
| 2. | ఏలూరు | 2 | 37,618 | 38,195 |
| 3. | బందరు | 2 | 69,319 | 70,931 |
| 4. | ఒంగోలు | 2 | 50,906 | 49,992 |
| 5. | పెనుకొండ | 2 | 17,406 | 18,125 |
| 6. | కర్నూలు | 2 | 32,756 | 32,294 |
| 7. | చెంగల్‌పట్ | 2 | 13,865 | 15,129 |
| 8. | తిరువళ్లూరు | 2 | 17,225 | 17,818 |
| 9. | రాణీపేట్ | 2 | 21,249 | 21,059 |
| 10. | తిరువణ్ణామలై | 2 | 31,476 | 32,132 |
| 11. | దిండివనం | 2 | 25,626 | 25,442 |
| 12. | చిదంబరం | 2 | 15,272 | 14,874 |
| 13. | తంజావూర్ | 2 | 26,904 | 16,133 |
| 14. | మన్నార్‌గుడి | 2 | 29,932 | 30,116 |
| 15. | అరియాలూర్ | 2 | 22,656 | 20,520 |
| 16. | సత్తూర్ | 2 | 30,988 | 29,530 |
| 17. | మలపురం | 2 | 28,229 | 28,085 |
| 18. | నమక్కల్ | 2 | 15,433 | 15,085 |

### II. బెంగాల్

| సంఖ్య | నియోజకవర్గం పేరు | స్థానాలు | గెలిచిన హిందూ అభ్యర్థులకు వచ్చిన ఓట్లు | గెలిచిన షెడ్యూల్డు కులాల అభ్యర్థులకు వచ్చిన ఓట్లు |
|---|---|---|---|---|
| 1. | బర్ద్వాన్ సెంట్రల్ | 2 | 42,858 | 33,903 |
| 2. | బర్ద్వాన్ | 2 | 32,270 | 25,723 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 3. | బీర్‌భమ్ | 2 | 24,629 | 20,252 | |
| 4. | బంకూరా వెస్ట్ | 2 | 30,388 | 21,266 | |
| 5. | తుర్ర్గమ్ (ఘటల్) | 2 | 40,900 | 19,060 | |
| 6. | హుగ్లీ | 2 | 26,132 | 18,768 | |
| 7. | హౌరా | 2 | 40,608 | 36,099 | |
| 8. | 24 పరగణాలు (ఆగ్నేయం) | 2 | 50,345 | 38,459 | |
| 9. | 24 పరగణాలు (నార్త్‌వెస్ట్) | 2 | 45,339 | 48,272 | |
| 10. | నాడియా | 2 | 30,489 | 28,054 | |
| 11. | ముర్షీదాబాద్ | 2 | 32,386 | 26,958 | |
| 12. | జెస్సోర్ | 2 | 38,665 | 41,434 | |
| 13. | ఖుల్నా | 3 | 79,218 | 57,724 | 44,043 |
| 14. | మాల్డా | 2 | 32,728 | 12,796 | |
| 15. | దినజ్‌పూర్ | 3 | 46,146 | 35,127 | 30,839 |
| 16. | జలపాయ్‌గురి (సిలిగురి) | 3 | 30,950 | 26,109 | 13,829 |
| 17. | రంగపూర్ | 3 | 46,869 | 29,657 | 23,237 |
| 18. | బోగ్రా మరియు పాబ్నా | 2 | 43,249 | 31,515 | |
| 19. | ఢాకా, ఈస్ట్ | 2 | 51,808 | 31,392 | |
| 20. | మైమన్‌సింగ్,వెస్ట్ | 2 | 37,983 | 32,782 | |
| 21. | మైమన్‌సింగ్, ఈస్ట్ | 2 | 43,678 | 32,207 | |
| 22. | ఫరీద్‌పూర్ | 3 | 70,115 | 51,450 | 29,503 |
| 23. | బకర్‌గంజ్ | 2 | 48,560 | 28,560 | |
| 24. | తిప్పెరా | 2 | 60,146 | 59,051 | |

## III. బొంబాయి

| సంఖ్య | నియోజకవర్గం పేరు | స్థానాలు | గెలిచిన హిందూ అభ్యర్థులకు వచ్చిన ఓట్లు | | గెలిచిన షెడ్యూల్డు కులాల అభ్యర్థులకు వచ్చిన ఓట్లు | |
|---|---|---|---|---|---|---|
| 1. | బొంబాయినగరం (పరిసరాలు) | 2 | 57,182 | 47,835 | .. | 59,646 |
| 2. | బొంబాయి నగరం (బైకుల్లా) | 3 | 42,143 | 41,795 | .. | 43,251 |
| 3. | కైరా జిల్లా | 4 | 68,044 | 63,422 | 57,394 | 69,807 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 4. | సూరత్ జిల్లా | 4 | 40,232 | 39,985 | 39,610 | 39,849 |
| 5. | ఠాణా (సౌత్) | 3 | 30,581 | 27,587 | .. | 11,630 |
| 6. | అహ్మద్‌నగర్ | 3 | 25,747 | 20,948 | .. | 20,908 |
| 7. | ఖందేష్ (తూర్పు) | 4 | 38,721 | 34,349 | 33,960 | 36,136 |
| 8. | నాసిక్ వెస్ట్ | 4 | 37,218 | 36,794 | 36,555 | 42,604 |
| 9. | పూనా వెస్ట్ | 3 | 23,758 | 23,454 | .. | 24,709 |
| 10. | సతారా నార్త్ | 4 | 44,315 | 42,727 | 41,474 | 43,961 |
| 11. | షోలాపూర్ నార్త్‌యిస్ట్ | 3 | 19,380 | 16,705 | .. | 18,264 |
| 12. | బెల్గాంగ్‌నార్త్ | 4 | 55,787 | 50,759 | 49,867 | 27,682 |
| 13. | బీజాపూర్‌నార్త్ | 3 | 23,083 | 20,838 | .. | 16,059 |
| 14. | కొలాబాజల్లా | 4 | 41,012 | 38,864 | 35,633 | 17,676 |
| 15. | రత్నగిరి నార్త్ | 4 | 13,640 | 10,985 | 10,372 | 11,734 |

## IV. సంయుక్త పరగణాలు

| సంఖ్య | నియోజకవర్గం పేరు | స్థానాలు | గెలిచిన హిందూ అభ్యర్థులకు వచ్చిన ఓట్లు | గెలిచిన షెడ్యూల్డు కులాల అభ్యర్థులకు వచ్చిన ఓట్లు |
|---|---|---|---|---|
| 1. | లక్నో నగరం | 2 | 24,614 | 14,110 |
| 2. | కాన్పూర్ నగరం | 2 | 34,550 | 34,782 |
| 3. | ఆగ్రా నగరం | 2 | 17,446 | 16,343 |
| 4. | అలహాబాద్ నగరం | 2 | 19,870 | 10,308 |
| 5. | బదేన్ జిల్లా | 2 | 6,716 | 14,037 |
| 6. | జలాన్ జిల్లా | 2 | 21,692 | 15,363 |
| 7. | బస్తీ జిల్లా | 2 | 14,450 | 15,447 |
| 8. | అలమోరా జిల్లా | 2 | 36,371 | 20,605 |
| 9. | రాయిబరేలీ | 2 | 15,917 | 1,889 |
| 10. | సితాపూర్ జిల్లా | 2 | 28,665 | 20,204 |
| 11. | గోండా జిల్లా | 2 | 17,949 | 13,447 |

## V. మధ్య పరగణాలు

| సంఖ్య | నియోజకవర్గం పేరు | స్థానాలు | గెలిచిన హిందూ అభ్యర్థులకు వచ్చిన ఓట్లు | గెలిచిన షెడ్యూల్డు కులాల అభ్యర్థులకు వచ్చిన ఓట్లు |
|---|---|---|---|---|
| 1. | నాగపూర్ నగరం | 2 | 21,905 | 23,595 |
| 2. | నాగపూర్–ఉమ్రేద్ | 2 | 8,330 | 7,847 |
| 3. | హింగన్ ఘాట్–వార్ధా | 2 | 11,677 | 10,781 |
| 4. | చాందా–బ్రహ్మపురీ | 2 | 10,208 | 8,144 |
| 5. | చింద్వారా–సన్సద్ | 2 | 16,365 | 6,190 |
| 6. | సాగార్, ఖురాయ్ | 2 | 7,829 | 5,162 |
| 7. | రాయ్‌పూర్ | 2 | 8,183 | 6,112 |
| 8. | బలోదా బజార్ | 2 | 21,861 | 9,659 |
| 9. | బిలాస్‌పూర్ | 2 | 13,109 | 6,030 |
| 10. | ముంగేలీ | 2 | 9,600 | 6,418 |
| 11. | తాంజ్ గిర్ | 2 | 11,914 | 7,419 |
| 12. | ద్రంగ్ | 2 | 5,975 | 5,593 |
| 13. | భండారా–సకోలీ | 2 | 16,824 | 10,491 |
| 14. | యోత్మార్–దరేషా | 2 | 10,915 | 4,719 |
| 15. | ఎలిచ్ పూర్ | 2 | 16,298 | 4,592 |
| 16. | చిక్లీ–మెహకర్ | 2 | 16,397 | 2,748 |
| 17. | అకోలా–బాలాపూర్ | 2 | 6,455 | 5,567 |

## VI. అస్సాం

| సంఖ్య | నియోజకవర్గం పేరు | స్థానాలు | గెలిచిన హిందూ అభ్యర్థులకు వచ్చిన ఓట్లు | | గెలిచిన షెడ్యూల్డు కులాల అభ్యర్థులకు వచ్చిన ఓట్లు |
|---|---|---|---|---|---|
| 1. | కామరూప్-సోర్ సౌత్ | 3 | 15,890 | 14,971 | 13,693 |
| 2. | నౌగాంగ్ | 1 | .. | .. | 14,560 |
| 3. | జోర్‌హాట్, నార్త్ | 2 | 17,429 | .. | 5,809 |
| 4. | హబీబ్ గంజ్ | 2 | 10,985 | .. | 9,770 |
| 5. | కరీంగంజ్ | 2 | 12,562 | .. | 11,676 |
| 6. | సిల్చార్ | 2 | 17,340 | .. | 7,081 |

## VII. ఒరిస్సా

| సంఖ్య | నియోజకవర్గం పేరు | స్థానాలు | గెలిచిన హిందూ అభ్యర్థులకు వచ్చిన ఓట్లు | గెలిచిన షెడ్యూల్డు కులాల అభ్యర్థులకు వచ్చిన ఓట్లు |
|---|---|---|---|---|
| 1. | ఈస్ట్ తాజ్‌పూర్ | 2 | 8,427 | 8,712 |
| 2. | ఈస్ట్ బరార్ | 2 | 4,195 | 937 |

## రెండవ వరుస పట్టికలు

### షెడ్యూలు కులాల అభ్యర్థులు ఎన్నికలో గెలుపొందడానికి రిజర్వేషన్ అవసరమైన నియోజకవర్గాల సంఖ్య

| | రాష్ట్రంపేరు | షెడ్యూలు కులాల వారికి స్థానాలు రిజర్వు చేసిన నియోజక వర్గాల సంఖ్య | పోటీ ఉన్న నియోజక వర్గాల సంఖ్య | హిందూ అభ్యర్థులు ఎక్కువ కావడం వల్ల పోటీ ఉన్న నియోజక వర్గాల సంఖ్య | షెడ్యూలు కులాల అభ్యర్థులు ఎక్కువ కావడం వల్ల పోటీ ఉన్న నియోజక వర్గాల సంఖ్య | షెడ్యూలు కులాలు హిందూ అభ్యర్థులు ఎక్కువ కావడం వల్ల పోటీ ఉన్న నియోజక వర్గాల సంఖ్య | షెడ్యూలు కులాల అభ్యర్థులు గెలుపొందడానికి రిజర్వేషన్ పై తప్పని సరిగా ఆధారపడవల్సి వచ్చిన నియోజక వర్గాలు |
|---|---|---|---|---|---|---|---|
| 1. | మద్రాసు | 30 | 18 | 14 | 17 | – | లేవు |
| 2 | బెంగాల్ | 30 | 24 | 19 | 24 | 19 | లేవు |
| 3. | బొంబాయి | 15 | 15 | 15 | 15 | 15 | 2 |
| 4. | సి.పి. | 22 | 17 | 14 | 17 | 14 | 2 |
| 5. | యు.పి. | 15 | 11 | 5 | 11 | 6 | లేవు |
| 6. | అస్సాం | – | – | – | – | – | 2 |
| 7. | ఒరిస్సా | – | 2 | – | 2 | – | లేవు |
| 8. | పంజాబ్ | 8 | – | – | – | – | – |

## మూడవ వరుస పట్టికలు

## సవర్ణ హిందువుల, షెడ్యూల్డు కులాల సాపేక్ష వోటింగ్ బలం

| నియోజక వర్గం | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లు | నియోజక వర్గం షెడ్యూల్డు కులాల ఓటర్లు | ఓటర్లలో షెడ్యూల్డుకులాల ఓటర్ల సాపేక్ష నిష్పత్తి |
|---|---|---|---|
| 1. మద్రాస్‌నగరం, సౌత్ సెంట్రల్ | 26,922 | 4,082 | 1 : 6.6 |
| 2. చికాకోల్ (శ్రీకాకుళం) | 90,496 | 8,070 | 1 : 11.2 |
| 3. అమలాపురం | 95,954 | 28,282 | 1 : 3.4 |
| 4. కాకినాడ | 86,932 | 17,616 | 1 : 4.9 |
| 5. ఏలూరు | 88,249 | 16,835 | 1 : 5.24 |
| 6. ఒంగోలు | 1,10,152 | 11,233 | 1 : 9.8 |
| 7. గూడూరు | 52,415 | 10,263 | 1 : 5.1 |
| 8. కడప | 92,572 | 10,842 | 1 : 8.5 |
| 9. పెనుకొండ | 74,952 | 11,896 | 1 : 6.3 |
| 10. బళ్ళారి | 85,928 | 10,146 | 1 : 8.5 |
| 11. కర్నూలు | 72,753 | 11,679 | 1 : 6.2 |
| 12. తిరుత్తని | 77,337 | 15,243 | 1 : 5.07 |
| 13. చెంగల్‌పట్ | 73,554 | 22,182 | 1 : 3.3 |
| 14. తిరువళ్ళూరు | 81,814 | 21,287 | 1 : 3.8 |
| 15. రాణీపేట్ | 24,403 | 11,271 | 1 : 2.1 |
| 16. తిరువణ్ణామలై | 97,259 | 15,536 | 1 : 6.2 |
| 17. తిండివనం | 85,514 | 19,221 | 1 : 4.4 |
| 18. చిదంబరం | 96,086 | 16,762 | 1 : 5.7 |
| 19. తిరుకోయిలూర్ | 1,02,482 | 21,733 | 1 : 4.7 |
| 20. తంజావూర్ | 99,496 | 13,198 | 1 : 7.5 |
| 21. మన్నార్‌గుడి | 69,579 | 11,547 | 1 : 5.8 |
| 22. అరియాలూర్ | 1,13,630 | 16,772 | 1 : 6.7 |
| 23. పళని | 92,655 | 13,521 | 1 : 6.8 |
| 24. సత్తూర్ | 84,169 | 8,033 | 1 : 10.5 |
| 25. కోయిల్‌పట్టి | 1,00,521 | 20,907 | 1 : 4.8 |
| 26. పొల్లాచ్చి | 63,821 | 12,808 | 1 : 4.9 |
| 27. నమక్కల్ | 51,860 | 11,407 | 1 : 4.5 |
| 28. కుందాపూర్ | 46,032 | 8,038 | 1 : 5.7 |
| 29. మలపురం | 70,346 | 10,808 | 1 : 6.5 |

## II. బొంబాయి

| నియోజక వర్గం | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లు | నియోజక వర్గంలోని షెడ్యూల్డు కులాల ఓటర్లు | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లలో షెడ్యూల్డు కులాల ఓటర్ల సాపేక్ష నిష్పత్తి |
|---|---|---|---|
| నగర ప్రాంతాలు – జనరల్ | | | |
| 1. బొంబాయి నగరం | 1,67,002 | 34,266 | 1 : 4.8 |
| 2. బొంబాయి నగరం బైకుల్లా, పారెల్ | 1,52,991 | 28,520 | 1 : 5.3 |
| గ్రామ ప్రాంతాలు జనరల్ | | | |
| 3. కైరా జిల్లా | 1,39,508 | 7,318 | 1 : 19.06 |
| 4. సూరత్ జిల్లా | 85,670 | 4,765 | 1 : 18.8 |
| 5. ఠాణా సౌత్ | 67,749 | 4,668 | 1 : 14.5 |
| 6. దక్షిణ అహ్మద్‌నగర్ | 73,162 | 7,382 | 1 : 9.9 |
| 7. తూర్పు ఖాండేష్ | 91,377 | 10,109 | 1 : 9.35 |
| 8. పశ్చిమ నాసిక్ | 99,274 | 12,698 | 1 : 7.7 |
| 9. పశ్చిమ పూనా | 73,551 | 13,055 | 1 : 5.6 |
| 10. ఉత్తర సతారా | 95,459 | 11,152 | 1 : 8.5 |
| 11. షోలాపూర్, నార్త్ ఈస్ట్ | 64,583 | 9,713 | 1 : 6.6 |
| 12. ఉత్తర బెల్‌గామ్ | 79,422 | 18,303 | 1 : 4.3 |
| 13. ఉత్తర బిజాపూర్ | 60,655 | 8,993 | 1 : 6.7 |
| 14. కొలాబా జిల్లా | 1,03,828 | 5,001 | 1 : 20.7 |
| 15. ఉత్తర రత్నగిరి | 32,606 | 3,529 | 1 : 9.2 |

## III. బెంగాల్

| నియోజక వర్గం | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లు | నియోజక వర్గం లోని షెడ్యూల్డు కులాల ఓటర్లు | ఓటర్లలో షెడ్యూల్డు కులాల ఓటర్ల సాపేక్ష నిష్పత్తి |
|---|---|---|---|
| గ్రామ ప్రాంతాలు – జనరల్ | | | |
| 1. మధ్య బర్ద్వాన్ | 74,306 | 24,610 | 1 : 3.01 |
| 2. వాయవ్య బర్ద్వాన్ | 80,035 | 16,830 | 1 : 4.8 |
| 3. బీర్‌భూమ్ | 1,03,231 | 36,637 | 1 : 2.7 |

| | | | |
|---|---|---|---|
| 4. పశ్చిమ బంకూరా | 84,128 | 25,487 | 1 : 3.3 |
| 5. మధ్య మిడ్నపూర్ | 99,961 | 20,167 | 1 : 4.95 |
| 6. బర్ధం-ఘటాల్ | 64,031 | 13,091 | 1 : 4.85 |
| 7. వాయవ్య హుగ్లీ | 67,697 | 20,318 | 1 : 3.33 |
| 8. హౌరా | 1,03,346 | 22,990 | 1 : 4.5 |
| 9. 24 పరగణాలు-నైరుతి | 82,366 | 47,378 | 1 : 1.7 |
| 10. 24 పరగణాలు –ఈశాన్య | 85,477 | 30,607 | 1 : 2.78 |
| 11. నాడియా | 90,092 | 25,605 | 1 : 3.5 |
| 12. ముర్షిదాబాద్ | 81,083 | 17.176 | 1 : 4.8 |
| 13. బస్సార్ | 1,21,760 | 55,052 | 1 : 2.2 |
| 14. ఖుల్నా | 1,45,335 | 76,848 | 1 : 1.87 |
| 15. మాల్డా | 73,664 | 29,010 | 1 : 2.54 |
| 16. దినాజ్‌పూర్ | 1,48,804 | 1,18,454 | 1 : 1.25 |
| 17. జలపాయ్‌గురి-సిలిగురి | 78,552 | 65,679 | 1 : 1.2 |
| 18. రంగపూర్ | 29,437 | 65,679 | 1 : 0.44 |
| 19. బొగ్రా-పబ్న | 87,704 | 33,873 | 1 : 2.58 |
| 20. ఢాకా ఈస్ట్ | 94,858 | 40,238 | 1 : 2.35 |
| 21. మైమన్‌సింగ్ (పశ్చిమం) | 98,795 | 38,046 | 1 : 2.59 |
| 22. మైమన్‌సింగ్ (తూర్పు) | 68,360 | 29,588 | 1 : 2.3 |
| 23. ఫరీద్‌పూర్ | 1,72,683 | 96,319 | 1 : 1.7 |
| 24. బకర్‌గంజ్ నైరుతీ భాగం | 78,796 | 49,014 | 1 : 1.6 |
| 25. తిప్పెరా | 1,27,097 | 34,813 | 1 : 13.61 |

## IV. సంయుక్త పరగణాలు

| నియోజక వర్గం | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లు | నియోజక వర్గం లోని షెడూల్డు కులాల ఓటర్లు | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లలో షెడ్యూల్డు కులాల ఓటర్ల సాపేక్ష నిష్పత్తి |
|---|---|---|---|
| నగర ప్రాంతాలు – జనరల్ | | | |
| 1. లక్నో నగరం | 89,412 | 9,079 | 1 : 9.8 |
| 2. కాన్పూర్ నగరం | 1,31,599 | 22,515 | 1 : 5.8 |
| 3. ఆగ్రా నగరం | 47,505 | 10,105 | 1 : 4.7 |

| | | | |
|---|---|---|---|
| 4. అలహాబాద్ నగరం | 55,379 | 6,854 | 1 : 8.07 |
| జనరల్ రూరల్ | | | |
| 5. చర్నపూర్ జిల్లా ఆగ్నేయం | 47,773 | 7,256 | 1 : 6.5 |
| 6. బులంద్ షా జిల్లా-ఆగ్నేయం | 49,699 | 7,506 | 1 : 6.6 |
| 7. ఆగ్రాజిల్లా, -ఈశాన్యం | 61,515 | 8,290 | 1 : 7.4 |
| 8. మణిపూరీజిల్లా -ఈశాన్యం | 51,406 | 5,878 | 1 : 8.7 |
| 9. బుదేన్ జిల్లా -తూర్పు | 46,966 | 7,087 | 1 : 6.6 |
| 10. జలాన్ జిల్లా | 68,815 | 14,611 | 1 : 4.7 |
| 11. ఉత్తర మీర్జాపూర్ జిల్లా | 43,648 | 4,045 | 1 : 10.7 |
| 12. ఉత్తర గోరఖ్ పూర్ జిల్లా | 43,441 | 5,626 | 1 : 7.7 |
| 13. బస్తి జిల్లా, దక్షిణం | 37,084 | 4,194 | 1 : 8.8 |
| 14. అజయ్ ఘర్ జిల్లా -పశ్చిమం | 51,194 | 8,127 | 1 : 6.2 |
| 15. ఆల్ మోరా జిల్లా-పశ్చిమం | 1,39,217 | 20,671 | 1 : 6.7 |
| 16. రాయిబరేలీ జిల్లా-ఈశాన్యం | 48,697 | 10,488 | 1 : 4.6 |
| 17. సితాపూర్ జిల్లా-ఈశాన్యం | 76,682 | 22,913 | 1 : 3.3 |
| 18. ఫైజాబాద్ జిల్లా -తూర్పు | 57,154 | 9,988 | 1 : 5.7 |
| 19. గోండాజిల్లా-ఈశాన్యం | 64,225 | 8,274 | 1 : 7.7 |
| 20. బరాబంకీ జిల్లా -ఉత్తరం | 68,285 | 16,303 | 1 : 4.18 |

## V. మధ్య పరగణాలు

| నియోజక వర్గం | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లు | నియోజక వర్గం లోని షెడూల్డు కులాల ఓటర్లు | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లలో షెడ్యూల్డు కులాల ఓటర్ల సాపేక్ష నిష్పత్తి |
|---|---|---|---|
| నగర ప్రాంతాలు - జనరల్ | | | |
| 1. నాగపూర్ నగరం | 72,329 | 14,388 | 1 : 5.02 |
| గ్రామ ప్రాంతాలు - జనరల్ | | | |
| 2 నాగపూర్-ఉమ్రేర్ | 29,267 | 6,037 | 1 : 48 |
| 3. హింఘన్ ఘాట్-వార్ధా | 35,201 | 4,011 | 1 : 9.02 |
| 4. చాందా-బ్రహ్మపురీ | 30,132 | 5,229 | 1 : 5.7 |
| 5 చింద్వారా-సౌసార్ | 37,942 | 3,914 | 1 : 9.7 |
| 6. దమోహ్-హట్టా | 33,284 | 3,608 | 1 : 9.2 |

| | | | |
|---|---|---|---|
| 7. జబల్‌పూర్-పటాన్ | 20,587 | 1,186 | 1 : 17.5 |
| 8. సాగోర్-ఖురై | 30,660 | 5,224 | 1 : 5.8 |
| 9. నర్సింగ్‌పూర్-గదర్‌వరా | 35,781 | 2,019 | 1 : 17.6 |
| 10. రాయిపూర్ | 33,053 | 11,041 | 1 : 2.9 |
| 11. బలోదాబజార్ | 46,943 | 15,636 | 1 : 3 .06 |
| 12. బిలాస్‌పూర్ | 33,260 | 10,547 | 1 : 3.1 |
| 13. ముంగేలీ | 28,028 | 10,067 | 1 : 2.7 |
| 14. జంజ్‌గిర్ | 42,763 | 13,558 | 1 : 3.15 |
| 15. ద్రగ్ | 34,883 | 8,942 | 1 : 3.19 |
| 16. ఎలిక్‌పూర్-దర్తపూర్ నెలేఘాట్ | 30,094 | 2,885 | 1 : 13.8 |
| 17. భండారా-సకోల్ | 47,047 | 10,399 | 1 : 4.5 |
| 18. అకోలా-బెలాపూర్ | 25,912 | 3,233 | 1 : 9.81 |
| 19. యోత్మల్-దర్వా | 20,327 | 2,020 | 1 : 10.06 |
| 20. చిఖ్‌లీ-మెహక్తర్ | 37,936 | 3,468 | 1 : 10.9 |

## VI. బీహార్

| నియోజక వర్గం | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లు | నియోజక వర్గం లోని షెడ్యూల్డు కులాల ఓటర్లు | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లలో షెడ్యూల్డు కులాల ఓటర్ల సాపేక్ష నిష్పత్తి |
|---|---|---|---|
| 1. తూర్పు బీహార్ | 35,631 | 4,618 | 1 : 7.7 |
| 2. దక్షిణ గయా | 49,363 | 10,360 | 1 : 4.7 |
| 3. నావడా | 41,432 | 7,684 | 1 : 5.3 |
| 4. తూర్పు మధ్య షహబాద్ | 41,707 | 5,984 | 1 : 6.9 |
| 5. పశ్చిమ గోపాల్ ఘంజ్ | 33,395 | 3,415 | 1 : 9.7 |
| 6. ఉత్తర బెట్టియా | 25,760 | 2,831 | 1 : 9.09 |
| 7. తూర్పు ముజఫర్ సదర్ | 27,271 | 3,133 | 1:8.7 |
| 8. దర్భాంగా గదర్ | 26,864 | 2,116 | 1 : 12.6 |
| 9. ఆగ్నేయ, సమస్తిపూర్ | 37,291 | 2,672 | 1 : 13.9 |
| 10. దక్షిణ సదర్ మోంగ్యార్ | 54,229 | 6,465 | 1 : 8.5 |
| 11. మధిపూర్ | 26,523 | 1,284 | 1 : 20.6 |

| | | | |
|---|---|---|---|
| 12. నైరుతి పూర్ణియా | 44,232 | 2,938 | 1 : 15.05 |
| 13. గరిధి – ఘత్రా | 55,246 | 4,667 | 1 : 11.8 |
| 14. ఈశాన్య పలమ్ము | 23,072 | 4,237 | 1 : 5.3 |
| 15. సెంట్రల్ మన్‌భుమ్ | 39,626 | 5,617 | 1 : 7.05 |

## VII. అస్సాం

| నియోజక వర్గం | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లు | నియోజక వర్గం లోని షెడ్యూల్డు కులాల ఓటర్లు | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లలో షెడ్యూల్డు కులాల ఓటర్ల సాపేక్ష నిష్పత్తి |
|---|---|---|---|
| 1. నౌగాంగ్–ఈశాన్యం | 26,618 | 3,569 | 1 : 7.2 |
| 2. కామరూప్ సదర్ –దక్షిణం | 33,234 | 2,117 | 1 : 15.6 |
| 3. సిల్చార్ | 38,647 | 4,201 | 1 : 9.2 |
| 4. కరీమ్ గంజ్–తూర్పు | 25,701 | 10,132 | 1 : 2.5 |
| 5. జోర్హాత్– ఉత్తరం | 26,733 | 1,360 | 1 : 19.6 |
| 6. జొనమ్‌గంజ్ | 39,045 | 11,603 | 1 : 3.3 |
| 7. హబిబ్‌గంజ్–ఉత్తరం | 31,511 | 9,996 | 1 : 3.1 |

## VIII. పంజాబ్

| నియోజక వర్గం | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లు | నియోజక వర్గం లోని షెడ్యూల్డు కులాల ఓటర్లు | నియోజక వర్గంలోని మొత్తం ఓటర్లలో షెడ్యూల్డు కులాల ఓటర్ల సాపేక్ష నిష్పత్తి |
|---|---|---|---|
| 1. ఆగ్నేయ – గుర్‌గావ్ | 37,815 | 6,049 | 1 : 6.2 |
| 2. కర్నాల్– ఉత్తరం | 31,967 | 5,120 | 1 : 6.2 |
| 3. అంబాలా– సిమ్లా | 47,403 | 17,507 | 1 : 3.27 |
| 4. పశ్చిమ హొషియార్‌పూర్ | 51,084 | 7,281 | 1 : 7.0 |
| 5. జలంధర్ | 36,570 | 20,521 | 1 : 1.8 |
| 6. లూధియానా, ఫిరోజ్‌పూర్ | 52,009 | 27,354 | 1 : 1.8 |
| 7. అమృత్‌సర్, సియాల్‌కోట్ | 38,046 | 10,328 | 1 : 3.68 |
| 8. లాయల్‌పూర్, జంగ్ | 32,703 | 7,602 | 1 : 4.2 |

## నాలుగవ వరుస పట్టికలు

### ప్రాథమిక, అంతిమ ఎన్నికల పోలిక

### 1. మద్రాసు

| నియోజక వర్గం | పేరు | అంతిమ ఎన్నికలో గెలుపొందిన షెడ్యూల్డు కులాల అభ్యర్థి — పార్టీ అనుబంధం | సంపాదించిన ఓట్లు | సాధారణ ఎన్నికలలో పోటీపడిన అభ్యర్థుల్లో అతని స్థానం | నియోజక వర్గాన్నంతా ఏకసభ్య నియోజక వర్గంగా పరిగణించి నప్పుడు ప్రాథమిక ఎన్నికలో అతని స్థానం | ప్రాథమిక ఎన్నికలో వచ్చిన ఓట్లు | ప్రాథమిక ఎన్నికలో అతని విజయం నామమాత్రపు మెజారిటితోనా లేక చీలికతోనా లేక సంపూర్ణ మెజారిటీ వల్ల వచ్చిందా? |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1 అమలాపురం | పండులక్ష్మణస్వామి | కాంగ్రెస్ | 48,524 | ముగ్గురిలో ప్రథముడు | 3వ స్థానం (పరాజయం) | 2,683 | .. . |
| 2 కాకినాడ | బి.ఎస్.మూర్తి | కాంగ్రెస్ | 28,544 | 4గురిలో 2వవాడు (ఇద్దరు హిందువులను ఓడించి) | 4వస్థానం (పరాజయం) | 1,411 | . .. |
| 3. బందరు | వేముల కూర్మయ్య | కాంగ్రెస్ | 70,931 | 6గురిలో 1వవాడు (4గురు హిందువులను ఓడించి) | 2వ స్థానం (పరాజయం) | 4,914 | . . |
| 4. కడప | స్వర్లా నాగయ్య | కాంగ్రెస్ | | | 1వ స్థానం | 3,482 | సంపూర్ణ మెజారిటీ |
| 5. పెనుకొండ | డి. కదిరప్ప | కాంగ్రెస్ | 18,125 | 4గురిలో ప్రథముడు (ఒక హిందువును, ఇద్దరు షెడ్యూల్డు కులాలవారిని ఓడించి) | 1వ స్థానం | 2,564 | నామమాత్ర మెజారిటీ |
| 6. తిరువణమాలి | ఆర్.తంగవేలు | కాంగ్రెస్ | 32,132 | 5 గురిలో ప్రథముడు (ఇద్దరు షెడ్యూల్డు కులాలవారిని ఇద్దరు హిందువులను ఓడించి) | 1వ స్థానం | 1,960 | నామమాత్ర మెజారిటీ |

ఇద్దరు హిందువులను ఓడించి)

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| 7. తిండివనం | కె.కులశేఖర్ దాస్ | కాంగ్రెస్ | 25,442 | 4 గురిలో 2వ వాడు (ఇద్దరు హిందువులను ఓడించి) | 1వ స్థానం | 2,785 | చీలిక ఓటు |
| 8. మన్నారు గుడి | తియాగూవైకరార్ | కాంగ్రెస్ | 30,116 | 5గురిలో ప్రథముడు (5గురు హిందువులను ఓడించి) | 1వ స్థానం | 2,895 | చీలిక ఓటు |
| 9. పొల్లాచి | సి.కృష్ణ కుదుంబన్ | కాంగ్రెస్ | - | | 1వ స్థానం | 2,430 | సంపూర్ణ మెజారిటీ |
| 10. నమక్కల్ | ఎం.పి.పెరియస్వామి | కాంగ్రెస్ | 15,085 | 5 గురిలో 2వ వాడు (ఇద్దరు హిందువులను ఒక షెడ్యూల్డు కులం అభ్యర్థిని ఓడించి) | 1వ స్థానం | 2,355 | నామమాత్రపు మెజారిటీ |

## II. బొంబాయి

| నియోజక వర్గం | పేరు | అంతిమ ఎన్నికలో గెలుపొందిన షెడ్యూల్డు కులాల అభ్యర్థి: పార్టీ అనుబంధం | సంపాదించిన ఓట్లు | సాధారణ ఎన్నికలలో పోటీపడిన అభ్యర్థుల్లో అతని స్థానం | నియోజక వర్గాన్నంతా ఏకసభ్య నియోజక వర్గంగా పరిగణించినప్పుడు ప్రాథమిక ఎన్నికలో అతని స్థానం | ప్రాథమిక ఎన్నికలో వచ్చిన ఓట్లు | ప్రాథమిక ఎన్నికలో అతని విజయం నామమాత్రపు మెజారిటితోనా చీలిక ఓటుతోనా లేక సంపూర్ణ మెజారిటీ వల్ల వచ్చిందా? |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1. బొంబాయి నగరం | సవలరామ్ గుండాజీ సోనే గావ్‌కర్ | కాంగ్రెస్ | 59,646 | ముగ్గురిలో ప్రథముడు (ఇద్దరు హిందూ అభ్యర్థుల కంటే ముందు) | 2వ స్థానం (పరాజయం) | 2,038 | .... |
| 2. బొంబాయి నగరం, బైదుల్లా పరెల్ | ఎన్.ఎస్.కజరోల్‌కర్ | కాంగ్రెస్ | 43,251 | ముగ్గురిలో ప్రథముడు (ఇద్దరు సాధారణ అభ్యర్థుల కంటె ముందు) | 2వ స్థానం (పరాజయం) | 21,098 | |
| 3. ఈస్ట్ ఖందేష్ ఈస్ట్ | హీరాలాల్ కళ్యాణి | కాంగ్రెస్ | 36,136 | 4గురిలో 2వ వాడు (ఇద్దదరిని ఓడించి) | 2వ స్థానం (పరాజయం) | 1,147 | . |

## III. సెంట్రల్ ప్రావిన్సులు

| నియోజక వర్గం | పేరు | అంతిమ ఎన్నికలో గెలుపొందిన షెడ్యూల్డు కులాల అభ్యర్థి: పార్టీ అనుబంధం | సంపాదించిన ఓట్లు | సాధారణ ఎన్నికలలో పోటీపడిన అభ్యర్థుల్లో అతని స్థానం | నియోజక వర్గాన్నంతా ఏకసభ్య నియోజక వర్గంగా పరిగణించి నప్పుడు ప్రాథమిక ఎన్నికలో అతని స్థానం | ప్రాథమిక ఎన్నికలో వచ్చిన ఓట్లు | ప్రాథమిక ఎన్నికలో అతని విజయం నామమాత్రపు మెజారిటీయా, సంపూర్ణ మెజారిటీయా లేక చీలిక ఓటు వల్ల వచ్చిందా? |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1. నాగపూర్ ఉమ్రేర్ | లవీంద్ర రామచంద్ర | కాంగ్రెస్ | 7,847 | 2వ స్థానం | 3వ స్థానం (పరాజయం) | 112 | .... |
| 2. హింఘన్ ఘాట్-వార్ధా | శంకర్ విఠల్ | కాంగ్రెస్ | 10,781 | 2వ స్థానం | 4వ స్థానం (పరాజయం) | 56 | ...... |
| 3. భండ్రా-సకోలీ | హర్యాన్జీ ఇస్రాం | కాంగ్రెస్ | 10,491 | 2వ స్థానం | 3వ స్థానం (పరాజయం) | 471 | ...... |
| 4. యోత్మాల-దార్వా | దౌలత్ లక్ష్మన్ | కాంగ్రెస్ | 4,791 | 2వ స్థానం | 3వ స్థానం (పరాజయం) | 126 | ...... |

## IV. యునైటెడ్ ప్రావిన్సులు

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| 1. ఆగ్రానగరం | రామ్‌చంద్ | కాంగ్రెస్ | 16,343 | 2వ స్థానం | మొదటిస్థానం (పరాజయం) | 836 | చీలిక ఓటు నామమాత్రపు మెజారిటీ |
| 2. అలహాబాద్ | మసురియాదీన్ | కాంగ్రెస్ | 10,308 | 2వ స్థానం | మొదటిస్థానం | 1,701 | చీలిక ఓటు నామమాత్రపు మెజారిటీ |
| 3. అల్మోరా | ఖుషీరామ్ | కాంగ్రెస్ | 20,605 | 2వ స్థానం | 2వ స్థానం (పరాజయం) | 937 | |

## V. పంజాబ్

| నియోజక వర్గం | పేరు | అంతిమ ఎన్నికలో గెలుపొందిన షెడ్యూల్డు కులాల అభ్యర్థి పార్టీ అనుబంధం | సంపాదించిన ఓట్లు | సాధారణ ఎన్నికలలో పోటీపడిన అభ్యర్థుల్లో అతని స్థానం | నియోజక వర్గాన్నంతా ఏకసభ్య నియోజక వర్గంగా పరిగణించి నప్పుడు ప్రాథమిక ఎన్నికలో అతని స్థానం | ప్రాథమిక ఎన్నికలో వచ్చిన ఓట్లు | ప్రాథమిక ఎన్నికలో అతని విజయం నామమాత్రపు మెజారిటీయా, సంపూర్ణ మెజారిటీయా లేక చీలిక ఓటు వల్ల వచ్చిందా? |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1. సౌత్ ఈస్ట్ గురు గాంవే | ప్రేంసింగ్ | యూనియనిస్ట్ | 7,706 | 2వ స్థానం | మొదటి స్థానం | 1,353 | చీలిక ఓటు |
| 2. కర్నాల్,నార్త్ | సుందర్ | కాంగ్రెస్ | 3,136 | 2వ స్థానం | మొదటి స్థానం | 519 | నామమాత్రపు మెజారిటీ |
| 3. అంబాలా-సిమ్లా | పృథ్వీ సింగ్ అజాద్ | కాంగ్రెస్ | 10,503 | 2వ స్థానం | 3వ స్థానం (పరాజయం) | 1,392 | .... |
| 4. హోషియార్‌పూర్ వెస్ట్ | మెహర్ చంద్ | కాంగ్రెస్ | 16,307 | 2వ స్థానం | 3వ స్థానం (పరాజయం) | 641 | ... |
| 5. జలంధర్ | గురుబంతసింగ్ | కాంగ్రెస్ | 21,476 | 1వ స్థానం | 1వ స్థానం (పరాజయం) | ... | .... |
| 6. లూథియానా ఫిరోజ్‌పూర్ | మటూరామ్ | కాంగ్రెస్ | 24,352 | 1వ స్థానం | 4వ స్థానం | 812 | .... |
| 7. లాయక్‌పూర్, జంగ్ | హర్‌భజ్‌రామ్ | .... | 8,312 | 2వ స్థానం | 2వ స్థానం (పరాజయం) | 1,166 | .... |

# అనుబంధం IV

## జనాభా గణాంక వివరాలు

1941లో షెడ్యూలు కులాల జనాభా 48,793,180 అని అంచనా వేయబడింది. దీనిని ఖచ్చితమైన సంఖ్యగా అంగీకరించవచ్చా?

ఈ సమస్యపై ఒక నిర్దిష్టమైన అభిప్రాయానికి వచ్చేటప్పుడు ఈ క్రింది అంశాలను దృష్టిలో ఉంచుకోవాలి.

(1) 1931 నాటి షెడ్యూల్డు కులాల జనాభాతో 1941 నాటి వారి జనాభాను పోలిస్తే తరుగుదల కనిపిస్తోంది.

() ఇదే సమయంలో ఇతర అన్ని కుల మతాల వారి జనాభాలో 15 శాతం పెరుగుదల కనిపిస్తోంది.

షెడ్యూలు కులాల జనాభాలో ఈ తరుగుదల ఉండటానికి ఏదైనా ప్రత్యేక కారణముందా అనేదే ప్రశ్న.

1941లో షెడ్యూలు కులాల జనభా లెక్కల సేకరణకు తీసుకున్న ప్రాతిపదిక 1931లో తీసుకున్న ప్రాతిపదిక ఒకటేనా? ఈ ప్రశ్నకు అవుననే సమాధానం. "అంటరాని వారు" అన్న పదానికి లోధియన్ కమిటీ ఇచ్చిన నిర్వచనాన్ని బట్టి, 1931 జనాభా లెక్కలను తిరిగి రాయగా వచ్చినవే 1931 నాటి షెడ్యూలు కులాల జనాభా సంఖ్యలు. 1941లోను నాటి షెడ్యూలు కులాల జనాభాలో తరుగుదలకు కారణం, 1931లో నుంచి అంచనాల వేశారనడానికి వీలులేదు.

1941 జనాభా లెక్కల్లో, అజ్మీర్, మెర్వారా, గ్వాలియర్ సంస్థానాల షెడ్యూలు కులాల వారిని చేర్చలేదన్నది వాస్తవం. కాని 49,538,145 అవుతుంది. దీన్ని 1931తో పోల్చి చూచినపుడు తరుగుదల కనిపిస్తుంది.

గత కొన్ని దశాబ్దాలుగా, జనాభా లెక్కల సేకరణ అనేది జన సంఖ్యా శాస్త్ర నియమాలకు అనుగుణంగా జరగడం లేదు. అదొక, రాజకీయ వ్యవహారంగా మారింది. భారత జనాభా లెక్కల సేకరణను నిజాయితీగా అధ్యయనం చేసే ప్రతి వ్యక్తికీ ఈ అభిప్రాయం వుంది. ఒకే దశాబ్దంలో షెడ్యూలు కులాల జనాభా తరుగుదలకూ, మిగిలిన ఇతర అన్ని వర్గాల మతాల వారి జనాభా పెరుగుదలకూ గల సరైన కారణాన్ని తెలుసు కోవాలనుకునే, ఏ ప్రయత్నమైనా ఈ అభిప్రాయాన్ని మరింతగా బలపరచేదిగా మాత్రమే ఉంటుంది. మరింతగా రాజకీయాధికారాన్ని తన చేతుల్లోకి తీసుకునేందుకు ప్రతి కులమూ, ఇతరులను పణంగా పెట్టి, తన జనాభా సంఖ్యను కృత్రిమంగా పెంచుకోవాలని ప్రయత్నిస్తోంది. ఇతర కులాల

వారందరి అత్యాశలకూ, షెడ్యూలు కులాల వారే ఉమ్మడి బలి పశువులు అయినట్లు కనిపిస్తోంది. ఇతరులందరూ తమ ప్రచారకుల ద్వారా కాని, ఎన్యూమరేటర్ల ద్వారాగాని, జనాభా లెక్కల సేకరణ కార్యక్రమాన్ని, వాటి ఫలితాలనూ నియంత్రిస్తున్నారు.

ఈ పరిస్థితుల దృష్ట్యా, అజ్మీర్- మేర్వార్, గ్వాలియర్ సంస్థానాల జనాభాను కలపడంతో పాటుగా, ఇతర కులాల జనాభాలో ఉన్న 15 శాతం సాధారణ పెరుగుదలను షెడ్యూలు కులాల జనాబాతో చేర్చి జనాభా లెక్కలను సవరించాలనీ, అదే సరైన షెడ్యూలు కులాల జనాభా అవుతుందని డిమాండు చేయడం సమంజసమే అవుతుంది.

# అనుబంధం IV

## జనాభా సంఖ్యలు పట్టిక – 1

### 1941 జనాభా లెక్కల ప్రకారం వివిధ కుల మతాల జనాభా

| | హిందువులు | షెడ్యూల్డు కులాలు | ముస్లింలు | సిక్కులు | ఇండియన్ క్రైస్తవులు | ఆంగ్లో ఇండియన్లు | పారశీలు |
|---|---|---|---|---|---|---|---|
| | (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| ప్రావిన్సులు | 150,890,146 | 39,920,807 | 79,398,503 | 4,165,097 | 3,245,706 | 1,13,936 | 1,01,968 |
| అజ్మీర్-మేర్వార్ | 376,481 | ? | 89,899 | 867 | 3,895 | 1,005 | – |
| అస్సాం* | 3,586,932 | 676,291 | 3,442,479 | 3,464 | 37,750 | 634 | 2 |
| బెలూచిస్తాన్ | 39,521 | 5,102 | 438,930 | 11,918 | 2,633 | 263 | 75 |
| బెంగాల్ | 17,680,054 | 7,378,970 | 33,005,434 | 16,281 | 110,923 | 31,619 | 86,270 |
| బీహార్ | 22,173,890 | 4,340,379 | 4,716,314 | 13,213 | 24,693 | 5,963 | 547 |
| ఒరిస్సా | 5,594,535 | 1,238,171 | 146,301 | 232 | 26,584 | 789 | 13 |
| బొంబాయి | 14,700,242 | 1,855,148 | 1,920,368 | 6,044 | 338,812 | 14,034 | 43,467 |
| సింధ్ | 1,038,292 | 191,634 | 3,208,325 | 31,011 | 13,232 | 2,731 | 1,936 |
| సెంట్రల్ ప్రావిన్సులు, బేరార్ | 9,880,583 | 3,051,413 | 783,697 | 14,996 | 48,260 | 4,538 | 2,014 |
| కూర్గ్ | 105,013 | 25,740 | 14,730 | లేరు | 3,309 | 80 | 12 |
| ఢిల్లీ | 444,532 | 122,693 | 304,971 | 16,157 | 10,494 | 3,408 | 284 |
| మద్రాసు | 34,731,330 | 8,068,492 | 8,896,452 | 418 | 2,001,082 | 28,661 | 369 |

| | (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
|---|---|---|---|---|---|---|---|
| నార్త్ వెస్ట్ ఫ్రాంటియర్ ప్రావిన్సులు | 180,321 | ? | 2,788,797 | 57,939 | 5,426 | 837 | 24 |
| పంజాబ్ | 6,301,737 | 1,248,635 | 16,217,242 | 3,757,401 | 486,038 | 5,891 | 4,327 |
| యునైటెడ్ స్టేట్స్ | 34,094,511 | 11,717,158 | 8,416,308 | 232,445 | 131,327 | 13,383 | 1,375 |
| సంస్థానాల్లో ఏజెన్సీలూ | 55,227,180 | 8,892,373 | 12,659,593 | 1,526,350 | 2,794,959 | 26,468 | 12,922 |
| భారతదేశం | 206,117,326 | 48,813,180 | 92,058,096 | 5,691,447 | 6,040,665 | 140,422 | 114,490 |
| *గిరిజనులు | 6,484,996 | | | | | | |

గిరిజనులు

| | |
|---|---|
| ప్రావిన్సులు | 16,713,256 |
| స్టేట్స్ అండ్ ఏజెన్సీసు | 8,728,233 |
| భారత దేశం | 25,441,489 |

## పట్టిక II

### 1931–1941 మధ్య వివిధ మతాల జనాభాలో గల తేడా

| | ప్రావిన్సులు | సంస్థానాలూ ఏజెన్సీలూ | మొత్తం భారతదేశంలో | ప్రావిన్సులు | స్టేట్స్ అండ్ ఏజెన్సీస్ | మొత్తం భారతదేశంలో | మొత్తం శాతం |
|---|---|---|---|---|---|---|---|
| హిందువులు | 139,319,979 | 50,335,391 | 189,654,370 | 150,890,146 | 55,227,180 | 206,117,326 | +26,462,956 |
| షెడ్యూల్డు కులాలు | 38,409,009 | 11,131,761 | 49,540,770 | 39,920,807 | 8,892,373 | 48,793,180 | -747,590 |
| ముస్లింలు | 67,020,443 | 10,657,102 | 77,677,545 | 79,398,503 | 12,659,598 | 92,058,096 | +14,381,551 |
| సిక్కులు | 3,220,997 | 1,114,774 | 4,335,771 | 4,165,097 | 1,526,350 | 5,691,447 | +1,355,676 |
| క్రైస్తవులు | 3,866,660 | 2,430,103 | 6,296,763 | 3,471,430 | 2,834,119 | 6,316,119 | +19,786 |
| పారశీలు | 96,549 | 13,203 | 109,752 | 101,968 | 12,922 | 114,890 | +5,138 |

(+) పెరుగుదల

(–) తరుగుదల

అనువాదం : పి. బాలకృష్ణ, బొజ్జా తారకం

కమతాలు చిన్నవిగాను, చెదురుమదురుగా ఉండటం వల్ల గొప్పదైన మన జాతీయ పరిశ్రమకు సంబంధించి ఎంతో ఆందోళన కలిగిస్తుంది.

గణాంకవివరాలను పోల్చి చూసినపుడు ఈ భావన మరీ ఎక్కువవుతుంది. భారతదేశంలోని ఆర్థిక జీవితానికి సంబంధించిన రెండు ముఖ్యమైన వాస్తవాలను, అవి ఏమంటే మన దేశం ప్రధానంగా వ్యవసాయికదేశం

(2) మన దేశం వ్యవసాయిక ఉత్పత్తి చాల తక్కువగా ఉండటం.

## వృత్తిపరమైన వివరాలు :-

ఈ రెండు వాస్తవాలు ఎంతో బాధాకరమైనవి కావటంతో చాలామంది ఈ తక్కువ ఉత్పత్తి ఎందుకు జరుగుతుందో కారణాలు తెలుసుకొనే ప్రయత్నం చేసారు. వీటి ఫలితంగా భూకమతాలు ఎక్కువగా విడిపోవటం, ముక్కలు అయిపోవటం మీద దృష్టిని కేంద్రీకరించటం జరిగింది. భూకమతాలను పెద్దవిగా చేసి కూడగట్టండి, దానిలో వ్యవసాయోత్పత్తి దానంతటదే ఎక్కువవుతుందని చాల నమ్మకంగా వాదిస్తున్నారు.

## ఏకీకరణ

కమతాలను కూడగట్టడం అనేది ఆచరణపరమైన సమస్యకాగా వాటిని విస్తరింప చేయటం సిద్ధాంతపరమైన సమస్య. వాటి పరిమాణాన్ని నిర్దేశిస్తుందనే సూత్రంపై చర్చకు దారితీస్తాయి ఇవి.

ఈ రెండుగూడ వాటి పరిమాణాన్ని నిర్దేశించే సూత్రము మీద ఆధారపడి ఉన్నవి. కమతాలను విస్తరించే సిద్ధాంతపరమైన సమస్య ప్రక్కకు పెట్టి, కమతాలను ఏకీకరణ పరిశీలించగా క్రింది రెండు అంశాలు తలెత్తుతున్నాయి.

(1) చిన్న, చదరిపోయిన కమతాలను ఏవిధంగా కూడగట్టాలి?

విస్తరణకు సంబంధించిన సిద్ధాంతపరమైన సమస్యపై చర్చను వాయిదావేసి ఏకీకరణ అనే సమస్యను తీసుకుంటే అందులో రెండు విషయాలు ప్రస్తావనకు వస్తాయి.

(1) ప్రస్తుతమున్నట్టుగా చిన్నచిన్నవిగా చెదురుమదురుగా ఉన్నవాటిని కలపటం ఎలా, (2) ఒకసారి కలిపిన తర్వాతవాటిని నిలపటం ఎలా? ఒకదాని తర్వాత మరొక దానిని పరిశీలిద్దాం. భూమిని విభజించాలంటే భూమిని ముక్కలు చెక్కలు చేయవలసినపనిలేదు. కాని దురదృష్టవశాత్తు జరుగుతున్నది అదే. ఎందుకంటే చనిపోయిన వ్యక్తి వారసులు తమకు ఒక్కొక్కరికి వీలయినన్ని ఎక్కువ సర్వే నెంబర్లు భూమివచ్చేలా పంచుకోకుండా ప్రతివానికీ ప్రతిసర్వే నెంబరు లోనూ వాటా కావాలని కోరుకుంటారు. అంటే, వారసులు భూమిని సర్వే నెంబర్లుతో పంచుకోకుండా ప్రతిసర్వే నెంబరులోనూ వాటా కావాలని

## వృత్తిపరమైన వివరాలు

| | ఇంగ్లాండు మరియు వేల్స్ | ఐర్లాండ్ | ఆస్ట్రియా | బెల్జియమ్ | బల్గేరియా | డెన్మార్క్ | ఫ్రాన్స్ | జర్మని | ఆలండ్ | హంగేరి | ఇటలీ | రష్యా | స్విట్జర్లాండ్ | ఇండియా | అమెరికా |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ాయ ా శాతం | 15.3 | 4.47 | 60.9 | 20.7 | 82.6 | 48 2 | 42.7 | 35.2 | 30.7 | 69 7 | 59 4 | 58.3 | 30.9 | 71.5 | 33.3 |

(2) Producein Lbs per Acre

| | యుకె ఇంగ్లాండ్ | కెనడా | న్యూజిలాండ్ | ఆస్ట్రియా | ఈజిప్ట్ | ఫ్రాన్స్ | జర్మని | హంగేరి | జపాన్ | అమెరికా | భారత రాష్ట్రాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | | | | టర్కి | ఉత్తర ప్రదేశ్ | N W P. | పంజాబ్ | బాంబే | యు బర్మా |
| ుములు | 1973 | 1054 | 1723 | 1150 | 1634 | 1172 | 1796 | 1056 | 1176 | ... | 1318 | 850 | 555 | 555 | 510 | 322 |
| న్న | ... | 3487 | 3191 | 1135 | 2059 | 1097 | ... | 1489 | 1525 | ... | 1372 | 1100 | 735 | 766 | ...... | |

కోరుకుంటారు. దానితో భూమి ముక్కలు ముక్కలు అవుతుంది. భూమిని ముక్కలు ముక్కలు చేయటం అనేది పంపకన్యాయ ఆదర్శాలను నెరవేర్చుతుంది కాని, భారత దేశంలో వ్యవసాయ సాగుకుమాత్రం అంత ఫలితాలను ఇవ్వదు. ఒకప్పుడు ఐరోపాఖండంలో ఇదే జరిగింది. దీనివల్ల శ్రమ, పశుశక్తి వృధాఅవుతుంది. గట్లు, సరిహద్దులవల్ల కొంత వృధాఅవుతుంది. ఎరువులు వృధా అవుతాయి. పంటకాపలాకాయటం, బావులు తవ్వటం, శ్రమను తగ్గించే పరికరాల వాడకం అసాధ్యమవుతుంది. సాగులో మార్పుతేవటం, రోడ్లు వేయటం, నీటికాల్వలు తవ్వటం వంటి పనులకు కష్టం అవుతుంది. ఉత్పత్తి ఖర్చు ఎక్కువవుతుంది. ముక్కలు చెక్కలు అవటంవల్ల కలిగే నష్టాలను బేరీజు వేసుకోవటం ఎందుకంటే వాటిని తిరిగి ఒకటి చేయటం, కూడగట్టడం అనే వాదానికి బలాన్ని తెచ్చుకోవటమే. "తిరిగి ఒకటి చేయటా"నికి ఉన్న మార్గాలు అనేకం, అయితే అన్నీ కూడా అంతే సమర్థవంతంగా ఉండవు. ఇష్టపూర్వకంగా మార్పిడి చేసుకోవచ్చు అనేదానిమీద ఎక్కువగా ఆధారపడలేము. కాని అనుభవించటం హక్కుపై అమ్మకాన్ని గనక కొంత కుదించినట్లయితే మంచి లాభాలు ఉండవచ్చు. ఎందుకంటే, దీనిక్రింద, భూమిని మునుపు అనుభవిస్తున్న వారు వదులుకున్నపుడు సర్వేనెంబర్లు వేలంపాటకుపెట్టినపుడు లేదా భూమిశిస్తు బకాయివల్ల భూమిని స్వాధీనం చేసుకున్నా, అటువంటి భూమికి ఇరుగుపొరుగు ఉన్న వ్యక్తులు మాత్రమే వేలం పాటలో పాల్గొనే అవకాశం ఇవ్వాలి. విలీనంచేసే పద్ధతిని సానుకూలం చేసేందుకు, భూమిని అమ్ముతున్న రైతులదగ్గర నుంచి భూమికొనుక్కునే అవకాశం ముందు వాటి పొరుగు రైతులకు ఇవ్వాలి. ఈ పద్ధతులు అవలంబిస్తే అనుకున్న ఫలితాలను కొద్ది మాత్రమైనా సాధించగలమని చెప్పుకోవచ్చు. ముక్కలవటం వల్ల జరిగే దుష్ఫలితాలు అపారంగా ఉంటాయి. వాటని ఒక సమగ్ర పథకంద్వారా కూడగట్టటం వల్లనే తట్టుకోగలం. అందువల్ల, సగానికి పైగా గ్రామంలో ఉన్న భూమిలో వ్యవహరిస్తున్న ఖాతాదార్లు మూడింట రెండువంతులు కోరినట్లయితే చెదురుమదురుగా ఉన్న భూముల్ని ఒక దగ్గరకు తీసుకువచ్చేపని ప్రభుత్వం చేపట్టాలి. నిర్బంధంగా ఈ ఏకీకరణ చేసే పనిని రెండు సూత్రాల మీద చెయ్యవచ్చు, (1) సముదాయం, (2) "అసలు యాజమాన్యం" ఈ రెండు సూత్రాల మంచి చెడ్డల గురించి బరోడా కమిటీ ఇలా అంటుంది.

"మొదట, ప్రతి కమతం ఎంత విలువ ఉంటుందో అంచనా వెయ్యాలి, దానికి మొదటనుంచీ ఉన్న సరిహద్దులను తొలగించాలి, రోడ్లు నమూనా వేసుకోవాలి, ప్రజల అవసరాలకోసం పనికివచ్చే భూమిని పక్కకు ఉంచాలి, మిగిలిన భూమిని కొత్త ప్లాట్లుగా తయారు చేయాలి. భూమి స్థానిక పరిస్థితులకు, సాగుకు సంబంధించి ఈ కొత్త భాగం ప్రతీదికూడా లాభసాటిగా ఉండే భాగంగా ఉండేట్టు చూసుకోవాలి. అంటే ఒక కుటుంబంలో అందరికీ పనిదొరికేటంత, కుటుంబాన్ని సాదుకొనేటంతగా ఈ భాగాలు ఉండాలి. ఈ కొత్త భాగాలని పాత ఆక్రమణ దారులమధ్యనే వేలం పాటద్వారా అమ్మించాలి. ఎక్కువ మంది సాగుదార్లు బయటకు పోకుండా మాత్రం ఈ పరిమితి విషయం చూసుకోవాలి. ఈ

కొనుగోలు ధనాన్ని పొలం చెక్కల అసలు యజమానుల మధ్య నిర్దిష్టమైన నిష్పత్తిలో విభజన చెయ్యాలి, కొంత భాగాన్ని ఖర్చుల క్రింద మినహాయించాలి, దీనిలో ప్రభుత్వం కూడా కొంత వాటాను పెట్టాలి. మరొక పద్ధతి ఏమంటే, గ్రామంలో ఉన్న మొత్తం భూమినంతా సేకరించాలి. నగర అభివృద్ధి ట్రస్టులు, నగరాల్లో ప్రభుత్వం కొత్తరోడ్లు వేసేటపుడు చేసినట్టుగా వేలంపాటద్వారా కొత్తగా భాగాలను చేసి అమ్మాలి. కాని వ్యవసాయ భూముల్ని అభివృద్ధి చేసేటపుడు ఈ పద్ధతిని సిఫారసు చెయ్యము. దీనివలన భూమి లాభంకోసం చేసే వ్యాపారం అయిపోతుంది. దానితో చిన్న కమతందార్లు పోటీనుంచి తొలగిపోతారు, అదివారికి చాలా కష్టం కలిగిస్తుంది.

"రెండో పద్ధతి ప్రకారం, భూమిని ఒకదగ్గరకు తేవడం నిర్ణయం అయిన తర్వాత మొదటఖాతాదార్లు వారికున్న కమతాల జాబితాను తయారు చెయ్యాలి. అపుడు పంచులు ఆ కమతాల బజారు ధరను నిర్ణయం చెయ్యాలి. ఆ తర్వాత తిరిగి భూమిని పంపిణీ చేస్తారు. వీలయినంత వరకు అసలు భూమి విలువకు తగినట్టుగానే ఖాతాదార్లకు వేరే భూమిని ఇవ్వటం జరుగుతుంది. ప్రతివానికి భూమి దొరుకుతుంది, అతనికి మొదట చెదురు మదురుగా పడి ఉన్న భూమికి బదులుగా మొత్తం భూమిని కూడగట్టినంత పరిణామంలో భూమి దొరుకుతుంది. కమతాలు మరీ తక్కువగా ఉన్న వ్యవసాయదార్లుగానే కొనసాగటం అంత మంచిది కాకపోయిన సందర్భాలలో మాత్రమే తమకున్న చిన్నిచిన్ని కమతాలను కోల్పోతారు. కాని వారికి కూడా నష్టం ఏమీ జరగదు, ఎందుకంటే భూమికి తగ్గట్టుగా మొత్తం డబ్బువారికి వస్తుంది." బరోడా కమిటీ రెండో పద్ధతిని ఎంచుకుంటుంది, ఎందుకంటే :

" ఎవరిని కూడా భూమి నుంచి వెళ్లగొట్టకూడదు (మరీ చిన్న పరిమాణంల ఉన్న కమతాలు మినహా) అనే సూత్రంతో అది మొదలవుతుంది. మరీ సన్నకారు మనిషి కూడా తన పరిస్థితిని మెరుగుపరుచుకోవటానికి ఇది అవకాశం కల్పిస్తుంది. అక్కడక్కడా ఉన్నతన పాత కమతంకు బదులుగా, దానికి సరిపోయేటంత భూమి ఒకే చోట అతనికి దొరుకుతుంది. ఈ మార్గం ద్వారా, మునుపటి ఉప విభాగాలు దానితో పాటు వచ్చే హానికరఫలితాలు అన్నీ పోతాయి[7]."

కూడగట్టటంపైన ప్రొఫెసర్ హెచ్.ఎస్. జెవాన్స్ ఇలా అంటారు :

పైన వర్ణించిన పద్ధతుల ప్రకారం గ్రామాల పునర్నిర్మాణం చేపట్టే పద్ధతిని ఎన్నుకొనటానికి నడిపించే సూత్రాలు ఇలా ఉంటాయి. మొదటిగా సాధ్యమైనంత వరకు బలవంతం చేయకూడదు. ఏదైనా ప్రాంతంలో సగానికంటే ఎక్కువ భూమి స్వాధీనంలో ఉన్న యజమానులు అంగీకరిస్తే తప్ప ఏర్పాటును వారిపైన రుద్ద కూడదనే సూత్రాన్ని పాటించాలి. ఒక ప్రాంతానికి ఈ షరతు గనక అంగీకారమయితే, ఆ ప్రాంతంలో అల్పసంఖ్యాకులను ప్రభుత్వ పర్యవేక్షణ క్రింద కమతాల పునర్విభజనకు ఒప్పుకొనేలా వసరమైన చట్టపరమైన అధికారం ఉపయోగించటం అపుడు సబబు అవుతుంది. రెండో

# I

# వ్యవసాయ ప్రాముఖ్యత

జీవనోపాధి సంపాదించటంతో ఉన్న ఆర్థిక విధానాల అధ్యయనానికి ఎప్పుడూ ప్రాముఖ్యత ఉంటుంది. సాధారణంగా పరిశ్రమలు లేక ఉద్యోగాల రూపంలో ఉంటాయి. సహాయక పరిశ్రమలకే మనం పరిమిత మయితే, వాటిని ప్రాథమిక పరిశ్రమలు అని విభజించవచ్చును.

ఈ ప్రాథమిక పరిశ్రమలు నేల నుంచీ మట్టి నుంచీ, నీటి నుంచీ, ఉపయోగకరమైన పదార్థాలు వెలికి తీయటంతో సంబంధం పెట్టుకొని చేపలు పట్టుట, పశుపోషణ, నిరుపయోగకరమైన పదార్థాలనుంచి ఉపయోగకరమైన వస్తువులు తయారు చేయటం ఖనిజసంపదను వెలికి తీయటం వంటి వాని రూపం తీసుకుంటుంది. ఈ ప్రాథమిక పరిశ్రమలు లేదా వెలితీత పరిశ్రమలు ప్రధానంగా రెండు రకాలు.

(1) అవి భౌతిక ప్రపంచం నుంచి ఉపయోగకరమైన పదార్థాలను వెలికి తీస్తాయి. ఆ పదార్థం మానవమనుగడకు ముఖ్యమైన మూలాధారాలు.

(2) అవి సహాయక పరిశ్రమలకు లేదా వస్తు ఉత్పాదక పరిశ్రమలకు ముడిసరుకు సరఫరా చేస్తాయి.

డా॥ ఫ్రాంక్లిన్ మాటల్లో చెప్పినపుడు ఉత్పత్తి చెస్తాయి అంటే పదార్థం రూపాంతరం చెందటం అన్నమాట. జాతీయ దృక్పథంలో చూసినా కూడా ఈ ప్రాథమిక పరిశ్రమల యొక్క ప్రాధాన్యత ఎనలేనిది. ఈ ప్రాథమిక పరిశ్రమలు ముఖ్యమే అయినా వాటిల్లో వ్యవసాయము అన్నింటికంటే ముఖ్యమైన పరిశ్రమ. ఇది అత్యంత ప్రాచీనమైనది,

ప్రాథమిక సహాయక పరిశ్రమల కంటే ఇది స్థిరమైనది ఆహారోత్పత్తికి సంబంధించిన పరిశ్రమ అనే వాస్తవమే మనిషికి ఆహారములభిస్తుంది, కాబట్టి వారి సమస్యలపై మన నిశితమైన దృష్టిని నిలపటానికి కారణమౌతుంది. కాని, యించుమించు పూర్తిగా వ్యవసాయము మీదనే ఆధారపడి వుందని దేశంలో దీని ప్రాముఖ్యాన్ని వేరే వక్కాణించి చెప్పనవసరము లేదు. వ్యవసాయ ఉత్పత్తితో ప్రత్యక్ష సంబంధం ఉన్న వ్యవసాయ ఆర్థిక వ్యవస్థలోని సమస్యలు ఏమి ఉత్పత్తి చేయాలి, కమతాల పరిమాణం. కౌలు కాలపరిమితి మొదలైనవి.

ఈ వ్యాసంలో కేవలం కమతాల పరిమాణం గురించి మాత్రమే చర్చించటం జరిగింది. ఎందుకంటే, ఇది వ్యవసాయిక ఉత్పాదకతను ప్రభావితం చేస్తుంది కాబట్టి కొన్ని దేశాలలో చిన్న కమతాల ప్రాబల్యము హెచ్చుగా ఉంటే మరి కొన్ని దేశాలలో పెద్ద కమతాలున్నాయి ఆడమ్‌స్మిత్ ప్రకారం తల్లి తండ్రుల మరణానంతరము ఆస్తి మొత్తం జ్యేష్ఠ కుమారునికే సంక్రమించే చట్టం ఉన్న దేశాలలో పెద్ద కమతాలు పెద్దకమతాలుగానే ఉండి పోతాయి కాని శాంతియుత జీవితం చాలా దేశాలలో సమానభాగాల పంపకం అనుసరించటం వల్లన చిన్న కమతాలు ఏర్పడతాయి. ఆడమ్‌స్మిత్ ఏమంటాడంటే భూమిని ఇలాగ జీవించటానికి అనుభవించటానికి ఒక సాధనంగా మాత్రమే భావించినపుడు, కుటుంబంలోని సభ్యులందరి మధ్య సహజ సిద్ధంగా లభించే హక్కు వారసత్వం ప్రకారం సమానంగా పంపకం జరుగుతుంది. కుటుంబంలోని అందరూ సమానంగా అనుభవించాలనే కోరిక తండ్రికి ఉంటుంది. దానివలన చిన్న కమతాలు ఏర్పడతాయి. కాని భూమిని ఎప్పుడైతే కేవలం భృతికి ఉపయోగపడే వస్తువుగా చూడకుండా దానిని ఒక శక్తి, ఒక రక్షణ కవచంలా భావించినపుడు అది పంపకం కాకుండా ఒకరికే సంక్రమించేటట్టు చేయటం మంచిదని భావించారు. అప్పటి అరాచక పరిస్థితులలో భూమిని విభజించడం అంటే కేవలం దానిని నాశనం చేయటమే అనుకున్నారు. ఎందుచేతనంటే భూమిని చిన్న చిన్న భాగాలుగా విభజించినపుడు బలవంతులైన పొరుగువాళ్ళు భూమిని కైవసం చేసుకొనే అవకాశం ఉంటుంది. అందుఫలన కమతాలలో ఆస్థి మొత్తం జ్యేష్ఠ కుమారునికి సంక్రమించే చట్టం అమలులోనికి వచ్చింది. మతాలను పరిరక్షించటం జరిగింది. అందువలన ఇంగ్లాండు పెద్ద కమతాల దేశంగా ఉండిపోయింది. విప్లవానంతర ఫ్రాన్సు చిన్న కమతాల దేశమైంది. అదే విధంగా హాలండ్, డెన్మార్క్‌లో కూడా. భారతదేశం విషయానికొస్తే మనం ఈ క్రింది విధమైన కమతాల పరిమాణం ప్రత్యేకం మరియు ప్రత్యక్షంగా 1896-97 మరియు 1900-01 సంవత్సరాలలో ఈ విధంగా ఉన్నట్లు గమనిస్తాం.

ఎకరాలలో సగటు కమతాల విస్తర్ణం

| సంవత్సరం | అస్సాం | బొంబాయి | మధ్యపరగణాలు | మద్రాసు |
|---|---|---|---|---|
| 1896-97 | 3.37 | 24.07 | 17 | 7 |
| 1900-01 | 3.02 | 23.9 | 48 | 7 |

పరిమిత ప్రాంతాలలో నుంచి వచ్చిందే అయినా ఇప్పటి కాలానికి సంబంధించిన [illegible] వివరాలు బరోడా రాష్ట్రానికి సంబంధించినది దొరుకుతుంది. ఆ రాష్ట్రంలోని కమత గణాంకవివరాలు ఈ క్రింది పట్టికలో ఎకరాలలో సంక్షిప్తంగా ఇవ్వటం జరిగింది

| జిల్లా పేరు | మొత్తం వ్యవసాయభూమి | అది విభజన అయినసర్వే నెంబరు | ఖాతాదార్ల పేరు | ఖాతాదారి క్రింద ఉన్న సగటు | సర్వే నెం. ప్రకారం సగటు |
|---|---|---|---|---|---|
| బరోడా | 17,17,319 | 4,30,601 | 107,638 | 15-19-2 | 4 |
| కడి | 25,13,982 | 5,89,687 | 141,145 | 17-16-5 | 4 1/4 |
| నవ్‌సరి | 10,46,176 | 2,16,748 | 52,652 | 19-17-8 | 4 |
| అమ్‌రేలి | 9,72,040 | 53,635 | 17,214 | 36-9-7 | 3 1/4 |
| మొత్తం | 82,49,517 | 12,92,671 | 318,649 | 17-10-10 | 3 7/8 |

(8 బీగాలు = 5 ఎకరాలు)

డాక్టర్ హెచ్.ఎస్. మాన్ వారి సహచరులు నిర్వహించిన మరొక పరిశోధన పూనావద్ద పింపాలసొదాగర్ అనే గ్రామంలో చిన్న కమతాలు ఉన్నాయనే వాస్తవాన్ని ఇంకా ఎక్కువ నిర్దిష్టంగా చూపిస్తుంది.

| | 20 ఎకరాల పైన | 10 నుంచి 20 ఎకరాల వరకు | 5 నుండి 10 ఎకరాల వరకు | 3 నుంచి 5 ఎకరాల వరకు | 2 నుంచి 3 ఎకరాల వరకు | 1 నుంచి 2 ఎక-రాల వరకు | 30 నుంచి 40 గంటల వరకు | 20 నుంచి 30 గంటల వరకు | 15 నుంచి 20 గంటల వరకు | 10 నుంచి 15 గంటల వరకు | 5 నుంచి 15 గంటల వరకు | 5 గుంటల లోపు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్లాటు సంఖ్య ప్రతిప్లాటు యొక్క పరిమాణం | 1 | 7 | 21 | 25 | 67 | 164 | 75 | 136 | 71 | 57 | 59 | 25 |

(40 గంటలు 1 ఎకరానికి సమానము)

ఈ విధంగా తగ్గుతూ వస్తున్న కమతాల పరిమాణం భారత వ్యవసాయరంగానికి ప్రమాదకరం అని అంటున్నారు. నిస్సందేహంగా చిన్న కమతాలు ఒకవేళ దగ్గర దగ్గరగా ఉంటే సాధారణంగా చిన్న కమతాల వల్ల కలిగే దుష్ఫలితాలు కొంతవరకు తగ్గుతాయి. కాని

1. వెల్త్ ఆఫ్ నేషన్స్ పుస్తకం III అధ్యాయం II
2. 1917లో బరోడా రాష్ట్రంలో చిన్న, చెదురుమదురుగా ఉన్న కమతాల ఏకీకరణపై ప్రతి పాదనలు చేయటానికి ఏర్పాటు చేసిన సంఘం నివేదిక. దీనిని ఇప్పటి నుంచి ఆర్ విసిగా ప్రస్తావిస్తుంటాము.
3. అదేనివేదిక. 3వ పేజి
4 ల్యాండ్ అండ్ లెబర్ ఇన్ ఎ డక్కన్ విలేజ్ 1927 పే 48.

దురదృష్టవశాత్తు ఆ విధంగా లేవు. భూమిశిస్తు వసూలు దృష్ట్యా ఒక రైతుకు ఉన్న కమతాలు ఒకే గ్రామంలో ఉంటాయని చెప్పినా అవి ఒకే చోట లేకపోవడం. అంతేకాకుండా మధ్య మధ్యలో వేరే రైతుల కమతాలు వుండడం ఒక సమస్యగా వున్నది. ఇవి ఈ విధముగా చెదరిపోయివున్నవి. అనేది కేవలం పటం ద్వారానే చూపించగలం. అందుకని ఒక కమతంలో ఎన్ని ప్రత్యేకమైన చెక్కలు ఉన్నాయో తెలుసుకొని సరిపెట్టుకోవాలి. ఎందుకంటే తెలియక పోయిన పటం ద్వారా వాటిని చూపించే పటం ఇవ్వటం సాధ్యం కాదు. ఒక్కొక్క కమతంలోని విడివిడి చెక్కలు ఎన్ని ఉన్నాయో చూస్తే అవి ఎంతగా విడిపోయి ఉన్నాయో తెలుస్తుంది. ఈ విషయానికి సంబంధించి భారత దేశానికంతటికీ సంబంధించిన వివరాలు మన దగ్గర లేవు. కాని గౌ॥ జి.ఎఫ్. కౌటిన్జ్ 1916లో ప్రభుత్వానికి సమర్పించిన వివరణలో ఆయన బొంబాయి ప్రెసిడెన్సీలోని అన్ని జిల్లాల నుండి ఉదాహరణ పూర్వకమైన వివరములను సేకరించారు. ఈ క్రింది పట్టిక సూక్ష్మమైన రూపంలో ఆ సమాచారాన్ని చూపిస్తుంది.

| ఉదాహరణ–II వి సిర్‌గోన్ టి.రత్నగిరి డి రత్నగిరి | | ఉదాహరణ–II వి.బాద్లపూర్ టి కల్యాన్ డి.థానా | | ఉదాహరణ–II వి కారా టి మావల్ డి.పూనా | | ఉదాహరణ–II వి ఆర్తన్ టి.గోర్‌స్ప డి సూరత్ | | ఉదాహరణ–II సూరత్ జిల్లా | | ఉదాహరణ–II ఖైరా జిల్లా | | ఉదాహరణ–II వి లాసుర్నా టి కొరిగాన్ డి సతారా | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కమతము విస్తీర్ణము | ప్రత్యేక ప్లాట్ల సంఖ్య | కమతము విస్తీర్ణము | ప్రత్యేక ప్లాట్ల సంఖ్య | కమతము విస్తీర్ణము | ప్రత్యేక ప్లాట్ల సంఖ్య | కమతము విస్తీర్ణము | ప్రత్యేక ప్లాట్ల సంఖ్య | కమతము విస్తీర్ణము | ప్రత్యేక ప్లాట్ల సంఖ్య | కమతము విస్తీర్ణము | ప్రత్యేక ప్లాట్ల సంఖ్య | కమతము విస్తీర్ణము | ప్రత్యేక విస్త సంఖ్య |
| ఎ గు | – | ఎ గుం | – | ఎ.గుం | | ఎ.గుం | | ఎ గుం | | ఎ గుం | | ఎ గుం | |
| 34 ½ | 3 | 48.6 | 53 | 60.0 | 27 | 0 | 9 | 1.0 | 14 | 62.13 | 27 | 38 | 6 |
| 33 | 2 | 67.0 | 38 | 2.27 | 8 | 85 0 | 8 | 13 0 | 18 | 65 34 | 23 | 23 | 7 |
| 20 | 3 | 1 9 | 6 | 2 31 | 5 | 26.9 | 8 | 22.0 | 20 | 36.16 | 16 | 36 | 3 |
| 1 14 | 5 | 6.30 | 8 | 16 6 | 7 | . | . | 3.6 | 4 | 7.9 | 5 | 2 2 | 10 |
| 1 30 | 5 | 24.0 | 17 | 2.35 | 6 | .. | .. | 5.0 | 7 | 5.26 | 5 | .. | . |
| 110¼ | 4 | .. | . | .. | .. | . | .. | 1.26 | 9 | 13.16 | 6 | . | . |
| | 9 | .. | .. | .. | .. | . | .. | 0.26 | 9 | 28.4 | 15 | .. | . |
| 633 | 7 | .. | . | .. | . | . | . | .. | .. | 12.10 | 8 | . | . |
| 3 293 | 2 | . | .. | .. | | . | | | . | 12.7 | 3 | . | . |
| 9 | 3 | .. | . | .. | .. | . | .. | . | .. | 5 26 | 5 | . | |
| 22 | .. | .. | .. | . | . | . | .. | | . | 5.34 | 5 | | |
| 35 | . | .. | .. | | .. | .. | .. | .. | . | 3 39 | 3 | | |

(ఎ=ఎకరం. గుం=గుంటలు, గ్రా=గ్రామము, తా=తాలూక, జి=జిల్లా)

ప్రొఫెసర్ జేవాన్స్ ఒక్కడే కమతాలు కూడ గట్టటంలో కమతాలను పెద్దగా చెయ్యాలనే అంశాన్ని అయన దృష్టిలో ఉంచుకున్నాడు.

## IV

## విస్తరణ

భూకమతాల విస్తరణ ఎంత ముఖ్యమో వాటిని కూడ గట్టటం కూడా అంతే ముఖ్యమని ఒప్పుకుంటే వాటి పరిమాణాన్ని క్రమపరిచే చర్చకు వద్దాం. మన వ్యవసాయరంగంలో ఆసక్తి కనపరిచే వారంతా కమతాలు లాభసాటి క్షేత్రాలుగా ఉండాలని కోరుతున్నారు. లాభసాటి క్షేత్రానికి ఖచ్చితమైన శాస్త్రీయమైన నిర్వచనమిచ్చి యుంటే, ఈ రంగంలో ఖచ్చితమైన, శాస్త్రీయమైన పదజాలం కనుగొన్నవారికి, మనం ఎక్కువగా రుణపడి ఉండేవారం అలాకాకుండా, పెద్ద కమతం అయితే లాభసాటి కమతం అయి ఉంటుందని అంటున్నారు. ప్రొ॥జేవాన్స్ కూడా ఇదే అభిప్రాయంలో పడ్డాడు. కమతం ఎంత పరిమాణంలో ఉండాలా అన్న విషయాన్ని ప్రొపెసర్ జేవాన్స్ చర్చిస్తూ కమతాలను కూడ గట్టిన గ్రామంలో ఆదర్శప్రాయమైన కమతం 29, 30 ఎకరాల మధ్యలో వుండాలని మొండిగా చెప్పాడు." ఆదర్శప్రాయమైన కమతం పరిమాణం ముప్పయ్యే ఎందుకుండాలి, 100 లేదా 200 ఎకరాలు ఎందుకుకాకూడదు? ఈ ప్రశ్నకు బహుశా ప్రొ॥జెవాన్స్ ఈ క్రింది విధమైన జవాబు ఇచ్చివుండేవాడేనని ఊహించవచ్చు. అదేమంటే అతను ఉదహరించిన కమతం పరిమాణం ఆ రైతుకు ఉన్నత జీవనస్థాయికి పోయేంత ఉత్పత్తినిస్తుందని ప్రొ॥జేవాన్స్ వ్రాసిన వ్యాసంలో భారతదేశంలోని సాధారణ జీవన ప్రమాణాన్ని పెంచాలనే విషయాన్ని విసుగు వచ్చేటంతగా పదే పదే వివరించాడు ఈ సూత్రంలో దాగివున్న తప్పును గురించి తర్వాత ఆలోచిద్దాం. తన ఆదర్శప్రాయమైన క్షేత్రానికి సరైన ఆర్థిక పరమైన కారణాలు చూపలేకపోయాడని చెప్పితే సరిపోతుంది.

బరోడా కమిటీ వ్యవహారం మరీ అధ్వాన్నంగా ఉంది. ఆదర్శవంతమైన లాభసాటి కమతం అంటే ఒక నిర్వచనానికయినా కనీసం కట్టుపడి ఉన్నాడు. బరోడా కమిటీ నివేదికలో నిర్వచనాలు ఎక్కువ అయిపోయాయి. పై పట్టికలో చూపిన విధంగా రాష్ట్రంలో సగటు కమతం పరిమాణం గురించి చేసిన వ్యాఖ్యానంలో గమనించవలసిన విషయం ఏమంటే కమతాలను కూడ గట్టటాన్ని కమిటీ వాంచిస్తున్నప్పటికీ ఉన్న కమతాల పరిమాణంతో సంతృప్తి పడింది. అది ఈ క్రింది దానిని బట్టి స్పష్టమవుతుంది.

"ఖాలేదారు సగటు కమతం ఆ అంకెలలో ఒకే చోట ఉన్న క్షేత్రంగా ఉంటే, పరిస్థితి ఆదర్శప్రాయంగా ఉన్నట్టే ఇందులో చేయవలసింది పెద్దగా ఏమీలేదు.

కాని కమిటీ మతిమరుపుది అయి ఉండటం వల్ల తాను పరిశోదనచేసి నివేదిక సమర్పించటం కోసం నియామకం అయిన విషయంలో పరిశోధనాత్మకమైన విశ్లేషణ

చెయ్యకుండా ఈ విధంగా అంటుంది.

"ఒకేచోట మంచి భూమి 30 నుంచి 50 ఎకరాలు ఉంటే అది ఆదర్శవంతమైన కమతం అవుతుంది. అయితే అందులో కనీసం ఒక మంచి నీటిసాగు బావి ఉండాలి, కమతంలో ఒక ఇల్లు ఉండాలి"[14]

ప్రస్తుతం కమతం ఉన్న పరిమాణం ఆదర్శప్రాయమైనది అయితే దానిని పెద్దదిచేయటం ఎందుకు? దీనికి కమిటీ ఏమీ సమాధానం చెప్పదు. కాని ఇది ఇంతేకాదు. లాభసాటి కమతంకు కమిటీ తానుగా పెట్టిన పరిమాణానికి కూడా అది కట్టుబడి ఉండటం లేదు. " లాభసాటి కమతం" సూత్రంపై గ్రామంలో చెదురుగా ఉన్న క్షేత్రాలను తిరిగి ఏర్పాటు చేయాలనే పథకాన్ని చర్చించవలసి వచ్చినపుడు, "లాభసాటి కమతం" అంటే ఏమిటో అనేదానిపైన మూడో ప్రతిపాదన అందిస్తుంది. ఈ ఆదర్శాన్ని చేరుకోవటానికి కమిటీ ఇలా చెబుతుంది.

"స్థానిక నేల, దుక్కి మొదలైన వాటిని దృష్టిలో పెట్టుకొని లాభసాటి కమతం ఏర్పడేలా ప్రతి కొత్త చెక్క తగిన పరిమాణంలో ఉండాలి. అంటే భూమిలో ఒక చెక్క ఒక కుటుంబలో సభ్యులకు సరిపోయే పని కల్పించేదిగాను, వారి తిండికి చాలినంతగాను ఉండాలి"[15]

ఆ విధంగా ఎంతో నిబ్బరంగా కమిటీ ఆదర్శవంతమైన లాభసాటి కమతానికి ఎంత పరిమాణం ఉండాలనే విషయంలో అంత తొందరగా కాకపోయినా మూడు అభిప్రాయాలను మార్చుకున్నది. కమిటీ రిపోర్టు తర్కం అంతా గందరగోళంతో ఉన్నదని చెప్పటంలో ఆశ్చర్యం లేదు, అయితే ఈ విషయంపై చాల విలువైన సమాచారాన్ని మాత్రం అందించింది.

గౌరవనీయ కేటిగ్ గారి అభిప్రాయంలో లాభసాటి కమతం అంటే :–

"ఒక వ్యక్తి తనకు తన కుటుంబానికి సరిపోయేటంత పంట పండించుకొని అవసరమైన ఖర్చులు పోను తాము సుఖంగా బ్రతక గలిగే అవకాశం ఇచ్చే కమతం".

లాభసాటి కమతం అంటే కేటింగ్ ఇచ్చిన ఈ నిర్వచనాన్ని బరోడా కమిటీ అంగీకరిస్తుందని మనం ఆశించవచ్చు. ఎందుకంటే, మూడోదిగా ఇచ్చిన తన నిర్వచనానికీ దీనికీ తేడా ఏమీలేదు. వారిద్దరూ అంగీకరిస్తారని అనుకుంటే, ఈ నిర్వచనం ఎంతవరకూ సమంజసంగా ఉందో పరిశీలిద్దాం.

11. అభిప్రాయాన్ని ఉదహరించారు. పేజి 38లో ఫట్టన్
13. అభిప్రాయ ప్రకటన – ఉపోద్ఘాతం.
14. ఆర్.బి.సి. పే.31.
15. ఆర్.బి.సి. పే.53

ప్రొఫెసర్ జెవాన్స్ ఉద్దేశంతో సహా ఈ నిర్వచనాలు అన్నీ లాభసాటి కమతాన్ని ఉత్పత్తి దృష్టితో కాకుండా వ్యయం దృష్టితో చూస్తాయనేది స్పష్టమయింది. ఇందులోనే పొరపాటు ఉన్నది. ఒక కమతం లాభసాటితనాన్ని నిర్ణయించటానికి వ్యయం సరైన కొలబద్దకాదు. రైతు పెట్టిన పెట్టుబడి ఒక్కొక్క అంశంపైన రాబడి ఎక్కువ ఉన్నప్పటికీ కుటుంబాన్ని పోషించటానికి మొత్తం దిగుబడి పరిపోవటం లేదు. కాబట్టి క్షేత్రం వల్ల లాభం ఏదీ లేదని కొట్టి వేయటం విపరీతమైన అంచనా కింద చెప్పవచ్చు. వ్యవసాయదారుని కుటుంబం వద్ద ఎంత శ్రామిక శక్తి ఉన్నదనే విషయంపైనే కుటుంబాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. ఈ శ్రామిక శక్తిలో కొంత భాగం వృధాగా పోతుండవచ్చు, కాని భారత దేశంలో మాదిరిగా సాంఘిక ఆచారాన్ని మన్నిస్తూ వారిని పోషించవలసిన ఆవశ్యకత మాత్రం ఉన్నది. ఒక వ్యవసాయదారుడు తన కుటుంబంలోని సభ్యులలో కొందరిని తన క్షేత్రంలో పనిచేయించుకోలేని పరిస్థితిలో ఉన్నప్పటికీ సాంఘిక ఆచారం ప్రకారం వారిని పోషించవలసిన పరిస్థితి ఉన్నందువల్ల కుటుంబంలో పనిచేస్తున్న వారితో పాటు పనిచేయని వారిని కూడా పోషించటానికి సరిపోయేటంత దిగుబడిని ఇవ్వటం లేదని క్షేత్రాన్ని మనం నిందించ కుండా జాగ్రత్త పడాలి. ఈ రకమైన లెక్కలు గనక మనం తీసుకోవటం జరిగితే చాలా విజయవంతం అవుతున్న కృషి కూడా విఫలమయిందని ప్రకటించవలసి వస్తుంది. వ్యవసాయదారుని కుటుంబానికి తన వ్యవసాయం లేదా పరిశ్రమ నుంచి వచ్చి మొత్తం దిగుబడికి నిజమైన ఆర్థిక సంబంధం ఏదీలేదు. మొత్తం దిగుబడికి పెట్టుబడికి మధ్యనే నిజమైన ఆర్థిక సంబంధం ఉంటుంది. మొత్తం దిగుబడి పెట్టుబడికి సరిపోయినట్లయితే తెలివి ఉన్న ఉత్పత్తిదారుడు ఎవరుకూడా తన పరిశ్రమను మూత పెట్టాలని అనుకోడు, ఎందుకంటే మొత్తం దిగుబడి తనకుటుంబాన్ని పోషించదు. ఇది స్పష్టంగానే ఉన్నది. వాడుక కోసమే ఉత్పత్తి అయినప్పటికీ ఉత్పత్తికి సహకరించే వారి వాడకం కోసమే దానిని ఉపయోగించాలి. దీనివల్ల తేలినదేమంటే దిగుబడికి పెట్టుబడికి మధ్య ఉన్న సంబంధమే నిజమైన ఆర్థిక సంబంధం అయితే, క్షేత్రం లాభసాటిదని చెప్పుకోవచ్చు, అంటే వాడకంతో సంబంధం కాకుండా ఉత్పత్తితో సంబంధం పెట్టుకోవటం కాబట్టి వాడకం మీద ఆధారపడే ఏ నిర్వచనమయినా, లాభసాటి కమతం స్వభావ విషయంలో పొరపడుతుంది, ఎందుకంటె అది ప్రధానంగా ఉత్పత్తిలోని కార్యక్రమమే.

ముందుకుసాగే టపుడు ఉత్పత్తి దృష్ట్యా లాభసాటి కమతం అంటే సానుకూలంగా అర్థం చేసుకోవటం కోసం కొన్ని ప్రాథమిక సూచనలతో విషయాలను స్పష్టపరచుకుందాం.

ముందుగా మనం అనుకోవలసిన విషయం ఏమంటే, పోటాపోటీ సమాజంలో వినియోగదార్ల వలనగాని ఉత్పత్తిదారులవలన గాని ధరల పాలన ద్వారా దానిసభ్యుల వ్యవహారాలు గాని నియంత్రణ అవుతాయనేది. అందువల్ల ధరల పాలనలో ఉత్పత్తిని మన అవసరంకోసం విశ్లేషణ చేయవలసి ఉంది. ముఖ్యంగా, ఆధునిక ఉత్పత్తి విధానం

పారిశ్రామిక వేత్త నాయకత్వంలో నడుస్తుంది. అతను దానిని నడిపిస్తాడు, పర్యవేక్షిస్తాడు అతని ద్వారా అదినడుస్తుంది. కార్మికులను నియమించేవారు, సామాగ్రి పరికరాలను అద్దెకు తీసుకొనేవారు పారిశ్రామికవేత్త అవుతాడు. ద్రవ్య సంబంధమైన సమాజంలో అతని లెక్కలు, ధర సరుకుతో కాకుండా ధర పథకాల ఉత్పత్తి ప్రకారం నడుస్తాయి, అదితప్పదు. ఉత్పత్తి అయ్యేసరుకు ముందు ముందు అమ్మకానికి పెట్టినా పెట్టకపోయినా అంతే. వ్యాపారవేత్త లాభానికి ఉత్పత్తి చేయటంలో, అనేక రకాల పెట్టుబడులలో తన పథకాన్ని విభజిస్తాడు. ఈ పెట్టుబడులు, వ్యాపారవేత్తకు ఉత్పత్తి లేదా ఖర్చులకు సంబంధించినవిగానే ఉండి, సంప్రదాయరీత్యా వేతనాలు (కార్మికుల) లాభాలు, అద్దె (భూమి) వడ్డీ (పెట్టుబడి)కి పరిమితమై ఉంటాయి. పారిశ్రామికవాస్తవాలు ఈ విభజనను సమర్థించవు. దీనిలో మరొక వాదన ఉన్నది. పంపక విధానంలో భాగం పంచుకొనే విషయాలు చాలా ఉన్నాయి. అవి ఉత్పత్తి విధానంలో తక్షణమే కొంత దూరంగానే భాగం పంచుకొని ఉంటాయి. అటువంటి విషయాలు ఎన్ని ఉన్నాయి. వస్తుతః వాటిలో తేడా ఏమైనా ఉంటుందా లేక కొంత అటూ ఇటూ ఉంటుందా అనేది అప్రస్తుతం. ఉత్పత్తి అవసరాలకోసం ముఖ్యమైన విషయం ఏమంటే వాటిని కలిపే విధానం.

ఉత్పత్తికి సంబంధించి అనుపాతసూత్రం (లాఆఫ్ ప్రపోర్షన్) పరిధిలో ఉంటాయి. ఒక వ్యాపారంలో ఉపయోగిస్తున్న వివిధ ఉత్పత్తి విషయాలలో పాళ్లు సరిగ్గా వెయ్యకపోతే ప్రతికూలత ఏర్పడుతుందని ఇది చెబుతుంది. ఈ సూత్రాన్ని విస్తరిస్తే, దాని అర్థం ఏమవుతుందంటే, ఒక వస్తువు పరిమాణం మరొక వస్తువు పరిమాణంతో కొంతమేరకు రెండింటికే అత్యంత ఎక్కువ సామర్ధ్యాన్ని ఇవ్వటానికి పనిచేస్తుంది. ఇతర వాటితో పోల్చినపుడు ఆ పరిమాణం ఎక్కువయినా లోపమున్నా అన్నిటి సామర్ధ్యాన్ని తగ్గిస్తూ మొత్తం దిగుబడికే దెబ్బతీస్తుంది. ఈ వస్తువులు ఒకదానిమీద మరొకటి ఆధారపడి ఉన్నాయనే విషయాన్ని దృష్టిలో ఉంచుకొని, ఈ రెండింటినీ ఎక్కువ లాభసాటిగా ఉపయోగించుకోవాలంటే ఉత్పత్తి దారునికి, ఒకదానిని మారిస్తే, దానికి అనుగుణంగా రెండోదానిని కూడా మార్చవలసిన అవసరం వస్తుంది. ఏదికూడా మరొక విధంగా ఉండదు. ఎందుకంటే, సమర్థవంతమైన ఉత్పత్తి ప్రధానలక్ష్యం పరిశ్రమలో ప్రతివస్తువుకూడా ఎక్కువ ఉపయోగపడేలా చేయటమే, అది ఎపుడు సాధ్యమవుతుందంటే అవసరమైన శక్తిమేరకు ఇతర వస్తువులతో సహకరించటంలోనే. పాళ్లనుబట్టి ఆదర్శం మారుతున్నప్పటికీ వివిధ వస్తువుల కలయికతో సమపాళ్ల అధర్మం ఉంటుంది.

ఈ వస్తువుల ధరల మార్పుల మూలంగా ముఖ్యంగా వ్యవహారంలోకి వచ్చిన బదులు సూత్రం వలన పాళ్లలో మార్పులు వచ్చాయని అంగీకరించాలి. కాని అన్ని ఆర్థిక ఉత్పత్తులపై ఆధిపత్యం వహిస్తున్న అనుపాతసూత్రాన్ని (లా ఆఫ్ ప్ర ప్రోర్షన్) ని వెల్లకుండా చేయటానికి ఈ సూత్రం చాలా చిన్నది. ఏ ఉత్పత్తిదారుడూ దీనిని అలక్ష్యం

విషయం సాధ్యమైనంతమేరకు ఖర్చులు తగ్గించుకోవాలి.. మూడో విషయం మొదటి కొద్ది సంవత్సరాలలో వివిధ ప్రాంతాలలో పునర్నిర్మాణం అమలు చేస్తున్న పద్ధతులలో వీలయినంత వెసులుబాటు ఉపయోగించాలి, ఎందుకంటే మొత్తం ఏర్పాటు అంతా ప్రయోగాత్మకమైన దశలోనే ఉందికాబట్టి. వివిధ పద్ధతులను ఉపయోగించి, అన్నిటికంటే ఉత్తమమైన పద్ధతిని శాశ్వతమైన నియమావళిని తయారు చేసుకోవటానికి ఎంచుకోవచ్చు. నాలుగో విషయం, పునర్నిర్మాణం జరిగిన గ్రామాలలో అమలులో ఉన్న కౌలుదారీ చట్టాన్ని తగిన విధంగా సవరించ వలసిన అవసరాన్ని కూడా గమనించాలి. విషయం పూర్తి అవటం కోసం, భూమి పునఃపంపకం వీలయినంత ఎక్కువ ధర్మ బద్ధంగా జరగాలి. ఇంతకుముందు వ్యవసాయం చేస్తూన్న వారిని తొలగించవలసిన అవసరం ఏర్పడినపుడు వారికి నష్టపరిహారం ఉదారంగా ఇవ్వాలనే షరతులను అయిదో సూత్రంగా నేను చెపుతున్నాను.

బలవంతంగా కమతాలను కూడగట్టటానికి సంబంధించిన విధానం విషయంలో ప్రొఫెసర్ జెవాన్స్, బరోడా కమిటీ ఇద్దరు కూడా కూడగట్టటం కొరకు దరఖాస్తులను విచారించటానికి ఒక కమిటీని నియమించాలని ప్రతిపాదించారు. ఈ విషయంలో ఎవరికైనా అభ్యంతరం ఉంటే తనకు ఈ విషయంలో అన్యాయం జరిగిందని అభిప్రాయపడినపుడు కోర్టుకు వెళ్లే హక్కు అతనికి కల్పించారు.

ఆ విధంగా కూడగట్టిన కమతాన్ని స్థిరంగా నిలిపే సమస్య ఆతర్వాత శాసనసభ్యులకు విడిచిపెట్టటం జరుగుతుంది. హిందువులు, ముస్లిములలో అమలులో ఉన్న వారసత్వం చట్టమే భూమి ఉప విభాగాలుగా అవుతుందనే విషయాన్ని నిస్సందేహంగా అందరూ ఒప్పుకుంటారు. హిందువుగాని, మహమ్మదీయుడుగాని మరణిస్తే మరణించిన వాని ఆస్తిని అతని వారసులు ఎలాంటి ఆటంకంగాని అదుపుగాని లేకుండా సమానంగా పంచుకుంటారు. ఇపుడు అట్టి వారసత్వం చట్టానికి లోబడి ఉంటే కూడగట్టిన కమతం ఎంతోకాలం నిలవదు. కూడగట్టటం జరిగిన తర్వాత, వారసత్వచట్టంలో గనక మార్పురాకుండా ఉంటే మళ్లీ కథ మామూలే, సిసిఫస్ పనే మళ్లీ మొదలవుతుంది.

కాని ప్రస్తుతం ఉన్న వారసత్వ చట్టాన్ని ఎలా మార్చటం? సమభాగాలు వేసుకొనే చట్టం కాకపోతే, జ్యేష్ఠునికే ఆస్తి సంక్రమించే చట్టాన్ని ప్రవేశపెడదామా!

ఈవిషయంలో బరోడా కమిటీ ఇలా అంటుంది.

"దీనిని ప్రవేశపెట్టే అవసరంలేదు. కోరుకొనేదేమంటే, భూమిని ఒక నిర్దిష్టమైన పరిమితికి మించి అంటే మంచి సాగుకు వీలయేంత భాగంకంటే మించి ఉపవిభాగాలు చేయకుండా ఉండాలి. భూమి ఉపవిభాగానికి నిర్ణయించిన పరిమితికంటే, విభజించిన

7. ఆర్.బి.సి. పే. 35

భాగాలు తక్కువకాకుండా ఉన్నంతవరకు కమతం ఉపవిభాగాలుకావటానికి అభ్యంతరం ఏవీలేదు. కాని ఒక కమతం ఇక ఉపవిభాగాలు చేయటానికి కుదరదు అనే దశకు గనక వస్తే కమతాన్ని భాగాలు పెట్టవలసిందిగా కుటుంబంలోని ఇతర సభ్యులు బలవంతం చెయ్యకుండా చూడాలి. ఉపవిభాగం చేసేబదులు, ఉమ్మడిగా సాగుచేసుకోవాలి, లేదా మొత్తం అంతా కుటుంబంలోని ఒక సభ్యునికి ఇచ్చివేయాలి. ఆ సభ్యుడు మిగిలిన సభ్యులవాటాకు వచ్చేటంత మొత్తాన్ని నష్టపరిహారంగా చెల్లించేటట్టుచూడాలి."

ఆస్తివిభజన సాగుకు పనికిరాకుండా మరీ చిన్నవిగా అయిన సందర్భాలలో వాటాదార్లలో ఎక్కువపాలుపాడి మొత్తం ఆస్తిని తీసుకోవటానికి ఇష్టమైనవారికి ఇవ్వటం, వాటాదార్లు ఎవరూ దానికి ఇష్టపడకపోతే బయటవ్యక్తికి వేలం పాటపెట్టి ఇచ్చివేసి, ఆవచ్చిన డబ్బును గుర్తించిన వాటాదార్లకు పంచటం చేయగలిగినపుడు స్థిరాస్తిని విభజించవలసిన అవసరం లేదనే సూత్రాన్ని భారత విభజన చట్టం 1983లో 4వ చట్టం, రెండవ అంశం ఆమోదించింది. అది ఇలాఉంది

" విభజనకోసం ఏదైనా వ్యాజ్యం ఈ చట్టం అమలుకు ముందు దాఖలయి ఉండి, డిక్రీ ఇవ్వటం జరిగి ఉండేదయితే, వ్యాజ్యానికి సంబంధించిన ఆస్తి స్వభావరీత్యా లేదా వాటా దార్లు ఎక్కువగా ఉండటంవలన గాని మరే ఇతర ప్రత్యేకమైన కారణాలవల్లగాని హేతుబద్ధంగా లేదా అనుకూలంగా ఆస్తి విభజన చేయటానికి వీలుపడదని ఆస్తిని అమ్మిదానితో వచ్చిన డబ్బును వాటాదార్లు అందరికీ పంచటమే ఎక్కువ లాభదాయకమని కోర్టుకు అనిపిస్తే, అపుడు కోర్టు, సమంజసం అనుకుంటే, ఆస్తిలో సగభాగం కంటే ఎక్కువ దానిలో వాటా ఉన్న వాటాదార్లలో ఏ ఒక్కరుగాని- లేదా కొంతమంది కలిసిగాని కోర్టును కోరితే, ఆస్తి అమ్మకానికి, వచ్చిన డబ్బు పంపకానికి ఉత్తరువు జారీ చేయవచ్చు."

వారసత్వ చట్టంలో ఈ విధమైన మార్పు తీసుకురావచ్చును అనేదానిని అంగీకరించినప్పుడు, చేయవలసిందల్లా ఏమంటే, ముందుగా నిర్ణయించిన పరిమితికి తక్కువగా భూమి మిగులుతుందనుకునే సందర్భంలో ఆస్తి విభజనను కోర్టు నిరాకరించే అవకాశం కోర్టుకు ఇచ్చేటట్లుగా సివిల్ ప్రొసీజర్ కోడ్ లో సవరణ తీసుకురావాలి.

ఈ సమస్యను పరిశీలించటానికి బొంబాయి రాష్ట్రంలో వ్యవసాయశాఖ డైరెక్టరుగా

---

9. రెండు వారసత్వ విధానాలేకాకుండా మూడోది ఒకటి ఉంది దానిప్రకారం తండ్రి తన ఆస్తిలో కొంత భాగాన్ని తన ఇష్టం వచ్చినట్టు చేసుకోవచ్చు, అయితే తనవారసులకు ఆస్తి అనుభవించటానికి సరిపోయేటంత విడిచి పెట్టాలి. దీనిక్రింద జర్మనులు అనెర్ జెనెరెక్ట్ చట్టాన్ని చేసుకున్నారు, దీనిప్రకారం భూమి అనవసర విభజన కాకుండా చూసుకోగలిగారు. కొన్ని విషయాలలో ఇది బరోడా కమిటీ ప్రతిపాదనలను, మరికొన్ని విషయాలలో గౌరవనీయ కేటింగ్స్‌గారి ప్రతిపాదనలు పసిగట్టింది వీటి వివరాలకు ప్రొఫెసర్ ఎన్.జి పేర్సన్ రాసిన ప్రిన్స్‌పుల్స్ ఆఫ్ ఎకనామిక్స్ 2 వసంపుటం, 286-90 పేజీలు చూడండి.

పనిచేస్తున్న గౌరవనీయ జి.ఎఫ్ కౌటింగ్‌గారు మరొక పద్ధతిని సూచించారు. ముసాయిదా బిల్లుకు అనుబంధంగా ఉన్న ఉద్దేశాలు కారణాల వివరణలో ఇలా అంటారాయన:

"తమ భూములు ఇంకా చెక్కలు చెక్కలు కాకుండా చూసుకోవాలని కోరుకొనే భూమి యజమానులకు, మరొకవిధంగా సాధ్యమయితే తమ కమతాలను శాశ్వతంగా కూడగట్టుకొనే అవకాశం కల్పించటమే ఈ బిల్లు ఉద్దేశం; ఆక్రమణలేని భూముల విషయంలో కూడా ఇదే పద్ధతిని అవలంబించటానికి ప్రభుత్వంలోని కార్యనిర్వాహక వర్గానికి కూడా ఇది అవకాశం కల్పిస్తుంది. అనుకూలత కల్పించటమే ఈ బిల్లు ఉద్దేశం, అదికూడా ఆ కమతంలో హక్కు ఉన్న ఏ వ్యక్తి అయినా తన అభీష్టాన్ని వ్యక్తం చేసిన సందర్భంలో మాత్రమే ఈ అనుకూలత లభ్యమవుతుంది.

"5. ఈ ఉద్దేశాలను సాధించటంకోసం ఈ బిల్లులో పొందుపరిచినట్టి పథకం ఈ విధంగా ఉన్నది. లాభసాటి కమతాన్ని ఏర్పరచటంకోసం, నియమావళి నిర్ణయించిన రిజిస్టరులో ఆమేరకు కొంత భూమి భాగాన్ని నమోదు చెయ్యాలి. ఈ భూమి ఎవరి ఆక్రమణలో అయినా ఉంటే, ఆ భూమిలో హక్కు వున్న వ్యక్తి ఎవరైనా దానికి లాభసాటి కమతంగా నమోదు చేసుకోవటానికి కలెక్టరుకు దరఖాస్తు పెట్టుకొనే వీలు ఉన్నది... అట్టి దరఖాస్తును తిరస్కరించటానికి తగిన కారణాలు ఉంటే తప్ప, కలెక్టరు ఈ విషయమై జాగ్రత్తగా దర్యాప్తు జరపాలి. ఆ దర్యాప్తులో 1894 భూసేకరణ చట్టంలో నిర్ణయించిన పద్ధతిని అనుసరించాలి. హక్కు ఉన్న అందరు వ్యక్తులూ అంగీకరిస్తున్నారని దర్యాప్తులో వెల్లడి అయితే, భూమి నమోదవుతుంది. పూర్తిగా ప్రభుత్వ ఆధీనంలో ఉన్న భూమి విషయంలో దర్యాప్తు అవసరంలేదు. ఎట్టి సందర్భంలో అయినా భూమి నమోదు కావాలి, ఒక పేరు మీద మాత్రమే నమోదు కావాలి, నమోదు అయిన తర్వాత నమోదు అయిన వ్యక్తికి తప్ప ఆ కమతంలో ఇంతకు ముందు హక్కు కలిగి ఉన్న వ్యక్తులందరి ఉన్న హక్కులూ రద్దు అవుతాయి. ఆ తరువాత, ఆ యజమాని భూమిని విభజన చెయ్యలేడు. అది తన యాజమాన్యంలో ఉన్నంత వరకూ దానిని ఒకటి గానే ఉంచాలి. దానిని అతను అమ్మ వచ్చు తనఖా పెట్టవచ్చు, మరోవిధంగా దానిని తీసివేయవచ్చు, కాని ముక్కలు ముక్కలుగా చేసి వ్యవహరించకూడదు, లేదా మొత్తం కమతం ముక్కలు అయ్యే పని ఏదీ చెయ్యకూడదు. యజమాని మరణానంతరం, వీలునామాద్వారా ఏరకమైన ఏర్పాటూ చేసి ఉండకపోతే, ఒకే వారసునికి అది సంక్రమిస్తుంది. ఈ బిల్లు నిబంధనలను ఎవరైనా అతిక్రమించినట్లయితే, (ఉదాహరణకు ఎవరైనా యజమాని తన కమతంలో కొంత భాగాన్ని తాకట్టు పెట్టి ఉండి, తాకట్టు తీసుకున్న వ్యక్తి భూమి స్వాధీనం కోసం డిక్రీని పొంది ఉన్నట్లయితే) కోర్టుకు కలెక్టరు ఒక సర్టిఫికెట్టు పంపే అధికారం ఉంటుంది. అపుడు కోర్టు డిక్రీనిగాని ఉత్తరువును గాని రద్దు చేస్తుంది. అక్రమమైన ఆధీనంలో ఉన్న వ్యక్తిని తొలగించే హక్కు కలెక్టరుకు ఉన్నది. ఒక చెక్క లాభసాటిదిగా ఏర్పాటు జరిగి ఉన్నట్టయితే, కలెక్టరు అనుమతితో తప్ప రిజిస్ట్రేషన్‌ను రదు చేయటానికి వీల్లేదు. రిజిస్ట్రేషన్‌ను రద్దు చేయటానికి వీలయిన

ఆధారాలను నిబంధనలలో పొందుపరచటం జరుగుతుంది. ఆర్థిక కారణాల వల్ల తప్పనిసరి అయితేనే తప్ప రిజిస్ట్రేషన్ రద్దు చేయటానికి అంగీకరించటం జరగదు.

కూడ గట్టటానికి సంబంధించిన రెండు అంశాలపైన చర్చను క్లుప్తీకరించినపుడు, వీటిని సమర్థించే వారందరు కూడా ఈ సమస్యను సంపూర్ణంగా చూసి ఉండలేదని చెప్పవలసి వస్తుంది. బరోడా కమిటీ ఒక్కటే, కమతాలను కూడగట్టటమే కాకుండా వాటిని కాపాడటం గురించి కూడ ప్రయత్నం చేసింది. కూడగట్టటం మూలంగా ప్రాప్తించిన ఫలితాలను భద్రపరిచే పని ప్రొఫెసర్ జెవాన్స్ చెయ్యలేదు. కూడగట్టటం గురించి కౌటింగ్ గారు అసలు ప్రస్తావించలేదు. మరీ ముక్కలు కాకుండా నిరోధించటం గురించే ఆయన ఆలోచించాడు. లాభసాటి కమతంగా నమోదు అయిన తర్వాత కూడా కమతం ముక్కలవుతుంది. తన చర్య ద్వారా రిజిస్ట్రేషన్ జరిగినపుడు కమతం ఎంత ఉన్నదో అంతనే ఉంచగలుగుతాడు, అంతే పరిమాణంలో తగ్గింపు జరగటాన్ని ఆయన అంగీకరించడు. కాని అవి చిన్నవిగాను చెల్లాచెదురుగానూ అవుతూనే ఉంటాయి. కటింగ్స్ చెప్పిన ప్రకారం శాసనం వచ్చినా పరిస్థితి ఇంచుమించు ఎప్పటిలాగానే ఉంటుంది. నిజంగా కూడ గట్టటం అనేది ప్రొఫెసర్ జెవాన్స్, బరోడా కమిటీ రెండూ ఉద్దేశించారు. ఈ అవసరం కోసం వారు సమర్థించిన ప్రతిపాదనలు ఇంచుమించు ఒకేలా ఉన్నాయి; దానిని అమలు చేసే విధానం కూడా అలానే ఉన్నాయి.

కూడ గట్టటం జరిగిన కమతాన్ని భద్రపరచటం కోసం, కేటింగ్ గారు బరోడా కమిటీ కూడా ఒక వ్యక్తే ఆస్తికి సంక్రమణ దారుడు కావాలనే నియమం పెట్టారు. భూమి విభజన ఫలితంగా స్వయం పోషకం కాని కమతాలు ఏర్పడే సందర్భంలో మాత్రమే బరోడా కమిటీ ఈ సూత్రాన్ని అనుసరిస్తుంది, అప్పుడయినా భూమి నుంచి భాగం వదులుకోవలసి వచ్చిన వారసుల హక్కుల్ని సంక్రమణదారుడు తప్పనిసరిగా కొనుక్కోవలసి వస్తుంది. కీటింగ్ గారు హక్కు వదులుకొనే వారసులకు నష్టపరిహారం చెల్లించవలసిన అవసరం లేదంటాడు.

కూడ గటట్టంకు సంబంధించిన ఈ ప్రతిపాదనల విషయంలో ఒక తీవ్రమైన విమర్శ ఉన్నది. అదేమంటే, కూడ గట్టిన కమతం పెద్ద కమతంగా కూడా ఉండాలనే విషయాన్ని అవి గుర్తించలేదనేది. భారతీయ వ్యవసాయం చిన్న కమతాల వల్ల చెదురుమదురుగా ఉన్న కమతాల వల్ల నష్టపోతున్నది అని అంటున్నారంటే, కమతాలను కూడగట్టటమే కాదు, అవి పెద్దగా ఉండేటట్టు కూడా చూడాలి. కూడగట్టటం వలన కమతాలు చెదురుమదుగా ఉండటం వల్ల వచ్చేనష్టాలను తొలగించుకోవచ్చుకాని, ఆ విధంగా కూడగట్టిన కమతం లాభసాటిదైతే తప్ప అంటే కమతం పెద్దగా అయితే తప్ప, చిన్నకమతాల వల్ల వచ్చే నష్టాలను నివారించుకోలేము. కమిటీ, కేటింగు గారు ఇద్దరు కూడా సమస్య సంబంధించి ఈ అంశాన్నివారు గమనించలేకపోయారు. అందరు సమర్థకులలో

చేయలేదు.

లాభసాటి కమతం నిర్వచనం మీద ఉత్పత్తికి సంబంధించిన పై వ్యాఖ్యానాలను దృష్టిలో ఉంచుకొని, వ్యవసాయాన్ని ఆర్థిక వ్యాపారంగా భావిస్తే, దానంతట అది కమతం పెద్దదని చిన్నదనే సమస్యే రాదని మనం నిర్ణయించుకోవచ్చు. ఆర్థిక వ్యాపారంగా తన కమతాన్ని సాగుచేసుకోవటానికి అవసరమైన ఇతర ఉత్పత్తి వస్తువుల విషయంలోనే తన కమతం చిన్నదా పెద్దదా అనే విషయం ఉంటుంది. ఆర్థిక అర్థాలు అన్నింటిలోనూ కేవలం భూమి పరిమాణం అనే దానిమీద ఏమీ ఆధారపడి ఉండదు. దీని ఫలితంగా, పెద్ద కమతం లాభసాటిగా ఉంటుంది, చిన్న కమతం నష్టదాయకంగా ఉంటుందని ఆర్థిక శాస్త్ర భాషలో చెప్పటానికి సాధ్యంకాదు. ఆవిధంగా చిన్న కమతమూ లాభసాటిగానే ఉంటుంది. పెద్ద కమతమూ ఉంటుంది. ఎందుకంటే, కమతం లాభదాయకమూ నష్టదాయకమూ అనే విషయం దాని పరిమాణాన్ని బట్టి ఆధారపడిఉండదు, భూమితో సహా అన్ని విషయాలు తగిన పాళ్లలో ఉండటం మీదనే ఆధారపడిఉంటుంది.

అందువల్ల, లాభదాయకమైన కమతం అంటే శుష్క అర్థంలో చెప్పుకోకుండా, భూమి, పెట్టుబడి, శ్రమ మొదలైన వాటి అన్ని కలయికలతోనూ చెప్పుకోవాలి. ఈ కలయికకూడా దానిలో ఉన్న ప్రతివిషయమూ ఇతర విషయంతో కలిసి వీలయినంత ఎక్కువగా వాటి శక్తి మేరకు అవిపనిచేయటంలోనే ఉంటుంది. మరో అర్థంలో చెప్పాలంటే, ఒక లాభదాయకమైన కమతాన్ని ఏర్పాటు చేయాలంటే, ఒక భూమి చెక్కను వ్యవసాయదారుడు మలుచుకుంటే సరిపోదు. తన కమతాన్ని సమర్థవంతంగా సాగుచేసుకోవటానికి కావలసిన ఇతర ఉత్పత్తి సాధనాలు అతనికి ఉండాలి, వాటిని తగిన పాళ్లలో ఉంచుకోవాలి. అది లేకపోతే సమర్థవంతమైన సాగు ఉత్పత్తి ఉండదు. అతని సామాగ్రి తగ్గిపోతే అతని కమతం కూడా తగ్గిపోవాలి. అతని సామాగ్రి పెరిగితే అతని కమతమూ పెరగవలసిందే. విషయం ఏమంటే, అతని సామాగ్రి, అతని కమతమూ ఒకదానికి ఒకటి సరియైన పాళ్లు లేకుండా ఉండకూడదు. సమపాళ్లలో ఉండాలి అవసరంపడితే, పాళ్లలో మార్పులు తీసుకు రావచ్చు

పైన అనుసరించిన వాదనా పద్ధతికి వాస్తవ ఆచరణలో మద్దతు లేకపోలేదు. బొంబాయి రాష్ట్రంలో సర్వే సెటిల్‌మెంట్ విధానానికి మూలపురుషులైన వారే దీనిని గుర్తించి అనుసరించారని తెలుసుకుంటే ఆర్థికవేత్త సంతోషిస్తాడు. ప్రసిద్ధిగాంచిన (1840) సంయుక్త నివేదిక ఈ సమస్యపై ఎంతో విజ్ఞానవంతమైన చర్చచేసింది. దక్కన్‌లో సర్వే పద్ధతిని ప్రవేశ పెట్టటానికి పంపించిన అధికార్లముందు వచ్చిన ప్రశ్న ఏమంటే పన్ను ఎలావిధించాలని. క్షేత్రం మీద విధించాలా లేక ఒక వ్యక్తిలేదా సహభాగస్వాములు వారు యజమానులుగా ఉన్నా లేక అనుభవదారులుగా ఉన్నా వారి క్రింద ఉన్న మొత్తం కమతం

**19 సర్వేసెటిల్‌మెంట్ మాన్యువల్ బొంబాయి ప్రెసిడెన్సీ. 1882 పే 3**

మీద విధించాలా అన్నది. ఎంతో చర్చ జరిగిన తర్వాత క్షేత్రంపైన విధించాలనే పద్ధతిని అనుసరించారనే విషయం అందరికీ తెలిసిందే. కాని దీనిని అనుసరించటానికి దారితీసిన కారణాలు చాలకొద్ది మందికి మాత్రమే తెలుసు, సంయుక్త నివేదికలోని ఈ క్రిందివివరణ భాగాలను ఆసక్తిదాయకంగాను బోధనాయుతంగానూ ఉంటాయి.

"6వ పేరా : ఒక గ్రామంలోని పన్ను విధింపును చాలా చిన్ని భాగాలుగా (సర్వేనెంబరులో తెలిపినట్టు) విడగొట్టటంలోని ప్రయోజనం ఏమంటే, వ్యవసాయదారులకు తమ దగ్గర ఉన్న వ్యవసాయపెట్టుబడులు తరుగుతూ పెరుగుతూ ఉండే మొత్తాలకు అనుగుణంగా తన పొలాన్ని అమరికం చేసుకోవటమో, పెంచుకోవటమో చేసుకోవటానికి వీలుకల్పిస్తుంది. ఇది, మొత్తం భారతదేశంలో. వ్యవసాయం చేసే వర్గాలకు ఉన్నట్టుగా అతితక్కువ వనరులు ఉండే రైతులకు విలువకట్టలేనంత ప్రాముఖ్యమైనది.

"7వ పేరా : రోగంద్వారాగాని మరొక రకంగా గాని కొన్ని ఎడ్లుచనిపోతే, గ్రామంలో అంతకు ముందు తన క్రింద ఉన్నపాలంలో సాగుచేసుకొనే పరిస్థితి రైతుకు లేకుండా పోతుంది. అమరిక చేసుకోవటానికిగాని అట్టి నష్టంవల్ల తన బాధ్యతలను తీర్చుకోవటానికిగాని అవకాశం లేకపోతే, చాల తొందరగానే నాశనం దగ్గరపడుతుంది[19].

ఈ ముగింపు వెలుగులో పరికించిచూస్తే కమతాల పరిమాణాన్ని క్రమపరచటం అనేది సరైనదికాదని, వృథా అని అనిపిస్తుంది. ఎందుకంటే ప్రొఫెసర్ రెఛార్ట్ టి. ఎలీ అన్నట్టుగా -

"ఒక పొలం ఎంతపరిమాణంలో ఉండాలి అనే ప్రశ్నకు ఏదో సమాధానం యివ్వటం సాధ్యంకాదు. పొలం విలువ, లేదా దానిపైన వచ్చే అద్దె చాల ముఖ్యమైన అంశం. అద్దె మొత్తంకు అదనంగా, రైతు పెట్టగలిగిన పెట్టుబడి, తనకు ఎక్కువ నేర్పుఉండే వ్యవసాయం, తను తెచ్చుకోగలిగే పనివారల స్వభావం, బజారుకు ఎంత దగ్గరలో ఉన్నదనేది, రవాణా సౌకర్యాలు చాలినంత ఉన్నాయా అనేవి, వీటన్నిటిని రైతు ఎంతపరిమాణంగల పొలాన్ని తను అజమాయిషీ చేయగలడు, ఎంత సమర్ధవంతంగా సాగుచేయగలడనే దానికి లెక్కలోకి తీసుకోవాలి.

"సమస్య ఏమంటే ఒక వ్యక్తి తనకు ఎంత స్వంతలాభం రావాలనే విషయాన్ని నిర్ణయించుకోవటమే. కాని శాసన కర్త, విజ్ఞాన శాస్త్రాన్ని అధ్యయనం చేస్తున్నవారు ఎంతో కష్టమైన ఈ వాణిజ్య శాస్త్రాన్ని-పొలం జమాఖర్చులు వేయటం -అభివృద్ధి పరచటానికి, పొలం వ్యవస్థ సర్దుకుపోవలసిన ధరలు, వేతనాలు, రవాణా ఖర్చులు గురించి రైతుకు ఎప్పటికప్పుడు తెలియచేయటానికి సహకరిస్తారు."

21. భారతదేశంలో ధరల పెరుగుదల పరిశీలన తత్సంబంధ నివేదిక 1914 (రిపోర్టు ఆన్‌ది ఇన్‌క్వయిరీ ఇంటు ది రైజ్ ఆఫ్ ప్రైసెస్ ఇన్ ఇండియా 1914 వాల్యూము 1, పేజీలు 66-67 (ఆంగ్లంలో ఏటవాలుగా (ఇటాలిక్స్) లిఖించిన, తెనుగులో కింద గీటుగీసిన పదాలు మావి)

కమతం పరిమాణాన్ని నిర్ణయించగలం అనే తెగువ ఉన్నవారికి మంచి ఉద్దేశాలు ఉన్నా మరొకరి తరఫున నిర్ణయించే వ్యవహారం ప్రమాదాలు తెచ్చిపెడుతుందనే సంగతి ప్రొఫెసర్ ఎలీ ఎంథో ఆలోచించి చెప్పిన అభిప్రాయం తెలియజేస్తుంది. ఎందుకంటే క్షేత్రం ఎంత పరిమాణంలో ఉండాలో అనేదానిని రైతు తప్పవేరెవరూ నిర్ణయించలేరు. కాలాన్ని బట్టి కమతం పరిమాణం మారుతూ ఉంటుందనే విషయం గుర్తుంచుకుంటే వారికి చాలా మంచిది. తన కమతం పరిమాణం సర్దుకోవలసిన సామాగ్రి మార్పును బట్టి ఒకసారి చిన్న కమతాన్ని మరొక సారి పెద్ద కమతాన్ని ఉంచుకోవాలని రైతు అనుకుంటాడు అందువల్ల అతను మంచి ఆర్థిక వేత్త ఏమీకాడు, లాభసాటి ఉత్పత్తి ప్రయోజనాల దృష్ట్యా మార్పు అవసరం అనుకున్నప్పుడు మార్పుకు వీలయ్యే పరిమాణాన్ని అతను నిర్ణయించుకుంటాడు. కమతం పరిమాణాన్ని నిర్ణయించటంలో అతను పెద్దకమతాన్ని నిర్ణయిస్తాడు తప్ప లాభసాటి కమతాన్ని నిర్ణయించ లేడు. ఎందుకంటే లాభసాటి కమతం అంటే పొలం పరిమాణం ఒకటే కాదు, సమర్థ వంతమైన సాగుకు అవసరమైన సామాగ్రికి సరిపోయేటంత పొలం ఉండటం

## V

## నివారణలపై విమర్శ

మన వ్యవసాయంలో ఏర్పడిన రుగ్మతలను నివారించడానికి, ఇప్పుడున్న కమతాలను మరింత పెద్దవి చేయాలని ప్రతిపాదిస్తున్నారు. కానీ వ్యవసాయంలో వినియోగించే దుక్కి-టెద్దులు పెరిగిపోతున్నట్లూనూ, పొలాల పరిమాణం తరిగిపోతున్నట్లూను చూపగలిగితేనే ఈ వాదంనిలుస్తుంది. పొలాల పరిమాణానికి సంబంధించిన వాస్తవాలను ఇంతకు మునుపే నమోదు చేయడం జరిగింది. వ్యవసాయంలో వినియోగించే గొడ్లూ, పనిముట్లూ తదితర సామాగ్రి పెరిగిందా లేదా అనే విషయాన్ని మాత్రమే ఇక చూడాల్సివుంది. ఈ అంశంపై విస్తారంగా సర్వే చేసిన శ్రీ కె.ఎల్ దత్తా ఇలా అంటున్నారు[21]

"178. మేము పరిశీలించిన రైతులలో చాలామంది, భూమిని సమర్థవంతంగా దున్నకపోవడం వల్లనే వ్యవసాయోత్పత్తుల సరఫరాల్లో తరుగుదల ఏర్పడిందనే అభిప్రాయం కల్గివున్నట్టు కనిపించింది. దుక్కి, పశువులు, శ్రామికుల మీద వెచ్చించే ఖరీదు పెరిగినందువల్ల వాటి కొరతవల్ల ఇంతకు మునుపు చేసినంత సమర్థవంతంగా, జాగ్రత్తగా ఇప్పుడు భూమిని సాగు చేయడం లేదని వారు చెప్పారు. వ్యవసాయం ఖర్చులను తగ్గించి ఆదా చేయడానికని రైతులు ఇంతకు మునుపు దున్నినంత తరచుగా ఇప్పుడు దున్నడంలేదని కూడా చెప్పారు. ఎరువులు వాడకం, కలుపు తీయడం, బావులను ఉపయోగించే చోట నీటి తడి పెట్టడం కూడా బాగా తగ్గిపోయింది."

22 ఇండియన్ ఇండస్ట్రీస్

179. దుక్కి దున్నే పశువుల గురించి.... దుర్భర క్షామ పరిస్థితుల ప్రభావం ఎంతగా ఉండేదో తెలియజేయటానికి ఈ పశువుల సంఖ్యే సాక్ష్యం. క్షామప్రభావ కారణంగా పశువుల సంఖ్య తగ్గడమనేది అనివార్యమయినప్పటికీ పరిస్థితులు ఇతర విధాల అనుకూలమైనప్పుడు కొద్ది సంవత్సరాలకాలంలోనే, సాధారణంగా ఈ లోటు పూడుతుంటుంది. అస్సాం, బుందేల్ ఖండ్, ఆగ్రాప్రావిన్సెస్ లోని ఉత్తర, పశ్చిమ ప్రాంతాలు, గుజరాత్, దక్కన్, బీరార్, మద్రాస్ ఉత్తర, మద్రాస్ పశ్చిమ ప్రాంతాలు వంటి కొన్ని ప్రాంతాలలో పట్టికలో చూపిన దుక్కిదున్నే పశువుల సంఖ్య, ప్రథమ సంవత్సరం (1893-94) కన్నా ఇటీవలి సంవత్సరం (1908-09)లో తక్కువగా ఉన్నది. ఈ గణాంక వివరాలు ఎక్కువగా ఆధారపడతగ్గవి కాకపోయినా, కొన్ని ప్రాంతాలలో మాత్రం దుక్కి దున్నే పశువుల కొరత వుండనే వున్నదని తెలియ చేయడానికి ఉపకరిస్తాయి. పెట్టుబడి కలిగుండడాన్ని గురించి శ్రీ ఎల్లియట్ జేమ్స్ ఇలా అంటున్నారు.

" ఆదర్శ (మాడల్) సాగు భూముల్లో చూపించిన మేలైన సాగు వ్యవస్థవల్ల కలిగే ఫలితాలను పొందేందుకు రైతులు ఆసక్తిగానే ఉన్నారు. అయితే, సక్రమ ఎరువుల వాడకం, మెరుగైన దుక్కి పద్ధతుల వల్ల మంచి దిగుబడులను పొందవచ్చునని చక్కగా తెలుసుకోవడం ఎల్ల రైతులు పెద్దగా లాభపడలేరు. (వారికి ప్రధానంగా కావలసినది పెట్టుబడి)"[22] వారిదగ్గర అసలులేనిది పెట్టుబడి. తన వ్యవసాయపనిముట్లు చాలా పురాతనమైనవని, అసమర్థమైనవని రైతుకు తెలిసినప్పటికీ అతను వాటిని మార్చి అంతకంటే మెరుగైనవి వాడగలిగే పరిస్థితిలో లేడు, అంటాడు ఆ గ్రంథకర్త. కారణమేమిటంటే, "మేలైన పనిముట్లు, మేలైన దుక్కిటెడ్లూ సేకరించాలంటే ఎక్కువ పెట్టుబడులు పెట్టాలి. అందుకు చాలా డబ్బు అవసరం. అది అతని దగ్గరలేదు"

బరోడా సంస్థాన వ్యాపార పారిశ్రామిక శాఖ కామర్స్ అండ్ ఇండస్ట్రీస్ డైరెక్టర్ శ్రీ ఎం. బి నానావటీ మరో సందర్భంలో బరోడా సంస్థానానికి సంబంధించి ఇటువంటి సమాచారాన్నే సేకరించారు. రాష్ట్రంలో కమతాల ఏకీకరణను పరిశీలించడానికి ఏర్పాటు చేసిన కమిటీలో కూడా ఆయన సభ్యులుగా ఉన్నారు. కాని దురదృష్టవశాత్తూ, వ్యవసాయోత్పత్తి సాధనాలకు కమతాలకు వున్న సంబంధం గుర్తెరగక, ఆయన తనకు తెలిసిన వాస్తవాల ఆధారంగా కమిటీ నిర్ణయాలను ప్రభావితం చేయలేకపోయారు. రైతుల పరిస్థితిగురించి చెబుతూ ఆయన ఇలా వాపోయారు : అవసరమైనన్ని దుక్కిదున్నే పశువులు రైతు వద్ద పూర్తిగా లేవు. ఈనాడు (1913లో) సంస్థానంలో రైతాంగానికి వున్న దుక్కిటెడ్లు మొత్తం సంఖ్య 8,34,901; అనగా ప్రతి 36 (బీఘాల) ఎకరాల భూమికి ఒక జత ఎడ్లన్నమాట. ఒకజత మంచి ఎద్దులు సగటున 25 బీఘాల భూమిని దున్నగలవు. కాని ఈనాటి ఎద్దు సంతతి అంత బలమైనదికాదు. ఈ తరానికి చెందిన ఓ జత ఎద్దులు మహా అయితే సగటున 20 బీఘాల భూమిని మాత్రమే దున్నగలుగుతాయి. కాని ఇప్పుడున్న దుక్కిటెడ్ల సంఖ్య, భూమి విస్తీర్ణాన్ని అనుసరించి, జత ఎద్దులు సగటున 36 బీఘాలు దున్నాల్సి వుంటుంది.

ఇటువంటి పరిస్థితుల్లో దుక్కి బాగా లోతుగా ఉండే అవకాశంలేదు. అది కేవలం భూమిని పైపైన గీకినట్లు మాత్రమే ఉంటోంది. చిన్న రైతుల వద్ద దుక్కి దున్ను పశువులే ఉండడం లేదు. మహా అయితే వారి వద్ద ఒక ఎద్దుమాత్రమే ఉంటుంది. తమలాగే ఒకే ఎద్దును కలిగి ఉన్న తమ స్నేహితుల సహకారంతో వారు భూమిని సాగుచేస్తున్నారు. ఇక వ్యవసాయ పనిముట్ల విషయానికొస్తే సంస్థానంలో 1,54,364 నాగళ్ళు ఉన్నాయి. అంటే సగటున ఇరువురు రైతులకు ఒక నాగలి చొప్పున ఉంది. రాష్ట్రంలో సాగుదార్లు, కౌలుదార్ల సంఖ్య మూడు లక్షల కంటే బాగా ఎక్కువ అన్నవిషయాన్ని ఈ సందర్భంలో గర్తుంచుకోవాలి. ప్రతి ఒక్కరికీ పూర్తిస్థాయిలో పనిముట్లు అవసరం. ఈ లెక్కన వాస్తవంలో వున్నసగటు పనిముట్ల వాడకం పైన చెప్పిన సగటు వాడకం కన్నా మరింత తక్కువై ఉండాలి.[23]

ఈ క్రింది పట్టికలో చూపినట్లుగా, వాస్తవానికి, 1898 తరువాత సంస్థానంలో వ్యవసాయోత్పత్తికి అవసరమైన సాధనాల సంఖ్య చెప్పుకో తగినంతగా పడిపోయింది.

| సంవత్సరం | నాగళ్లు | బళ్ళు | దుక్కిదున్నే ఎడ్లు | ఇతర పశువులు |
|---|---|---|---|---|
| 1898 | 1,75,989 | --- | 4,15,089 | 5,70,517 |
| 1910 | 1,51,664 | 68,946 | 3,34,801 | 5,09,416 |

పరిస్థితులు ఇలా ఉన్నప్పుడు ఒక్కభూమి మినహా ఇప్పుడు లభ్యమయ్యే మిగతా వ్యవసాయోత్పత్తి సాధనాలు ప్రతిపాదించిన పెద్దకమతాలకు ఏ మాత్రం చాలవనే మాట అటుంచి ప్రస్తుతమున్న చిన్న కమతాలు కూడా అందుబాటులో సున్న ఈ కొద్దిపాటి సాధనాల దృష్ట్యా, అతి పెద్ద కమతాలే అవుతాయని అనడమే ఉచితమనిపించుకుంటుందిగదా? మన సిద్ధాంతం దృష్ట్యా ఇటువంటి వాస్తవాలను పరిశీలించినప్పుడు ఇప్పుడున్న కమతాలు ఆర్థికంగా లాభసాటికావని మనం అంగీకరించకతప్పదు అయితే ఉన్నకమతాలు లాభసాటికాకపోవడానికి కారణం అవి చిన్నవైనందువల్లకాకపోగా, పెద్దవైనందువల్లనే అనేవిషయం తేలుతుంది. అందువల్ల, ఆర్థికంగా లాభదాయకం అనే పదాన్ని ఏ అర్థంలో నయితే ఉపయోగించామో, ఆ అర్థంలో లాభదాయకంగా ఉండేందుకు గాను ప్రస్తుతమున్న కమతాల పరిమాణాన్ని మరింతగా తగ్గించమని మనం వాదిద్దామా? తర్కబద్ధంగా అనివార్యంగా తేలేవిషయం ఇదేనని, జాగ్రత్తగా ఆలోచించని పాఠకులనుకోవచ్చు. ఈ దేశంలో ఉన్న ప్రధాన ఆలోచనా సరళికి అది భిన్నంగా ఉండి ఆశ్చర్యం కలిగిస్తుందనడంలో సందేహంలేదు. అయితే, ఆనిర్ణయానికి రావడం ఏ విధంగానూ అనివార్యమనుకోరాదు. ఎందుకంటే, ఇంతకు క్రితం మనం చెప్పుకున్న సిద్ధాంతాన్ని అనుసరించి, ఈ సందర్భంగా దుక్కిటెడ్లు, వ్యసాయపనిముట్లు పెంచాలని కూడా మరింత హేతుబద్ధంగానూ, నిరాఘాటంగానూ

23. బరోడా సంస్థానంలో 1913వ సంవత్సరంలో వ్యవసాయ దారుల ఋణగ్రస్తతపై నివేదిక, పేరా 35. (రిపోర్ట ఆన్ ఎగ్రికల్చరల్ ఇన్‌డిటెన్‌నెస్ ఇన్ బరోడా స్టేట్ 1913 పేరా 35.)

వాదించే వీలుంది. అప్పుడు పెద్దకమతాల ఆవశ్యకతా ఏర్పడుతుంది; అలాంటి పెద్దకమతాలు ఆర్థికంగా లాభసాటిగానూ ఉంటాయి. అందువల్ల, భారతదేశం వ్యవసాయ రుగ్మతలకు నివారణ అన్నది భూకమతాల పరిమాణాన్ని పెంచడం పైనకాక పెట్టుబడి, ఉత్పత్తి సాధనాలను పెంచడంపై ఆధారపడిఉంది. ఆ పెట్టుబడి అనేది పొదుపు నుండీ వస్తుందనీ, మిగులు ఉన్నప్పుడే పొదుపు సాధ్యమనీ, ఆర్థికశాస్త్రంలో అందరూ ఎరిగున్నదే.

దేశప్రజల ప్రధాన ఆర్థిక జీవనాధారమైన మన వ్యవసాయం ఏమైనా మిగులునిస్తోందా? మిగులేమీ ఉండదని అందరూ అనేమాటతో మనం ఏకీభవిస్తాము. లోటులుఉన్నా మన ఆర్థికవ్యవస్థను మిగులు ఆర్థిక వ్యవస్థగా మార్చేందుకు కమతాలను ఏకీకృతం చేసి, విస్తరింపచేయాలన్న నివారణోపాయాన్ని కూడా మనం ఆమోదిస్తాం అయితే మనం విభేదించే దెక్కడంటే ఆ లక్ష్యాన్ని సాధించేందుకు అనుసరించాల్సిన పద్ధతిపైనే. ఎందుకంటే, భారతదేశంలో చిన్నకమతాల సమస్య అనేది మౌలికమైంది కాదు; సామాజిక ఆర్థిక వ్యవస్థలోని అనుచిత సర్దుబాటు అనే మౌలిక సమస్యనుండే ఈ సమస్య ఉత్పన్నమైనదనే మా నిశ్చితాభిప్రాయం. అందువల్ల ఈ సమస్యను శాశ్వతంగా పరిష్కరించాలంటే, మౌలిక సమస్యనే మనం పరిష్కరించాల్సి ఉంటుంది.

ఆ పని చేసేముందు, అపసవ్యమైన సామాజిక ఆర్థిక వ్యవస వల్ల మన మెంతగా బాధపడుతున్నామో రుజువు చేస్తాను భారత దేశం వ్యవసాయ దేశం అనే సర్వసాధారణమైన ప్రకటన అందరూ చేస్తుంటారు అయితే చాలా మందికి తెలియని విషయమేమంటే, విస్తారమైన భూమి సాగులో ఉన్నప్పటికీ, దేశ జనాభాతో పోల్చుకుంటే బహుస్వల్పమైన నిష్పత్తిలో మాత్రమే భూమి సాగు అవుతోంది.

1895 సంవత్సరానికి ముల్‌హాల్ ఇచ్చిన సంఖ్యలు ఈ అంశాన్ని స్పష్టంగా రుజువు చేస్తున్నాయి. 1895లో ఒక్కొక్క గ్రామస్థుడికి ఉన్నసాగుభూమి.

| | |
|---|---|
| గ్రేట్ బ్రిటన్ | 0.91 |
| ఐర్లాండ్ | 3.30 |
| ఫ్రాన్స్ | 2.30 |
| జర్మనీ | 1.70 |
| రష్యా | 5.60 |
| ఆస్ట్రియా | 2.05 |
| ఇటలీ | 1.75 |
| స్పెయిన్, పోర్చుగల్ | 2.90 |
| యు.ఎస్.ఎ. | 8.90 |
| ఇండియా | 1.0 |

అయితే, 1895 తరువాత, పరిస్థితి మరీ అధ్వాన్నంగా తయారైంది. ఈ కింది సంఖ్యలు ఆ అంశాన్ని స్పష్టంగా తెలియచేస్తున్నాయి.

| | 1881 | 1891 | 1901 | 1911 |
|---|---|---|---|---|
| బెంగాల్ | 1.5 | 0.8 | 1.12 | .. |
| బొంబాయి | 1.7 | 1.6 | 1.41 | 1.3 |
| మద్రాసు | 1.3 | 0.3 | 0.68 | 0.79 |
| అస్సాం | --- | 0.5 | 0.78 | 0.85 |
| పంజాబ్ | 1.2 | 1.3 | 1.05 | 1.11 |
| ఔధ్ | 0.81 | 0.72 | 0.73 | 0 75 |
| ఎన్.డబ్ల్యు.బి. | 0.8 | 0.73 | 0.75 | |
| బర్మా | --- | 1.5 | 1.08 | 1 09 |
| సెంట్రల్ ప్రావిన్సిస్ | 1.67 | 2.4 | 1.8 | 1.79 |
| బి. ఇండియా | 1.04 | 1.0 | 0.86 | 0.88 |

అసాధారణంగా కనిపించే ఈ విపరీతానికి అర్థమేమిటి? ఓ దేశపు పెద్దవ్యవసాయ జనాభాకు, అచ్చంగా సాగుచేసే భూమి  అతి తక్కువ నిష్పత్తిలో వున్నదంటే, వారిలో అధిక భాగం అనవసరమైన వారు, పనిలేనివారు అయివుంటారు

భారతదేశంలోని వ్యవసాయ భూములలో పనిలేని కార్మికులు ఎంత మంది ఉన్నారో ఖచ్చితంగా తెలుసుకోవడం సాధ్యంకాదు. భారత వ్యవసాయరంగంలో ఇలాంటి పనిలేని కార్మికులు ఉన్నట్లు మొట్టమొదటిసారిగా గుర్తించిన సర్ జేమ్స్ కెర్ట్ 1884లో ఇలా అంచనా వేశారు:

"ఇంగ్లాండ్ లో ఒక చదరపు మైలు సాగు భూమిని విస్తారంగా సాగుచేస్తే యువకులు, వృద్ధులు కలుపుకుని 25 మంది పురుషులకి, స్త్రీలు, బాలురు కలుపుకుని మరో 25 మందికి అంటే మొత్తం 50 మందికి పని కల్పిస్తుంది. అదే భారత దేశంలో ప్రతి ఒక చదరపు మైలుసాగుభూమికి 200 మంది, చొప్పున కేటాయించినా, అది మొత్తం జనాభాలో మూడవవంతుకు మాత్రమే పని కల్పించగలుగుతుంది"[24]

1881 లో ఉన్న మొత్తం 25.40 కోట్ల జనాభాలో మూడింట రెండువంతుల జనాభా వ్యవసాయంపైనే ఆధారపడినట్లు నమోదైనది. మనం పైన వర్ణించిన కైర్ట్ అంచనాలను అంగీకరిస్తే, జనాభాలోని మూడవ వంతుకు మాత్రమే వ్యవసాయరంగం పని

24. ఇండియా ది లాండ్ అండ్ ది పీపుల్ పే 225

కల్పిస్తుంది. అంటే ఏరకమైన ఉత్పాదక శ్రమ చేయని కార్మికులు అంతే పరిమాణంలో ఉన్నారని మనం చెప్పకోవచ్చు. ఒక వంక గ్రామీణ వ్యవస్థ విస్తరిస్తూ వుండడం, మరొకవంక సాగుభూమి నిష్పత్తి తగ్గిపోతుండడంవల్ల, ఈ రంగంలోని పనిలేని వృధా కార్మికుల సంఖ్య విస్తృత స్థాయిలో పెరిగే ఉండి ఉంటుంది.

ఈ పనిలేని వృధా కార్మికుల వల్ల కలిగే ఆర్థిక దుష్పరిణామాలు రెండు రకాలు మొదటగా, సాగు భూమిపై వ్యవసాయదారుల విపరీతమైన వత్తిడికి ఇది మరికొంత వత్తిడితోడుచేస్తుంది.

భూమిపై వత్తిడి ఎంతగా ఉందో మనకు అర్థం కావడానికి ఈ క్రింది పట్టిక ఉపయోగపడుతుంది.

1911లో ఒక చదరపు మైలులో ఉన్న సగటు సాంద్రత

| | ఔధ్ ఎన్. డబ్ల్యు. పి. | బెంగాల్ | మద్రాసు | పంజాబ్ | బొంబాయి | అస్సాం రా | స. పి. బీ ర్ | కూర్గ్ బ | బ్రిటిష్ ర్మా |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మొత్తం భూమి | 427 | 551 | 291 | 177 | 145 | 115 | 122 | 111 | 53 |
| నా భూమి | 829 | 1162 | 785 | 453 | 444 | 766 | 360 | 792 | 575 |

బహుశా ప్రపంచంలోని మరే ఇతర ప్రాంతంలోనూ భూమిపై ఇంతటి జనాభావత్తిడి ఉండి ఉండదు. ఈవత్తిడి ప్రభావం ఎలా వుంటుందో స్పష్టంగా తెలుస్తూనే వుంటుంది.

ఎవరేమి చెప్పినప్పటికీ, భూమి విభజనకు ప్రధానకారణం ఈ తీవ్రమైన వత్తిడే. సాగుభూమిపై ఈ తీవ్రమైన వత్తిడి ప్రభావాన్ని గ్రహించ లేక పోవడంవల్లనే వారసత్వచట్టం ఇంతపెద్ద సంకటంగా భావించబడుతున్నది. భూమి విభజనకు వారసత్వచట్టమే కారణమని చెప్పడము అంటే వాస్తవపరిస్థితిని తలక్రిందులుచేసి తప్పుడు దృక్పథాన్ని కలిగించడమే అవుతుంది. కేవలం ఆ చట్టం ఉండటాన్నే ఒక ఇబ్బందిగా భావించకూడదు. ఉన్న ఇబ్బంది అల్లా ఆ చట్టాన్ని ఆశ్రయించడంలో వుంది. దుష్పలితాలు ఉంటాయని తెలిసినప్పుడు కూడా ఈ చట్టాన్ని ఎందుకు ఆశ్రయించవలసివస్తున్నది? లాభదాయకం కావడం వల్లనే ఆ చట్టాన్ని ఆశ్రయించడం జరుగుతున్నది. ఇందులో విడ్డూరం ఏమీలేదు.

వ్యవసాయం ఒక్కటే వృత్తి అయినప్పుడు, ఏకాస్త భూమి లేకుండా ఉండడంకన్నా ఎంతో కొంత చిన్నమడిచెక్కను కలిగి ఉండడం మెరుగు అనిపిస్తుంది. ఆ విధంగా చిన్న చిన్న కమతాలను కలిగి ఉండడం కూడా లాభదాయకంగా చేసిన పరిస్థితులే ఈ సంకటానికి కారణం. తమ జీవనభృతిని సంపాదించుకోవడం కోసం అత్యధిక జనాభా వ్యవసాయంపై

ఆధారపడి ఉండటం అనే ఏకైక కారణం వలనే చిన్న చిన్న కమతాలు కూడా లాభదాయక మనిపించు కుంటున్నాయి; అందులో సందేహంలేదు. వ్యవసాయం తప్ప మరే వృత్తి లేనప్పుడు సహజంగానే జనాభా అంతా ఎంతోకొంత భూమిని, అది ఎంత చిన్నదైనప్పటికీ, సంపాదించేందుకు గల ప్రతి అవకాశాన్ని వినియోగించుకో ప్రయత్నిస్తారు. అందువల్ల, కీడు జరిగేది కేవలం వారసత్వ చట్టం వల్ల కాదు. సాగుభూమిపై అత్యధిక వత్తిడి కారణంగా ఆచట్టాన్ని తరచూ అమలు జరపవలసి రావడం వల్లనే ఎక్కువ హాని జరుగుతున్నది. ప్రొఫెసర్ జెవాన్స్ అనుకుంటున్నట్లుగా, కమతం ఎంత చిన్నదైనప్పటికీ సాగుదార్లుగా తాము ఉత్పత్తి దాయకమైన కార్యక్రమంలోనే నిమగ్నమై ఉన్నామని చెప్పుకునేందుకు మన వ్యవసాయ జనాభా ఎంతో కఠినంగా శ్రమిస్తుంటారు. అయినప్పటికీ, సర్ జేమ్స్ కైర్ట్

[25]జీవన ప్రమాణాలు తక్కువగా ఉండడం వల్లనే ప్రజలు చిన్న చిన్న కమతాలను సాగు చేయటం లేదు. ప్రస్తుత పరిస్థితుల్లో వాటిని సాగుచేయడం ఒక్కటే లాభదాయకం కావడం వల్లనే వారాపనిచేస్తున్నారు. చేయడానికి అంతకంటే లాభదాయకమైనది మరొకటి ఉండి ఉంటే ప్రజలెప్పుడూ చిన్న కమతాలను సేద్యం చేయడానికి ఇష్టపడి ఉండి ఉండేవారు కాదు. అందువల్ల, చిన్నకమతాలు, లేదా అల్పవిస్తీర్ణంలో సేద్యం అనేది ప్రపంచవ్యాప్తంగా ఎందుకు ఉందో, భూమిపై ఉన్న తీవ్ర వత్తిడి ని దృష్టిలో ఉంచుకుని చూస్తే సులభంగా అర్థం చేసుకోవచ్చు.

ఇంతకుమునుపే : పరిచయం; జీవన ప్రమాణ స్థాయి తక్కువగా వుండటం వల్లనే భారతదేశంలోని వ్యవసాయం ఇబ్బందులను ఎదుర్కొంటుందనే అభిప్రాయాన్ని ప్రొఫెసర్ జేవాన్స్ పాఠకులకు కలిగిస్తున్నారు. ఉన్నతజీవన ప్రమాణస్థాయి ఒకసారి ఏర్పడితే, అది పెద్ద కమతాలకు దారి తీస్తుందని, ఎందుకంటే ఉన్నత జీవన ప్రమాణాలు కలిగినవారు చిన్న కమతాలను సాగుచేసేకంటే వలస పోవటానికే ఇష్టపడతారనేది ఆయన వాదన. కమతాలు, జీవన ప్రమాణ స్థాయి ఒకదానితో మరొకటి సంబంధం కలిగినవన్న ఆయన వాదన బాగా ఆలోచించలేని పాఠకులను తప్పుదోవపట్టించేదిగా ఉంది. అందువల్ల దీనికి సంబంధించి ఒక వివరణను ఇవ్వడం అవసరమవుతుంది. జీవనప్రమాణస్థాయి అనేది మనిషి అలవాట్లను బట్టి నిర్ణయించబడే ఒక వినియోగస్థాయి మాత్రమే. ఒకనిర్ణీత వినియోగితాస్థాయిని నిర్ణయించే అంశమేమిటి? అది ఉత్పత్తి స్థాయే. జీవన ప్రమాణ స్థాయిలో పెరుగుదల అనేది ఉత్పత్తి అధిక మవ్వడానికి దోహద పడుతుందని అంగీకరించవచ్చు. అంతేకాని, కేవలం కోరిక ఉన్నంత మాత్రాన అది కార్యసాధనకు దారితీస్తుందనుకోవడం మూర్ఖత్వం. ఉత్పత్తిలో వాస్తవ పెరుగుదల మాత్రమే జీవన ప్రమాణస్థాయి పెరుగుదలకు దోహదపడుతుంది. అంతేగాని "విద్యవల్ల లేదా మరొక చోటకు వెళ్లడం వల్ల" కాని కలిగే అభిలాష కారణంగా కాదు. ఉత్పత్తి పెరుగుదలకు గల అవకాశం ఉన్నత జీవన ప్రమాణస్థాయికి దారితీసి, చిన్నకమతాలను తోసిపుచ్చుతుందనేదే ప్రొఫెసర్ జేవాన్స్ అభిప్రాయమైనట్లయితే మనం ఆయన వాదనను బలపర్చేవాళ్లము ఒకరుమవుతాం. కాని ఆయన చెప్పేది మనకు బాగా విశదంగా అర్థంచేసి చెప్పాలనుకుంటే జీవనప్రమాణ స్థాయి అన్న అంశాన్ని వదలివేసి ఉత్పత్తి పెరుగుదల అన్న అంశం గురించి మాత్రమే మాట్లాడడం బాగుంటుంది. ఉత్పత్తిలో పెరుగుదల అనేది జీవన ప్రమాణాల పెరుగుదలకు దారితీస్తుంది అనే అంశాన్ని అందరూ అంగీకరిస్తారు. అంతేకానీ, ప్రొఫెసర్ జేవాన్స్ అంటున్నట్లు, జీవన ప్రమాణాలు పెరుగుదల ఉత్పత్తి పెరుగుదలకు దారితీసేదికాదు. కేవలం జీవన ప్రమాణాల పెరుగుదల అనేది ఉత్పత్తి పెరుగుదలకైనా దారి తీయవచ్చు లేదా మరొకరిని కొల్లగొట్టే స్థితికన్నా దారి తీయవచ్చు. ఉత్పత్తిపై పెరుగుదల గురించి మాట్లాడకుండా జీవన ప్రమాణాల గురించి మాత్రమే మాట్లాడటమే అంటే అది ఉదాత్తమైన అభిలాషను వ్యక్తం చేయడమైనా అవుతుంది; తప్పితే అనర్థానికైనా దారితీస్తుంది.

ప్రమాణం దృష్ట్యా పరిశీలించినట్లయితే మన వ్యవసాయం జనాభాలో అత్యధికభాగం పనిలేని వృథా శ్రామికులుగానే తేలుతారు. వినియోగించని వృథాపెట్టుబడికి, పనిలేని వృథాశ్రామికులకి అత్యంత కీలకమైన తేడా ఒకటి ఉంది. పెట్టుబడి అనేది ఉన్నచోట పడి ఉంటుంది. దానికి పోషణ అవసరంలేదు. కాని సజీవులైన శ్రామికులు జీవించాలంటే వారికి పోషణ అవసరం. అనగా పెట్టుబడి వృథాగా పడివుంటే దానిపై ఏ సంపాదనా వుండదనే మాటనిజమే; కానీ దాని పోషణకంటూ అయ్యే ఖర్చుకూడా అట్టేవుండదు. కాని శ్రామికులు అలా కాదు. వారు సంపాదించినా, సంపాదించకపోయినా, వారు జీవించి ఉంటానికి తినక తప్పదు, అందుకయ్యే ఖర్చూ తప్పదు. అందువల్ల శ్రామికులు పనిలేకుండా వృథాగా ఉండడమనేది ఒక విపత్తుగా భావించవలసివుంటుంది. ఎందుకంటే, ఉత్పత్తి ద్వారా వారు మనుగడ సాగించలేకపోయినప్పుడు, ఇతరుల సంపాదనను హరిస్తూ వారు జీవించాల్సి వస్తుంది. పనిలేని ఈ వృథా శ్రామికులే భారతదేశ జీవధాతువులను హరిస్తూ, కొరుకుడు పుండ్లువలే తయారయ్యారు. జాతీయ ఆదాయానికి మరికొంత చేర్చాల్సిందిపోయి, వీరు ఉన్న కొంచెం మిగులును కూడా హరిస్తున్నారు. జాతీయ మిగులు తరుగుదల అనేది ఈ వృథా శ్రామికులవల్ల కలిగే మరొక ముఖ్యమైన దుష్ప్రభావం. వ్యక్తి ఆదాయం మాదిరిగానే సమాజ ఆదాయం కూడా (1) ఆదాయం కోసం చేసే కృషి (2) ఉపయోగించే వనరులు అన్న అంశాలపై ఆధారపడి ఉంటుంది. వ్యక్తి లేదా సమాజం యొక్క మొత్తం ఆదాయం అనేది ప్రస్తుత శ్రమ లేదా అంతకు మునుపే సంపాదించి పెట్టుకున్న ఉత్పాదక వనరుల ద్వారా వస్తుందని నిర్ధారణగా చెప్పు కోవచ్చు. అంటే సమాజానికి ఈనాడు దక్కేది యావత్తూ, ఇప్పుడు పడిన శ్రమ లేదా గత కాలపు ఉత్పత్తుల ద్వారా కాని వస్తుంది. ఈ ప్రమాణాన్ని బట్టి చూస్తే తన జీవనోపాధిని సంపాదించడం కోసం మన సమాజంలోని అత్యధిక భాగం వర్తమానంలో ఎక్కువ కృషిచేయడం లేదని, ఇతర విధాల ఆధారపడడానికి గత కాలపు వనరులు దాని దగ్గర విస్తృత స్థాయిలోనూ లేవని అర్థమవుతుంది. అందువల్ల మన ఆర్థిక వ్యవస్థ స్పష్టమైన పెట్టుబడి కొరతతో ఉందని నిస్సందేహంగా చెప్పవచ్చు. పెట్టుబడి అనేది ఘనీభవించిన మిగులు. మిగులు అనేది సంపాదన కోసం మనం చేసేకృషి మీద ఆధారపడి ఉంటుంది. సంపాదన కోసం ప్రయత్నమే లేనప్పుడు సంపాదన ఉండదు. సంపాదన లేనప్పుడు మిగులు ఉండదు. మిగులు లేనప్పుడు పెట్టుబడి ఉండదు.

మన వ్యవసాయ రుగ్మతలకు మన అపసవ్య సామాజిక ఆర్థిక వ్యవస్థే ఏ విధంగా కారణమో రుజువు చేశాం. మనమంతా పూర్తిగా వ్యవసాయం మీదే ఆధారపడి ఉండడం వల్ల, అది కమతాల విభజనకు, అవి చిన్నవి కావడానికి ఎలా దారి తీస్తుందో రుజువు చేశాం. మన జనాభాలో అత్యధిక భాగాన్ని మన వ్యవసాయం తన ఉత్పాదక కార్యక్రమంలో ఉపయోగించుకోలేని పరిస్థితి ఉండడంవల్ల వారు పనిలేని వృథా శ్రామికులుగా ఎలా ఉండిపోవాల్సి వస్తుందో కూడా స్పష్టంచేశాం. ఈ పనిలేని వృథా శ్రామికులు మన దేశానికి

పెట్టుబడి అనేదిలే కుండా ఎలా చేస్తున్నారో కూడా రుజువు చేసి చూపాం. ఈ విశ్లేషణ దృష్ట్యా చూసినప్పుడు, ప్రస్తుత సామాజిక ఆర్థిక వ్యవస్థలో భూకమతాల ఏకీకరణ, విస్తరణ అనే నివారణోపాయాలు ఖచ్చితంగా ఎందుకు విఫలమవుతాయో సులభంగా అర్థం చేసుకోవచ్చు.

అన్ని అనర్థాలకు చిన్న కమతాలే మూలంగా పరిగణించేవారు సహజంగా వాటి విస్తరణను సమర్థిస్తారు. అలా సమర్థించటం తప్పుల తడకలతో కూడిన రాజకీయ ఆర్థిక విధాన మనిపించుకుంటుంది. 'తప్పుల తడకల రాజకీయం ఆర్థిక విధానం నేరాలకు ఫలవంతమైన మాతృక' అవుతుందని ఒకప్పుడు థామస్ ఆర్నాల్డ్ స్పష్టం చేశారు. కేవలం భూకమతాల విస్తరణ ఒక్కటీ కమతాలను లాభదాయకం చేయదు. అలాచేయకపోగా, కృత్రిమ కమతాల విస్తరణ పెక్కుసామాజిక రుగ్మతలకు దారితీస్తుంది. ఈ కృత్రిమ కమతాల విస్తరణ వల్ల భవిష్యత్తులో పెక్కుమంది భూములు కోల్పోయినవారు భూములులేని వారు తయారవుతారు. ఇలాంటి పరిస్థితి వ్యక్తిపరంగా సంతోషదాయకమూకాదు, జాతిపరంగా వాంఛనీయమూకాదు. ఇపుడున్న కమతాలను విస్తరించి, వాటికి తగినంత పెట్టుబడిని, అవసరమైనంత ఉత్పాదక సామాగ్రిని సమకూర్చినా, అది ప్రస్తుత సమస్యలకు సరైన నివారణ అనిపించుకోదు. పైపెచ్చు ఇపుడున్న వృధా శ్రామికులకు, మరికొంత మందిని అదనంగా చేర్చి మన అరిష్టాలను మరింతగా పెంచుతుంది. ఎందుకంటే పెట్టుబడిదారీ పద్ధతుల్లో వ్యవసాయం చేపట్టినప్పుడు ప్రస్తుత పద్ధతుల్లో సాగే వ్యవసాయానికి కావల్సినంతమంది మనుషులు అవసరం ఉండదు.

కమతాల పరిమాణాన్ని పెంచకపోతే, ఏకీకరణ సాధించ లేమా? ప్రస్తుత సామాజిక ఆర్థిక వ్యస్థలో కమతాల ఏకీకరణం కూడా సాధ్యంకాదని రుజువు చేసి చూపవచ్చు. కమతాల విభజన, చీలికల సమస్యను కమతాల ఏకీకరణ అనే నివారణోపాయంపూర్తిగా పరిష్కరిస్తుందని అనుకోవడానికి వీలులేదు. సమస్యను పూర్తిగా పరిష్కరించకపోగా, అది కేవలం చట్టపరమైన కంటితుడుపు చర్య మాత్రమే అవుతుంది. ఏకవ్యక్తివారసత్వమన్న నిబంధన ఆచరణలో ఏవిధంగా ఉంటుందో ముందుగా మనం తెలుసుకోగలిగితే ఈ అంశం మరింత సులభంగా అర్థమవుతుంది. ఇందుకై అటువంటి నిబంధన అమలులోకి వస్తే అది సర్వే రికార్డులలో తీసుకువచ్చే మార్పులను మనం గుర్తించాల్సి ఉంటుంది. ప్రస్తుతం అమలులో ఉన్న బొంబాయి లాండ్ రెవిన్యూ నిబంధనావళిలోని చాప్టర్ 1, సెక్షన్ 3, క్లాజ్ (6) ప్రకారం;

"సర్వే నెంబరు" అనేది సంబంధిత గ్రామనగరపట్టణ సర్వేరికార్డులలో, గుర్తించడానికి వీలైన ప్రత్యేక సూచిక సంఖ్య కింద నమోదైవుండే ఓ భూభాగం. ఆనంబరులో దానికి సంబందించిన విస్తీర్ణం, తదితర వివరాలు లిఖించివుంటై. ఆ సర్వే నంబరులో గుర్తించబడిన వాటా కూడా అందులో పొందు పర్చబడిఉంటుంది. "సర్వే నెంబరులో గుర్తించబడినవాటా" అంటే ప్రత్యేకంగా మదింపుచేయబడి రిజిష్టరు చేయబడిన ఆ సర్వే నంబరు ఉప విభాగం

అని అర్థం.

ఏక వ్యక్తి వారసత్వ నిబంధనను అమలులోకి తెచ్చిన తరువాత, సర్వేనెంబరు అనేది ఆర్థికంగా లాభదాయకమైన కమతం ఎంత పరిమాణంలో ఉండాలని నిర్ణయించబడుతుందో, అంతే భూభాగానికి సంబంధించినదై ఉంటుంది. ఆ సర్వే నెంబరులో గల ఏ ఉపభాగాన్ని ప్రత్యేకంగా రిజిష్టరు చేయడానికి తిరస్కరించాల్సిన అవసరం కూడా ఏర్పడుతుంది. అంటే ఏదైనా ఒక భూభాగం ప్రత్యేక సర్వే నెంబరుతో ప్రత్యేకంగా రిజిస్టరు చేయబడాలి అంటే అది లాభదాయకంగా ఉండే కమతానికన్నా తక్కువ విస్తీర్ణం కలిగినదై ఉండి ఉండకూడదు. అంతే కాకుండా లాభదాయకంగా ఉండే కమతానికి ఇచ్చే సర్వే నెంబరు కూడా ఒక వ్యక్తి పేరు మీదనే రిజిష్టరు చేయాలి. బరోడా కమిటీ నివేదికను అమలుచేస్తే ఖచ్చితంగా ఇదే జరుగుతుంది. దీనికి ప్రత్యామ్నాయంగా శ్రీ కేటింగ్ మరో ప్రతివాదన చేశారు. అతిపెద్ద సుసంఘటిత కమతానికింతటికీ ఒక సర్వేనెంబరును ఒక వ్యక్తి పేరు మీద వచ్చేపద్ధతిని కాకుండా, ఒక భూభాగం యూనిట్‌లో ఉండే చెదురుమదురు, చిన్నభూభాగాలకు విడి సర్వేనెంబర్లను ఇవ్వాలని ఆయన ప్రతిపాదించారు. ఆచరణలో ఆ ప్రతిపాదనవల్ల ఎటువంటి ప్రయోజనం లేదు. అందువల్ల దానిని పూర్తిగా తోసి పుచ్చవచ్చు. ఇకపోతే, ఏకవ్యక్తి వారసత్వనిబంధనవల్ల జరిగేదేమిటంటే, నిర్ణీతపరిమాణం కన్నా తక్కువ పరిమాణంలో ఉండే భూములను అది చట్టపరంగా గుర్తించ నిరాకరిస్తుంది. చిన్న చిన్న కమతాలను ఇలా చట్టపరంగా గుర్తించడానికి నిరాకరించడం వల్ల సంఘటిత కమతాలు ముక్కలు చెక్కలు కావడాన్ని అది నిరోధిస్తుందని చెపుతున్నారు. కమతాల విభజన అనేది అనేక కారణాల వల్ల జరగవచ్చు. అలా ముక్కలుగా విభజించబడటం లాభదాయకమా లేక నష్టదాయకమా అనేది పరిస్థితుల స్వభావం పై ఆధారపడిఉంటుంది. శ్రీ కేటింగ్ కూడదన్నట్లుగా ఎట్టి పరిస్థితులలోనూ భూమి విభజనను అనుమతించక పోవడమన్నది భూమి విలువ తరుగుదలకు దారితీస్తుంది. దుక్కిటెద్దు, ఇతరవ్యవసాయోప పరికరాలు తగ్గిపోయి విభజన అవసరమైనప్పుడుకూడా దానిని అనుమతించకపోయినట్లయితే, అది ఆర్థికంగా నష్టదాయకమైన పరిస్థితులను సృష్టిస్తుంది. అంటే ఏ లక్ష్యాన్ని సాధించడానికైతే దీనిని ఉద్దేశించారో ఖచ్చితంగా దానికి వ్యతిరేకమైన ఫలితాలకు దారితీస్తుంది. ఇంతేగాక ఆర్థిక పరిస్థితుల వత్తిడి మూలంగా భూమి విభజన అవసరమైనప్పుడు, చట్టపరంగా భూమి విభజనను నిరోధించినంత మాత్రాన అది వాస్తవంలో భూమివిభజనను నిరోధించినట్లవదు. అరాకొరాగా లభ్యమయ్యే వ్యవసాయ పనిముట్లు, భూమిపై ఉన్న జనాభా వత్తిడి అన్న అరిష్టాలు ఉన్నకారణంచేత – కమతాల ఏకీకరణ, విస్తరణను ప్రతిపాదిస్తున్నవారు ఈ అరిష్టాలపట్ల ఎటువంటి శ్రద్ధ చూపలేదు అనే మాట అటుంచి, – కమతాల విభజన అనివార్యంగా కనిపిస్తుంది. ఇట్టి పరిస్థితిలో కూడా మనం ప్రత్యేక సర్వే నెంబరుగా రిజిస్టరు చేయబడటానికి కావల్సిన పరిమాణం ఉన్నా తక్కువ పరిమాణం కల భూములను సర్వే రికార్డులతో నమోదు చేసుకోకూడదని చట్టం చేసినట్లయితే అది మన వ్యవసాయ

రుగ్మతలకు చికిత్స చేయకపోగా, వాస్తవ పరిస్థితులకు భిన్నమైన తప్పుడు రికార్డు రిజిస్టరును సృష్టించడానికి దోహదకారి అవుతుంది. కమతాల విభజనను, చీలికలను నిరోధించడానికి సూచించిన మార్గాలపై ఇదీ మన విమర్శ. ఇక ఇప్పుడు కమతాల ఏకీకరణకు సంబంధించి మన దృక్పథం ఏమిటో కూడా మనం చెప్పగలగాలి. ఏకీకరణ, పరిరక్షణ అనేవి ఒకదానితో మరొకటి విడదీయలేనంతగా ముడిపడిన అంశాలు. అందులో ఒక దానిని విస్మరించి మరొకదానిగురించి ఆలోచించలేము. ఏకీకరణ జరిపిన ఓ కమతాన్ని మనం పరిరక్షించుకోలేకపోతే, ఏకీకరణ సాధ్యమైనంత మాత్రాన ఓ కమతాన్ని ఏకీకరణ చేయటం సబబా? మన సామాజిక ఆర్థిక వ్యవస్థలో గట్టి మార్పులు చేయకపోతే ఈ ఏకీకరణ కార్యక్రమాన్ని మనం మళ్లీ మొదలెత్తుకోవలిసివచ్చి పూర్వం సిసిఫస్ పడ్డ శ్రమలాంటిదే మన వంతు అవుతుంది. గ్రీకు పురాణాల్లో మోసగాడైన సిసిఫస్ రాజును నరకంలో దేవుళ్లు ప్రతి దినమూ బండరాయి నొకదానిని కొండవీదికి తోసుకువెళ్లే శిక్షవిధించారు. తీరా పైకి తోసుకు వెళ్లింతర్వాత అది కింది కొండకిందికి జారి పడుతుండేది. అందుచేత అతడు మర్నాడు అదేపనిని మళ్లీ ప్రారంభించవలసివచ్చేది. అంతులేని శ్రమకు సిసిఫస్‌ను సంకేతంగా భావించవచ్చు.

కమతాల ఏకీకరణ, విస్తరణ వల్ల ఒనగూరే ప్రయోజనాలకన్నా, ఏకీకరణద్వారా పనిలేని, మిగులు శ్రామికులు మరింతగా ఎక్కువైనందువల్ల కలిగే నష్టం అధికంకాబట్టే, ప్రొఫెసర్ గిల్‌బర్ట్ స్లేటర్ ఈ ప్రతిపాదనలకు సుముఖంగాలేరు.

ప్రొఫెసర్ స్లేటర్ అభిప్రాయానికి భిన్నంగా, మేము, ఈ అరిష్టాలు తొలగించగలిగినవేనని భావిస్తున్నాం. ఈ అరిష్టాలను తొలగించాలన్న ఆత్రుత మాకు ఉండడం వల్లనే కమతాల విస్తరణకు మేము భిన్నమైన మార్గాలను ప్రతి

26. "దివిలేజ్ ఇన్ ది మెల్టింగ్ పాట్" జర్నల్ ఆఫ్ ది ఇండియన్ ఎకనమిక్ సొసైటీ, వాల్యూమ్ 1, నెం. 1, పే.10.

27. వ్యవసాయంలోని మిగులు జనాభాలను పట్టణాలకు తరలించాలని ప్రొఫెసర్ జేవాన్స్ చెపుతున్నారు. మిగులు జనాభా అనే అరిష్టం ఉందని ప్రొఫెసర్ జేవాన్స్ గుర్తించి నందుకు నేను సంతోషిస్తున్నాను. అయితే మన వ్యవసాయాన్ని ప్రభావితంచేస్తున్న రుగ్మతలన్నిటికీ మాతృక ఈ మిగులు జనాభాయే అన్న విషయాన్ని మాత్రం జేవాన్స్ గుర్తించలేకపోయారు. తన విజ్ఞానాన్ని, తన పలుకుబడినంతటినీ ఉపయోగించి భారతదేశంలో పారిశ్రామికీకరణకు వ్యతిరేకంగా వాదించే ప్రొఫెసర్ జేవాన్స్, మిగులు జనాభాను పట్టణాలకు తరలించాలనడం కాస్త ఆశ్చర్యకరంగానే ఉంది; ఎందుకంటే, పట్టణాలకు వలసపోవడమనేది భారతదేశ పారిశ్రామికీకరణతో ముడిపడి ఉన్న అంశం మరోవిషయమేమిటంటే భారతదేశంలో పట్టణాలు బహుతక్కువగా ఉన్నాయనే విషయాన్ని ప్రొఫెసర్ జేవాన్స్ మరిచారు. ప్రొఫసర్ జేవాన్స్ మాదిరిగానే మనం కూడా వ్యవసాయంలో మిగులు జనాభా ఉందని విశ్వసించేటట్లయితే మనకెంత అయిష్టంగా కనిపించినప్పటికీ, పట్టణాల ఏర్పాటుకు ప్రయత్నించాలనే నిర్ణయానికి రాక తప్పదు. పట్టణాలు రూపొందించడమంటే, పారిశ్రామికీకరణే.

పొదించాలనుకుంటున్నాం. కాబట్టే, మనకృషి అంతా ఈ పనిలేని వృధా శ్రామికులు అన్న అరిష్టాన్ని తొలగించడం పైనే ప్రధానంగా కేంద్రీకరించాలని మేం చెపుతున్నాం.[27]

వ్యవసాయేతర ఉత్పత్తి కార్యక్రమాలలోకి ఈ పనిలేని వృధా శ్రామికులను కనుక మనం తీసుకువచ్చినట్లయితే, ఒకేసారి రెండు ప్రయోజనాలను సాధించగలుగుతాం. ప్రస్తుతం భారతదేశంలో భూమిపై ఉన్న వత్తిడిని తగ్గించగలుగుతాము; భూమిని అత్యంత విలువైనదిగా పరిగణించే దృష్టిని అరికట్టగలుగుతాము. ఈ ప్రయోజనాలే కాక మరొకటేమిటంటే, ఉత్పాదకమైన పనిలో శ్రామికులు నిమగ్నమైనప్పుడు నేటివలే వారు ఇతరులను దోచుకుతినటం మానివేస్తారు. తమ మనుగడ కోసం తమకుతాము సంపాదించకోవడమే కాకుండా, సమాజానికి కూడా మిగులును అందిస్తారు. మిగులు ఎక్కువైన కొద్దీ పెట్టుబడి పెరిగివస్తేకదా. ఈ మాటకాస్తవింతగా కనిపించిప్పటికీ, క్లుప్తంగా చెప్పాలంటే, పారిశ్రామికీకరణ అనేది భారతదేశ వ్యవసాయసమస్యలకు అన్నిటికన్నా ఉత్తమ పరిష్కారం. పారిశ్రామికీకరణ భూమిపై వత్తిడిని తగ్గిస్తుంది; పెట్టుబడిపరిమాణాన్ని. ఉత్పాదకవస్తువుల మొత్తాన్ని పెంచుతుంది. ఇవన్నీ కలిసి కమతాల విస్తరణ అనేది ఆర్థికపరంగా అవసరమయ్యే పరిస్థితిని సృష్టిస్తాయి. అంతేకాదు, భూమిని అమిత విలువైనదిగా పరిగణించే ధోరణిని అరికట్టడం ద్వారా పారిశ్రామికీకరణ భూమి విభజన చీలికల అవసరాన్ని కూడా చాలావరకు తగ్గించివేస్తుంది. పారిశ్రామికీకరణ అనేది మన వ్యవసాయ సమస్యలకు సహజమైన, శక్తివంతమైన పరిష్కారమార్గం. ఇంతకునుపు పేర్కొన్న అనాలోచిత పరిష్కార పథకాలకన్నా ఇదే ఎంచుకోతగింది. కమతాల విభజనను నిరోధిస్తూ చట్టం చేయడంద్వారా బూటకపు గిట్టుబాటు కమతాలు దక్కవచ్చునేమోకాని, అదే సమయంలో తత్పర్యవసానంగా అనేక సామాజిక రుగ్మతలను తలకెత్తుకుంటాం. కాని అదే పారిశ్రామికీకరణ ద్వారా అయితే, పూర్తి లాభదాయకమైన అంశంగా పెద్ద గిట్టుబాటు కమతాలు వాటంతట అవే మనకు సిద్ధిస్తాయి.

కమతాల విస్తరణ ఏకీకరణ, ఏకీకృతమైన భూకమతాల పరిరక్షణకు సంబంధించి మనం సూచించేమార్గం ఈ విధంగా ఉంటుంది. పారిశ్రామికీకరణ ప్రతి క్రియా ప్రభావాల ద్వారానే మన వ్యవసాయ రుగ్మతలను నయంచేసేందుకు అధిక ప్రాధాన్యమిస్తాం. కానీ మేము సూచించే ఈ చికిత్స సాధ్యముకానిదని అనబోతామోననే ఉద్దేశంతో, మా దృష్టిని సమర్ధించే సాక్ష్యాధారాన్ని కూడా ఇవ్వబూనుకున్నాం. పారిశ్రామికీకరణ ప్రతి క్రియా ప్రభావాల ద్వారా వ్యవసాయం ఎలా మెరుగవుతుందో 1883లో అమెరికాలు అధ్యయనం చేశారు. లండన్ టైమ్స్ ప్రచురించిన ఆ అధ్యయన సంగ్రహపాఠాన్ని విస్తృతంగా ఇక్కడ ఉదహరిస్తున్నాం.

"ఇతరపరిశ్రమలతో వ్యవసాయానికి గల నిష్పత్తి ఏ స్థాయిలో అయితే పెరుగుతోందో ఖచ్చితంగా అదేస్థాయిలో భూముల విలువ తరుగుతోందని అమెరికా సంయుక్త రాష్ట్రాల

వ్యవసాయ శాఖలకు చెందిన గణాంకాధికారి ఒకరు ఇటీవల ప్రచురించిన ఒక నివేదికలో రుజువు చేశారు. మొత్తం జనాభాలో సగం మంది మాత్రమే వ్యవసాయ శ్రామికులుగా ఉన్న చోటకన్నా, మొత్తం జనాభా తమ శ్రమనంతటినీ వ్యవసాయానికి కేటాయిస్తున్న చోట భూమి విలువ తక్కువగా ఉంది. మొత్తం జనాభాలో నాలుగవవంతు మాత్రమే వ్యవసాయంలో నిమగ్నమై ఉన్నచోట వారిభూముల విలువ మరింత ఎక్కువగా ఉంది. వాస్తవానికి ఈ గణాంక వివరాలద్వారా వైవిధ్యమున్న వివిధరకాల, పరిశ్రమలు దేశానికి ఎంతో ఉపయోగకరమని, పొలానికి సమీపంలో కర్మాగారం ఉండడటం వల్ల ఆ పొలం, దాని నుండి వచ్చే పంటవిలువను పెంచుతుందని రుజువు చేయడం జరిగింది. మొత్తం జనాభాలో వ్యవసాయ జనాభా నిష్పత్తిని బట్టి అమెరికా సంయుక్త రాష్ట్రాలను నాలుగు తరగతులుగా లేదా నాలుగు విభాగాలుగా చేస్తే వ్యవసాయ జనాభాకు భూమివిలువ అనేది విలోమనుపాతంలో ఉంటుందని రుజువు చేయడంకూడా జరిగింది. మొత్తం జనాభాలో 30 శాతం కంటే తక్కువ జనాభా వ్యవసాయదారులుగా, వ్యవసాయ శ్రామికులుగా ఉన్న రాష్ట్రాలను మొదటి తరగతిగాను, 30 నుండి 50 శాతం వరకూ వ్యవసాయంపై ఆధారపడిన జనాభా ఉన్న రాష్ట్రాలను రెండవ తరగతిగాను, 50 నుండి 70 శాతం వరకూ వ్యవసాయంపై ఆధారపడిన జనాభా ఉన్న రాష్ట్రాలను మూడవ తరగతిగాను, 70 శాతం పైబడి వ్యవసాయం పై ఆధారపడిన జనాభా ఉన్న రాష్ట్రాలను మొదటి తరగతిగాను విభజించినప్పుడు మొదటి తరగతి రాష్ట్రాలలో భూమి విలువ ఎకరాకు 5.28 డాలర్లు మాత్రమే ఉంది రెండవ తరగతి రాష్ట్రాలలో భూమి విలువ ఎకరాకు 13.03 డాలర్లు, మూడవ తరగతి రాష్ట్రాలో 22.21 డాలర్లు, పారిశ్రామిక జిల్లాలు ఉన్న ప్రాంతంలో 40 91 డాలర్లు ఉంది. వ్యవసాయం, పరిశ్రమలు ఉన్న మిశ్రమ జిల్లాలు బాగా లాభదాయకమని ఈ వివరాలు తెలియచేస్తున్నాయి. అటువంటి ప్రాంతాలలో భూమివిలువ ఎక్కువగా ఉండటమే కాక, ఎకరా ఉత్పత్తి కూడా అధికంగాను, వ్యవసాయ శ్రామికులకు చెల్లించే వేతనాలు అత్యధికంగాను ఉన్నాయి. పారిశ్రామికోత్పత్తులు, వైవిధ్యమున్నా వివిధ పరిశ్రమలు ఉత్పత్తి దార్లులకు ఎంతగా ప్రయోజనకరంగా ఉంటున్నాయో, వ్యవసాయదారులకు కూడా అంతే ప్రయోజనాన్ని చేకూర్చి పెడుతున్నాయి "

మన వ్యవసాయ రుగ్మతలకు మేం చెప్పిన నివారణ తిరుగులేనిదని పైవాక్యాలు రుజువు చేస్తున్నాయి. అందువల్ల పారిశ్రామికీకరణ అనేది కమతాల విస్తరణను ప్రోత్సహించి, కమతాల విభజనను చీలికలను సమర్థవంతంగా నిరోధించగలదని ఎటువంటి భయసందేహాలు లేకుండా చెప్పవచ్చు. ఈ మాటను అంగీకరిస్తూనే, భూముల ఏకీకరణకు ప్రత్యక్ష పారిశ్రామికీకరణ ఒక్కటే చాలకపోవచ్చు, అనే మాట కూడా అంగీకరించాలి. కమతాల ఏకీకరణకు నివారణోపాయాలు (డైరెక్ట్ రెమెడీస్) అవసరమన్నది నిజమేకావచ్చు. అయితే పారిశ్రామికీకకరణ కమతాల ఏకీకరణను నేరుగా సాధించలేక పోయినప్పటికీ, అది ఏకీకరణకు దోహదం చేస్తుందన్నది కూడా నిజమే. ఎంత సముచితమైన సూత్రాల ఆధారంగా కమతాల ఏకీకరణకు ప్రయత్నించినప్పటికీ భూమిని అతివిలువైనదిగా

గురిగణించినంతకాలం అది అంత సులభంకాదు అనేది తిరుగులేని సత్యం. కమతాల ఏకీకరణకు భూమిని అతివిలువైనదిగా పరిగణించడాన్ని తొలగించడం తప్పనిసరి. పారిశ్రామికీకరణ దానిని బాగా తగ్గించగలుగుతుంది. అదేమన్నా తక్కువ సేవా? కానేకాదు. కమతాల ఏకీకరణకు సంబంధించిన మరొక అంశాన్ని పరిగణనలోకి తీసుకున్నా అదికూడా ఇదే అభిప్రాయానికి వచ్చేటట్లు చేస్తుంది. ఆ అంశమేమంటే ఏకీకరణకు ముందు పారిశ్రామికీకరణ జరగాలి. ఏకీకరణచెందిన కమతాలు భవిష్యత్తులో మరెన్నడూ ముక్కలు, చెక్కలు కాకుండా వుండేటట్లుగా పటిష్ఠమైన అడ్డుగోడనిర్మించకుండా ఏకీకరణకు ప్రణాళికలు రూపొందించడం వృధాఅనే విషయాన్ని మనమెప్పుడు మరువకూడదు. అటువంటి పటిష్ఠమైన అడ్డుగోడ పారిశ్రామికీకరణ ద్వారానే మనకు లభిస్తుంది. ఎందుకంటే, భూమివిభజనకు కారణమైన విపరీతమైన వత్తిడిని పారిశ్రామికీకరణ మాత్రమే తగ్గించగలుగుతుంది. మనవ్యవసాయాన్ని పట్టిపీడిస్తున్న రుగ్మతలు కమతాలు చిన్నవైవుండడం, అవికూడా చెదురుమదురుగా పడివుండడం అనేదే నిజమైతే, వాటికి చికిత్సచేయడానికి పారిశ్రామికీకరణే మార్గమనేది నిర్వివాదం.

కాని పారిశ్రామిక దేశం జాబితాలో భారతదేశం స్థానం ఏమిటి?

| | ఇంగ్లండ్ | | జర్మనీ | | అమెరికా | | ఫ్రాన్స్ | | ఇండియా | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పట్టణ ప్రాంతం | గ్రామీణ ప్రాంతం | పట్టణ ప్రాంతం | గ్రామీణ ప్రాంతం | పట్టణ ప్రాంతం | గ్రామీణ ప్రాంతం | పట్టణ ప్రాంతం | గ్రామీణ ప్రాంతం | పట్టణ ప్రాంతం | గ్రామీణ ప్రాంతం |
| 1790 | .. | .. | ... | ... | 87.5 | .. | .. | .. | .. | .. |
| 1840 | .. | .. | . | .. | 77.5 | .. | 75.6 | 24 4 | .. | .. |
| 1851 | 49.92 | 50.08 | .. | .. | .. | .. | .. | .. | .. | .. |
| 1871 | 38.20 | 61.80 | .. | 36 | 47.6 | .. | .. | .. | .. | .. |
| 1881 | 32.1 | 67.9 | .. | 41 | 44.3 | 29.5 | . | .. | .. | .. |
| 1891 | 27.95 | 72.05 | .. | 47 | 39.2 | 36.1 | .. | .. | 64.4 | .. |
| 1901 | 23.00 | 77.00 | .. | 54 | 35.7 | 40.5 | .. | . | 67.5 | .. |
| 1911 | 19.9 | 78.1 | .. | .. | 33.3 | 46.6 | 57 9 | 42 1 | 71.5 | .. |

వివిధ దేశాలకు సంబంధించిన లెక్కలు ఆ సంవత్సరాలకు సంబంధించి లేవు. తేడా ఇంచుమించు మూడు సంవత్సరాలు ఉంటుంది.

28. ఎస్సేస్ ఇన్ ఫైనాన్స్. సెకండ్‌సిరీస్. పే.240

29. బొంబాయిలో 1915, డిసెంబర్‌లో జరిగిన భారత పారిశ్రామిక మహాసభలో 'కాపిటలిస్టిక్ డెవలప్‌మెంట్ ఆఫ్ అగ్రికల్చర్' అనే తన పత్రాన్ని చదువుతూ ప్రొఫెసర్ జేవాన్స్ పారిశ్రామికీకరణకు వ్యతిరేకంగా వాదించారు. అయితే జేవాన్స్ అభిప్రాయానికి భిన్నంగా, పారిశ్రామికీకరణ మాత్రమే పెట్టుబడిదారీ తరహా వ్యవసాయాన్ని సాధించగలదని చెప్పుకోవచ్చు. జేవాన్స్ పత్రంలోని లోపాలను తెలుసుకుని సరిదిద్దు కోవడానికి 'ఎస్సేస్ ఇన్ ఫైనాన్స్ ఫస్ట్ సిరీస్ పేరుతో సర్ రాబర్ట్ గిఫ్ఫెన్ రాసిన IV వ్యాసం ఉపయోగ పడుతుంది

వివిధ దేశాల ఆర్థిక వ్యవస్థల ధోరణులను సర్వేచేసిన తరువాత సర్ రాబర్ట్ గిఫెన్ ఈవిధంగా అన్నారు;

" మనుషులకు లభ్యమయ్యే వసరులతో బాటే వారి అవసరాలు కూడా పెరుగుతై. అప్పుడు వ్యవసాయం, గనుల తవ్వకం వంటి కార్యక్రమాలలో పాల్గొనే జనాభా నిష్పత్తి తరుగుదల దిశగా ఉంటుంది. మరోవంక పరిశ్రమలు లేదా విస్తృతార్థంలో చెప్పాలంటే వస్తూత్పత్తి కార్యక్రమాలలో పాల్గొనే జనాభా నిష్పత్తి పెరుగుతూ వస్తుంది "[28]

సార్వజనీన ధోరణికి అద్దం పడుతూ ఒక నిపుణుడు చెప్పిన ఈ సూత్రానికి విరుద్ధంగా ఉన్నాయి భారతదేశపు లెక్కలు. అమెరికా సంయుక్త రాష్ట్రాలు వంటి ఇతర దేశాలు, వ్యవసాయక దేశాలుగా పురోగమిస్తుంటే భారతదేశంలో మాత్రం నగరీకరణ దిశగా కాకుండా ప్రజలు సమస్తమైన గ్రామావసరాలను మించిన సంఖ్యలో గ్రామవ్యవస్థను ఆశ్రయించి గ్రామీణ జనాభాను పెంచేస్తున్నారు. ఈ వెధు ధోరణిని ఎంత త్వరగా అరికడితే అంతమంచిది. తమ స్వప్రయోజనాలను దృష్టి నిడుకొన్న ఇతరులు ఈ విషయమై నప్పటికీ ఈ సందర్భంగా మన జాతీయ ఆర్థిక వ్యవస్థను గురించి సర్ హెన్రీ కాటన్ చేసిన హెచ్చరిక అత్యంత హితకరమైనది, సత్యమైనదిగా గ్రహించవచ్చు. ఆయన అన్నమాటలివి: "భారతదేశంలో, కూడనంత విపరీత స్థాయిలో వ్యవసాయం జరుగుతున్న ప్రమాదమున్నది."

అనువాదం : బొజ్జాతారకం,
పి. అంబేడ్కర్

# 12

# రసెల్ – సమాజ పునర్నిర్మాణం

మాననీయ బెర్ట్రండ్ రసెల్ రచించిన
"ది ప్రిన్సిపుల్స్ ఆఫ్ సోషల్ రీకన్‌స్ట్రక్షన్"
పుస్తకంపై సమీక్ష

# రసెల్ – సమాజ పునర్నిర్మాణం

ఆనరబుల్ బెర్ట్రాండ్ రసెల్ రాసిన "సామాజిక పునర్నిర్మాణ సూత్రాలు"[1] పుస్తకం ఒక యుద్ధ పుస్తకం. పోట్లాటకు సంబంధించిన సాహిత్యం మొత్తం మీద ప్రచార సాధనంగానో నిరోధకంగానో ఉంటుంది. రసెల్ పుస్తకం రెండో వర్గానికి చెందినదే అయినా ఆ రకంలో వచ్చిన పుస్తకాలు అన్నింటికన్నా భిన్నమైనది. నైపుణ్యం గల విజేతలు కొన్ని దేశాలకు వాటి ఇష్టానికి వ్యతిరేకంగా అసహజమైన భౌగోళిక అడ్డంకుల మధ్య బంధించి ఉంచారు. నిరోధక పుస్తకాలు కొన్ని వాటికి వ్యతిరేకంగా వాదన లేవదీస్తాయి ఏంగెల్ రాసిన గ్రేట్ ఇల్యూషన్ లాంటి పుస్తకాలు యుద్ధ గణితంలో విజేతకు కూడా లాభంకంటే నష్టమే ఎక్కువ ఉంటుందని చూపటానికి ప్రయత్నిస్తాయి. రసెల్ విశ్లేషణ మాత్రం పూర్తిగా భిన్నమైనది. పైన తెలిపినటువంటి హేతువాద విజ్ఞాపనలతో యుద్ధాలను పోగొట్ట లేమని ఆయన విశ్వసిస్తారు. "హేతువు ద్వారా మాత్రమే" యుద్ధాలను నివారించలేము" అని ఆయన అంటారు, యుద్ధానికి దారితీసే ప్రేరణలు, ఆవేశాలకు విరుద్ధమైన నిర్మాణాత్మకమైన జీవనంద్వారా మాత్రమే యుద్ధాలను నివారించగలం జ్ఞాపకముండే భావనాత్మకమైన జీవితాన్నే కాకుండా ఆవేశ జీవితాన్ని కూడా మార్చవలసి ఉంది "[2]అని ఆయన అంటారు. ఆయన విశ్లేషణ ఎంత వైవిధ్యంగా ఉంటుందో ఆయన సాంఘిక తత్వంకూడా అంతే. ఆ "యుద్ధం ద్వారా మనం ముఖ్యంగా నేర్చుకోవలసిందని ఆయన ఏమంటాడంటే" మానవ క్రియాజనితాలు ఏమయి ఉంటాయి న్యాయంగా అవిఏమి కావాలని మనం ఆశిస్తాము". దానిపై ఒక స్పష్టమైన భావనకలిగి ఉండాలి. ఈ దృక్పథమే కనుక యదార్థమైనది అయితే, సాంప్రదాయకమైన ఉదారవాద తత్వం కనబరిచిన దానికంటె ఎక్కువ సమర్థవంతంగా నిటారుగా నిలబడగలిగే రాజకీయ తాత్విక వేదికను అది కలుగజేస్తుంది.

---

1. జార్జ్ ఎలెన్ అండ్ అన్విన్ లిమిటెడ్ 1917, 6 నెట్
2 ప్రిన్సిపుల్స్ ఆఫ్ సోషల్ రికన్‌స్ట్రక్షన్ - పేజి -13

ఈ దృక్పథానికి అనుగుణంగా ఆయన ప్రవర్తనకు సంబంధించిన మానసికో శాస్త్ర విధానాన్ని అవలంబిస్తాడు. మానసిక శాస్త్రంలో వచ్చిన ఈ కొత్త అభివృద్ధి అందించిన ముఖ్యాంశం ఏమంటే మానవ ప్రియోజనితాలు అనే కొత్త దృక్పథం వెలువడటం. మానవచర్యలకు బాహ్యపరిస్థితులే కారణం అనే సిద్ధాంతాన్ని ఇది త్రోసి పుచ్చింది. ప్రవర్తన ప్రధానం అని నమ్మే వ్యక్తి[4] ఏమంటాడంటే, ఆ సిద్ధాంతమే గనుక నిజమయితే, ఒక ...తపరుడైన మనిషిని మనం ఊహించవలసి వస్తుంది. భౌతికంగా అది అసత్యం. మనిషిలో ...ియోజనితాలు అంతర్భాగమై ఉంటాయి అని అది ప్రభోదిస్తుంది. ఎందుకంటే ఏదోపని చెయ్యాలనే ధోరణితోనే అతను పుట్టాడు. బాహ్య పరిస్థితులు కార్యాన్ని ప్రేరేపించవు అవి దారిని మళ్లిస్తాయి అంతే పని చెయ్యాలనే ఈ ధోరణులు, పని చేస్తూ ఉన్నపుడు, అవి పనిచేస్తున్న సామాజిక పరిస్థితుల ప్రభావం వల్ల మార్పు చెందుతూ ఉంటాయని ప్రవర్తన ప్రధానమని విశ్వసించేవారు అంటారు. మూల విధానాలలో వచ్చిన ఈ మార్పులే అత్యంత ప్రధానమైనట్టివి. ఇదే విద్య అని మనం అనుకోవచ్చు. అలా అని, అన్ని మార్పులూ అంతే ప్రధానమైనవి అని అనుకోవటానికి వీల్లేదు – సంస్కర్త పని ఏమిటంటే, సమాజంపై చెడు ప్రభావాన్ని కలుగజేసే ధోరణులు పుట్టించే పరిస్థితులను, సంస్థలను తొలగించి సమాజానికి మేలు కలిగించే ధోరణులకు దోహదం చేసే వాటిని భద్రపరుచుకొని ప్రవేశపెట్టాలి. ఏది ఏమయినప్పటికీ, ఈ ధోరణులు నిర్దిష్టంకాని అనేక మార్పులు తీసుకురాగలవు కాబట్టి, ఇవి సమాజానికి ఎంతో ఉపయోగకరమైనవి. "మనిషి ఆవేశాలు" అతని సహజ స్వభావాలను బట్టి మొదటి నుంచీ స్థిరంగా ఉండవు. కొన్ని పరిమితులకు లోబడి, అతని పరిస్థితులు, అతని జీవన విధానాల వల్ల విస్తృతంగా మార్పులు చెందుతూ ఉంటాయి. ఈ మార్పుల స్వభావాన్ని పరిశీలించవలసి ఉంటుంది. రాజకీయ సాంఘిక సంస్థలు కలుగుజేసిన మంచి చెడులను బేరీజు వేసుకొనేటపుడు ఈ పరిశీలన ఫలితాలను లెక్కలోకి తీసుకోవలసి ఉంటుంది.[5] కాబట్టే ఇది సాధ్యమని రసెల్ అంటారు.

రాజ్యం, యుద్ధం, ఆస్తి, విద్య, వివాహం, మతం వ్యవస్థల క్రింద మానవ స్వభావం చెందిన మార్పులను పరిశీలిస్తూ రసెల్ విజ్ఞానాత్మకమైన అధ్యాయాలను ఆరింటిని రాశారు. ఈ అధ్యాయాలు ఒక్కొక్కదానిలోని అంశాలను సంక్షిప్తం చేయటం ద్వారా రసెల్ సామాజిక తత్వం గురించి తగిన అభిప్రాయాన్ని అందచేయటం అసాధ్యం. అవి ప్రస్తావించే అన్ని అంశాలకు సంబంధించి అవి సజీవ వ్యాఖ్యానాలని చెప్పవచ్చు సూచనలతో నిండి ఉంటాయోమో,, ఆలోచనలు రేకెత్తిస్తాయి, అందుకని అసలు గ్రంథాన్నే చదవాల్సి ఉంటుంది

---

3 అదే పుస్తకం పే - 9

4 Readers of Mr Russell will do well to aquaint themselves with proj - 62 Thorndiker's Educational Psychology Vol-I "On the Original Nature of Man"

5 ప్రిన్స్ పుల్స్ ఆఫ్ సోషల్ రీకన్‌స్ట్రక్షన్ - 19

సమీక్ష వరకూ అయితే ఇది సంప్రదాయానికి విరుద్ధమే, కాని ఈ సమీక్ష ఒక ఆర్థిక పత్రికకు ఉద్దేశించి కాబట్టి, సమంజసమే అనిపిస్తుంది. ఇందుకోసం, ఆస్తివ్యవస్థ విశ్లేషణ, మానవ స్వభావంలో అది ఎటువంటి మార్పులు తెచ్చిందని రసెల్ అభిప్రాయపడ్డారో తెలుసుకుంటే సరిపోతుంది.

అయితే ఈ పనికి ఉపక్రమించే ముందు, అసలు యుద్ధతత్వం అభివృద్ధి సూత్రాలతో ఎటువంటి సంబంధం కలిగి ఉందని రసెల్ చెప్పారో వాటి గురించి చర్చించుకోవటం ఉపయోగకరంగా ఉంటుంది.

అయితే ముందుగా ఒక విషయం చెప్పాల్సి ఉంటుంది. ఆయన పుస్తకం యుద్ధ వ్యతిరేకంగా ఉండేది కాబట్టి శాంతితత్వాన్ని ఆయనలో చదవాలనుకునే వారు మాత్రం ఆయన్ను పూర్తిగా తప్పుగా చదివారనే చెప్పవచ్చు. రసెల్ యుద్ధ నివారణకు ఆత్రుత పడేవాడేకాని, ఆయన స్పష్టంగా అంటూ ఉండేవారు." యుద్ధానికి దారి తీసిన ఆవేశాలు ఎంతో నాశనాన్ని తీసుకువచ్చినప్పటికీ, ఈ ఆవేశాలు ఉన్న జాతికి, అన్ని ఆవేశాలు చచ్చిపోయిన జాతికంటే భవిష్యత్తు ఉంటుంది. ప్రాణానికి ప్రతీక ఆవేశం. అది ఉన్నంతకాలం అది మృత్యువు వాసికంటే ప్రాణంకేసి తిరిగే ఆశే ఎక్కువ ఉంటుంది, ఆవేశాలు లేకపోవటం అంటే మరణమే మరణం నుంచి కొత్త జీవితం ఏదీ ఉద్భవించదు. ఆయన ఇంకా ఏమి అంగీకరిస్తారంటే "దేశాలను యుద్ధానికి నడిపించిన అనేక గొప్ప ఆవేశాలన్నీ ఏ బలమైన, ప్రగతిశీల జీవితానికయినా అవసరమని ఊహ, సాహసం పట్ల అభీష్టం లేకపోతే సమాజం నిలిచిపోతుంది. క్షీణించటం ప్రారంభిస్తుంది. వైరుధ్యం, వినాశనకారి, పశుప్రాయం కాకుండా ఉంటే, మనిషి కార్యకలాపాలను ఉత్తేజపరచటానికి, మృతప్రాయమైన కేవలం సంప్రదాయంగా నిలిచి పోయిన వాటికై జీవత్వం తొణికిసలాడుతున్న వాటి విజయాన్ని సాధించిపెట్టటానికి అది అవసరమవుతుంది. తన ఆదర్శం గెలవాలనే వాంఛ అధిక సంఖ్యాకులుగా ఉన్న ప్రజలతో ఐక్యంగా ఉండాలనే భావన అనే విషయాలు విజ్ఞతగల వ్యక్తి నాశనం చెయ్యాలనుకొనేవి కావు. మృత్యువు, వినాశనం, ద్వేషంకు దారి తీసేవి మాత్రమే – కీడు చేసేవి యుద్ధం ద్వారా ఆవేశాలు బహిర్గతం కాకుండా వాటిని అదుపులో ఉంచుకోవటమే ఉన్న సమస్య".[7]

వీటి అన్నిటి సారాంశం ఏమంటే కదలిక అనేది పెరుగుదలకు నియమం అని నొక్కి చెప్పవలసిన విషయం ఏమంటే రసెల్ యుద్ధ వ్యతిరేకి, కాని శాంతి కాముకుడు కాదు ఎందుకంటే, ఆయన ప్రకారం, కదలిక పెరుగుదలకు దారి తీస్తుంది. శాంతి అనేది మృత్యువుకు మరో పేరు. ప్రొఫెసర్ డివే మాటల్లో చెప్పాలంటే ఆయన "హింసగా బలాన్ని" వ్యతిరేకిస్తాడు, కాని "శక్తిగా బలాన్ని" కోరుకుంటాడు బలాన్ని వ్యతిరేకించే వారు గుర్తుంచుకోవలసిన

6. అదే పుస్తకం, పేజి 21

7. అదే పుస్తకం, పేజి 93

విషయం ఏమంటే, ఏదో ఒక ఆదర్శం, ప్రయోజనం లేకుండా కార్యకలాపాలు అన్నీ ఫలవంతంకాని పిచ్చి వ్యవహారాల్లాగా ఉన్నట్టే, బలం లేకుండా అన్ని భావనలూ శూన్యంగా మిగిలిపోతాయి. అందువల్ల లక్ష్యం, సాధనలు ఒకదాని నొకటి అనుసరిస్తూ ఉంటాయి. లక్ష్యాన్ని బట్టి సాధనను సమర్థిస్తామనే సాధారణలోకోక్తిలో ప్రగాఢమైన సత్యం ఉంది. అయితే దానిని అపార్థం చేసుకోవటం వల్ల వక్రమార్గంలోకి పోయింది. లక్ష్యం సాధనను సమర్థించకపోతే ఇంక ఏది సమర్థిస్తుంది? చిక్కు ఎక్కడ వస్తుందంటే, ఒకసారి ఉపయోగించిన సాధనల పని తీరును మనం తగినంతగా అదుపులో ఉంచలేక పోవటం ఒకసారి ఉపయోగించిన సాధనం మాత్రమే కాకుండా అనేక లక్ష్యాలను విముక్తి చేస్తుంది. ఈ వాస్తవాన్ని చాల తక్కువ గుర్తిస్తారు. ఏమయినప్పటికీ, సాధించాలనే మూర్ఖపు పట్టుదల మనకు ఉండటం వల్ల మనం కోరుకొనే లక్ష్యం ఒక దానికే మనం ప్రాధాన్యత ఇస్తాము. ఈ సాధన విముక్తి కలిగించే అనేక లక్ష్యాలను మనం పట్టించుకోము. అత్యంత ఆచరణాత్మకమైన జీవితావసరాలకోసం మనం ఒకోసారి ఒక లక్ష్యం మీదనే గురిపెట్టుకొని ఉంటాము. ఇది చేస్తున్నపుడు ఇతర లక్ష్యాలను వదులుకోకుండా జాగ్రత్తపడాలి. ఈ విధంగా, ఉన్న సమస్య ఏమంటే దేనినైనా సాధించటానికి మనం బలం 'ఉపయోగించవలసి వచ్చినపుడు – ఉపయోగించి తీరాలి. ఈ క్రమంలో అంతే ప్రాముఖ్యమైన లక్ష్యాలను మాత్రం నాశనం చెయ్యకూడదు. దీనిని ప్రస్తుత యుద్ధానికి అన్వయించినపుడు బల ప్రయోగానికి సమర్థన ఏదీ ఉండదని నేను అనుకుంటున్నాను. వినాశకమైన హింస సమర్థనకు అవసరమవుతుంది. ఈ సమర్థన ప్రపంచానికి నచ్చ చెప్పవలసింది ఏమంటే, యుద్ధంలో పాల్గొన్న ఇరుపక్షాలలో ఏదో ఒకరి లక్ష్యానికి ప్రాధాన్యత ఇచ్చినపుడు దానిని హింస ద్వారా మాత్రమే సాధించగలరనేది, అంటే ప్రపంచ స్థిరత్వానికి అంతగానూ విలువ అయిన ఇతర లక్ష్యాలను త్యజించవలసిన అవసరం లేకుండా లక్ష్యాలను సాధించగలమనేది హింసను ఎల్లప్పుడూ తప్పించుకోవటానికి వీలుపడదని, ప్రతి నిరోధానికి ఉత్తమ మార్గంగా మాత్రమే ప్రతిఘటనారాహిత్యాన్ని అవలంబించాలనే దానిలో కొంత సత్యం ఉండవచ్చు. శక్తులను చాకచక్యంతో అదుపులో ఉంచే బాధ్యత మనందరిపైనా ఉన్నది. సూక్ష్మంగా చెప్పాలంటే, దేనిని సాధించటానికైనా బలాన్ని ఉపయోగించాలి. అయితే దానిని వినాశకరమైన హింసలే కాకుండా నిర్మాణాత్మకమైన శక్తిగా మాత్రమే వినియోగించాలి.

పెరుగుదల సూత్రాలకు సంబంధించి యుద్ధ తత్వ విషయంలో సాగుతున్న ఈ సుదీర్ఘ చర్చను సాగదీసే సందర్భాలు ఎన్నో వాటితో సమర్థించవచ్చు. ప్రస్తుత ఐరోపా యుద్ధం బలం వాదనలోకి లెక్కించ వీలులేని, అర్థ రహితమైన అదుపును ప్రవేశపెట్టి శాంతి సందేశాన్ని, ప్రతిఘటనా రాహిత్యాన్ని ముందుకు తీసుకు వచ్చింది. రసెల్ రాసిన పుస్తకం యుద్ధ వ్యతిరేకిది కావటం, రసెల్‌ని ఆరునెలలు జైల్లో పెట్టటం – సమీక్షలో ఉన్న ఈ పుస్తకం రాసినందుకుగాదు. అహంకారి అయిన శాంతి కాముకుడు అవటం వల్ల – యుద్ధ సంక్షోభానికి తప్పించుకోవాలంటే శాంతియుత జీవితాన్ని గడపాలి అని కొంతమందిలో మిణుకు మంటున్న

సందేహానికి ఇది కొంత బలాన్ని అందించవచ్చు. అందువల్ల బలాన్ని ఎంతవరకు రసెల్ ఖండించాడనే విషయాన్ని తెలుసుకోవటం అవసరమవుతుంది. రసెల్ పట్ల భారతదేశ పాలకులలో ఉన్న పక్షపాతవైఖరి ఈ సమర్ధనకు మరొక పరిస్థితిగా చెప్పవచ్చు. బలతత్వం బదులుగా ప్రాగ్దేశ తత్వం, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే భారతీయతత్వాన్ని ప్రబోధిస్తున్నారనే దానిని మనం గ్రహించగలుగుతాం. అందుకని రసెల్ ప్రవర్తన విషయంలో సరియైన వ్యాఖ్యానాన్ని భారతదేశ పాఠకులకు అందించటం మరీ అవసరమయింది. శాంతియుతమైన జీవితంపట్ల వారికి సహజమైన వాంఛ ఉండటం, ప్రతిఘటనా రాహిత్యం వైపే వారి తత్వం మొగ్గు చూపటం అనేవి రసెల్‌లో కూడా తమ జీవన విధాన సమర్ధనే. దానిని కాపాడుకోవలసిన అవసరం కాకపోయినా – చదవటానికి దోహదం చేస్తాయని నాకు భయం వేస్తున్నది.

భారతీయ జీవన విధానం ఆచరణయోగ్యమైన దృక్పథమేనా? నీషే తన విరక్తి ధోరణిలో క్రైస్తవుడు ఒకడే ఉండేవాడు అతనిని శిలువ వేసేశారు అని క్రైస్తవ మతం గురించి అనేవాడు. అంటే క్రైస్తవ జీవన విధానం అంత ఆచరణ సాధ్యం కాదని చెప్పటం. ఈ వ్యాఖ్యానం, క్రైస్తవ మతం విషయంలో నిజమయినప్పుడు ప్రాగ్దేశ జీవన విధాన విషయంలో కూడా అంతే నిజమవుతుంది. ప్రాంతీయ పరంగా క్రైస్తవ మతం పశ్చిమ దేశాలకు సంబంధించిందే. అయినా మూలం, సారాశం విషయంలో ప్రధానంగా అది ప్రాగ్దేశానికి సంబంధించినదే పైకి చూపిన విధంగా శాంతితత్వాన్ని రసెల్ అంత కర్కశంగా కాకపోయినా దానికి తగ్గట్టుగా ఖండిస్తాడు. సైద్ధాంతికంగా అసాధ్యమై ఉంది, ఈ దేశం ఎన్నో అరిష్టాలగుండా ప్రయాణం చేయవలసి వచ్చినా భారతీయుల తమ జీవన విధానంలో ఇదే ధోరణికి పట్టుకు వ్రేలాడుతుండటం చూస్తే ఎవరికైనా ఆశ్చర్యం వేస్తుంది. అంతేకాదు. భారతీయ జాతీయ వాదపు ప్రస్తుత కాలంలో –దేనికైనా భారతీయం అని సమర్థించుకోవటానికి సరిపోతున్నది. ఈ వైఖరిని ఇంకా ఆమోదించి కొనసాగించేలా ఉన్నారు. తూర్పు పడమర దేశాల వైఖరి మధ్య వ్యత్యాసాన్ని యుద్ధం ముందుకు తీసుకు వచ్చింది. తూర్పు దేశస్థులు స్వార్థ రూపంలో ఒకే ఒక దానికి ప్రాముఖ్యతనిస్తారని చెప్పుకుంటారు – అదేమంటే యుద్ధానికి వినాశనానికి దారితీసే పాశ్చాత్యుల భౌతిక వాదానికి దూరంగా ఉంటామనేది. అంత కఠినమైన వ్యత్యాసాన్ని పాశ్చాత్యుల పట్ల చూపటానికి సమర్ధన ఏమీలేదు. మనమంతా భౌతిక వాదులమనే విషయాన్ని తూర్పు సులువుగా మరిచిపోతుంది. అసలు తూర్పు దేశమే భౌతికవాద యుద్ధం సంబంధించి పడమర దేశాన్ని నిందించాలి. అయితే అది ఎదురు తిరిగి" పని చెయ్యకుండా ఉండటం అంటే మరణం కార్యరూపంలోనే జీవితం ఉన్నది. పని చెయ్యటం మంచిది. అవసరమైతే యుద్ధంలో మాదిరి హింసాత్మకంగా కూడా పని చెయ్యాలి. ఎందుకంటే, మనం పని చేయటం జరిగినప్పుడే మంచి పని చెయ్యగలం అనే ఆశ ఉంటుంది" అని అనవచ్చు. కొంత ఆశ్చర్యం కలగవచ్చు కాని, ఇందుకనే వ్యక్తి అభివృద్ధికి దారితీసే చర్యగా యుద్ధాన్ని రసెల్ చూపిస్తాడు. మరణానికి-వినాశనానికి దారితీస్తుంది కాబట్టే దానిని ఆయన ఖండిస్తాడు. మెత్తని పద్ధతిలో

యుద్ధం జరగటం ఆయన ఆహ్వానిస్తాడు, ఎందుకంటే, "తన శక్తులను ఉపయోగిస్తున్నాననే భావన మరోమాటల్లో తాను పెరుగుతున్నాననే భావన తనకు కలగాలంటే ప్రతి మనిషికి ఏదో ఒక పోటీ అవసరం, ఏదో ఒక అవరోధాన్ని అధిగమించాలి అని అంటాడాయన.

భారతీయ జీవన విధానాన్ని సమర్థించటానికి ఉపయోగిస్తున్న అనేక కారణాలలో ఒక కారణం ఏమంటే, ప్రాచీన దేశాలు అన్నింటిలో భారతదేశం ఒక్కటే జీవించి ఉన్నదనే అభిప్రాయం మీద ముఖ్యంగా ఆధారపడినట్టిది. తరుచు వినపడే వ్యాఖ్యానం ఇది. తేలికగా వారి అభిప్రాయాలను తీసివేయటానికి వీల్లేని పెద్దల నుంచి కూడా ఇదే అభిప్రాయం వస్తుంది. ఈ వ్యాఖ్యానాన్ని రుజువు చెయ్యాలా అవసరం లేదా అనే విషయాన్ని నేనంత పట్టించుకోను. బ్రతికి బట్టకట్టటం అనే వాస్తవమే పరిగణన లోనికి తీసుకోవాలంటే అంతకంటే ముఖ్యమైన విషయం నేనొకటి చెప్తాను. అదేమంటే, బ్రతకటానికి అనేక పద్ధతులున్నాయి. అన్నీ మెచ్చదగినవి కావు. ఉదాహరణకు సమయం వచ్చినపుడు పలాయన వాదం చిత్తగిస్తే, బలహీనులైన ప్రజలు కూడా బ్రతికిపోతారు. ప్రజలు బ్రతకటానికి పరిస్థితిని తట్టుకొని నిలబడగలిగే శక్తి ఎలా పనికి వస్తుందో ఒకోసారి పాదాక్రాంతమై లేదా అణిగిపడి ఉండే స్థితి కూడా అంతే ఉపయోగపడుతుంది. ఫలితంగా, యుగాల నుంచీ ప్రజలు జీవిస్తూ వస్తూ ఉన్నారు కాబట్టి యుగాలనుంచీ వారు పెరుగుతూ అభివృద్ధి చెందుతూ వస్తున్నారని అందరూ అనుకున్నట్టుగా చెప్పటానికి వీల్లేదు. అందువల్ల, ఉట్టి జీవించటం కాదు, ఎంత యోగ్యంగా జీవిస్తున్నారనేది ఏ స్థాయిలో జీవిస్తున్నారనేది ముఖ్యం.

భారతదేశం లోని రసెల్ పాఠకులు, వారు ఊరికే బ్రతికి ఉన్నామని సంతృప్తి పడకుండా ఎంత యోగ్యంగా జీవిస్తున్నారో పరిశీలించుకుంటే, తమ జీవన విలువలను మరొకసారి బేరీజు వేసుకోవలసిన అవసరం వారికి వస్తుందనే నమ్మకం నాకు ఉన్నది.

యుద్ధ తత్వం గురించి రసెల్‌కు ఉన్న దృక్పథం గురించి ఇంత చెప్పుకున్నాం. ఆస్తి ఫలితాలకు సంబంధించి ఆయన విశ్లేషణ ఏమిటో చూద్దాం. సమాజంలో ఉన్న ఆర్థిక వ్యవస్థలను విశ్లేషిస్తూ, అవి కలుగ చేసే సామాజిక కీడులను ప్రస్తావిస్తూ, వాటికి విరుగుడులు చెప్తూ పోతాడు. ఆయన చేసిన విమర్శ ఆయన మాటల్లోనే ఇలా సంక్షిప్త పరచవచ్చు.

"వినిమయదారుడు, ఉత్పత్తిదారుడు, పెట్టుబడిదారుని వివిధ ప్రయోజనాల మధ్య తేడా నుండి ప్రస్తుత వ్యవస్థలోని చెడులు వస్తున్నాయి. ఈ మూడింటిలో ఏ ఒక్క దానికి కూడా సమాజానికి గాని వీటిలో ఏ రెండింటికి గాని ఉన్న ప్రయోజనాలు లేవు సహకార వ్యవస్థ వినిమయదారుని, పెట్టుబడిదారుని ప్రయోజనాలను కలుపుతుంది. సిండికాలిజం (కార్మికులే పెట్టుబడి పెట్టుకునే పద్ధతి, ఉత్పత్తిదారుని పెట్టుబడిదారుని ప్రయోజనాలను కలుపుతుంది. ఏది కూడా ఈ మూడింటినీ కలపదు, లేదా పరిశ్రమను నడిపించే వారి ప్రయోజనాలు

8. ప్రిన్సిపుల్స్ ఆఫ్ సోషల్ రీకన్‌స్ట్రక్షన్ పేజి – 96

సామాజికి ప్రయోజనాలతో తాదాత్మ్యం పొందేలా కూడా చేయదు. అందువల్ల ఏదికూడా పారిశ్రామిక పోరాటాన్ని నిరోధించలేదు. రాజ్యాన్ని మధ్యవర్తిగా ఉండే అవసరనాన్ని కూడా తీసుకు రాలేదు. ప్రస్తుత వ్యవస్థకంటే ఇందులో ఏదయినా,మంచిదే. బహుశా ఈ రెండింటి మిశ్రమం ప్రస్తుతం ఉన్న పారిశ్రామిక వాదంలో ఉన్న చెడులను తొలగించగలదు. రాజకీయ స్వాతంత్ర్యం గురించి పురుషులు, స్త్రీలు పోరాటం చేశారుగాని పరిశ్రమలో ప్రజాస్వామ్యాన్ని ప్రవేశపెట్టటానికి చాల స్వల్పమైన కృషి చేశారనే విషయం చూస్తే చాల ఆశ్చర్యంగా ఉంది. సహకారపద్ధతి మీద గాని సిండికాలిజం సాధించాలని ఉద్దేశిస్తున్న స్వపరిపాలన లాంటి దానితో వృత్తిని గాని వ్యాపారాన్నిగాని ప్రభుత్వ ప్రయోజనాల కోసం ఒక కేంద్రంగా గుర్తించటం ద్వారాగాని పారిశ్రామిక ప్రజాస్వామ్యం ద్వారా లెక్కించటానికి వీలులేని ప్రయోజనాలు కలుగుతాయనే నమ్మకం నాకు ఉన్నది. ప్రభుత్వ సంస్థలన్నీ భౌగోళికంగా ఉండటంలో హేతువు ఏమీ కనబడటం లేదు. రాకపోకల సౌకర్యాలు నెమ్మదిగా ఉండేవి కాబట్టి పూర్వ కాలంలో ఈ పద్ధతి అవసరమయింది కాని ఇపుడది అవసరం లేదు. అటువంటి పద్ధతి ఏదో రానివ్వరు. చాలా మంది మనుషులు తమ పనిలో మళ్లీ గర్వపడుతూ ఉంటారు. ఎవరో కొద్ది మంది అదృష్టవంతులకు తప్ప ఇతరులకు దొరకని సృజనాత్మక భావాలు బయటికి పోయే మార్గాలు మళ్ళీ వెతుకుతుంటారు. ఇటువంటి పద్ధతికి భూస్వామి రద్దుకావటం, పెట్టుబడిదారుణ్ణి నిబంధనలో ఉంచటం అవసరమవుతుంది, కాని ఆదాయంలో సమానత్వాన్ని కలుగ చేయలేదు. సామ్యవాదంలా ఇది స్థిరమైన, తుది అయిన వ్యవస్థ కూడా కాదు. శక్తికి, చొరవకు ఇది ఒక నిర్మాణ రూపంకంటే ఏమీ ఎక్కువ కాదు. అటువంటి ఏదో ఒక పద్ధతి ద్వారా మాత్రమే వ్యక్తి స్వేచ్ఛాయుతమైన పెరుగుదలకు, పారిశ్రామిక వాదం మూలంగా అవసరంగా అయిన పెద్ద సాంకేతిక సంస్థలతో సమాధానపరచవచ్చు".[9]

పారిశ్రామిక వ్యవస్థ అరలు అరలుగా ఉండే నైతిక విలువలను ప్రవేశ పెడుతుందని, కార్మికుల వ్యక్తిత్వాన్ని కుంచింపచేసి బానిసలుగా చేస్తుందనే సాధారణ విమర్శ ఉన్నది. అటువంటి ఫలితాన్ని తప్పించటం కోసం రసెల్,.ముందు జాగ్రత్త కలిగే ఉత్సాహంతో, ఆర్థికవ్యవస్థల వలన కలిగే సాంఘిక ప్రయోజనాలపై విశాల దృక్పదం, తాత్విక చింతనతో ఉపక్రమిస్తాడు. ఆస్తి కలిగించే మానసిక ఫలితాలపై ఆయన విశ్లేషణ గురించి కూడా అంతే చెప్పగలిగితే బాగుండేది అని నాకున్నది.

"ధనాపేక్ష" గురించి వచ్చిన వ్యాఖ్యానం వల్ల అపార్థానికి దారితీసింది. దాంట్లో ఆయన ఏమంటాడంటే విజయం లభిస్తే చాలనే తప్పుడు భావనలో మనిషి తన స్వభావాన్నే కుంచింపుకొనే దానికి, మానవ సంక్షేమానికి, ఏ మాత్రమూ దోహదకారికాని వ్యాపారం పట్ల ఆరాధనకు అది దారితీస్తుంది. అది నడత ప్రయోజనాల మధ్య మృత ప్రాయమైన ఐక్యతను

9. ప్రిన్సిపుల్ ఆఫ్ సోషల్ రీ కన్‌స్ట్రక్షన్, పేజీలు 141, 142

10. అదే పుస్తకం, పేజీ 113

పెంపొందిస్తుంది. జీవితానందాన్ని తగ్గించివేస్తుంది. మొత్తం సమాజం అలసట చెంది నిరుత్సాహపడి నైరాశ్యంలోకి జారిపోయే ఒత్తిడి ఒడుదుడుకులను అది కలుగ జేస్తుంది‖[10] ఇదిపాత బూజు భావన, జీవన తత్వానికి పునాదిగా ఉండేది. అప్పుడు ఇది ఆమోద యోగ్యంగా ఉండేదనుకోండి. ఒక సమాజానికి సంబంధించిన ఆర్థిక జీవితం, తాత్విక దృక్పధం సాధారణంగా అనుకున్న దానికంటే చాలా సన్నిహిత సంబంధాలు కలిగి ఉంటాయి.[11] అతిశయోక్తి కొంత తొలగిస్తే చరిత్ర పై ఆర్థిక వ్యాఖ్యానం సరి అయినదే అనిపిస్తుంది. ప్రాచీన కాలం నుంచీ నైతిక శాస్త్రజ్ఞులు " ధనాపేక్ష"పై చేస్తున్న ఈ ఫిర్యాదు ప్రపంచ వస్తువులపై వారు చేసే సాధారణ ఫిర్యాదే, ఈ నిర్దిష్టమైన నమ్మకానికి దారితీసిన ఆర్థికపరిస్థితులలో సమర్థించుకుంటుంది. దీనిని దృష్టిలో పెట్టుకుంటే, పేదవాళ్ల అందని ద్రాక్షపళ్ళు పుల్లన అనే తత్వం, నమ్మకాలు అన్నింటిలో ఎంత మానవీయమో, మనం సంపాదించుకొనే వస్తువులు మనం ఎంత ప్రయత్నం చేసినా సంపాదించుకోలేని వస్తువుల గురించిన మన అభిప్రాయాలను అది ఎంతగా కమ్మి వేస్తుందో మనకు అర్థమవుతుంది. మనం ఏ వస్తువునయినా పొందలేమనుకోండి, అది పొందదగినది కాదని వాదిస్తాము. ఈ విధంగా ప్రపంచ వస్తువుల పట్ల పేదవారికి ధనికులకు ఉండే దృక్పధంలో ఓడి పోయినవాడు గెలిచిన వాని మతాలలో తేడా ఉన్నట్టే నిజమైన వ్యత్యాసం ఉంటుంది. ప్రతివ్యక్తి ప్రగాఢమైన నైతిక స్వభావానికి – అవినీతిలో కూడా నీతివంతంగా ఉండటం ఎందుకంటే అది చేసే ప్రతి పనినీ సమర్థించుకుంటుంది. విధేయుడై ఉండి తన ప్రవర్తనను ఆదర్శీకరించుకుంటాడు. ప్రాచీన ప్రపంచం ఉన్నట్టుగా మొత్తం ప్రపంచం " బాధ ఆర్థికస్థితి"'లో నివసిస్తూ ఉండేటపుడు, మానవ శ్రమ ఫలితం అత్యంత స్వల్పంగా ఉండి ఏ ప్రయత్నాలూ ఆదాయాన్ని పెంచలేని పరిస్థితుల్లో ఉన్నపుడు, క్లుప్తంగా చెప్పాలంటే మొత్తం ప్రపంచమంతా పేదరికంలో జీవిస్తున్నపుడు నీతి శాస్త్రజ్ఞులు పేదరికం గొప్పదని బోధించటం, లభ్యం కావు కాబట్టి మాత్రమే ప్రాపంచిక సౌఖ్యాలను వదులుకోమని బోధించటం సహజమే. 'విచ్చల విడిగా ఖర్చు చేయటం''కు అలవాటుపడిన సుఖమయమైన ఆర్థిక విధానానికి'' సమాజ విధానం చవకా ఉన్నదంటే అది అసహ్యకరమైన విషయమనే అభిప్రాయాన్ని ఎలా విశ్వసిస్తుందో అదే విధంగా బాధాకరమైన ఆర్థిక విధానం సమాజం తనకు ఏదయితే దొరకదో అది చెడ్డది అనే అభిప్రాయంలో ఉంటుంది. ధనాపేక్ష "వలన కలిగే అరిష్టాలను రసెల్ పునరుద్ఘాటించటం కూడా దాని చారిత్రక విలువకు తాత్వికమైన బలాన్ని ఏదీ కలుగచేయదు. ధనాపేక్ష ప్రయోజనాన్ని పరిశీలించకుండా రసెల్ దానిని విమర్శిస్తాడనే వాస్తవం మూలంగా అపార్థానికి దారితీస్తుంది. ధనాపేక్ష అనేది ఎల్లప్పుడూ " ఏదో దానికోసం" ఉంటుంది. ఆ ఏదో దానికోసం అనే దాంట్లో ఇమిడి ఉన్న ప్రయోజనాన్ని బట్టి దానిని గౌరవించాలా లేక అవమానపరచాలా అనేది ఆధారపడి ఉంటుంది. దీనిని దృష్టిలో ఉంచుకుంటే, వ్యక్తులమధ్య మృత్రప్రాయమైన ఒకే నడవడి'' అనేది ఉండదు. ఎందుకంటే, ధనాపేక్ష కలిగి ఉన్నా, వివిధ

11 CF James Boanr Bonar " Philosophy in its relation to Political Economy" more Particularly, Achille Loria "Economic Foundation of Scoeity

సందర్భాలను బట్టి వాటి ప్రయోజనాలు మారుతూ ఉంటాయి. ధనాపేక్షనే ఒక లక్ష్యంగా పెట్టుకోవటం కూడా రకరకాలైన నడవడికకు దారితీస్తుంది. మన జీవన ఉత్పత్తి దృష్టితో చూసినప్పుడు రసెల్ సిద్ధాంతం ఊగిసలాడేదిగా కనబడితే, వినియోగ దృక్పథం నుంచి చూస్తే అది కింద పడుతుంది. కేవలం అన్నం పెట్టటంద్వారా ఒకరి ఆకలిని మానవ స్వభావం తగ్గించివేస్తుందని నిజంగా రుజువు చేయాలంటే జీవన ఉత్పత్తిని కాక వినియోగాన్ని[12] పరిశీలించటం ద్వారా మాత్రమే మనం సమర్థతను తెచ్చుకోగల వినిమయ సూత్రాలు మనకు తెలుసును కాబట్టి తగ్గించి వేయటం సాధ్యమవుతుందా అని ప్రశ్నవేసుకుంటే దానికి వచ్చే సమాధానం లేదని.

విలువలకు సంబంధించిన ప్రయోజన సిద్ధాంతాల నుంచి వచ్చినవే వినిమయ సూత్రాలని మనం గుర్తుంచుకోవాలి. కోర్నాట్, గోసెన్, వాల్స్, మెంజర్ జెవాన్స్ ప్రవచించిన సాంప్రదాయకమైన సిద్ధాంతాన్ని వ్యతిరేకిస్తూ దీనిని రూపొందించారేమో. ప్రయోజనం అనేది స్థూల వస్తువులోనో, పరిస్థితిలోనో కూడి ఉన్న విలువగా దానిని పరిగణించకుండా మానవుని కోర్కెలు తీర్చటానికి పొంది ఉన్న సామర్థ్యం మీద ఆధారపడి ఉంటుంది. అది అలా అయినపుడు, ఒక వస్తువుకు ఉన్న ప్రయోజనం, తృప్తిని కోరుతున్న అంగనిర్మాణంలో మారుతున్న పరిస్థితులను బట్టి మారుతుంది. మనకు అత్యంత ప్రీతిదాయకమైన ఆహారం లాంటి పదార్థం కూడా మనం ఆకలిగా ఉన్న లేదా ఎక్కువ తిన్న పరిస్థితిని బట్టి దానిమీద మనకు ఇష్టం ఏర్పడుతుంది లేదా ఏవగింపు కలుగుతుంది. తృప్తి పెరిగే కొలదీ ప్రయోజనం సన్నగిల్లుతుంది. మరో మాటలో చెప్పాలంటే, ఒక అవయవం లేదా కొన్ని అవయవాల సముదాయం చేసే ఆనందకరమైన చర్యయే సంతృప్తి అయినపుడు, అంగానికి తృప్తిని కలిగించే వస్తువుకు ఉన్న సంబంధాన్ని తెలిపే రేఖ అంగం స్థితిని బట్టి తలకిందులుగా మారుతుంది.

మానసిక శాస్త్రానికి సంబంధించిన ఈ విశ్లేషణ ఎటువంటి విధానాలను కలుగ జేస్తుందనే విషయాన్ని రసెల్ గనుక గమనించే ఉంటే, ప్రస్తుతం చర్చలో ఉన్న అపార్థాన్ని ఆయన రప్పించగలిగి ఉండేవారు. అసలు మానసిక శాస్త్ర విశ్లేషణ అంటే ఏమిటి? ఒక వస్తువు ప్రయోజనం శూన్యం లేదా వ్యతిరేకం కావటం ఎందుకవుతుంది. ఇది రెండు విధానాలలో ఏదో ఒక విధంగా అవుతుందని మనం వాదించవచ్చు (1) సంతృప్తి పడే తీరులో ఎక్కడో ఒకచోట, ఒకనిర్దిష్టమైన అంగం తాను వాంఛించే వస్తువుపై తనకు భోజ్యంగా అందిస్తున్నా వికారం పుట్టటంతో ఏ మాత్రమూ తృప్తిని పొందలేక పోవటం, (2) ఇతర విధమైన తృప్తి కావలసిన అవయవాలు, వాటికి దక్కకుండా ఏదో ఒక అవయవం మాత్రమే అమితంగా వ్యవహరించటం వలన రెండో అభిప్రాయం కలిగి ఉన్నప్రొఫెసర్ గిడ్డింగ్స్ ఏమంటాడంటే ఒకనిర్దిష్టమైన

12 For a brichant discussion of them C/o Prof S N Pattens – "A Theory of Consumption"

13 Democray and empire P–19

అంగం లేదా అంగసముదాయం వాంఛించే వాటి తృప్తి కలిగించే విధంగా అందజేస్తూ, మరొకపక్క మిగిలిన అంగాలకు ఏమీ లభించకపోయినట్లయితే, నిర్లక్ష్యానికి గురయిన అంగాలు నిరసన తెలియజేసి, వాటిని కూడా సంతృప్తి పరచటానికి మనల్ని తొందరపెడ్తాయి. మన స్వభావంలో నిర్లక్ష్యానికి గురయిన భాగాల ఆకలి చైతన్యస్థాయికి చేరుకుంటోంది. అందవలసిన దానికంటే ఎక్కువ పొందుతున్న అంగం నుంచి మన దృష్టిని ప్రయత్నాలను మళ్లిస్తుంది.[13] ఈ రెండు ప్రత్యామ్నాయ వివరణలో ప్రొఫెసర్ గిడ్డింగ్స్ ఇచ్చిన వివరణ చాలవరకు సరైనదని అనిపిస్తుంది ప్రవర్తన సిద్ధాంతాన్ని దృష్టిలో పెట్టుకుని, అంగసముదాయాన్ని ఒక చైతన్య తత్వంగా భావిస్తే, ప్రతి అంగానికి అవసరమైన రకరకాల తృప్తి కొరకు మొత్తం అంగ సముదాయానికి ఒక ఆకలి ఉంటుందని, అది పైన చెప్పిన నిరసనను పుట్టిస్తుందని భావించటం సహజమే అనిపిస్తుంది. ఈ నిరసనే, వినిమయంలో వైవిధ్యం" అనే సూత్రానికి విధేయంగా ఉండేలా చేస్తుంది. ఇదే వాస్తవమయితే, ఒకే అంగం శాశ్వత ఏలుబడిద్వారా మొత్తం అంగసముదాయాన్ని ఛిన్నాభిన్నం ఎలా చేయగలదో అర్థం చేసుకోవటం కష్టం. అలా కాకుండా, అన్ని కోర్కెలు ఒకటి ఒకోసారి అయినా వాటి వంతు వస్తుంది. ఈ విధంగా, మానవస్వభావ, అదృష్టవశాత్తు, అనుకూల వాతావరణంలో సంపూర్ణ వికాసాన్ని అందజేస్తుందనే నమ్మకంలో ఏ మాత్రమూ సందేహానికి తావు ఇవ్వకుండా ఒకభాగమే అభివృద్ధి చెందకుండా ఉండేలా ఏర్పాటు చేసుకుంది. తాను వాంఛించే విజ్ఞానాత్మకమైన లేదా ఆధ్యాత్మికమైన ఆహార పదార్థాలను తాను సమకూర్చుకోగలదా అనేది తన చేతుల్లో లేదు. ఆహారంలో వైవిధ్యం లేకపోవటం ద్వారా అంగచ్ఛేదం అయితే, సాంఘిక ఉపేక్ష వలన మాత్రమే అది జరుగుతుంది కాని తన తప్పు వల్ల మాత్రం కాదు.

రసెల్ చేసిన మరో అభియోగం ఏమంటే, స్వాధీనం చేసుకోవాలనే ప్రకృతికి రూపమే ఆస్తి కాబట్టి అది యుద్ధానికి దారితీస్తుందని రసెల్‌తో ఎవరైనా అంగీకరించవచ్చు. అయినా, ఆస్తిఫలితాలను రసెల్ కంటే ఫ్రెడెక్ నీషే ఎక్కువగా అర్థం చేసుకున్నాడని చెప్పవచ్చు. ఈ ఫలితాన్ని దూసి డైడ్స్ ఎక్కడో చెప్పిన ఒక కథలో సంక్షిప్తం చెయ్యవచ్చు. పంటనంతా పోగుచేసుకొని, దానిపక్కన కూర్చుని బజారు ఎలా ఉన్నదో, తనకెంత లాభం వస్తుందో అని ఆలోచిస్తూ ఉన్న రైతును ఆయన వర్ణిస్తాడు తన ధ్యాసలో పూర్తిగా నిమగ్నమై పోయి ఉన్న అతణ్ణి ఒక దొంగ ఆశ్చర్యపరుస్తాడు. మెలుకువ రావటంతో, ఒక్క మాటయినా నిరసన తెలియజేయకుండా, తన పంటను పంచుకోవటానికి సిద్ధపడి, పోనీ సగమైనా మిగిలినందుకు దేవుడికి దణ్ణం పెట్టుకుంటాడు. ఇది నిజమే కావచ్చు, కథ కావచ్చు, కాని ఎప్పుడూ మనకు కనిపించని ఒక సత్యం మాత్రం ఇందులో ఉన్నది. కాల గమనంలో తన సంపాదనలు మనిషి విశృంఖల స్వభావాన్ని ఎంతగా మచ్చిక చేశాయో చెప్పటం కష్టం. కాని అది అలా జరిగిందనటంలో సందేహం లేదు నీషేకు ఇది చాలా బాగా తెలుసు అందుకే తన ఆది మానవుణ్ణి ఆస్తి ఏమీ సంపాదించుకోనివ్వలేదు, ఎందుకంటే ఆది మానవుని చేత ఎంత

విధ్వంసం చేయించాలనుకున్నాడో, అది ఆది మానవుడు తన ఆస్తి పోతుందనే భయంతో చేయలేదు. అందువల్ల వచ్చిన చిక్కు ఆస్తితో రాలేదు. దాని అసమాన విభజన వలన వచ్చిందని కొందరు అనవచ్చు, ఎందుకంటే అదిలేనివారు, దానిని సంపాదించటం కోసం ఉన్న వారికంటే ఎక్కువ వినాశనాన్ని కలిగించే అవకాశం ఉంది ఆధునిక యుగంలో పారిశ్రామిక వివాదాన్ని మరొక ఉదాహరణగా చెప్పవచ్చు. సమ్మెలో వారు యజమానులకంటే ఎక్కువ హింసను ఉపయోగిస్తారనే విషయాన్ని వ్యాఖ్యానం ద్వారా మనం గ్రహించగలం. ఏదో మనం కోల్పోయేలా ఉన్నామనే విషమ స్థితి కత్తిని మొరటు చేస్తుంది. అటువంటిదేమీ లేకపోతే అంచు చాలా వాడిగా ఉంటుంది అందువల్ల ఆస్థి అనేది కలహానికి దారితీయవచ్చు, కాని దాని ప్రయోజనాలు దానికి లేకుండా పోలేదు

రసెల్ సంపూర్ణ దృక్పథాన్ని ఒక ప్రధానమైన అభిప్రాయంలో వెలబరిచి ఉంచాడు, దాని గురించి ఏమీ మాట్లాడకుండా ఉండటం చాల అన్యాయమవుతుంది. ఆయన ఇలా అంటాడు, "మనుష్యుల ప్రేరణలు, వాంఛలను రెండు విధాలుగా విభజించవచ్చు, ఒకటి సృజనాత్మకమైనవి. రెండు : స్వాధీనపరుచుకొనేది. మన చర్యలలో కొన్ని ఇతర విధంగా అస్తిత్వంలో లేని వాటిని సృష్టించేలా చేస్తాయి. మరి కొన్ని ఇదివరకే ఉన్నవాటిని సంపాదించుకోవటానికి లేదా నిలుపుకోవటానికి నడిపిస్తాయి. సృజనాత్మకమైన ప్రేరణలు అధిక భాగం, స్వాధీనపరుచుకోవాలనే ప్రేరణలు చాల తక్కువగా ఉండే జీవితం చాలా గొప్పది.[14] ప్రేరణలను ఈ విధంగా విభజించటం సాధ్యమవుతుందా? తానే ఉపయోగించుకోవాలనే ప్రేరణ ఉంటుందా? ఈ దీర్ఘమైన ప్రశ్నను చర్చించటం ఈ సమీక్ష పరిధిని మించినది అవుతుంది. ఒక ప్రశ్న లేవ నెత్తాలనుకున్నాను, అంతే. ఎందుకంటే వ్యత్యాసాన్ని ఒక స్వభావపరమైనదిగా ఆయన చేయటం వల్ల, రసెల్ వాదన అంత నిలబడేదిగా లేదు. ప్రతి ప్రేరణ, అదుపులు లేకపోతే ఏదో ఒక సృజనాత్మకమైన చర్యకు దారితీస్తుంది. ఉత్పత్తి అయిన దానిని ఉపయోగించుకుంటామా లేదా అనేది, ప్రేరణ లేదా స్వభావానికి సంబంధించిన ఏ చర్యతోనూ సంబంధం ఉండదు. దాని ఉత్పత్తి విధానం పైన – వైయక్తికమైన తదితరమైన, దాని ఉపయోగ విధానంపైన ఉమ్మడిగానే మరొక రకంగానా–అనేదాని మీద ఆధారపడి ఉంటుందని మనవి చేస్తున్నాను ఉమ్మడి ప్రయత్నాలమీద ఉత్పత్తి అయిన దేనికైన గాని ఉమ్మడి ఉపయోగానికి పనికి వచ్చే దేనిపైనగాని అనుభవించే హక్కును ఏ ఒక్కరూ ప్రతిష్ఠించ లేదు ఆదిమజాతివారు చేసే ఉమ్మడి వేటను మొదటి దానికి ఉదాహరణగా ఎవరైనా చెప్పవచ్చు రెండో దానికి ఉదాహరణగా ఒక కుటుంబంలోని ఒక సన్నివేశాన్ని చాల హాయిగా చెప్పుకోవచ్చు. ఎదురు చెప్పలేదు. అనే భయం లేకుండా, ప్రజలకు చెందిన జ్ఞాపకాల కట్టడాలకు సంబంధించి ఎవరూ కూడా ప్రత్యేకమైన యాజమాన్యపు హక్కును ఏ విధంగా అయితే ప్రతిష్ఠించుకోలేరో, అదే విధంగా బల్ల పై ఉన్న పరికరాలను, అలంకరణకు

14 Principles of Social Reconstructions p 234

ఉపయోగించే వస్తువులపై ఏ ఒక్కరు కూడా హక్కును ప్రతిష్ఠించుకోలేరు. అది గృహానికి చెందినవి. కాని కుటుంబంలో ఉన్న ప్రతి ఒక్కరు తన బట్టలను ప్రత్యేకంగా ఉపయోగించే హక్కును కుటుంబంలోని ప్రతి ఒక్కరు ప్రతిష్ఠించుకుంటారు. అవి వ్యక్తికి సంబంధించినట్టివి. ఉత్పత్తికీ, వినియోగానికి మధ్య ఉన్న సమస్య మాత్రమే ఒక వస్తువును ఉపయోగించుకున్నామంటే అది ఉత్పత్తికి వినియోగానికి సంబంధించినట్టిది తప్ప ప్రేరణ లేక కాదు. ఈ విధంగా సృజనాత్మకమైన లేదా స్వాధీనపరుచుకొనే తత్వం, రెండు విభిన్న స్థాయిల్లో ఉన్నాయి, మొదటి దానిని పెంచటానికి రెండో దానిని కుదించివేయటానికి ఉపయోగించే విధానాలు తప్పకుండా తేడాలో ఉంటాయి. ఒకటి బాగా ఎక్కువగా ఉన్నదంటే, రెండోది అపకారం చేసేది అవుతుంది.

రసెల్ పుస్తక సమీక్షను ఇంతటితో ముగిద్దాం భవిష్య సామాజిక నిర్మాణం పునాదులు వద్ద ఉంచవలసింది ఇందులో చాలా ఉన్నది. సామాజిక జీవితంలో మనస్తత్వ శాస్త్ర పాత్రకు నొక్కి చెప్పినందుకు రసెల్ ని అభినందించాలి. సమాజానికి వ్యక్తికి మధ్య ఉన్న సంబంధాలను సరిగా గ్రహించటంలోనే సాంఘిక పునర్నిర్మాణం ఆధారపడి ఉంటుంది- ఈ సమస్య ఎంతోమంది సామాజిక తత్వవేత్తలకు అందకుండా పోతున్నది. ఈ సంబంధం విషయంలో రసెల్ కు ఉన్న అభిప్రాయం – వ్యవస్థకు ప్రేరణకు ఉన్న సంబంధం – యదార్థమైనదని చెప్పటంలో సందేహం ఏదీ లేదు. ఏమయినప్పటికీ, దీనిని ఈ పుస్తకం ప్రస్తావించిన అనేక సమస్యలను అర్థం చేసుకోవాలంటే మూలగ్రంథాన్నే చదవమని నేను గట్టిగా సిఫారుసు చేస్తాను. రసెల్ ని అపార్థ చేసుకోవటానికి అవకాశమున్న చోట కాకుండా ఆయనకు సరియైన స్థానంలో ఉంచటానికి, గమనించకుండా దొరలి పోయే కొన్ని అపార్థాలనుంచి పాఠకులను తప్పించటానికి నేను ప్రయత్నం చేశాను. రెండు సందర్భాలలోను రసెల్ – ఆయన పాఠకుల పట్ల నా విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చాను.

అనువాదం : బొజ్జా తారకం

# పదసూచి

# నాయకుడు - నాయకారాధన

అంతులేని అభిమానాన్ని చూపించుకోవడమనే అర్థంలో మహా పురుషుల ఆరాధన వేరు; ఒక మహాపురుషుడు చెప్పినట్లల్లా నడుచుకోవడం వేరు. మొదటిదానిలో తప్పేమీ లేదు. కాని రెండవది నిస్సందేహంగా అత్యంత హానికరమైనది. మొదటిది మహోన్నతమైన దనుకొన్న ప్రతి దానిపట్లా, అవన్నీ మూర్తీభవించాయనుకొన్న గొప్ప వ్యక్తి పట్లా గౌరవం చూపించడం అవుతుంది. కాని తరువాతది దుష్టపాత్ర వహించే స్వామిభక్తిలాంటిది. మొదటిది గౌరవాను గుణమైనది. రెండవది నీచ లక్షణం. మొదటిదాని వల్ల ఆలోచించే శక్తి పోదు. ఏదైనా చేయడానికి ఒకరికి ఉన్న స్వేచ్ఛను అది ఎక్కడికి తీసికొని పోదు. కాని తరువాతది ఉన్నదే, అది మనిషిని అన్ని విధాలా బుద్ధిహీనుణ్ణి చేస్తుంది. మొదటిదానివల్ల దేశానికి కలిగే నష్టం ఏమీ లేదు. రెండవ దానివల్ల తప్పనిసరిగా ప్రమాదం వాటిల్లుతుంది. ఒక ముక్కలో చెప్పాలంటే రెనడే జయంతిని జరుపుకోవటంలో మనం ఎవరూ ఎన్నుకొనని, ఎవరికీ జవాబుదారీకాని, ఎవరూ తొలగించరాని ఒక పెత్తందారుని మాత్రం ఆరాధించటం లేదు. ఒక నాయకుడికి అభిమానంతో నివాళులర్పిస్తున్నాము. ఆ నాయకుడు జనాన్ని పశులమందను తోలినట్టు తోలినవాడు కాడు. వారికి నాయకత్వం వహించిన వాడు. ఆ నాయకుడు జిత్తుల ద్వారానో, హింసాకాండ ద్వారానో తన సొంత ఆలోచనలను జనం మీద రుద్దినవాడు కాడు. జనం ఆలోచించి చేసిన నిర్ణయాలను అమలులోకి తీసుకొని రావాలని ఆశించినవాడు.

డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్

"రెనడే, గాంధీ, జిన్నా" నుంచి

# డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్

# రచనలు - ప్రసంగాలు

## సంపుటం. 1

భారతదేశంలో కులాలు • కుల నిర్మూలన • భాషా ప్రయుక్త రాష్ట్రంగా మహారాష్ట్ర • అదుపులు - సమతుల్యాల ఆవశ్యకత • భాషా ప్రయుక్త రాష్ట్రాలపై ఆలోచనలు • రేనడే, గాంధీ, జిన్నా • సౌత్‌బరో కమిటీకి ఇచ్చిన వాంగ్మూలం • సమాఖ్యకు పోటీగా స్వేచ్ఛ • కుల మతపర ప్రతిష్టంభన - పరిష్కార మార్గం • రాష్ట్రాలు - అల్ప సంఖ్యాక వర్గాలు • భారతదేశంలో చిన్న కమతాలు • రసెల్ సమాజ పునర్నిర్మాణం






ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణలు

1994